# యాదవుల
# జానపద ప్రదర్శన కళలు








యాదవుల
జానపద ప్రదర్శన కళలు

ఆచార్య మర్రెబోయిన జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్నం.







డి.లిట్. సిద్ధాంత గ్రంథం

B. KURMARAO

# యాదవుల జానపద ప్రదర్శన కళలు

# yadavula janapada pradarshana kalalu

## D.Litt. Thesis

Published with Financial Assistance from the Central Institute of Indian Languages (Ministry of Human Resourse Development, Department of Higher Education, Govt. of India), Manasagangotri, Mysore- 570 006, vide sanction letter No. F51-11(9)/2009- 10/Tel/Grant. dated 9th March 2010 under the scheme of Grant - in-Aid.

మైసూరులో ఉన్న భారతీయ భాషల కేంద్ర సంస్థ ( మినిస్ట్రీ ఆఫ్ హ్యూమన్ రిసోర్స్ డెవలప్‌మెంట్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, మానసగంగోత్రి, మైసూరు– 570 006 ) మంజూరు చేసిన ఉత్తర్వు నెం. F51-11(9) / 2009 - 10/Tel/Grant. dated 9th March 2010 ద్వారా పొందిన ఆర్థిక సాయంతో ఈగ్రంథం ముద్రింపబడింది.

పద్మావతీ ప్రచురణలు

విశాఖపట్నం

యాదవుల జానపద ప్రదర్శన కళలు

"YADAVULA JANAPADA PRADARSHANA KALALU"

Written by
Prof. M. JAYADEV
Dept.of. Telugu
Andhra University
Visakhapatnam
Andhra Pradesh

**For Copies**
Prof. M. JAYADEV
Flat No. 5A, Madeti Enclave
49-33-8/6/9, Ramakrishna Nagar
Santhi puram,
Visakhapatnam - 530 016
Andhra Pradesh
Cell : 9290102364

First Edition : April - 2010
Copies : 500
Price : Rs. 400/-

Designed & Printed at
**VINAY OFFSET PRINTERS**
30-6-40, Beside Premasamajam,
Dabagardens, Visakhapatnam - 20 ,.A.P.

# అంకితం



ఉత్తమ అధ్యాపకులు, అత్యుత్తమ పరిశోధకులు
ప్రముఖ సామాజిక శాస్త్రవేత్తలు, సామాజిక న్యాయ ప్రవర్తకులు
పరిపాలనాదక్షులు, సహృదయ సార్వభౌములు
ఆంధ్రవిశ్వవిద్యాలయం మాజీ వైస్ చాన్సలర్ అయిన

**ఆచార్య కె. వి. రమణ గారికి**



గ్రంథకర్త
ఆచార్య మర్రెబోయిన జయదేవ్

## రచయిత గురించి

పేరు - మర్రెబోయిన జయదేవ్

తల్లిదండ్రులు - వెంకటమ్మ, పుల్లన్న గార్లు

పుట్టిన తేదీ - తెలియదు, పదవ తరగతి సర్టిఫికెట్ ప్రకారం 14-6-1956

స్వంత ఊరు - చాకరాజువేముల గ్రామం, దొర్నిపాడు మండలం, కర్నూలు జిల్లా

విద్యాభ్యాసం - 1 నుంచి 5వ తరగతి వరకు ఇటికాల గ్రామం, 6వ తరగతి - కొలిమిగుండ్ల, 7వ తరగతి నుంచి 10వ తరగతి వరకు దొర్నిపాడు, ఇంటర్మీడియట్ - ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా,బి.ఎ - ఎస్.ఎస్.ఎన్ కళాశాల, నరసరావు పేట, గుంటూరు జిల్లా. ఎం.ఏ. పిహెచ్.డి - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.
డి.లిట్. - బరంపురం విశ్వవిద్యాలయం, ఒరిస్సా

డిప్లొమాలు - డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్, డిప్లొమా ఇన్ ట్రాన్స్‌లేషన్ - ఆంధ్ర విశ్వవిద్యాలయం

ఉద్యోగం - 1984 నుంచి 1990 వరకు గుడివాడ, ఏ.ఎన్.ఆర్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా, 1990 నుంచి 1998 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరుగా, 1998 నుంచి ప్రొఫెసర్‌గా, 1996 నుంచి 1999 వరకు తెలుగు శాఖాధ్యక్షులుగా, 2004 నుంచి 2007 వరకు తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా

ముద్రిత గ్రంథాలు - 1. దుర్భాక రాజశేఖర శతావధాని చారిత్రక కావ్యాలు,
2. సింహాచలం దేవళం కట్టుబడి కథాగేయం,
3. వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం,
4. యాదవుల జానపద ప్రదర్శన కళలు

ముద్రిత పరిశోధనా పత్రాలు - 30

అముద్రిత గ్రంథాలు - దశావతార కథాగేయాలు - మూడు భాగాలు

ఇష్టమైన అంశాలు - జానపద సాహిత్యం, వేమన పద్యాలు, సామాజిక స్పృహ ఉన్న రచనలు

# ముందుమాట

నేను 1990వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖలో అధ్యాపకునిగా చేరిన తర్వాత ఒకసారి సేవగరిడి కళాప్రదర్శనను చూడడం జరిగింది. ఆ కళా ప్రదర్శనను విశాఖపట్నం ప్రాంతంలోని కొన్ని యాదవ కుటుంబాలవారు తరతరాలుగా ప్రదర్శిస్తున్నట్లుగా తెలుసుకున్న తర్వాత ఆ కళపట్ల నాకు ఆసక్తి కలిగింది. ఈ కళాకారులు దాదాపుగా నిరక్షరాశ్యులైనప్పటికి గంటల తరబడి దశావతార కథా గేయాలను అలవోకగా పాడడం గమనించిన నాకు వారి ధారణాశక్తికి, శ్రుత పాండిత్యానికి ఆశ్చర్యం కలిగింది. ఆ తర్వాత నమ్మి అప్పలస్వామి, గొలగాని అప్పారావు, ఈపు నరసింగ రావు, ఈపు చిన్నఅప్పన్న, పిల్లి అప్పలస్వామి, మువ్వల అప్పారావు మొదలైన సేవగరిడి కళాకారుల వెంటబడి, వారితో దశావతార కథలను పాడించుకుని టేపు రికార్డరు ద్వారా రికార్డు చేసుకొని రాసుకున్నాను.

ఆ తర్వాత ఉత్తరాంధ్ర ప్రాంతంలో ఉన్న ఆలగొల్లలు తప్పెటగుళ్ళు కళను గురువు ద్వారా నేర్చుకొని ప్రదర్శిస్తున్నట్లుగా తెలుసుకొని, దాని గురించిన సమాచారాన్ని సేకరించాను. విజయనగరం జిల్లా మరుపల్లి గ్రామంలో ఉన్న పొడపోతులవారు అనే జంగాలు, విశాఖపట్నం జిల్లా నర్సీపట్నానికి ఆనుకొని ఉన్న పెదబొడ్డేపల్లి గ్రామంలో ఉన్న తెరచీరలవారు తరతరాలుగా కాటమరాజు కథలను చెబుతూ యాదవులను యాచించి జీవిస్తున్నారని తెలుసుకొని వారిని గురించిన వివరాలను సేకరించాను. రాయలసీమ ప్రాంతంలో గొల్లసుద్దులవారు, కొమ్ములవారు కాటమరాజు కథలను చెబుతూ యాదవులను యాచించి జీవిస్తున్న విషయం నాకు అంతకు ముందే తెలుసు. ఆతర్వాత తెలంగాణ ప్రాంతంలో మందెచ్చులవారు, బైకానివారు అనే గాయక బిక్షుకులు కాటమరాజు కథలను చెబుతూ ఆ ప్రాంతంలోని యాదవులను యాచించి జీవిస్తున్నట్లుగా తెలుసుకున్నాను.

ఆ తర్వాత యాదవులకు సంబంధించిన జానపద కళలు ఇంకా ఏమున్నాయని ఆరా తీస్తే గంగిరెద్దులాట, ఒగ్గుకథ, గొరవయ్యలు ఉన్నట్లుగా తెలిసింది. మొత్తానికి ఆంధ్రప్రదేశ్‌లోని యాదవులకు సంబంధించి గొరవయ్యలు, సేవగరిడి, గంగిరెద్దులాట, ఒగ్గుకథ, తప్పెటగుళ్ళు, గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, మందెచ్చులవారు, తెరచీరలవారు, బైకానివారు అనే పదకొండు జానపద కళలు ఉన్నట్లుగా తెలుసుకొన్నాను.

వీటిలో సేవగరిడి కళాకారులు పాడే దశావతార కథలను ఇంచుమించుగా వెయ్యి పేజీల వరకు నేను సేకరించాను. ఇంత గొప్పకళ, ఇంత గొప్ప సాహిత్యం మరే కులానికి లేదు. అలాగే కాటమరాజు కథలు మొత్తం ముప్పైరెండు ఉన్నాయి. ఇంత పెద్ద కథాగేయ చక్రం తెలుగులోనే కాదు, మిగిలిన భారతీయ భాషల్లో ఎందులోనూ ఇంకొకటి లేదు. ఈకథలను గొల్లసుద్దులవారు, కొమ్ములవారు మొదలైన యాదవకుల కథాఖ్యాన కళాకారులు పాడుతారు. ఒగ్గుకథకులు, తప్పెటగుళ్ళ కళాకారులు కూడా అనేక కథాగేయాలను పాడుతారు. సమాజంలో అజ్ఞానులుగా, అమాయకులుగా చూడ బడుతున్న యాదవులు ప్రాచీనకాలం నుంచి సామాజికగౌరవాన్ని, ఔన్నత్యాన్ని ఆశించి ఇంత గొప్ప సాహిత్యాన్ని , ఆసాహిత్యాన్ని పాడడానికి అపూర్వమైన జానపద కళలను సృష్టించుకొని వాటిని మౌఖిక సంప్రదాయంలో అభ్యసిస్తూ, పాడుకుంటూ తరతరాలుగా ఆ సాహిత్యసంపదను కాపాడు కుంటూవస్తున్నారు. వీరు రెక్కాడితే గానీ డొక్కాడని బీదవారైనప్పటకీ తమ కళల పట్ల, సాహిత్యం పట్ల వారు చూపిస్తున్న ఆసక్తి అభిమానాలకు ఆశ్చర్యపోయి, యాదవ కళల పట్ల ఆసక్తి, అభిమానం కలిగి వాటి మీద పరిశోధన చేయాలని నిర్ణయించుకొని నా డి.లిట్. పరిశోధనకు వాటిని విషయంగా గ్రహించాను.

“ఆంధ్రప్రదేశ్ యాదవుల జానపద ప్రదర్శన కళలు” అనే ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఆరు అధ్యాయాలుగా విభజించాను. మొదటి అధ్యాయమైన “జానపద విజ్ఞానం – జానపద కళలు”లో జానపద విజ్ఞాన నిర్వచనాన్ని గురించి, డార్సన్ చేసిన జానపద విజ్ఞాన వర్గీకరణ గురించి చర్చించాను. డార్సన్ అమెరికా దేశపు జానపద విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని చేసిన జానపద విజ్ఞాన వర్గీకరణను మన భాషాను గుణంగా చిన్న మార్పుచేసి జానపద సాహిత్యం, జానపద భాష, జానపద కళలు, జానపద వస్తు సంస్కృతి, జానపద సాంఘికాచారాలు అనే అయిదు విభాగాలుగా చేశాను. తర్వాత జానపద కళల పుట్టుకను గురించి, తెలుగు జానపద కళల ప్రాచీనత గురించి, జానపద కళల వర్గీకరణ గురించి చర్చించి, తెలుగులోని కథాగేయాల గురించి వివరించాను.

రెండవ అధ్యాయమైన “ఆంధ్రప్రదేశ్ యాదవులు – స్థితిగతులు” లో పురాణాల్లోనూ, చారిత్రకంగానూ యాదవుల స్థితిగతులను వివరించిన తర్వాత ఈనాడు యాదవుల్లో ఉన్న అనేక శాఖల గురించి, వారి మనస్తత్వాన్ని గురించి, వారి స్థితిగతులను గురించి, యాదవులకు ప్రత్యేకంగా ఉన్న ఇంటిపేర్లను గురించి వివరించాను.

మూడవ అధ్యాయమైన “యాదవుల జానపద కళలు – స్వరూప స్వభావాలు – చరిత్ర” లో నేను పరిశోధనకు తీసుకొన్న పదకొండు కళల స్వరూప స్వభావాలను గురించి, చరిత్రను గురించి కూలంకషంగా వివరించాను. నాల్గవ అధ్యాయమైన

"యాదవుల జానపద కళలు - ప్రదర్శనా విధానం"లో పై పదకొండు జానపద కళల ప్రదర్శనా విధానాన్ని విశ్లేషించాను.

నేను పరిశోధనకు స్వీకరించిన పదకొండు జానపద కళల్లో గొరవయ్యలు తప్ప మిగిలిన పది కళలు కథాఖ్యానం ప్రధానంగా ఉన్న కళలు. ఈ కళాకారులు తమ కళా ప్రదర్శన సందర్భంగా అనేక కథాగేయాలను పాడుతారు. ఈకథాగేయాలు గొప్ప సాహిత్యాంశాలతో శోభిస్తున్నాయి. ఐదవ అధ్యాయమైన "యాదవుల జానపద కళలు-సాహిత్యాంశాలు"లో యాదవ కళాకారులు పాడే కథాగేయాల్లోని సాహిత్యాంశాలను గురించి వివరంగా చెప్పాను. ఈ సిద్ధాంత వ్యాసంలో ఈ అధ్యాయం ముఖ్యమైంది. అందువల్ల ఈ అధ్యాయాన్ని గురించి ఎక్కువగా వివరించాను.

"యాదవ జానపద కళాకారులు - జీవన విధానం" అనే ఆరవ అధ్యాయంలో గొరవయ్యలు, సేవగరిడి కళాకారులు మొదలైన పదకొండు రకాల కళాకారుల జీవన విధానాన్ని వివరించాను.

జానపదవిజ్ఞానంలో కులవిజ్ఞానం ఒక భాగం. కులవిజ్ఞానంలో కులానికి సంబంధించిన సాహిత్యం, భాష, కళలు, వస్తుసంస్కృతి, సాంఘికాచారాలు మొదలైన వాటిని వివరించవలసి ఉంటుంది. ఈగ్రంథంలో నేను యాదవులకు సంబంధించిన కళలను గురించి వివరించాను. ఈగ్రంథం సహృదయుల మన్ననలను పొందుతుందని ఆశిస్తూ...

**ఎం. జయదేవ్**


## కృతజ్ఞతలు

ఈగ్రంథముద్రణకు యాభై వేల రూపాయలను మంజూరు చేసిన మైసూరులోని భారతీయ భాషల కేంద్ర సంస్థకు, ఈడబ్బును మంజూరు చేయించిన మిత్రులు, సహాధ్యాపకులు ఆచార్య ఎలవర్తి విశ్వనాథరెడ్డి గారికి నాహృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ పరిశోధనకు విషయ సేకరణలో నాకు సహకరించిన అనంతపురం జిల్లా, ఉరవకొండ గ్రామనివాసి, గొరవయ్య అయిన గొరవ నాగన్నగారికి, విశాఖపట్నం వాస్తవ్యులు సేవగరిడీ కళాకారులు అయిన స్వర్గీయ నమ్మి అప్పలస్వామి, నమ్మి బాబూరావు, గొలగాని అప్పారావు, గొలగాని సింహాద్రి, ఈపు చిన్న అప్పన్న, పిల్లి అప్పలస్వామి మొదలైన వారికి, విశాఖపట్నం జిల్లా పరవాడ మండలం, లంకెలపాలెం దగ్గర ఉన్న గంగిరెద్దు కళాకారులైన దొనకొండ మరిడయ్య బృందం వారికి, రంగారెడ్డిజిల్లా కీసర మండలం అంకిరెడ్డి పల్లె గ్రామనివాసులు గంగిరెద్దుల కళాకారులైన బైకాని మల్లేశ్ బృందం వారికి, హైదరాబాదు, ఉప్పల్‌లోని కురవగూడ నివాసులు ఒగ్గు కథాకారులు అయిన ఒగ్గు సోమయ్య బృందం వారికి, విశాఖపట్నంలోని శివాజీపాలెం నివాసులు, తప్పెటగుళ్ళ కళాకారులు అయిన పడగల త్రినాథరావు బృందం వారికి, ప్రకాశం జిల్లా జె. పంగులూరు మండలం, బసాపురం గ్రామవాస్తవ్యులు కొమ్ముకథాకారులు అయిన గంగవరం కనకయ్య బృందం వారికి, కడపజిల్లా ప్రొద్దుటూరు నివాసులు గొల్లసుద్దులవారు అయిన ధర్మరాజు బృందంవారికి, విజయనగరం జిల్లా గజపతి నగరం మండలం మరుపల్లె నివాసులు, పొడపోతులవారు అయిన పానుగంటి వెంకట రావు, గంటా అప్పారావు, కర్నకోట సూర్యారావు మొదలైన వారికి, విశాఖపట్నం జిల్లా నర్సీపట్నం దగ్గర ఉన్న పెదబొడ్డేపల్లి గ్రామవాస్తవ్యులు తెరచీరల కళాకారులైన కొల్లి రమణ బృందం వారికి, వరంగల్ జిల్లా హనుమకొండ దగ్గర ఉన్న గోపాలపురం నివాసులు, మందెచ్చులవారు అయిన ఊరపర్వతాలు, ఊరరాజమల్లు, ఊర కొమరమల్లు మొదలైనవారికి, వరంగల్ జిల్లా తొర్రూరు మండలం పోలేపల్లి గ్రామనివాసులు బైకాని కళాకారులైన తండు బిక్షం బృందం వారికి నాహృదయపూర్వక ధన్యవాదాలు.

# విషయసూచిక

# జానపద విజ్ఞానం - జానపదకళలు

## జానపద విజ్ఞానం :

జానపద విజ్ఞానం చాల ప్రాచీనమైంది. ఆదిమానవుని కాలం నాటి నుంచి ఇది మార్పు చెందుతూ తరతరాలుగా సాంప్రదాయికంగా వ్యాపిస్తూ ఉంది. దీని మీద మొట్టమొదటగా కృషి చేసిన ఘనత ఫిన్లాండు దేశానికి చెందుతుంది. "1780-90 ప్రాంతంలోనే ఈ దేశస్థులు జానపద విజ్ఞానం మీద అధ్యయనం చేయడం ప్రారంభించారు. 1830 ప్రాంతంలోనే ఇలియాస్ లూన్రూత్ అనే ఆయన అక్కడి మౌఖిక సాహిత్యాన్ని సేకరించడం ప్రారంభించాడు. 1835 నాటికి ఫిన్లాండు దేశపు మహేతిహాసమైన 'కలేవాలా'ను సేకరించడం పూర్తి చేశాడు"[1]. ఫిన్లాండు తర్వాత జానపద విజ్ఞానం మీద కృషి చేసిన దేశం జర్మనీ. జర్మన్ భాషలో జానపద విజ్ఞానాన్ని "VOLKS KUNDE" అని పిలుస్తారు. జాకబ్ లుడ్విగ్ కార్ల్‌గ్రిమ్, విల్‌హెల్మ్‌కార్ల్ గ్రిమ్ అనే ఇద్దరు జర్మన్ సోదరులు తమ భాషలోని వచన కథలను సేకరించి వాటిని విశ్లేషించి 1819లో "KINDER HAUS MARCHEN" అనే గ్రంథాన్ని వెలువరించారు. వీరిద్దరినీ గ్రిమ్ సోదరులు అని పిలుస్తున్నారు.

ఆంగ్లంలో జానపద విజ్ఞానాన్ని Popular Antiquities and popular Literature అని పిలిచేవారు. ఈ పేరు అర్థవంతంగా లేకపోవడం చేత W.J. Thoms అనే ఇంగ్లాండు దేశానికి చెందిన జానపద విజ్ఞానవేత్త 1846 ఆగష్టు 22వ తేదీన Ambros Marton అనే కలం పేరుతో "The Athaenaeum" అనే పత్రికకు ఉత్తరం రాస్తూ పాపులర్ లిటరే చర్ అండ్ పాపులర్ ఆంటిక్విటీస్‌కు బదులుగా "FOLK LORE" అనే పదాన్ని వాడవలసిందిగా సూచించాడు. ఆ తర్వాత కొంతకాలం నుంచి ఆంగ్లంలో "Folk lore" పదాన్ని వాడడం ప్రారంభించారు.

19వ శతాబ్దంలోని జానపద విజ్ఞానవేత్తలు Folk lore ను అక్షరజ్ఞానం లేని గ్రామీణులకు సంబంధించిన విషయంగా మాత్రమే భావించేవారు. అయితే కాలం గడిచేకొద్దీ ప్రజల్లో మార్పులు వచ్చాయి. గ్రామాల్లో ఉన్నవారు చదువుకోవడం, పల్లె ప్రజలు బ్రతుకు తెరువు కోసం పట్టణాలకు, నగరాలకు వలస వెళ్లడం, నగరాల్లో ఉండేవారు ఉద్యోగం చేయడానికి పల్లెటూళ్లకు రావడం, పట్టణాలు, నగరాలు విస్తరించి చుట్టుపక్కల గ్రామాలను తమలో కలుపుకోవడం మొదలైనవి జరిగాయి. ఇలాంటి సందర్భంలో జానపద విజ్ఞానం అంటే కేవలం గ్రామీణులకు మాత్రమే సంబంధించింది

అని చెప్పడం సమంజసం కాదని జానపద విజ్ఞానవేత్తలు భావించారు. మనిషిలో మనం చూడవలసింది జానపదత్వాన్ని మాత్రమే. ఈ జానపదత్వాన్ని ఆంగ్లంలో Folkliness అంటారు. అతడు గ్రామీణుడైనా నగరవాసి అయినా, చదువు లేనివాడైనా, చదువుకున్నవాడైన, అనాగరికుడైనా, నాగరికుడైనా సంబంధం లేదు. అతనిలో జానపదత్వం ఉంటే అతడు జానపదుడు అవుతాడని 20వ శతాబ్దంలోని జానపద విజ్ఞానవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఇంత విశాలమైన దృష్టితో జానపద విజ్ఞానాన్ని నిర్వచించిన విద్వాంసుడు అలెన్ డండెస్. ఇతడు తన సంపాదకత్వంలో వెలువడిన "The Study of Folklore" అనే గ్రంథంలో "What is Folklore" అనే ప్రశ్న వేసుకొని దానికి సమాధానంగా ఇలా చెప్పాడు. "It is possible, however, to define both folk and lore in such a way than even the beginner can understand what folklore is. The term "Folk" can refer to any group of people what soever who share at least one common factor. It does not matter what the linking factor is - it could be a common occupation, language or religion but what is important is that a group formed for whatever reason will have some traditions which it calls its own"[2] ఏదైనా ఒక్క విషయాన్నైనా భాగం పంచుకుంటున్న ప్రజాసమూహాన్ని జానపదులు (Folk) అనవచ్చు. ప్రజాసమూహాన్ని కలుపుతున్న ఆ విషయం వృత్తి గానీ, భాష గానీ లేదా మతం గానీ కావచ్చు. అయితే ముఖ్యమైనది ఏమంటే ఏ కారణం చేత ప్రజలు గుంపుగా కలిసి జీవిస్తున్నారో వారందరూ తప్పనిసరిగా తమవే అని చెప్పుకోదగిన కొన్ని సంప్రదాయాలను కలిగి ఉండాలి.

డండెస్ 'Folk' అనే పదాన్ని పై విధంగా నిర్వచించి 'Lore' అనే పదానికి వేరుగా నిర్వచనం చెప్పకుండా ఆ పదం కిందికి వచ్చే అంశాలను గురించి ఒక పట్టిక ఇచ్చాడు. ఆ పట్టికలో Myths (పురాణాలు), Legends (ఐతిహ్యాలు), Folk tales (జాన పదకథలు), Jokes (చతురోక్తులు), Proverbs (సామెతలు), Blessings (దీవెనలు), Curses (తిట్లు), Oaths (ఒట్లు), Insults (అవమానాలు), Folk Dance (జాన పదనృత్యం), Folk Drama (జానపద రూపకం), Folk Belief (నమ్మకం), Folk Medicene (వైద్యం) మొదలైన జానపదుల జీవితానికి సంబంధించిన అనేక విషయాలు ఉన్నాయి.

డండెస్ Folk పదానికి ఇచ్చిన నిర్వచనం ప్రకారం మనం అన్ని సమాజాల్లోని జానపద విజ్ఞానాన్ని అనేక కోణాల నుంచి అధ్యయనం చేయవచ్చు. మనదేశంలో



కొన్ని వందల సంవత్సరాల నుంచి కులవ్యవస్థ పాతుకొని ఉంది. చాల కులాల వారికి కులవృత్తులు, ఆ కులవృత్తులు చేయడానికి ప్రత్యేకమైన పరికరాలు, ఆ వృత్తిలో వారి నైపుణ్యం, కులాన్ని గురించిన చరిత్ర, కులంలో శాఖలు, వారి ఇంటిపేర్లు, గోత్రాల పేర్లు వాటికి సంబంధించిన చరిత్ర, కులానికి సంబంధించిన గేయాలు, కథా గేయాలు, జానపదకళలు, కులదేవతలు, కులదేవతల ఆరాధనా విధానం, కొలుపులు, ఉత్సవాలు, జాతరలు మొదలైనవన్నీ కులవిజ్ఞానం (Caste lore) కిందికి వస్తాయి. ఈనాడు భారతదేశంలో కులవిజ్ఞానం మీద మంచి పరిశోధన జరుగుతూ ఉంది. ఆంధ్రదేశంలో మాలల జానపద విజ్ఞానం, మాదిగల జానపద విజ్ఞానం, ఎరుకల జానపద విజ్ఞానం, యానాదుల జానపద విజ్ఞానం, సాలీల జానపద విజ్ఞానం, యాదవుల జానపద విజ్ఞానం, గౌడకులస్థుల జానపద విజ్ఞానం మొదలైన పేర్లతో ఆయా కులాలవారి జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయవచ్చు. అలాగే బ్రాహ్మణ, రెడ్డి, కమ్మ మొదలైన కులాలవారి జానపద విజ్ఞానాన్ని కూడా అధ్యయనం చేయవచ్చు. భాషాపరంగా చూస్తే ఆంధ్రుల, తమిళుల, కన్నడిగుల, మలయాళీల, మిగిలిన ఇతర భాషావ్యవహర్తల జానపద విజ్ఞానాన్ని వేరువేరుగా అధ్యయనం చేయవచ్చు. మత పరంగా చూస్తే హిందువుల, మహమ్మదీయుల, క్రైస్తవుల జానపద విజ్ఞానాన్ని వేరు వేరుగా అధ్యయనం చేయవచ్చు. హిందువుల్లో ప్రధాన శాఖలైన శైవుల, వైష్ణవుల జానపద విజ్ఞానాన్ని వేరుగా అధ్యయనం చేయవచ్చు. ఈ విధంగా సమాజంలోని అనేక వర్గాల వారి జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి అవకాశం ఉంది. డండెస్ నిర్వచనం ప్రకారం జానపదులు అంటే చదువుకున్నవారు, చదువు లేనివారు, పల్లెటూరి వారు, పట్నవాసులు, నాగరికులు అనాగరికులు అనే తేడా లేదు. ప్రజలు గుంపుగా కలిసి జీవిస్తుండాలి. ఏదైనా ఒక్క విషయాన్నైనా వారు భాగం పంచుకుంటూ ఉండాలి. వారందరూ తమనే అని చెప్పుకోదగిన కొన్ని సంప్రదాయాలను కలిగి ఉండాలి అనే మూడు లక్షణాలు ఉండాలి. సమాజంలోని అన్నివర్గాల వారి జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి వీలైనంత విశాలంగా నిర్వచనం ఉండడం చేత డండెస్ నిర్వచనం ఉత్తమమైందిగా పరిగణింపబడుతూఉంది.

**జానపద విజ్ఞాన వర్గీకరణ :**

మొదట్లో గేయాలు, కథాగేయాలు, సామెతలు, పొడుపుకథలు, వచన కథలు మొదలైన జానపద సాహిత్య ప్రక్రియలను మాత్రమే జానపద విజ్ఞానంగా భావించే వారు. అలెన్ డండెస్ లాంటి జానపద విజ్ఞానవేత్తలు జానపద సాహిత్యంతో పాటు జానపదుల వృత్తులు, వృత్తుల పరికరాలు, వేషభూషణాలు, ఆచారవ్యవహారాలు, సాంప్ర

దాయాలు, నమ్మకాలు, వేడుకలు, వినోదాలు, పండుగలు మొదలైన జానపదుల జీవితానికి సంబంధించిన అన్ని విషయాలను జానపద విజ్ఞానం పరిధిలోకి తెచ్చి దాన్ని సాగరం లాగా విస్తరింపజేశారు. అందువల్లనే డార్సన్ లాంటి జానపద విజ్ఞాన వేత్తలు జానపద విజ్ఞానం అనే పేరుకు బదులుగా జానపద జీవితం (Folk Life) అనే మాటను ఉపయోగిస్తున్నారు. జానపదుల జీవితమంతా మహాసాగరంలాగా విస్తరించిన జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి అందులోని సూక్ష్మాంశాలను పరిశీలించడానికి జానపద విజ్ఞానాన్ని తప్పనిసరిగా వర్గీకరించాలి. అందువల్లనే Richard M. Dorson, R.S. Boggs లాంటి వారు జానపద విజ్ఞానాన్ని వర్గీకరించారు. డార్సన్ తన సంపాదకత్వంలో ప్రకటించిన Folk lore and Folk life అనే వ్యాస సంపుటానికి రాసిన పరిచయ వ్యాసంలో జానపద విజ్ఞానాన్ని నాలుగు విభాగాలుగా వర్గీకరించాడు. ఈ వర్గీకరణను బిరుదురాజు రామరాజుగారు తమ 'తెలుగు జానపద గేయసాహిత్యం"[3] గ్రంథంలో వివరించారు.

**1. Oral Folk lore : మౌఖిక జానపద విజ్ఞానం :** ముఖం ద్వారా వెలువడే పాట, మాట, పలుకు మొదలైనవన్నీ ఈ విభాగం కిందికి వస్తాయి. ఇందులో అనేక రకాల గేయాలు, కథాగేయాలు, సామెతలు, పొడుపు కథలు, వచన కథలు, మారుమూల పదాలు, మాండలికాలు, యాసలు, నుడి కారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవి చేరతాయి. ఇవే గాకుండా కూనిరాగాలు, గొనగడాలు, ఆశ్చర్యార్థకాలు, సంబోధనలు, మెచ్చుకోళ్ళు, పిలుపులు, మచ్చికకూతలు, అరపులు, కేకలు, సంజ్ఞలు, ఉచ్చాటనలు, ఏడ్పులు, శోకాలాపాలు మొదలైనవి గూడా ఇందు లోకి వస్తాయి.

**2. Material Culture : వస్తు సంస్కృతి లేదా భౌతిక సంస్కృతి :** జానపదుల భౌతిక జీవితానికి సంబంధించిన వస్తువులన్నీ ఈ విభాగం కిందికి వస్తాయి. జానపదులు చేసే అనేక రకాల పనులు, వృత్తులు, కుటీర పరిశ్రమలు, వాటి పరికరాలు, వాటిలో నైపుణ్యం, వంటావార్పు పానీయాలకు సంబంధిం చినపాక కళ, నిర్మాణ వాస్తు విజ్ఞానం, నేతలు, అల్లికలు, పశుపక్షి పాలన మొదలైనవి, జానపదుల ఉపకరణాలు, వస్తువాహనాలు, పాత్రలు చేయడంలో నేర్పు, వేషభూషణాలు, అలంకరణలు, తెరపటాలు, ముగ్గులు, పచ్చబొట్లు, జలచర భూచర ఖేచరాల వేట మొదలైనవి ఇందులో చేరతాయి. అంటే జానపదులు ఉదయం లేచినప్పటి నుంచి రాత్రి పడుకునే వరకు వారు చేసే అన్ని రకాల పనులకు సంబంధించిన అన్ని వస్తువులు దీని కిందికి వస్తాయి.

**3. Social Folk Custom : జానపద సాంఘికాచారాలు :** అటు మౌఖిక జానపద విజ్ఞానానికి ఇటు వస్తుసంస్కృతికి మధ్య రెండు వైపులా వ్యాపించిన సాంప్రదాయిక



జీవితానికి సంబంధించిన అన్ని ఆచారాలు ఈ విభాగం కిందికి వస్తాయి. జానపదులు పుట్టినప్పటి నుంచి చనిపోయేవరకు ఉన్న అన్ని రకాల కర్మలకు సంబంధించిన అనేక రకాల ఆచారాలు, వేడుకలు, వినోదాలు, క్రీడలు, పండుగలు, పబ్బాలు, తిరునాళ్ళు, ప్రభలు, సిడులు, బోనాలు, వీరాచారాలు, బలులు, సూతకపుటాచారాలు, సమాధులు, మంత్ర తంత్రాలు, యంత్రాలు, మందులు, మాయలు, ప్రయోగాలు, కట్టుబోతువిద్యలు, తాయెత్తులు, రక్షలు, దిగదిడుపులు, దిష్టి తీయడం, దేవతలకొలుపులు, పూనకాలు, విశ్వాసాలు, శకునాలు, సోది, కాలజ్ఞానం, ఆటలు, పందాలు, సైగలు, భూతవైద్యం, మూలికా వైద్యం, బైరాగి చిట్కాలు, రాక్షస వైద్యం, విభూతి మొదలైనవన్నీ ఇందులో చేరతాయి.

**4. Performing Folk Arts : జానపద ప్రదర్శన కళలు :** ఆటవికుల, జానపదుల వ్యక్తిగతమైన, బృందగతమైన నృత్తాలు, నృత్యాలు, గాత్రసంగీతం, వాద్యసంగీతం, యక్షగానాలు అనేక రకాల భాగవతాలు అనేక రకాల బొమ్మలాటలు, వాలకం, దొమ్మరాట, తప్పెటగుళ్ళు మొదలైన రెండు వందలకు పైగా ఉన్న జానపద కళలన్నీ ఈ విభాగం కిందికి వస్తాయి.

డార్సన్ చేసిన పై వర్గీకరణ శాస్త్రబద్ధంగా ఉంది. డార్సన్ అమెరికా దేశపు జానపద విజ్ఞానవేత్త. ఇతడు తమ దేశ జానపద విజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని పై వర్గీకరణ చేశాడు. మనం మన దేశ కాలానుగుణంగా, మన జానపద విజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని డార్సన్ వర్గీకరణకు చిన్న మార్పు చేసి, దాని ప్రకారం మన తెలుగు జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయవచ్చు. డార్సన్ మొదటి విభాగమైన మౌఖిక జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యాన్ని, జానపద భాషను కలిపి చెప్పాడు. ఈ రెండింటిని వేరువేరుగా చెప్పాలి. గేయాలు, కథాగేయాలు అనేక రకాల వచన కథలు, సామెతలు, పొడుపుకథలు మొదలైన ప్రక్రియలన్నీ జానపద సాహిత్యం కిందికి వస్తాయి. మాండలికాలు, మారుమూల పదాలు, యాసలు, ఊర్లపేర్లు, ఇంటి పేర్లు, వ్యక్తులపేర్లు మొదలైనవన్నీ భాష కిందికి వస్తాయి. కాబట్టి డార్సన్ చెప్పిన మౌఖిక జానపద విజ్ఞానాన్ని జానపద సాహిత్యం, జానపద భాష అని రెండు విభాగాలుగా విభజించాలి.

డార్సన్ జానపద ప్రదర్శక కళలను చివరగా చెప్పాడు. జానపద కళలు కొన్నింటిలో సాహిత్యం ఉంటుది. కొన్నింటిలో సాహిత్యం ఉండదు. సాహిత్యం లేక పోయినప్పటికీ వీటిలో భాష ఉంటుంది. అందువల్ల జానపద కళలను చివరగా గాకుండా భాష తర్వాత అంటే మూడవ విభాగంగా చెబితే బాగుంటుంది. నాలుగవ విభాగంగా వస్తు సంస్కృతిని, ఐదవ విభాగంగా సాంఘికాచారాలను చెప్పాలి. డార్సన్ చేసిన వర్గీకరణను పైన చెప్పిన మార్పులతో ఇలా చెప్పవచ్చు.

1. జానపద సాహిత్యం (Folk Literature)
2. జానపద భాష (Folk Language)
3. జానపద కళలు (Folk Arts)
4. జానపద వస్తు సంస్కృతి (Material Culture)
5. జానపద సాంఘికాచారాలు (Social Folk Customs)

ఈ ఐదు విభాగాల కింద మనం మన తెలుగు జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయవచ్చు.

## జానపద కళలు :

Folk Arts అనే ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా తెలుగులో జానపద కళలు అనే మాటను ఉపయోగిస్తున్నాం. Folk అంటే జానపదులు. Arts అంటే కళలు. ఇంగ్లీషులోని Art అనే పదం Ars అనే గ్రీకు భాషాపదం నుంచి వచ్చింది. Ars అంటే ప్రకృతి కానిది అని అర్థం (Ars is that which is not nature). Nature అంటే ప్రకృతి. ప్రకృతి కానిది అంటే కృత్రిమమైనదని అర్థం. అంటే కళ మానవుని చేత కృత్రిమంగా రూపొందించబడిందని అర్థం. "Art imitates nature"[4] అని అరిస్టాటిల్ చెప్పాడు. మనిషి ప్రకృతిని చూచి దానికి అనుకరణగా కళను రూపొందించాడు. మనిషి ప్రకృతిని చూచి అనేక విషయాలు నేర్చుకున్నాడు. అందులో కళలు గూడ ఉన్నాయి. అందువల్లనే "Nature taught Art" [5] ప్రకృతి కళను నేర్పింది అని మిల్టన్ చెప్పాడు. చెప్పేదేమంటే జానపద కళలను చాలావరకు మనిషి ప్రకృతిని చూచి సృష్టించాడు. అయితే ప్రకృతిలో ఉన్న దాన్ని ఉన్నట్లుగా కాకుండా, ప్రకృతి అతని మనస్సుకు గోచరించినట్లుగా చిత్రించాడు. అంటే మనిషి ప్రకృతిలో ఉన్న దాన్ని చూసి దానికి ప్రతి సృష్టి చేశాడన్న మాట.

**జానపద కళల పుట్టుక, వికాసం :** జానపద కళలు ఎప్పుడు, ఎలా సృష్టించబడ్డాయి అనేది తెలుసుకోవాలంటే మనం ఆదిమ మానవుని దగ్గరికి వెళ్ళవలసి ఉంటుంది. ఆదిమ మానువుడు అతిశీతల వాతావరణంలోఅడవుల్లో జంతువుల మధ్య జీవించేవాడు. మానవునికి అనుకరణ శక్తి ఎక్కువ. ప్రకృతిలో పశువులు, పక్షులు మొదలైన ప్రాణులు తమ జాతి ప్రాణులతో కలిసి సామూహికంగా జీవించేవి. ఆదిమ మానవుడు వాటిని చూచి సామూహిక జీవనాన్ని అలవాటు చేసుకున్నాడు. జంతువులు ఆహార సంపాదనకు సామూహికంగా వెళ్లి తమకు ఆహారమైన జంతువులను చుట్టుముట్టి చంపేవి. అలాగే మానవులు గూడ సామూహికంగా వేటకు వెళ్లి తాము వేటాడదలచుకున్న జంతువులను చుట్టుముట్టి చంపేవారు. అలాగే వారు జంతువులను చూసి ఏ జంతువును ఎలా వేటాడాలో నేర్చుకొని వేటలో నైపుణ్యాన్ని సంపాదించుకున్నారు. జంతువులు కొండ గుహల్లో నివసించడం చూసి వాటిని పారద్రోలి ఆ గుహల్లో తాను నివసించడం నేర్చుకున్నాడు. ఆనాటి ప్రజల ముఖ్య వృత్తి వేట. ఆహార సంపాదనకు వేట మీదనే వారు ఆధారపడ్డారు. వేటకు వారు సామూహికంగా వెళ్లేవారు. ఇలా వెళ్లడం వల్ల వారిలో సామూహిక చైతన్యం, ఉత్సాహం కలిగేవి. వేట సమయంలో వారు జంతువుల వెంట పరుగెడుతూ పెద్దపెద్ద అరపులతో కేకలతో వాటిని భయపెట్టి చుట్టుముట్టి చంపేవారు. వేట బాగా దొరికితే వారి ఆనందానికి హద్దులుండేవి కావు. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయ్యేవారు. లయబద్ధమైన అరపులతో కేకలతో చిందులు వేసేవారు. ఆవిధంగా ఆదిమ మానవుడు మొదట నృత్యం (Dance) చేయడం నేర్చుకున్నాడు.

ఆదిమ మానవునికి భాష లేనప్పుడు తన భావాలను ఆంగిక సంజ్ఞల ద్వారా, హావభావాల ద్వారా తన తోటివారికి తెలియజేసేవాడు. ప్రకృతిలోని పశువుల, పక్షుల అరపులను కూతలను మనిషి అనుకరించడం ద్వారా తన భావాలను ఇతరులకు తెలియజేసేటప్పుడు నోటి నుంచి వచ్చే శబ్దాల వల్ల, హావభావాలకు ఉపయోగించే సంకేతాల ద్వారా, ఆనందంతో వేసే కేకలు, అరపుల ద్వారా మొదట భాష పుట్టి ఉంటుంది. తర్వాత కొంత కాలానికి మానవుడు నిప్పును కనుక్కున్నాడు. మానవుని సాంస్కృతిక పురోభివృద్ధిలో నిప్పును కనుక్కోవడం చాల ముఖ్యమైనది. ఆనాటి మానవుడు నిప్పును రెండు విధాలుగా ఉపయోగించేవాడు. ఒకటి వేటాడిన మాంసాన్ని నిప్పుల్లో కాల్చడానికి, రెండు చలి కాచుకోవడానికి. వేట బాగా దొరికినప్పుడు వేటాడిన జంతువుల మాంసాన్ని నిప్పుల్లో కాల్చుతూ దాని నుండి వచ్చే వాసనను ఆనందంగా పీల్చుతూ మంట చుట్టూ గుంపులోని సభ్యులందరూ ఆనందంతో చిందులు వేసేవారు. అలాంటి సమయంలో ఆ గుంపులోని ప్రతిభావంతుడైన వ్యక్తి అప్పటికి ఉన్న మాటలతో ఆశువుగా ఒకటి రెండు పాదాలతో గేయాన్ని చెప్పి ఉంటాడు. మిగిలినవారు ఆ గేయాన్ని తిరిగి పాడుతూ మంట చుట్టు నాట్యం చేసి ఉంటారు. ఆ విధంగా మానవుడు నృత్తంతో పాటు పాటను పాడటం నేర్చుకు న్నాడు. భాష లేనప్పుడు మొదటి దశలో నృత్తం పుట్టింది. రెండవ దశలో భాష పుట్టిన తర్వాత నృత్తంతో పాటు పాటను పాడడం నేర్చుకున్నాడు. అంటే రెండవ దశలో నృత్తం, పాట ఉన్న కళను సృష్టిం చుకున్నాడు. కొంతకాలం తర్వాత రాళ్ళతో గానీ, లోహాలతో గానీ నృత్తగీతాలకు తోడుగా లయబద్ధంగా ధ్వని కల్పించడం నేర్చుకున్నాడు. అదే ఆ తర్వాత కాలంలో వాద్యమయింది. ఈ విధంగా ప్రాచీన మానవుడు మొదటి దశలో నృత్తాన్ని, రెండవ దశలో నృత్తంతో

పాటు గీతాన్ని, మూడవ దశలో నృత్తగీతాలతో పాటు వాద్యాన్ని కల్పించుకున్నాడు.

ప్రకృతిలోని మిగిలిన ప్రాణులకు లేకుండా మానవులకు మాత్రమే ఉన్న సౌకర్యాలు రెండు. మొదటిది అతని మెదడు. రెండవది మనిషికి చేతులుండడం. మనిషి మెదడుతో ఆలోచించి ఏది తనకు మంచిదో, ఏది మంచిది కాదో తెలుసుకొని, మంచిదని తోచిన దాన్ని చేతులతో అమలు చేసి, అనేక రకాల పనిముట్లు తయారు చేసి తన జీవితాన్ని సుఖమయం చేసుకుంటూ సాంస్కృతికంగా దినదినాభివృద్ధిని చెందుతూ వచ్చాడు.

ఆదిమ మానవునికి ప్రకృతిలోని అనేక విషయాలకు కారణం తెలిసేది కాదు. సూర్యోదయం, సూర్యాస్తమయం, ఋతువులేర్పడడం, వర్షం కురవడం, స్త్రీగర్భం ధరించడం, పిల్లలను కనడం, ప్రాణులు చనిపోవడం మొదలైనవ అనేక విషయాలకు కారణం తెలియక, తనకు తెలియని అతీతమైన శక్తి ఏదో ఉందని, అదే అవన్నీ చేస్తుందని భావించి, ఆ శక్తికి దేవతని, దేవుడని పేరుపెట్టి ఆరాధించడం ప్రారంభిం చాడు. ఆ విధంగా మానవుడు దైవీభావనను కల్పించుకొని, తనకు కష్టాలు రాకుండా కాపాడుమని దైవాన్ని ప్రార్థించేవాడు. ప్రార్థనకు తన బుద్ధినుపయోగించి అనేక గీతా లను కల్పించుకున్నాడు. అనేక కళలను సృష్టించుకున్నాడు. మానవుడు మొదట సృష్టించుకున్న కళలు ఎక్కువ భాగం దేవతలనుద్దేసించినవే. అంటే అవి భక్తి ప్రధాన మైనవి. ఇవి అనేక రకాల పూజలకు పునస్కారాలకు సంబంధించినవి. తర్వాత కాలంలో మానవుల సంతోషం కోసం భక్తికి వినోదాన్ని జోడించి భక్తి, వినోదం ఉన్న కళలను సృష్టించాడు. ఆ తర్వాత కేవలం వినోద ప్రధానమైన కళలను సృష్టించడం నేర్చుకున్నాడు.

మనిషి సామూహిక జీవనానికి, సంచార జీవనానికి స్వస్తిచెప్పి అడవి జంతువులను మచ్చిక చేసుకొని, వాటిని తన అవసరాలకు తగినట్లుగా తర్ఫీదు నివ్వడం ప్రారంభించాడు. అడవి మొక్కలను తర్వాత కాలంలో పండించడం ప్రారం భించి మెల్లగా వ్యవసాయం చేయడం మొదలుపెట్టాడు. తర్వాత కాలక్రమంలో అనేక రకాల వృత్తులు ఏర్పడ్డాయి. అ వృత్తులే తర్వాత కాలంలో కులాలుగా స్థిరపడ్డాయి. తర్వాత కాలంలో కులవ్యవస్థకు కట్టుదిట్టంగా అమలు చేయడం ప్రారంభమయ్యింది. అన్ని కులాలవారు తమ కులం చాలా గొప్పదని చెప్పడానికి కుల పురాణాలను సృష్టిం చుకొని, ఆకుల పురాణాలను గానం చేయడానికి ఆశ్రిత కులాలను ఏర్పాటు చేసుకు న్నారు. ఆ విధంగా అనేక రకాల కులాధారిత జానపద కళలు ప్రచారంలోకి వచ్చాయి.

మొదటి నుంచి మానవునికి సౌందర్య దృష్టి ఎక్కువ. తాను చేసే పరికరాలు, వస్తువులు అందంగా తయారు చేసేవాడు. అలాగే తాను సృష్టించే జానపద కళల



విషయంలో గూడా అందానికి ప్రాధాన్యతనిచ్చే వాడు. వేషధారణ అందంగా ఉండడం కోసం మేకప్ చేసుకోవడం, రకరకాల జంతువుల లాగా వేషధారణ చేసుకోవడం నేర్చుకున్నాడు. ఈ విధంగా జానపద కళలు ఉద్భవించి తర్వాత కాలంలో అనేక మార్పులు చెందుతూ వికాసాన్ని పొందుతూ తరతరాలుగా సాంప్రదాయికంగా వ్యాపిస్తున్నాయి.

**తెలుగు జానపద కళల ప్రాచీనత :** అన్ని భాషల్లోనూ జానపద కళలున్నాయి. ఆ భాషలు పుట్టినప్పటి నుంచి ఆ సమాజంలో జానపద కళలు పుట్టి ఉంటాయి. జానపద కళల ప్రాచీనత భాషతో ముడిపడి ఉంది. అంటే భాషతో సమానంగా జానపద కళలు ప్రాచీనమైనవి. తెలుగు జానపద కళలు గూడా తెలుగుభాష పుట్టినప్పటి నుంచి ఉన్నాయి. అయితే ప్రస్తుతం ఉన్న జానపద కళలన్నీ తెలుగుభాష పుట్టినప్పటి నుంచి ఉన్నాయని చెప్పడం కాదు. కొన్ని కళలు మాత్రం తప్పనిసరిగా ఉంటాయి. కొంత మంది పండిత కవులు తమ రచనల్లో తమ కాలం నాడు ఉన్న జానపద కళలను ప్రస్తావించారు. శిష్టసాహిత్యానికి సంబంధించి నన్నయను ఆదికవిగా చెప్పుకుంటున్నాం. నన్నయకు పూర్వం నుంచే మనకు అనేక జానపద కళలు ఉన్నాయి. అయితే నన్నయ్య తన భారతంలో జానపద కళల పేర్లను ప్రస్తావించ లేదు. కానీ యాదవులు రైవతకాద్రి ఉత్సవాన్ని చేయడానికి వివిధ రకాల వాయిద్యాలు వాయిస్తూ, వాటికి అనుగుణంగా ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ రైవతకాద్రికి ఊరేగింపుగా వెళ్లినట్లుగా ఇలా చెప్పాడు.

"పొలుపుగ బూషికట్టి తొరి భూరి విభూతి ప్రకాశితంబుగా
గలయగ దత్పురీ జనులు కాంస్య మృదంగ ముకుంద వేణుకా
హల పటల ధ్వనుల్ చెలగ నాటలు బాటలు నొప్పె నెల్లవా
రలు జని చేసిరర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోన్"[6]

పై పద్యంలో యాదవులు కంచుతాళాలు, మృదంగాలు, ముకుందాలు, పిల్లన గ్రోవులు, కాహళాలు, తప్పెటలు మొదలైన వాయిద్యాలు చెలరేగగా ఆటపాటల తో రైవతకాద్రికి వెళ్లినట్లుగా చెప్పబడింది. ఇక్కడ చెప్పబడిన వాయిద్యాలన్నీ జానపద వాయిద్యాలే. అంతేగాకుండా ఆడడం, పాడడం గూడ జానపద కళగానే భావించాలి. తర్వాత పద్యంలో నన్నయ యాదవ స్త్రీలు మద్యపాన మత్తులై తాళానికి తగినట్లుగా ఆడి పాడారని ఇలా చెప్పాడు.

"గురుకుచ యుగ్మముల్ గదల గ్రొమ్ముడులందుల పుష్పముల్ పయిం
దొరగ నిదాఘబిందు వితతుల్ చెదరన్ మదిరామదంబునన్
బరవశలయ్యు నింపెసగ బాడుచు దాళము గూడ వెట్టుచుం
దరుణియ లొప్పనాడిరి ముదంబున దమ్ముజనాలి మెచ్చగన్"[7]

మద్యం తాగి తాళానికి తగినట్లుగా ఆడడం, పాడడం జానపద కళే.

నన్నెచోడుని కుమార సంభవంలో ఆటవికులైన శబర స్త్రీలు జీరికకల్లు తాగి గౌడు గీతాలను పాడుతూ గిరగిరా తిరుగుతూ గోరడమాడినట్లుగా చెప్పబడింది.

"జీఱికకల్లు ద్రావి మదసింధుర గామినులన్ని కేటియల్
వాఱుచు గౌడు గీతములు వాడుచు బొల్పుగ గ్రాలియాడుచున్
గోఱడమాడుచున్ బతులకున్ వశవర్తులు గాక మేరకున్
మీఱుచు వన్నె కాంతలు రమింతురు తద్విపినాంతరంబునన్"[8]

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలోనూ, బసవపురాణంలోనూ తన కాలంనాటి అనేక జానపద కళలను పేర్కొన్నాడు. పండితారాధ్య చరిత్రలోని మహిమ ప్రకరణంలో శివభక్తులు కోలాటం, జోకలు, కేళికలు మొదలైన కళలను ప్రదర్శించినట్లుగా చెప్పబడింది.

"నిద్దవాద్య ధ్వనులెల్ల ఘూర్ణిల్ల - శుద్ధ సౌళగ గీత సూళాదులులియ
నంతంత గోలాటలంతంత జోక - లంతంత గేళికలభినయింప"[9]

పర్వత ప్రకరణంలో శివరాత్రి పండుగ సందర్భంలో అనేక జానపదకళలు ప్రదర్శించినట్లుగా పాల్కురికి సోమన రాశాడు.

"జప్పట్లు వెట్టంగ జక్కన లేచి - యప్పాట వెడయాట లాడెడువారు
వేడుకతో జిందులాడంగ నుబ్బి - కోడంగి యాటల గునిసెడువారు
బ్రన్నని నిజదేశ భాషల జతుల - కన్ని కోడంగాట లాడెడువారు
భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెఱసి- రమణ చాంబాసి పేరణి యాడువారు
బ్రమథ పురాతన పటు చరిత్రముల - గ్రమమొంద బహునాటకము లాడువారు
లలితాంగ రస కళాలంకార రేఖ - లలవడ బహురూపమందాడు వారు
గరణముల్ మెరవణుల్ గతులు జిత్రములు - నరుదుగ వెడ్డంగ మాడెడువారు
నమరాంగనలు దివిన్నాడెడు మాడ్కి - నమరంగ గడలపై నాడెడువారు
నావియద్గతి బక్షులాడెడునట్టు - బావన మ్రోకులపై నాడెడువారు
భారతాది కథల జీరమ్మెఱుగుల - నారంగ బొమ్మల నాడించువారు
గడునద్భుతంబుగ గంబ సూత్రంబు - లడరంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్షవిద్యాధ - రాదులై పాడెడు నాడెడు వారు
వివిధ ప్రచ్ఛన్న వేషముల్ దాల్చి - యధికోత్సవముడులు కాదు నట్లాడు"[10]

ఇందులో వెడయాటలు, కోడంగియాటలు, కన్నికోడంగాట, పేరణి, బహు



రూపులు, వెడ్డంగం, దొమ్మరాట, తోలుబొమ్మలాట మొదలైన జానపద కళలను ప్రదర్శించినట్లుగా సోమన రాశాడు: పర్వత ప్రకరణంలోనే ఇంకొకచోట పక్షులను, జంతువులను అనుకరించి చేసే నృత్యాలను ఇలా వివరించాడు.

"జిలుకయు బోలె జెన్నొలయ బలుకుచును - జలచరంబులవోలె జనుల కుప్కుచును
గలహంసయును బోలె గతుల నేర్చుచును - నిలమృగమట్లురిమి చూచుచును
గండుకోయిలవోలె గడగి కూయుచును - వెండి క్రోతియు బోలె వికృతి సేయుచును
నాలతేడును బోలె నటయిట సనుచు - గోలికాడును బోలె గోర్మెన గొనుచు
మదగజంబును బోలె మాఱుమలయుచు - బొదల వ్యాఘ్రంబట్ల పొటినులియుచును
గేసరి వోలె లంఘించి పట్టుచును - మావటీడును బోలె మడ్డి వెట్టుచును
మహిభుజంగమువోలె మలకలు గొనుచు - విహగంబు క్రియ నభోవీధిని జనుచు"[11]

ఇందులో చిలుక, చేప, హంస, జింక, కోయిల, కోతి, ఏనుగు, పెద్దపులి మొదలైన వాటిని అనుకరించి చేసిన నర్తనలు వివరింపబడ్డాయి.

బసవ పురాణంలో బసవని పెండ్లి సందర్భంలో శివభక్తులు చేసిన కోలాటం, గొండ్లి, పేరణి, జోకం మొదలైన నృత్యాలను అభినయించినట్లుగా సోమన ఇలా రాశాడు.

"కోలాటమును బాత్ర గొండ్లి పేరిణియు- గేలిక జోకయు లీల నటియింప

.................................................................

నలిరేగి వేణు వీణావాద్య వితతు - లులియుచు లీలతో నొక్కట మ్రోయ
నానంద గీతము లగ్గించు వారు - పూని శంకర గీతములు పాడువారు
జతిగీతముల మీద జప్పట లిడుచు - నతిశయ శివభక్తి నాడెడువారు"[12]

పాల్కురికి సోమన పైన చెప్పిన దాన్ని బట్టి ఆనాడు పండుగలు, జాతరలు, పెళ్లి సందర్భాల్లో జానపద కళలను ప్రదర్శించేవారని తెలుస్తుంది. పాల్కురికి సోమన దేశి సాహిత్య ప్రియుడు కావడంవల్ల పైన చెప్పిన జానపద కళలను పేర్కొన్నాడు. ఇతని లాగా ఇన్ని జానపద కళలను పేర్కొన్న కవి మరొకరు లేరు.

తిక్కన విరాటపర్వంలో బృహన్నల తాను నేర్చుకున్న విద్యల గురించి విరాటరాజుకు వివరించే సందర్భంలో దండలాసకం, కుండలి, ప్రేంఖనము, ప్రేరణి అనే జానపద నృత్యాలను ప్రస్తావించాడు.

"ఒండు పనులకు సెలవు లేకునికి జేసి
యభ్యసించితి శైశవమాదిగాగ
దండలాసక విధమును, గుండలియును
బ్రేంఖణంబు తెఱంగును బ్రేరణియును"[13]

నాచన సోమన తన ఉత్తర హరివంశంలో శ్రీకృష్ణుడు హంస డిభకుల మీదికి యుద్ధానికి వెళ్ళి తన పాంచజన్యాన్ని పూరించినప్పుడు, ఆ శబ్దానికి ఆదిశేషుడు, ఉదయాస్తగిరులు, సప్తసముద్రాలు చలించిన విధానాన్ని జానపద నృత్యాలతో పోల్చి ఇలా చెప్పాడు.

సీ!! "వడుకు పన్నగరాజు పడగల మీద స
ర్వంసహా కాంత పేరణము సూప
నుఖ్యాత లూగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడ
దెరలెత్తి సప్త సాగరములు బొరలంగ
వరుణందు గొండిలి పరిఢవింప
మొకముల చాయ వేరొక చందముగ నిల్పి
కమల సంభవుడు ప్రేంఖణ మొనర్ప"[14]

ఇంకొక చోట ప్రద్యుమ్నుని యుద్ధ విజృంభణను వర్ణిస్తూ అతని ధాటికి శత్రు సైన్యంలోని రథాలు తోలు బొమ్మలాటలోని బొమ్మల మాదిరిగా కింద పడిపోయినట్లుగా -"యంత్రకుడాడించి యవని ద్రోచిన వ్రాలు- బొమ్మలగతి రథపూగములను"[15] అని చెప్పాడు.

శ్రీనాథుడు తన కాశీఖండం, భీమేశ్వర పురాణం, శివరాత్రీ మాహాత్మ్యం, పల్నాటివీర చరిత్ర గ్రంథాల్లో కొన్ని జానపద నృత్యాలను పేర్కొన్నాడు. ఆనాడు పండుగ రోజున దేవాలయాల్లో అనేక నృత్య ప్రదర్శనలు జరుగుతూ ఉండేవి. వాటిలో జానపద నృత్యాలు గూడ ఉన్నట్లుగా భీమేశ్వర పురాణాన్ని బట్టి తెలుస్తున్నది.

"వేమభూపాల రాజ్యభార దురంధరుండై బెండపూడన్నయామాత్యుడు గట్టించిన మొగసాల వాకిట మహోత్సవ మంటపంబు నందు బేరోలగంబుండి కుండలీ, దండలాసక, ప్రేరణీ, ప్రేంఖణ, సింధు కందుకదమాళి చెలమతల్లీ హల్లీస కాది నృత్యంబు లవలోకించుచు"[16] ఉండేవారట.

పల్నాటి వీరచరిత్రలో గూడ శ్రీనాథుడు జానపద నృత్యాలను పేర్కొన్నాడు. నలగామరాజు సభలో ప్రదర్శింపబడిన విద్యావినోదాన్ని గురించి వర్ణించే సందర్భంలో వివిధ రకాల జానపద నృత్యాలను ఇలా చెప్పాడు.

"భూచారి నాట్యంబు పొందుగా సలిపి- పదునారు విధములై పరగిన యట్టి
ఆకాశచారియు నమరంగనాడి- అంగహారాఖ్యగలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధముల నాడి- గతిచారి భేదముల్ గనుపడునట్టు



భ్రమణ సంయుత దీప్తి పటిమ మీరంగ- పాణి భేదములను బాటించి చూపి
స్థానక సంచయ సంయుక్తి అమర- ప్రేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బాహుచారి- సప్తతాండవములు సల్పె చిత్రముగ"[17]

ఇందులో ప్రేరణి, దేశిని, ప్రేంఖణం మొదలైన జానపద నృత్యాలు చెప్పబడ్డాయి. ఇంకొక చోట గంగిరెద్దులవారిని -

"గంగిరెద్దుల వాడు కావరమణచి- ముకుదాడు పొడిచిన పోట్లెద్దులట్లు"[18]

అని ప్రస్తావించాడు.

వల్లభరాయుడు తన క్రీడాభిరామంలో గౌరవలను, బవనీలను, మైలారు వీరభటులను, పాములవారిని పేర్కొన్నాడు.

"వీరు మైలార దేవర వీరభటులు
గొండ్లి యాడించు చున్నారు గౌరగ పడుచు
నాడు చున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టిక సీలంత గాని లేదు"[19]

అని గౌరవపడుచు ఆటను పేర్కొన్నాడు.

"పరుశురాముని కథలెల్ల ప్రౌఢి పాడె
జారుతరకీర్తి బవనీల చక్రవర్తి"[20]

అని పరశురాముని కథలను చెప్పిన బవనీలను గురించి చెప్పాడు. మైలారు వీరభటుల సాహసకృత్యాలను గురించి వల్లభరాయుడు ఇలా చెప్పాడు.

సీ!! "అవఅవ మందు నెత్తిని చంద్ర మల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి యలుగులు గనప పాతర్లలో
నుట్టి చేరులు గోసి యురుకువారు
గాలంపు గొంకి గంకాళ చర్మము గ్రుచ్చి
యుడువీధి నుయ్యేల లూగువారు
కటిక హోన్నాళంబు గండకత్తెర పట్టి
మిసిమంతలును గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
యెడమ కుడిచేత నారతులిచ్చువారు
సాహసమూర్తి గైకొన్న సరణివారు
దీరహృదయులు మైలారు వీరభటులు"[21]

ఆ తర్వాత పెదపాటి ఎర్రన, కొరవి గోపరాజు, రఘునాథ నాయకుడు, కనుపర్తి అబ్బయామాత్యుడు మొదలైన పండిత కవులు తమ కాలంనాటి కొన్ని జానపద కళల పేర్లను తమ రచనల్లో ప్రస్తావించారు. దీన్నిబట్టి మన జానపద కళలు చాల ప్రాచీన మైనవని తెలుస్తూ ఉంది.

జానపద కళలు అవి పుట్టినప్పటి నుంచి జానపదులకు వినోదాన్ని విజ్ఞానాన్ని కలిగించాయి. టీ.వీ.లు, సినిమాలు, నాటకాలు లేనికాలంలో గ్రామీణ, పట్టణ ప్రాం తాల్లోని ప్రజలందరికీ జానపద కళలు గొప్ప రసానందాన్ని కలిగించాయి. ప్రజలు చాలా దూరం వెళ్ళి ఈ కళలను చూసేవారు. "తొంభైయ్యామడ వెళ్లి తోలుబొమ్మలాట ఆరవయ్యామడ వెళ్ళి ఆలపబ్బం చూడాలి" అనే సామెతను బట్టి తోలుబొమ్మలాటకు ఆలపబ్బంగా పిలువబడే గంగజాతరకు ఆనాడు ఎంత ప్రసిద్ధి ఉండేదో, ఆనాటి ప్రజలు ఆరెండింటినీ ఎంత ఇష్టపడేవారో తెలుస్తుంది. మిగిలిన జానపద కళలను గూడ ప్రజలు ఎంతో ఆసక్తిగా, ఇష్టంగా తిలకించేవారు. ఈ కళలు ఆనాటి ప్రజల్లో కులపరమైన అంతరువులను పోగొట్టి ప్రజల మధ్య సామరస్యాన్ని, సంఘీభావాన్ని కలిగించాయి. వివిధ కులాలవారు పక్కపక్కనే కూర్చొని వాటిని చూడడంవల్ల వారి మధ్య కుల పట్టింపులు తగ్గేవి. అంతేగాకుండా ఇవి ఆనాటి ప్రజల్లో భక్తి భావాన్ని ఆధ్యాత్మిక చింత నను కలిగించాయి. విష్ణువు, శివుడు, రాముడు, కృష్ణుడు మొదలైన పౌరాణిక పాత్రలకు సంబంధించిన కథలను ఈ కళలు ప్రదర్శించడం వల్ల ప్రజల్లో భక్తిభావం, ఆధ్యాత్మిక చింతన ప్రబలేది. ప్రదర్శనకారులు మధ్య మధ్యలో అనేక రకాల నీతులకు సంబంధిం చిన కథలు చెప్పడం వల్ల ప్రజల్లో నైతిక జీవనంపట్ల ఆసక్తి పెరిగేది.

జానపదుల కోసం జానపదులు సృష్టించినవి జానపద కళలు. అంతేకాదు వీటిని పెంచి పోషించినదీ జానపదులే. జానపదులు తమ ఊర్లోకి వచ్చిన జానపద కళాకారులను తమ తాహతుకు తగినట్లుగా ధనమూ, ధాన్యమూ ఇచ్చి గౌరవించే వారు. వారిని యాచకులుగా చూసేవారు కాదు. వారిని కళాకారులుగా గుర్తించి గౌరవించేవారు. గతంలో జానపద కళలకు ఇంతటి ఆదరణ, కళాకారుల పట్ల ఇంతటి గౌరవమూ ఉండడం వల్లనే ఎన్నో రకాల జానపద కళలు సృష్టింపబ డ్డాయి. ఎంతో మంది జానపద కళా ప్రదర్శనను వృత్తిగా స్వీకరించి జీవించారు. అంతే గాదు వీరు ఆ కళాప్రదర్శనను వంశ పారంపర్యంగా ప్రదర్శించేవారు. ఇలా ప్రదర్శిం చడం వల్ల వారు తమ కళాప్రదర్శనలో గొప్ప నైపుణ్యాన్ని సంపాదించేవారు. అంతే గాకుండా కళా ప్రదర్శనలో కొత్త ప్రయోగాలు చేసి తమ కళా ప్రదర్శనను మరింత ఆసక్తి కరంగా, రసవంతంగా చేయడానికి ప్రయత్నించే వారు. పెద్ద ప్రయత్నం. కష్టం



లేకుండా అలవోకగా వారు తమ కళను ప్రదర్శించేవారు. ప్రత్యేకించి ఆ కళా ప్రదర్శ నకులుగా గుర్తింపు పొందేవారు. ఇందుకు ఉదాహరణగా తోలుబొమ్మలాట వారు, గంగిరెద్దులవారు, దొమ్మరాటవారు మొదలైన వారందరినీ చెప్పవచ్చు.

జానపదులు ఎలాంటి ఆడంబరాలు లేకుండా సాధారణమైన జీవితాన్ని గడుపుతారో జానపద కళలు గూడ అంతే సాధారణంగా ఉంటాయి. వీటికి పెద్ద హంగూ ఆర్భాటమూ అవసరం లేదు. పెద్దగా మేకప్ గూడా అవసరం లేదు. ఒక్క తోలుబొమ్మలాటకు తప్ప మిలిగిన వాటికి వేదిక గూడా అవసరం లేదు. వీటిని ఎప్పు డైనా ఎక్కడైనా సులభంగా ప్రదర్శించవచ్చు. వీటిని ప్రదర్శించడానికి కొన్ని వాద్య పరికరాలు అవసరమవుతాయి. ఈ పరికరాలు ఒకసారి సమకూర్చుకుంటే చాలు, అవి ఎంతో కాలం పనికివస్తాయి.

తెలుగులో రెండు వందలకు పైగా, జానపద కళలున్నాయి. వీటిలో కొన్ని ఆ కళలను ప్రదర్శించే గాయక భిక్షుకుల పేరుతో పిలువబడుతున్నాయి. కొన్ని నృత్యం పేరుతో, కొన్ని ఆట పేరుతో, కొన్ని కథ పేరుతో, కొన్ని భాగవతం పేరుతో, కొన్ని దాసరి పేరుతో, కొన్ని జంగాల పేరుతో, కొన్ని నాటకం పేరుతో, కొన్ని భజనపేరుతో, కొన్ని మేళం పేరుతో, కొన్ని వేషం పేరుతో పిలువబడుతూ ఉన్నాయి.

**గాయక భిక్షుకుల పేరుతో పిలువబడే కళలు :** కులాధారిత జానపద కళలన్నీ ఈ వర్గం కిందికి వస్తాయి. ఆంధ్రదేశంలోని దాదాపు అన్ని కులాలవారు తమ కులం గొప్పతనం గురించి చెప్పడానికి కులపురాణాలు సృష్టించుకొని, ఆ కుల పురాణం చెప్పడానికి ప్రత్యేకంగా ఒక జాతివారిని ఏర్పాటు చేసుకొని వారి పోషణా భారాన్ని తామే వహించారు. అంటే కులపురాణం చెప్పేవారు ఆశ్రితులు. ఈ ఆశ్రితులు ఏ కులాన్ని గురించి కులపురాణాన్ని చెబుతున్నారో వారు పోషకులు. ఆశ్రితకులాల వారు నిర్ణీత కాలవ్యవధిలో అంటే సంవత్సరానికి ఒకసారి గానీ, రెండేళ్లకొక సారి గానీ, లేదా మూడేళ్లకొకసారి గానీ తమను పోషించే కులస్థులున్న గ్రామాలకు వెళ్లి వారి ఇళ్ల దగ్గర పోషితకులస్థుల కులపురాణాన్ని చెప్పి కొన్ని రోజుల పాటు ఆ ఊర్లో ఉండి, వారు ఇచ్చే సంభావన గ్రహించి ఆ తర్వాత మరొక ఊరికి వెళ్ళి అక్కడ గూడ అదేవిధంగా చేస్తారు. వీరు చెప్పే ఈ కథలను లేదా ప్రదర్శనను కులకథాఖ్యాన జానపద కళలు అని పిలువవచ్చు. ఈ కళాకారులు ఏ కులం యొక్క పురాణాన్ని చెబుతారో ఆ కులస్థులను మాత్రమే యాచిస్తారు. మిగిలిన కులాల వారిని యాచిం చరు. తమ కళను ప్రత్యేకంగా తమను పోషించే కులస్థుల కోసమే వారి ఇళ్ల దగ్గర మాత్రమే ప్రదర్శిస్తారు. అయితే మిగిలిన కులస్థులు వీరి కళను చూడడానికి రావచ్చు.

ఆంధ్రదేశంలో ఇలాంటి కులాధారిత జానపద కళలు చాలా ఉన్నాయి. కులం పేరును. దానికి ఎదురుగా ఆ కులాధారిత కళను కింద ఇస్తున్నాను.

బ్రాహ్మణులు - విప్రవినోదులు
వైశ్యులు - వీరముష్టివారు
రెడ్లు, కమ్మవారు - పిచ్చుగ్గుంట్లు
కాపులు (తెలగలు) - కాకిపడగల వారు
యాదవులు (గొల్లలు)- గొల్లసుద్దుల వారు, కొమ్ముల వారు
పొడపోతుల వారు, మందెచ్చుల వారు
తెరచీరల వారు, బైకాని వారు
ముదిరాజులు - పాండవులు వారు, తోటి వారు
గౌడవారు - గౌడజెట్టి వారు
విశ్వబ్రాహ్మణులు - రుంజల వారు
పద్మసాలీలు - సాధనాశూరులు, కూనపులి వారు
దేవాంగులు - జాతిబిడ్డల వారు, సింగం వారు
చాకలివారు - పటం వారు
మంగలివారు - అద్దపు వారు
కుమ్మరివారు - పెక్కింటి వారు
మాదిగలు - బైండ్ల వారు, ఆసాది వారు
మాలలు - గుర్రం వారు

అలాగే మిగిలిన కులాలవారికి కూడా కులాధారిత జానపద కళలున్నాయి. ఈ కళాకారులందరూ గాయక భిక్షుకులుగా పిలువబడుతున్నారు. వీరే గాకుండా గాయక భిక్షుకుల పేరుతో పిలువబడే జానపద కళలు మరికొన్ని ఉన్నాయి. అయితే ఇవి ప్రత్యేకించి ఒక కులానికి సంబంధించినవి గావు. ఈ కళాకారులు అన్ని కులాల వారిని యాచిస్తారు.బుడబుడకల వారు, గొండల వారు,బవనీలు, పెదవేటిగొల్లలు, చినవేటి గొల్లలు, బూదాటి గొల్లలు, చిందుమాదిగలు, కాటికాపరులు, పూసల బలిజలు, దక్కలి వారు, కాటిపాపల వారు, హరిదాసులు, వీరవిద్యావంతులు, కొమ్మదాసరి, నూనెగుద్దల వారు, భట్రాజులు, చిన్నమాదిగలు, బాలసంతు వారు, కాకిపడగలవారు, పటాల వారు, పనసల వారు, మరిదిపిచ్చులు, పరికెముగ్గులు. యానాదులు, గంట సాయిబులు మొదలైనవారు గాయక భిక్షుకుల పేరుతో పిలువబడే జానపద కళాకారులు.



**నృత్యం పేరుతో ఉన్న జానపద కళలు:** కోయనృత్యం, గొరవయ్యల నృత్యం, ఉరుముల నృత్యం, గూస్సాడి నృత్యం, మామిడి నృత్యం, నెమలి నృత్యం, ధిమ్సా నృత్యం, లంబాడీ నృత్యం, డప్పు నృత్యం, గరగ నృత్యం, కరువ నృత్యం, పులి నృత్యం, కీలుగుర్రం నృత్యం, అశ్వ నృత్యం, మొసలి నృత్యం, తాబేలు నృత్యం, పక్షి నృత్యం, ఘట నృత్యం, వీరభద్ర విన్యాస నృత్యం, పేరిణి నృత్యం, దేవదాసి నృత్యం, గొండ్లి నృత్యం, చెంచు నృత్యం, వీర నాట్యం, జ్యోతి నృత్యం, జాలరి నృత్యం, నామాల సింగని నృత్యం, సిద్ధి నృత్యం, కారువామేళ నృత్యం, గంట నృత్యం, ధూలా నృత్యం, వేమయ్యగుర్రం నృత్యం, రామచిలకల నృత్యం, తాషావిన్యాస నృత్యం, కచ్చేరి నృత్యం, నాగిని నృత్యం, తోంగ్‌సేన్ నృత్యం, గొబ్బి నృత్యం, కోలాటం నృత్యం, జట్టిజాము నృత్యం, తప్పెటగుళ్ల నృత్యం మొదలైనవి నృత్యం పేరుతో పిలువబడే జానపదకళలు.

**ఆట పేరుతో ఉన్న జానపద కళలు :** గంగిరెద్దులాట, దొమ్మరాట, గుర్రాలాట, బుట్టబొమ్మలాట, మల్లేలాట, తోలు బొమ్మలాట, కోతాట, ఎలుగుబంటాట, పాములాట, బయలాట, జోగాట, కట్టెబొమ్మలాట, కీలుబొమ్మలాట, కొర్రగేదెలాట, మల్లికాసులాట, మాలమాస్టీడాట, మాదిగబోగమాట మొదలైనవి ఆట పేరుతో పిలువబడుతున్న కళలు.

**కథ పేరుతో ఉన్న జానపద కళలు :** పంబకథ, తంబురకథ, జముకుల కథ, బుర్రకథ, రుంజకథ, ఒగ్గుకథ, జంగం కథ, బైకాని కథ, జముకుల కథ, జక్కుల కథ, తందనాన కథ, శారద కథ, కంజరి కథ, చెంచిత కథ, జమ్మిటిక కథ, బోనుల కథ, కిన్నెర కథ మొదలైనవి కథ పేరుతో ఉన్న కళలు.

**భాగవతం పేరుతో ఉన్న జానపద కళలు :** వీధి భాగవతం, తూర్పు భాగ వతం, యానాది భాగవతం, గంటి భాగవతులు, కోటకొండ భాగవతులు, జేగంట భాగవతులు, గొల్ల భాగవతులు, మాల భాగవతులు, చిందు భాగవతం, చెంచు భాగవతం, నక్కల భాగవతం మొదలైనవి భాగవతం పేరుతో పిలువబడే కళలు.

**దాసరి పేరుతో ఉన్న జానపదకళలు :** బుక్క దాసరి, భాగవత దాసరి, దండె దాసరి, మాల దాసరి, నక్క దాసరి, గొల్ల దాసరి, మాదిగ దాసరి, గరుడస్థంభం దాసరి, ఎరుకల దాసరి, వైష్ణవ దాసరి, వీధి దాసరి మొదలైనవి దాసరి పేరుతో పిలువబడుతున్న కళలు.

**జంగాల పేరుతో ఉన్న జానపద కళలు :** బుడిగ జంగాలు, మాల జంగాలు, నక్క జంగాలు, గంట జంగాలు మొదలైనవి జంగాల పేరుతో ఉన్న కళలు.

**నాటకం పేరుతో ఉన్న జానపద కళలు :** ఎర్రగొల్లల నాటకం, వీధి నాటకం, వెన్నెల

నాటకం, చాయా నాటకం, బయలు నాటకం, చెంచు నాటకం మొదలైనవి నాటకం పేరుతో పిలువబడుతున్న కళలు.

**భజన పేరుతో ఉన్న జానపద కళలు :** బైటోభజన, పందరి భజన, చెక్క భజన, నృత్యతాళ భజన, హరి భజన, చిందు భజన, తాళ భజన మొదలైనవి భజన పేరుతో ఉన్న కళలు.

**మేళం పేరుతో ఉన్న జానపద కళలు :** భాగవత మేళం, నట్టువ మేళం, భోగం మేళం,సాఖీ మేళం, అక్కన్న మాదన్నల భాగవత మేళం, కోయ మేళం, సన్నాయి మేళం మొదలైనవి మేళం పేరుతో ఉన్న కళలు.

**వేషం పేరుతో ఉన్న జానపద కళలు :** పగటి వేషాలు, ఫకీరు వేషం, బళ్ళమీది వేషాలు, దాదినమ్మ వేషం, కోతి వేషం, ఎలుగుబంటి వేషం మొదలైనవి వేషం పేరుతో పిలువబడుతున్న జానపదకళలు.

పైన చెప్పినట్లుగా పేర్లు లేకుండా ఉన్న జానపద కళలు కొన్ని ఉన్నాయి. అవి- కత్తిసాము, కర్రసాము, ఎరుకత సోది, యక్షగానం, కురవంజి, గారడీ విద్య, మూకాభినయం, వాలకం, కాశీకావడి, జంతరు పెట్టె, దేవత పెట్టె, బుంగీలు, కడ్డీ వాయిద్యం, కాముని పున్నమి, మోడీ, చిరుతల రామాయణం, బహురూపులు, ఇంద్ర జాలం, మెరవణిగద్య, గాలపుసిడి, కత్తుల గారడి, పగటి వేషాలు, సేవ గరిడి, దండా గానం, చుట్టకాముడు, కప్పల కావడి, కొయ్యకాళ్ళు, అగ్నిగుండం తొక్కడం, కొమ్ము బూరలు, పందిరిపాట, చిత్రకథా గానం, బైరాగి తత్వాలు, రెల్లి జట్టులు, రేల పాటలు, వీరఖడ్గాలు, వీధి పురాణాలు, పరికెముగ్గుల సోది, సాతాని పదాలు, చోడిగాని కలాపం, హరిహరీ పదాలు, రోడ్డుమీద బొమ్మలు మొదలైనవి ఇలాంటివి.

ఆంధ్రదేశంలో పైన పేర్కొన్న రెండు వందలకు పైగా ఉన్న జానపద కళలను అనేక రకాలుగా వర్గీకరించవచ్చు. మొదట జానపద కళల్లోని విషయాన్ని బట్టి 1. భక్తి ప్రధాన కళలు 2. వినోద ప్రధాన కళలు 3. ఉభయ ప్రధాన కళలు 4. కులకథాఖ్యాన కళలు అని నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు. గరగ నృత్యం, హరిదాసులు, వివిధ రకాల భజనలు, అగ్ని గుండం తొక్కడం, సేవగరిడి, వీరనాట్యం, శూలనృత్యం, రోడ్డు మీది బొమ్మలు మొదలైనవి భక్తి ప్రధాన కళలు. ఎలుగుబంటి ఆట, కోతిఆట, దొమ్మ రాట, పాములాట, గారడివిద్య, కొమ్ముబూరలు, మెరవణి గద్య, ఇంద్రజాలం మొదలై నవి వినోద ప్రధాన కళలు. జానపద కళల్లో ఎక్కువ భాగం వినోద ప్రధాన కళలే ఉన్నాయి. భక్తి, వినోదం రెండూ ఉన్నవి ఉభయ ప్రధాన కళలు. కోలాటం, తప్పెటగుళ్ళు, బుర్రకథ, గంగిరెద్దులాట, పగటివేషాలు, తోలుబొమ్మలాట, వివిధ రకాల భాగవతాలు,



దాసరులు, కంజరికథలు, తంబురకథలు మొదలైనవి ఉభయ ప్రధానకళలు. విప్రవినోదాలు, వీరముష్టివారు, పిచ్చుగ్గుంట్లు, గొల్లసుద్దులవారు మొదలైన ఆశ్రితకులాల వారు ప్రదర్శించే కళలన్నీ నాల్గవ వర్గమైన కుల కథాఖ్యాన కళల కిందికి వస్తాయి.

జానపద కళలన్నింటినీ సాహిత్యం ఉన్న కళలు. సాహిత్యం లేని కళలు అని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. కులకథాఖ్యాన కళలన్నింటిలోనూ కులపురాణాన్ని చెప్పడం ఉంటుంది. అందువల్ల అవన్నీ సాహిత్యం ఉన్న కళల కిందికి వస్తాయి. అంతేగాకుండా కోలాటం, కంజరికథ, తంబురకథ, సేవగరిడి, తప్పెటగుళ్ళు, అనేక రకాల భజనలు, తోలు బొమ్మలాట మొదలైనవన్నీ సాహిత్యమున్న కళలు. జానపద కళల్లో ఎక్కువ భాగం సాహిత్యమున్న కళలే ఉన్నాయి. అగ్ని గుండం తొక్కడం, కత్తిసాము, కర్రసాము, పాములాట, కోతిఆట, ఎలుగుబంటి ఆట, దొమ్మరాట, బళ్ళమీది వేషాలు, మోడి మొదలైనవి సాహిత్యం లేని జానపద కళలు.

ప్రదర్శననుబట్టి వంశపారంపర్యంగా ఏదైన ఒక కులంవారు మాత్రమే ప్రదర్శించేవి, అందరూ ప్రదర్శించేవి అని జానపదకళలన్నింటినీ రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. కులకథాఖ్యాన కళలన్నీ వంశపారంపర్యంగా ఒక కులం వారు మాత్రమే ప్రదర్శించేవి. ఇవి గాకుండా పగటివేషాలు, గంగిరెద్దులాట, దొమ్మరాట, లంబాడీ నృత్యం, ధిమ్సా నృత్యం మొదలైనవి కూడా ఈ విభాగం కిందికి వస్తాయి. జానపద కళలు ఎక్కువ భాగం ఈ విభాగానికి చెందినవే ఉన్నాయి. బుర్రకథ, డప్పునృత్యం, పులివేషం, కోతివేషం, ఎలుగుబంటివేషం, కోలాటం, గొబ్బి, కత్తిసాము, కర్రసాము మొదలైనవి అందరూ ప్రదర్శించేవి.

జానపద కళలను అవి ప్రదర్శించే సమయాన్ని బట్టి పగలు ప్రదర్శించేవి, రాత్రి ప్రదర్శించేవి, పగలూ రాత్రీ ప్రదర్శించేవి అని మూడు రకాలుగా చెప్పవచ్చు. ప్రదర్శనలో పాల్గొనే వ్యక్తులను బట్టి పురుషులు మాత్రమే ప్రదర్శించేవి, స్త్రీ పురుషు లిద్దరూ ప్రదర్శించేవి. స్త్రీ పురుషులతోపాటు పిల్లలు గూడ ప్రదర్శించేవి అని మూడు రకాలుగా చెప్పవచ్చు. అలాగే జానపద కళలు అవి ప్రదర్శించే ప్రాంతాన్నిబట్టి ఆంధ్ర దేశమంతటా ప్రదర్శించేవి, ఏదైనా ఒకటి, రెండు ప్రాంతాల్లో మాత్రమే ప్రదర్శించేవి అని రెండు రకాలుగా చెప్పవచ్చు.

మనం ఏదైనా జానపద కళను గురించి చెప్పాలనుకున్నప్పుడు పై వర్గీకర ణను దృష్టిలో పెట్టుకొని చెప్పవచ్చు. ఉదాహరణకు తోలుబొమ్మలాటను తీసుకుందాం. తోలుబొమ్మలాట భక్తి వినోదమూ రెండూ ఉన్న ఉభయ ప్రధానమైన కళ. ఇది

సాహిత్యం ఉన్న కళ. అంతేకాకుండా ఇది వంశ పారంపర్యంగా ఒక కులంవారు మాత్రమే ప్రదర్శిస్తున్న కళ. దీన్ని రాత్రిపూట మాత్రమే ప్రదర్శిస్తారు. దీని ప్రదర్శనలో స్త్రీ పురుషులు, పిల్లలు అందరూ పాల్గొంటారు. ఇది ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడే కళ. ఇదే విధంగా అన్ని జానపద కళలను గురించి అధ్యయనం చేయవచ్చు.

జానపదకళల్లో ఎక్కువ భాగం కథను చెప్పేవి ఉన్నాయి. కులకథా ఖ్యాన కళలన్నీ కథను చెప్పడం ప్రధాన లక్షణంగా ఉంటాయి. పంబకథ, తంబురకథ మొదలైన కళల్లో గూడా కథాఖ్యానం ప్రధానంగా ఉంటుంది. అంతే గాకుండా నేను పరిశోధనకు విషయంగా గ్రహించిన యాదవ జానపద కళల్లో గొల్లసుద్దుల వారు, కొమ్ములవారు, మందెచ్చులవారు, పొడపోతులవారు,తెరచీరలవారు, బైకాని వారు కాటమరాజు కథలను చెప్పడమే పనిగా పెట్టుకున్నవారు. సేవగరిడి, తప్పెటగుళ్లు, ఒగ్గుకథ అనే మూడు కూడా కథాఖ్యానాత్మకంగా ఉంటాయి. గంగిరెద్దులవారు గూడా అనేక కథా గేయాలను పాడుతారు. ఒక్క గొరవయ్యలు మాత్రమే కథను చెప్పరు. ఇది నృత్య ప్రధానమైన కళ. మిగిలిన పది కళల కళాకారులు కథలను గానం చేస్తారు. వీరు గానం చేసే కథలను కథాగేయాలు అంటారు. అందువల్ల కథాగేయాలను గురించి కొంత తెలుసుకోవలసి ఉంది.

## కథా గేయాలు :

జానపద సాహిత్యంలో కవిత్వం, వచనం అనే రెండు శాఖలున్నాయి. వీటిలో మొదటిదైన కవిత్వంలో కథారహితం, కథాసహితం అనే రెండు అంతశ్శాఖలున్నాయి. కథారహిత కవిత్వానికి జానపద గేయం (Folk Song) శుద్ధగీతం (Pure Song) అనే పేర్లు ఉన్నాయి. కథాసహిత కవిత్వాన్ని కథాగేయం (Narrative Song) అంటారు. కథాగేయమంటే కథ కలిగిన గేయమని అర్థం. దీన్నే కొందరు గేయకథ అని, మరికొందరు వీరగాథ అని అన్నారు. గేయకథ అంటే గేయ రూపంలో ఉన్న కథ అని అర్థం. జానపద కవిత్వంలో మొదటిదైన కథారహిత కవిత్వం నుండి రెండవదైన కథాసహిత కవిత్వాన్ని పేరు చేసేది కథ. కథ లేకపోతే అది జానపద గేయమౌతుంది. కాబట్టి ఇక్కడ ముఖ్యమైనది కథ. పేరులో ఈ కథ అనే పదం మొదట ఉంటే ఆ పేరుకు మరింత సార్థకత ఉంటుంది. కాబట్టి కథాసహిత కవిత్వానికి గేయకథ అనే పేరు కంటే కథాగేయం అనే పేరే అన్ని విధాలా తగినదని చెప్పవచ్చు. కథాసహిత కవిత్వాన్ని ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారు 'వీరగాథ' అని పిలిచారు. ఇంగ్లీషులో (Ballad) అనే పదానికి తెలుగులో సమానార్థంగా 'వీరగాథ' అనే పదాన్ని తంగిరాలవారు ఉపయోగించారు. ఇంగ్లీషులో G.H. Gerould, Francis B. Gummere



మొదలైన జానపద విజ్ఞానవేత్తలు Narrative Song ను Ballad అని అన్నారు. అదే విధంగా తంగిరాలవారు గూడా కథాసహిత కవిత్వాన్ని వీరగాథ అని అన్నారు. అయితే వీరగాథ అనే పదం వీరరస ప్రధానమైన కథాగేయాలకు మాత్రమే వర్తిస్తుంది. కథాగేయాల్లో వీరరస ప్రధానమైనవే గాకుండా కరుణ, అద్భుత రస ప్రధానమైనవి గూడా ఉన్నాయి. వీటికి వీరగాథ అనే పేరు వర్తించదు. ఇంగ్లీషులో గూడా వీరరస ప్రధానమైన కథాగేయాలను Heroic Ballads అని అంటారు. కాబట్టి కథాసహిత కవిత్వాన్ని వీరగాథలు అని పిలవడం కంటే కథాగేయాలు అని పిలవడమే సమంజసం.

**కథాగేయ నిర్వచనం :** G.H. Gerould Ballad ను ఇలా నిర్వచించాడు. "Balad is a Folk Song that tells a story ................ a ballad is always a Narrative is always sung to a rounded melody, and is always learned from the lips of others rather than by reading".[22]..

Francis B. Gummere Ballad ను popular ballad. Traditional ballad అని రెండు భాగాలుగా చేసి నిజమైన జానపద కవిత్వమైన Popular ballad ను ఇలా నిర్వచించాడు. "Popular Ballad is a poem meant for singing, quite ipersonal in manner, narrative in material, probably connected in its origins with the communal dance, but submitted to a process of oral tradition among people who are free from literary influences and fairy homogeneous in character"[23].

ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారు "జానపద గేయ రూపమున నుండి వీరరస ప్రధానమైన కథను చెప్పుచు, సంచార గాయక బిక్షుకుల (Minstrels) చే పాడబడు సరళ కథాగేయమే వీరగాథ"[24] అని వీరగాథను నిర్వచించారు. ఈ నిర్వచనం వీరరస ప్రధానమైన కథాగేయాలకు మాత్రమే వర్తిస్తుంది. అంతేగాకుండా వీరగాథలన్నీ సంచార గాయక బిక్షుకుల చేత పాడబడవు. కొన్ని వీరగాథలను ఇతరులు గూడా పాడతారు. ఉదాహరణకు విశాఖపట్నం జిల్లాలో పాడబడే దశావతార కథాగేయాలు వీరరస ప్రధానమైనవే. వీటిని 'సేవగరిడి' అనే జానపద కళాప్రదర్శన సందర్భంలో యాదవులు పాడుతారు. వీటిని పాడే యాదవులు సంచార గాయక బిక్షుకులు కారు. అందువల్ల తంగిరాలవారి నిర్వచనం కథాగేయాలకు మాత్రమేగాదు కొన్ని వీరగాథలకు గూడా వర్తించదు.

కథాగేయాన్ని ఇలా నిర్వచించవచ్చు. "కథను కలిగి, గేయరూపంలో ఉండి, సరళశైలిలో భిన్న పాఠాంతరాలతో, మౌఖిక సంప్రదాయంలో తరతరాలుగా అందింపబడుతున్న కథాసహిత కవిత్వాన్ని కథాగేయం"[25] అని పిలువవచ్చు.

**కథాగేయ లక్షణాలు :** కథాగేయ నిర్వచనంలోనే దానియొక్క ప్రధాన లక్షణాలన్నీ

ఇమిడి ఉన్నాయి. 1. కథాగేయం కథను కలిగి ఉండాలి, 2. కథాగేయం గేయ రూపంలో పాడటానికి అనువుగా లయబద్ధంగా ఉండాలి. 3. కథాగేయం భిన్న పాఠాంతరాలను కలిగి ఉండాలి, 4. కథాగేయం మౌఖిక సంప్రదాయంలో జీవిస్తూ తరతరాలవారికి అందింపబడుతూ ఉండాలి, 5. కథాగేయం వారానువార్తనాల(Ballad Common Places)ను కలిగి ఉండాలి. వీటితోపాటు బిరుదురాజు రామరాజుగార్లు జానపద గేయపరంగా చెప్పిన 1. అజ్ఞాత కర్తృత్వం, 2. రచనా కాలం తెలియకపోవడం, 3. నియమిత స్వరూపం లేకపోవడం, 4. ఆశు రచనం, 5. పునరావృత్తి అనే అయిదు లక్షణాలను గూడా కథాగేయ లక్షణాలుగా చెప్పవచ్చు.

**కథాగేయాల వర్గీకరణ :** తెలుగు జానపద సాహిత్యంలో కథాగేయాలు గంటలోపు కాలంలో పాడబడే చిన్నవాటి నుండి మొదలుకొని నెలల తరబడి పాడడానికి వీలైనంత పెద్దవి వరకు ఉన్నాయి. కాబట్టి కథాగేయాలను వాటి నిడివిని బట్టి 1. చిన్న కథాగేయాలు, 2. పెద్ద కథాగేయాలు, 3. కథాగేయ చక్రాలు అని మూడు విధాలుగా విభజింపవచ్చు.

**చిన్నకథాగేయాలు :** వీటిలో కథ చాల చిన్నదిగా ఉంటుంది. ఇవి గంటలోపు కాలంలో పాడబడతాయి. వీటిలో పౌరాణిక సంబంధమైన వాటిని స్త్రీలు పాడుతూ ఉంటారు. మిగిలిన వాటిని జానపదులు పని పాటల సందర్భంలో, గాయక భిక్షుకులు పగటపూట భిక్షమెత్తుకునేప్పుడు పాడుతూ ఉంటారు. ఈ చిన్న కథాగేయాల పేర్ల చివర సాధారణంగా పాట లేక పదం అనే మాటలు వస్తూ ఉంటాయి. ఉదాహరణకు సాయిబు నాయుడు పాట, గంగరాజు పాట, మాలవారి మంగమ్మ పాట మొదలైనవి.

చిన్న కథాగేయాలను ఇతివృత్తాన్నిబట్టి పౌరాణికాలు, మత సంబంధాలు, అద్భుతరస ప్రధానాలు, చారిత్రకాలు, సాంఘికాలు అనే అయిదు శాఖలుగా విభజింపవచ్చు.

**పౌరాణికాలు:** పౌరాణిక చిన్న కథాగేయాల్లో ఇతివృత్తాన్నిబట్టి రామాయణ సంబంధాలు, భారత సంబంధాలు, భాగవత సంబంధాలు, ఇతరాలు అనే నాలుగు అంతశ్శాఖలను గుర్తింపవచ్చు. కంసల్య బైకలు, శ్రీరాముల ఉగ్గు పాట, మాయలేడి పాట, గరుటపచ్చి పాట, సీతమ్మ చెర, ముద్దుటుంగరం పాట, సీతాదేవి ఆనవాల పాట మొదలైనవి రామాయణ సంబంధాలు. ధర్మరాజు జూదం, పందు పాట, సుభద్ర సారె, శశిరేఖా పరిణయం బతుకమ్మ పాట మొదలైనవి భారత సంబంధాలు. శ్రీకృష్ణ జననం లాలిపాట, కాళింగ మడుగు పాట, శ్రీకృష్ణుని చల్దుల పాట, గుమ్మడు పాట, యశోదకొంగ పాట, రుక్మిణీ కళ్యాణం బతుకమ్మ పాట మొదలైనవి భాగవత సంబంధాలు.



నల చరిత్ర పదం, గోవు పాట, మంగమ్మ పాట, తురకబూబమ్మ పాట మొదలైనవి ఇతరాలు.

**మతసంబంధాలు :** మత సంబంధాల శాఖకు చెందిన చిన్న కథాగేయాల్లో శైవమత సంబంధాలు, వైష్ణవమత సంబంధాలు అనే రెండు అంతశ్శాఖలున్నాయి. మేనకాదేవి నొప్పులు, మేనకా పార్వతీ సంవాదం, సవతుల కయ్యం, గంగాగౌరు సంవాదం మొదలైనవి శైవమత సంబంధాలు. వరదరాజు పెండ్లి పాట, తిరుమంత్రం పాట, లక్ష్మీదేవి సాగటాలాట పాట మొదలైనవి వైష్ణవమత సంబంధాలు.

**అద్భుతరస ప్రధానాలు :** ఎర్రపాప పాట, చాకలిదుడుమన్న పదం లేక వీరనాగమ్మ పాట, వానదేవుని పాట, భూపతిరాజు పదం, బొత్తుడు పాట, ఒలియపొచ్చావు పాట మొదలైనవి అద్భుతరస ప్రధాన శాఖకు చెందిన చిన్న కథాగేయాలు"[26]

**చారిత్రకాలు :** చారిత్రక శాఖకు చెందిన చిన్న కథాగేయాల్లో వీర మరణాలు, వీర ప్రశంసలు, విప్లవ జన్యాలు, దానవీర ప్రశంసలు అనే నాలుగు అంతశ్శాఖలను గుర్తింపవచ్చు.

దొరవారి నరసింహారెడ్డి పాట, చిన్నపరెడ్డి పాట, అల్లూరి సీతారామరాజు పాట మొదలైనవి వీరమరణాలు అనే అంతశ్శాఖను చెందుతాయి. వీటిలో చెప్పబడిన వ్యక్తులందరూ ఆంగ్లేయుల మీద తిరుగుబాటు చేసి చివరకు వారిచేత ఉరి తీయబడడం గానీ, తుపాకితో కాల్చబడి చనిపోవడం గానీ జరిగింది.

నరసింహారెడ్డిపాట, మరుట్ల చిన్నమల్లేశుని పాట, ఓబులరెడ్డి పాట, పెనుగొండ కోట పాట మొదలైనవి వీర ప్రశంసలనే అంతశ్శాఖకు చెందుతాయి"[27]

దొడ్డి కొమరయ్య పాట, రేణిగుంట రామిరెడ్డి పాట, గోముక్కల గోపాలరెడ్డి పాట, యలకపల్లి యాదగిరి పాట, పసునూరి వెంకటరెడ్డి పాట, వీరమళ్ల వెంకయ్య పాట, కొంతం కొండలరెడ్డి పాట, అనిరెడ్డి రామిరెడ్డి పాట, చిలకమ్మ పాట మొదలైనవి విప్లవ జన్యాలనే అంతశ్శాఖకు చెందుతాయి. ఇందులో చెప్పబడిన వ్యక్తులందరూ తెలంగాణాలో నైజాం నవాబును, కిరాతకులైన అతని రజాకార్లను ఎదిరించి వీరమరణాన్ని పొందారు. 1945 నుండి 49 వరకు కమ్యూనిష్టులు గొప్ప విప్లవాన్ని లేవదీశారు. ఆ విప్లవం సందర్భంగానే పైన పేర్కొన్న వీరులు వీర వనితలు నైజాం నవాబును ఎదిరించారు. అందువల్లనే తంగిరాల వేంకట సుబ్బారావుగారు వీటికి విప్లవ జన్యాలు"[28] అనే పేరు పెట్టారు.

బుడ్డా వెంగళరెడ్డి పాట, సుద్దపల్లి లక్ష్మమ్మ పాట, యాదాళ్ల నాగమ్మ పాట, డొక్కా సీతమ్మ పాట, చిన్న అండ్లూరు శివమ్మ పాట మొదలైనవి దానవీర ప్రశంసలు

అనే అంతశ్శాఖకు చెందుతాయి.

**సాంఘికాలు :** సాంఘిక శాఖకు చెందిన చిన్న కథాగేయాల్లో గ్రామ కక్షలు - హత్యలు, స్వైరిణులు - భర్తృహంతలు, పందాలు - స్పర్థలు, ఆత్మత్యాగాలు - కట్టపదాలు, విధి వైపరీత్యాలు - ప్రమాదాలు అనే ఐదు అంతశ్శాఖలను చెప్పవచ్చు[29]

గుర్రాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, గడేకల్లు నాగిరెడ్డి పాట, బండోళ్ల కురుమలన్న పాట మొదలైనవి గ్రామకక్షలు - హత్యలు అనే వర్గానికి చెందుతాయి. అద్దాల సుబ్బులు పాట, చిన్న మునెమ్మ పాట, గుంటూరు ఆదెమ్మ పాట మొదలైనవి స్వైరిణులు - భర్తృహంతలు అనే విభాగానికి చెందుతాయి. అప్పలాపుం చెన్నారెడ్డి పాట, గొర్రెపోతుల పందెం మొదలైనవి పందాలు - స్పర్థలు అనే విభాగానికి చెందుతాయి. లలికట్ట పదం, ఒద్దిరాజుల పాట, బోన కాటపరెడ్డి పాట మొదలైనవి ఆత్మత్యాగంతో కూడిన కట్టపదాలు, ఎల్లల చెరువు పొంగిన పాట, మూసి పొంగిన పాట, జనగామ రైలు ప్రమాదం, జడ్‌చెర్ల రైలు ప్రమాదం మొదలైనవి విధి వైపరిత్యాలు - ప్రమాదాలు అనే విభాగానికి చెందుతాయి.

సాంఘిక శాఖలో గ్రామ కక్ష్యలు - హత్యలు, స్వైరిణులు - భర్తృహంతలు, పందాలు - స్పర్థలు, ఆత్మత్యాగాలు - కట్టపదాలు, విధివైపరిత్యాలు - ప్రమాదాలు అనే అంతశ్శాఖలున్నట్లుగా తంగిరాలవారు చెప్పారు. తంగిరాలవారు తాము సేకరించిన చిన్న కథాగేయాలను ఆధారంగా చేసుకొని పై వర్గీకరణ చేశారు. పై వర్గీకరణ కిందికి రాని సాంఘికశాఖకు చెందిన చిన్న కథాగేయాలు ఇంకా ఉన్నాయి. ఉదాహరణకు నేను విశాఖపట్నం పరిసరాల్లో సేకరించిన మాలవారి మంగమ్మపాట, గంగరాజుపాట, సాయిబు నాయుడు పాట మొదలైన వాటిలో మాలవారి మంగమ్మ పాటలోని కథ హరిజన కాపు కులాలకు చెందిన యువతీయువకుల ప్రేమగాథ, గంగరాజు పాటలో గంగరాజు అనే మోసగాడు తన ఊరి నాయుడి కూతురైన వెంకట లక్ష్మికి మాయమాటలు చెప్పి ఆమెను లేవదీసుకు పోతాడు. సాయిబునాయుడు పాటలో సాయిబునాయుణ్ణి పట్నంలో ఉండే ప్రేమలచ్చిమి అనే భోగం స్త్రీ డబ్బుకోసం చంపిస్తుంది. కాబట్టి సాంఘిక శాఖలో చిన్న కథాగేయాలు లభించే కొద్దీ వాటిలో అంతశ్శాఖలు పెరిగిపోతూ ఉంటాయి.

**పెద్ద కథాగేయాలు :** వీటిలో కథ పెద్దదిగా ఉంటుంది. ఇవి రెండు మూడు రాత్రులు పాడదగిన పరిమాణంలో ఉంటాయి. కొన్ని నాలుగు, అయిదు రాత్రులు పాడదగినంత పెద్దవిగా గూడా ఉంటాయి. వీటిలో పౌరాణిక సంబంధమైన వాటిని ఎక్కువగా స్త్రీలు పాడుకుంటూ ఉంటారు. అల్లీరాణి కథలాంటి పౌరాణిక కథాగేయాలను మిగిలిన



కథా గేయాలను గాయక భిక్షుకులు రాత్రిపూట పాడుతూ ఉంటారు. వీటి పేర్ల చివర సామాన్యంగా కథ అనే పదం వస్తూ ఉంటుంది. బొబ్బిలి కథ, బాలనాగమ్మ కథ, సర్వాయిపాపని కథ, ఆరెమరాఠీల కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మొదలైనవి వీటికి ఉదాహరణలు.

ఇతివృత్తాన్నిబట్టి పెద్దకథాగేయాలను పౌరాణికాలు, మత సంబంధాలు, చారిత్రకాలు, అద్భుతరస ప్రధానాలు, సాంఘికాలు అనే అయిదు శాఖలుగా విభజించవచ్చు.

**పౌరాణికాలు :** పౌరాణికాలను రామాయణ సంబంధాలు, భారత సంబంధాలు, భాగవత సంబంధాలు, ఇతరాలు అనే నాలుగు అంతశ్శాఖలుగా విభజించవచ్చు.

శాంత గోవిందనామాలు, అడవి గోవింద నామాలు లేక చరగోవింద నామాలు, సూక్ష్మ రామాయణం, పెండ్లి గోవింద నామాలు, లంకాయాగం, శారద రామాయణం, కుశలవ కుచ్చల చరిత్ర, రామకథా సుధార్ణవం మొదలైనవి రామాయణ సంబంధమైన పెద్ద కథాగేయాలు. దేవయానిచరిత్ర, సుభద్రా కళ్యాణం, గయోపాఖ్యానం, విరాటపర్వం జంగం కథ మొదలైనవి భారత సంబంధమైన పెద్ద కథాగేయాలు.

ప్రహ్లాదచరిత్ర, వామన విజయం, అంబరీషోపాఖ్యానం, గజేంద్రమోక్షం, ధ్రువ చరిత్రం మొదలైనవి భాగవత సంబంధమైన పెద్ద కథాగేయాలు.

నలచరిత్ర, సత్యహరిశ్చంద్ర కథ, చంద్రమతీదేవి కథ, దత్తాత్రేయ జననం, పారిజాత పల్లవి మొదలైనవి ఇతరాలకు చెందిన పెద్ద కథాగేయాలు. ఈ పౌరాణికాలను ఎక్కువగా స్త్రీలు పాడుతూ ఉంటారు.

**మత సంబంధాలు :** తెలుగు జానపద సాహిత్యంలో హిందూమతంలో ప్రధానాలైన శైవ వైష్ణవ మత సంబంధమైన కథాగేయాలు లభిస్తున్నాయి. దక్షయజ్ఞం గంగావివాహం, సురాభాండేశ్వరం, మార్కండేయుని జననం, శ్రీయాళమహారాజు చరిత్ర జంగం కథ, చిరుతొండరాజు కథ, కుమ్మర గండయ్య కథ, మిండ జంగం కథ, కొమిరెల్లి మల్లన్న కథ మొదలైనవి శైవమత సంబంధమైన పెద్ద కథాగేయాలు. అండాళ్ చరిత్రం, శ్రీరంగ మహాత్మ్యం, చెంచీత కథ, ఏకాదశీ మహాత్మ్యం, రుక్మాంగద మహారాజు కథ, చిన్నమ్మకథ, వరాహావతార చరిత్రం మొదలైనవి వైష్ణవ మతానికి చెందిన పెద్ద కథాగేయాలు.

**చారిత్రకాలు :** చారిత్రకశాఖకు చెందిన పెద్ద కథాగేయాలు ఎక్కువగా వీరరస ప్రధానమైనవి. ఇంగ్లీషులో వీటిని Heroic ballads అంటారు. తెలుగులో వీటిని

వీరగాథలు అనవచ్చు. వీటిలో యుద్ధవీరం ప్రధానంగా ఉంటుంది. చారిత్రకాల్లో స్పష్ట చారిత్రకాలు, అస్పష్ట చారిత్రకాలు అనే రెండు అంతశ్శాఖలున్నాయి. బొబ్బిలి కథ, సర్వాయి పాపని కథ, కొమారరాముని కథ, దేశింగురాజు కథ, రాణీ శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, కర్నూలు నవాబుకథ మొదలైనవి స్పష్ట చారిత్రకాలు. ముగ్గురు మరాఠీల కథ లేక ఆరె మరాఠీల కథ. బంగారు తిమ్మరాజు కథ లేక దేవరాయల కథ, కుంటి మల్లారెడ్డి కథ, వేమన కథ, బల్లూరి కోండ్రాయని కథ మొదలైనవి అస్పష్టచారిత్రకాలు.[30]

**అద్భుతరస ప్రధానాలు** : జానపదులకు నవరసాల్లో అత్యంత ప్రీతికరమైంది అద్భుత రసం. ఆశ్చర్యకరమైన సంఘటనలు ఎంత ఎక్కువగా ఉంటే వారు అంతగా ఆదరిస్తారు. జానపదుల ఈ ఇష్టాన్ని గమనించి జానపద కవులు అద్భుత రస ప్రధానాలైన కొన్ని కథాగేయాలను కల్పించారు. బాలనాగమ్మకథ, కమ్మవారి పణతి - పసల బాలరాజు కథ, గాంధారికథ, కాంభోజరాజుకథ, ధర్మాంగద చరిత్ర పాముపాట మొదలైనవి అద్భుతరస ప్రధానాలు.

**సాంఘికాలు** : సాంఘికాల్లో పేరంటాండ్రు, సాహసికులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్ష్యలు - హత్యలు, కుటుంబ కలహాలు, లేచిపోవడాలు అనే ఏడు అంతశ్శాఖ లున్నాయి.[31] కన్యకామ్మవారి కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, లక్ష్మమ్మ కథ, వీరరాజమ్మ కథ, నల్లతంగాళ్ కథ, ఎరుకల నాంచారి కథ, ఉయ్యూరు వీరమ్మ కథ మొదలైనవి పేరంటాండ్ర విభాగానికి చెందుతాయి. చిన్నపరెడ్డి కథ సాహసికుల శాఖకు చెందుతుంది. మలగర బాలేసాబు కథ బందిపోట్ల శాఖకు చెందుతుంది. మియ్యాసాబు కథ, పండుగ శాయన్న కథ, నక్కపల్కి రాముడు కథ మొదలైనవి గజదొంగల శాఖకు చెందుతాయి. కుంటి పుల్లారెడ్డి కథ, ఎల్లమంద నాయుడి కథ, దొర్నిపాడు వెంకటరెడ్డి కథ, పరిగ రామకృష్ణారెడ్డి కథ మొదలైనవి గ్రామకక్ష్యలు - హత్యలు అనే శాఖకు చెందుతాయి. కండెపు సుబ్బయ్యగారి కథ కుటుంబ కలహాలు అనే శాఖకు చెందుతుంది. మందలోడు కథ లేచిపోవడం అనే విభాగానికి చెందుతుంది.

**కథాగేయ చక్రాలు** : పెద్ద కథాగేయాల లాంటి కథాగేయాలు కొన్ని ఈ కథాగేయ చక్రంలో ఒకదాని తరువాత ఒకటి చెప్పబడుతూ పెద్ద ఇతిహాసం లాగా ఉంటాయి. ఈ కథాగేయ చక్రాలను ఒక్కొక్కదాన్ని గాథాకారులు నెలల తరబడి పాడుతూ ఉంటారు. తెలుగు జానపద సాహిత్యంలో ఇప్పటికి లభించినంత వరకు కథాగేయ చక్రాలు అయిదు ఉన్నాయి. ఈ అయిదు అయిదు రకాలుగా ఉన్నాయి. వీటిలో మొదటిది మహాభారతం లాగా ఒక రాజవంశాన్ని ఆధారంగా చేసుకొని ఆ



వంశంలోని వీరుల గురించి, దాయాదుల పరస్పర కలహాల గురించి అనేక కథలను వివరిస్తుంది. దీనికి ఉదాహరణ పల్నాటి వీరకథాచక్రం. ఈ కథాచక్రంలో క్రీ.శ. 12వ శతాబ్దంలో పల్నాడును పాలించిన హైహయ వంశపు రాజుల గురించి వివరిం పబడింది. ఇందులో మొత్తం ఇరవై అయిదు కథలున్నాయి.[32]

రెండవ దానిలో పెద్ద కథాగేయాలలాంటి కథలు కొన్ని ఒక ప్రముఖ వీరుని చుట్టు అల్లబడి అతణ్ణి గురించి, అతని బంధువులను గురించి చాల కథలను వరుసగా వర్ణిస్తూ ఉంటాయి. దీనికి ఉదాహరణ కాటమరాజు కథాచక్రం. ఈ కథాచక్రంలో కథా నాయకుడైన కాటమరాజును గురించి, అతని పెదతండ్రి, పినతండ్రుల గురించి, వారి కుమారులు, కుమార్తెలు, అల్లుళ్ల గురించి మొత్తం మూడు తరాల వారికి సంబంధించిన అనేక కథలు వివరింపబడ్డాయి. ఈ కథాగేయ చక్రంలో మొత్తం ముప్పై రెండు కథలున్నాయి.[33]

మూడవదానిలో కొన్ని పెద్ద కథాగేయాలు ఒక మహిమగల స్త్రీ చుట్టు అల్లబడి ఆమెను గురించి, ఆమె తల్లిదండ్రులను గురించి, ఆమె సంతానాన్ని గురించి చెప్పబడుతూ ఉంటాయి. దీనికి ఉదాహరణ ఎల్లమ్మ కథాచక్రం. ఇందులో తొమ్మిది కథలున్నాయి.[34]

నాల్గవదానిలో ఒక దేవతను గురించి, ఆ దేవతను కొలిచిన రాజవంశం వారిని గురించి కొన్ని పెద్ద కథాగేయాల్లో వివరింపబడుతూ ఉంటుంది. దీనికి ఉదాహరణ అంకమ్మ కథాచక్రం. ఇందులో మూడు కథలున్నాయి[35].

ఐదవ దానిలో దుష్ట శిక్షణ శిష్ట రక్షణ కోసం ఒక దైవం ఎత్తిన అవతారా లను గురించి వరుసగా అనేక పెద్ద కథాగేయాల్లో చెప్పబడుతూ ఉంటుంది. దీనికి ఉదాహరణ దశావతార కథాచక్రం. ఇందులో మొత్తం 10 కథలున్నాయి.

పైన చెప్పిన ఐదు కథాగేయ చక్రాల్లో పల్నాటి కథాచక్రం, కాటమరాజు కథాచక్రం, ఎల్లమ్మ కథాచక్రం, అంకమ్మ కథాచక్రం అనే నాలుగింటిని గురించి తంగిరాల వేంకట సుబ్బారావుగారు విశేషమైన పరిశోధన చేసి ఎన్నో అమూల్యమైన విషయాలను వివరించారు. దశావతార కథాచక్రం గురించి తంగిరాలవారు ప్రస్తావించ లేదు. ఈదశావతార కథలను గుర్తించి వాటిని మొదటి సారిగా వెలుగులోకి తెచ్చింది నేనే. ఉత్తరాంధ్ర జిల్లాల్లో సేవగరిడి అనే కళాప్రదర్శన సందర్భంగా యాదవులు దశావతార కథలను పాడుతారు. ఈదశావతార కథాచక్రంలో శ్రీ మహావిష్ణువు ఎత్తిన విష్ణువవతారం, మత్స్యావతారం, కూర్మావతారం, కొమ్మల వరాహావతారం, నరసింహావతారం, వామనావతారం లేక బలుడవతారం, పరుశు రామావతారం,

రామావతారం, వరాహావతారం, కృష్ణావతారం అనే పది అవతారాల గురించి పది కథాగేయాల్లో వివరింపబడింది.

ఇతివృత్తాన్నిబట్టి కథాగేయ చక్రాలను చారిత్రకాలు, జానపదాలు, పౌరాణికాలు అనే మూడు అంతశ్శాఖలుగా విభజించవచ్చు. పల్నాటి కథాచక్రం, కాటమ రాజు కథా చక్రం అనేవి రెండు చారిత్రక శాఖకు చెందుతాయి. ఎల్లమ్మ కథాచక్రం, అంకమ్మ కథాచక్రం అనే రెండు శక్తి కథలని పౌరాణిక శాఖకు చెందుతాయని తంగిరాలవారు చెప్పారు. ఎల్లమ్మ కథల్లో రేణుక, జమదగ్ని, పరుశురాముడు అనే పేర్లు తప్ప మిగిలిన కథాభాగమంతా అద్భుత కల్పనలతో నిండి వుంది. ఇందులో ఎల్లమ్మ అనే నామాంతరమున్న రేణుక ఒక దుష్టశక్తిగా, తన కడుపున పుట్టిన పిల్లలకు పరమ శత్రువుగా చిత్రింపబడింది. అంకమ్మ కథల్లో గూడా అనేక అద్భుత కల్పనలున్నాయి. కాబట్టి ఇవి రెండు అద్భుతరస శాఖకు చెందుతాయని చెప్పవచ్చు. దశావతార కథా చక్రం పౌరాణిక శాఖకు చెందుతుంది.

ఈ విధంగా తెలుగు జానపద సాహిత్యంలో చాల రకాలైన కథాగేయాలున్నాయి.

పైన చెప్పిన కథాగేయాల్లో పెద్ద కథాగేయాలు, కథాగేయ చక్రాలు వివిధ కథాఖ్యానాత్మక కళల ప్రదర్శన సందర్భంగా ఆయా కళాకారులు గానం చేస్తారు. ఈ కళల్లో ముఖ్యమైనది కథను చెప్పడం, కాబట్టి ఈ కళల్లో ప్రధాన కథకుడు ముఖ్యమైన పాత్రను పోషిస్తాడు. ఇతనికి ఇరువైపులా ఇద్దరు వంతలుంటారు. ఈ వంతలు ప్రధాన కథకునికి సహాయకులు మాత్రమే. ప్రధానమైన పాత్ర ప్రధాన కథకునిదే.

కళాప్రదర్శన విజయవంతం కావడం ఈ ప్రధాన కథకుని సామర్థ్యం పైనే ఆధారపడి వుంటుంది. ఇతడు మంచి కంఠం కలిగి రాగయుక్తంగా కథను గానం చేయగలిగినవాడై ఉండాలి. కథను తడుముకోకుండా ధారాళంగా చెప్పగలిగి వుండాలి. మంచి వాక్చమత్కారం కలిగి వుండాలి. గొంతులో ఉదాత్త, అనుదాత్తాలు, మధ్యమధ్యలో విరామాలు పాటించాలి. చమత్కారవంతమైన సంభాషణ, హాస్యప్రియత్వం కలిగి వుండాలి. శ్రోతలకు విసుగు కలగకుండా ఆసక్తి కలిగించేలా కథను చెప్పగలిగి వుండాలి. మధ్యమధ్యలో చిత్రమైన ప్రశ్నలు హాస్య సంభాషణలు చేస్తూ వుండాలి. చిత్రమైన ప్రశ్నలను ప్రేక్షకులకు వేసి వారి నుంచి సమాధానాలు రాబట్టి కథాకథనంలో ప్రేక్షకులను భాగస్వామ్యులుగా చేయాలి.

ఇలా ప్రేక్షకులను ఆకట్టుకోవడానికి పొడుపు కథల వంటివి బాగా ఉపయోగపడతాయి. ప్రేక్షకులు కూడా విసుగు లేకుండా కథను వింటారు. మధ్య మధ్యలో



హాస్యంతో కూడిన పిట్టకథలను చెబుతూ వుంటే ప్రేక్షకులు మనసారా నవ్వుకుంటూ కథాగానం మీద దృష్టిని కేంద్రీకరిస్తారు. అంతేకాకుండా ప్రధాన కథకుడు నవరసాలను తన గొంతులో పలికించగల సామర్థ్యాన్ని కలిగి వుండాలి. కరుణరసాత్మక సన్నివేశాలను చెప్పేటప్పుడు ప్రేక్షకుల చేత కంట తడి పెట్టించ గలగాలి. అలాగే శృంగారం, హాస్యం, రౌద్రం, వీరం, భయానకం, భీభత్సం, అద్భుతం, శాంతం మొదలైన రసాలకు సంబంధించిన కథను చెప్పేటప్పుడు ప్రేక్షకునికి ఆయా రసాలను అనుభవానికి వచ్చేలా కథను చెప్పగలగాలి. అంతేగాకుండా కథలో వచ్చే అన్ని పాత్రలకూ తగినట్లుగా హావభావాలను ప్రదర్శించే నేర్పరితనాన్ని కలిగి వుండాలి. ముఖ్యంగా స్త్రీ పాత్రలు వచ్చినప్పుడు స్త్రీల మాదిరిగా మాట్లాడడం, అభినయం చేయడం, నడవడం మొదలైనవి చేస్తే ప్రేక్షకులు ఎంతో ఆసక్తికరంగా తిలకిస్తారు. ఇతనికి ఇరుపక్కలా వున్న వంతలు ఇలాంటి సందర్భంలో సహాయపడుతుంటారు. కథలో రెండు మూడు పాత్రల మధ్య సంభాషణ వచ్చినప్పుడు ప్రధాన కథకుడు, వంతలు ఒక్కొక్కరు ఒక్కో పాత్రలో ప్రవేశించి భావయుక్తంగా మాట్లాడుతూ ప్రేక్షకులకు నాటకం చూస్తున్న అనుభూతిని కలిగించాలి. అలాగే ప్రధాన కథకుని చేతిలో కర్ర, జేబు రుమాలు లాంటి గుడ్డ మొదలైన వస్తువులు వుంటాయి. ఈ వస్తువులు కథను చెప్పేటప్పుడు అవసరాన్నిబట్టి కత్తిగాను, డాలుగాను మిగిలిన అనేక పరికరాలు గాను ఉపయోగపడుతూ వుంటాయి.

ప్రధాన కథకునిలో వుండవలసిన మరొక లక్షణం ఏమంటే అతడు కథమీద పూర్తి పట్టును కలిగి వుండాలి. అంటే కథకుడు అవసరాన్నిబట్టి కథను క్లుప్తీకరించటం, పెంచటం చేయగలిగి వుండాలి. రెండు మూడు రాత్రులలో చెప్పే కథను అవసరమైతే ఒకే రాత్రి చెప్పగలిగి వుండాలి. అలాగే ఒకరాత్రి చెప్పే కథను రెండు మూడు రాత్రులలో విస్తృతపరచి చెప్పగలిగి వుండాలి. ఇలా చేసేటప్పుడు మూల కథకు పాత్రచిత్రణకూ భంగం వాటిల్లకుండా చూసుకోవాలి. కథను పెంచేటప్పుడు వర్ణనలు, వ్యాఖ్యానాలు, హాస్య సంభాషణలు, పిట్టకథలు, వంతలతో సరససంభాషణలు చేయడం పొడుపు కథల వంటి చిత్రమైన ప్రశ్నలను ప్రేక్షకులకు వేసి వారి నుండి సమాధానాలు రాబట్టడం మొదలైనవి బాగా పనికొస్తాయి. ప్రధాన కథకుడు సమయ సందర్భాలనుబట్టి కవి, గాయకుడు, నటుడు, విమర్శకుడు, వ్యాఖ్యాత మొదలైన బహుపాత్రలను ధరిస్తూ కనిపించాలి. ఇతడు గేయ భాగాలను పాడి అవి ప్రేక్షకులకు మరింత బాగా అర్థం కావడానికి వాటిని వచనంలో వ్యాఖ్యానాత్మకంగా వివరించ గలగాలి. కథలో వచ్చే పాత్రల మధ్య సంభాషణలను అవసరమైతే వివిధ పాత్రలు

తానే అయి సంభాషిస్తూ కథ అక్కడే జరుగుతున్నట్లుగా శ్రోతలు భావించే విధంగా నటనా కౌశలాన్ని కలిగి వుండాలి. పాత్రల చర్యలను అనుకరించి చూపించాలి. ఈ విధంగా కథాఖ్యానాత్మక జానపద కళ విజయవంతంగా ప్రదర్శించడానికి ప్రధాన కథకుడు ముఖ్య పాత్ర పోషించవలసి వుంటుంది. ఇతనికి సహాయంగా వంతలు, వాద్య పరికరాలను వాయించే వారు కథను రక్తి కట్టించే ప్రయత్నం చేస్తారు.

## పాదసూచికలు

1. జానపద సరస్వతి, వార్షిక పరిశోధన పత్రిక, జానపద నిర్వచనం, వ్యాస రచయిత పి. సుబ్బాచారి, పుట:35
2. The Study of Folklore, Alan Dundes, p.2.
3. తెలుగు జానపద గేయ సాహిత్యం, బి. రామరాజు, పుటలు 12-13.
4. సాహిత్య శిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం - పుట 80
5. సాహిత్య శిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం - పుట 80
6. మహాభారతం - ఆదిపర్వం, అష్టమాశ్వాసం, 174 వ పద్యం.
7. మహాభారతం - ఆదిపర్వం, అష్టమాశ్వాసం, 175 వ పద్యం.
8. కుమార సంభవం - 6-45వ పద్యం.
9. పండితారాధ్య చరిత్ర - పుట 179.
10. పండితారాధ్య చరిత్ర - పుటలు 434-436.
11. పండితారాధ్య చరిత్ర - పుటలు 441-442.
12. బసవ పురాణం - ప్రథమ భాగం, పుటలు 38,39.
13. ఆంధ్ర మహాభారతం - విరాటపర్వం - 1-241.
14. ఉత్తర హరివంశం - 4-216.
15. ఉత్తర హరివంశం - 4-256.
16. భీమేశ్వర పురాణం - 1-118.
17. పల్నాటి వీరచరిత్ర - పుటలు 15,16.
18. పల్నాటి వీరచరిత్ర - శ్రీనాథుడు - పుట 34.



19. క్రీడాభిరామం - 143వ పద్యం.
20. క్రీడాభిరామం - 143వ పద్యం.
21. క్రీడాభిరామం - 142వ పద్యం.
22. The Ballad of Tradition, P.3.
23. ThePopular Ballad, P.2.
24. కాటమరాజు కథలుఇ మొదటి భాగం, డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట x
25. సింహాచలం దేవళం, కట్టుబడి కథాగేయం, డా॥ యం. జయదేవ్, పుట 2.
26. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxxiv
27. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxxiii
28. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxxxiv
29. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxxxiii
30. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxix
31. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxix
32. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxxxxi
33. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxiiixxxiii
34. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxiii
35. కాటమరాజు కథలు, మొదటి భాగం - డా॥ తంగిరాల వేంకట సుబ్బారావు, పుట xxxiii

# ఆంధ్రప్రదేశ్ యాదవులు- స్థితిగతులు

భారతదేశమంతటా వ్యాపించి ఉన్న కొద్ది కులాల్లో యాదవ కులం ఒకటి. వీరు దేశవ్యాస్తంగా చెప్పుకోదగినంత సంఖ్యలో జనాభా ఉన్నారు. దేశంలో ముస్లిం జనాభాతో సమానంగా యాదవకుల జనాభా ఉంది. భారతదేశంలో అత్యధిక సంఖ్యలో జనాభా కలిగిన ఏకైక కులం యాదవ కులం. వీరిలో ఎక్కువమంది రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా ఎంతో వెనుకబడి ఉన్నారు. ఇప్పటికీ దేశవ్యాప్తంగా యాదవ కులస్థులు తమ కులవృత్తులకే పరిమితమయ్యారు.

పురాణాల ప్రకారం యాదవ వంశం చాలా ప్రాచీనమైంది. ఈ వంశానికి మూల పురుషుడు 'యదువు'. ఇతడు శుక్రాచార్యుని కూతురైన 'దేవయాని' యయాతి మహారాజుల పెద్దకుమారుడు. యదువు పేరుతోనే ఈ వంశానికి యాదవ వంశం అనే పేరువచ్చింది. యదువు తర్వాత యాభైతరాలకు ఈ వంశంలో శ్రీకృష్ణుడు జన్మించాడు. శ్రీకృష్ణుడు జన్మించడం వల్ల యాదవవంశం జగత్రసిద్ధమూ, చరితార్థమూ అయింది. భారతీయ సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతనకు తలమానికమని చెప్పదగిన భగవద్గీతను మహాభారత గ్రంథకర్త శ్రీకృష్ణుని చేత చెప్పించాడు. మహాభారతం, భాగవతం, హరివంశం, విష్ణుపురాణం, బ్రహ్మాండపురాణం, గర్గసంహిత మొదలైన ప్రాచీన గ్రంథాలు పౌరాణికంగా యాదవుల గొప్పతనాన్ని వారి వైభవాన్ని చెబుతున్నాయి. పూర్వం యాదవుల్లో వృష్ణి, భోజ, కుకుర, అంధక, దాశార్హ, శూరసేన, చ్యవన మొదలైన తెగలు ఉండేవి. ఇవన్నీ యాదవ వంశంలోని అనేక శాఖలు. వీటిలో వృష్ణి తెగకు వృష్ణి, భోజ తెగకు భోజుడు, కుకుర తెగకు కుకురుడు, అంధక తెగకు అంధకుడు, దాశార్హ తెగకు దాశార్హుడు, శూరసేన తెగకు, శూరసేనుడు, చ్యవన తెగకు చ్యవనుడు అనే రాజులు మూలపురుషులు. ఈ మూలపురుషుల పేర్లతోనే ఆయాతెగలు ప్రసిద్ధమయ్యాయి. శ్రీకృష్ణుడు అంధక తెగకు చెందినవాడు. వీరిలో అంధకుని వారసులైన అంధకులు త్రైలింగ ప్రాంతాన్ని పాలించారనీ, అందువల్లనే త్రైలింగ ప్రాంతం అంధక ప్రాంతమైందనీ, తర్వాత కాలంలో అంధక ప్రాంతం 'ఆంధ్ర' అయిందని కొంతమంది పరిశోధకులు చెబుతున్నారు. అంతేగాకుండా శ్రీకృష్ణుడు అంధక తెగకు చెందినవాడు కావడంవల్ల అతడు అసలు సిసలైన ఆంధ్రుడని కూడా కొంతమంది పరిశోధకులు చెబుతున్నారు".[1]

చారిత్రకంగా చూస్తే యాదవులకు గొప్ప చరిత్ర ఉంది. ఉత్తర, దక్షిణ భారతదేశంలో యాదవ వంశానికి చెందిన అనేక రాజులు రాజ్యాలను పరిపాలించారు.



దక్షిణాదిలో రాష్ట్ర కూటులు, హొయసాలులు, దేవగిరి సేవుణలు (దేవగిరి యాదవులు) మైసూరు ఒడయార్లు తాము యాదవ వంశానికి చెందిన వారమని తమ శాసనాల్లో చెప్పుకున్నారు. విజయనగర సామ్రాజ్యస్థాపకులైన హరిహరరాయలు, బుక్కరాయలు కూడా యాదవులే. వీరు మొత్తం ఐదుగురు సోదరులు. వీరిద్దరితోపాటు కంపన, మారప, ముద్దప అనే ముగ్గురు కలసి మొత్తం ఐదుగురు సోదరులు. వీరి తండ్రి సంగముడు. ఈసంగముడు గొల్లలలో ఒక శాఖ అయిన 'కురువగొల్ల' శాఖకు చెందినవాడు.

విజయనగర రాజ్యాన్ని పాలించిన తుళువ వంశం వారు యాదవులు అని చెప్పడానికి సాహిత్యాధారం ఉంది. శాసనాధారం లేదు. శాసనాధారం లేని చోట సాహిత్య గ్రంథంలో చెప్పినదాన్ని ఆధారంగా స్వీకరించవచ్చు. విజయనగర రాజుల్లోనే గాకుండా దక్షిణ భారతదేశంలోనే గొప్ప చక్రవర్తిగా పేరు పొందిన శ్రీకృష్ణదేవరాయలు తుళువ వంశీయుడు. ఇతని ఆస్థానంలో అష్టదిగ్గజాలు అనే కవులు ఉండేవారు. వీరిలో ఒకడైన నందితిమ్మన తాను రాసిన పారిజాతాపహరణ కావ్యంలో కృతిభర్త అయిన కృష్ణదేవరాయల గురించి ఇలా రాశాడు.

సీ॥ "చక్రవర్తి మహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమ స్థితి ఘటించె
భూభృదుద్ధరణ విస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణ ఖ్యాతిఁ గుదురు పఱిచె
సాధు బృందావన సరణి నాఁడును నేఁడు
వంశాను రాగంబు వదలఁడయ్యె
సత్యభామా భోగసక్తి నాఁడును నేఁడు
నా కల్ప మవని నింపార నిలిపె
తే॥ నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను వసుదేవ మనుజ విభుని
కృష్ణుఁడను పేర నరసేంద్రు కృష్ణదేవ
రాయఁడను పేర నాదినారాయణుండు"

(పారిజాతాపహరణం - పీఠిక - 19వ పద్యం)

పై పద్యంలో కృష్ణుని పరంగా ఒక అర్థం. కృష్ణదేవరాయలపరంగా ఇంకొక అర్థం చెప్పబడింది. విష్ణువు ద్వాపరయుగంలో యాదవవంశంలో వసుదేవుని కుమారుడైన కృష్ణుడుగా జన్మించి చక్రాన్ని ధరించీ ధర్మరాజుకు న్యాయాన్ని చేకూర్చాడు. కలియుగంలో

ఇప్పుడు నరసరాజు కుమారుడైన శ్రీకృష్ణదేవరాయలుగా యాదవ వంశంలో జన్మించి చక్రవర్తి అనే ప్రసిద్ధిని పొంది ధర్మాన్ని సరిగా పాదుకొల్పాడు. చక్రవర్తిత్వం, ధర్మ క్రమస్థితి సంఘటనం - రెండూ రెండు జన్మల్లోనూ ఉన్న సమాన ధర్మాలు. కృష్ణావతారంలో గోవర్ధనగిరి పర్వతాన్ని ఎత్తి గోవులను రక్షించాడు. కృష్ణరాయావతారంలో శత్రు భూపాలురను చంపి భూమిని బాగా పాలించాడు. భూభృదుద్ధరణ, గోరక్షణ అనేవి రెండూ, రెండు అవతారాల్లోనూ ఉన్న సమానాంశాలు. కృష్ణావతారంలో రమ్యమైన బృందావనంలో మురళి మీద ఎక్కువ అనురాగాన్ని కలిగి ఉన్నాడు. కృష్ణరాయావతారంలో సత్సమూహంలోనూ, తన వంశంవారి యందునూ అధికమైన ఆదరాన్ని కలిగి ఉన్నాడు. సాధు బృందావన, వంశానురాగాలు రెండు అవతారాల్లోనూ సమానం. కృష్ణావతరాంలో సత్యభామ భోగంనందున్న ప్రీతిచేత పారిజాతవృక్షాన్ని భూమికి తీసుకొని వచ్చాడు. కృష్ణరాయావతారంలో సత్యం విషయంలోనూ, నిజ భార్యలయందు ఉన్న ప్రేమతో భూమిని ఆకల్పాంతం నిలిపాడు. సత్యభామా భోగసక్తి, ఆకల్పస్థాపనం రెండూ, రెండు అవతారాల్లోనూ సమానం.

పై పద్యంలో విష్ణువు యాదవ వంశంలో నాడు అంటే ద్వాపర యుగంలో వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణునిగా, నేడు అంటే కలియుగంలో నరసరాయల కుమారుడైన శ్రీకృష్ణదేవరాయలుగా జన్మించినట్లుగా నందితిమ్మన చెప్పాడు. నంది తిమ్మన రాయల కాలం నాటివాడు. రాయలకు తన గ్రంథాన్ని అంకితం ఇచ్చినవాడు. అలాంటి నంది తిమ్మన రాయల కులాన్ని గురించి అబద్ధం చెప్పే అవకాశం లేదు. అందువల్ల తిమ్మన చెప్పిన పై పద్యాన్నిబట్టి విజయనగరాన్ని పాలించిన తుళువ వంశస్థులు కూడా యాదవులని చెప్పవచ్చు.

తెలుగు భాషా పరిరక్షణకు కంకణం కట్టుకొన్న తెలుగుభాషా ఉద్యమకారుడు, తెలుగువాణి సంస్థ స్థాపకుడు అయిన స. వెం. రమేశ్ గారు " నడుస్తున్న చరిత్ర " మాసపత్రిక ఏప్రిల్ 2009 సంచికలో శ్రీకృష్ణదేవరాయలు తెలుగువాడని, అతని ఇంటిపేరు సంపెట అని, అతని కులం తుళువగొల్ల అని, ఈకులస్తులు కర్నాటక, తమిళనాడు ప్రాంతాల్లో ఇప్పటికీ కొన్ని లక్షలమంది ఉన్నారనీ, వీరందరూ కృష్ణదేవ రాయలు తమ కులస్తుడని చెప్పుకుంటారని రాశారు. దీన్ని బట్టి కూడా కృష్ణదేవ రాయలు యాదవకులానికి చెందినవాడని చెప్పవచ్చు.

పైన చెప్పినవారే కాకుండా దేవగిరి యాదవ రాజులకు సమకాలికంగా ఆంధ్రదేశంలో కొన్ని యాదవ వంశాలు చిన్నచిన్న రాజ్యాలు స్థాపించుకొని తెలుగు చోళులకు, కాకతీయులకు సామంతులుగా పాలించారు. అట్టి యాదవ రాజ్యాలలో



అద్దంకి, అలవలపాడు, యర్రగడ్డపాడు, పానుగల్లు రాజ్యాలుముఖ్యమైనవి".[2]

**అద్దంకి యాదవ వంశం క్రీ.శ. 1150 - 1280 :** అద్దంకిని పాలించిన యాదవ రాజులు 'చక్రనారాయణ' బిరుదాంకితులు. ఈ బిరుదు పేరుతోనే వీరు చక్రనారాయణ యాదవ వంశంగా పిలువబడ్డారు. అద్దంకిని రాజధానిగా చేసుకొనివీరు క్రీ.శ. 1150 నుంచి 1280 వరకు కాకతీయుల సామంతులుగా పాలించారు.

ఈ వంశం వారి శాసనాల్లో వీరి వంశోత్పత్తిని గురించిన వివరాలు లేవు. తెలుగు చోళ శాసనాలు వీరిని మహారాష్ట్రులుగా చెబుతున్నాయి. వీరు సేణువ దేశస్థు లని, దేవగిరి యాదవ వంశానికి సంబంధించిన వారని కొందరు భావిస్తున్నారు. వీరి రాజ్యానికి ఒకవైపు వెలనాటి చోడరాజ్యం, నెల్లూరు తెలుగుచోళులు, యర్రగడ్డపాడు యాదవ రాజ్యం, ఇంకొక వైపు పానుగల్లు యాదవ రాజ్యం సరిహద్దులుగా ఉండేవి.[3]

ఈ వంశంలో మొదటిసారంగధరుడు (క్రీ.శ. 1150-1208), మాధవ దేవుడు (క్రీ.శ. 1208-1247), సింగల దేవుడు (క్రీ.శ. 1247-1253), రెండవ సారంగధరుడు (క్రీ.శ. 1253-1267), రెండవ సింగదేవుడు (క్రీ.శ. 1268-1272), రెండవ మాధవదేవుడు (క్రీ.శ. 1272-1280) అనే ఆరుగురు రాజులు ఉన్నారు.

**మొదటి సారంగధరుడు :** ఇతడు చక్రనారాయణ యాదవ వంశంలో మొదటి రాజు. ఇతని శాసనాలు లభించడం లేదు. ఇతణ్ణి గురించి ఇతని మనుమడైన రెండవ సారంగ ధరుడు తన శాసనాల్లో ఇతణ్ణి తాతగా పేర్కొన్నాడు. మొదటి సారంగధరుని కుమారుడు మాధవదేవుడు. ఇతడు క్రీ.శ. 1208 లో రాజ్యానికి వచ్చాడు. కాబట్టి మొదటి సారంగ ధరుడు 12వ శతాబ్దం మధ్యకాలంలో పాలించి ఉంటాడు.[4]

**మాధవదేవుడు :** ఇతడు మొదటి సారంగధరుని కుమారుడు. ఇతడు క్రీ.శ. 1208 లో రాజ్యానికి వచ్చాడు. ఈ వంశంలో శాసనాలు విడుదల చేసిన వారిలో ఇతడు మొదటి వాడు. మణికేశవరం శాసనం ఇతని మొదటి శాసనం. మణికేశవరం ఒంగోలు తాలూకాలో ఉన్న గ్రామం. ఈ శాసనంలో ఇతడు మధుకేశ్వరస్వామికి గుండ్లకమ్మకు పడమటి దిక్కున ఉన్న కొటకలపూడి గ్రామంలోని కొంత భూమిని దానంగా ఇచ్చిన ట్లుగా చెప్పబడింది. క్రీ.శ. 1239వ సంవత్సరం నాటి నాగులుప్పలపాడు శాసనంలో ఇతడు కాకతిగణదేవుని తన సార్వభౌముడుగాపేర్కొన్నాడు.

**సింగలదేవుడు :** మాధవదేవునికి సింగల, సారంగపాణి, గోపాలదేవుడు అనే ముగ్గురు కుమారులు ఉన్నారు. వీరిలో సింగలదేవుడు తండ్రి తర్వాత 1247లో రాజ్యానికి వచ్చాడు. ఎందులూరి శాసనం ఇతని మొదటి శాసనం. ఇది ఒంగోలు తాలూకాలో ఉన్న గ్రామం. ఈ శాసనం క్రీ.శ. 1248వ సంవత్సరం నాటిది. ఇదే

సంవత్సరంలో వేయబడిన చేజర్ల శాసనం, 1250వ సంవత్సరంలో వేయబడిన ఒంగోలు శాసనాల్లో సింగల దేవుడు పేర్కొనబడ్డాడు. ఈ రెండు శాసనాలను ఇతని మంత్రులు వేయించారు. ఇతడు నిశ్శంకమల్ల, మహామండలేశ్వర చక్రనారాయణ, అద్దంకి సింగలదేవ అని శాసనాల్లో పేర్కొనబడ్డాడు.

**రెండవ సాతంగధరుడు :** సింగలదేవుని తర్వాత అతని తమ్ముడు సారంగధరుడు 1253లో రాజ్యానికి వచ్చాడు.ఇతడు శాసనాల్లో సారంగపాణి దేవరసు, సారంగపాణి దేవరాజులు, సారంగధర అనే పేర్లతో పేర్కొనబడ్డాడు. ఇతని మొదటి శాసనం వాగులుప్పలపాడు శాసనం. ఇది క్రీ.శ. 1253వ సంవత్సరం నాటిది. ఇతడు వేయించిన 1256వ సంవత్సరం నాటి, ఎండ్లూరు శాసనంలో ఇతడు తన రాజైన కాకతి గణపతి దేవునికి ఆయురారోగ్యాలు కలగాలని కోరాడు. అద్దంకిని పాలించిన యాదవ రాజుల్లో ఇతడు ప్రసిద్ధుడు.

**రెండవ సింగదేవుడు :** ఇతడు మొదటి సింగలదేవుని కుమారుడు. రెండవ సారంగ ధరుని తర్వాత క్రీ.శ. 1268లో ఇతడు రాజ్యానికి వచ్చి అయిదు సంవత్సరాలు పాలించాడు. ఇతడు శాసనాల్లో మహామండలేశ్వర, కాటరాయనంత సింగదేవ మహారాజు అని పేర్కొనబడ్డాడు.

**రెండవ మాధవుడు :** ఇతడు రెండవ సారంగధరుని కుమారుడు. రెండవ సింగదేవుని తర్వాత 1272 రాజ్యానికి వచ్చాడు. ఇతని కాలం నాటి మొదటి శాసనం తుమ్మలూరు శాసనం.ఇది 1272వ సంవత్సరం నాటిది. క్రీ.శ. 1273 నాటి ఒంగోలు శాసనంలో ఇతడు మాధవదేవ మహారాజుగా పేర్కొనబడ్డాడు. "ఇతని రాజధాని ఒంగోలు గానీ, తుమ్మలూరు గానీ అయిఉండవచ్చు. అద్దంకిని ఇతని బాబాయి గోపాలదేవుడు పాలిస్తున్నట్లు అతని కుమార్తె శాసనం తెలుపుతూ వుంది".[5]

**అలవులపాడు యాదవ వంశం :** నెల్లూరు చోళ రాజ్యానికి పక్కనే అలవులపాడును ఇంకొక యాదవ వంశం పాలించింది. వీరిని గురించి 1259 నాటి గుండ్లపాలెం శాసనం తెలుపుతూ ఉంది. "వల్లురాజు అలవులపాడు రాజ్యానికి రాజు అని గుండ్ల పాలెం శాసనంలో చెప్పబడింది. చోళుల కాలంలో సింహాద్రిరాజు వల్లురాజులు ఒక శాసనంలో పేర్కొనబడ్డారు. సింహాద్రి రాజు వల్లురాజు తండ్రి అయివుండవచ్చు. వల్లు రాజు కుమారుడు అలప్రోల రాజు అయివుండవచ్చు. అతనికే ఎరపోలు అనే పేరుఉంది".[6] "ప్రతాపరుద్రుని కాలంలో అలప్రోల రాజు పెదయేర్వ, పినయేర్వ ప్రాంతాలను పాలిస్తున్నాడని ఇంకొకచోట ప్రస్తావింప బడింది".[7] "అలప్రోలరాజు నెల్లూరు చోళరాజైన మూడవ మనమసిద్ధి సమకాలికుడు. ఇతని రాజ్యంలో క్రీ.శ.



1258వ సంవత్సరంలో వర్షాలు లేకపోవడం వల్ల కరువు ఏర్పడింది. నెల్లూరు రాజైన మూడవ మనుమసిద్ధితో పుల్లరి ఒప్పందం కుదుర్చుకొని నెల్లూరులోని పాకనాటి రాజ్యంలో పెన్నానది ఒడ్డున స్థావరం ఏర్పాటు చేసుకొని పశువులను మేపాడు".[8] కాని పుల్లరి చెల్లించలేదు. మూడవ మనుమసిద్ధి లేక నల్లసిద్ధి తన సైన్యాన్ని ఆలమంద మీదికిపంపిస్తాడు. అలప్రోలు పద్మనాయుడు అనే మరొక యాదవ నాయకుడు తమ ఆలమందను నెల్లూరు రాజ్యం దాటించి ఎర్రగడ్డపాడుకు చేర్చాడు. పుల్లరి చెల్లించమని నల్లసిద్ధి దూతను పంపాడు. యాదవులు తిరస్కరించడంతో నెల్లూరు చోళులకు అలవులపాడు యాదవులకు యుద్ధం జరిగింది. "ఈ యుద్ధం లింగాలకొండ, ఎర్రగడ్డపాడు వద్ద జరిగింది. అలప్రోలురాజు, పెద్దిరాజు, వారి కుమారులు సోమేశ్వరదేవుని సమక్షంలో సిద్ధిరాజుతో యుద్ధం చేసినట్లుగా గుండ్లపాలెం శాసనం తెల్పుతూ వుంది"[9]. "ఈ శాసనంలోని సిద్ధిరాజు మూడవ మనుమసిద్ధి 1248-1267. ఇతడు కాకతి గణపతి సమకాలికుడైన మూడవ మనుమసిద్ధి అని తేల్చబడింది. ఎర్రగడ్డపాడు నేటి ప్రకాశంజిల్లాలోని గ్రామంగా గుర్తించారు. సోమేశ్వరగుడి కనిగిరి తాలూకాలోని అలవులపాడు వద్ద ఉన్న పోలేరమ్మ గుడిగా గుర్తించారు".[10] "వల్లురాజుకు సింహాద్రిరాజు, పెద్దిరాజు ఎర్రమరాజు, నల్లనూకరాజు, పోలరాజు అనే ఐదుగురు కుమారులున్నారు. వీరిలో చివరివాడైన పోలరాజే అలప్రోలరాజు. అతడే ఈ యుద్ధానికి కారకుడు. పెద్దిరాజుకు కాటమరాజు అనే కుమారుడున్నాడు. వీరందరూ లింగాల కొండ ఎర్రగడ్డపాడు యుద్ధంలో పాల్గొన్నారు. వీరందరినీ మనుమసిద్ధి ఓడించాడు".[11]

**ఎర్రగడ్డపాడు యాదవ వంశం :** "ఇదే కాలంలో ఎర్రగడ్డపాడును యాదవ క్షత్రియ వంశానికి చెందిన కాటమరాజు అనే అతను 32 సంవత్సరాలు పాలించాడు".[12] అలవులపాడు యాదవ వంశంలోని పెద్దిరాజు కుమారుడైన కాటమరాజు ఇతడేనని కొందరి అభిప్రాయం. ఇతడు ప్రతాప రుద్రుని సామంతుడని గుండ్లపాలెం శాసనం తెలుపుతూ ఉంది. అయితే ఇతడు కాకతి గణపతిదేవునికి సమకాలికుడు. "పుల్లరి విషయమై ఇతనికి నెల్లూరు మూడవ మనుమసిద్ధికి యుద్ధం జరిగింది. ఈ యుద్ధం క్రీ.శ. 1263 లో జరిగిందని చరిత్రకారులు నిర్ణయించారు. సీవెల్ కాటమరాజును అమరావతి పాలకుడుగా భావించాడు. కాని అతని వాదం తిరస్కరింపబడింది".[13] ఈ యుద్ధం కాకతి గణపతి దేవుని కాలంలో జరిగిందని, అలవులపాటి యాదవులు, ఎర్రగడ్డపాటి కాటమరాజు కలిసి మనుమసిద్ధిని ఎదిరించారని, వీరికి కాకతీయులు సహాయం చేసినట్లుగా కనిపిస్తూ వుందని మరికొందరు భావించారు.[14]

"చరిత్రకారుల ప్రకారం ఈ యుద్ధంలో మనుమసిద్ధి మరణించలేదు. ఇతని శాసనాలు ఇతడు క్రీ.శ. 1267 వరకు జీవించి ఉన్నట్లుగా తెలుపుతూ ఉన్నాయి. కాటమరాజు చనిపోయినది లేనిది స్పష్టంగా తెలియదు".[15]

**పానగల్లు యాదవ వంశం :** ఒక యాదవవంశం కాకతీయుల సామంతులుగా నల్గొండ జిల్లాలోని పానగల్లును రాజధానిగా చేసుకొని పాలించింది. దేవగిరి యాదవరాజుల్లో సింగణకు జైతుగి, సారంగపాణి అనే ఇద్దరు కుమారులున్నారు. జైతుగి కుమారులు దేవగిరి రాజ్యానికివారసులయ్యారు. సారంగపాణి దేవగిరిని వదిలిపెట్టి పానగల్లుకు వెళ్లి కాకతీయుల సామంతుడుగా ఒక చిన్న రాజ్యాన్ని స్థాపించుకొని పాలించాడు. అందువల్ల సారంగపాణి పానుగంటి యాదవ వంశానికి మూలపురుషుడు.

సారంగపాణి కాలం నాడు అతని రాజధాని పానగల్లులో 1267వ సంవత్సరంలో ఒక శాసనం వేయబడింది. ఇందులో సారంగపాణి వంశవృక్షం సింగణ నుంచి సారంగపాణి వరకు ఇవ్వబడింది. కాకతి రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు ఇతని సమకాలికులు. ఇతడు కాకతీయులతో కలిసి అనేక యుద్ధాలు చేసి గొప్ప బిరుదులు ధరించాడు. పృథ్వీవల్లభ, సమస్తభువనాశ్రయ, మహారాజాధి రాజపరమేశ్వర, పరమ భట్టారక అప్రతిహమల్ల అహితరాయ, రహసర మొదలైన చాల బిరుదులను ధరించాడు. ఇతడు విరాటరాజైన కొక్కిలి దేవుడు. కిమిడిరాజు జాజల్ల దేవుడు, ఘూర్జర రాజు భోజుడు, మాళవరాజు లక్ష్మీదేవులను ఓడించినట్లుగా పానగల్లు శాసనంలో ఉంది. ఈ విజయాలన్నీ ఇతని తండ్రి దేవగిరి యాదవరాజు సింగన సాధించినట్లు సింగన శాసనాల్లో ఉంది. సారంగపాణి తన తండ్రితో కలిసి పై యుద్ధాల్లో పాల్గొని ఉంటాడు. ఆ విజయాలను పానగల్లు శాసనంలో రాయించి ఉంటాడు. సారంగపాణి తర్వాత ఇతని వంశస్థులు పానగల్లును పాలించినట్లు ఎలాంటి దాఖలాలు లేవు. అందువల్ల పానగల్లు యాదవ రాజ్యం ఇతనితో ప్రారంభమై ఇతనితోనే అంతరించిపోయింది.

ఈ విధంగా ఆంధ్రదేశంలో కొందరు యాదవులు రాజ్యాలను పాలించినట్లుగా తెలుస్తూ ఉంది. తమిళదేశంలో బ్రిటిషువారిని గజగజలాడించిన వీరపాండ్య కట్టబొమ్మన గూడ యాదవుడే. అంతేగాదు ఇతడు తెలుగువాడు కూడా. ఇతని చరిత్రను "ఆంధ్రకీర్తి" మాసపత్రిక సంస్థాపకులు, సంపాదకులు అయిన ఆంధ్ర శేషగిరి రావు గారు 1981 అక్టోబరు, నవంబరు, డిశంబరు సంచికల్లో ధారావాహికగా ప్రచురించారు. ఇతని పూర్తి పేరు జగవీరపాండ్య కట్టబొమ్మ కరటయ్య నాయకుడు. ఇందులో కట్టబొమ్మ అనేది వీరి ఇంటిపేరు. వీరు మహావీరులు కావడం చేత జగవీర అని, పాండ్యదేశంలో ఉండడం చేత పాండ్య అని, ఈ రెండింటినీ కలిపి జగవీర



పాండ్య అనే బిరుదాన్ని వీరు ధరించారు. కరటయ్యనాయకుడు ఇతని పేరు. ఇతను పంచాలన్‌కుర్చి అనే సంస్థానానికి పాలకుడు. ఆనాడు ఇలాంటి పాలకులను పాలెగాళ్ళు అని పిలిచేవారు. వీరి పూర్వులు విజయనగర రాజుల కాలంలో ఆంధ్రదేశం నుంచి తమిళదేశానికి వలస వెళ్ళి విజయనగర రాజుల, మధుర నాయకరాజుల దగ్గర సైన్యాధిపతులుగా, సంస్థానాధీశులుగా ఉన్నారు. వీరిని తొట్టియన్‌లు అని, తొట్టియార్‌లు అని పిలిచేవారు. వీరిని గురించి స్టూవార్ట్ 1891 జనాభా నివేదికలో ఇలా రాశాడు.[16] " తొట్టియార్‌లు మధుర, తిరునల్వేలి, కోయంబత్తూరు సేలము మున్నగు జిల్లాలలో వలస నెలకొనిన తెలుగు కర్షకులు. మధుర మండలమునకు వారి రాకను తెలుపు ఐతిహ్యములు మెకంజీదొర సేకరించిన కైఫీయత్తులందు కలవు. తొట్టియారులనే కంబళత్తారులని కూడా అనెదరు. వారు కానుగ వృక్షమును పూజింతురు. తుంగభద్రా నదికి ఉత్తర ప్రాంతము నుండి తాము ఆదిలో వచ్చినట్లు వారు చెప్పుదురు. విజయనగర రాజుల, మధుర నాయక రాజుల సేవలో చేరి వారు ప్రతిష్ఠ గడించిరి".

పాలెగాండ్ర పద్ధతిని ఏర్పరచిన మధుర నాయక రాజ్యం అంతరించిన తర్వాత పాలెగాండ్రు ఉన్న తిరునల్వేలి ప్రాంతం కొంతకాలం కర్నాటక నవాబుల ఏలుబడి కింద సాగింది. నవాబు పాలెగాండ్రను కప్పం కట్టమని వత్తిడి చేయలేదు. 1781లో నవాబు ఆప్రాంతాన్ని ఈస్టిండియా కంపెనీ వారికి ఇచ్చాడు. కంపెనీ ఆప్రాంతంలో ఉన్న పాలెగాండ్రను పన్ను కట్టమని వత్తిడి చేసింది. ఐనప్పటికీ వారు పన్ను కట్టకుండా కాలయాపన చేయడం ప్రారంభించారు. 1797లో జాక్సన్ అనే అతను తిరునల్వేలి కలెక్టరుగా వచ్చాడు. ఇతని కాలం నాటికి పాలెగాండ్రు పన్ను కట్టకుండా కంపెనీ మీద తిరుగుబాటు చేయడానికి పూనుకున్నారు. వీరికి నాయకుడు కట్టబొమ్మన కరటయ్య నాయకుడు. నాగలాపురం, కోటార్పట్టి, కాడల్‌గుడి, మేల్ మాందయి, కులత్తూరు, ఈటయిరాంపన్నె మొదలైన పాలెగాండ్రు ఇతనికి అనుచరులుగా ఉన్నారు. వీరందరూ కంపెనీ తాఖీదులను లెక్కచేయలేదు. కూంబీ పాలెగాడు డబ్బుకు బదులుగా బస్తాలో గులకరాళ్ళు పోసి కంపెనీ వారికి పంపించాడు. ఇలా లాభం లేదని కలెక్టరు 1798 జూన్ మాసంలో కరటయ్య నాయకునికి పన్ను కట్టమని గట్టిగా కబురు చేశాడు. కరటయ్య దాన్ని పట్టించుకోకుండా నాలుగునెలలు కాలయాపన చేశాడు. చివరకు సెప్టెంబరు 10వ తేదిన అతను తన సైన్యంతో మందీ మార్బలంతో కలెక్టరును దర్శించడానికి వెళ్ళాడు. అది గమనించి కలెక్టరు అతనికి దర్శనమీయకుండా మకాముల వెంట మకాములు తిప్పాడు. చివరకు రామనాథపురంలో దర్శనమిచ్చాడు. ఆసమయంలో కంపెనీ వారు పాతఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలించడం ప్రారంభించారు.

అప్పుడు జరిగిన చర్చలో తనను మోసంతో బంధిస్తారని కరటయ్య అనుమానించి, అక్కడ నుంచి తప్పించుకోవడానికి విశ్రాంతి తీసుకోవడానికి అనుమతి కోరుతాడు. కలెక్టరు అనుమతిస్తాడు. కరటయ్య కచ్చేరీ గది నుంచి బైటికి వచ్చి కోటగుమ్మం వైపు పరుగెత్తడం ప్రారంభించాడు. అతని అనుచరులు అతని వెంబడిస్తారు. ద్వారపాలకులు అడ్డగించబోగా కరటయ్య అనుచరులు వారిని చంపివేస్తారు. అదే సమయంలో కోటలోకి వస్తున్న క్లార్కు అనే కంపెనీ ఉద్యోగిని కరటయ్య కత్తితో పొడిచి చంపుతాడు. వెంటనే కంపెనీ సిపాయిలు కాల్పులు ప్రారంబిస్తారు. అప్పుడు జరిగిన దొమ్మియుద్ధంలో కరటయ్య సైనికులు కొందరు చనిపోతారు. కొందరికి గాయాలై బందీలుగా పట్టుబడతారు. కరటయ్య చనిపోయిన తన సైనికుల శవాలను తన భటులతో మోయించుకొని మిగిలిన అనుచరులతో తన స్వస్థలానికి వెళ్ళిపోతాడు. జాక్సన్ జరిగిన సంగతంతా పైఅధికారులకు తెలియజేస్తాడు. కంపెనీ వారు జరిగిన విషయం సమగ్రంగా తెలుసు కోవడానికి ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని వేస్తారు.

ఆసమయంలో కంపెనీ వారు టిప్పుసుల్తాన్‌తో యుద్ధం చేస్తుండడం వల్ల కరటయ్యతో యుద్ధం చేయడం మంచిది కాదని భావించారు. వారి ఆలోచన ప్రకారం జాక్సన్ కరటయ్య విషయంలో చాకచక్యంగా వ్యవహరించలేదని, క్లార్కు హత్య విషయంలో కరటయ్యకు ఎలాంటి శిక్ష విధించనవసరం లేదని కమిటీ నివేదిస్తుంది. కంపెనీ వారు జాక్సన్‌ను తొలగించి అతని స్థానంలో స్టీఫెన్ రంబోల్డ్ లషింగ్టన్‌ను 1799 జూన్ 12వ తేదీన తిరునల్వేలి కలెక్టరుగా నియమించారు. లషింగ్టన్ ఎన్ని సార్లు కబురు చేసినప్పటికీ కరటయ్య నాయకుడు అతణ్ణి దర్శించలేదు. లషింగ్టన్ అతణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవడానికి కోట దగ్గర దొమ్మీలో పట్టుబడిన అతని అనుచరులను విడిచిపెట్టడమే గాకుండా కంపెనీ అధికారాన్ని గౌరవించి పన్ను సక్రమంగా కడితే కరటయ్య లోగడ చేసిన తప్పిదాలను మాపు చేస్తామని ప్రకటించడమే గాకుండా వాటిని మాపు చేసినట్లుగా ఒక లేఖ రాసి ఆలేఖలో తనను ఒకసారి కలిసి వెళ్ళవలసిం దిగా కోరుతాడు. ఐతే కరటయ్య వీటికి లొంగకుండా కంపెనీ వైపు చేరిపోయిన శివగిరిపాలెం మీదికి సాయుధులైన తన సైనికులను పంపించి అల్లర్లు లేవదీశాడు. దీనితో లషింగ్టన్ జరిగిన విషయమంతా కంపెనీవారికి తెలియజేశాడు. అప్పటికి మైసూరు యుద్ధం ముగిసి టిప్పుసుల్తాన్ మరణించడం వల్ల కంపెనీవారు కరటయ్య విషయంలో శ్రద్ధ వహించడానికి అవకాశం కలుగుతుంది.

1799 ఆగష్టులో కంపెనీ మేజర్ బానర్‌మాన్ అనే అతనికి కొంత సైన్యాన్నిచ్చి, ఆయుద్ధం విషయంలో అతనికి సంపూర్ణాధికారాలిచ్చి తిరునల్వేలికి పంపిస్తుంది.



బానర్‌మాన్ కరటయ్యకు ఒక లేఖ రాస్తూ అందులో కరటయ్య ఒంటరిగా విధేయుడై వచ్చి బాకీ ఉన్న పన్ను పూర్తిగా కట్టి శివగిరిపాలెంలో అల్లర్లు లేవదీసినందుకు సంజాయిషీ ఇచ్చుకోవాలని కఠినంగా శాసిస్తాడు. కరటయ్య వాయిదాలు కోరుతూ కాలయాపన చేస్తాడు. దానితో కోపించిన బానర్‌మాన్ సెప్టెంబరు 8 వతేదీన పంచాలన్‌కుర్చి కోటను ముట్టడిస్తాడు. కరటయ్య వైపు సైన్యం ఎక్కువగా ఉన్నప్పటికీ అతని సైన్యం వీరోచితంగా పోరాడినప్పటికీ బానర్‌మాన్ వైపు ఫిరంగులు, తుపాకులు ఉండడం వల్ల, వారు ఆధునిక యుద్ధతంత్రాన్ని పాటించడం వల్ల యుద్ధంలో ఆంగ్లేయులదే పైచేయి అవుతుంది. కోట శత్రువుల వశం కాకతప్పదని గ్రహించిన కరటయ్య కొంత మంది అనుచరులతో కోటనుంచి ఆరాత్రి తప్పించుకొని పారిపోతాడు. అతణ్ణి పట్టుకోవడానికి కొంత అశ్వదళాన్ని, నాలుగు వందల మంది కాలిబంటులను బానర్‌మాన్ పంపిస్తాడు. అంతేగాకుండా పారిపోతున్న కరటయ్యను పట్టిబంధించమని చుట్టుపక్కల ఉన్న పాలెగాండ్రకు అధికారులకు తాఖీదులు పంపిస్తాడు.

కరటయ్య నాయకుని పంచాలన్‌కుర్చి సంస్థానం పక్కనే ఎట్టియాపురం అనే సంస్థానం ఉంది. దాని పాలకుడైన పాలెగాడు కూడా తెలుగువాడే, యాదవకులానికి చెందినవాడే. ఐతే వీరిద్దరికీ బద్ధశత్రుత్వం ఉండేది. ఈశత్రుత్వం కారణంగా ఎట్టియా పురం పాలెగాడు కంపెనీవారితో కుమ్మక్కై తన భటుల ద్వారా కరటయ్య కోలార్పట్టి కోటలో ఉన్నట్లు తెలుసుకొని ఆవిషయాన్ని కంపెనీవారికి తెలియజేస్తాడు. కంపెనీ సైన్యం కోలార్పట్టి కోటను ముట్టడిస్తుంది. ఆయుద్ధంలో కరటయ్య అనుచరులు చనిపోతారు. ఐతే కరటయ్య శత్రువులకు చిక్కకుండా కోట నుంచి తప్పించుకొని పారిపోతాడు.అతని ఆచూకీ కోసం ఎట్టియాపురం పాలెగాడు ఎంతగానో ప్రయత్నిస్తాడు. బానర్‌మాన్ అతడు చేస్తున్న సహాయానికి గాను అతణ్ణి గౌరవిస్తాడు. ఆతర్వాత బానర్‌మాన్ కరటయ్య వైపు ఉన్న పాలెగాళ్ళ కోటలను నేలమట్టం చేయించి వారు పాలిస్తున్న సంస్థానాలను కంపెనీ రాజ్యంలో కలిపివేస్తాడు.

పారిపోయిన కరటయ్య నాయకుడు పగటిపూట దాక్కుంటూ రాత్రిపూట ప్రయాణం చేస్తూ పుదుక్కోట సంస్థానం అడవులకు చేరుకుంటాడు. పుదుక్కోట పాలకుడు కంపెనీవారితో కుమ్మక్కై కరటయ్యనాయకుని నమ్మించి తన దగ్గర అతిథిగా ఉంచు కొని సెప్టెంబరు 24వ తేదీన కంపెనీ వారికి పట్టిస్తాడు. కంపెనీ ప్రభుత్వం విచారించి కరటయ్యను ఉరితీయించి చంపుతుంది. ఈవిధంగా కాకలు తీరిన యోధుడైన కట్టబొమ్మన కరటయ్యనాయకుడు దేశద్రోహుల కారణంగా దొరికిపోయి చనిపో తాడు. తమిళనాడులో ఇతని పేరుతో కట్టబొమ్మన జిల్లా ఉంది.

పౌరాణిక కాలంలో చంద్రవంశ క్షత్రియులుగా దేదీప్యమానంగా వెలుగొందిన యాదవులు, చారిత్రకంగా రాజులై రాజ్యాలను పాలించి ప్రకాశించిన యాదవులు నేడు దయనీయమైన స్థితిలో దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. నేడు ఆంధ్ర దేశంలో యాదవులు లేని పల్లెటూరు గానీ పట్నం గానీ లేదు. ఆంధ్రదేశంలోని అన్ని ఊర్లలో కొద్దో గొప్పో యాదవులున్నారు. వీరు లేని ఊరు లేదంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రదేశంలోని కళింగాంధ్ర, కోస్తా ప్రాంతం, రాయలసీమ, తెలంగాణాల్లోని అన్ని ఊర్లలోనూ చెప్పుకోతగిన జనాభా ఉన్న కులం యాదవ కులం ఒకటే. మిగిలిన కులాలన్నీ ఏదో కొన్ని ప్రాంతాలకే పరిమితం కాగా యాదవకులం మాత్రం అన్ని ప్రాంతాల్లోనూ వ్యాపించి ఉంది. ఆంధ్రప్రదేశ్ జనాభాలో వీరు పది శాతం వరకు ఉంటారు.

ఆంధ్రప్రదేశ్‌లో యాదవులను "గొల్ల" అనే పేరుతో పిలుస్తున్నారు. ఈ పేరు వీరు చేసే వృత్తినిబట్టి వచ్చిన పేరు. ప్రాచీనకాలంలో భారతదేశమంతటా వీరి ముఖ్య వృత్తి గోపాలన. గొల్ల పదం 'గోపాల' శబ్దం నుంచి వచ్చింది. గోపాల > గోఆల> గోల> గొల్ల అయింది. కొందరు 'గొర్ల' శబ్దం నుంచి 'గొల్ల' పదం వచ్చిందని చెబుతారు. అది వాస్తవం కాదు. యాదవులు గొర్రెలను, మేకలను కాయడం రెండువందల సంవత్సరాల లోపునుంచి మాత్రమే చేస్తున్నారు. గొల్ల పదం భాగవతంలో చాల చోట్ల వాడబడింది. పోతన కాలం నాడు గొల్లల ముఖ్యవృత్తి గోపాలన మాత్రమే. అప్పుడు గొర్రెల పాలన లేదు. అందువల్ల గొల్ల శబ్దం గోపాల శబ్దం నుంచి వచ్చింది. ఉత్తర భారత దేశంలో ఇప్పటికి వీరిని 'గోల' అని పిలుస్తారు. ఈ 'గోల' పదం తెలుగులో 'గొల్ల' అయింది. కళింగాంధ్ర ప్రాంతంలో వీరిని 'కోనారి' అని గూడా పిలుస్తారు. కోనారి అంటే గోసమూహం కలిగినవాడు అని అర్థం.

ఆంధ్రప్రదేశ్‌లోని యాదవుల్లో చాలా శాఖలున్నాయి. పొడపోతులవారు, గొల్లసుద్దులవారు మొదలైన యాదవకుల ఆశ్రితులు ఆంధ్రప్రదేశ్‌లోని గొల్ల కులంలో మొత్తం అరవై ఆరు శాఖలున్నాయని చెబుతారు. అయితే వీరు పది, పన్నెండు శాఖల పేర్లు మాత్రమే చెప్పగలుగుతారు. మొత్తం అరవై ఆరు శాఖల పేర్లు వీరు ఎవరూ చెప్పలేరు. అనేక గ్రంథాలను, అనేకమంది యాదవులను సంప్రదించి యాదవుల్లోని 70 శాఖల పేర్లు నేను సేకరించాను. వాటి పేర్లు ఇవి. కురవగొల్ల, ఆలగొల్ల, గౌడగొల్ల, మేకలగొల్ల, ఎర్రగొల్ల, పూజగొల్ల, కర్నగొల్ల, కరినెగొల్ల, ఇడయార్‌గొల్ల, మొండిగొల్ల, అస్తంత్రగొల్ల, ఆస్థానగొల్ల, అడవిగొల్ల, క్రిష్ణగొల్ల, దూదిగొల్ల, ఊరిగొల్ల, కాడుగొల్ల, పాకనాటి గొల్ల, సుద్దులగొల్ల, పూరిగొల్ల, పూనాటిగొల్ల, పూనగొల్ల, పున్నుగొల్ల, వృష్ణిగొల్ల, మందగొల్ల, పెదవేటిగొల్ల, చినవేటిగొల్ల, గవిడిగొల్ల, రాచగొల్ల, పాలగొల్ల,



గుజరాతిగొల్ల, మరాఠీగొల్ల, వెయ్యగొల్ల, పెయ్యగొల్ల, ముష్టిగొల్ల, సద్దనపు గొల్ల, దోమ కంటి గొల్ల, తీగగొల్ల, పద్మగొల్ల, కమ్మగొల్ల, బూదాటిగొల్ల, ఏగొల్ల, ఆగొల్ల, గంపగొల్ల, తెలుసూరిగొల్ల, పెద్దింటిగొల్ల, ఉన్నిగొల్ల, పత్తిగొల్ల, గంగిరెద్దులగొల్ల, ఎల్లమ్మగొల్ల, ఎల్లన్నగొల్ల, భాగవతులగొల్ల, ముదిమిగొల్ల, వెకారిగొల్ల, మొండిగొల్ల, మల్లన్నగొల్ల, సరనపుగొల్ల, దేవరగొల్ల, కొలువులగొల్ల, ఏకులగొల్ల, కొమ్ముగొల్ల, తగరగొల్ల, కూటి ఆటలగొల్ల, ఆరెగొల్ల, బడతగొల్ల, దారగొల్ల, పికిలిగొల్ల, మోటాటిగొల్ల, పెద్దగొల్ల , అలగంపగొల్ల.

పైవాటిలో కర్నగొల్ల, కరినెగొల్ల ఒకటే అయివుండవచ్చు. అలాగే పూనగొల్ల, పున్నుగొల్ల శాఖలు కూడా ఒకటే అయివుండవచ్చు. అంటే పిలవడంలో తేడా తప్ప అవి వేరువేరు శాఖలు కాకపోవచ్చు. పైన చెప్పిన 70 శాఖల్లో ఈరెండింటిని తొలగిస్తే ఆంధ్రదేశంలోని యాదవుల్లో మొత్తం 68 శాఖలు ఉన్నట్లుగా తెలుస్తుంది. ఇవి నాసేకరణలో లభించిన పేర్లు. ఇలాంటి శాఖలపేర్లు ఇంకా ఉన్నాయేమో తెలియదు.

పై శాఖల్లో కురువగొల్లలు రాయలసీమ తెలంగాణా ప్రాంతాల్లో ఎక్కువగా ఉన్నారు. ప్రస్తుతం వీరు కురుబ, కురుమ పేర్లతో పిలువబడుతూ ప్రత్యేకమైన కులంగా పరిగణింపబడుతున్నారు. ప్రభుత్వం వారు గూడ వీరిని ప్రత్యేకమైన కులంగా పరిగణించి వెనుకబడిన తరగతుల్లో "బి" గ్రూపులో చేర్చారు. వీరు ప్రధానంగా శైవులు. మల్లన్న, బీరప్పలను కొలుస్తారు. వీరిలో ఉన్ని కంకణం, పత్తికంకణం అనే రెండు వర్గాలున్నాయి. గొర్రెలను, మేకలను కాయడం, గొర్రెబొచ్చు తీసి దీనితో కంబళ్లు నేయడం వీరి ప్రధాన కులవృత్తి. విజయనగర రాజ్యాన్ని స్థాపించిన హరిహ రరాయలు, బుక్కరాయలు కురువగొల్ల కులానికి చెందినవారు. భక్తిప్రధాన కళ అయిన 'గొరవయ్యలు' కళను వీరు ప్రదర్శిస్తారు. ఒగ్గుకథను గూడ ప్రధానంగా వీరే చెబుతారు.

ఆలగొల్లలు కళింగాంధ్ర, తూర్పుగోదావరి జిల్లాల్లో ఉన్నారు. వీరి ప్రధాన వృత్తి గొర్రెలను మేకలను కాయడం. పట్టణాల్లో ఉండేవారు పాలవ్యాపారం చేస్తారు. భక్తి ప్రధాన జానపదకళ అయిన 'సేవగరిడి'ని, ఉభయ ప్రధాన కళ అయిన తప్పెట గుళ్ళ కళను వీరు ప్రదర్శిస్తారు. గౌడగొల్లలు కళింగాంధ్ర జిల్లాల్లో ఉన్నారు. వీరి ప్రధాన వృత్తి పాల వ్యాపారం. మేకలగొల్ల, పున్నుగొల్ల శాఖలవారు ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో ఉన్నారు. వీరి ప్రధాన వృత్తి గొర్రెల, మేకల పాలన. ఎర్రగొల్లలు పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాల్లో ఉన్నారు. వీరిలో తక్కువమంది గొర్రెల మేకలను కాస్తారు. ఎక్కువ మంది వ్యవసాయం చేస్తారు. మిగిలినశాఖల కంటె వీరు ఆర్థికంగా, రాజకీయంగా, విద్యాపరంగా ముందంజలో ఉన్నారు. దీనికి కారణం వీరు సస్య

శ్యామలమైన ఉభయగోదావరి, కృష్ణా జిల్లాల్లో ఉండడమే.

పూజగొల్లలు గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, రాయలసీమ జిల్లాల్లో ఉన్నారు. వీరి ప్రధాన వృత్తి గొర్రెల మేకల పెంపకం. కర్నూలు, అనంతపురం జిల్లాల్లోని పూజ గొల్లలు గొర్రెల మేకల పెంపకంతోపాటు గొర్రెబొచ్చు తీసి కంబళ్లు గూడా నేస్తారు. కర్నగొల్ల, కరినెగొల్ల ఒకటే అయి ఉండవచ్చు. వ్యవహారంలో తేడా తప్ప వీరు వేరువేరు శాఖలూ కాకపోవచ్చు. వీరు రాయలసీమ జిల్లాల్లో ఉన్నారు. వీరిలో తక్కువమంది గొర్రెలను కాస్తారు. ఎక్కువమంది వ్యవసాయం చేస్తారు.

ఇడయార్ గొల్ల, మొండి గొల్ల, అస్తంత్ర గొల్లలు ప్రధానంగా తమిళనాడు సరిహద్దు ప్రాంతంలోనూ, తమిళనాడులోను ఉన్నారు.

ఆస్థానగొల్ల, అడవిగొల్ల, క్రిష్ణగొల్ల, దూదిగొల్లలు కర్నాటక సరిహద్దు ప్రాంతంలోనూ, కర్నాటకలోనూ ఉన్నారు. ఊరిగొల్లలు అనంతపురం జిల్లాలో కర్నాటక సరిహద్దు ప్రాంతంలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో వ్యవసాయశాఖ మంత్రిగా ఉన్న ఎన్. రఘువీరారెడ్డిగారు ఊరిగొల్ల శాఖకు చెందిన వారు. ఈ శాఖ వారు తెలుగు కన్నడ భాషలను మాట్లాడతారు. కాడుగొల్లలు గూడ ఈ ప్రాంతంలోనే ఉన్నారు. వీరు అనేక మూఢవిశ్వాసాలతో, మూఢాచారాలతో అనాగరికులుగా దుర్భ రమైన జీవితాన్ని గడుపుతున్నారు. వీరి ఇల్లు చిన్న పూరిగుడిశలు. బహిష్టు అయిన స్త్రీని ఇంటిలోపలికి రానివ్వకుండా అయిదు రోజులపాటు బైట ఉంచుతారు. ఆ స్త్రీలు ఆ అయిదు రోజులు పగలు ఎండలో ఎండుతూ రాత్రి చలికి వణుకుతూ, వర్షంలో తడుస్తూ ఉండవలసిందే. గర్భవతులైన స్త్రీని ప్రసవించడానికి ముందు ఊరిబైట చిన్నగుడిసె వేసి అందులో ఉంచుతారు. ఆమె ప్రసవించిన తర్వాత నెల రోజులపాటు ఒక్కతే తన పనులన్నీ చేసుకుంటూ జీవించాలి. పచ్చిబాలింతరాలైన స్త్రీకి ఆ పనులు చేసుకోవడం ఎంత కష్టమో చెప్పనవసరం లేదు. నెలరోజుల తర్వాత ఆమెను ఇంటికి తీసుకొని వస్తారు. వీరు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నప్పటికి వీరి మాతృభాష కన్నడం. గతంలో ఎన్. రఘువీరారెడ్డిగారు పశుసంవర్ధకశాఖ మంత్రిగా ఉన్నప్పుడు వీరు ఉంటున్న గ్రామాల్లో కమ్యూనిటీ హాళ్ళు కట్టించారు. బహిష్టు సమయంలో స్త్రీలు ఈ కమ్యూనిటీ హాళ్లలో ఉంటున్నారు.

పాకనాటి గొల్లలు తెలంగాణ ప్రాంతంలో ఉన్నారు. గ్రామాల్లో ఉన్నవారు గొర్రెల, మేకల పాలనతోపాటు కంబళ్లు నేస్తారు. పట్టణాల్లో, నగరాల్లో ఉన్నవారు పాలవ్యాపారం చేస్తారు. సుద్దులగొల్లలు రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల్లో ఉన్నారు. వీరినే గొల్లసుద్దులవారు అని పిలుస్తారు. వీరు కాటమరాజు కథలను చెబుతారు.



నిజానికి వీరు యాదవుల్లో ప్రత్యేకమైన శాఖ కాదు. సుద్దులగొల్లలు ఎర్రగొల్ల శాఖకు చెందిన వారు. అయితే వీరి జీవన విధానం మిగిలిన ఎర్రగొల్లల కంటె భిన్నంగా అంటే కాటమరాజు కథలను చెబుతూ యాదవులను యాచిస్తూ జీవిస్తున్నందువల్ల వీరు ప్రత్యేక మైన శాఖగా పరిగణింపబడుతున్నారు.

అలాగే గంగిరెద్దులగొల్లలు గూడా ప్రత్యేకమైన శాఖ కాదు. గంగిరెద్దుల వారు యాదవకులంలోని పూజగొల్ల శాఖకు చెందినవారు. గంగిరెద్దుల వారు తాము గొల్ల కులానికి చెందినవారమని చెప్పుకోరు. గంగిరెద్దులవారమనే చెప్పుకుంటారు. వీరికి ప్రత్యేకమైన వృత్తి. జీవన విధానం ఉంది. అందువల్ల గంగిరెద్దుల వారు ప్రత్యేక మైన శాఖగా పిలువబడుతున్నారు.

పెదవేటిగొల్లలు, చినవేటిగొల్లలు తెలంగాణా ప్రాంతంలో ఉన్నారు. వీరు చాల తక్కువమంది ఉంటారు. వీరు 'మోడి' లాంటి కనుకట్టు విద్యను 'ప్రదర్శిస్తూ యాచన ద్వారా జీవిస్తారు. వీరు సంచార జీవనులు. ముప్పై, నలభై సంవత్సరాల కిందటి వరకు వీరు తెలంగాణ ప్రాంతం నుంచి తమ కుటుంబంతో కలిసి రాయల సీమ ప్రాంతానికి వచ్చేవారు. ప్రస్తుతం వీరు ఎక్కడా కనిపించడం లేదు. తను కళకు ఆదరణ లేకపోవడం వల్ల వీరు మరొక వృత్తిని ఎంచుకొని జీవిస్తూ ఉండవచ్చు. వీరు కొన్ని కుటుంబాల వారు మాత్రమే ఉండేవారు. వీరు చేతబడి మొదలైన తాంత్రిక విద్యలు చేస్తారని ప్రతీతి.

బూదాటిగొల్లలు కూడా తెలంగాణ ప్రాంతంలోనే ఉన్నారు. వీరు జానపద గాయక భిక్షుకులు. ఊర్లవెంట సంచార జీవనం చేస్తూ కథాగేయాలను చెబుతూ యాచన ద్వారా జీవిస్తారు.

గుజరాతిగొల్లలు గుజరాత్‌రాష్ట్రం నుంచి వలసవచ్చి ఇక్కడ స్థిరపడిన యాద వులై ఉంటారు. అలాగే మరాఠీగొల్లలు మహారాష్ట్ర రాష్ట్రం నుంచి వలస వచ్చి ఇక్కడ స్థిరపడిన యాదవులై ఉంటారు. గుజరాతిగొల్లలు, మరాఠీ గొల్లలతోపాటు మిగిలిన అన్ని శాఖల గొల్లలు తెలంగాణా ప్రాంతంలోనే ఉన్నారు. ముష్టిగొల్లలు వరంగల్ జిల్లాలో ఉన్నారు. వీరి ముఖ్య వృత్తి గొర్రెల పెంపకం. తెలంగాణాలోని కొన్ని జిల్లాల్లో యాదవు ల్లోని చాల శాఖల వారున్నట్లుగా తెలుస్తుంది. ఉదాహరణకు మెదక్ జిల్లాలో ముష్టిగొల్ల, పాకనాటి గొల్ల, ఎర్రగొల్ల, పూజగొల్ల, పత్తిగొల్ల, సద్దనపు గొల్ల, అలగొంప గొల్ల, కమ్మ గొల్ల శాఖల వారున్నారు. వీరిలో కమ్మగొల్లలు గొర్రెలను పెంచరు, వీరు వ్యవసాయం, వ్యాపారం మొదలైన వృత్తుల ద్వారా జీవిస్తారు. మిగిలిన శాఖలవారు గొర్రెలు మేకలను కాస్తారు. గొంగళ్లు నేస్తారు.

మిగిలిన పూరిగొల్ల, పూనాటిగొల్ల, వృష్ణిగొల్ల మొదలైన శాఖల వారందరూ తెలంగాణా ప్రాంతంలోనే ఉన్నట్లుగా తెలుస్తుంది. వీరిలో కొందరు పెదవేటి, చినవేటి, బూదాటిగొల్లల లాగా సంచార జీవనం చేస్తూ యాచన ద్వారా జీవించే వారుగా ఉండ వచ్చు. మిగిలిన అన్నిశాఖలవారు ప్రధానంగా గొర్రెల, మేకల పాలనతో ప్రధానంగా జీవిస్తున్నారు.

పెదవేటి, చినవేటి, బూదాటి, గంగిరెద్దుల గొల్లలు లాంటి యాచకులు తప్ప మిగిలిన అన్ని శాఖల మధ్య కంచం పొత్తుఉంది. నిన్న, మొన్నటి వరకు మంచం పొత్తు ఉండేది గాదు. కానీ ఈనాడు విద్యావంతులైన యాదవులు శాఖాభేదాలను పట్టించుకోకుండా వివాహ సంబంధాలు చేసుకుంటున్నారు. కానీ గ్రామాల్లో చదువు లేనివారు శాఖాభేదాలను పాటిస్తూ తమ శాఖలోనే ఇచ్చిపుచ్చుకుంటున్నారు.

ఆంధ్రదేశ జనాభాలో 10 శాతం వరకు ఉన్న యాదవుల్లో 90 శాతం మంది విద్యాపరంగా, రాజకీయంగా, ఆర్థికంగా వెనుకబడి దారిద్ర్యరేఖకు అడుగున జీవిస్తు న్నారు. దీనికి ప్రధాన కారణం వీరి కులవృత్తి అయిన పశుపాలన. యాదవులు మొదట ఆవుల పాలన చేసేవారు.అడవులు, బీడు భూములు తగ్గిపోవడంతో ఆవులకు మేత పెద్ద సమస్య కావడంవల్ల యాదవులు ఆవుల పాలన మానివేసి గొర్రెల మేకల పాలన ప్రారంభించారు. కొన్ని వందల సంవత్సరాల నుంచి తరతరాలుగా యాదవులు తమ కులవృత్తి అయిన పశుపాలన కోసం అడవుల వెంట, పొలాల వెంట తిరగడం వల్ల వీరు చదువు సందెలు లేక నిరక్షరాశ్యులుగా, అమాయకులుగా, అజ్ఞానులుగా తయార య్యారు. సంఘంలో జరుగుతున్న మార్పును గ్రహించలేక మూఢవిశ్వాసాలతో అనేక కట్టుబాట్లు మధ్య జీవిస్తున్నారు.

పశుపాలన కారణంగా వీరు గ్రామంలోని వారందరికీ ఒదిగి ఉండవలసిన పరిస్థితి ఏర్పడింది. పొద్దున లేచినప్పటి నుంచి వీరు తమ గొర్రెల మందను రైతుల పొలాల్లో మేపుకోవలసి ఉంటుంది. అలా మేపుకోవాలంటే రైతులతో అణకువగా, మంచిగా ఉండాలి. పొరపాటున గొర్రెలు చేలో మేస్తే రైతుల నుంచి తిట్లు, తన్నులు మొదలైన అవమానాల పాలు కావలసి ఉంటుంది. ఈ పశుపాలన కారణంగా వీరు తలెత్తుకొని గౌరవంగా, పౌరుషంగా జీవించే అవకాశాలు తక్కువ అయ్యాయి. రాను రాను బంజరు భూములు తగ్గిపోవడంతో గొర్రెల మేత రోజురోజుకు కష్టంగా తయార యింది. దీనికితోడు ముచ్చురోగం, బొబ్బరోగం, గాలికుంటు, నీలినాలుక రోగం మొదలైన అనేక రోగాల వల్ల గొర్రెలు, మేకలు చనిపోయి యాదవులకు ఎంతో నష్టాన్ని కలుగజేస్తున్నాయి. ఫలితంగా వీరు అప్పుల పాలవుతున్నారు. కల్లుగీతవారు, నేతపని



వారు మొదలైన వృత్తుల వారికి సహకార సంఘాలు ఉన్నాయి. వీటివల్ల ప్రభుత్వం నుంచి తక్కువ వడ్డీకి ఋణాలు, నష్టం కలిగినప్పుడు నష్టపరిహారం మొదలైన సౌక ర్యాల ద్వారా వారు కొంత లాభపడుతున్నారు. కాని యాదవులకు ఇలాంటి సహకార సంఘాలు చాల కాలం వరకు లేవు. ఈ మధ్యకాలంలో స్థానికంగా సహకార సంఘాలు ఉన్నాయి. కానీ రాష్ట్రస్థాయిలో సహకార సంఘాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేయలేదు. అలా ఏర్పాటు చేస్తే దానికి కొంత డబ్బును కేటాయించవలసి వస్తుంది. దానికి అధ్య క్షుణ్ణి నియమించవలసి ఉంటుంది. వీటన్నింటికి బడ్జెట్‌లో డబ్బు కేటాయించవలసి ఉంటుంది. అది ప్రభుత్వానికి ఇష్టం ఉండదు. దాన్ని సాధించాలంటే యాదవులు రాజకీయ చైతన్యంతో పోరాడాలి. పోరాడ గలిగిన చైతన్యం గానీ, ఐకమత్యం గానీ వీరిలో లేదు. అందువల్ల రాష్ట్రస్థాయి సహకార సంఘం ఏర్పాటు కావడం లేదు. దీని కారణంగా వీరికి ఋణాలు గానీ, నష్టపరిహారం గానీ లభించడం లేదు.

యాదవుల్లో కులచైతన్యం గానీ, రాజకీయ చైతన్యం గానీ, సాంఘిక చైతన్యం గానీ లేదు. విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, ఉభయగోదావరి జిల్లాల్లోనూ, ప్రకాశం, కర్నూలు, అనంతపురం జిల్లాల్లోనూ, తెలంగాణాలోని నల్గొండ, కరీంనగర్ మొదలైన జిల్లాల్లో యాదవులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. కొన్ని గ్రామాల్లో 90 శాతం మంది వీరే ఉంటారు. అయినా ఆవూరి మున్సబుగా గానీ, మిగిలిన గ్రామాధికార పదవుల్లో గానీ యాదవులుండరు. మిగిలిన 10 శాతం జనాభా ఉన్న కులాల్లోని వారు ఆపదవుల్లో ఉండి 90 శాతం జనాభా ఉన్న యాదవుల మీద పెత్తనం చెలాయిస్తూ ఉంటారు. వీరిలో ఐకమత్యం ఏమాత్రం లేదు. తమలో తాము కలహించుకుంటూ మూడోవ్యక్తి తమ మధ్య చొరబడడానికి అవకాశం ఇస్తూ ఉంటారు. వీరికి కులాభి మానం కూడా ఉండదు. గ్రామంలోని అధికార పదవికి తమ కులంలో ఎవరైనా పోటీ చేస్తే ఓటు అతనికి వేయకుండా పార్టీలు, సిద్ధాంతాలు అంటూ ఇతర కులస్తులకు వేస్తారు. సినిమాల్లో యాదవ కులాన్ని, యాదవ కులానికి మాత్రమే పరిమితమైన ఇంటిపేర్లను కించపరుస్తూ సన్నివేశాలు చిత్రీకరిస్తున్నా ఇదేమని అడిగేవారు గూడా లేరు. తమ చుట్టూ ఉన్న సమాజం హైటెక్ వేగంతో దూసుకుపోతుంటే వీరు ఎలాంటి చైతన్యం లేకుండా అజ్ఞానంలో, మూఢనమ్మకాలతో, సాంప్రదాయికమైన కులవృత్తులతో దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. పై అవలక్షణాలకు తోడు వీరిలో తాగుడు అలవాటు ఎక్కువ. తాగుడుకు బానిసై సంపాదించిన దాన్ని ఎక్కువగా తాగుడుకు ఖర్చు చేస్తారు. తమ పిల్లలను చదివించకుండా చిన్నప్పటి నుంచి గొర్రెలు కాయడానికి పంపిస్తారు.

యాదవుల్లో ఆవేశం కూడా ఎక్కువే. ఆలోచన లేకుండా ఆవేశంతో నిర్ణయాలు

తీసుకోవడంలో వీరు ముందుంటారు. లౌక్యం తక్కువ. సిద్ధాంతాలకు, మాటకు కట్టుబడి ఉండడం వీరిలో ఎక్కువ. ఈ లక్షణాల వల్లనే నక్సలైట్లలో ఎక్కువ మంది యాదవులున్నారు. పోలీసు కాల్పుల్లో చనిపోయేది కూడా ఎక్కువగా వీరే.

అయితే ఇప్పుడిప్పుడే వీరిలో పై అవలక్షణాల్లో కొంత మార్పు వస్తున్నది. అయితే ఈ మార్పు చాల స్వల్పస్థాయిలో ఉంది. ఈఅవలక్షణాల నుంచి బైటపడి అంటే తాగుడు మానివేసి, చదువుకొని, వివేకంతో మెలగుతూ కులచైతన్యం పొంది ఐకమత్యంతో ముందుకు సాగిననాడు, తమ జనాభాకు తగిన విధంగా చట్టసభల్లో ప్రతినిధులను గెలిపించుకోగల శక్తిని వీరు సంపాదించుకున్ననాడు భారతదేశంలోని సగం రాష్ట్రాల్లోనూ, కేంద్రంలోనూ వీరి ప్రభుత్వమే ఉంటుందనడంలో ఎలాంటి అతిశయోక్తి ఉండదు. ఆంధ్రదేశ జనాభా ఎనిమిది కోట్లు అనుకుంటే అందులో యాదవులు 70 నుంచి 80 లక్షల వరకు ఉన్నారు. వీరి జనాభా ప్రకారం రాష్ట్రంలో కనీసం 60 మంది ఎం.ఎల్.ఏలు, ఆరుగురికి తక్కువ కాకుండా ఎం.పీలూ యాదవులు ఉండాలి. ఉండవలసిన వారిలో ప్రస్తుతం వీరి ప్రాతినిథ్యం పదవ వంతు మాత్రమే ఉంటున్నారు. తమ జనాభా దామాషా ప్రకారం చట్టసభల్లో ప్రతినిధులను గెలిపించుకోవడానికి యాదవులు చాల చైతన్యవంతులు కావాలి. ఇంతగా వీరిని చైతన్యవంతులను చేయడానికి బహుశా మళ్లీ శ్రీకృష్ణుడు యాదవకులంలో జన్మించవలసి ఉంటుందేమో.

పైన చెప్పిన అవలక్షణాలవల్ల వీరిలో వీరికి నష్టమే గానీ ఇతర కులాల వారికి వీరి వల్ల ఎలాంటి నష్టం లేదు. ఇతర కులాల వారికి దీనివల్ల కొద్దోగొప్పో లాభమే ఉంది. యాదవులు చదువుకోక పోవడంవల్ల మిగిలిన కులాల పిల్లలకు విద్యాసంస్థల్లో చదువుకోవడానికి అవకాశం కలుగుతూ ఉంది. వీరు ఉద్యోగాలు చేయకపోవడంవల్ల ఇతర కులాలవారు వీరి భాగం ఉద్యోగాలు గూడా పొంది బాగుపడుతున్నారు. అలాగే రాజకీయంగా అధికార పదవులకు యాదవులు పోటీ పడకపోవడం వల్ల ఇతర కులాల వారు అధికార పదవులు పొంది లాభపడుతున్నారు. అందువల్ల యాదవుల అజ్ఞానం, అనైక్యత వల్ల వారికి నష్టమే గానీ ఇతర కులాల వారికి ఎలాంటి నష్టం లేదు. లాభమే ఉంది. ఐతే దేశం అభివృద్ధి చెందడమంటే దేశంలో ఉన్న ప్రజలందరూ అభివృద్ధి చెందడం. యాదవులు ఈవిధంగా అభివృద్ధిచెందకుండా ఉంటే ఆమేరకు దేశాన్ని వెనుకబాటులో ఉంచినట్లే. అందువల్ల వీరు గూడా చదువుకొని వివేకవంతులై అభివృద్ధి చెంది దేశాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తారని ఆశించుదాం.

యాదవుల్లో పై అవలక్షణాలున్నా కొన్ని మంచి లక్షణాలు కూడా ఉన్నాయి. అవి చేసేపని నిజాయితీగా నమ్మకంగా చేయడం, కష్టపడి పనిచేయడం, పరోపకారం



చేయడం, సిద్ధాంతాలకు, మాటకు కట్టుబడి ఉండడం. తమను ఆశ్రయించినవారిని పోషించడం మొదలైనవి.

యాదవులు గొప్ప నమ్మకస్తులు, ప్రాణమైనా వదులుతారు గానీ నమ్మకద్రోహం మాత్రం చేయరు. వీరి ఈగొప్ప లక్షణాన్ని గమనించి ఆంగ్లేయులు తమ ధనాగారాల వద్ద యాదవులను మాత్రమే కాపలా ఉంచేవారు. కొన్ని చోట్ల చాకలివారిని గూడా కాపలా ఉంచేవారు. యాదవుల్లో పరోపకార గుణం బాగా కనిపిస్తుంది. కాటమరాజు కథల్లో కాటమరాజు తండ్రి, పినతండ్రి, పెదతండ్రులు, అతని తాత అందరూ పరోపకారం కోసం యుద్ధాలు చేసి చనిపోయారు. నిన్నమొన్నటి వరకు యాదవులు గ్రామాల్లో పెరుగు చిలికి వెన్న తీసిన తర్వాత మజ్జిగను అందరికీ ఉచితంగా పోసేవారు. ఇప్పుడు పాలకేంద్రాలకు పాలు అమ్ముతూ ఉండడం వల్ల పెరుగు చిలకడం మజ్జిగ ఉచితంగా పోయడం మొదలైనవి చేయడం లేదు. తమకున్నదాంట్లో కొంతైనా ఇతరులకు పెట్టాలన్న పరోపకారగుణం అమాయకులైన వీరిలో ఎక్కువగా కనిపిస్తుంది.

యాదవుల ఈపరోపకారానికి మంచి ఉదాహరణ గొల్ల హంపన్న చరిత్ర. గొల్ల హంపన్న అనంతపురం జిల్లా గుత్తి అనే ఊరు కాపురస్తుడు. ఇతడు గుత్తి దగ్గర రైల్వే గేటుకు కాపలా మనిషిగా పనిచేసేవాడు. భార్యాబిడ్డలు చనిపోయి ఒంటరిగా జీవిస్తున్న వ్యక్తి. యాభై సంవత్సరాల వయసు పైబడినవాడు. ఇతడు ఒక రోజు విధి నిర్వహణలో ఉన్నప్పుడు ఆరుగురు తెల్లసిపాయిలను ఎదిరించి ఇద్దరు భారతీయ స్త్రీల మానాన్ని కాపాడి ఆరుగురు సిపాయిల్లో ఆష్ అనే సిపాయి చేత కాల్చిబడి చనిపోయాడు. ఈసంఘటన 1893 అక్టోబరు నెల 4 వ తేదీన జరిగింది. ఇతని హత్యాకేసు ఆనాడు చాల ప్రసిద్ధి చెందింది. ఆష్ స్వయంగా హంపన్నను కాల్చినట్లు అంగీకరించాడు. ఐతే ఆత్మరక్షణ కోసమే అతడు కాల్చాడని తీర్పుచెప్పి న్యాయస్థానం కేసు కొట్టివేసింది. అతని ఈసాహసకార్యాన్ని ఔదార్యగుణాన్ని ఆనాటి భారతీయులు, కొందరు తెల్లదొరలు ఎంతగానో ప్రశంసించారు. అతణ్ణి భూస్థాపితం చేసిన దగ్గర అతని స్మృతిచిహ్నంగా ఒక సమాధి నిర్మించి దాని మీద "ఈసమాధిలో ఇరువురు దిక్కులేని స్త్రీల మానాన్ని రక్షించే ప్రయత్నంలో 1893 వ సంవత్సరం అక్టోబరు నెల 4 వ తేదీన ఒక యూరోపియను సోల్జరుచే పిస్తోలుతో కాల్పబడ్డ గొల్లహంపన్న శిష్టాస్థికలు ఉన్నాయి. యూరోపియనుల చేత భారతీయుల చేత ప్రశంసింపబడిన ఆపుణ్యాత్ముడు ఆమరునాడే దివం గతుడైనాడు." అనే అర్థాన్నిచ్చే ఆంగ్లవాక్యాలు చెక్కిన శిలాఫలకం దానిమీద స్థాపించారు. ఇతని సమాధి ఇప్పటికీ గుత్తిలో మన్రో సత్రం దగ్గర రోడ్డు పక్కన ఉన్నది. ఇతని చరిత్రను కథగా జమదగ్ని గారు రాసి పార్థివనామ సంవత్సరం

మాఘమాసం (1946 ఫిబ్రవరి) భారతి పత్రికలో ప్రచురించారు. ఈకథను తెలుగువిశ్వవిద్యాలయం వారు 2007లో ప్రచురించిన "జాతీయోద్యమ కథలు" సంకలన గ్రంథంలో ప్రచురించారు. అంతేగాదు ఇతని చరిత్రను వివరిస్తూ గొల్లహంపన్న అనే పుస్తకం గూడా వెలువడింది.

యాదవులు కష్టపడి పని చేస్తారు. గొర్రెలను మేకలను మేపడానికి వీరు చెట్ల వెంట, గుట్టలవెంట, అడవులవెంట ఎండ చలి వర్షం అనుకోకుండా తిరగాలి. ఇల్లు, వాకిలి వదలిపెట్టి, పెళ్లాం బిడ్డలను వదిలిపెట్టి రాత్రనక పగలనక తిరగాలి. గొర్రెల పెంట, రొచ్చుల్లో పడుకోవాలి. చలికి, వానకు తట్టుకోవాలి. గొర్రెల మంద పొరపాటున చేలో మేస్తే రైతులతో తిట్లు, తన్నులు కాయాలి, అవమానాలు భరించాలి. ఇన్నింటికి ఓర్చుకోవడం మాటలు గాదు. దీనికి ఎంతో సహనం, ఓర్పు కావాలి. కష్టాన్ని సహించే గుణం అలవరచు కోవాలి. కొన్ని వందల సంవత్సరాలుగా పశు పాలనలో కష్టాలను సహిస్తూ యాదవులు రాటుదేలారు.

మిగిలిన దేశాల్లో బర్రె సాధుజంతువు గాదు. అడవి బర్రెలను సాధుజంతువులుగా మార్చి వాటి నుంచి కోట్ల ప్రజలు పాల అవసరాలను తీర్చింది యాదవులే. చలి నుంచి మానవ శరీరాలను రక్షించడానికి గొంగళ్లు తయారు చేసేది యాదవులే. గొర్రెలు, మేకలను పెంచి మాంసాన్ని సరఫరా చేసి ఆరోగ్యవంతమైన, బలమైన సమాజాన్ని తయారు చేసేది యాదవులే. ఉత్పత్తి సంస్కృతిలో యాదవులది అద్వితీయమైన పాత్ర. అసలు వారి వేషధారణ చూస్తేనే వారు పడే కష్టం తెలుస్తుంది. ఒక చేతిలో కర్ర, మరొక చేతిలో చెట్లు కొట్టడానికి గొడ్డలి లేదా కత్తి, భుజం మీద గొంగడి మొదలైనవి పట్టుకొని పంచెను గోచిలాగా చెక్కిన వీరి వేషధారణ చూడగానే యాదవుడు అనిపించుకునే విధంగా ఉంటుంది.

అమాయకులైన యాదవులు నీతి, నిజాయితీకి పెట్టింది పేరు. ఇతరులను మోసం చేయడం వీరి ఇంటవంట ఉండదు. అష్టకష్టాలు పడినాసరే ఆడిన మాటకు కట్టుబడి ఉంటారు. ఇతరుల సొమ్ము ఆశించరు. కష్టపడి పనిచేసి సంపాదించడమే వారికి తెలిసింది. మాటకు, నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి ఉండడం వీరి ప్రత్యేకత. సైద్ధాంతిక నిబద్ధత కారణంగానే ఎంతోమంది యాదవ యువకులు నక్సలైట్లులో చేరి పోయారు. పోలీసుల చేతిలో చనిపోతున్న నక్సలైట్లులో సగంమంది యాదవులే ఉంటారు.

యాదవుల్లో ఆశ్రితులను పోషించే లక్షణం బాగా కనిపిస్తుంది. మిగిలిన కులాల వారికి ఒకరు లేక ఇద్దరు ఆశ్రిత కులాల వారుంటారు. బ్రాహ్మణులకు విప్రవినోదులు, కోమట్లకు వీరముష్టివారు, రెడ్లకు పిచ్చుకగుంట్లు మొదలైన విధంగా



ఒక్కొక్క కులానికి ఒక్కొక్క ఆశ్రితకులం ఉంది. కాని యాదవులకు గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, మందెచ్చులవారు, తెరచీరలవారు, బైకాని వారు మొదలైన అనేకులు ఆశ్రితులుగా ఉన్నారు. వీరు నిర్ణీత కాలంలో అంటే రెండు సంవత్సరాలకు ఒకసారి గానీ, మూడు సంవత్సరాలకు ఒకసారి గానీ యాదవులున్న గ్రామాలకు వెళ్లి వారి కులకథలను గానం చేసి వారి నుంచి ధనధాన్యాలను గానీ, జీవాలను గానీ బహుమానంగా స్వీకరిస్తారు. ఈ ఆశ్రిత కులాలవారిని యాదవులు తమ ఆడపడుచుగా భావించి వారికి భోజనం, ఉండడానికి వసతి కల్పించి ఎంతో మర్యాదగా, ప్రేమగా, అభిమానంగా చూస్తారు. మిగిలిన కులాలవారిలో ఈ ఆశ్రిత వ్యవస్థ దాదాపుగా నశించింది. అంటే దాతృకులాలవారు తమ ఆశ్రిత కులాల వారిని పట్టించుకోకుండా వారిని ఆదరించకుండా, వారికి ఆర్థిక సాయం చేయకుండా ఉండడంచేత ఆయా ఆశ్రిత కులాల వారు కులకథలు చెప్పడం మానివేసి వేరే వృత్తులు చేసుకుంటున్నారు. గొల్లసుద్దుల వారు, పొడపోతులవారు, మందెచ్చులవారు, తెరచీరలవారు, బైకాని వారు మొదలైన ఆశ్రితులు ఇప్పటికీ యాదవులను దర్శించి వారి కులకథలు చెప్పి వారు చేసే ఆర్థిక సాయంతో జీవిస్తున్నారు. "వీళ్లు ఊర్లోకి వస్తే యాదవుల వాడలన్నీ సందడిగా ఉంటాయి. యాదవకుల సంస్కృతి, యాదవ రాజులను, గంగదేవి, కాటమరాజు, ఒంటికొమ్ముబొల్లావు, అక్కమాంకాళి, మల్లన్న, బీరన్న, నలగామరాజు లాంటి అనేక కథలు చెబుతూ ఈ జానపద బిచ్చగాళ్లు యాదవులను తమ తల్లిదండ్రులుగా భావిస్తూ బతుకుతారు. బొమ్మలు నిలబెట్టడం, కొమ్ము ఊదడం, ఒగ్గు, కనక దప్పుల మోతలతో కథలు చెప్పడం లాంటి పనులతో బతికే వాళ్ల పోషకులు యాదవులే".[17] ఈ విధంగా యాదవులు ఇప్పటికీ తమ ఆశ్రిత కులాల వారిని చక్కగా పోషిస్తున్నారు.

**యాదవుల ఇంటిపేర్లు :** తెలుగు వారికి పేరుకు ముందు ఇంటిపేర్లుండడం ఒక ప్రత్యేకత. ఈయింటి పేర్లు సాధారణంగా ఊర్లపేర్లు అయి ఉంటాయి. కొన్ని ఊర్లపేర్లు ఇంటిపేరుగా ఉన్నవారు అన్ని కులాల్లోనూ ఉన్నారు. ఉదాహరణకు కోరాడ అనే ఊరుపేరును ఇంటిపేరుగా గలవారు యాదవుల్లోనూ బ్రాహ్మణుల్లోనూ మాల మాదిగ కులాల్లో ఉన్నారు. ఊర్లపేర్లు కాని ఇంటి పేర్లు గూడా ఎక్కువగానే ఉన్నాయి. ఇంటిపేర్లలో కొన్ని, కొన్ని కులాలకు మాత్రమే ప్రత్యేకమైనవి ఉన్నాయి. ఇలాంటి ఇంటిపేర్లను బట్టి వారి కులాన్ని చెప్పవచ్చు. "నేని" ఉత్తరపదంగా ఉండి పూర్వపదం వ్యక్తి పేరును కలిగిన ఇంటిపేరు సాధారణంగా కమ్మవారిలో ఉంటుంది. ఉదాహరణకు సూరపనేని, అక్కినేని, పర్వతనేని మొదలైనవి ఇలాంటివి. అలాగే

రెడ్లకు మాత్రమే పరిమితమైన ఇంటిపేర్లు కొన్ని ఉన్నాయి.

అలాగే తెలుగునాట యాదవులకు మాత్రమే పరిమితమైన ఇంటిపేర్లు కొన్ని ఉన్నాయి. "బోయిన" అనే పదం ఉత్తరపదంగా ఉండి వ్యక్తిపేరు పూర్వపదంగా ఉన్న ఇంటిపేర్లు యాదవుల్లో ప్రధానంగా కనిపిస్తున్నాయి. ఉదాహరణకు మర్రెబోయిన, ముద్దరబోయిన, చినబోయిన, రామనబోయిన, చిట్టిబోయిన, గుంటు బోయిన మొదలైనవి ఇలాంటివి. ఇలాంటి పదాల్లో మర్రె, ముద్దర, చిన, రామన, చిట్టి, గుంటు అనేవి వ్యక్తులను సూచించే పేర్లు. ఉత్తరపదమైన బోయిన అనేది వారి వృత్తిని సూచిస్తుంది. 'బోయిన' అనే పదం 'బోయడు' పదం నుంచి వచ్చింది. బోయడు > బోయన > బోయినగా మారింది. బోయడు అనేది పూర్వకాలంలో దేవాలయాలను ఆశ్రయించి జీవించిన ఒక వృత్తి. పూర్వకాలంలో దేవాలయాలను ఆశ్రయించి కొన్ని వృత్తులవారు జీవించేవారు. వాటిలో బోయడు వృత్తి ఒకటి. గతంలో కొన్ని వృత్తులు కొన్ని కులాలకు పరిమితంగా ఉండేవి. అలాగే బోయడు వృత్తిలో యాదవులుండే వారు. అందువల్లనే రాయలసీమలో గొల్ల కులానికి చెందిన పురుషులను గొల్లబోయడు అని గతంలో పిలిచేవారు. భక్తులు తమ మొక్కుబడిని అనుసరించి ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు మొదలైన పాలు ఇచ్చే జంతువులను దేవాలయానికి దానం చేసేవారు. వాటిని బోయడు స్వీకరించి వాటిని సాకుతూ వాటివల్ల వచ్చే ఆదాయాన్ని అనుభవిస్తూ దేవాలయానికి అవసరమైన పాలు పెరుగు నెయ్యి మొదలైన వాటిని సరఫరా చేసేవాడు. ఈవిషయాన్ని తెలిపే శాసనాలు చాల ఉన్నాయి. ఉదాహరణకు కింది శాసనాన్ని పరిశీలించుదాం.

"1. స్వస్తి శ్రీ శక వరషం
2. బులు 1173 అగు నేంటి
3. విరోధికృత్ సంవత్సర కా
4. ర్తి ˘కపర్వ˘ నిమిత్తమున శ్రీ త్రి
5. పురాంత్తక దేవరకు మేడపికిల్ల నూంక సె
6. ట్టి తమ తంఁడ్రి భూమిసెట్టికిం దమ తల్లి దు
7. గ సానికిం దమ్మువుగాను అఖండదీపము
8. నకుం బెట్టిన మోదాలు 25 వీనిం జేకొ
9. ని ఎవురము ఎరబోయుండు నిత్యమా
10. నెండు నెయి తన పుత్రాను పవుత్రికము
11. ఆచంద్రార్కము నడపం గలవాడు".[18]



పైశాసనం శాలివాహన శకం 1173 వసంవత్సరం అంటే క్రీ.శ. 1251వ సంవత్సరం నాటిది. ఇందులో కార్తీక పర్వదినం దినం సందర్భంగా మేడపికిల్ల నూంకసెట్టి అనే వ్యక్తి తన తల్లిదండ్రులైన దుగసాని భూమిసెట్టిల ధర్మార్థం త్రిపురాంతకేశ్వరునికి అఖండదీపానికి గాను 25 ఆవులను దానం చేసినట్లు, ఆదానాన్ని ఎవురము ఎరబోయడు అనే బోయడు గ్రహించినట్లు, అతడు, అతని సంతతి ప్రతి రోజు దేవుని దగ్గర వెలిగించే అఖండ దీపానికి మానెడు నెయ్యి సరఫరా చేయాలని చెప్పబడింది. ఈశాసనం త్రిపురాంతక దేవాలయ శాసనములు అనే గ్రంథంలోనిది. ఈగ్రంథంలో ఇలాంటి శాసనాలు చాల ఉన్నాయి. ఈశాసనంలో చెప్పబడిన మోదాలు అనే పదానికి ఆవులు అని అర్థం.

ఈబోయడు వృత్తిలో 99.9 శాతం యాదవులుండేవారు. మిగిలిన .1 శాతం కమ్మవారు, కాపులు ఉండేవారు. అందువల్ల యాదవుల్లో కనిపించే ఇలాంటి ఇంటిపేర్లు కమ్మవారిలోనూ, కాపుల్లోనూ చాల అరుదుగా ఉన్నాయి.

యాదవుల్లో ఉన్న ఇలాంటి ఇంటిపేర్లు ఒక పద్ధతిలో కన్పిస్తున్నాయి. బోయిన పదానికి ముందు ఉండే వ్యక్తినామసూచకమైన పదం ఒక క్రమపద్ధతిలో కనిపిస్తూ ఉంది. ఉదాహరణకు వ్యక్తినామ సూచకాలైన ఈపదాలు రెండు అక్షరాలతో ఉన్నవి కొన్ని , మూడు అక్షరాలతో ఉన్నవి కొన్ని ఉన్నాయి. వీటిలో రెండు అక్షరాలతో ఉన్న వాటికి మర్రెబోయిన, చిట్టిబోయిన, అల్లబోయిన, పిన్నెబోయిన, దాలబోయిన, గుంటుబోయిన మొదలైనవి ఉదాహరణలు. మూడు అక్షరాలతో ఉన్నవాటికి ముద్దర బోయిన, బుసనబోయిన, రామనబోయిన మొదలైనవి ఉదాహరణలు.

వ్యక్తినామాన్ని సూచించే రెండు అక్షరాలతో ఉన్న పదాల్లో కూడా ఒక క్రమపద్ధతి కనిపిస్తుంది. ఈపదం కొన్ని ఇంటిపేర్లలో అకారాంత ద్విత్వంగా, కొన్నింటిలో ఇకారాంత ద్విత్వంగా, కొన్నింటిలో ఎకారాంత ద్విత్వంగా, కొన్నింటిలో ఉకారాంత ద్విత్వంగా కనిపిస్తూ ఉంది. అకారాంత ద్విత్వానికి అల్లబోయిన, చిన్నబోయిన, చిట్టబోయిన, చెన్నబోయిన, తట్టబోయిన, అడ్డబోయిన మొదలైనవి ఉదాహరణలు. ఇకారాంత ద్విత్వానికి చిట్టిబోయిన, పెద్దిబోయిన, మిద్దిబోయిన, పిన్నిబోయిన, మల్లిబోయిన, మద్దిబోయిన, పల్లిబోయిన, కొల్లిబోయిన, ఇద్దిబోయిన, రెడ్డిబోయిన మొదలైనవి ఉదాహరణలు. ఎకారాంత ద్విత్వానికి మర్రెబోయిన, కన్నెబోయిన, నన్నెబోయిన, కట్టెబోయిన, బొడ్డెబోయిన, పొన్నెబోయిన, మట్టెబోయిన మొదలైనవి ఉదాహరణలు. ఉకారాంత ద్విత్వానికి బొడ్డుబోయిన, చెన్నుబోయిన మొదలైనవి ఉదాహరణలు.

వ్యక్తి నామాన్ని సూచించే రెండు పదాల అక్షరాలతో ఉన్న పదాల్లో మొదటి పదంలోని మొదటి అక్షరం దీర్ఘంగా ఉన్నవి కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు మూర బోయిన, దాలిబోయిన, శేకుబోయిన, ఓయిబోయిన, బోనబోయిన, నారబోయిన, దాలబోయిన, సానబోయిన, దేశబోయిన, మేడబోయిన, గోనబోయిన, దానబోయిన, దారబోయిన, నీలబోయిన మొదలైనవి ఇలాంటివి. రెండు అక్షరాలతో ఉన్నవాటిలో రెండవ అక్షరం అకారాంతంగా ఉన్నవి కొన్ని, ఇకారాంతంగా ఉన్నవి కొన్ని, ఉకారాం తంగా ఉన్నవి కొన్ని, బిందుపూర్వకంగా ఉన్నవి కొన్ని, ' ర ' వత్తుతో ఉన్నవి కొన్ని ఉన్నాయి. అకారాంతంగా ఉన్నవాటికి మిరబోయిన, చినబోయిన మొదలైనవి ఉదా హరణలు. ఇకారాంతానికి కరిబోయిన, ఉకారాంతానికి గైరుబోయిన, పెనుబోయిన మొదలైనవి, బిందుపూర్వకంగా అంటే సున్నతో ఉన్న వాటికి గుంటుబోయిన, గండి బోయిన, కంచుబోయిన, గుండుబోయిన, గుండెబోయిన, దొంతుబోయిన, దండు బోయిన, గండబోయిన, కంగుబోయిన మొదలైనవి, 'ర' వత్తుతో ఉన్న వాటికి ముద్ర బోయిన, చిద్రబోయిన మొదలైనవి ఉదాహరణలు.

వ్యక్తినామాన్ని సూచించే మూడు అక్షరాలతో ఉన్న పదాల్లో కూడా ఒక పద్ధతి కనిపిస్తుంది. ఈపదాలు అకారాంతాలుగా కొన్ని, ఇకారాంతాలుగా కొన్ని ఉన్నాయి. బుసనబోయిన, దేవనబోయిన, నాగనబోయిన, చీదరబోయిన మొదలైనవి అకారాంతానికి ఉదాహరణలు. చవిడిబోయిన ఇకారాంతానికి ఉదాహరణ. వ్యక్తి నామాన్ని సూచించే మూడు అక్షరాలతో ఉన్న పదాల్లో మధ్య అక్షరం ద్విత్వంతో ఉన్నవి కొన్ని, బిందుపూర్వకంగా ఉన్నవి కొన్ని ఉన్నాయి. బొమ్మనబోయిన, అక్కర బోయిన, కొమ్మనబోయిన, అప్పనబోయిన, ముద్దరబోయిన,అల్లనబోయిన మొదలైనవి మధ్య అక్షరం ద్విత్వంతో ఉన్న వాటికి ఉదాహరణలు. పంపనబోయిన, పంపరబోయిన, గంగనబోయిన, పందరబోయిన మొదలైనవి మధ్య అక్షరం బిందుపూర్వకంగా ఉన్న వాటికి ఉదాహరణలు.

ఈవిధంగా తెలుగునాట యాదవుల ఇంటిపేర్లు ఒక క్రమపద్ధతిలో ఉన్నాయి. పైన చెప్పిన విధంగా తెలుగునాట యాదవుల జీవనస్థితిగతులున్నాయి.



## పాదసూచికలు

1. ఆరుద్ర రచనలు - ఆరుద్ర, పుట - 27.
2. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం, ముప్పాళ్ళ హనుమంతరావు, పుట 303
3. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 303.
4. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 304.
5. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
6. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
7. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
8. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
9. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
10. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
11. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
12. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
13. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 307.
14. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 308.
15. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి - రెండవ భాగం - పుట 308.
16. ఆంధ్రకీర్తి మాసపత్రిక , నవంబరు 1981వ సంచిక, పుట: 65
17. 'యాదవులు - చరిత్ర - సంస్కృతి - కులసంస్కరణ' అనే గ్రంథంలోని 'యాదవ సంస్కృతి - అభివృద్ధి' అనే వ్యాసం నుంచి, వ్యాసకర్త కాలువ మల్లయ్యగారు, పుట 32.
18. త్రిపురాంతక దేవాలయ శాసనములు, బి. ఎన్. శాస్త్రి, పుట: 86

# యాదవుల జానపద కళలు-స్వరూప స్వభావాలు- చరిత్ర

ఆంధ్రప్రదేశ్‌లోని యాదవులు చాలవరకు నిరక్షరాశ్యులైనప్పటికి వీరు ప్రసిద్ధి చెందిన పదకొండు జానపదకళలను పోషిస్తున్నారు. గొరవయ్యలు, సేవగరిడి, గంగిరెద్దులాట, ఒగ్గుకథ, తప్పెటగుళ్ళు, గొల్లసుద్దుల వారు, కొమ్ముల వారు, పొడపోతుల వారు, తెరచీరల వారు, మందెచ్చుల వారు, బైకాని వారు అనే పదకొండు వీరికి సంబంధించిన జానపద కళలు.

గొరవయ్యలు శైవభక్తి ప్రధానమైన జానపద కళ. అంతేగాదు ఇది నృత్య ప్రధానమైనది. దీన్ని కర్నూలు, అనంతపురం జిల్లాల్లో ఉన్న కురవగొల్లలు ప్రదర్శిస్తారు. ఈ కళను ప్రదర్శిచేటప్పుడు వీరు శివునికి సంబంధించిన పాటలను పాడుతారు. సేవగరిడి వైష్ణవ భక్తి ప్రధానమైన జానపద కళ. ఇది కథాఖ్యాన ప్రధానమైన కళ. దీన్ని కళింగాంధ్ర ప్రాంతంలోను, తూర్పుగోదావరి జిల్లాలోను ఉన్న ఆలగొల్లలు ప్రదర్శిస్తారు. ఈ కళా ప్రదర్శన సందర్భంగా వీరు విష్ణువు దశావతార కథలను గానం చేస్తారు.

గంగిరెద్దులాట, ఒగ్గుకథ, తప్పెటగుళ్లు, ఈ మూడు భక్తి, వినోదం రెండూ ఉన్న ఉభయ ప్రధానమైన జానపదకళలు. గంగిరెద్దులాట ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడుతున్న జానపదకళ. ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాల్లోను గంగిరెద్దుల వారున్నారు. వీరందరూ పూజగొల్ల శాఖకు చెందిన యాదవులు. గంగిరెద్దుల వారు అనేకరకాల జానపద గేయాలను, కథాగేయాలను పాడుతారు.

ఒగ్గుకథ తెలంగాణా ప్రాంతంలో ఉన్న కురమ, పాకనాటి, ముష్టి, ఎర్ర మొదలైన శాఖలకు చెందిన గొల్లలు ప్రదర్శిస్తారు. ముఖ్యంగా కురుమ గొల్లలు దీన్ని ప్రదర్శిస్తారు. ఇది కథాఖ్యాన ప్రధానమైన జానపదకళ. ఒగ్గుకథకులు మల్లన్నకథ, బీరప్ప కథలతోపాటు అనేక కథలను చెబుతారు.

తప్పెటగుళ్లు కళను కళింగాంధ్ర ఉభయ గోదావరి జిల్లాల్లో ఉన్న ఆల గొల్లలు ప్రదర్శిస్తారు. ఇది నృత్య ప్రధానమైన జానపద కళ. ఈ కళాకారులు అనేక రకాల కథాగేయాలను పాడతారు.

గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, తెరచీరల వారు, మందెచ్చులవారు, బైకాని వారు - ఈ ఆరు కులకథాఖ్యాన కళలు. ఈ కళాకారులు యాదవ రాజుల కథలైన కాటమరాజు కథలను చెబుతారు. వీరిలో గొల్లసుద్దుల కళను తెలంగాణ, రాయలసీమ జిల్లాల్లోని ఎర్రగొల్లలు ప్రదర్శిస్తారు. కొమ్ములవారు చెప్పే



కథలను కొమ్ముకథలు అంటారు. ఈ కథలను కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, రాయలసీమ జిల్లాల్లోని మాదిగ కులస్థులు చెబుతారు. పొడపోతుల వారు కళింగాంధ్ర ప్రాంతంలో ఉన్నారు. వీరు జంగం కులస్థులు. తెరచీరల వారు విశాఖ పట్నం జిల్లాలో ఉన్నారు. వీరు పూజగొల్ల శాఖకు చెందిన యాదవులు. మందెచ్చుల వారు బుడగజంగం కులస్థులు. వీరు తెలంగాణా ప్రాంతంలో ఉన్నారు. బైకాని వారు ఎర్రగొల్ల శాఖకు చెందిన యాదవులు. వీరు వరంగల్ జిల్లాలో ఉన్నారు.

నేను పరిశోధనకు స్వీకరించిన పై పదకొండు జానపద కళల స్వరూప స్వభావాలను గురించి ఈ అధ్యాయంలో వివరించే ప్రయత్నం చేస్తాను.

## గొరవయ్యలు - స్వరూప స్వభావాలు - చరిత్ర :

గొరవయ్యలు ఆంధ్రదేశంలో కర్ణాటకకు సరిహద్దుగా ఉన్న కర్నూలు, అనంతపురం జిల్లాల్లో ఎక్కువగా ఉన్నారు. వీరు కురువ కులానికి చెందినవారు. "వీరికి గొరవలు, గురవలు, గురవయ్యలు, గురప్పస్వాములు, మల్లయ్యస్వాములు, మల్లయ్య కుక్కలు, మల్లయ్య దేవత కుక్కలు అనే వేరువేరు పేర్లు వేరువేరు ప్రాంతాల్లో వున్నాయి".[1] వీరు శివుని భక్తులు. శివుని అవతారమైన మైలారు స్వామిని ఇష్టదైవంగా కొలుస్తారు. మల్లారుస్వామినే మల్లయ్యస్వామి అని కూడా అంటారు. ఆంధ్రదేశంలోని గొరవయ్యలు కర్నూలు జిల్లాలో ఆలూరుకు దగ్గరగా వున్న గట్టు మల్లయ్యకొండ పుణ్యక్షేత్రంలో వున్న మల్లయ్యస్వామిని ఇష్టదైవంగా పూజిస్తారు. శ్రీశైలం మల్లేశ్వరస్వామిని కూడా పూజిస్తారు.

అనంతపురంజిల్లా, ఉరవకొండ నివాసి, గొరవయ్య అయిన గొరవ నాగన్న గారి దగ్గరనుంచి నేను గొరవయ్యలకు సంబంంధించిన విషయాలను సేకరించాను.

గొరవయ్యలు పూజా కార్యక్రమాల్లో నృత్యం చేస్తూ మైలారు స్వామికి సంబంధించిన గేయాలను పాడతారు. గొరవయ్యలు దాదాపుగా నిరక్షరాస్యులు, జానపదులు. అందువల్ల వీరిని ఈనాడు నృత్య ప్రధానమైన జానపద కళాకారులుగా పరిగణిస్తున్నారు. వీరిది భక్తి ప్రధానమైన జానపద కళ. ఈ కళ శైవ సంప్రదాయానికి చెందినది. ఈ కళ ఆంధ్రదేశంలో కర్నూలు, అనంతపురం, కడప జిల్లాల్లో మాత్రమే కనిపిస్తుంది. చిత్తూరు ప్రాంతంలో కూడా కొంతమంది గొరవయ్యలు వున్నారు. ఈ ప్రాంతంలో వీరిని "మల్లయ్య కుక్కలు" అని పిలుస్తారు. అంటే ఈ కళ ఆంధ్రదేశంలో రాయలసీమ ప్రాంతానికి మాత్రమే పరిమితమైనది. గొరవయ్యలందరూ పురుషులే. వీరిలో స్త్రీలు ఎవ్వరూ వుండరు. అంటే ఈ కళలో పురుషులు మాత్రమే పాల్గొంటారు. గొరవయ్యల్లో బాలురు కూడా వుంటారు. గొరవయ్యలు నృత్యం చేసే సందర్భంలో మైలారుస్వామికి

సంబంధించిన పాటలను పాడతారు. అందువల్ల ఇది సాహిత్యం ఉన్న కళ కోవకు చెందుతుంది. గొరవయ్యలు తమ నృత్యగానాన్ని పగలు, రాత్రి అని తేడా లేకుండా అన్నివేళలా ప్రదర్శిస్తారు. ఆంధ్రదేశంలోని గొరవయ్యలందరూ కురువకులానికి చెందినవారే. అందువల్ల ఈ కళ వంశపారంపర్యంగా ఒక కులానికి మాత్రమే సంబంధించినది.

"గొరవ" శబ్దం "కురువ" శబ్దం నుంచి వచ్చిందని చెప్పవచ్చు. గొరవయ్య లందరూ కురువ కులానికి చెందినవారు. కులవాచకమైన కురువ > కొరవ > గొరవ గా పరిణామం చెందిందని చెప్పవచ్చు. గొరవయ్యలు అతి ప్రాచీనకాలం నుంచి ఉన్నట్లుగా పాల్కురికి సోమనాథుడు మొదలైన కవుల ప్రయోగాలను బట్టి తెలుస్తుంది. కర్ణాటకలో వీరిని "గొరగలు" అని పిలుస్తారు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోని మూడవ ఆశ్వాసంలో గొరగల ప్రసక్తి ఉంది. కన్నప్ప కథలో తిన్నడు శివుణ్ణి -

"గొరగలుమ్మెత్త పత్తిరి బూజ సేయ- మరులెత్తి వచ్చితోయురుతరాటవికి"[2]

అని ప్రశ్నిస్తాడు. అలాగే పంచమాశ్వాసంలో "ముసిడి చౌడప్ప కథ"లో -

"డిగు డిగు గొరగ నాకిగవడితింక- నగవు గాదిచట నున్నను సయిరింప"[3]

అని సోమన గొరగ శబ్దాన్ని ప్రయోగించాడు. నన్నెచోడుడు తన కుమార సంభవంలో "గొఱగ, గొరగ" శబ్దాలను ప్రయో గించాడు. కృతకముని కుమారుడు పార్వతితో శివుని అధిక్షేపిస్తూ పలికే సందర్భంలో

"గొఱగ గలుచుగా కాతని గోరి తపము- సేసెదట గౌరి నీవెంత చేట్ల పురువో"[4]

అని గొఱగ శబ్దాన్ని ప్రయోగించాడు. అలాగే అదే సందర్భంలోనే -

"పులి గూడు దిండి గొరగం
గలిచియు నోచెల్లయింత గల్పించెదు శ్రీ
గల వానికి దగిన పురుషుం
గలిచిన నీకన్నుబొమ్మ యెగ యుదరుదనుమా"[5]

అని మరొక చోట కూడా గొరవ శబ్దాన్ని ప్రయోగించాడు.

శ్రీనాథుడు 'కాశీఖండం'లో

"గొరగయై మైలారు గొనియాడు నొకవేళ- నొసలిపై బండారు పసుపు దాల్చి"[6]

అని గొరగ శబ్దాన్ని ప్రయోగించాడు.

క్రీడాభిరామ కర్త మైలారుభటుల సాహసకృత్యాలను వర్ణించే సందర్భంలో -



"వీరు మైలార దేవర వీర భటులు
గొండ్లి యాడించు చున్నారు గొరగ పడుచు
నాడు చున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టిక సీలంత గాని లేదు"[7]

అని గొరగ శబ్దాన్ని ప్రయోగించాడు. ఈ విధంగా ప్రాచీన కవులు చాలమంది గొరగ శబ్దాన్ని ప్రయోగించారు. దీన్నిబట్టి పాల్కురికి సోమనకు పూర్వం నుంచే గొరవలు వున్నట్లుగా స్పష్టమౌతుంది.

కురవ కులంలో గొరవయ్యలు తయారు కావడం ఒక సంప్రదాయంగా వస్తూ వుంది. కురువ కుటుంబంలో మొదటి కొడుకు గానీ చివరి కొడుకు గానీ గొరవయ్యగా మారాలనే సంప్రదాయం ఉంది. ఈ సంప్రదాయాన్ని మొన్నమొన్నటి వరకూ కురువ కులస్థులందరూ పాటించారు. ఇలా గొరవయ్యగా తయారయ్యే ప్రక్రియను "గొరవ దీక్ష" అని అంటారు. ఈ గొరవ దీక్షను కురువ కులస్థులు గొప్ప శుభకార్యంగా భావించి ఘనంగా చేస్తారు. కుటుంబంలోని పెద్దకొడుకు గానీ లేదా చిన్నకొడుకు గానీ గొరవ దీక్ష స్వీకరిస్తారు. సాధారణంగా పెద్దకొడుకు గొరవ దీక్షను స్వీకరించడం జరుగుతుంది. ఏదైనా కారణంచేత పెద్దకొడుకు స్వీకరించకపోతే చిన్నకొడుకు స్వీకరిస్తాడు.

కురవ కులస్థులు ఐదు లేదా పది పంద్రెడేండ్ల వయసులో బాలునికి గొరవ దీక్ష ఇప్పిస్తారు. కుటుంబ యజమాని తన కుమారునికి గొరవ దీక్ష యిప్పించాలని నిర్ణయించి, ఆ విషయాన్ని గణాచారికి తెలియజేస్తాడు. గణాచారి గొరవదీక్షకు ఒక మంచి రోజు నిర్ణయిస్తాడు. కుటుంబ యజమాని కొత్తగుడ్డలో బండారు, (పసుపు) ఒక రూపాయి ముడుపు కట్టి దాన్ని కొంతమంది గొరవయ్యలకు ఇచ్చి "మా ఇంట్లో గొరవయ్యను చేస్తున్నాము. మీరు వచ్చి గొరవయ్యను తయారు చేయాలి" అని ఆహ్వానిస్తాడు. కుటుంబ యజమాని తన ఆర్థిక స్థోమతను బట్టి ఎంతమంది గొరవ య్యలనైనా పిలవవచ్చు. అతని ఆహ్వానాన్ని మన్నించి గొరవయ్యలు, గణాచారి కలిసి వస్తారు. నిర్ణయించిన రోజు కంటే ముందురోజే ఇంటి యజమాని తన ఇంటిని అలికి, పూసి శుభ్రం చేసి ఇంటి ముందు పందిరి వేసి ఆవుపేడతో కళ్ళాపు చల్లి ముగ్గులు వేస్తారు. మామిడాకులతో తోరణాలు కడతారు. గొరవయ్యలు రాగానే ఇంటి యజ మాని వారి కాళ్ళు కడిగి ఇంటిలోకి ఆహ్వానిస్తాడు. అప్పుడు గొరవయ్యలు తమ వేష ధారణ చేసుకుంటారు. వీరి వేషధారణ ప్రత్యేకంగా వుంటుంది. తలమీద ఎలుగు బంటి చర్మంతో చేసిన టోపీని ధరిస్తారు. ఎలుగుబంటి చర్మం లభించకపోతే నల్ల

కంబడితో చేసిన టోపీని ఉపయోగిస్తారు. అలాగే నల్లకంబడితో చేసిన నిలువుటంగీని వేసుకుంటారు. అంగీ మీద పులి చర్మాన్ని కోటులాగా వేసుకుంటారు. పులి చర్మం లభించక పోతే పులి చర్మం లాంటి గుడ్డతో కోటును తయారు చేసుకుంటారు. కోటు పైన నడుముకు 'కాయజెట్టి" కట్టుకుంటారు. మెడలో గవ్వల పట్టి (గవ్వల దండ) ఉంటుంది. కుడిచేతిలో దమరుకం, ఎడమ చేతిలో పిల్లనగ్రోవి ఉంటాయి. దోణి (చిన్న పాత్ర లాంటి వస్తువు), త్రిశూలం ధరిస్తారు. నడుముకు బండారు సంచి (పసుపు వేసుకొనే సంచి) ఉంటుంది. కాళ్ళకు గజ్జలు కట్టుకుంటారు. ముఖానికి వీబూది పూసుకొని బండారుబొట్టు లేదా కుంకుమబొట్టు పెట్టుకుంటారు.

గణాచారి, ఇంట్లో విశాలమైన ప్రదేశంలో నల్లకంబడిని చతురస్రాకారంగా మడిచి కింద పరుస్తాడు. దాని మీద తెల్ల పిండితో ముగ్గులు వేసి, ఆ ముగ్గు మీద పసుపు, కుంకుమను వేస్తాడు. ఇలా తయారు చేసిన దాన్ని సింహాసనం అంటారు. ఈ సింహాసనానికి తూర్పు వైపు సూర్యుని, పడమర వైపు చంద్రుని, ఉత్తరం వైపు సిద్దేశ్వరుని దక్షిణం వైపు చౌడేశ్వరుని పిండితో వేసి తూర్పు వైపున గౌరవయ్య దోణిని, పడమర వైపున ఒక చెంబును ఉంచుతాడు. దోణిలో పాలు, పెరుగు, తేనె, నెయ్యి, అరటిపళ్ళు వేస్తారు. గణాచారి ఆ తరువాత పూజ చేయడం ప్రారంభిస్తాడు. గౌరవయ్యలు పూజాస్థలం చుట్టూ కూర్చుంటారు. పూజ అయిపోయిన తరువాత చుట్టూ ఉన్న గౌరవయ్యలు తమ నడుమకు కట్టుకొన్న సంచిలో నుంచి బండారును తీసుకొని సింహాసనం మీద చల్లుతూ శివుని మీద, విఘ్నేశ్వరుని మీద దండకాలు చదివి, ఆ తరువాత సింహాసనం చుట్టూ తిరుగుతూ కుడిచేతిలో ఉన్న దమరుకాన్ని, ఎడమ చేతిలో ఉన్న పిల్లనగ్రోవిని వాయిస్తూ నృత్యం చేస్తారు. కొంతమంది గౌరవయ్యలు ఈశ్వరునికి సంబంధించిన భక్తి పాటలు పాడతారు. ఇదంతా అయిపోయిన తరువాత గౌరవయ్యలు సింహాసనం చుట్టూ మోకాళ్ల మీద కూర్చొని "భౌ భౌ" అంటూ కుక్క లాగా మొరుగుతారు. ఆ తరువాత గణాచారి, ఇంటి యజమాని గౌరవయ్యల అనుమతిని పొంది పాలు తాగుతారు. గౌరవయ్యలు కుక్కల్లాగ భౌ భౌ మని అరుస్తూ దోణిలో వున్న పాలు, పెరుగు, తేనె మొదలైన వాటిని నోటితో తాగుతూ కుక్కలు కాట్లాడు కున్నట్లుగా కాట్లాడుకుంటారు. ఇలా కాట్లాడుకుంటూ పాలు తాగే సమయంలో ఒక గౌరవయ్యను మల్లయ్యస్వామి పూనుతాడు. గణాచారి పూనకం వచ్చిన గౌరవయ్య నోట్లో బండారు వేసి నిమ్మకాయలను కోస్తాడు. దానితో మెల్లగా పూనకం తగ్గి గౌరవయ్య మామూలు స్థితికి చేరుకుంటాడు. ఇప్పటి వరకూ జరిగిన ఈ తంతును 'గౌరవయ్య పూజ' అంటారు.



ఈ గౌరవయ్య పూజ అయిన తరువాత గణాచారి కొత్త గౌరవయ్యను తయారు చేసే ప్రక్రియను ప్రారంభిస్తాడు. గణాచారి మొదట అక్కడున్న భక్తులందరి అనుమతి తీసుకొని తాను తయారు చేసి తెచ్చిన గవ్వలపట్టీని (గవ్వలదండ) కొత్త గౌరవయ్య మెడలో వేస్తాడు. తరువాత కొత్త గౌరవయ్య చెవిలో –

"ఆచారం అనాచారం చెయ్యకూడదు– కులవృత్తికి ద్రోహం చెయ్యకూడదు
ఇతరులను మోసం చెయ్యకూడదు– అబద్ధం చెప్పకూడదు"

అని నీతుల లాంటి మాటలను చెబుతాడు. ఇలా చెప్పడాన్ని "మంత్రోపదేశం" చేయడం అంటారు. ఆ తరువాత గణాచారి కొత్త గౌరవయ్యకు నల్లకంబడితో తయారు చేసిన నిలువుటంగీని ధరింప జేస్తాడు. నడుముకు బండారు సంచిని కడతాడు. ఎలుగుబంటి చర్మంతో చేసిన టోపీని తలపై పెడతాడు. దమరుకం, పిల్లనగ్రోవి, త్రిశూలం ఇస్తాడు. ఇలా వేషధారణ పూర్తైన తరువాత గణాచారి కొత్త గౌరవయ్యతో సింహాసనం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ చేయించి గౌరవయ్యలు తాగగా దోణిలో మిలిగిపోయిన పాలను కొత్త గౌరవయ్యతో తాగిస్తాడు. తరువాత కొత్త గౌరవయ్య ముందుగా గణాచారికి, తరువాత గౌరవయ్యలకు ఆ తరువాత అక్కడున్న పెద్దలకు నమస్కరిస్తాడు. దీనితో గౌరవదీక్ష పూర్తి అవుతుంది. అప్పటి నుండి కొత్త గౌరవయ్యను అందరూ గౌరవయ్యస్వామి అని లేదా మల్లయ్యస్వామి అని పిలవడం ప్రారంభిస్తారు. ఆనాటి నుండి అతను తన ఊరిలో ఉన్న కురువ కులస్థులకు మిగిలిన మల్లారు స్వామి భక్తులకు గురువు అవుతాడు. పాత గౌరవయ్యలు కొత్త గౌరవయ్యను కొంతకాలం తమ దగ్గర ఉంచుకొని నృత్యం చేయడం, పాటలు పాడడం, దమరుకం, పిల్లనగ్రోవిని వాయించడంలో శిక్షణ ఇస్తారు. ఒకవేళ కొత్త గౌరవయ్య తండ్రి గౌరవయ్య అయితే తండ్రి దగ్గరే శిక్షణ పొందుతాడు. ఆనాటి నుంచి మిగిలిన గౌరవయ్యలతోపాటు భిక్షాటన చేస్తూ ఊర్లు తిరుగుతూ భక్తులు చేసే పూజా కార్యక్రమాల్లో పాల్గొంటూ గౌరవయ్యగా మంచి శిక్షణ పొందుతాడు. శిక్షణ పూర్తి అయిన తరువాత భక్తుల ఇళ్ళలో జరిగే ధార్మిక కార్యక్రమాల్లో పాల్గొంటూ జీవనం సాగిస్తాడు.

కొంతమంది కురువ కులస్థులు గౌరవదీక్షను గట్టు మల్లయ్యకొండలోని మల్లేశుని గుడిలో చేయిస్తారు. ఇలా చేయించేటప్పుడు కూడా గణాచారి ఉండాలి. మొదట గౌరవయ్యగా మారబోయే బాలుణ్ణి అక్కడ వున్న కోనేరులో స్నానం చేయిస్తారు. కంబడితో సింహాసనాన్ని తయారుచేసి దానిమీద బాలుని కూర్చోబెడతారు. గణాచారి గవ్వల దండను బాలుని మెడలో వేస్తాడు. ఇలా గవ్వల దండను మెడలో వెయ్యడాన్ని "ముద్రాదానం" చేయడం అంటారు. తరువాత గణాచారి బాలుని చేత ఇలా ప్రమాణం చేయిస్తాడు.

"మన కుల వృత్తికి ద్రోహం చెయ్యకూడదు.

ఇతరులను మోసం చెయ్యకూడదు - అబద్ధం చెప్పకూడదు"

దీని తరువాత బాలునికి గొరవయ్య వేషం గణాచారి ధరింప జేస్తాడు. అప్పటి నుంచి అతను గొరవయ్యగా చెలామణి అవుతాడు. ఈగొరవ దీక్షను గమనిస్తే ఈనాటి అయ్యప్ప స్వామి దీక్ష గొరవవయ్యల దీక్ష నుంచి వచ్చిందని చెప్పవచ్చు.

ఆంధ్రదేశంలో కంటే కర్ణాటకలో గొరవ సంప్రదాయానికి మంచి ఆదరణ వుంది. అక్కడ ఉన్న మైలారు స్వామి భక్తులకు గొరవయ్యల మీద ఇప్పటికీ మంచి భక్తిగౌరవా లున్నాయి. అందువల్ల అక్కడ గొరవదీక్షను ఎంతో పవిత్రంగా నిర్వహిస్తారు. కర్ణాటకలో జరిగే గొరవ దీక్షా పద్ధతిని "మైలారన గొరవరు" అనే గ్రంథంలో డా॥ జి.శం. పరమ శివయ్యగారు వివరించినట్లుగా డా॥బి.రామాచార్యులుగారు వివరించారు.[8]

ఆంధ్రదేశంలో లాగానే కర్ణాటకలో కూడా కురువ కులస్థులు తమ పెద్ద కుమారునికి గానీ, చిన్నకుమారునికి గానీ బాల్యంలోనే గొరవదీక్ష ఇప్పిస్తారు. పుత్ర సంతానం లేనివాళ్ళు తమ అన్నదమ్ముల కుమారుల్లో ఒకరిని తీసుకొని గొరవదీక్ష ఇప్పిస్తారు. అసలు సంతానం లేనివారు తమకు సంతానం కలిగితే గొరవయ్యను తయారు చేస్తామని మొక్కుకుంటారు. గొరవ దీక్షా కార్యక్రమాన్ని దేవాలయంలో పెళ్ళి లాగా నిర్వహిస్తారు. గొరవదీక్ష రోజుకు ముందు రోజు నుంచే ఐదుగురు ముత్తైదువలు ఉపవాసం వుంటారు. దీక్ష రోజున ముత్తైదువలు స్నానం చేసి ఐదు చెంబులను కలశాలుగా చేసుకొని మంగళ వాద్యాలతో నదికి గానీ, చెరువుకు గానీ, బావికి గానీ ఊరేగింపుగా వెళ్తారు. ఈ ఊరేగింపులో గొరవయ్యలు నృత్యం చేస్తూ వెళతారు. ముత్తైదువలు చెంబులను తోమి నీళ్ళు నింపుకొని ఆ కలశాలకు పూలమాలలు వేసి పసుపు కుంకుమలతో పూజిస్తారు. దీన్నే గంగపూజ అంటారు. తరువాత వాటిని తీసుకొని ఊరేగింపుగా దేవాలయానికి వెళతారు. ఈ సందర్భంలో ఐదుగురు ముత్తై దువలకు పైన ఒక తెల్లటి వస్త్రాన్ని నలుగురు వ్యక్తులూ నాలుగు వైపుల పట్టుకోగా మధ్యలో ఒక వ్యక్తి ఒక కర్రతో గుడ్డను పైకిలేపి గొడుగుగా పట్టుకుంటాడు. అంతకు ముందే దేవాలయంలో నల్లకంబడితో సింహాసనాన్ని సిద్ధం చేసి వుంటారు. ఆ సింహాసనం మీద నాలుగు వైపుల, మధ్యలో మొత్తం ఐదు చోట్ల బియ్యాన్ని పోసి బియ్యం మీద ముత్తైదవులు తెచ్చిన నీటి కలశాలను ఉంచుతారు. ఆ కలశాల మీద కొబ్బరికాయలను పెడతారు. మధ్యలో వున్న కలశానికి మొదట పసుపు దారాన్ని చుట్టి తరువాత మిగిలిన కలశాలకు కూడా పసుపు దారాన్ని చుడతారు. నీటిని తెచ్చిన ఐదుగురు ముత్తైదువలకు పళ్ళు, తమలపాకులు, వక్కలు, బియ్యం ఇస్తారు.



గొరవదీక్షను చూడడానికి బాలుని బంధువులతో పాటు కులపెద్దలందరూ దేవాలయానికి వస్తారు. ఆ రోజు ఉదయమే బాలునికి శిరోముండనం చేయించి, స్నానం చేయించి దేవాలయానికి తీసుకొని వస్తారు. బాలుని కూర్చోబెట్టి, అతని ముందు కంచు పళ్ళెరాన్ని ఉంచి దానిమీద కలశాన్ని వుంచుతారు. ఐదుగురు ముత్తైదువలు బాలుని చేతికి నూనె రాసి సీకాయతో కడుగుతారు. తరువాత మిగిలిన బంధువులు కూడా కడుగుతారు. స్త్రీలు మంగళ గీతాలు ఆలపిస్తారు. తరువాత కొత్తగుడ్డను తెచ్చి పళ్ళెరంలో ఉంచి బాలునికి దిష్టి తీస్తారు. ఆ తరువాత కొత్త గుడ్డను అతని భుజం మీద వేస్తారు. బాలుడు అగరుబత్తీని చేతితో పట్టుకొని తన చుట్టూ తాను ప్రదక్షిణ చేస్తాడు. బాలుని ముఖానికి భుజాలకు, రొమ్ముకు విభూది పూసి నుదుట కుంకుమ పెడతారు. ఆవు పంచకాన్ని తాగిస్తారు. తరువాత గణాచారి బాలుని తన ఎదురుగా కూర్చోబెట్టుకొని గవ్వల దండను అతని మెడలో వేస్తాడు. గవ్వలదండను మెడలో వేసే ముందు ఆ ఊరి పెద్దలను పిలిచి "బసవన్నను విడుస్తున్నాను" అని అంటాడు. అక్కడున్న వారందరూ "విడువు, విడువు" అని చెబుతారు. అప్పుడు గణాచారి "గొరవయ్య ఎక్కడ మేసినా, తిరిగినా ఏం చేసినా ఊళ్ళోవాళ్ళు ఏమీ అనకూడదు" అని అనగానే అందరూ అలాగే, అలాగే అంటారు. గణాచారి "ఇతడు దేవుని శిష్యుడు, మైలారుదేవుని మహిమను ప్రచారం చేస్తూ జీవిస్తాడు. అందువల్ల అతణ్ణి అందరూ గౌరవించాలి అతని పోషణా భారాన్ని అందరూ వహించాలి సహక రించాలి" అని చెబుతాడు. ఆ తరువాత గణాచారి గవ్వలదండను బాలునిమెడలో వేస్తాడు. అప్పుడు అక్కడున్న వాళ్ళందరూ "శరణార్థి - శరణార్థి" అని అంటారు. తరువాత గణాచారి బాలునికి డమరుకం, దోణి, నాగబెత్తు, జోలె మొదలైనవి ఇస్తాడు. వచ్చిన బంధవులు ఎలుగు బంటి చర్మపు టోపీని, కంబడితో తయారుచేసిన నిలువుటంగీని ఇస్తారు. అప్పుడు గణాచారి బాలుని తల్లిదండ్రులను పిలిచి ఇతను ఎవరి కుమారుడని ప్రశ్నిస్తాడు. తల్లిదండ్రులు మీ కుమారుడే అని సమాధానం చెబుతారు. ఆ తరువాత గణాచారి కొత్త గురవయ్యల మధ్య ఇలా సంభాషణ సాగుతుంది.

గణాచారి : (గవ్వల పట్టీని చూపిస్తూ) ఇదేమి

బాలుడు : ఇది సర్పం

గణాచారి : అది కరుస్తుంది. కరిపించుకుంటావా

బాలుడు : కరిపించుకుంటాను

గణాచారి : గొరవయ్యను చూస్తే ఏమంటావు

బాలుడు : శరణార్థిని అని అంటాను

గణాచారి : మారి గుడిలోని వారికి అన్నం పెడతావా

బాలుడు : పెడతాను

ఇలా సంభాషణ జరిగిన తరువాత గణాచారి బాలుని దేవాలయంలో దేవుని విగ్రహం వద్దకు తీసుకొని వెళ్ళి సత్యాన్ని, న్యాయాన్ని, ధర్మాన్ని, నియమనిష్ఠలను వదిలిపెట్ట కూడదని పరోపకారిగా జీవించాలని ఉపదేశం చేసి అతని చేత ప్రతిజ్ఞ చేయిస్తాడు. దీనితో గొరవదీక్ష ముగిసినట్లవుతుంది. దీక్ష అయిపోయిన తరువాత అక్కడ వున్న గొరవయ్యలు భోజనానికి కూర్చుంటారు. తమ విస్తర్లలో వేసిన భోజన పదార్థాలలో కొంత భాగాన్ని ప్రసాదంగా కొత్త గొరవయ్య దోణిలో వేస్తారు. భోజనం చేసే ముందు గొరవయ్యలు మల్లేశ్వరా ! మైలారులింగా ! అని తమ ఇష్టదైవాన్ని తలచుకొని కొత్త గొరవయ్యను "పిల్లా పాపలు కలిగి వర్థిల్లాలి" అని దీవించి దమరుకం వాయిస్తారు. కొత్త గొరవయ్య ఆనాటి నుంచి ఐదురోజులు గానీ లేక పదిరోజులు గానీ భిక్షాటన చేస్తూ దోణిలో భుజిస్తూ జీవనం సాగించాలి.

పై అంశాలను పరిశీలిస్తే గొరవ సంప్రదాయంలో గొరవదీక్షకు ఒక ప్రముఖమైన స్థానం వుందని చెప్పవచ్చు. గొరవ దీక్ష తీసుకోకుండా గొరవయ్య వేషాన్ని ధరించ కూడదు.

**గొరవయ్యల వేషధారణ :** వీరి వేషధారణ ఆశ్చర్యాన్ని కలిగించేదిగా ఉంటుంది. అంతేగాకుండా ఆకర్షణీయంగా, విచిత్రంగా వుంటుంది.ఆంధ్రదేశంలోని గొరవయ్యల వేషధారణ ఇలా వుంటుంది. తలమీద ఎలుగుబంటి చర్మంతో చేసిన టోపీని ధరిస్తారు. ఎలుగుబంటి చర్మం లభించకపోతే నల్లకంబడితో చేసిన టోపీని ఉపయోగిస్తారు. భుజాల నుంచి పాదాల వరకు నల్లకంబడితో చేసిన నిలువుటంగీని వేసుకుంటారు. అంగీ మీద పులి చర్మం కోటులాగ వేసుకుంటారు. పులి చర్మం లభించకపోతే పులి చర్మం లాంటి రంగు గుడ్డతో కోటును తయారు చేసుకుంటారు. కోటు మీద నడుముకు కాయజెట్టీని కట్టు కుంటారు. మెడలో గవ్వలపట్టీ వుంటుంది. దమరుకం, పిల్లనగ్రోవి, దోణి, త్రిశూలం ఉంటాయి. నడుముకు బండారు సంచి వుంటుంది. కాళ్ళకు గజ్జలు కట్టుకుంటారు. ముఖానికి విభూదిని పూసుకొని బండారు లేదా కుంకుమను పెట్టుకుంటారు. సాధారణంగా ఆంధ్రదేశంలోని గొరవయ్యలందరూ ఇదే వేషాన్ని ధరిస్తారు. వీటిలో ఒక్కొక్క దాని గురించి కొంత వివరించ వలసి వుంది.

**టోపీ :** గొరవయ్యలు సాధారణంగా ఎలుగుబంటి చర్మంతో చేసిన టోపీని ధరిస్తారు. దీన్ని వీరు 'కిరీటం' అని కూడా అంటారు. ఇటీవల కాలంలో ఎలుగుబంటి చర్మం దొరకడం కష్టం కావడంవల్ల, ఒక వేళ దొరికినా ఖరీదు ఎక్కువగా ఉండడంవల్ల





గొరవయ్య వేషంతో నృత్యం చేస్తున్న గొరవ నాగన్న (ఉరవకొండ అనంతపురం జిల్లా)

గొరవయ్యలు నల్లకంబడితో తయారుచేసిన టోపీని ధరిస్తున్నారు. టోపీ మధ్యలో శివలింగం, శివలింగానికి ఒకవైపు త్రిశూలం మరొకవైపు శివుని చిహ్నాన్ని దేన్నైనా వేస్తారు. టోపీ పైభాగంలో రంగురంగుల కుచ్చులను కుట్టి అందంగా వుండేలా తయారు చేసుకుంటారు.

**గవ్వల పట్టీ :** గొరవయ్యలు మెడలో గవ్వల పట్టీని వేసుకుంటారు. గొరవదీక్షను ఇచ్చే సమయంలో గణాచారి జింక చర్మం మీద గానీ లేదా మందంగా తయారు చేసిన గుడ్డ మీద గానీ మూడు లేదా ఐదు గవ్వలను కుట్టి ఈ గవ్వల పట్టీని తయారు చేస్తాడు. అలా తయారు చేసిన దాన్ని గొరవ దీక్షాసమయంలో గణాచారి తన చేతులతో కొత్త గొరవయ్య మెడలో వేస్తాడు. అప్పటి నుండీ గవ్వల పట్టీని మెడలోనే వుంచుకోవాలి. దాన్ని తీయడానికి వీలులేదు.

**కంబడితో చేసిన నిలువుటంగీ :** కురవ కులస్థుల ముఖ్యవృత్తి గొర్రెలను కాయడం, గొర్రెల శరీరం మీది ఉన్నిని తీసి కంబళ్ళు తయారుచేసి అమ్మడం. గొర్రెల కాపరులైన కురవలు గొంగడిని భుజం మీద వేసుకొని తిరుగుతూ ఉంటారు. అందువల్ల కురవల జీవితంలో కంబడికి ముఖ్యమైన స్థానం వుంది. కురవ కులస్థులైన గొరవయ్యలు కూడా కంబడికి తమ జీవితంలో ముఖ్యమైన స్థానాన్ని ఇచ్చారు. తమ వస్త్రధారణలో భుజాల నుంచి పాదాలవరకూ ఉండేలాగా కంబడితో చేసిన నిలువు అంగీని వేసుకుంటారు. ఈ అంగీని గొరవయ్యలు స్వయంగా తయారు చేసుకుంటారు. అంతేగాకుండా కొందరు గొరవయ్యలు కంబడిని తమ భుజాలమీద అటూ ఇటూ వేసుకుంటారు. గొరవ దీక్షా సమయంలో తయారుచేసే సింహాసనం కూడా కంబడితోనే తయారౌతుంది. కంబడిని చతురస్రాకారంగా మడిచి సింహాసనాన్ని తయారు చేస్తారు.

**బండారు సంచి :** బండారు అంటే పసుపు. అయితే గొరవయ్యలు దాన్ని పసుపు అనరు. బండారు అని అంటారు. గొరవ సంప్రదాయంలో బండారుకు చాల ప్రాధాన్యత ఉంది. దీన్ని "అంగారు" అని "ఆగారు" అని కూడా పిలుస్తారు. వైష్ణవులకు తిరుచూర్ణం శైవులకు విభూది లాగా గొరవయ్యలకు బండారు చాల పవిత్రమైనది. గట్టుమల్లయ్య కొండ, శ్రీశైలం మొదలైన క్షేత్రాల్లో ఎక్కడ చూసినా బండారు కనిపిస్తుంది. గొరవయ్యలు భక్తులకు బండారు పెట్టి వాళ్ళు ఇచ్చే దక్షిణను తీసుకుంటారు. అందువల్ల వీరు గొరవయ్య వేషం ధరించి నప్పుడు బండారు వేసుకోవడానికి ఒక సంచిని నడుముకు కట్టుకుంటారు. కొందరు భుజానికి తగిలించుకుంటారు. సాధారణంగా ఈ సంచిని పులిచర్మంతో తయారు చేస్తారు. పులిచర్మం లభించకపోతే మందమైన బట్టతో సంచిని కుట్టుకుంటారు.

**దోణి :** దీన్నే "పానపాత్ర" అంటారు. అంటే తాగడానికి ఉపయోగించే పాత్ర. గొరవయ్యలు ఒగ్గసేవలో పాల్గొన్నప్పుడు భక్తులు ఈ పాత్రలో పాలు పెరుగు పళ్ళు మొదలైనవి వేస్తారు. వాటిని గొరవయ్యలు తాగుతారు. అందువల్లనే దీన్ని పానపాత్ర అంటారు. రాయలసీమలో ఎద్దులు, బర్రెలు, ఆవులు మొదలైన పశువులు నీళ్ళు తాగే తొట్టిని 'దోణి' అంటారు. గొరవయ్యలు కూడా పానపాత్రలో పోసిన పాలను మనుషుల లాగా చేతులతో పట్టుకొని పాలు తాగరు. దోణిని కిందపెట్టి కుక్కలు పాలు తాగినట్లుగా నోటితో తాగుతారు. సాధారణంగా ఈ దోణిని పంచ లోహాలుతో తయారు చేస్తారు. కొందరు చెక్కతో చేసిన దోణిని, మరికొందరు ఇత్తడితో చేసిన దోణిని ఉపయోగిస్తారు. అంటే గొరవయ్యల ఆర్థిక స్థోమతను బట్టి ఈ మూడింటిలో ఏదో ఒక దాన్ని ఉపయోగిస్తారు. గొరవయ్యలు బిక్షాటనకు వెళ్ళినప్పుడు కూడా భిక్షను దోణిలో వేయించు కుంటారు. శివుడు బ్రహ్మ కపాలాన్ని భిక్షా పాత్రగా స్వీకరించాడు. ఆ బ్రహ్మ కపాలానికి గుర్తుగా గొరవయ్యలు దోణిని వాడతారని గొరవయ్యలు చెబుతారు. పాలు తాగిన తరువాత దోణిని శుభ్రం చేసి వీరు నడుముకి తగిలించుకుంటారు.

**కాయజెట్టి :** కంబడితో చేసిన నిలువు అంగీ అటూ ఇటూ కదలకుండా ఉండడానికి గొరవయ్యలు ఈ కాయజెట్టీని కట్టుకుంటారు. ఇది నడుముకు కట్టుకొనే గుడ్డ. సాధారణంగా గొరవయ్యలు పసుపురంగు గుడ్డను కాయజెట్టిగా ధరిస్తారు. కొందరు వేరువేరు రంగుల గుడ్డలను కూడా కాయజెట్టీగా ధరిస్తారు.

**త్రిశూలం :** శివుని ఆయుధం త్రిశూలం. శివుడు మార్తాండభైరవుని రూపంలో మణిమాల్లా సురలను త్రిశూలంతో సంహరించాడు. అతని భక్తులైన గొరవయ్యలు అందుకు గుర్తుగా త్రిశూలాన్ని ధరిస్తారు. దీన్ని కొందరు గొరవయ్యలు నడుముకు కట్టుకుంటారు. మరికొందరు నాట్యం చేసేటప్పుడు త్రిశూలాన్ని పట్టుకొని నాట్యం చేస్తారు.

**డమరుకం :** డమరుకం శివుడు వాయించే వాద్యం. నటరాజైన శివుడు నాట్యం చేసేటప్పుడు డమరుకాన్ని వాయిస్తాడు.అందువల్లనే గొరవయ్యలు కూడా డమరుకాన్ని ధరిస్తారు. అంతేగాకుండా నృత్యం చేసేటప్పుడు దాన్ని కుడిచేత పట్టుకొని లయబద్ధంగా వాయిస్తారు. డమరుకాన్ని చెక్కతో గానీ, ఇత్తడితో గానీ తయారుచేస్తారు. దానికి రెండు వైపుల గొర్రె లేక మేక చర్మంతో మూసివేసి తాళ్ళతో గట్టిగా బిగిస్తారు. మధ్యలో నుంచి రెండు చిన్న తాళ్ళను కట్టి వాటి రెండు చివర్లా ముడివేస్తారు. డమరుకాన్ని మధ్యలో పట్టుకొని అటు ఇటు తిప్పితే ముడివేసిన తాడు భాగం చర్మాన్ని గట్టిగా తాకి "బుడ బుడక్, బుడ బుడక్" అనే శబ్దం వస్తుంది. గొరవయ్యలు డమరుకాన్ని కుడివైపు భుజానికి తగిలించు కుంటారు. మరికొందరు నడుము వేలాడదీసుకుంటారు.



**పిల్లనగ్రోవి :** పిల్లనగ్రోవి శ్రీకృష్ణుని వాద్యం. ఆవులు, గొర్రెలు, మేకలు కాసే పశువుల కాపర్లు కూడా పిల్లనగ్రోవిని వాయిస్తారు. గొరవయ్యలు నృత్యం చేసేటప్పుడు ఎడమ చేత్తో దీన్ని పట్టుకొని నోటితో ఊదుతూ వాయిస్తారు. దీనికి "వేణువు", "మురళి", "వంశి" అనే పేర్లు కూడా ఉన్నాయి. గొరవయ్యలు శైవమతస్థులు. అయినప్పటికీ కృష్ణుని వాద్యమైన పిల్లనగ్రోవిని ధరించడం చూస్తే వీరి కళ హరిహరా భేదాత్మక మైనదిగా కనిపిస్తుంది. గొరవయ్యలు కురవ కులానికి చెందినవారు. కురవలు యాదవుల్లో ఒక శాఖ. ఇప్పటికీ వీరిని కొన్ని ప్రాంతాల్లో "కురువ గొల్లలు" అని పిలుస్తారు. గొల్లలు శ్రీకృష్ణుని ఇష్టదైవంగా భావిస్తారు. అలాగే కురవగొల్ల కులానికి చెందిన గొరవయ్యలు కూడా తమ కులదైవమైన శ్రీకృష్ణుని వాద్యమైన పిల్లనగ్రోవిని ధరిస్తారని చెప్పవచ్చు.

**గజ్జలు :** నాట్యం చేసేవారు ఎవరైనా గజ్జలను ధరిస్తారు. నాట్యం చేసేటప్పుడు ఇది మంచి ధ్వనిని కల్పించి ప్రేక్షకులకు ఆనందాన్ని కలిగిస్తాయి. గొరవయ్యలు కూడా నాట్యం చేస్తారు. కాబట్టి గజ్జలను కాళ్ళకు కట్టుకుంటారు. గొరవయ్య వేషం ధరించినప్పుడు గజ్జలను కూడా తప్పనిసరిగా కట్టుకుంటారు.

గొరవయ్యలు పైన చెప్పిన విధంగా వేషధారణ చేయడానికి గల కారణాలు గురించి కన్నడంలో కొన్ని కథలున్నాయి. అందులో ఒక కథను డా॥ జి.శం. పరమశివయ్య గారు "మైలారన గొరవరు" అనే గ్రంథంలో పేర్కొన్నట్లుగా డా॥బి. రామాచార్యులుగారు ఇలా చెప్పారు".[9]

ఒకసారి కైలాసంలో శివపార్వతులు పాచికలాడుతూ ఉన్నప్పుడు తాను గొప్ప ధైర్యం కలదాన్నని, తనను ఎవరూ భయపెట్టలేరని తలచుకొని పార్వతి నవ్వుతుంది. శివుడు ఆమె నవ్విన కారణాన్ని గురించి చెప్పమని బలవంతం చేస్తే ఎనభైకోట్ల జీవరాశుల్లో నన్ను ఎవరూ భయపెట్టలేరని తలచుకొని నవ్వానని పార్వతి చెబుతుంది. ఆమె మాటలకు శివుడు నవ్వుకొని ఎనభై కోట్ల జీవరాశులకు ఆహారం పెట్టి వస్తానని చెప్పి శివుడు వెళ్ళిపోతాడు. కొంత సేపటికి శివుడు పార్వతిని భయపెట్టడానికి ఇపుడు గొరవయ్యలు వేసుకొనే వేషాన్ని ధరించి కైలాస ద్వారం దగ్గర రౌద్రరూపంతో తాండవ మాడుతూ ఉంటాడు. శివుని తాండవానికి కైలాస పర్వతం గడగడలాడుతుంది. పార్వతి ఆ శబ్దాన్ని విని భయటికి వచ్చి భయంకరంగా మహా గొరవయ్య రూపంలో తాండవం చేస్తున్న శివుని చూసి ఒక్క క్షణం నిర్ఘాంతపోయి నిలబడుతుంది. తరువాత లోపలికి వెళ్ళి పట్టెమంచం మీద పడుకొని గొరవయ్య రూపాన్ని తలచుకుంటూ ఉంటుంది. తరువాత శివుడు మామూలు రూపంలో పార్వతి

దగ్గరకు వచ్చి ఏమిటి ఇలా ఉన్నావని అడుగుతాడు. అప్పుడు పార్వతి ఎవరో మహా గౌరవయ్య భయంకరంగా తాండవమాడుతున్నాడని చెబుతుంది. అప్పుడు శివుడు నిన్ను ఎవరూ భయపెట్టలేరు కదా! అని వ్యంగ్యంగా అంటాడు. వెంటనే పార్వతి శివుడు తనని భయపెట్టడానికి గౌరవయ్య వేషంలో వచ్చాడని తెలుసుకొని ఎనభై కోట్ల జీవులకు ఆహారంపెట్టి వచ్చావా అని శివుని అడుగుతుంది. అప్పుడు శివుడు పెట్టివచ్చానని చెబుతాడు. పార్వతి తన వద్ద డబ్బీలో దాచిన చీమను చూస్తుంది. దాని నోట్లో చక్కెర ఉంటుంది. అప్పుడు పార్వతి శివుని మహాత్మ్యాన్ని గ్రహిస్తుంది.

మరొక కథ "మైలార లింగన" కావ్యంలో ఇలా చెప్పబడింది.[10] పూర్వం 'మణిశూల' పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న ఋషులను మల్లాసురుడు, మణి కాసురుడు అనే ఇద్దరు రాక్షసులు బ్రహ్మవరగర్వితులై హింసిస్తూ ఉంటారు. మునులు ఆ రాక్షసుల బారి నుండి తమను రక్షింపమని ఇంద్రుడు మొదలైన దేవతలను ప్రార్థిస్తారు. దేవతలు విష్ణువుతో కలిసి శివుని దగ్గరకు వెళ్ళి రాక్షసుల దుర్మార్గాలను గురించి వివరిస్తారు. అప్పుడు శివుడు కోపంతో తన జడను నేలకేసి కొట్టగా ఆ జడనుంచి భయంకర ఆకారాన్ని కలిగిన "మారి" అనే శక్తి పుడుతుంది. మునులు నెయ్యితో ఆ మారిని అభిషేకం చేసి "తుప్పదుమారి" అని పిలుస్తారు. నెయ్యితో అభిషేకం చేయడం వలన ఆ శక్తి "ఘృతమారి" అని కూడా పిలవబడుతుంది. అప్పుడు శివుడు రాక్షస సంహారం చేస్తానని మునులకు, దేవతలకు మాట ఇచ్చి పసుపుపచ్చని పీతాంబరం, పులిచర్మం, కంబడి నిలువు అంగీ, కంబడి టోపీ, త్రిశూలం, డమరుకం, దోణి, చేతిలో ఖడ్గం, నుదుట బండారు కుంకుమతో మార్తండ భైరవుని వేషాన్ని ధరించి తెల్లని గుర్రం ఎక్కి యుద్ధానికి తుప్పదిమారితో కలిసి బయలుదేరతాడు. అప్పుడు కోపంతో శివుడు హూంకరించగా ఆ హూంకారం నుంచి జయనందుడు, వీరభద్రుడు మొదలైన కుక్కలు పుడతాయి. ఈ యుద్ధంలో శివునికి హెగ్గయ్య పార్వతి, గంగి మాళమ్మలు సహాయపడతారు. శివుడు మార్తాండ భైవరుని వేషంలో ఉగ్ర రూపంతో డమరుకాన్ని వాయించగా ఆ ధ్వనికి ముల్లోకాలూ దద్దరిల్లుతాయి. మల్లాసుర, మణికా సురులకు ప్రమద గణాలతో కూడిన శివునికి భయంకర యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో మణికాసురుడు గాయపడి శివుని శరణుజొచ్చుతాడు. మార్తండ భైరవుడు పాశుపతాస్త్రంతో మల్లాసురిని సంహరిస్తాడు. చనిపోయేముందు మల్లాసురుడు జ్ఞానో దయంతో శివుని పాదాల మీదపడి నీ పాదాల దగ్గరే ఉండేటట్లుగా కరుణించమని శివుని ప్రార్థిస్తాడు. అప్పటి నుండి శివుడు "మల్లారి మార్తాండ భైరవుడి"గా పేరు పొందుతాడు.

పై కథలను పరిశీలిస్తే గౌరవ సంప్రదాయం కర్ణాటకలో బలంగా ఉందని,



గౌరవలకు సంబంధించిన సాహిత్యం కన్నడభాషలో ప్రచురంగా ఉందని స్పష్టమౌతుంది. తెలుగులో ఇలాంటి సాహిత్యమున్న గ్రంథాలు లేవు. కురువ కులస్థులు కర్ణాటకలో ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. వారిని చూసి ఆంధ్రదేశంలో ఉన్న కురువ కులస్థులు కూడా గౌరవ సంప్రదాయాన్ని పాటించినట్లుగా తెలుస్తుంది. పైన చెప్పిన రెండవ కథలో శివుడు మల్లాసురుని చంపి మల్లారిమార్తాండ భైరవుడుగా పేరుపొందినట్లుగా చెప్పబడింది. భైరవుడు అంటే కుక్క. అందువల్లనే గౌరవయ్యలు తమ దోణిలోని పాలు, పళ్ళు మొదలైనవాటిని కుక్కలలాగానే తాగటం జరుగుతూ ఉంది.

**బండారు :** గౌరవ సంప్రదాయంలో బండారుకు ప్రముఖమైన స్థానం ఉంది. బండారు అంటే పసుపు. భారతీయ జీవన విధానంలో పసుపుకు ప్రముఖమైన స్థానం ఉంది. అన్ని రకాల శాఖాహార, మాంసాహార కూరల్లో పసుపు తప్పనిసరిగా వేస్తారు. స్త్రీలు పసుపును సౌందర్య సాధనంగా వాడతారు. స్నానం చేసే ముందు గతంలో స్త్రీలు ఒంటికి పసుపు రాసుకునే వారు. కాన్పు అయిన స్త్రీకి శరీరం అంతా పసుపు పూస్తారు.

అలాగే శరీరంలో ఎక్కడ గాయమైన ఆ గాయానికి పసుపు పూస్తారు. జంతువులకు వచ్చే గాలి కుంటు వ్యాది మొదలైన అనేక రకాల రోగాలకు పసుపును ఉపయోగిస్తారు. ఇన్ని ఉపయోగాలు పసుపు వల్ల ఉండడం వల్లనే జానపదులు పసుపును గురించి చక్కని పొడుపుకథను సృష్టించుకున్నారు.

"అనంతపురంలో తప్పెట గొడితే – అంతకు తగులు ఇంతకు తగులు
చెరువులో ఉండే చేపకు తగులు– గాళ్ళలో ఉండే గొడ్డుకు తగులు
బాలింతకు తగులు"

ఈ విధంగా భారతీయులు పసుపును అనేక రకాలుగా ఉపయోగించడానికి కారణం అందులో గొప్ప ఔషద లక్షణాలు ఉండటమే. ఆధునిక పరిశోధనలు కూడా పసుపు మంచి యాంటీబయాటిక్‌గా పని చేస్తుందని రుజువు చేశాయి. ఈ విధంగా పసుపు మానవ సమాజానికి మహాపకారిగా ఉంది. మన పూర్వులు పసుపు యొక్క గొప్పతనాన్ని అతి ప్రాచీన కాలంలోనే గుర్తించి దాన్ని అనేక రకాలుగా ఉపయోగించడం ప్రారంభించారు. అందువల్లనే మనవారు పసుపును "శుభసూచకం"గా పరిగణిస్తారు.

పసుపుయొక్క ఈ ప్రాధాన్యాన్ని గమనించిన గౌరవ సంప్రదాయ కర్తలు తమ మతపరమైన జీవన విధానంలో పసుపుకు ప్రముఖమైన స్థానాన్ని ఇచ్చారు. అంతే కాకుండా దానికి బండారు అని పేరు పెట్టారు. బండారు అంటే "సంపద" అనే అర్థం ఉంది. గౌరవయ్యలకు ఇది ధనం లాంటిది. మతపరమైన తమ కార్యక్రమాల్లో

గొరవయ్యలు పసుపును చాలా ఎక్కువగా ఉపయోగిస్తారు. అందువల్లనే వీరు పసుపును తమ దగ్గర ఎప్పుడూ ఉంచుకోవడానికి నడుముకు బండారు సంచిని కట్టుకుంటారు. గొరవయ్యలు చేసే జాతరలు, ఉత్సవాల సందర్భంగా చేసే ఊరేగింపులో బండారును ఎక్కువగా చల్లుతారు. ఆ ప్రదేశమంతా పసుపుమయంగా మారిపోతుంది. ఆకాశం కూడా పసుపు రంగులో కనిపిస్తుంది. భక్తులు తెల్లటి దుస్తులు కూడా పసుపు దుస్తుల లాగా మారిపోతాయి. అంతే గాకుండా గొరవయ్యలు భక్తులకు బండారు పెడతూ ఆశీర్వదిస్తారు. గొరవయ్యలు సాహస కృత్యాలు చేసిన తరువాత గాయాలకు పసుపును పూసుకుంటారు. ఎంత పెద్ద గాయమైనా వీరు ఇంక ఏమందునూ వాడరు. గాయం మానిపోయేవరకు బండారునే పూస్తుంటారు. గొరవయ్యలు పూజా సమయంలో కూడా దేవుని మీద బండారును చల్లుతూ పాటలు, ఖడ్గాలు (వచనంలో చెప్పేవి) చెబుతారు. గొరవయ్యలు తమ ఇష్టదేవుడైన మైలారుస్వామి ఉన్న క్షేత్రాలను దర్శించినప్పుడు తాము ఆ క్షేత్రాల నుంచి తెచ్చిన బండారును ప్రసాదంగా తమ ఊర్లో ఉన్న భక్తులకు పంచి పెడతారు. భక్తులు గొరవయ్యలను తమ ఇంటికి పూజకు ఆహ్వానించడానికి ఒక కొత్త బట్టలో కొంత బండారును కట్టి గొరవయ్యలకు ఇవ్వాలి. దీన్నే "బండారు కట్టడం" అంటారు. ఇలా బండారు కడితేనే గొరవయ్యలు భక్తుల ఇళ్ళకు పూజకు వెళతారు. ఈవిధంగా గొరవ సంప్రదాయంలో బండారుకు గొప్ప ప్రాధాన్యత ఉంది. అంత ప్రాధాన్యత ఉండబట్టే గొరవల ఇష్టదైవమైన మైలారుదేవుని బండారుదేవుడని కూడా పిలుస్తారు.

**గణాచారి :** గొరవ సంప్రదాయంలో గణాచారికి చాల ప్రాధాన్యత ఉంది. గణాచారి అంటే గణానికి ఆచారి అని అర్థం. గొరవయ్యలు కొందరు ఒక గుంపుగా లేక గణంగా ఉంటారు. ఈ గుంపుకంతటికీ ఒక గణాచారి ఉంటాడు. గొరవయ్యలు ఒక గ్రామంలో ఉన్న వాళ్ళందరూ కలిసి గానీ, లేక నాలుగైదు గ్రామాలకు చెందిన గొరవయ్యలు కలిసి గానీ ఒక గణంగా ఉంటారు. వీరందరికీ ఒకే ఒక గణాచారి ఉంటాడు. గొరవయ్యలు కురవ కులస్థులకు గురువులైతే గణాచారి గొరవయ్యలకు గురువు. గొరవ దీక్షను గణాచారి ఇప్పిస్తాడు. అంటే గొరవయ్యలను తయారు చేసేది గణాచారే. అంతేగాక గొరవయ్యల పూజ ఎక్కడ జరిగినా అక్కడ తప్పనిసరిగా గణాచారి ఉంటాడు. గణాచారి లేకుండా గొరవయ్యలు ఎలాంటి పూజా కార్యక్రమాలలోనూ పాల్గోరు.

గొరవయ్యలు వంశపారంపర్యంగా తయారైనట్లే గణాచారి పదవి కూడా వంశ పారంపర్యంగా వస్తుంది. అంటే గణాచారి కుటుంబానికి చెందినవారే తరువాత వంశ పారంపర్యంగా గణాచారులు అవుతున్నారు. ఈ గణాచారి కూడా కురవ



కులానికి చెందిన వాడే. కురవ కులస్థుల వివాహానికి గణాచారి పురోహితుడుగా వ్యవహరిస్తాడు. అందువల్ల కురవల సాంఘిక, సాంస్కృతిక జీవితంలో గణాచారికి గొప్ప ప్రాధాన్యం ఉంది.

గణాచారి వేషధారణ గొరవయ్యల వేషానికి భిన్నంగా ఉంటుంది. ఇతడు తెల్లటి అంగీ, తెల్లనిపంచ, తలకు తెల్లటి రుమాలు ధరిస్తాడు. ముఖానికి విభూది పూసుకొని బండారు లేదా కుంకుమ బొట్టు పెట్టుకుంటాడు. గొరవయ్యలు నృత్యం చేసేటప్పుడు గణాచారి మెడలో మద్దెలను ధరించి గురవయ్యల మధ్యలో ఉండి మద్దెలను వాయిస్తాడు. గణాచారి గురవయ్యలతో కలిసి మత సంబంధమైన అన్ని కార్యక్రమాల్లోనూ పాల్గొంటాడు. గణాచారి కురవ కులానికి చెందినవాడు కావడం వల్ల ఇతడు గొర్రెలను, మేకలను పెంచడం, కంబళ్ళు నేయడం మొదలైనవి చేస్తాడు. కొంతమంది వ్యవసాయం కూడా చేస్తారు.

## సేవగరిడి - స్వరూప స్వభావాలు - చరిత్ర :

సేవగరిడి వైష్ణవ మతానికి చెందిన భక్తి ప్రధానమైన జానపదకళ. ఈ కళను ఉత్తరాంధ్ర జిల్లాల్లో ఆలగొల్ల శాఖకు చెందిన యాదవులు ప్రదర్శిస్తారు. వీరు తరతరాలుగా, వంశపారంపర్యంగా ఈ కళను ప్రదర్శిసున్నారు. ఉత్తరాంధ్ర జిల్లాలో సింహాచలం ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం. ఈ క్షేత్రంలో విష్ణువు వరాహరూపంలో ఉన్నాడు. ఈ స్వామిని వరాహనృసింహస్వామి అని అంటారు. ఉత్తరాంధ్ర ప్రజలు వరాహ నృసింహస్వామిని "సింహాద్రప్పన్న" అని పిలుచుకుంటారు. సేవగరిడి కళాకారుల ఇష్టదైవం సింహాద్రప్పన్న. వీరు "హరిహరి నారాయణాది నారాయణ, కరుణించి మమ్మేలు కమల లోచనుడా" అనే వరుసలో దశావతార కథలను సేవగరిడి కళా ప్రదర్శన సందర్భంగా పాడతారు. ఆంధ్రదేశానికి కర్నాటక సరిహద్దులో శైవభక్తి ప్రధానమైన జానపద కళ "గొరవయ్యలు" ఉండగా, ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో వైష్ణవ భక్తి ప్రధానమైన జానపద కళ అయిన సేవగరిడి ఉంది. గొరవయ్యలు కురవ గొల్లశాఖకు చెందిన యాదవులు. సేవగరిడీని ప్రదర్శించే కళాకారులు ఆలగొల్ల శాఖకు చెందిన యాదవులు. గొరవయ్యలు లాగానే సేవగిడి కూడా భక్తి సంప్రదాయానికి చెందిన జానపద కళ. గొరవయ్యలు శివభక్తులైనప్పటికీ వీరు వీరశైవులు కాదు. వైష్ణవాన్ని ఆదరించగలిగిన మతసహనం ఉన్నవారు. అలాగే సేవగరిడి వైష్ణవ భక్తి ప్రధానమైన జానపద కళ అయినప్పటికీ వీరు కూడా వీరవైష్ణవులు కారు. శైవాన్ని ఆదరించగల మతసహనం గలవారు. కర్నాటక సరిహద్దులో శైవభక్తి ప్రధానమైన

జానపద కళను యాదవులు ప్రదర్శించడం, ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో వైష్ణవ భక్తి ప్రధానమైన సేవగరిడిని కూడా యాదవులు ప్రదర్శించడం కాకతాళీయమే, అయినప్పటికీ వీటిని గురించి కొంత ఆలోచింపవలసిన అవసరం ఉంది.

సేవగరిడి కళకు గరిడిసేవ అని, కోలసంబరం అని, సింహాద్రి అప్పన్న సేవ అనే పేర్లుఉన్నాయి. సేవ అనే పదానికి శుశ్రూష, కొలువు అనే అర్థాలను, గరిడి అనే పదానికి సాము, సాముకూటం, చోటు అనే అర్థాలను శబ్దరత్నాకరం చెబుతూంది. పై అర్థాలను బట్టి సేవగరిడి అంటే "కొలువు చేసే చోటు" అని అర్థం వస్తుంది. కొలవడం అంటే దైవానికి సంబంధించిన అర్థంలో సేవించడం అని అర్థం. సేవగరిడి కళాకారులు ఈ కళాప్రదర్శన చేసేటప్పుడు గుండ్రంగా నిలబడి విష్ణువు యొక్క దశావతారాలను గానం చేస్తారు. అందువల్ల సేవగరిడి అంటే "విష్ణువు సేవ చేసే చోటు" లేక "విష్ణువును కొలిచే చోటు" అనే అర్థాలను చెప్పవచ్చు. సేవగరిడి ప్రదర్శన సమయంలో ఈ కళాకారులు ఉపయోగించే పరికరాలనుబట్టి కూడా ఈ కళక్కు ఈ పేరు వచ్చిఉండవచ్చు. వీరు ఇనుముతో చేసిన "కోల" అనే బరువైన పరికరాన్ని, కంచుతో చేసిన పెద్ద తాళాలను ప్రదర్శనలో ఉపయోగిస్తారు. ఈ పరికరాలను శారీరకంగా బలవంతులు మాత్రమే ఉపయోగించగలరు. బలహీనులు వీటిని ఎక్కువసేపు ఉపయోగించలేరు. ఈ పరికరాలను ఉపయోగించడం సాము లేక వ్యాయాయం చేసినట్లుగా ఉంటుంది. ఈ కారణం వల్ల కూడా ఈ కళకు సేవగరిడి, గరిడి అనే పేర్లు వచ్చి ఉండవచ్చు.

సేవగరిడి కళా ప్రదర్శనలో "కోల" అనే వస్తువును వెలిగించి దానిమీద నూనె పోస్తూ దశావతారాలను గానం చేస్తారు. సేవగరిడి కళాప్రదర్శనలో కోల ముఖ్యమైన పరికరం. దీన్ని ఒక వ్యక్తి పట్టుకొని తిప్పుతూ ఉంటాడు. ఈ పరికరాన్ని బట్టి ఈ కళకు "కోలసంబరం" అనే పేరు వచ్చింది. సేవగరిడి కళాకారుల ఇష్టదైవం సింహాచలేశ్వరుడైన సింహాద్రప్పన్న. వీరు సింహాద్రప్పన్న సేవ చేస్తారు. కాబట్టి దీనికి సింహాద్రి అప్పన్న సేవ అనే పేరు వచ్చింది. సింహాద్రప్పన్న సేవ అంటే సింహాద్రప్పన్నను కొలవడం లేదా సింహాద్రి అప్పన్నను పూజించడం అని అర్థం.

సేవగరిడి భక్తి ప్రధానమైన జానపదకళ. ఈ కళా ప్రదర్శన సందర్భంగా విష్ణువు యొక్క దశావతారాలను గానం చేస్తారు. అందువల్ల ఇది వైష్ణవ భక్తి ప్రధానమైన జానపద కళ అని చెప్పవచ్చు. ఈ కళ కళింగాంధ్ర ప్రాంతంలో మాత్రమే ప్రదర్శింపబడుతూ ఉంది. అందువల్ల ఇది కళింగాంధ్ర ప్రాంతానికి మాత్రమే పరిమితమైన కళ అని చెప్పవచ్చు. ఈ కళను పగలు రాత్రి అనే భేదం లేకుండా అన్ని సమయాల్లోనూ ప్రదర్శిస్తారు. ఈ కళా ప్రదర్శనలో పురుషులు మాత్రమే పాల్గొంటారు.



పురుషుల్లో పెద్దవారితోపాటు బాలురు కూడా పాల్గొంటారు. ఈ కళా ప్రదర్శనలో విష్ణువు దశావతార కథలను పాడుతారు. అందువల్ల ఇది సాహిత్యమున్న జానపద కళ. ఈ కళను కొన్ని యాదవు కుటుంబాల వారు తరతరాలుగా ప్రదర్శిస్తూ ఉన్నారు. ఐతే ఈ మధ్య కాలంలో యాదవుల వద్ద ఈ కళాప్రదర్శనను అభ్యసించిన జాలారి, రెడ్డిక, కాళింగ, గవర మొదలైన కులాలవారు కూడా అక్కడక్కడ ప్రదర్శిస్తున్నారు. వీరి సంఖ్య చాలా తక్కువ.

సేవగరిడి ఉత్తమజానపద కళ. ఇందులో సాహిత్యం, సంగీతం, నృత్యం ఉన్నాయి. సేవగరిడి కళారులు తమ కళాప్రదర్శన సందర్భంలో విష్ణువతారం, మత్స్యావతారం, కూర్మావతారం, కొమ్మలవరాహావతారం, నరసింహావతారం, వామనావతారం, పరశురామావతారం, రామావతారం, వరాహావతారం, కృష్ణావతారం మొదలైన దశావతార కథాగేయాలను పాడుతారు. ఈ ప్రదర్శనాకారులు తొమ్మిదవ అవతారమైన వరాహావతారానికి అనుబంధంగా "సింహాచలం దేవళం కట్టుబడి కథాగేయం" అనే మరొక కథాగేయాన్ని పాడతారు. దీనితో కలిపి సేవగరిడి కళాకారులు పాడే కథాగేయాలు మొత్తం పదకొండు అవుతాయి. ఈ పదకొండు కథాగేయాలను సేవగరిడి కళాకారులు "దశపదకొండు అవతార కథలు" అని పిలుస్తారు.

ఈ కళాకారులందరూ దాదాపుగా చదువు లేనివారు కావడంవల్ల అవతారం అనే మాటను అవుతారం అని పలుకుతారు. దశావతారాల పేర్లను విష్ణువౌతారం, మచ్చావుతారం, కుర్మావుతారం, వారావుతారం లేక కొమ్మలవారావుతారం లేక కొమ్మలావుతారం, నర్శిమ్మావుతారం, వామనావుతారం, పరసరామావుతారం, రామావుతారం, వారావుతారం, కిష్ణావుతారం లేక కిష్టావుతారం అని పలుకుతారు. వీటిలో నాల్గవది, ఎనిమిదవది రెండూ వరాహావతారం అనే పేరుతో ఉన్నాయి. అందువల్ల ఈ రెండింటినీ గుర్తించడానికి వీలుగా నాల్గవదైన వరాహావతారాన్ని కొమ్మలవారావుతారం అని ఈ కళాకారులు పిలుస్తారు. విష్ణువు వరాహావతారం ఎత్తి హిరణ్యాక్షకుని సంహరించి భూమిని తన కోరల మీద మోశాడు. ఈ కోరలను సేవగరిడి కళాకారులు కొమ్ములుగా భావించి ఈ అవతారాన్ని కొమ్మలవారావుతారం అని పిలుస్తారు. మరికొందరు కొమ్మలావుతారం అని కూడా పిలుస్తారు.

ఈ దశావతారాల్లో మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం లేదా కొమ్మల వరాహావతారం, నరసింహావతారం, వామనావతారం, పరుశురామావతారం, రామావతారం, కృష్ణావతారం అనే ఎనిమిది శిష్టసాహిత్యంలో ఉన్నవే. అయితే కథలోను, పాత్రల పేర్లలోను శిష్టసాహిత్యానికి వీటికి భేదం ఉంటుంది. మొత్తంమీద శిష్ట

సాహిత్యంలోని ఆయా కథలను అనుసరించి జానపద కవి ఎనిమిది కథాగేయాలను చెప్పాడు. మొదటిదైన విష్ణువవతారం, తొమ్మిదవదైన వరాహావతారం రెండూ శిష్ట సాహిత్యంలోని దశావతారాలకు సంబంధించినవి కావు. ఇవి రెండూ జానపదకవి కల్పితాలే. శిష్టసాహిత్యంలోని బుద్ధావతారం, కల్క్యవతారం గురించిన కథలను జానపదకవి చెప్పలేదు.

సేవగరిడి కళను ప్రదర్శించే వారు 'తోడపెద్దు' అనే పేరుగల ఒక ఎద్దును పెంచుతారు. ఈ ఎద్దును వీరు సాక్షాత్తుగా సింహాద్రప్పన్న గాను, బసవదేవుడు గాను భావించి పూజిస్తారు. ఈ కళా ప్రదర్శన సందర్భంలో కళాకారులు తమ వెంట తోడ పెద్దును కూడా పట్టుకొని వెళ్ళి దాని ఎదురుగా సేవగరిడి కళను ప్రదర్శిస్తారు. ఈ తోడపెద్దు కూడా ఎలాంటి బెదురు, భయం లేకుండా ఈ కళా ప్రదర్శకుల ఎదురుగా నిలబడి ఉంటుంది. ఈ సందర్భంగా తోడపెద్దుకు అనేక రకాల అలంకరణ వస్తువులు తొడుగుతారు. ఈ తోడపెద్దు ఇంచుమించుగా గంగిరెద్దు లాగా ఉంటుంది. ఐతే గంగిరెద్దుల వారు గంగిరెద్దును పూజ్యభావంతో చూడరు. సేవగరిడి కళాకారులు తోడపెద్దును బసవదేవుడితో సమానంగా, సింహాద్రి అప్పన్నతోసమానంగా భావిస్తారు. గంగిరెద్దుల వారు గంగిరెద్దుతో ఆట ఆడిస్తారు. కానీ సేవగరిడివారు తోడపెద్దుతో ఎలాంటి ఆట ఆడించరు. సేవగరిడి కళాకారులు తోడపెద్దును ఎదురుగా పెట్టుకొని సేవగరిడి కళను ప్రదర్శిస్తూ విష్ణువు ఎత్తిన దశావతారాలను గానం చేస్తారు.

సేవగరిడి కళ పుట్టుకను గురించి, ఈకళాకారులు తోడపెద్దును ఎదురుగా పెట్టుకొని విష్ణువు అవతారాలను గానం చేయడానికి గల కారణాన్ని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. ఈ కథను నమ్మి బాబూరావుగారు చెప్పారు.

సేవగ్గరిడి కళాకారుల్లో కథను చెప్పే వ్యక్తిని దాసుడు అంటారు. నమ్మి బాబూరావుగారు గొప్పదాసుడు. దశావతార కథలను తడుముకోకుండా అలవోకగా పాడగల వారు. వీరి వయసు 58 సంవత్సరాలు. వీరు రైల్వేశాఖలో సీనియర్ టెక్నీషియన్‌గా పని చేస్తున్నారు. సేవగరిడి కళను వీరి కుటుంబం వారు వంశపారంపర్యంగా ప్రదర్శిస్తున్నారు. వీరి స్వగ్రామం కంచరపాలెం. ప్రస్తుతం కంచరపాలెం విశాఖపట్నం నగరంలో కలిసిపోయింది. ఇలాంటి బాబూరావుగారు సేవగరిడి కళ పుట్టుకను గురించి ఇలా చెప్పారు. ఈ విషయం కూర్మావతారం కథలో చెప్పబడింది.

"కృతయుగం బందునా కైలాసగిరి యందు - రుద్రగణముల్లోను రుషబుడన్నోడు
రుషబుడను శివదూత పరమేశ్వరుని - నాబిస్థానమున నిలుపుకొని తపమాచరింప
ఆ తపమునకు మెచ్చి ఆ గౌరీశంకరులు - ప్రత్యక్షమై పలికిరి పరమమోదమున



ఓ భక్త రుషబుడా ఓ నిర్మలాత్ముడా - మెచ్చితిమి నీ తపము ఇచ్చెదము వరము
ఏ వరము కావాలో కోరుకొమ్మంటేను - ఏమంట పలికేను తాను రుషంబుండు
ఓ భక్తవత్సలా ఓ పార్వతీశ్వరా - మీదరిశనము చేత మిగుల భాగ్యంబు
మీ దర్శనము కన్న ఏమి భాగ్యంబేమి - శివకేశవులన్న బేదంబు లేక
శివనందిని పూజిస్తూ శ్రీహరిని స్మరియిస్తు - నన్ను పూజించేటి భక్తులందరకు
ముక్తి ప్రసాదించే శక్తివంతుడనయి - వుండుటకు వరమిమ్ము ఓ చంద్రమౌళి
అంత నా పరమేశుడతిక సంతోషమున - మరు జన్మమున నందివై యుందువయ్యా
నందివై మాయెదుట వుందువయ్యా - మాకన్న తొలిపూజ నీకు చేయుదురు
అని వరము దయచేసి అంతర్హితుండాయె - ఆలాగు మరికొంత కాలంబు గడిచె
మరుజన్మమున రుషబుండు మహత్తరమైనట్టి - పరమేశ్వరుని పదచరణమందుద్భవించె
పరమేశ్వరుండంత పవిత్రమైన - నందీశ్వరుడని నామంబు లిడెను
నందీశ్వరుని చంద్రమౌళి ముందుండమని - కైవల్య మొసగినడు గరల కంటుండు
ఆలాగు మరికొంత కాలంబు గడువగను - సురులూను దేవతలు కూడి అబ్ది తరిసేరు
భక్తితో ఆయబ్ది పట్టి తరిసితేని - సెగపుట్టి శేషువుండిషము కక్కేను
అసురులును దేవతలు అంత రుద్రుని వేడ - హాలహలము కంటమందతడు నిలిపె
వదిలితే జగమంత మండిపోతాది - మింగితే లోకము కుంగిపోతాది
కంఠమందున శివుడు గరళంబు నిలిపితే - అందువల్లను విషాతాపంబు గలిగే
అందువల్లను విషాతాపంబదికంబు కాగా - అది కళ్ళజూసినాదాది విష్ణుండు
ఔర పరమేశు కాపదొచ్చిందని - ఈ రాత్రి జాగరణ కల్పించాలని
ఆటపాటలు సలిపె అంబోది వద్దునా - కళాశాస్త్రములన్ని కల్పించినాడు
వినావినోదములు గానములు హరికథలు - సానిమేళంబులు చాల సృష్టించె
తుంబుర నాదములు అంబరంబున కెగయ - గంభీర వాద్యములు గనముగా మోగె
భజనలరిభజనలను బాగుగా కల్పించె - సంగీత వాద్యములు చాల కల్పించె
తప్పిడి మేళాలు తగిన కోలాటాలు - కోయిడాన్సు సిడతలు కొన్ని కల్పించె
ఇందిరా రమణుండు నందీశ్వరుని పిలిచి - బసాదేవుని జేసె బాగుగా నపుడు
బసాదేవుని పూజ చేయంగ పట్టాపు - దాసులను సృష్టించె దానవాంతకుడు
పువ్వంటి దాసులను సేవదాసులను - సృష్టించె తాళాలు కోలలన్నింటిని
నాగబెత్తట్టుకొని నరహరిని స్మరియిస్తు - అడుగులొరసలు తాళధ్వనులతో పాటలు
తాళాలు మోగిస్తూ దాసుల్లు పాడుతూ - పున్నపెన్నెల కోల పూని బెలిగించుకొని
పువ్వంటి దాసుల్లు సేవ జేసేరు - బండి తిరపతికోల పట్టి బెలగించుకొని

పట్టాపు దాసుల్లు సేవజేసేరు - బసవన్నను పూజిస్తు పాడుదురు శ్రీహరిని
భక్తితో సేవలు పట్టి సేయగను - భక్తితో సేవలు పట్టి చేసితేని
భక్తితో నావిషాతాప మరియించె - పరమేశునకు శాంతి సమకూడగా
విష్ణు బసవన్న వ్రతమని బాగు కల్పించె - నాటి నుండి వ్రతము నారాయణుడు
సృష్టించి దాసుల్లు తోడుపెద్లా సేవ - చేయుచును శ్రీహరి పాట పాడుదురు
నందీశ్వరుని బసాదేవునిగ పూజించి - శౌరి యవతార మొర్జించి పాడుదురు
శివునొరము చొప్పునా శౌరిచే నిర్మింప - తోడపెద్లావారు తాళాలవారు
శివకేశవుల శక్తి చెందె బసదేవుని - తోడపెద్దనే పేరున తరియించు చుండె
తోడపెద్లావారు తాళాల వారిని - దాసానదాసులను దరణి కల్పించె
ఈ బసాదేవుని భక్తితో నెవ్వరు - భజియింప వారలకు పరమార్థమబ్బు"

కృతయుగంలో శివుని రుద్రగణాల్లోని వృషభుడు అనే భటుడు శివుని గురించి గొప్ప తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నారు. దానికి వృషభుడు తనను పూజిస్తూ శ్రీహరిని కీర్తించే భక్తులందరికీ ముక్తిని ప్రసాదించే శక్తిని ప్రసాదించమని కోరుకున్నాడు. ఈశ్వరుడు అతని కోరికకు సంతోషించి మరుసటి జన్మలో వృషభుడు నందీశ్వరుడు అనే పేరుతో జన్మించి ఎల్లప్పుడు తన ఎదురుగా ఉంటాడని, భక్తులు మొదట అతణ్ణే పూజిస్తారని చెబుతాడు. చెప్పినట్లుగానే మరుసటి జన్మలో వృషభుడు నందీశ్వరునిగా జన్మించి ఎల్లప్పుడు శివుని ఎదురుగానే ఉంటాడు.

ఇలా ఉండగా కొంతకాలానికి దేవతలు, రాక్షసులు అమృతం కోసం మందర పర్వతాన్ని కవ్వంగా, ఆదిశేషుని కవ్వం తాడుగా చేసుకొని పాలసముద్రాన్ని చిలకడం ప్రారంభిస్తారు. చిలుకుతూ వుంటే శేషుడు వేడి ఎక్కి విషం కక్కుతాడు. దేవతల్లు రాక్షసులు ఆ విషాగ్ని తాపాన్ని భరించలేక విషాగ్ని బారి నుంచి తమను రక్షింపమని శివుని ప్రార్థిస్తారు. శివుడు వచ్చి ఆ విషాన్ని నోట్లో వేసుకొని కంఠంలో ఉంచుతాడు. అయితే శివుడు విషతాపాన్ని భరించలేకపోతాడు. శివునికి ఆపద కలుగుతుందని విష్ణువు భావించి శివునికి వినోదం కలిగించి అతని తాపాన్ని పోగొట్ట డానికి, అతడు ఆ రాత్రి నిద్రించకుండా జాగరణ చేయడానికి వీలుగా హరికథలు, సానిమేళాలు, భజనలు, కోలాటాలు, కోయడాన్సులు మొదలైన వినోద ప్రధానమైన కళలతోపాటు భక్తి ప్రధానమైన సేవగరిడి కళను సృష్టించాడు. దీని కోసం శివుని వాహనమైన నందీశ్వరుని బసవదేవునిగా (తోడపెద్దుగా) చేస్తాడు. సేవగరిడి కళాకారులు బసవదేవుని ఎదుట కంచుతాళాలు వాయిస్తూ విష్ణువును కీర్తిస్తూ కథలను చెబుతారు.



ఆ రాత్రంతా దాసులు భక్తితో హరిసేవ చేసేటప్పటికి శివుని తాపం తగ్గిపోయింది. ఆనాటి నుంచి దాసులు బసవదేవుని (తోడపెద్దును) ఎదురుగా పెట్టుకొని విష్ణుమాహాత్మ్యాన్ని తెలిపే కథాగేయాలను పాడుతూ సేవగరిడి కళను ప్రదర్శిస్తున్నారు. శివుడు వృషభునికి ఇచ్చిన వరం ప్రకారం విష్ణువు నిర్మించిన కళ సేవగరిడి. శివకేశవుల శక్తి బసవదేవునిలో ఉండి తోడపెద్దు అనే పేరుతో భూమి మీద ప్రసిద్ధి చెందింది. ఈ విధంగా బసవదేవుని (తోడపెద్దును) పూజిస్తూ విష్ణుకథలు పాడే వారికి మోక్షం కలుగుతుంది.

సేవగరిడి కళ పుట్టుకను గురించి నమ్మి బాబూరావుగారు చెప్పిన పై కథ హేతుబద్ధ మైనది కాదు. ఈ కథలో సేవగరిడితోపాటు హరికథ, సానిమేళం, భజనలు, కోలాటం, కోయడాన్సు మొదలైన వాటిని విష్ణువు త్రేతాయుగంలో సృష్టించినట్లుగా చెప్పబడింది. ఇది నమ్మదగిన విషయం కాదు. సేవగరిడి కళాకారులు తమ కళకు ప్రాచీనతను, పవిత్రతను ఆపాదించడానికి కల్పించిన కట్టుకథ ఇది. ఈ కథలో శివుడు వృషభునికి ఇచ్చిన వరం ప్రకారం విష్ణువు సేవగరిడి కళను నిర్మించినట్లుగా చెప్పబడింది. వరం ఇచ్చినవారే దాన్ని నెరవేర్చాలి. కానీ ఇందులో వృషభునికి వరం ఇచ్చింది శివుడు, దాన్ని నెరవేర్చింది విష్ణువు. కాబట్టి ఇందులో శివకేశవులకు అభేదం చెప్పబడింది. అంతేగాకుండా సేవగరిడి కళాకారులు శివరాత్రి పండుగరోజున రాత్రంతా మేలుకొని సేవగరిడి కళను ప్రదర్శిస్తూ విష్ణువు అవతారకథలను పాడతారు. అందువల్ల ఈ కళ శివకేశవా భేదాన్ని చాటి చెప్పడానికి కల్పించబడిందని చెప్పవచ్చు.

తోడపెద్దుకు ఆ పేరు రావడానికి గల కారణాన్ని గురించి బాబూరావుగారు సేవగరిడి కళాకారులకు బసవన్న ఎల్లప్పుడూ తోడుగా ఉంటుంది కాబట్టి దానికి తోడపెద్దు అనే పేరు వచ్చిందని చెప్పారు.

అయితే తోడపెద్దుకు ఆ పేరు రావడానికి గల కారణాన్ని గురించి గొలగాని సింహాద్రి అనే దాసుడు ఇలా చెప్పారు. రేపల్లె పాలకుడైన నందునికి ఒక చెల్లెలుండేది. నందుడు ఆమెకు కొన్ని ఆవులను అరణంగా తోలి పంపించాడు. అందులో ఒక ఆవు పేరు బూతాల బైరవి. ఆ ఆవు కడుపున బసవన్న కోడెదూడ రూపంలో జన్మించాడు. నందుని చెల్లెలు దాన్ని తన అన్న ఆలమందకు పెద్దదిక్కుగా, రక్షణగా పంపిస్తుంది. తోడబుట్టిన చెల్లెలు పంపించిన ఎద్దు కావడం వల్ల దానికి తోడపెద్దు అనే పేరు వచ్చిందని గొలగాని సింహాద్రిగారు చెప్పారు.

సేవగరిడి కళాప్రదర్శన సమయంలో కళాకారులు తోడపెద్దుకు అనేక రకాల ఆభరణాలు తొడుగుతారు. ఈ ఆభరణాలను మొదట బాలకృష్ణుడు బసవన్నకు చేయించాడు. బసవన్నకు బాలకృష్ణుడు ఈ ఆభరణాలు చేయించడానికి గల కారణం

కృష్ణావతారకథలో చెప్పబడింది. ఆ కథ ఇది.

రేపల్లెలో బాలకృష్ణుడు తన చిలిపి చేష్టలతో ప్రతిరోజు తగవులు తెస్తుంటాడు. ఆ తగవులతో విసిగిపోయిన కృష్ణుని తల్లి గోపెమ్మ కృష్ణుని ఆలమందలు కాయడానికి వెళ్లమని చెబుతుంది. బాలకృష్ణుడు దానికి అంగీకరిస్తాడు. గోపెమ్మ కృష్ణుని ఆలమంద దగ్గరికి తీసుకొని వెళ్లి ఆవులను ఏ కోనలో మేపాలో ఏ కోనలో మేపకూడదో చెబుతుంది. అందులో -

"శివశక్తి అన్నది మా కానిదిరా బాబు- అది పట్టపగలే చిట్టచీకటి కోన
శివశక్తి కోనలో సిక్కులడతావు- వద్దొద్దు నా బాబు నా బుద్దులినవయ్య"

అని చెబుతుంది. శివశక్తి కోన దట్టమైన అడవితో పట్టగపలే చిట్టచీకటిగా ఉంటుందని దాని అధిపతి శివశక్తి ప్రమాదకరమైనదని, కాబట్టి శివశక్తి కోనకు ఆవులను మేపడానికి వెళ్లవద్దని చెబుతుంది. తర్వాత గోపెమ్మ మందకు పెద్దదిక్కుగా ఉన్న బసవన్నకు కృష్ణుని అప్పగిస్తూ -

"అవుదువోయి బసవన్న అవునంతవాడా- చిన్నోడు కృష్ణమ్మ మందకొస్తున్నాడు.
మంద నీకిల్లడోయి బసమదేవుండా- పోకిరీ ఏసాలు నువు మానుకోవాల
మంద నీ కిల్లడోయి బసమదేవుండా"

అని చెప్పి ఆమె వెళ్లిపోతుంది. కృష్ణుడు గోపెమ్మ వెళ్లవద్దని చెప్పిన కోనలకు ఆవులను తోలుకొని వెళ్లి మేపుతాడు. చివరగా శివశక్తి కోనలో ఆవులను మేపాలని కృష్ణుడు నిర్ణయిస్తాడు. అయితే అది పట్టపగలే చీకటిగా ఉంటుంది. కాబట్టి వెలుతురు కోసం కృష్ణుడు ఆవు పాల నుంచి వెన్న తీసి దివిటీలు తయారు చేసి ఆ దివిటీలను ఆవుల కొమ్ములకు కట్టి వాటి వెలు తురులో ఆవులమందతో శివశక్తి కోనలోకి ప్రవేశిస్తాడు. ఈ విషయాన్ని జానపదకవి ఎంతో చక్కగా ఇలా వివరించాడు.

"మందపాలకులారా మాయన్నలారా- తప్పకా శివసత్తి కోన మేపాల
మళ్ళించండి గోవులను గోదారి సోరుపుని- అష్టబూలోకాల కిష్టావతారుడు
గోదారి సోరుపుని కోరి మందాసి- ఆవుకు అరసోల పాలు పిదికేను
పచ్చి పాలల్లోను ఎన్న తరిసేడు- ఎన్న గాసి నెయ్యి జేసేడు
నెయ్యి గాసి దివిటీలు వెలిగించేరు- ఎద్దెద్దు కొమ్ములకు ఏక దివిటీలు
పద్దాల కొమ్ములకు పట్టి దివిటీలు- బసవన్న కొమ్ములకు ఎండి దివిటీలు
దివిటీలు వెలిగించేరు మందకోనార్లు"

పై విధంగా దివిటీలు వెలిగించి కృష్ణుని ఆదేశం మేరకు గోపాలకులు గోవులను శివశక్తి కోనలోకి తోలి మేపుతారు.



"అప్పుడే మన్నాడు నీలయెన్నుండు- పట్టపగలే సిట్ట సీకటికోన
శివసత్తి కోనొకటి సూసి వద్దాము - శివసత్తి కోనకు గోవులొడ్డండి
ఆ పలుకులిన్నాడు మందకోనార్లు- కదిలించినారా మంద కాలనాదమున
రవ్వనే రవదూలి కమ్ముకెళ్లేను- ఆవుల రవదూలి ఆకాశముగమ్మేను
ఆకాశము రవదూలి ఆవుల గమ్మేను- శివసత్తి కోనను మట్టుడించేరు
చుట్టుకోనడికోన పట్టి మేసేరు- మున్నూరామట కోన ముట్టడేసేరు
సిట్టసీకటి కోన శివసత్తికోన- సిట్టసీకటి కోన పట్టగపలాయె"

దివిటీల వెలుతురులో శివశక్తి కోనను ముట్టడించి ఆవులను మేపుతూ ఉంటే ఆ కోన అధిపతి శివశక్తి కోపించి పెనుగాలి కల్పించి దివిటీలన్నీ ఆరిపోయేలాగా చేస్తుంది. వెంటనే కోన చిట్టచీకటి అయిపోతుంది. చీకట్లో ఆలమంద కనిపించకపోవడంతో కృష్ణుడు దిగులుపడి ఏమి చేయాలో పాలుపోక చీకట్లో తడుముకుంటూ తిరుగుతూ, బసవన్నను పట్టుకుంటాడు. కృష్ణుడు బసవన్న పాదాలు పట్టుకొని ఆపద నుండి రక్షించమని ఇలా వేడుకుంటాడు.

"ఆవు కడుపున పుట్టి అవతారమెత్తిన- అన్నరో మాయన్న బాల బసవన్న
నేను శివసత్తి కోనలో సిక్కులడ్డాను- ఈబారు గాయవోయి బాలబసవన్న
ఈబారు గాసి మనం రేపల్లెకెల్తేను- కొమ్ములా కెలుగైన అనిసి లెయ్యిస్తను
ఈబారు గాయవోయి బాలబసవన్న- బసవన్న పాదాలు పట్టి ఏడేను
ఈబారుగాసి నేను రేపల్లె కెల్లితే- పనకట్టు కెలుగైన పతకాల పేరు
ఈబారు గాయవోయి బాలబసవన్న- బసవన్న పాదాలు పట్టి ఏడేను
ఈబారు గాసి నేను రేపల్లె కెల్తేను- నొష్టకే ఎలుగైన నొష్టపద్దకమన్న
ఈబారు గాయవోయి బాలబసవన్న- బసవన్న పాదాలు పట్టి ఏడేను
అన్నరో మాయన్న బాలబసవన్న- అలనాడు మాతల్లి నీకిల్ల డెట్టింది
ఇల్లడేనిన వంట్ర బాలబసవన్న- ఈబారు గాసి నేను రేపల్లె కెలితేను
ముట్టికే ఎలుగైన చిటిమోర పేరులు- ఈబారు గాయవోయి బాలబసవన్న
బసవన్న పాదాలు పట్టి ఏడేను- ఉలకడు బసవన్న ఊరుకున్నాడు
ఈబారు గాసి నేను రేపల్లె కెలితేను- కంటంబు తిరుగోర గంటలాపేరు
ఈబారు గాయవోయి బాలబసవన్న- ఈబారు గాసి నేను రేపల్లె కెలితే
బొడ్డుకే ఎలుగైన బోరుగంటేద్దును- ఈబారు గాయవోయి బాలబసవన్న
ఈబారు గాసి నేను రేపల్లె కెలితే- నడుముకే ఎలుగైన నాగు టొడ్డానము
ఈబారు గాసి నేను రేపల్లె కెలితే- తీరైన తోకకే దొండకై పేరు

ఈబారు గాయవోయి బాలబసవన్న- ఈబారుగాసి నేను రేపల్లె కెలితే
నాలుగు కాళ్లకు నాగుటంజెయిస్తను- ఈబారు గాయవోయి బాలబసవన్న
బసవన్న పాదాలు పట్టి ఏడేను- అలనాడు మాతల్లి నీకిల్ల దెట్టింది
ఇల్లదేనిన వంట్ర బాలబసవన్న"

శివశక్తి కోనలో చిక్కుబడ్డ తనను రక్షిస్తే రేపల్లె కెల్లిన తర్వాత బసవన్న కొమ్ములకు అనిసెలు, పనకట్టుకు పతకాలదండ, నొసటికి పతకం, ముట్టెకు చిటిమోరదండలు, గొంతుకు గంటల దండ, బొడ్డుకు బోరుగంట, నడుముకు వడ్డాణం, అందమైన తోకకు దొండకాయలలాంటి దండ, నాలుగుకాళ్లకు అందెలు చేయిస్తానని వేడుకుంటాడు. కృష్ణుని పరిస్థితి చూసి బసవన్న జాలిపడి ఖనేల్లుమని పెద్ద రంకె వేయగానే ఆరి పోయిన దివిటీలన్నీ మళ్లీ వెలుగుతాయి. వెలుతురులో శివశక్తి భయపడి పారిపోతూ వుంటే బసవన్న ఆమె వెంటపడి పట్టుకొని ఆమెను కృష్ణుని దగ్గరికి తీసుకొని వస్తాడు. కృష్ణుడు ఆమెను క్షమించి ఇకనుంచి శివశక్తి కోనలోకి ఆలమందలు వస్తే వాటిని ఏమీ అనగూడదని చెప్పి పంపిస్తాడు.

ఆ తర్వాత కృష్ణుడు తన ఆలమందను దేవేంద్రుని కోనకు మళ్లించి మేపుతూ ఉంటాడు. దానికి దేవేంద్రుడు కోపగించి మేఘాలను పంపి కుంభవర్షం కురిపిస్తాడు. కృష్ణుడు గోవాది పర్వతాన్ని ఎత్తి గొడుగుగా పట్టుకొని గోవులను గోపాలకులను దాని కింద ఉంచి వాటిని రక్షిస్తాడు. భాగవతంలో కృష్ణుడు గోవర్ధనగిరి పర్వతాన్ని ఎత్తినట్లుగా చెప్పబడింది. మేఘాలు కురిసి కురిసి అలసిపోయి వెళ్లిపోతాయి. దానితో కోపగించిన దేవేంద్రుడు ఆకాలపిడుగును గోవాదికొండ మీద వేయిస్తాడు. పిడుగు కొండ మీద పడి దానికి రంధ్రం చేసుకొని కృష్ణుని మీదకు వస్తూ ఉంటుంది. కృష్ణుడు దాన్ని తన మామ దేవేంద్రుడు పంపిన కట్నంగా భావించి చేత పట్టుకుంటాడు. తర్వాత కృష్ణుడు శివశక్తి కోనలో తాను చిక్కు బడ్డప్పుడు తనను రక్షించిన బసవన్నకు నగలు చేయిస్తానని చెప్పిన విషయం గుర్తుకు వచ్చి కంసాలిని పిలిపించి పిడుగుతో నగలు చేయిస్తాడు. దీన్ని జానపదకవి ఇలా వివరించాడు.

"పెలపెలని ఆ పిడుగు పరుగెత్తు కెల్లింది- పరుగెత్తి ఆ పిడుగు కొండపై పడ్డాది
కొండ తొలుచుక పిడుగు ఎల్తనున్నాది- అట్టి కన్నుల జూసి నీలయెన్నుండు
మా మామ దేవేంద్రు కట్నమంపాడని- అస్త్రాల నా పిడుగు నందుకున్నాడు
అప్పుడేమన్నాడు నీలయెన్నుండు- మందపాలకులారా మాయన్నలారా
శివసత్తికోనలో నాడు మొక్కినమొక్కులు- నాడు మొక్కిన మొక్కులు నేడు చెల్లిద్దును
బసమదేముని నగలు చేయిద్దు నన్నాడు- ఇశ్వబ్రమ్మం కొడుకు ఈరన్ననే పిలిచి





కంచు ఆభరణాలతో అలంకరించబడిన తోడపెద్దు.



తోడపెద్దు కాళ్ళు కడుగుతున్న భక్తురాండ్రు

కొండ కిందన కొలిమి కాయించినాడు- బారుతిత్తుల జోడు బోరు కలిపించి
నేరడాపండండి నీలాలు బోసి- నిమ్మపండూ చాయ నిప్పు లేసేరు
ఆకాలపిడుగును పట్టి తెచ్చినారు- ఆకాల పిడుగును దాయిలెట్టేరు
ఊరేరు తిత్తిని ఉరుములను బోలె- ఎగిరేటి నిప్పులు మెరుపులను బోలు
కాకొట్టి ఆ పిడుగు కవల పూసాయ- కలపిలని ఆ పిడుగు కలిసి ఉడికింది
బుక్కకారుల తోటి నొక్కి తీసేరు- డాగల్ల మీదకి డాకలిపినారు
సుత్తితో నొకదెబ్బ సిద్ధించినారు- ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత
సాయిసిల్లొకటి చేయించినారు- అక్కడికి మిగిలింది ఆకాల పిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత- కొమ్ములా కెలుగైన అనిసె జేసేరు
అక్కడికి మిగిలింది ఆకాలపిడుగు- ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత
పనకెట్టు కెలుగైన పతకాల పేరు - పతకాల పేరులు చేయించినారు
అక్కడికి మిగిలింది ఆకాలపిడుగు- నొష్టకే ఎలుగైన నొష్ట పద్దకము
నొష్టపద్దకము చేయించినాడు- అక్కడికి మిగిలింది ఆకాల పిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత- ముట్టికే ఎలుగైన చిటిమోర పేరులు
చిటిమోర పేరులు చేయించినారు- ఆక్కడికి మిగిలింది ఆకాల పిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత- రొంటంబు కెలుగైన గంటలాపేరు
గంటలా పేరులు చేయించినారు- అక్కడికి మిగిలింది అకాల పిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత- బొడ్డుకే ఎలుగైన బోరుగంటాలు
బోరుగంటాలు చేయించినారు- అక్కడికి మిగిలింది ఆకాల పిడుగు
ఏపేరు సమ్మెట్లు రణబేరు మోత- నడుముకే ఎలుగైన నాగుటొడ్డాణము
నాగుటొడ్డాణము చేయించినారు- అక్కడికి మిగిలింది ఆకాలపిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరు మోత- నాలుగు కాళ్లకు నాగుటంజేలు
నాగుటంజలు చేయించినారు- అక్కడికి మిగిలింది ఆకాల పిడుగు
ఏసేరు సమ్మెట్లు రణబేరుమోత- తోకకే ఎలుగైన దొండకై పేరు
దొండకై పేరునే చేయించినారు"

కొండకింద కొలిమిపెట్టి కొలిమిలో పిడుగును కాల్చి దానితో బసవన్న కొమ్ములకు అనిసెలు, పనకట్టుకు పతకాల దండ, నొసటికి పతకం, ముట్టెకు చిటిమోర దండలు మొదలైన ఆభరణాలు చేయించి, వాటినన్నింటినీ బసవన్నకు వేసి అలంకరిస్తాడు. కృష్ణుడు ఆనాడు బసవన్నకు చేయించిన ఆభరణాలను ఈనాడు సేవగరిడి వారు ఇత్తడితో తోడపెద్దుకు చేయించి కళా ప్రదర్శన సమయంలో వాటి నన్నింటికి దానికి తొడుగుతూ

ఉంటారు. కళా ప్రదర్శన అయిపోయి ఇంటికి వెళ్ళిపోయిన తర్వాత ఆ సొమ్ములను తీసి జాగ్రత్త చేస్తారు. ఆభరణాలను అలంకరిచేటప్పుడు ఒక్కొక్క దాన్ని తోడపెద్దుకు వేస్తూ వీళ్ళు పాటపాడుతారు. ఈపాటలో తోడపెద్దును వీరు నీలయెన్నుడని, పద్మనాభుడు అని పాడుతారు. అంటే దాన్ని సాక్షాత్తు విష్ణువుగా భావిస్తారు.

"ముస్తాబు జేసేరు నీలయెన్నుడికి- రొంటంబు సుటుదిరగ గంటల్లపేరు
పాలనేతుల్లోను తేరగడిగేరు- సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీలయెల్లుడికి
పట్టి తొడిగీనారు పద్దనాబుడికి- కొప్పురము సుటు దిరుగ మువ్వలా పేరు
పాలనేతుల్లోను పొరగడిగేరు- సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీలయెన్నుడికి
పట్టి తొడిగీనారు పద్దనాబుడికి- నొష్టకే ఎలుగైన నొష్టపతకంబు
పాలనేతుల్లోను తేరగడిగేరు- సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీలయెల్లుడికి
పట్టి తొడిగీనారు పద్దనాబుడికి- బొడ్డుకే ఎలుగైన బోరుగంటాలు
పాలనేతుల్లోను పొరగడిగేరు- సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీల యెన్నుడికి
పట్టి తొడిగీనారు పద్దనాబుడికి- నడుముకే ఎలుగైన నాగబందాము
పాలనేతుల్లోను పొరగడిగేరు- సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చియని- నిలబెట్టి తొడిగేరు నీల యెన్నుడికి
పట్టితొడిగీనారు పద్దనాబుడికి- తోకకే ఎలుగైన దొండకై పేరు
పాలనేతుల్లోను పొరగడిగేరు - సీకటి కోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీల యెన్నుడికి
పట్టితొడిగీనారు పద్దనాబుడికి- నాలుగు కాళ్లకే నాగుటంజెలు
పాలనేతుల్లోను పొరగడిగేరు- సీకటికోనలో నాడు మొక్కిన మొక్కు
ఇదిగోర బసవన్న నీకు నిచ్చయని- నిలబెట్టి తొడిగేరు నీలయెన్నుడికి
పట్టి తొడిగీనారు పద్దనాబుడికి"

ఈ విధంగా ఆభరణాలను తొడపెద్దుకు తొడిగేటప్పుడు పాడతారు. సేవగరిడి కళాప్రదర్శన పూర్తి అయిన తర్వాత తోడపెద్దును ఇంటికి తీసుకొని వచ్చి దానికి వేసిన ఆభరణాలను ఒక్కొక్క దాన్ని తీసివేస్తూ ఇలా పాట పాడుతారు.

"పొత్తు గుడ్డలతోని ఒల్లల్ల తుడిసి- రొంటంబు సుటు దిరుగ గంటలా పేరు



నిలబెట్టి తీసేరు నీలయెన్నుడికి- నొష్టకే ఎలుగైన నొష్ట పద్దకము
నిలబెట్టి తీసేరు నీల యెన్నుడికి- కొప్పురము సుటు దిరగ మువ్వలా పేరు
నిలబెట్టి తీసేరు నీలయెన్నుడికి- మెడలోను ఎలుగైన బెల్లుగంటాలు
నిలబెట్టి తీసేరు యెన్నుడికి- బొడ్డుకే ఎలుగైన బోరుగంటాలు
నిలబెట్టి తీసేరు నీల యెన్నుడికి- నడుముకే ఎలుగైన నాగబందాము
నిలబెట్టి తీసేరు నీల యెన్నుడికి - తోకకే ఎలుగైన దొండకై పేరు
నిలబెట్టి తీసేరు నీల యెన్నుడికి- నాలుగు కాళ్లకే నాగుటంజలు
నిలబెట్టి తీసేరు నీలయెన్నుడికి"

ఈ విధంగా సేవగరిడి కళాకారులు తోడపెద్దును విష్ణుమూర్తిగాను, బసవన్నగాను భావించి భక్తితో పూజిస్తారు.

**తోడపెద్దును పట్టడం :** కోడెదూడను తోడపెద్దుగా పట్టడం, దాన్ని తోడపెద్దుగా మార్చడం మొదలైన విషయమంతా పవిత్రమైన ఆచారంగా, సంప్రదాయంగా వస్తూ ఉంది. గతంలో విశాఖపట్నం చిన్న పట్టణంగా ఉన్నప్పుడు దాని చుట్టుపక్కల ఉన్న చిన్నవాల్తేరు, శివాజీపాలెం, మువ్వలవానిపాలెం, కంచరపాలెం మొదలైన ఊర్లు చిన్న గ్రామాలుగా ఉండేవి. ఈ గ్రామాల్లో ఉండే యాదవులకు వ్యవసాయ భూములు, ఆవులు ఉండేవి. వంశపారంపర్యంగా గరిడి ఉన్న యాదవులకు ఆవులుండేవి. సాధారణంగా తోడపెద్దుగా మారబోయే కోడెదూడ గరిడి ఉన్నవారి ఇంటి ఆవుకు పుడుతుంది. పుట్టబోయే ముందు ఆ ఇంటి యజమానికి వారి ఇంట్లో తోడపెద్దు పుట్టబోతున్నట్లుగా కల వస్తుందట. కల వచ్చిన పది,హేను, ఇరవై రోజుల లోపు కాలంలో వారి ఇంటి ఆవుకు తోడపెద్దు పుడుతుందట. తోడపెద్దుగా పుట్టే దూడకు కొన్ని లక్షణాలుంటాయట. దూడ తల కూర్మావతార రూపంలో ఉంటుంది. నుదుట భాగం పంది రూపంగా ఉంటుంది. మూపురం పెద్దదిగా ఉంటుంది. పుట్టిన వెంటనే చాల చలాకీగా ఉండి దానంట అదే లేచి తల్లిపాలు తాగుతుంది. దీని తల్లి మూడు రోజులపాటు దూడకు మాత్రమే పాలు ఇస్తుంది. ఈ మూడు రోజుల్లో మనుషులు పిండితే పాలకు బదులుగా రక్తం వస్తుంది. ఇలాంటి లక్షణాలున్న దూడను, అది తల్లి పాలు వదలి వేసిన తర్వాత దానికి సింహాద్రప్పన్న అచ్చువేసి తోడపెద్దుగా మార్చుతారు. తోడపెద్దును పట్టటంలో ఇది ఒక పద్ధతి.

సేవగరిడి ఉన్నవారు మరొక పద్ధతిలో కూడా తోడపెద్దును పడతారు. కొంతమంది ఆవులు ఉన్న రైతులకు పైన చెప్పిన లక్షణాలతో కోడెదూడ పుడుతుంది. అలాంటిదూడ దేవుని దూడ అని, అది వ్యవసాయానికి పనికి రాదని రైతులు భావించి

దాన్ని సేవగరిడి ఉన్న వారికి తోడపెద్దుగా ఇచ్చి వేస్తారు. ఇలాంటి దూడను సేవగరిడి వారికి ఇచ్చి వేయడానికి ఒక పద్ధతి ఉంది. మొదట దూడ తల్లిపాలు వదలివేయాలి. వదిలి వేసిన తర్వాత వారు సేవగరిడి వారికి తమ ఇంట్లో తోడపెద్దు పుట్టిందని, దాన్ని వారికి ఇచ్చి వేస్తామని కబురు పంపిస్తారు. గరిడీవారు వచ్చి దూడను చూసు కొని అది తోడపెద్దుకు తగినదిగా వారు భావిస్తే, ఒక మంచిరోజు నిర్ణయించుకొని, ఆ రోజున వచ్చి దూడను తీసుకొని వెళ్తామని ఇంటి వారికి చెబుతారు. నిర్ణయించు కున్న మంచి రోజున ఉదయం 11 గంటల ప్రాంతంలో గరిడివారు గరిడి చేసుకుంటూ దూడ ఉన్నవారి ఇంటికి వెళ్తారు. దూడ ఉన్నవారు మూడు కుండల్లో నీరుపోసి ఆ నీటిలో చందనం, పసుపు, కుంకుమ వేసి కలిపి ఆ నీటితో దూడకు స్నానం చేయిస్తారు. స్నానం చేయించగా కొంత నీరు మిగిలి ఉంటుంది. ఆ నీటితో గరిడీ వారి పాదాలను ఇంటి యజమానురాలు కడిగి, సాంబ్రాణి, గుగ్గిలం ధూపంతో వారి పాదాలకు పొగవేస్తుంది. దూడ నుదుట, మూపురం, నాలుగు కాళ్లకు పసుపురాసి కుంకుమతో బొట్టుపెడతారు. సేవగరిడివారు కోల వెలిగించి చాల సేపు గరిడీసేవ చేస్తారు. కోల వెలిగించడానికి అవసరమైన నూనెను దూడ ఉన్న ఇంటివారు ఇస్తారు. మధ్యాహ్నం వరకు ఇలా సేవ చేస్తారు. మధ్యాహ్నం సేవగరిడీ కళాకారులందరికీ ఇంటివారు భోజనాలు పెడతారు. ఆ తర్వాత ఇంటివారు దూడను సేవగరిడి వారికి పట్టి ఇస్తారు. గరిడివారు దూడను తాడుతోకట్టి తమ వెంట తీసుకొని గరిడిసేవ చేసుకుంటూ తమ ఇంటికి వస్తారు.

**దూడకుఅచ్చువేయడం :** పైన చెప్పిన రెండు విధాల్లో ఏదో ఒక విధంగా కోడెదూడను పట్టుకున్న తర్వాత దానికి “అచ్చు” వేస్తారు. ఈ అచ్చునే సింహాద్రప్పన్న అచ్చు అని అంటారు. అచ్చు వేసే దాకా అది తోడపెద్దు గాదు. అచ్చు వేయక ముందు అది మిగిలిన అన్ని కోడెదూడల వంటి దూడ మాత్రమే. సింహాద్రప్పన్న అచ్చువేసి దాన్ని సింహాద్రప్పన్న దూడగా మార్చిన తర్వాత అది తోడపెద్దుగా పిలువబడుతుంది. అచ్చు నక్షత్రం (*) ఆకారంలో ఉంటుంది. దీన్ని ఇనుముతో తయారు చేస్తారు. అచ్చును సాధారణంగా శివరాత్రి పండుగరోజు ఉదయం పూట వేస్తారు. దూడకు అచ్చువేసే కార్యక్రమాన్ని ఒక శుభకార్యంగా ఘనంగా చేస్తారు.

అచ్చు వేసేరోజు ఇంటిముందు కళ్లాపు చల్లి ముగ్గు వేసి పందిరి వేసి మామిడాకుల తోరణాలు కడతారు. రెండు లేక మూడు గరిడీల వారిని పిలిచి ఆ పందిరి కింద గరిడీసేవ చేయిస్తారు. అచ్చు వేయడానికి ముందు దూడకు ముక్కుతాడు వేస్తారు. తర్వాత అచ్చు వేసే కార్యక్రమాన్ని ప్రారంభిస్తారు. మొదట అచ్చును కాల్చుతారు.



కొందరు అచ్చును మంచి గంధపు చెక్కతో కాల్చుతారు. కొందరు మామూలు నుగ్గులతో కాల్చుతారు. అచ్చును దూడకు వెనుక కుడికాలు పైన వేస్తారు. అచ్చు వేసే చోట దట్టంగా తడిపసుపు (నీటిలో తడిపిన పసుపు) ను పూస్తారు. తర్వాత పందిరి కింద అరిటాకులు పరచి, అరిటాకుల మీద కొత్త పంచె పరిచి, ఆపంచె మీద దూడను పడుకోబెట్టి ముందు రెండు కాళ్ల కలిపి కట్టివేస్తారు. అలాగే వెనుక రెండు కాళ్లు కలిపి కట్టివేస్తారు. తర్వాత బాగా కాల్చిన అచ్చును తెచ్చి వెనుక కుడికాలు పైన పసుపు పూసిన దగ్గర పెట్టి గట్టిగా నొక్కుతారు. అచ్చు చర్మం దాటి లోపలికి నక్షత్రం ఆకారంలో కాలుతుంది. అక్కడ నక్షత్రం ఆకారం ఏర్పడుతుంది. అచ్చువేసిన దగ్గర పసుపు పూస్తారు. గాయం మానిపోయే వరకు పసుపు పూస్తూ ఉంటారు. అచ్చుగుర్తు ఎప్పటికీ పోదు. గాయం మానిపోయినా గుర్తు ఎప్పటికీ అలాగే ఉండిపోతుంది. అచ్చు వేసినప్పటి నుంచి ఆ దూడ తోడపెద్దుగా పిలువబడుతుంది. అప్పటి నుంచి సేవగరిడీవారు తాము కళాప్రదర్శన చేసే దగ్గరికి తోడపెద్దును అలంకరించి పట్టుకొని వెళ్లి దానిముందు గరిడీసేవ చేస్తూ ఉంటారు.

సేవగరిడివారు దూడకు శివరాత్రినాడు అచ్చు వేసిన తర్వాత అదే రోజు దూడను తీసుకొని అప్పికొండ అనే (అప్పికొండ విశాఖపట్నం స్టీలుప్లాంటు దగ్గర ఉంది) ఊర్లో ఉన్న సోమేశ్వర్వామి ఆలయానికి వెళ్తారు. గరిడివారు ఈ స్వామిని అప్పికొండ సోమన్న అని పిలుస్తారు. సోమన్న ఈశ్వరుడు. శివరాత్రినాటి రాత్రి సమ యానికి కొత్తగా అచ్చు వేసిన తోడపెద్దును తీసుకొని సోమన్న గుడికి వెళ్లి, ఆ స్వామిని దర్శించి, ఆ రోజు రాత్రంతా మేల్కొని స్వామి ఎదురుగా గరిడిసేవ చేస్తూ దశావతారా లను పాడుతారు. తెల్లవారిన తర్వాత ఉదయమే అక్కడున్న సముద్రంలో తోడపెద్దుకు స్నానం చేయించి, తాము గూడా స్నానం చేసి తమ ఊరికి తిరిగి వస్తారు. గతంలో అప్పికొండకు తోడపెద్దును తోలుకొని నడిచి వెళ్లేవారు. లేదా ఎడ్లబండ్ల మీద వెళ్లేవారు. ప్రస్తుతం విశాపట్నంలో ఎవరికి ఎద్దులు లేవు. అందువల్ల సేవగరిడీ వారు ఒక వ్యాన్ అద్దెకు తీసుకొని అందులో తోడపెద్దును ఎక్కించుకొని అప్పికొండకు వెళ్లి శివరాత్రి నాటి రాత్రంతా గరిడీ చేస్తూ జాగరణ చేసి మరుసటిరోజు ఉదయమే అదే వ్యాన్‌లో తిరిగి వస్తున్నారు.

తోడపెద్దుకు అచ్చు వేసిన మరుసటి సంవత్సరం శివరాత్రికి గరిడీవారు తోడపెద్దును తీసుకొని రామతీర్థం (రామతీర్థం విజయనగరం జిల్లా నెల్లిమర్ల దగ్గర ఉంది) అనే ఊరికి వెళ్తారు. గరిడివారు ఈ స్వామిని రాంగుళ్ల రామన్న అని పిలుస్తారు. ఇక్కడ ఉన్న రామాలయంలోని రాముని దర్శించి ఆ రోజు రాత్రంతా సేవగరిడీ చేస్తూ

జాగరణ చేస్తారు. తెల్లవారిన తర్వాత తోడపెద్దుకు స్నానం చేయించి, తాము గూడా స్నానం చేసి తిరిగి వస్తారు.

తర్వాత సంవత్సరం అంటే మూడవ సంవత్సరం శివరాత్రికి గరిడీవారు సింహాచలం వెళ్తారు. కింది నుంచి కొండపైకి తోడపెద్దుతో మెట్లు ఎక్కి వెళ్లి కొండపైన పుట్టుధార దగ్గర తోడపెద్దుకు స్నానం చేయించి, గరిడీ వారందరూ గూడ స్నానం చేసి సింహాద్రప్పన్న దర్శనం చేసుకొని నడిచి కొండ దిగి వచ్చి, అక్కడ ఆ రోజు రాత్రంతా గరిడీ సేవ చేస్తూ జాగరణ చేస్తారు. తెల్లవారిన తర్వాత అడివార చెరువులో తోడపెద్దుకు స్నానం చేయించి తాము గూడ స్నానం చేసి తమ ఊరికి వస్తారు.

గరిడీవారు మరుసటి సంవత్సరం అంటే తోడపెద్దుకు అచ్చు వేసిన తర్వాత నాల్గవ సంవత్సరం శివరాత్రికి "ఉప్మాక" (ఉప్మాక విశాఖపట్నం జిల్లా నక్కపల్లి దగ్గర ఉంది) అనే ఊర్లో ఉన్న వేంకటేశ్వరస్వామిని దర్శించడానికి తోడపెద్దుతో కలిసి వెళ్తారు. వీరు ఈ స్వామిని ఉప్మాక వెంకన్న అనిపిలుస్తారు. ఆరోజు స్వామిని దర్శించి ఆ రాత్రంతా గరిడీసేవ చేస్తూ దశావతారాలు పాడుతూ జాగరణ చేసి, తెల్లవారిన తర్వాత తోడపెద్దుకు స్నానం చేయించి తాము గూడ స్నానం చేసి తిరిగి వస్తారు.

ఈ విధంగా సేవగరిడీవారు తోడపెద్దుకు అచ్చు వేసిన తర్వాత మొదటి సంవత్సరం శివరాత్రికి అంటే అచ్చు వేసిన రోజే అప్పికొండ సోమన్నను, రెండవ సంవత్సరం శివరాత్రికి రామతీర్థంలో రాముణ్ణి, మూడవ సంవత్సరం శివరాత్రికి సింహాద్రప్పన్నను, నాల్గవ సంవత్సరం శివరాత్రికి ఉప్మాక వెంకన్నను వరుసగా దర్శించి ఆ దేవుళ్ల ముందు సేవగరిడీ చేస్తూ దశావతారాలను గానం చేస్తూ జాగరణ చేస్తారు. సేవగరిడి ప్రధానంగా వైష్ణవ సంప్రదాయానికి చెందిన జానపద కళ అయిన ప్పటికి వీరు శివరాత్రినాడు కోడెదూడకు సింహాద్రప్పన్న అచ్చువేసి తోడపెద్దుగా మార్చడం, అదేరోజు అప్పికొండలో ఉన్న సోమేశ్వరస్వామిని (శివుని) దర్శించి రాత్రంతా గరిడీసేవ చేస్తూ విష్ణువు అవతారాలను గానం చేయడం, అంతేగాకుండా ప్రతి శివరాత్రి పండుగనాడు తప్పనిసరిగా రాత్రంతా మేలుకొని గరిడీసేవ చేయడం చూస్తే వీరు హరిహరాభేదాన్ని పాటిస్తూ శైవవైష్ణవ మతాల మధ్య సామరస్యం కోసం కృషి చేసిన వారని స్పష్టమవుతూ ఉంది. శైవవైష్ణవ మతాల్లో వీరం చేరి, రెండు మతాల వారు పరస్పరం విద్వేషాన్ని పెంచుకొని శత్రువులుగా మారి రక్తపుటేరులు పారించి, ఆ తర్వాత వీరం పోయి సయోధ్య కుదిరి మతసహనం కోసం ప్రయత్నాలు జరుగుతున్న కాలంలో సేవగరిడి కళ పుట్టి, హరిహరాభేదాన్ని ప్రచారం చేసిందని చెప్పవచ్చు.

సేవగరిడివారు తోడపెద్దుకు అచ్చువేసిన తర్వాత గతంలో ఊరి మీద వదలి



వేసేవారు. గతంలో విశాఖపట్నం చుట్టు పక్కల వ్యవసాయ భూములు, బీడు భూములు ఉండేవి. తోడపెద్దు ఆ భూముల్లో పచ్చిగడ్డి తిని బతికేది. ప్రజలు దాన్ని దేవుడుగా భావించి అది ఎక్కడ తిరిగినా ఏమి తిన్నా ఏమీ అనేవారు కాదు. అది అప్పుడప్పుడు తనను వదిలిన గరిడి వారి ఇంటికి వచ్చేది. అలా వచ్చినప్పుడు వారు దానికి తవుడు, చిట్టు మొదలైన ఆహారం పెట్టేవారు. దానితో పని ఉన్నప్పుడు గరిడీ వారు దాన్ని వెదకి పట్టుకొని వచ్చి సేవగరిడి కళాప్రదర్శన దగ్గరికి తీసుకొని వెళ్తారు. మిగిలిన సమయంలో అది ఊరిమీద తిరుగుతూ ఉండేది.

ప్రస్తుతం విశాఖపట్నం చుట్టుపక్కల పల్లెటూళ్లను తనలో కలుపుకొని నగరంగా మారిపోవడం వల్ల వ్యవసాయ భూములు, బీడుభూములు అన్నీ ఇళ్లుగా రూపాంతరం చెందాయి. అందువల్ల ఇప్పుడు తోడపెద్దులు తిరగడానికి ఖాళీస్థలం గానీ, మేయ డానికి పచ్చిగడ్డి గానీ దొరకడం లేదు. ఈ కారణం చేతనే చాల మంది సేవగరిడీ వారు తోడపెద్దులను పట్టడం లేదు. విశాఖపట్నంలో సేవగరిడీని వంశపారంపర్యంగా ప్రదర్శించే యాదవ కుటుంబాలు చాలా ఉన్నాయి. వెంకోజీపాలెంలో ఒమ్మి వారు, మువ్వలవానిపాలెంలో మువ్వల వారు, శివాజీపాలెంలో బుద్దలవారు, చిన్నవాల్తేరులో కొయ్యవారు, శ్రీరంగాపురంలో సారిపిల్లివారు, సీతంపేటలో ఒమ్మివారు, కంచరపాలెంలో నమ్మివారు, చినగదిలిలో గొలవానివారు, పెదగదిలిలో ఒమ్మివారు మొదలైన వారు సేవగరిడీ కళను ప్రదర్శిస్తున్నారు. వీరే గాకుండా చాలా కుటుంబాల వారు సేవగరిడీ కళను వంశపారంపర్యంగా ప్రదర్శిస్తున్నారు. వీరిలో కంచరపాలానికి చెందిన నమ్మి వారు మాత్రమే క్రమం తప్పకుండా తోడపెద్దును పట్టి సాకుతున్నారు. తోడపెద్దు పన్నెండు సంవత్సరాలకు మించి జీవించదు. ఒక తోడపెద్దు చనిపోయిన వెంటనే మరొక దూడను పట్టి సాకడాన్ని క్రమం తప్పకుండా తోడపెద్దును సాకడం అంటారు. ఈ విధంగా క్రమం తప్పకుండా కంచరపాలెంలో ఉన్న నమ్మివారు మాత్రమే తోడపెద్దును పట్టి సాకుతున్నారు. మిగిలిన వారెవ్వరూ తోడపెద్దును పట్టడం లేదు. ఈమధ్య శివాజీపాలేనికి చెందిన బుద్దలవారు, మువ్వలవానిపాలేనికి చెందిన మువ్వల వారు కూడా దూడను పట్టి అచ్చు వేసి, దాన్ని ఇంటి దగ్గర కట్టేసి మేపుతున్నారు. కంచరపాలెంకు చెందిన నమ్మివారు కూడా చాల కాలం నుంచి తోడపెద్దును ఊరిమీద వదలివేయకుండా కట్టేసి మేపుతూ పెంచుతున్నారు.

తోడపెద్దును కట్టేసి పెంచేవారు దాన్ని చిన్నపిల్లలను పెంచినట్లు పెంచుతారని సేవగరిడి వారు చెబుతారు. దానికి ప్రతిరోజు స్నానం చేయిస్తారు. గడ్డి, తవుడు, ఉడకబెట్టిన మినుములు, గంట్లు, తెలగపిండి మొదలైన వాటిని ఆహారంగా

పెడతారు. తోడపెద్దుకు ఎంగిలి ఆహారం పెట్టరు. అలా ఎంగిలి ఆహారం పెట్టడం పాపంగా గరిడీవారు భావిస్తారు. తోడపెద్దును ఇలా కట్టేసి మేపడం ఖర్చుతో కూడుకున్నదే. అయితే సేవగరిడీవారు తోడపెద్దును పెంచడం కష్టంగానూ, భారం గానూ భావించరు. అది తమ ఇంట్లో ఉండడం వల్ల తమ కుటుంబానికి శుభం కలుగుతుందని, సిరి సంపదలు కలుగుతాయని వీరు భావిస్తారు. తోడపెద్దును మేపడానికి అయ్యే ఖర్చు తోడపెద్దే సంపాదించుకుంటుందని వీరు చెబుతారు. విశాఖపట్నం ప్రాంతంలోని ప్రజలు అనేక కారణాలచేత సేవగరిడి కళను ప్రదర్శింప జేస్తారు. ఇలా ప్రదర్శింప జేయించినప్పుడు వారు వెయ్యిరూపాయల దాకా డబ్బు ఇస్తారు. ఇలా వచ్చిన డబ్బును తోడపెద్దు కోసం ఖర్చు చేస్తూ ఉంటారు.

తోడపెద్దు చిన్నగా ఉన్నప్పుడు గానీ, పెరిగి పెద్దదైనప్పుడు గానీ ఎవరినీ ఏమీ అనదు. చిన్నపిల్లలు దాని దగ్గరికి వెళ్ళినా పొడవడం గానీ, తన్నడం గానీ చేయదు. ఎవరైనా దాన్ని తిట్టడం, కొట్టడం చేస్తే, అలాంటి వారిని పొడుస్తుంది. గరిడీ వారు దాన్ని సింహాద్రప్పన్నగా, బసవదేవునిగా భావించి పూజ్యభావంతో చూస్తూ ఉంటారు. పండుగ రోజుల్లో తోడపెద్దుకు పసుపు కుంకుమ పెట్టి పూజిస్తారు. ఇంట్లో దేవుని దగ్గర పూజ అయిపోయిన తర్వాత తాము చేసుకున్న ఆహార వస్తువులన్నీ అరిటాకులో పెట్టి మొదట తోడపెద్దుకు పెట్టి ఆ తర్వాతనే ఇంట్లోవారు తింటారు. ముఖ్యంగా సంక్రాంతి పండుగ నాడు అరటిపళ్ళు, కొబ్బరికాయ నుంచి తీసిన పచ్చికొబ్బరి, అరిసెలు మొదలైనవి అరిటాకులో పెట్టి తోడపెద్దుకు పెడతారు.

తోడపెద్దు చనిపోతే సేవగరిడీవారు దానికి అంత్యక్రియలు ఘనంగా చేస్తారు. మనిషి చనిపోతే శవాన్ని శ్మశానానికి తీసుకొనివెళ్ళి పూడ్చడం గానీ, కాల్చడం గానీ చేస్తారు. కానీ తోడపెద్దు చనిపోతే దాని శరీరాన్ని శ్మశానానికి తీసుకొని వెళ్లరు. సేవగరిడి వారికి స్వంతపొలం గానీ, ఖాళీస్థలం గానీ ఉంటే ఆ ఖాళీస్థలంలో పుడ్చిపెడతారు. ఖాళీస్థలం లేకపోతే తమ ఇంటి ముందు గొయ్యి తీసి పాతిపెడతారు. తోడపెద్దును పూడ్చడానికి గూడ ఒక పద్ధతి ఉంది. మొదట తోడపెద్దును పూడ్చడానికి అవసరమైన పెద్దగొయ్యి తవ్వుతారు. ఆ గొయ్యిలో రెండు, మూడు బస్తాల ఉప్పు పోస్తారు. ఉప్పు పోయడంవల్ల తోడపెద్దు శరీరం త్వరగా పాడుగాదు. ఉప్పు మీద అరిటాకులు పరుస్తారు. అరిటాకుల పైన మర్రికొమ్మ, పాలకొమ్మ, వెదురుకొమ్మ వేస్తారు. అంతేగాకుండా గన్నేరుపువ్వులు, నూరువరాల పువ్వులు, వెయ్యివరాల పువ్వులు, తులసి ఆకు, మారేడుఆకు, నేరేడు ఆకులు, అత్తరు, పన్నీరు మొదలైనవి వేసి వాటిపైన తోడుపెద్దు శరీరాన్ని గొయ్యిలో దించుతారు. ఎద్దు పైన కొత్త తెల్లటి గుడ్డను



కప్పుతారు. దానిపైన మట్టి పోస్తారు. తోడపెద్దుకు ఇలా అంత్యక్రియలు చేసే రోజు తమ గరిడీ మాత్రమే గాకుండా మరొక రెండు మూడు గరిడీల వారిని రప్పించి గరిడీసేవ చేయిస్తారు. ఈ సందర్భంలో గరిడీవారు కృష్ణావతారంలో చివరి భాగమైన కృష్ణుడు అవతారాన్ని వదిలివేసి వైకుంఠానికి వెళ్ళిపోయిన కథను పాడతారు. గరిడీవారు తోడపెద్దుకు అంత్యక్రియలు ప్రారంభించే దగ్గర నుంచి పూర్తి అయ్యేవరకు అంటే తోడపెద్దును పూడ్చిపెట్టే వరకు గరిడీసేవ చేస్తారు. అంత్యక్రియలు పూర్తి అయిన తరువాత గరిడి ఆపేస్తారు. ఆ తరువాత తోడపెద్దు చనిపోయిన సంవత్సరం లోపల దాన్ని పూడ్చిన చోట పైభాగంలో సిమెంట్‌తో తిన్నె గట్టి ఆ తిన్నెమీద తులసికోట కడతారు. ప్రతిరోజు తులసికోటలో ఉన్న తులసి మొక్కకు నీళ్ళు పోస్తూ దీపం వెలిగిస్తారు. ఈ విధంగా సేవగరిడీ కళాకారులు తోడపెద్దును ఎంతో పవిత్రంగా పూజ్యభావంతో చూస్తారు.

సేవగరిడి భక్తిప్రధానమైన కళ కావడంవల్ల ఈ కళాకారులు నియమ నిష్ఠలను పాటిస్తారు. గరిడి చేసేటప్పుడు సాధారణంగా మూత్రవిసర్జనకు గానీ, మలవిసర్జనకు గానీ వెళ్ళరు. ఒకవేళ తప్పనసరి పరిస్థితిలో మూత్రవిసర్జనకు వెళితే కాళ్ళు మొగం కడుక్కొని వచ్చి గరిడీ సేవలో పాల్గొంటారు. మలవిసర్జనకు వెళితే స్నానం చేసి వచ్చి గరిడిసేవలో పాల్గొంటారు. గరిడిసేవ చేసేటప్పుడు బీడీ, చుట్ట, సిగరెట్టు మొదలైనవి కాల్చరు. సారా, కల్లు లాంటి మద్యపానం కూడా సేవించరు. గరిడిసేవ ముందురోజు స్త్రీ సంగమం చెయ్యరు. ఎంగిలి తాగడం, తినడం చెయ్యరు. కళాప్రదర్శన సమయంలో కాలికి జోడు వేసుకోరు. సాధారణంగా వీరు గరిడిసేవ చేసేటప్పుడు తెల్లపంచె, తెల్లచొక్కా వేసుకొంటారు. ఐతే ఇప్పుడు ఈ దుస్తులకు సంబంధించిన నియమాన్ని పెద్దగా పాటించడం లేదు. సేవగరిడి కళాకారులను "దాసులు" అంటారు. ఈ దాసులు ఎప్పుడు గూడా చావు భోజనం, సమర్త భోజనం, పురుడు భోజనం చెయ్యరు. సొరచేపను తినరు. విష్ణువు మత్స్యావతారాన్ని ధరించినప్పుడు సొరచేప రూపాన్ని ధరించాడని అందువల్ల తాము సొరచేపను తినమని వీరు చెబుతారు. అలాగే పంది మాంసాన్ని కూడా తినరు. విష్ణువు వరాహావతారాన్ని ధరించాడు కాబట్టితాము పంది మాంసం తినమని వీరు చెబుతారు.

సేవగరిడి కళాకారులు బెత్తు, నెమలికుంచె, కోలలు, తాళాలు అనే పరికరా లను కళా ప్రదర్శన సందర్భంలో ఉపయోగిస్తారు. ఈ కళాకారులు ఈ పరికరాలను కూడా దైవంగా భావిస్తారు. సేవగరిడి కళను తరతరాలుగా చేస్తున్న వారి ఇళ్ళలో దేవుని గది ప్రత్యేకంగా ఉంటుంది. ఈ దేవుని గదిని పెద్దిల్లు అని అంటారు. ఆ గదిలో

ఒక అటక ఉంటుంది. సేవగరిడి కళాప్రదర్శన సమయంలో ఉపయోగించే పరికరాలను ఈ అటక మీద పెడతారు. గరిడి సేవకు వెళ్ళేటప్పుడు అటక మీద నుంచి పరికరాలను కిందకు దింపి వాటిని పూజించి సాంబ్రాణి పొగ వేసి గరిడిసేవకు తీసుకొని వెళతారు. గరిడిసేవ అయిపోయిన తర్వాత మళ్ళీ వాటికి సాంబ్రాణి పొగ వేసి అటక మీద పెడతారు.

గరిడిసేవను తరతరాలుగా చేస్తున్న దాసులు సంక్రాంతి పండుగ ముందు వచ్చే శనివారాన్ని చాలా ముఖ్యమైనదిగా భావిస్తారు. ఈ శనివారం రోజు దాసులు చనిపోయిన తమ పెద్దలకు బట్టలుపెట్టి, సేవగరిడి పరికరాలను అటకమీద నుంచి కిందికి దింపి వాటిని పూజించి కోల వెలిగించి తమ ఇంటిముందు గరిడిసేవ చేస్తారు. ఆ మరుసటిరోజు నుంచి సంక్రాంతి పండుగ అయిపోయేవరకు తమ ఊర్లోను, చుట్టుపక్కల ఊర్లలోను గరిడి సేవచేస్తూ చందాలు వసూలు చేస్తారు. ఇలా చందాలు కోసం వెళ్ళినప్పుడు కోలను వెలిగించరు. తాళాలను వాయిస్తూ దశావతార కథలను పాడతారు. సంక్రాంతి పండుగ చివరి రోజైన కనుమరోజు గరిడి పరికరాలకు సాంబ్రాణి పొగ వేసి అటకమీద ఉంచుతారు.

ఈ విధంగా సేవగరిడి కళాకారులు తోడపెద్దును, సేవగరిడి పరికరాలను ఎంతో భక్తిభావంతో చూస్తారు.

## గంగిరెద్దులాట - స్వరూప స్వభావాలు - చరిత్ర :

గంగిరెద్దును ఆడించి పొట్టపోసుకొనే వారిని గంగిరెద్దుల వారు అంటారు. వీరి ప్రదర్శనను "గంగిరెద్దులాట" అంటారు. ఆంధ్రదేశంలో గంగిరెద్దులవారు అన్ని జిల్లాల్లో ఉన్నారు. గంగిరెద్దుల వారిని తెలియని ఆంధ్రుడు ఉండడు అని చెప్పడం అతిశయోక్తి కాదు. అంటే వీరు ఆంధ్రదేశంలో అంత బాగా ప్రసిద్ధి పొందారన్నమాట. ఆంధ్రదేశంలోని గంగిరెద్ల వారందరూ యాదవకులానికి చెందినవారే. వీరందరూ పూజగొల్ల శాఖకు చెందిన వారు. ఐతే వీరు తాము యాదవులమని చెప్పుకోరు. "గంగిరెద్దులవారమనే" చెప్పుకుంటారు. ప్రత్యేకించి మీదేకులమని అడిగితే అప్పుడు గొల్లలం అని సమాధానం చెబుతారు. వృత్తిని బట్టి కులం ఏర్పడిందని చెప్పడానికి గంగిరెద్దులవారిని మంచి ఉదాహరణగా చెప్పవచ్చు. వీరు గొల్లకులస్థులైనప్పటికీ వీరి వృత్తి గంగిరెద్దును ఆడించటం కావడం వల్ల వీరు గంగిరెద్దులవారుగా ప్రసిద్ధులయ్యారు. ప్రభుత్వంవారు వీరిని వెనుకబడిన తరగతుల్లో "ఎ" వర్గంలో గంగిరెద్దులవారు అనే పేరుతో చేర్చారు. నిజానికి వీరిని షెడ్యూల్డ్ తెగల్లో చేర్చాలి. వీరు ఇప్పటికీ పొట్టకూటి



కోసం సంచార జీవనం చేస్తూ అత్యంత దయనీయమైన జీవితాన్ని గడుపుతున్నారు. తాము దయనీయమైన జీవితాన్ని గడుపుతున్నా మన్న సంగతి కూడా వీరికి తెలియదు. ఏమాత్రం చైతన్యం లేకుండా దుర్భరమైన పరిస్థితుల్లో కాలం వెళ్ళదీస్తున్నారు. ఇప్పటికీ వీరిలో అక్షరజ్ఞానం ఉన్నవారు లేరంటే అతిశయోక్తి కాదు. వీరి చుట్టూ ఉన్న సమాజం హైటెక్ యుగంలోకి రాకెట్ వేగంతో దూసుకొని పోతూ ఉంటే వీరు మాత్రం ఆదిమానవుల లాగా సామూహిక జీవితాన్ని గడుపుతూ సంచార జీవనం చేస్తున్నారు. అందువల్ల వీరి దయనీయ స్థితిని గమనించి ప్రభుత్వం వారు వీరిని షెడ్యూల్డ్ తెగల్లో చేర్చి వీరి బాగుకు కృషి చేయాలి.

విశాఖపట్నం జిల్లా లంకెలపాలెం దగ్గర ఉన్న గంగిరెద్దు కళాకారులైన దొనకొండ మరిదయ్య బృందం వారి దగ్గరనుంచి, రంగారెడ్డి జిల్లా కీసర మండలం అంకిరెడ్డి పల్లె గ్రామనివాసులైన బైకాని మల్లేశ్ గారి దగ్గరనుంచి నేను గంగిరెద్దుల వారికి సంబంధించిన విషయాలను సేకరించాను.

గంగిరెద్దులాట ఆంధ్రదేశం అంతటా బాగా ప్రసిద్ధి పొందిన జానపద కళ. ఇందులో వినోదంతో పాటు భక్తి కూడా ఉంది. అందువల్ల ఇది వినోదం భక్తి ఉన్న ఉభయ ప్రధానమైన కళ. గంగిరెద్దులవారు అనేక రకాల జానపద గేయాలను, కథాగేయాలను పాడతారు. అందువల్ల ఈ కళ సాహిత్యం ఉన్న కళ వర్గానికి చెందు తుంది. గంగిరెద్దులవారు అనాది నుంచీ వంశపారంపర్యంగా ఈ కళను ప్రదర్శిస్తున్నారు. అందువల్ల ఈ కళ ఒకే కులానికి పరిమితమైన కళగా చెప్పవచ్చు. ఈకళలో పురుషులు మాత్రమే పాల్గొంటారు. స్త్రీలు పాల్గొనరు. ఈకళను పగలు, రాత్రి అని భేదం లేకుండా అన్ని వేళల్లో ప్రదర్శిస్తారు.

గంగ + ఎద్దు = గంగెద్దు. గంగెద్దు పదమే కాలక్రమంలో గంగిరెద్దుగా మారింది. ఇందులో "గంగ" పదానికి పెద్దది అని అర్థం. దీని ప్రకారం గంగెద్దు అంటే పెద్ద ఎద్దు అని అర్థం. గంగెద్దుల వారు అంటే పెద్ద ఎద్దు కలిగినవారు అని అర్థం. అయితే గంగ పదానికి పవిత్రమైనది అనే అర్థం కూడా ఉంది. గంగానది అంటే పెద్దనది అనే అర్థంతోపాటు, పవిత్రమైన నది అనే అర్థంకూడా చెప్పబడుతూ ఉంది. అలాగే గంగెద్దు అంటే పెద్ద ఎద్దు అని, పవిత్రమైన ఎద్దు అని రెండు అర్థాలను చెప్పవచ్చు. గంగిరెద్దును గ్రామీణులు పవిత్రమైనదిగా పూజిస్తారు. దీని నుదుట పసుపు కుంకుమ పెట్టి హారతులివ్వడం కూడా చేస్తారు. అందువల్ల గంగిరెద్దు అంటే పవిత్రమైన ఎద్దు అని కూడా చెప్పవచ్చు.

గంగిరెద్దులాట చాలా ప్రాచీనమైంది. ఈ ఆట పుట్టుకను గురించి తెలిపే

పౌరాణిక కథ ఒకటి ప్రచారంలో ఉంది. గంగిరెద్దులాట ఎలా పుట్టింది అని ఏ గంగిరెద్దుల వారిని ప్రశ్నించినా ఈ కథనే చెబుతారు. విశాఖజిల్లా లంకెలపాలెం దగ్గర ఉన్న గంగిరెద్దుల వారిలో ఒకరైన దొనకొండ మరిడయ్యగారు నాకు ఈ కథను చెప్పారు. మరిడయ్యగారికి అరవై సంవత్సరాల వయసు ఉంటుంది. వీరు అనేక రకాల గేయాలను, కథాగేయాలను అలవోకగా పాడతారు. చిన్నప్పుడు ఒకటవ తరగతి వరకు మాత్రమే చదువుకున్నారు. తెలుగు అక్షరాలను అతి కష్టంమీద చదవగలరు. కానీ అతను అనేక కథాగేయాలను తడుముకోకుండా ధారాళంగా పాడడం చూస్తే అతనికి గల శ్రుత పాండిత్యానికి, జ్ఞాపకశక్తికి ఆశ్చర్యం వేస్తుంది. అంతేకాదు అతను కొన్ని కథాగేయాలను సొంతంగా కల్పించగలడు. అతను కల్పించి చెప్పిన "లక్ష్మీపూజ పాట" అనే కథాగేయాన్ని నేను అతని నుంచి సేకరించాను. కథాగేయాలను పాడేటప్పుడు ఇతను రసానుగుణంగా హావభావ యుక్తంగా చక్కగా పాడగలడు. అలాంటి మరిడయ్యగారు తమ గంగిరెద్దులాట పుట్టుకను గురించి చెప్పిన కథ ఇది.

పూర్వం గజాసురుడు అనే రాక్షసుడు శివుని గురించి ఘోరమైన తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకోమని గజాసురుని అడుగుతాడు. అప్పుడు గజాసురుడు నీవు మరెక్కడా ఉండకుండా నా శరీరంలోనే ఉండాలి అని గజాసురుడు శివుణ్ణి కోరుతాడు. శివుడు చేసేదిలేక అలాగేనని గజాసురునికి చెప్పి శివలింగం రూపంలో గజాసురుని పొట్టలో కొలువై ఉంటాడు.

కైలాసంలో పార్వతి శివుని కోసం చూసి చూసి చివరికి అతను రాకపోవడం చేత విష్ణువు దగ్గరకు వెళ్ళి శివుడు కనిపించకపోవడాన్ని గురించి చెప్పి శివుడు ఎక్కడ ఉన్నాడో తెలపవలసిందిగా కోరుతుంది. విష్ణువు తన దివ్యదృష్టితో శివుడు గజాసురుని పొట్టలో ఉన్న విషయాన్ని గ్రహించి త్వరలోనే శివుని తీసుకొని వస్తానని పార్వతికి మాట ఇచ్చి ఆమెను పంపిస్తాడు.

తరువాత విష్ణువు, బ్రహ్మ, దేవేంద్రుడు మొదలైన దేవలతోను, నారదుడు, తుంబురుడు మొదలైన వారితోను కలిసి గంగిరెద్దుల వారి వేషాన్ని ధరిస్తారు. శివుని వాహనమైన "నంది"ని గంగిరెద్దుగా మార్చి అందరూ కలిసి గజాసురుని పట్టణానికి వెళ్ళి అపూర్వంగా గంగిరెద్దులాటను ప్రదర్శిస్తూ ఉంటారు. వీరి ప్రదర్శనా విధానాన్ని భటుల ద్వారా విన్న గజాసురుడు వారిని పిలిపించి తన ఎదుట ఆటను ప్రదర్శించమని చెబుతాడు. దానికి విష్ణువు మొదలైన దేవతలు సంతోషించి, గంగిరెద్దులాటను అద్భుతంగా ప్రదర్శిస్తారు. ఆ ప్రదర్శనకు గజాసురుడు ముగ్ధుడై సంతోషించి మీకు



ఏమికావాలో కోరుకొండి, తప్పకుండా ఇస్తాను అని చెబుతాడు. అప్పుడు విష్ణువు స్వార్థంతో నీవు శివుని నీలోనే ఉంచుకున్నావు, శివుడు లేకపోవడం వల్ల పార్వతీదేవి మొదలైనవారు ఎంతగానో బాధపడుతున్నారు. కాబట్టి నీలో ఉన్న శివుని బయటకు పంపించు అని చెబుతాడు. విష్ణువు మాటలు విన్నతరువాత వచ్చిన వాళ్ళు మామూలు గంగిరెద్దులవారు కాదని శివుని తీసుకొని వెళ్ళడానికి వచ్చిన విష్ణువు మొదలైన దేవతలని గ్రహించి, తనకు చావు తప్పదని తెలుసుకొని శివుని ప్రార్థించి నందీశ్వరునికి ఎదురుగా నిలబడతాడు. అప్పుడు విష్ణువు నందీశ్వరుని ప్రేరేపిస్తాడు. వెంటనే నందీశ్వరుడు తన కొమ్ములతో గజాసురుని పొట్టను చీల్చగా శివుడు బయటపడతాడు.

పైవిధంగా గంగిరెద్దులాటను మొదట విష్ణువు, దేవేంద్రుడు మొదలైనవారు కల్పించారని గంగిరెద్దులవారు చెప్పుకుంటారు. పై కథను నేదునూరి గంగాధరం గారు "మున్నీరు" అనే తమ గ్రంథంలో పొందుపరిచారు. దేవతలు కల్పించిన గంగిరెద్దులాట గంగిరెద్దులవారికి వచ్చిన విధానాన్ని గురించి తెలియజేసే మరొక కథను నేదునూరి గంగాధరంగారు"[11] ఇలా వివరించారు.

గజాసురుని పొట్టలో నుంచి శివుని బయటకు రప్పించి సంతోషంతో వస్తున్న దేవతలకు మిథిలాపురి పట్టణం పొలిమేరలో ఒక వ్యక్తి ఏడుస్తూ కనిపిస్తాడు. ఎందుకు ఏడుస్తున్నావని దేవతలు అతన్ని ప్రశ్నిస్తారు. దానికి అతడు మాది మిథిలాపురం, మా వూరి రాజు జనకమహారాజు "ఎవరి కుల వృత్తులు వారు చేయాలి" అని శాసించాడు. నాది సంకరకులం ఏ కులవృత్తీ లేక నేను ఏడుస్తున్నాను అని చెబుతాడు. అప్పుడు దేవతలందరూ భయపడకు ఇదిగో ఈ గంగిరెద్దు వృత్తిని చేసుకో అని గంగిరెద్దులాట విధానాన్ని అతనికి నేర్పించి వెళ్ళిపోతారు. అప్పటి నుంచి గంగిరెద్దులాట అతని వంశం వారికి పరంపరగా వస్తూ ఉంది.

పైన చెప్పిన కథలు హేతువుకు నిలిచేవికావు. గంగిరెద్దులవారు తమ కళా పవిత్రతను, ప్రాచీనతను గొప్పగా చెప్పుకోవడానికి పై కథలను కల్పించి ఉంటారు. ఏమైనప్పటికీ గంగిరెద్దులాట చాలా ప్రాచీన కాలం నుంచి ఉందని ఈ కథలనుబట్టి మనం గ్రహించవచ్చు.

మన ప్రాచీన కవుల్లో శ్రీనాథుడు తన "పల్నాటి వీరచరిత్ర"లో –

"గంగిరెద్దులవాడు కావరమణచి
ముకుదాడు పొడిచిన పోట్లెద్దులట్లు"[12]

అని గంగిరెద్దులవారిని గురించి ప్రస్తావించాడు. దీన్ని బట్టి శ్రీనాథుని కాలం నాటికే గంగిరెద్దులాట ప్రసిద్ధంగా ఉన్నట్లు మనం గ్రహించవచ్చు.

**గంగిరెద్దును పట్టడం :** గంగిరెద్దులవారు తమ ఆటకు అవసరమైన ఎద్దును రైతుల దగ్గర నుంచి సంపాదిస్తారు. కొడెదూడలు కొన్ని మామూలుగా కాకుండా కొన్ని ప్రత్యేక లక్షణాలతో పుడతాయి. మూపురం దగ్గర కాలు లాంటిది ఉండడం లేక మాంసపు ముద్ద వంటి భాగం ఉండడం లేక నాలుక ఆకారం ఉన్న అవయవం ఉండడం, తోక మొదలు దగ్గర మరొక తోక లాంటి అవయవముండడం ఇలా అనేక విధాలైన ప్రత్యేకతలు ఉన్న కోడెదూడ ఎవరి ఆవుకైనా పుడితే అది దైవాంశతో పుట్టిందని, అలాంటి దూడ వ్యవసాయానికి పనికి రాదని భావించి వాటిని రైతులు గంగిరెద్దుల వారికి ఇస్తారు. గంగిరెద్దులవారు వాటిని పెంచి పెద్దచేసి ఆట నేర్పిస్తారు.

గ్రామాల్లో కొందరు రైతులు తమకు సంతానం కలగనప్పుడు సంతానం కలిగితే తాము అనుకున్న దేవునికి కోడెదూడను వదులుతామని మొక్కుకుంటారు. అలాగే మరి కొందరు తమ పిల్లలకు వివాహం ఎన్నాళ్ళకూ కాకుండా ఉంటే అలాంటి వారు తమ పిల్లలకు పెళ్ళి అయితే దేవునికి కోడెదూడను వదులుతామని మొక్కుకుంటారు. ఇలా మొక్కుకున్న వారి కోరిక ఫలించినప్పుడు వారు ఒక దూడను తాము మొక్కుకున్న దేవునికి వదిలి పెడతారు. అది ఆ దేవుని పేరుతో పిలువబడుతూ ఊరంతా తిరుగుతూ ఉంటుంది. దాన్నే "ఆబోతు" అని పిలుస్తూ ఉంటారు. అది ఊరిలో ఎవరినీ పొడవకుండా మంచిగా ఉంటే సరి, లేకపోతే దాన్ని గంగిరెద్దుల వారికి పట్టిస్తారు. గంగిరెద్దులవారు దాన్ని తీసుకొని ముక్కుతాడువేసి కొంతకాలం పాటు దానికి ఆహారం పెట్టకుండా దాని పొగరు అణచి తరువాత దాన్ని మెల్లగా తమ దారిలోకి తెచ్చుకుంటారు.

ఇలా గంగిరెద్దులవారు అనేక రకాలుగా తమకు కావలసిన ఎద్దులను సంపాదిస్తారు. ఇలా లభించకపోతే అందంగా ఉండి మంచి లక్షణాలు కలిగిన దూడను గంగిరెద్దులవారు కొనుక్కొని గంగిరెద్దుగా మార్చుకుంటారు.

గంగిరెద్దులకు అనేక రకాల విన్యాసాలను నేర్పించే శిక్షణాకేంద్రాలు ఆంధ్ర దేశంలో కొన్ని ఉన్నాయి. నెల్లూరులో జంగం బసవయ్య అనే అతను గంగిరెద్దులకు శిక్షణ ఇస్తున్నాడు. కర్నూలు జిల్లాలో కర్నూలుకు దగ్గరగా ఉన్న 'బొంగనం పల్లి' అనే గ్రామంలో నరసయ్య, లక్ష్మి అనే దంపతులు శిక్షణ ఇస్తున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా జంగారెడ్డి గూడెంలో యశోదమ్మ, బసవయ్య అనే దంపతులు శిక్షణ ఇస్తున్నారు. శిక్షణ ఇచ్చేవారికి ఎడ్ల మనస్తత్వం, వాటి ప్రవర్తన బాగా తెలిసి ఉంటుంది. వీరు ఎలాంటి ఎద్దుకు ఏవిధంగా శిక్షణ ఇవ్వాలో బాగా తెలిసినవారై ఉంటారు. శిక్షణ ఇచ్చినందుకు ఒక్కొక్క ఎద్దుకు వీరు పదివేల రూపాయలు దాకా తీసుకుంటారు.



గంగిరెద్దులవారు నాలుగైదు నెలల వయసు నుంచి సంవత్సరం వయసు గలిగిన కోడెదూడను శిక్షకుడికి అప్పగిస్తారు. శిక్షకులు మొదట కోడెలకు మంచి ఆహారాన్ని నీటిని ఇస్తూ వాటిని మచ్చిక చేసుకుంటారు. కొన్ని రోజులపాటు పరిసరాలు అలవాటు పడేలాగ కోడెలను స్వేచ్ఛగా తిరగనిస్తారు. పరిసరాలకు, తమకు అలవాటు పడిన తరువాత శిక్షణ ఇవ్వడం ప్రారంభిస్తారు. మొదట దూడకు వారు ముక్కుతాడు వేస్తారు. ముక్కు తాడు వేయడం వల్ల ఎంతబలమైన దూడనైనా సులభంగా లొంగ దీసుకోవచ్చు. మొదట శిక్షకుడు దూడకు తన మాటలు అర్థమయ్యేలాగా శిక్షణ ఇస్తాడు. అంతకు ముందు శిక్షణ పొందిన ఎద్దుచేత కొత్తగా శిక్షణ ఇచ్చే ఎద్దుల ముందు విన్యాసాలు చేయిస్తాడు. డోలు వాయించేటపుడు, గంట వాయించేటపుడు దానికి అనుగుణంగా తల ఊపడం, ముందు కాళ్లు ఒకదాని తరువాత ఒకటి ఎత్తడం, ఈలవేసి పిలిచిన వెంటనే పరుగు పరుగున రావడం మొదలైన చిన్నచిన్న విద్యలు మొదట నేర్పుతారు. ఆ తరువాత కొంత కష్టమైన పనులను నేర్పించడం మొదలు పెడతారు.

ఇందులో మొదట ఎద్దుకు కూర్చోవడం, లేవడం నేర్పిస్తారు. ఎద్దును కూర్చో మన్నప్పుడు శిక్షకుడు కూర్చొని దాన్ని కూడా అలా చెయ్యమని చేతిలోని కఱ్ఱతో కింద కొడతాడు. ఎద్దును లేవమన్నప్పుడు తాను లేచి కఱ్ఱతో పైకి లేవమన్నట్లుగా సంజ్ఞ చేస్తాడు. శిక్షకుడి సంజ్ఞలను బట్టి ఎద్దు అతడు చెప్పినట్లుగా చేస్తుంది. ఒకసారి శిక్షకుడి మాటలను అర్థం చేసుకొన్న ఎద్దు అతడు చెప్పే మిగిలిన అనేక విధాల విన్యాసాలను కూడా అర్థం చేసుకొని అతను చెప్పినట్లుగా చేస్తుంది. దానికి అర్థం కాకుంటే శిక్షకుడు దాని ముందు అది చేయవలసిన పనులను తానే చేసి చూపిస్తాడు. దాన్ని బట్టి ఎద్దు అతని హృదయాన్ని గ్రహించి అతను చెప్పినట్లుగా చేస్తుంది.

కొన్ని పొగరుబోతు ఎద్దులు శిక్షకుని మాట వినకుండా పొడవడానికి వస్తాయి. అలాంటి ఎద్దులకు రెండు మూడు రోజులపాటు ఆహారం, నీరు ఇవ్వకుండా పస్తు పెడతారు. దానితో అవి నీరసించి శిక్షకుడు చెప్పినట్లుగా చేస్తాయి. శిక్షకుడు చెప్పినట్లుగా చేస్తేనే వాటికి ఆహారం నీరు ఇస్తారు. దీనితో ఆహారం కోసం అవి శిక్షకుడు చెప్పినట్లుగా ప్రవర్తిస్తాయి. గంగిరెద్దులు వేగంగా నడవకుండా మెల్లగా గంభీరంగా నడుస్తాయి. ఇలా నడవడానికి శిక్షకుల శిక్షణే కారణం. ఈ విధంగా నడవడానికి శిక్షకులు బంకమట్టితో నిండిన బురద గుంటను ఏర్పాటుచేసి ఎద్దును అందులోకి దింపుతారు. బంకమట్టిలో వాటి కాళ్ళు ఇరుక్కొని అతి ప్రయత్నం మీద అడుగు తీసి అడుగు వేస్తాయి. బంకమట్టిలో అవి వేగంగా నడవలేవు. మెల్లగా నడవటం నేర్చుకుంటాయి. అంతేగాకుండా ఎక్కువసేపు ఎద్దును బంకమట్టిలో ఉంచుతారు.

ఇలా చేయడం వల్ల గంగిరెద్దు నడకలో వేగం తగ్గి ఎంతో హుందాగా, అందంగా నడుస్తుంది. ఇలాగ ఎద్దు పూర్తిగా శిక్షణ పొందడానికి ఆరు నెల్ల నుంచి సంవత్సర కాలం పడుతుంది. ఎద్దుకు శిక్షణ ఇచ్చే కాలంలో వాటి యజమానులైన గంగిరెద్దులవారు మధ్యమధ్యలో శిక్షణాలయానికి వెళ్ళి ఎద్దుకు తమకు ఉన్న సంబంధాన్ని ఎద్దు మరిచి పోకుండా గుర్తు ఉంచుకొనే లాగా చేస్తారు. వెళ్ళినప్పుడు రెండు మూడు రోజులు ఎద్దు దగ్గరే ఉండి దాని శరీరం నిమురుతూ స్నేహాన్ని చూపిస్తారు. ఇలా చేయటం వల్ల ఎద్దు శిక్షణా కాలంలో తమకు మరచిపోకుండా ఉండడానికి, శిక్షణ అయిన వెంటనే ఎద్దు యజమానులతో వెళ్ళి ప్రదర్శన సందర్భంలో వారు చెప్పినట్లుగా వినడానికి వీలుగా ఉంటుంది. శిక్షకులు ఎద్దుకు శిక్షణ ఇచ్చిన తరువాత గంగిరెద్దుల వారికి కూడా కొంత శిక్షణ ఇస్తారు. ఎద్దుతో ఏ విన్యాసాన్ని ఎలా చేయించాలి, ఎలాంటి సంజ్ఞల ద్వారా ఏఏ విన్యాసాలను ఎద్దుతో చేయించవచ్చు మొదలైనవి చెబుతారు. ముఖ్యంగా ప్రమాదకరమైన విన్యాసాలను ఎద్దుతో చేయించేటప్పుడు గంగిరెద్దులవారు ఎలా ప్రవర్తించాలో శిక్షకులు నేర్పిస్తారు. ఎద్దు పూర్తిగా శిక్షణ పొందిన తరువాత దాని యజమాని అయిన గంగిరెద్దుల వారికి అప్పగిస్తారు. గంగిరెద్దుల వారు దాన్ని తమ వెంట తీసుకొని వచ్చి దానితో ఆట ఆడిస్తూ జీవనయాత్ర సాగిస్తారు.

గంగిరెద్దు మీద జానపదులకు ముఖ్యంగా గ్రామీణులకు కొన్ని నమ్మకాలు న్నాయి. ఏదైనా పనిమీద ఊరికి వెళ్ళేటప్పుడు గంగిరెద్దు ఎదురు వస్తే దాన్ని శుభంగా పరిగణిస్తారు. కొత్తగా పెళ్ళైన వారింటికి గంగిరెద్దులవారు వస్తే పెళ్ళి సమయంలో వధూవరులు కట్టుకున్న బట్టలను గంగిరెద్దుల వారికి దానంగా ఇస్తారు. అంతేగాకుండా బాసికాలను గంగిరెద్దు కొమ్ముకు తగిలిస్తారు. ధాన్యం గానీ, ధనం గానీ దక్షిణగా ఇస్తారు. తమ ఇంటి వద్దకు వచ్చిన గంగిరెద్దులవారిని గ్రామీణులు సాధారణంగా ఏమీ ఇవ్వకుండా పంపరు. ఎంతోకొంత ధాన్యం గానీ, డబ్బు గానీ ఇస్తారు.

సంక్రాంతి పండుగ సందర్భంలో గంగిరెద్దులవారు ప్రతీ ఊరిలోనూ కనిపిస్తారు. పండుగకు ముందు వారం రోజులు, పండుగ తరువాత వారం రోజులు వీరు గ్రామాల్లో ఇల్లిల్లు తిరిగి యాచన చేస్తారు. ఊర్లో పెద్దల అనుమతిని పొంది పగలు గానీ, రాత్రి గానీ తమ ఆటను ప్రదర్శిస్తారు. కొన్ని ప్రాంతాల్లో తమ కుటుంబంలోని వ్యక్తులు ఎవరైనా చనిపోయినప్పుడు పెద్దకర్మ రోజున గంగిరెద్దులాటను ప్రదర్శింప జేస్తారు. ఇది తెలంగాణా ప్రాంతంలో ఆచారంగా ఉంది. కురవ గొల్లలు తమ ఇంట్లో ఎవరైనా చనిపోయినప్పుడు శవానికి అంత్యక్రియలు నిర్వహించే ముందు తమ ఇంటి ముందు గంగిరెద్దులాటను ప్రదర్శింప జేస్తారు. ఇలాంటి సందర్భంలో గంగిరెద్దుల



వారు ఆ కుటుంబానికి చెందిన పూర్వీకుల పేర్లను వారి దానగుణాలను, ఇంటిపేరును, గోత్రం పేరును వర్ణిస్తూ ఆ కుటుంబీకులను ఆశ్వీరదిస్తూ ఎద్దుతో ఆశీర్వదింపజేస్తారు. చనిపోయిన వ్యక్తి గొప్పతనం, ఆతని దానగుణాన్ని ప్రశంసిస్తారు. అతని వంశం తరతరాలుగా అభివృద్ధి చెందాలని ఆశీర్వచనం పలుకుతారు.

**గంగిరెద్దు అలంకరణ విధానం :** గంగిరెద్దులవారు అందంగా బలిష్టంగా ఉండే ఎద్దునే గంగిరెద్దుగా మలుచుకుంటారు. ఇలాంటి ఎద్దుకు అనేక రకాల అలంకరణ వస్తువులు వేసి దాన్ని మరింత అందంగా తయారుచేస్తారు. గంగిరెద్దు వీపుమీద రంగురంగుల చారలు ఉన్న బొంతను గానీ, చూడగానే చక్కగా ఆకర్షించగల ముదురు రంగు బొంత గానీ వేసి దానిపైన రెండు మూడు చీరలను మడతపెట్టి వీపు అటువైపు నుండి ఇటువైపుకు వేలాడేవిధంగా వేస్తారు. గంగిరెద్దు మూపురం పెద్దదిగా ఉండి అందంగా ఉంటుంది. ఆ మూపురానికి ఎలుగుబంటి చర్మంతో చేసిన టోపీ లాంటి దాన్ని అమరుస్తారు. మూపురం పక్కన వీపు మీద రంగురంగుల చీరలు చిన్న మడతలుగా మలిచి అందంగా అలంకరిస్తారు. అవి జారిపడిపోకుండా వెంట్రుకలతో చేసిన తాడు కడతారు. ఆ తాడుకు చుట్టూ మువ్వలుంటాయి. గంగిరెద్దు కొమ్ములకు రంగురంగుల బట్టలు చుడతారు. కొమ్ముల చివర ధగధగా మెరిసే ఇత్తడి గొట్టాలు పెడతారు. మూతికి అందమైన చిక్కమోర తొడుగుతారు. రెండుకొమ్ముల మధ్యలో ముఖం మీద రంగురంగుల పూసలను, వెంట్రుకల కుచ్చును కడతారు. మెడలో గంగడోలు కింది వరకు వెడల్పైన తోలు బెల్టుతో చేసిన దాన్ని వేసి దానికింద గంట కడతారు. ఈ తోలుబెల్టుకు పెళ్ళి బాసికాలు, పెళ్ళి కంకణాలు కట్టి ఉంటాయి. గంగిరెద్దు వెనుక భాగంలో తోక కింది నుంచి పెద్ద మువ్వలు ఉన్న తోలుబెల్టును అటువైపు నుంచి ఇటువైపుకు వాలుగా కడతారు. ముందు రెండు కాళ్ళకూ గజ్జలు కడతారు. వెనుక వైపున ఒక కాలికి వెంట్రుకల తాడు కడతారు. ఈ విధంగా గంగిరెద్దు అలంకరణ చూడగానే అందరినీ ఆకర్షించే విధంగా ఉంటుంది.

గంగిరెద్దులాటలో ఐదుగురు కళాకారులు పాల్గొంటారు. వీరిలో ఒక వ్యక్తి ప్రధాన ఆటగాడుగా ఉంటాడు. ఇతను మిగిలిన వారికంటే కొంత ప్రత్యేక వేషధారణ చేసుకుంటాడు. ఇతడు తెల్లని పంచె కట్టుకొని దాని మీద అంగీ వేసుకొని అంగీమీద నల్లకోటు వేసుకుంటాడు. తలకు పాగా చుట్టుకుంటాడు. మిగిలినవారు కూడా పంచె కట్టుకొని అంగీ వేసుకొని తలపాగా కట్టుకుంటారు. వీరి పాగాలు ఆకర్షణీయమైన రంగుల్లో ఉంటాయి. గంగిరెద్దులవారు సాధారణంగా గుబురు మీసాలు కలిగి గంభీరంగా కనిపిస్తారు. ఇలాంటి వేషధారణతో వీరు ప్రేక్షకులను బాగా ఆకట్టుకుంటారు.

**వాయిద్యాలు :** గంగిరెద్దులవారు తమ ప్రదర్శనలో ఒక డోలు, ఒక వీరణం, రెండు సన్నాయిలు, ఒక గంటను వాయిద్యాలుగా ఉపయోగిస్తారు. ఈ వాయిద్యాలను వీరు ఒక్కొక్కరు ఒక దాన్ని ధరించి రకరకాలుగా వాయిస్తూ ప్రేక్షకులను చక్కగా ఆకట్టు కుంటారు. వీరి వాయిద్యాలు ఆటను రక్తి కట్టించడంలో ఎంతగానో ఉపయోగిస్తాయి.

## ఒగ్గుకథ - స్వరూప స్వభావాలు - చరిత్ర :

జానపదకళల్లో ఒగ్గుకథ లాంటి కళ మరొకటి లేదని చెప్పవచ్చు. ఈనాడు ఈకళ తెలంగాణా ప్రజలను విశేషంగా ఆకర్షిస్తూ ఉంది. హైదరాబాదులోని ఉప్పల్ ప్రాంతంలో ఉన్న ఒగ్గు సోమయ్య గారి నుంచి నేను ఒగ్గుకథకు సంబంధించిన విషయాలను సేకరించాను. ఒగ్గుకథ తెలంగాణ ప్రాంతంలో బాగా ప్రసిద్ధి చెందిన జానపదకళ. హైదరాబాదు, వరంగల్, నల్గొండ, కరీంనగర్ జిల్లాల్లో ఈ కళకు మంచి ప్రసిద్ధి ప్రచారం ఉన్నాయి. ఒగ్గుకథను కురుమ, గొల్ల కులాలవారు చెబుతారు. వీరు మల్లన్న, బీరప్ప కథలను ఒగ్గుకథగా చెబుతారు. శివుని వాద్యమైన డమరుకాన్ని ఒగ్గుకథకులు "ఒగ్గు" అని పిలుస్తారు. ఈ కళా ప్రదర్శనలో ఒగ్గును ఉపయోగించి కథను చెప్పడంవల్ల దీనికి ఒగ్గుకథ అనే పేరు వచ్చింది. ఒగ్గుకథలు చెప్పేవాళ్ళని ఒగ్గోళ్ళు, ఒగ్గువాళ్ళు, ఒగ్గులు అని అంటారు. వీరు కురుమ లేదా గొల్లకులాలకు చెందిన వారు. కురుమ, కురువ, కురుబ అనే పేర్లతో పిలవబడే వీరు నిజానికి గొల్లలే. అందు వల్లనే రాయలసీమ ప్రాంతంలో వీరిని "కురువ గొల్లలు" అని పిలుస్తారు. ఐతే కాల క్రమంలో వీరు ప్రత్యేకమైన కులంగా పరిగణింపబడు తున్నారు. ఈ కురువల వృత్తి గొర్రెలను, మేకలను పెంచడం, గొర్రెబొచ్చు నుంచి కంబళ్ళు నేయడం. ఈ రెండింటిని తెలంగాణ ప్రాంతంలోను, అనంతపురం జిల్లాలోను ఉన్న గొల్లలు కూడా చేస్తారు.

గతంలో ఒగ్గు దీక్ష స్వీకరించినవారే ఒగ్గుకథను చెప్పేవారు. ఒగ్గు దీక్షను కురుమ, గొల్ల కులాలవారు స్వీకరించేవారు. శైవక్షేత్రాలైన కొమురవెల్లి, శ్రీశైలం, వేములవాడల్లో వృద్ధులైన ఒగ్గువారు కొత్తవారికి ఒగ్గుదీక్షను ఇస్తారు. దీక్ష స్వీకరించి నప్పటి నుంచి వారు "ఒగ్గు పూజారులు"గా పిలవబడుతూ మల్లన్న, బీరప్ప కథలను ఒగ్గుకథలుగా చెబుతుంటారు.

ఒగ్గువారిలో మల్లన్నవాళ్ళు, బీరన్నలవాళ్ళు అని రెండు రకాలవారు ఉన్నారు. మల్లన్నను పూజించేవారు మల్లన్నలవారు. వీరభద్రుని పూజించేవారు వీరన్నలవారు. ఈ వీరన్నల పదం కాలక్రమంలో బీరన్నలుగా పరిణామం చెందింది. పూర్వం మల్లన్నల వారు కేవలం మల్లన్న కథను మాత్రమే ఒగ్గుకథగా చెప్పేవారు. అలాగే బీరన్నలవారు



బీరప్ప కథను ఒగ్గుకథగా చెప్పేవారు. అదీ ఒగ్గుదీక్షను స్వీకరించిన వారు మాత్రమే ఈ కథలను చెప్పేవారు. కానీ నేడు గొల్ల, కురుమ కులాలవారే గాకుండా ఇతర కులాల వారుకూడా ఒగ్గుకథను చెప్పడం నేర్చుకొని జనరంజకంగా ఒగ్గుకథను చెబుతూ పేరు ప్రఖ్యాతులను సంపాదిస్తున్నారు. పూర్వం మల్లన్న కథను, బీరప్ప కథను మాత్రమే ఒగ్గు కథలుగా చెప్పేవారు. ఇప్పుడు ఈ రెండు కథలతోపాటు ఎల్లమ్మ కథ, నల్లపోచమ్మ కథ, బాలనాగమ్మ కథ, హరిశ్చంద్రుని కథ, మైరావణ కథ, మాంధాత కథ, పురూరవ చక్రవర్తి కథ, వానదేవుని కథ, పెద్దిరాజు పెద్దమ్మ కథ, శ్రీదేవి కథ, ఆడిపిల్ల అంజమ్మ కథ, శివకుమారుని కథ, కీలుగుర్రం కథ, మౌనోదరి కథ, దుర్గమ్మ కథ మొదలైన అనేక కథలను ఒగ్గుకథలుగా చెబుతున్నారు. అంతే గాకుండా భారత రామాయణాల్లోని కొన్ని ఘట్టాలను ఒగ్గు కథా శైలిలో చెబుతున్నారు.

ఒగ్గుకథకులు శైవులు. మల్లన్న, బీరప్పలు ఇద్దరూ శివుని అంశవల్ల జన్మించినవారు. మహిమలు కలవారు. అనేక ఘనకార్యాలను చేసినవారు. వీరు చేసిన మహిమలను, ఘనకార్యాలను ప్రస్తుతిస్తూ కథను చెబుతారు. శివాంశతో పుట్టిన వారి కథలను, శైవులైన ఒగ్గువారు శివుని వాద్యమైన ఒగ్గుతో చెప్పడంవల్ల ఈ కథకు ఒగ్గుకథ అనే పేరువచ్చింది. పూర్వం మల్లన్న బీరప్ప కథలను వరుసగా పదిహేనురోజుల పాటు ఒగ్గుకథగా చెప్పేవారు. ఎల్లమ్మ కథ, బాలనాగమ్మ కథ మొదలైన వాటిని మూడు నుంచి ఐదు, ఆరు రోజులపాటు చెప్పేవారు. కానీ ఈనాడు అంత సుదీర్ఘంగా కథను వినే ఓపిక ప్రజలకు లేకపోవడం వల్ల సమయ సందర్భాలను బట్టి తాము చెప్పే కథలను కుదించి ఒకటిరెండు రోజుల్లో చెబుతున్నారు. అంతే గాకుండా కథను పూర్తిగా కాకుండా శ్రోతలు కోరిన ముఖ్యమైన ఘట్టాలను చెబుతున్నారు. ఇలా చెప్పడానికి అనుగుణంగా ఒగ్గుకథకులు మల్లన్న కథను కాపుకాండం, బలిజ మ్యాడలదేవి పెండ్లి, గొల్లకేతమ్మ పెండ్లి మొదలైన విధంగా విభజన చేసుకున్నారు.

ఒగ్గుకథలో ప్రధాన వాద్యమైన ఒగ్గు పుట్టుకను గురించి ప్రముఖ ఒగ్గు కథాకారుడైన చుక్కా సత్తెయ్యగారు ఇలా చెప్పారు. "కృతయుగంలో త్రిపురాసులు అనే రాక్షసులు దేవతలను బాధిస్తున్నప్పుడు విష్ణువు, బ్రహ్మ, మిగిలిన దేవతలందరూ కలిసి ఈశ్వరుని దగ్గరకు వెళ్ళి త్రిపురాసులలను సంహరించి వారి బారి నుంచి తమను కాపాడమని ప్రార్థిస్తారు. ఈశ్వరుడు హిమాలయ పర్వతాన్ని ధనస్సుగా, విష్ణువును ధనస్సుకు తాడుగా, బ్రహ్మను అస్త్రంగా, భూమిని రథంగా, సూర్యచంద్రులను రథ చక్రాలుగా చేసుకొని త్రిపురసురులతో యుద్ధం చేస్తూ ఉంటాడు. ఈశ్వరుని బాణాల దెబ్బకు త్రిపురాసురుల శరీరం నుంచి రక్తపు చుక్కలు భూమి మీద పడగానే ఆ రక్తపు

చుక్క నుంచి రాక్షసులు ఉద్భవించి శివుని మీదకు వెళుతూ ఉంటారు. ఇలా ఎప్పటికప్పుడు పుట్టుకొస్తున్న రాక్షసుల ధాటికి శివుడు తట్టుకోలేక ఆదిశక్తి అయిన చండికా దేవిని తనకు సాయంగా రమ్మని వేడుకుంటాడు. అప్పుడు చండికా దేవి త్రిపురాసురు లను సంహరించడానికి ఈశ్వరుని శరీరంలో కలిసిపోతుంది. ఈ విధంగా చండి, ఈశ్వరునిలో కలిసిపోవడం వల్ల ఆ మూర్తిని చండీశ్వరుడు అని పిలిచారు. చండీదేవి ఈశ్వరునిలో కలిసిపోవడం వల్ల ఆమె చేతిలోని దమరుకం చండీశ్వరుని చేతికి వస్తుంది. ఈ విధంగా వచ్చిన దమరుకాన్ని (జగ్గును) చండీశ్వరుడు వాయిస్తూ త్రిపురాసురులను సంహరిస్తాడు. ఆ ఆనందంతో చండీశ్వరుడు జగ్గును వాయిస్తూ ప్రళయ తాండవం చేశాడు. ఆదిశక్తి చేతిలో దమరుకం అని పిలువబడిన ఈ వాద్యం చండీశ్వరుని చేతికి వచ్చేటప్పటికి 'జగ్గు'గా పిలవబడింది. భూలోకంలోని భక్తులు ఈశ్వరుని (మల్లికార్జునుని) కొలిచేటప్పుడు జగ్గును వాయిస్తూ పూజలు చేసేవారు. ఈ సందర్భంలో జగ్గు "ఒగ్గు"గా పిలువబడింది.

ఒగ్గువాద్యం మల్లికార్జునస్వామి నుంచి అతని సంతతివారైన భక్తులకు సంక్రమించిన విధానాన్ని గురించి ఒక కథ ఉంది. ఆ కథ ఇది.[13]

కొల్లాపూర్‌లోఅన్నదాతలుగా ప్రసిద్ధి పొందిన రెడ్డి కులస్థులను రక్షించడానికి శ్రీశైల మల్లికార్జునుడు ఆదిరెడ్డి నీలమాదేవులకు మల్లారెడ్డి అనే పేరుతో జన్మిస్తాడు. నీలమాదేవి అన్నలైన కళ్యాణం కళింగ రాజులు మల్లారెడ్డికి మేనమామలు. మల్లారెడ్డి విద్యాబుద్ధులు, అతని శక్తి సామర్థ్యాలు గమనించిన మేనమామలు కొల్లాపూరు పట్టణ పాలనను అతనికి అప్పగిస్తారు. మల్లన్న కంటే పెద్దవాళ్ళైన ఆరుగురు అన్నలు తమ తమ్మునికి లభించిన రాజ్యపాలనకు అసూయపడి అతనికి అనేక రకాల కష్టాలు కలిగిస్తూ బాధలు పెట్టే ప్రయత్నం చేస్తారు. ఈ బాధలకు తట్టుకోలేక మల్లారెడ్డి తన భార్యా అయిన పద్మావతిని కొల్లాపూర్‌లో వదిలిపెట్టి రెండు ఎద్దులను, ఒక నాగలిని తీసుకొని "జంగాల పర్వడి లింగాల కుర్మడి" అనే అడవిలో ఏడుతీర్లు ఉన్న భూమి మీద నాగలితో దున్నుతుంటాడు. నాగలి ఒక పుట్టకు తగిలి ఆగిపోతుంది. ఆ పుట్టలో అంతకుముందు పార్వతీపరమేశ్వరులు ఒక గొర్రెల మందను పెట్టి ఉంటారు. మల్లన్న నాగలితో పుట్టను దున్నగానే పుట్టలో ఉన్న గొర్రెల మంద బయటకు వస్తుంది. అప్పుడు పార్వతీదేవి ప్రత్యక్షమై మల్లన్నా! నాగలితో భూమి దున్ని విత్తనం వేస్తే ఆర్నెల్లకు పంట వస్తుంది. ఈ గొర్రెల మందను సంబాలించుకొని కాపాడితే పొద్దున గొర్రె ఈనితే పొద్దు గుంకేటప్పటికి ఆ గొర్రెపాలు తాగి బతకవచ్చు. కాబట్టి గొర్రెల



మందను సంబాలిస్తూ జీవించమని చెప్పి పార్వతీదేవి అదృశ్యమౌతుంది. అప్పుడు మల్లన్న కొంతమంది జీతగాళ్లను పెట్టుకొని గొర్రెల మందను సంబాలిస్తూ అడవిలో జీవిస్తుంటాడు. మల్లన్న ఒకరోజు పాలు కాచుకోవడానికి అగ్గికోసం వెదుకుతూ ఒక పెద్ద వటావృక్షం ఎక్కి నాలుగు దిక్కులా చూస్తాడు. "పెద్దబొక్కల సిరికోట" అనే పెద్ద కొండగుహలో పొగ బయటకు వస్తూ కనిపిస్తుంది. మల్లన్న ఆ గుహ దగ్గరకు వెళతాడు. ఆ గుహ దగ్గర ఒక రాక్షసి ఉంటుంది. ఆ రాక్షసి పేరు "మహాదండి రాక్షసి". ఆ రాక్షసి అంతకు ముందు "విప్రాపురి" అనే పేరుగల నగరంలోని ప్రజలను వంతుల వారిగా రోజుకు ఒకరిని చంపి తింటూ ఉండేది. ఒకసారి శివభక్తులైన బ్రాహ్మణ దంపతుల వంతు వస్తుంది. ఆ దంపతులకు పార్వతీదేవి కరుణవల్ల "రత్నాంగి" అనే పేరు గల అమ్మాయి ఉంటుంది. రాక్షసి బ్రాహ్మణ దంపతులను చంపి రత్నాంగిని బలవంతంగా తీసుకొని వచ్చి గుహలో పెంచుతూ ఉంటుంది. మల్లన్న అగ్గి కోసం గుహ దగ్గరకు వెళ్ళి అక్కడ ఉన్న మహాదండి రాక్షసిని చంపి రత్నాంగిని తీసుకొని వస్తాడు. అప్పుడు రాక్షసి ఒరే మల్లికార్జునా! నేను పెంచుకుంటున్న బిడ్డను తీసుకుపోతున్నావు. నేను ఇప్పుడు చచ్చిపోతున్నాను. నా శవాన్ని ఒక చెట్టు మీద పెట్టి మాంసం అంతా కరిగిపోయిన తరువాత నా ఎముకలు, నరాలు, తలవెంట్రుకలు కట్టగట్టుకొని నాబిడ్డతోపాటు తీసుకొనివెళ్ళు. ఎందుకంటే నీకు ఇంతకు ముందే పద్మావతి అనే భార్య ఉంది. ఆమెకు అన్ని విధాల ఆస్తిపాస్తులు ఉన్నాయి. నా బిడ్డకు ఎలాంటి ఆస్తిపాస్తులు లేవు. నా ఎముకలు, నరాలు, వెంట్రుకలే ఆమెకు ఆస్తి పాస్తులవుతాయి. నా ఎముకల్లో దవడదంతాలు గొర్రె బొచ్చును కత్తిరించే కత్తెర అవుతాయి. గుండ్రని నా మోకాలుబొక్క (ఎముక) ఉన్నిని వడికే "కుదురు బిండ" అవుతుంది. నా తల వెంట్రుకలు "కుంచె" అవుతాయి. నా నరాలు "తీపితాడు" అవుతుంది. నా వెన్నెముక గొంగడి నేయడానికి "దోనుగ" అవుతుంది. మిగిలిన ఎముకలన్నీ గొంగడి నేయడానికి అవసరమైన పరికరాలు అవుతాయి. ఇవన్నీ నా బిడ్డ సంతానానికి యుగయుగాల వరకు ఉపయోగపడతాయి. అని చెప్పి మహాదండి రాక్షసి చనిపోతుంది.

రాక్షసి చెప్పిన విధంగా మల్లన్న దాన్ని శవాన్ని చెట్టు మీద పెట్టి శిలాబండారు సంచిలో చెయ్యి పెట్టి పిడికెడు బండారు తీసి ఆ శవం మీద చల్లగానే శవంలోని మాంసం అంతా కరిగిపోయి ఎముకలు, నరాలు, తలవెంట్రుకలు మిగులుతాయి. మల్లన్న వాటిని మోపుగా కట్టుకొని రత్నాంగిని తీసుకొని గొర్రెల మంద దగ్గరకు వస్తాడు. ఆ తరువాత మల్లన్న తనకు రత్నాంగికి పెళ్ళి చేయమని దేవతలను కోర

తాడు. పార్వతి పరమేశ్వరులు మిగతా దేవతలు వచ్చి మల్లన్నకు రత్నాంగికి వివాహం చేస్తారు. తరువాత మల్లన్న రత్నాంగిని, గొర్రెల మందను తీసుకొని కొల్లాపూరు పట్టణానికి వస్తాడు. మల్లన్న మొదటి భార్యా అయిన పద్మావతిని కలుసుకొని ఇద్దరు భార్యలకు వేరువేరుగా పట్టణాలు కట్టించి కొల్లాపూరును పాలిస్తూ ఉంటాడు. మొదట రత్నాంగికి "జగపతిరాయలు" అనే కుమారుడు జన్మిస్తాడు. తరువాత పద్మావతికి "శామరాయలు" అనే కుమారుడు జన్మిస్తాడు. జగపతిరాయలకు కలిగిన రెండు వందల రెండు మంది సంతానం "ఉన్ని కంకణం" గాను, శామరాయలకు కలిగిన రెండువందల రెండు మంది సంతానం "పత్తికంకణంగాను" గుర్తింపబడతారు.

మల్లన్న బ్రాహ్మణ కన్య అయిన రత్నాంగిని గొర్రెలమంద దగ్గర వివాహం చేసుకున్నప్పుడు గొర్రెబొచ్చును కత్తిరించి దాన్ని దారంగా ఒడికి ఆదారాన్ని పుస్తెకు, చేతి కంకణానికి పోలుదారంగా ఉపయోగించడం వల్ల రత్నాంగి సంతానం ఉన్ని కంకణం వారుగా పిలవబడతారు. మల్లన్న రెడ్డి కులస్థురాలైన పద్మావతిని వివాహం చేసుకున్నప్పుడు రెడ్లు పండించే పత్తిని దారంగా ఒడికి ఆ దారాన్ని పుస్తెకు, చేతికి కంకణానికి పోలుదారంగా ఉపయోగిస్తాడు. కాబట్టి పద్మావతి సంతానాన్ని పత్తి కంకణం వారుగా పిలుస్తారు. ఆ తరువాత మల్లన్న ముప్పైమూడు సంవత్సరాలు రాజ్యపాలన చేసి తన కుమారులతో రాజ్యంలో తన విగ్రహాలను ప్రతిష్టించమని, తనకు గుళ్ళు, గోపురాలు కట్టి జాతరలు, తీర్థాలు నడిపించమని ఒగ్గుతో తనను ప్రార్థించి, ఒగ్గుడోళ్ళతో ఊరేగింపులు చేసి ఉదయం పూట ఒగ్గు వాద్యంతో మేలు కొలుపు ప్రార్థన చేసి రాత్రి పూట ఒగ్గుడోళ్ళతో ప్రచారం చేస్తూ తన చరిత్రను ప్రజలకు చెబుతూ తన కీర్తిని జగమంతా ప్రచారం చెయ్యమని చెప్పి శ్రీశైలానికి వెళ్లి అక్కడే స్థిరపడిపోతాడు.

ఈ విధంగా కృతయుగంలోని చండీశ్వరుడు త్రేతాయుగంలో మల్లన్నగా (మల్లికార్జునుడుగా) అవతారమెత్తినప్పుడు చండీశ్వరుని నుంచి మల్లన్న చేతికి ఒగ్గు సంక్రమించిందని ఆ తరువాత మల్లికార్జునుడు శ్రీశైలంలో లింగాకారంలో శిలగా మారినప్పటి నుంచి అతని సంతతివారైన ఉన్ని కంకణంవారు, పత్తి కంకణంవారు అతణ్ణి ప్రార్థించడానికి ఒగ్గును ఉపయోగించేవారు. అప్పటి నుంచి మల్లికార్జుని సంతతివారైన కురువగొల్లలు మల్లికార్జునునికి పండుగలు ఉత్సవాలు చేస్తున్నారు. ఈ విధంగా ఒగ్గు పుట్టుకకు సంబంధించిన కథ ప్రచారంలోకి వచ్చింది.

ఒగ్గువారు ఒగ్గుకథను చెప్పేటప్పుడు డోలును ఉపయోగిస్తారు. ఈ డోలును ఒగ్గుడోలు అని అంటారు. ఈ ఒగ్గుడోలు పుట్టుకకు సంబంధించి కూడా ఒక కథ ఉంది.[14]

కోటిలింగాల పట్టణాన్ని రాజధానిగా చేసుకొని "శివలింగభూపతి" అనే



రాజు పరిపాలిస్తున్నప్పుడు డోలాసురుడు అనే రాక్షసుడు కోటిలింగాల పట్టణం మీద పడి ప్రజలను అల్లకల్లోల పరుస్తూ ఉంటాడు. శివలింగ భూపతి ఆ రాక్షసునితో యుద్ధం చేసి అతణ్ణి పడగొడతాడు. ఐతే డోలాసురుడు ప్రాణం పోక పరితపిస్తూ ఉంటాడు. అప్పుడు శివలింగ భూపతి డోలాసురుని స్థితికి జాలిపడి నీ ప్రాణం ఏవిధంగా పోతుంది అని అడుగుతాడు. డోలాసురుడు యుగయుగాలకు నా పేరు మారుమ్రోగేటట్లు చేస్తే తన ప్రాణం పోతుందని చెబుతాడు. శివలింగ భూపతి అలాగే చేస్తానని హామీ ఇస్తాడు. డోలాసురుడు తృప్తిగా కన్ను మూస్తాడు. శివలింగ భూపతి మరణించిన డోలాసురుని చర్మం తీసి దాన్ని, కంచుతో డబ్బాలాగ తయారు చేసిన దానికి అమర్చుతాడు. తరువాత శివలింగ భూపతి కోటిలింగాల పట్టణానికి "శివకంచుభేరి పట్టణం" అనే పేరు పెట్టి ఆపట్టణం ఏడవ కోట మీద డోలాసురుని చర్మంతో చేసిన భేరిని పెట్టిస్తాడు. ఆ పట్టణంలోకి శత్రువులు ఎవరైనా వస్తే ఆ భేరి "రణభేరి"గా మోగుతుందని, శుభకార్యాలకు బాజాగా మోగుతుందని చెప్పి దానికి "వీరశేషపాలుడు" అనే సిపాయిని కాపలాగా ఉంచుతాడు.

లింగ భూపతి కొడుకు "వరదరాజు". వరదరాజు భార్య "భూపాల సిద్దమ్మ". ఈ దంపతులకు ఏడుగురు కొడుకులు, మేడలదేవి అనే కూతురు ఉంటారు. మల్లికార్జునుడు మేడలదేవిని పెళ్ళి చేసుకోవడానికి జంగంవేషం, బలిజవేషం, కోమటివేషం కట్టి శాల మల్లయ్య, మట్టల మల్లయ్య, కంచర మల్లయ్య, అవుసల మల్లయ్య మొదలైన అనేక రకాల వేషాలు కట్టి, మేడలదేవి ఏడుగురు అన్నలైన బలిజవాళ్ళను ఓడించి, ఏడుమేడలు కూలగొట్టి మేడలదేవిని గుర్రం మీద కూర్చుండ బెట్టుకొని పారి పోతున్నప్పుడు వీరశేషపాలుడు కంచుభేరిని మోగించి మల్లన్న మీదకు సేనను పురి కొల్పుతాడు. అప్పుడు మల్లన్న వీరశేషపాలుని వధించి కంచుభేరిని కిందకు దించి మేడలమ్మతో పాటు దాన్ని గూడా తీసుకొనిపోతూ ఉంటాడు. అతన్ని వెంబడించిన మేడలమ్మ ఏడుగురి అన్నలను మల్లన్న కర్రెకుక్కలను చేసి కట్టివేస్తాడు. ఆ తరువాత మల్లన్న మామ వరదరాజును, అత్త భూపాలసిద్దమ్మను రప్పించుకొని వారి సమక్షంలో మేడలమ్మను వివాహం చేసుకుంటాడు. ఆ తరువాత బలిజ కులస్థులు శ్రీశైలమల్లన్నకు ప్రియభక్తులు అవుతారు. అప్పటినుంచి ఆ భేరిని శ్రీశైలం మల్లికార్జునుని వివాహ సందర్భంలోను, మల్లికార్జునుని ప్రార్థించే సమయంలోను ఉపయోగిస్తున్నారు. ఆ తరువాత కాలంలో ఆ భేరి ఒగ్గుడోలుగా రూపాంతరం చెందింది.

ఒగ్గుకథను కాపు, కురుమ, గొల్ల కులాలవారు తమ ఇళ్ళల్లో వివాహాలు జరుగు తున్నప్పుడు, శుభకార్యాలు జరుగుతున్నప్పుడు చెప్పిస్తారు. కొందరు భక్తులు

మూడేండ్లకు, ఐదేండ్లకు, ఏడేండ్లకొకసారి ఒగ్గుకథను చెప్పిస్తామని మొక్కుకుంటారు. ఆ మొక్కును చెల్లించడం కోసం భక్తులు ఒగ్గుకథను చెప్పిస్తారు. కొందరు పండుగల సమయాల్లోనూ, జాతరల సమయాల్లోను ఒగ్గుకథను చెప్పిస్తారు. కురుమలు మల్లన్న పండుగ, బీరన్న పండుగలు చేస్తున్న సందర్భాల్లో ఒగ్గుకథను చెప్పిస్తారు. కుటుంబ సభ్యుల్లో ఎవరైనా చనిపోయినప్పుడు వారి ఆత్మశాంతి కోసం ఒగ్గుకథను చెప్పిస్తారు. మల్లన్న పండుగ సమయంలో ఒగ్గుకథను మల్లన్న గుడిముందు చెప్పిస్తారు. బీరన్న పండుగ సమయంలో బీరన్న గుడిముందు చెప్పిస్తారు. వివాహం లాంటి శుభకార్యాల సందర్భంలో తమ ఇంటి ముందు ఒగ్గుకథను చెప్పిస్తారు. అలాగే కుటుంబ సభ్యుల్లో ఎవరైనా చనిపోయినా కూడా చనిపోయిన వ్యక్తి ఇంటిముందు కథను చెప్పిస్తారు.

ఒగ్గుకథ ప్రధానంగా గొల్ల, కురుమ కులాల వారికి సంబంధించినది ఐనప్పటికీ ఆ కథను వినడానికి అన్ని కులాలవారు వస్తారు. దానికి కారణం ఒగ్గుకథ గొప్ప జన రంజకంగా ఉండడమే. కథను చెప్పేరోజు సాయంకాలం ఈ రోజు రాత్రి ఫలానాచోట ఫలానా వారు ఒగ్గుకథను చెప్పిస్తున్నారని ఊర్లో చాటింపు వేస్తారు. కథ రాత్రి పదిగంటల నుంచి చెబుతారు. కానీ సాయంత్రం ఆరు, ఏడు గంటల ప్రాంతం నుంచే ప్రజలు కథ చెప్పేచోటికి వచ్చి తాము కూర్చొనే స్థలంలో చాప, గోనెసంచి, దుప్పటి మొదలైనవి పరచి తమ సీటును రిజర్వ్ చేసుకుంటారు. లేదా తాము పరిచిన వాటి మీద తమ పిల్లలను కూర్చోబెట్టి వెళతారు. దీన్నిబట్టి చూస్తే తెలంగాణ ప్రాంతంలో ఒగ్గుకథకు ఎంత ప్రసిద్ధి ఉందో అర్థమౌతుంది. తెలంగాణ ప్రాంతంలో దీనికి ఇంత ప్రసిద్ధి ఉన్నప్పటికి ఒగ్గుకథ ఆంధ్రదేశంలోని మిగిలిన ప్రాంతాల్లో ప్రచారంలోకి రాలేదు. దీనికి కారణం ఒగ్గుకథను కులకథగా భావించే కురుమ కులస్థులు ఆంధ్రదేశంలోని ఇతర ప్రాంతాల్లో లేకపోవడం కావచ్చు.

ఒగ్గుకథా ప్రదర్శన ప్రధానంగా ప్రధాన కథకులైన ఇద్దరు వ్యక్తుల మీద ఆధారపడి ఉంటుంది. ప్రధాన కథకుల్లో ఒకరు స్త్రీవేషాన్ని ధరిస్తారు. ఈ ప్రధాన కథకుల అభినయ సామర్థ్యం మీద, రసానుగుణంగా హావభావయుక్తంగా కథను చెప్పడం మీద ఈ ప్రదర్శన విజయవంతం కావడం ఆధారపడి ఉంటుంది. తెలంగాణ ప్రాంతంలో జానపద కళలు చాలా ఉన్నప్పటికి ఒగ్గుకథకు ఉన్న ప్రసిద్ధి ప్రచారం ఇంక ఏ కళకు లేవు. దీనికి కారణం ఒగ్గుకథలో కొన్ని విశిష్ట లక్షణాలు ఉండటమే.

ఒగ్గుకథ చేప్పేటప్పుడు కథకులు తెలంగాణ మాండలిక భాషలో ధారాళంగా మాట్లాడుతూ కథను చెబుతారు. వీరి మాటల్లో సామెతలు, జాతీయాలు, పలుకుబళ్లు చోటుచేసుకుంటాయి. అందువల్ల ఈ కథ వినసొంపుగా ఉంటుంది. ఒగ్గుకథకులు



మధ్యలో పొడుపుకథల వంటి చిత్రమైన ప్రశ్నలు ప్రేక్షకులకు వేసి ప్రేక్షకుల నుంచి సమాధానాలు రాబట్టడం ద్వారా తమ కథలో ప్రేక్షకులను కూడా భాగస్వాములుగా చేస్తారు. ఈ విధంగా చేయడంవల్ల ప్రేక్షకులు కథను మరింత శ్రద్ధతో ఆసక్తితో వింటారు.

ఒగ్గుకథకులు మధ్యలో హాస్య సంభాషణలను చేస్తూ ఉంటారు. ఈ సంభాషణలు కొన్ని కథకు సంబంధించినవి ఉంటాయి. కొన్ని కథకు సంబంధం లేనివి ఉంటాయి. అయినప్పటికీ హాస్యసంభాషణలతో ఒగ్గుకథకులు ప్రేక్షకులను కడుపుబ్బా నవ్వించి తమ కథ పట్ల వారికి మరింత ఆసక్తిని పెంపొందింప జేస్తారు. అదే విధంగా కరుణరస సన్నివేశాల్లో తమ హావభావాలతో ప్రేక్షకుల చేత కంట తడి పెట్టిస్తారు. అద్భుత సన్నివేశాల్లో, భయానక సన్నివేశాల్లో ప్రేక్షకులు ఆశ్చర్యపోయే లాగా, ఉత్కంఠకు లోనయ్యే లాగా నటించి ప్రేక్షకులను మెప్పిస్తారు. తమ కథలో ప్రేక్షకులు లీనమైపోయే లాగా చేస్తారు.

ఒగ్గుకథ విశిష్ట లక్షణాల్లో మరొకటి కథకులు కథలో వచ్చే ఏ పాత్రనైనా చక్కటి హావభావ యుక్తంగా నటించడం. కథలో వచ్చే పాత్రల అవసరాలను బట్టి సమయ సందర్భాలను బట్టి ఒగ్గుకథకులు మారిపోతూ ఉంటారు. ప్రధాన కథకులే గాకుండా వీరి వెనుకాల ఉన్న వంతలు, వాద్య పరికరాలను వాయించేవారు కూడా ముందుకు వచ్చి కథలోని పాత్రలుగా మారిపోయి నాటకంలోని నటుల లాగా ఆసమయానికి తగిన విధంగా హావభావ యుక్తంగా సంభాషణ చేసి తిరిగి తమతమ స్థానాలకు వెళ్ళిపోతారు.

ఒగ్గుకథ ప్రజలను బాగా ఆకట్టుకోవడానికి మరొక కారణం ప్రధాన కథకులిద్దరిలో ఒకరు స్త్రీ వేషాన్ని ధరించి కథలో వచ్చే స్త్రీ పాత్రలన్నింటిని సమర్థంగా పోషించడం. ఈ స్త్రీ వేషధారి కంఠస్వరంలో నడకలో, హొయలు ఒలికించడంలో ముమ్మూర్తుల స్త్రీని పోలి ఉంటాడు. అంతేగాదు అతడు తన నటనా సామర్థ్యంతో ప్రేక్షకులకు స్త్రీయే నని భ్రమను కలుగుజేస్తాడు. కథలో వచ్చే అన్ని రకాల స్త్రీ పాత్రలను అతడు అతి సహజంగా నటిస్తాడు. ఒగ్గుకథలో సహజత్వం ఉంటుందని చెప్పడానికి స్త్రీ పాత్రను ఉదాహరణగా చెప్పవచ్చు.

ఒగ్గుకథగా చెప్పే కథలు ప్రేక్షకులకు తెలిసినవే అయినప్పటికీ కథకులు కథను చెప్పడంలో వైవిధ్యాన్ని ప్రదర్శించడం వల్ల ప్రేక్షకులకు విసుగు కలగదు. ఒగ్గుకథకులు కథ మీద మంచి పట్టు కలిగి ఉంటారు. వారం రోజులు చెప్పే కథను దాని అర్థం ఏమాత్రం చెక్కుచెదరకుండా ఒక్కరోజులోనే కుదించి చెప్పగలరు. అలాగే ఒక్కరోజులో చెప్పేకథను వారం రోజులపాటు సాగదీసి చెప్పగలరు. కథకుల ఈ

విధమైన కథాకథన సామర్థ్యం వల్లనే ఒగ్గుకథ కథాఖ్యానాత్మక కళగా పేరు ప్రసిద్ధులు పొందింది. జానపద కళలు కనుమరుగైపోతున్న ఆధునిక కాలంలో కూడా ఒగ్గుకథ ప్రజలను ఆకర్షిస్తూ వారి హృదయాల్లో చిరస్థాయిగా చోటుచేసుకుంది.

రాజకీయ నాయకులు, ఉద్యమకారులు ఒగ్గుకథ పట్ల ప్రజలకు ఉన్న ఆసక్తిని గమనించి తమ సిద్ధాంతాలను ఒగ్గుకథ రూపంలో ప్రచారం చేస్తున్నారు. సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా ఒగ్గుకథను ఆధునీకరించి అనేక సమస్యలను ప్రజలకు తెలిపి, ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజల్లో ఒగ్గు కథకున్న ప్రసిద్ధిని గమనించిన ఆకాశవాణి, దూరదర్శన్ లాంటి ప్రసార సాధనాలు కూడా ఒగ్గుకథను ప్రదర్శింపజేసి అది బహుళ ప్రచారంలోకి రావడానికి దోహదం చేస్తున్నాయి.

ఒగ్గుకథ మొదట భక్తి ప్రధానమైన జానపద కళ. మొదట్లో ఒగ్గుదీక్ష స్వీకరించిన గొల్ల, కురుమ కులాలవారు తమ కులదేవతలైన మల్లన్న, బీరప్ప కథలను మాత్రమే చెప్పేవారు. ఆ సమయంలో ఒగ్గుకథ భక్తిప్రధానమైనది. కానీ ఈనాడు మల్లన్న బీరప్ప కథలనే గాకుండా అనేక పౌరాణిక, చారిత్రక కథలను ఒగ్గుకథలుగా చెబుతున్నారు. ఒగ్గుకథకులు ప్రజలను రంజింపజేయడానికి అనేక రకాల హాస్యసన్నివేశాలను కల్పించి చెబుతున్నారు. అందువల్ల ఈనాటి ఒగ్గుకథ భక్తి, వినోదము రెండూ ఉన్న ఉభయ ప్రధానమైన జానపద కళ అని చెప్పవచ్చు. ఈ కళ తెలంగాణ ప్రాంతంలో మాత్రమే ప్రదర్శింపబడుతూ ఉంది. అందువల్ల ఇది ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమైన కళగా భావించవచ్చు. ఒగ్గుకథను ప్రధానంగా రాత్రిపూట చెప్పినప్పటికి అప్పుడప్పుడు పగటిపూట గూడా చెబుతున్నారు. అందువల్ల ఈ కళ పగలు రాత్రి అనే భేదం లేకుండా అన్ని వేళలా ప్రదర్శించే కళగా చెప్పవచ్చు. ఈ కళా ప్రదర్శనలో పురుషులు మాత్రమే పాల్గొంటారు. స్త్రీలకు ఇందులో చోటులేదు. ప్రధాన కథకుల్లో ఒకరు స్త్రీ వేషాన్ని ధరించినప్పటికీ అతడు స్త్రీ కాదు పురుషుడే. ఇందులో పిల్లలు కూడా పాల్గొనరు. అందువల్ల ఒగ్గుకథ పురుషులకు మాత్రమే పరిమితమైన కళగా చెప్పవచ్చు. ఒగ్గుకథ ఆఖ్యానాత్మకమైన కళ. ఈ కళలో బాల నాగమ్మకథ, ఎల్లమ్మకథ, మైరావణకథ, వానదేవుని కథ, పెద్దిరాజు పెద్దమ్మ కథ మొదలైన పౌరాణిక, చారిత్రక కథలను చెబుతారు. అందువల్ల ఇది సాహిత్యమున్న జానపదకళ. ఈ కళను ప్రధానంగా కురుమ, గొల్ల కులాలవారు చెబుతున్నారు. అయినప్పటికీ కొంతమంది మిగిలిన కులాలవారు కూడా కథ చెప్పే విధానాన్ని నేర్చుకొని ఒగ్గుకథను చెబుతున్నారు. అందువల్ల ఒగ్గుకథ మొన్నమొన్నటివరకు కురుమ, గొల్లకులాల వారికి పరిమితమైనప్పటికి ఈనాడు అది అన్ని కులాలవారికి సంబంధించిన కళగా చెప్పవచ్చు. ఒగ్గుకథకు అన్ని కులాలవారు ప్రేక్షకులుగా ఉంటారు.



## తప్పెటగుళ్ళు - స్వరూప స్వభావాలు - చరిత్ర :

తప్పెటగుళ్ళు ఉత్తరాంధ్ర జిల్లాల్లో బాగా ప్రసిద్ధి చెందిన జానపదకళ. తెలంగాణ ప్రాంతంలో ఒగ్గుకథకు ఎంతటి ప్రసిద్ధి, ప్రచారం ఉన్నాయో ఉత్తరాంధ్ర ప్రాంతంలో తప్పెటగుళ్ళు కళకు అంతటి ప్రసిద్ధి ప్రచారం ఉన్నాయి. ఉత్తరాంధ్ర జిల్లాల్లో యాదవుల్లో ఒక శాఖ అయిన ఆలగొల్లలు ఈ తప్పెటగుళ్ళు కళను చాల కాలం నుంచి ప్రదర్శిస్తున్నారు. ఇందులో నాట్యం, సంగీతం, సాహిత్యం మూడు ఉన్నాయి. అంతేగాకుండా ఈ కళాకారులు ప్రదర్శన సమయంలో అనేక రకాల విన్యాసాలను చేస్తారు.

తప్పెటగుళ్ళు కళా ప్రదర్శనలో ఉపయోగించే వాద్యం పేరు 'తప్పెటగుండు'. ఈ వాద్యాన్ని బట్టే ఈ కళకు తప్పెటగుళ్ళు అనే పేరు వచ్చింది. తప్పెటగుండు ఏక వచనం, తప్పెటగుళ్ళు బహువచనం. ఈ కళాకారులు పది నుంచి ఇరవైమంది వరకు ఒక జట్టుగా ఏర్పడి ఈ ప్రదర్శనను నిర్వహిస్తారు. కళాప్రదర్శనలో ఎంతమంది పాల్గొంటారో అంతమందీ తప్పెటగుళ్ళను ధరించి వాటిని వాయిస్తూ నృత్యం చేస్తారు. ఒకటి కంటే ఎక్కువ తప్పెటగుండులను ఈ కళా ప్రదర్శనలో ఉపయోగించడంవల్ల దీనికి తప్పెటగుళ్ళు అనే పేరు వచ్చింది.

తప్పెటగుళ్ళు కళా ప్రదర్శనలో విష్ణువవతారం, మత్స్యావతారం, కృష్ణావతారం మొదలైన దశావతార కథలను పాడతారు. అందువల్ల ఈ కళ వైష్ణవ భక్తి ప్రధానమైన జానపద కళ అని చెప్పవచ్చు. మొదట్లో ఇలాంటి భక్తి ప్రధానమైన కథలను చెప్పినప్పటికీ తరువాత కాలంలో సారంగధర కథ, బొబ్బిలియుద్ధం, చెంచిత కథ, మాలవారి మంగమ్మ కథ, రెల్లి అప్పమ్మ కథ మొదలైన ఇతర కథలను కూడా వీరు పాడతారు. అందువల్ల ప్రస్తుతం తప్పెటగుళ్ళు జానపదకళ భక్తి, వినోదమూ రెండూ ఉన్న ఉభయ ప్రధానకళగా చెప్పవచ్చు. ఈ కళను ఉత్తరాంధ్ర ప్రాంతంలోను, ఉభయ గోదావరి జిల్లాల్లోనూ ప్రదర్శిస్తున్నారు. అందువల్ల ఇది ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమైనక కళ అని చెప్పవచ్చు. ఈ కళా ప్రదర్శనలో గతంలో పురుషులు మాత్రమే పాల్గొంటారు. ఈ కళను పగలు, రాత్రి అనే తేడా లేకుండా అన్ని వేళలా ప్రదర్శిస్తారు. ఈ కళా ప్రదర్శనలో కళాకారులు అనేక రకాల కథలను చెబుతారు. అందువల్ల ఇది సాహిత్యం ఉన్న జానపద కళ. ఈ కళను ఆలగొల్ల శాఖకు చెందిన యాదవులు మాత్రమే ప్రదర్శిస్తారు. అందువల్ల ఇది యాదవ కులానికే పరిమితమైన కళగా చెప్పవచ్చు.

శివుని ఆజ్ఞ ప్రకారం గంగాదేవి కాటమరాజు భార్యగా జన్మించిందని, అందువల్లనే ఆమెను యాదవుల కులదేవతగా పూజిస్తారని, ఒకసారి శివుని దర్శించడానికి

కొంతమంది భక్తులు వెళ్ళగా శివుడు వారికందరికీ తలా ఒక వాయిద్యాన్ని ఇచ్చాడని, చివరగా యాదవులు వెళ్ళి శివుని దర్శిస్తే శివుడు మిగిలిపోయిన తప్పెటగుండును యాదవులకు ఇచ్చాడని అప్పటి నుండి యాదవులు తప్పెటగుండును వాద్యంగా చేసుకొని ఈ కళను ప్రదర్శిస్తున్నారని తప్పెటగుళ్ళ కళాకారులు తమ వాద్యమైన తప్పెటగుండు పుట్టుకను గురించి చెబుతారు. ఈకథ హేతుబద్ధమైనది కాదు. తమ కళకు ప్రాచీనతను, పవిత్రతను ఆపాదించడానికి తప్పెటగుళ్ళు కళాకారులు ఈ కథను కల్పించి ఉంటారు.

తప్పెటగుళ్ళు పుట్టుకను గురించి మరొక కథ పల్లి తిరుపతిరావుగారు రాసిన "తప్పెటగుళ్ళు - జానపద కళ" అనే గ్రంథంలో చెప్పబడింది.[15] ఆ కథ ఇది. "ఆవుల వలురాజుకు పెద్దిరాజు, ఎర్రినూకరాజు, నల్లనూకరాజు, సింహాద్రిరాజు, పోలిరాజు అనే ఐదుగురు కుమారులు కొమరమ్మ అనే ఒక కూతురు జన్మించారు. పై ఐదుగురు రాజకుమారులు బాలరాజులు ధనుమకొండ (నేటి ధనకొండ)ను రాజధానిగా చేసుకొని పరిపాలిస్తున్నారు. ఒకమారు ధనుమకొండ పట్టణం బాగా కరువు పెట్టింది. మఖ, పుబ్బ, కార్తెలలో కూడా మంచి మందు వేసవిలా మాడిపోతోంది. చిత్త, స్వాతిలో సీమ కరువు పెట్టింది. ఎంతోమంది ఆకలితో అలమటించిపోతున్నారు. ఆవుల మందలకు సరైన మేపు లేక వేల సంఖ్యలో ఆవులు చనిపోతున్నాయి. ఇక వేరే గత్యంతరం లేక కరవు పెట్టినందున ఈ గొల్లరాజులు తమ ఆలమందలు తోలుకొని పల్నాటి భూముల్ని ఏలిన సిద్ధిరాజులు ఎర్రసిద్ధిరాజు, కస్తూరి సిద్ధిరాజు, చోళసిద్ది రాజు, మనుమసిద్ధిరాజు, తాత భేతాళరాజు భూముల్లోకి వచ్చి "పుల్లరి" ఇస్తామని రాజులకు చెప్పి ఆ భూముల్లో గడ్డిని మేపుకున్నారు. 'పుల్లరి' అంటే గడ్డికి, నీరుకు ఇచ్చే ఓ విధమైన శిస్తు లేదా కప్పమని చెప్పుకోవచ్చు.

అయితే పుల్లరి ఇస్తామని చెప్పి గడ్డిని మేపుకున్న గొల్లరాజులు 'గడ్డి గెడ్డదాటి' పుల్లరి ఇవ్వకుండా వెళ్ళిపోతున్నారట. అప్పుడు సిద్దిరాజులు ఇదేమిటి మనకు పుల్లరి ఇస్తామన్న ఘనమైన గొల్లరాజులు ఇలా మోసపుచ్చారేమిటి? పండుతున్న పంటలు, ఆకుతోటలు, ఒకటేమిటి అన్నీ మేపుకున్నారు. కదా! అని అడిగేసరికి 'నీటికి పుట్టింది కదా గడ్డి అందుచేత మేం పుల్లరి ఇవ్వం అని గొల్లరాజులు తిరిగి కబురంపారు. గొల్లరాజులు అలా కబురంపటంతో నెల్లూరి సిద్ధిరాజులకు ఆశ్చర్యం, ఆందోళన కలిగాయి. పైగా కోట మీద పుట్టిన గడ్డిపై కూడా మాకు హక్కుంది, అని కోట మీదకి ఎద్దుల్ని ఢీ కొట్టారట. వాటి ధాటికి తట్టుకోలేక సిద్ధిరాజులు పారిపోయారు. సిద్ది రాజుల తోబుట్టువైన పున్నమాదేవి ఒక రామచిలుకను అతి ప్రేమతో వసపోసి



పెంచింది. తొలి ద్వారం దగ్గర పంజరంలో నున్న రామచిలుకతో పున్నమాదేవి ఇలా అంటుంది. 'నాకు కొడుకుల్లేరు, కొమ్మల్లేరు, నాకే కొడుకులుంటే నిలువునా ఇలా ధ్వంసమైపోతున్న పట్టణాన్ని కాపాడేవారు కదా!' అని భోరున విలపించింది. ఆ శోకం విన్న పంజరంలోని రామచిలుక 'ఎందుకమ్మా అలా విలపిస్తావు, నేను నీకు కొడుకు లాంటి వాణ్ణి కానా! నేను పక్షిరాజును కానా! నీ కొచ్చిన భయం లేదు! నేనున్నాను! ఆరు మూళ్ల కటారి కాళ్ళకు కట్టుకొని మూడు మూళ్ళ కటారి ముక్కున కరచుకొని 'ఆ గొల్లరాజులాలమందలను ధ్వంసం చేస్తాను' అని ధైర్యం చెప్పి, విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి పై కటార్లను సంపాదించుకొని వచ్చింది. గ్రహణం పట్టినప్పుడు గొల్లరాజులు మందలోనికి వెళ్లరని గ్రహించిన రామచిలుక నిశిరాత్రి వేళ పసిపిల్లలకు పాలు ఇవ్వని వేళల్లో రివ్వుమని బాణం వలె ఎగిరి మందలోనికి ప్రవేశించింది. మందలలోని ఆవులను బెదిరించి వాటి శరీరంలోని కండలను ముక్కలు ముక్కలుగా పొడిచింది. మందను చెల్లాచెదురు చేసింది. ఇటువంటి సమయంలో గొల్లలు ఆ పరిస్థితిని చూసారు. ఆ పక్షి వీరిని చూసి అక్కడున్న మర్రిచెట్టు ఆకులలో దాక్కుని చూస్తూ కూర్చున్నది. ఈ గొల్లలు ఇక్కడ నుండి వెళ్ళిపోతారా! వెళ్ళరా? అని చిలుక చూస్తోంది. ఈ పరిస్థితిలో చిలుకను ఎలా పంపించడం అని ఆలోచించారు, భేరీలు మ్రోగించారు. డప్పులతో సప్త తాళలు వాయించారు. చిలుక కదల్లేదు, మెదల్లేదు, మద్దెల్ని కొట్టారు, ఇంకెన్నో వాద్యాల చప్పుళ్ళు చేసారు. ఎన్ని చేసినా రామచిలుక బెదరలేదు, అదరలేదు, చెదరలేదు. కాటమరాజు కేకలు వేస్తూ అదిరించి రెండు చేతులతో చప్పట్లు కొట్టాడు, అందరూ అలాగే చప్పట్లు ఏకధాటిగా కొట్టడం ప్రారంభించారు. ఆ చిలుక తప్పట్లకు భయపడి ఎగిరిపోయింది. ఆవిధంగా చేతులతో తప్పెట్లు కొట్టడం క్రమేపి గుండె (చాతి) మీద కొట్టుకుంటూ పాడుకొనే కళగా మారింది. ఆ తరువాత ఒక రకమైన వాద్య పరికరమును తయారుచేసి చాతిపై కట్టుకొనేవారు. ఆ పరికరానికి గుండు, తప్పెటగుండు, తప్పెటగుళ్ళు అని పేరు అప్పటి నుండే వచ్చింది. ఈ పరికరము పుట్టిన రోజుల్లోనే గుండుపై దరువేస్తూ ఏవో అమాయకపు పాటలు పాడేవారని తెలుస్తుంది".

తప్పెటగుళ్ళ ఆవిర్భావాన్ని గురించి చెప్పిన పై కథ వాస్తవమైనది కాదు. అందులో సిద్దిరాజులు పలనాటి భూములను పాలిస్తున్నట్లుగా చెప్పబడింది. యాదవ బాలరాజులు ధనుమకొండను పాలిస్తున్నట్లుగా చెప్పబడింది. పున్నమాదేవి సిద్దిరాజుల తోబుట్టువుగా చెప్పబడింది. ఆమె పెంచుకున్న రామచిలుక విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి ఆరుమూళ్ళ కటారిని, మూడుమూళ్ళ కటారిని తీసుకొని వచ్చి యాదవుల గోవులను గాయపరిచినట్లుగా చెప్పబడింది. యాదవులు దాన్ని బెదరగొట్టడానికి భేరీలు

మ్రోగించడం, డప్పులు వాయించడం, మద్దెల్లను కొట్టడం మొదలైనవి చేశారు. ఈ శబ్దాలకు భయపడని రామచిలుక కాటమరాజు కేకలువేసి రెండు చేతులతో కొట్టిన చప్పట్లకు భయపడి ఎగిరిపోయినట్లుగా చెప్పబడింది. ఈ చెప్పిన విషయాలేవీ నమ్మదగినవి కావు. కాటమరాజు శ్రీశైలం అడవుల్లో గోవులను మేపుతున్నప్పుడు కరువు వచ్చినట్లుగా, గోవులకు మేత నీరు ఇవ్వడానికి నెల్లూరును పాలిస్తున్న నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం కుదుర్చుకొని ఆ రాజ్యంలో కాటమరాజు తన గోవులను మేపుకున్నట్లుగా, కాటమరాజు ఆలమంద బీడు భూములనే కాకుండా నెల్లూరులో ఉన్న పంట పొలాలను గూడా మేపడం చేత అక్కడి రైతులు నల్ల సిద్దిరాజు రెండవ భార్య అయిన కుందమా దేవికి ఫిర్యాదు చేసినట్లు, ఆ తరువాత కుందమాదేవి పెంపుడు చిలుక కాటమరాజు ఆలమందలున్న దగ్గర గట్టిగా అరుస్తూ ఉండడంచేత ఆలమందలు బెదిరి చెదరిపోయి నట్లు, కాటమరాజు మిత్రుడైన పద్మరాఘవుడు చిలుకను బాణంతో కొట్టినట్లుగా, తన పెంపుడు చిలుకను చంపిన యాదవుల మీద కినుక వహించిన కుందమాదేవి కాటమరాజు ఆలమందలను బోయలతో పొడిపించినట్లుగా, ఈ ఘోరం అంటే బోయలు చేత తన ఆలమందలు పొడిపించినది నల్లసిద్ది రాజే అనుకొని కాటమరాజు తాను ఇవ్వవలిసిన పుల్లరిని నల్లసిద్ధిరాజుకు ఇవ్వకుండా నెల్లూరు నుంచి గోవులను మళ్ళించు కొని ఎర్రగడ్డపాడు దగ్గర విడిది చేసినట్లుగా, ఎర్రగడ్డపాడు దగ్గరనే పుల్లరి గురించి నల్లసిద్ధిరాజుకు, కాటమరాజుకు యుద్ధం జరిగినట్లుగా కాటమరాజు కథల్లో చెప్పబడింది. కాటమరాజు కథల్లోని ఈ విషయాన్ని ఆధారంగా చేసుకొని తప్పెటగుళ్ళు కళాకారులు పల్లి తిరుపతిరావుగారు చెప్పిన పై కథను కల్పించి ఉంటారు. అందువల్ల తప్పెటగుళ్ళు ఆవిర్భావానికి సంబంధించి పల్లి తిరుపతిరావుగారు చెప్పిన కథ వాస్తవమైనదికాదు.

విశాఖపట్నంలోని శివాజిపాలెంలో ఉన్న రాజీవ్ నగర్‌లో “శ్రీ యశోదాకృష్ణ జానపద తప్పెటగుళ్ళు కళాబృందం” అనే పేరుతో తప్పెటగుళ్ళు కళాకారులు ఉన్నారు. ఈ బృందానికి నాయకుడు పడగల త్రినాథరావు. ఇతను యాదవ కులస్థుడు. ఇతనికి నలభై సంవత్సరాలు వయసు ఉంటుంది. వీరు చిన్నప్పుడు మూడవ తరగతి వరకు మాత్రమే చదువుకున్నారు. ఇతని తప్పెటగుళ్ళ గురువు పల్లా అప్పలస్వామి. తప్పెట గుళ్ళ పుట్టుకను గురించి తమ గురువుగారైన పల్లా అప్పలస్వామిగారు చెప్పిన విషయాన్ని నాకు ఇలా చెప్పారు.

కాటమరాజు ఇతర గోపాలకులతో కలిసి తన ఆలమందను అడవుల్లో మేపుకొనేటప్పుడు క్రూరమృగాలు ఆలమంద దగ్గరికి రాకుండా, వాటిని



భయపెట్టడానికి తప్పెటగుళ్ళు వాయిద్యాన్ని కల్పించాడు. గోపాలకులు ఆ వాద్యాన్ని వాయిస్తూ క్రూరమృగాలు తమ ఆలమంద దగ్గరకు రాకుండా భయపెట్టి పారద్రోలేవారు. అప్పటినుంచి యాదవులు తప్పెటగుళ్ళ వాద్యాన్ని వాయిస్తూ ఉన్నారు.

తప్పెటగుళ్ళు కళారూపం కాటమరాజు కాలంనాటిది కాదు. తమ కళకు ప్రాచీనతను కల్పించడానికి తప్పెటగుళ్ళవారు ఈ కథను కల్పించారు.

బద్రి కూర్మారావుగారు రాసిన “ఉత్తరాంధ్ర జానపద కళలు” అనే గ్రంథంలో తప్పెటగుళ్ళ పుట్టుకను గురించి ఈవిధంగా చెప్పబడింది.[16] గొల్లలు రెండు మూడు నెలలు మందలో ఉండిపోతారు. ఇంటివద్ద వారి భార్యలు చిన్నపిల్లలు ఉంటారు. బిడ్డలు క్షేమంగా ఉండాలని వర్షాలు పడాలని, జీవులు (గొర్రెలు, మేకలు) క్షేమంగా ఉండాలని, అంతా క్షేమంగా ఉంటే గావు సంబరం చేస్తామని మొక్కుకుంటారు. యాదవులు గంగమ్మ పండుగ చేస్తారు. దానినే గావు గంగాలమ్మ పండుగ అంటారు. ఆ సంబరం రోజున పాటపాడుకొని గెంతులు వేసుకొని గుండెపై చేతులు కొట్టుకొని పాటపాడతారు. గుండెలను కొట్టుకొని పైకి ఎగురుతారు.

“ఓ రామరామయ్యా! శ్రీరామ రామయ్య- హరి రామరామయ్య అయివోధ్యలోన” ఈ విధంగా తప్పెటలను గుండెలపై వాయించుకొనేవారు. ఆ తరువాత తప్పెటగుండును తయారుచేశారు”.

తప్పెటగుళ్ళు పుట్టుకను గురించి బద్రి కూర్మారావుగారు చెప్పిన విషయం సహేతుకంగానే ఉంది. యాదవులు ఇంటి దగ్గర భార్యాపిల్లలను వదిలిపెట్టి కొన్ని రోజుల పాటు (వారం, పది రోజులు) మంద దగ్గర ఉండవలిసి వస్తుంది. మందను వేరే ఊర్లకు తోలుకొని వెళ్ళినప్పుడు నెలా రెండు నెలలపాటు మందదగ్గరే ఉండి పోవలసి వస్తుంది. ఇలాంటి సందర్భంలో వీరికి తమ ఊర్లో ఉన్న భార్యా పిల్లల మీద మనసుపోవడం సహజం. ఇలాంటి సందర్భంలో ఏదైనా ఇతర విషయం మీద తను మనస్సును లగ్నం చేసే ప్రయత్నం చేస్తారు. ఇందులో భాగంగా తమకు తోచిన పాటలు పాడుకోవడం, తాము విన్న భారత రామాయణ సంబంధమైన కథలను పాటలుగా పాడుకోవడం జరుగుతూ ఉంటుంది. అలా పాడుకుంటున్నప్పుడు ఆ పాటకు తగిన వాద్యంగా చేతులతో తప్పట్లు కొట్టడం గానీ, చేతులతో గుండెల మీద కొట్టుకొని శబ్దంచేసే అవకాశం ఉంది. ఇలా కొంతకాలం చేసిన తరువాత గుండెల మీద కట్టుకొనే వాద్యాన్ని తయారుచేసి దాని మీద కొడుతూ పాటలు పాడుకుంటూ ఉంటారు. ఈ విధంగా తప్పెటగుండు పుట్టడానికి అవకాశం ఉంది. మందల దగ్గర

రాత్రి పూట ఉన్న మందకాపరులైన యాదవులు కాలక్షేపానికి మొట్టమొదట ఈ తప్పెటగుళ్ళు కళను సృష్టించుకొని ఉండవచ్చు. తరువాత కాలంలో దానిలో అనేక పరిణామాలు చోటుచేసుకొని నేటి తప్పెటగుళ్ళుగా మార్పు చెంది ఉండవచ్చు. ఏమైనా ఇవన్నీ మనం ఊహించవలసిందే గానీ స్పష్టంగా తప్పెటగుళ్ళు ఆవిర్భావానికి సంబంధించిన విషయాన్ని చెప్పడం కష్టం. తప్పెటగుళ్ళు గురించే కాదు ఏ జానపద కళ పుట్టుకను గురించి అయినా చెప్పడం కష్టమే అవుతుంది. తప్పెటగుళ్ళు ఎలా పుట్టింది? ఏ కాలంలో పుట్టి ఉంటుంది? అనే దాన్ని గురించి స్పష్టంగా చెప్పలేక పోయినప్పటికీ ఈ కళను యాదవులు సృష్టించుకున్నారని, వారే దానిలో కాలానుగుణంగా అనేక మార్పులు చేసి అనేక విన్యాసాలతో కూడిన నేటి తప్పెటగుళ్ళ కళను రూపొందించారని స్పష్టంగా చెప్పవచ్చు.

తప్పెటగుళ్ళు కళాకారులు వాయించే తప్పెటగుండు వాద్య పరికరం 'తాషా' ఆకారంలో ఉంటుంది. ఐతే ఇది తాషా కన్నా చిన్నదిగా ఉంటుంది. తప్పెటగుండును ఇప్పుడు ఇనుపరేకుతో తయారు చేస్తున్నారు. మొదట దీని చట్రాన్ని మట్టితో కుమ్మరి వాళ్ళతో తయారు చేయించి దానికి గొర్రె లేక మేక చర్మాన్ని అతికించి వాయించేవారు. ఇలా వాయించేటప్పుడు మట్టి చట్రం పగిలిపోయేది. ఒక్కొక్కసారి అజాగ్రత్త వల్ల కిందపడి ముక్కలయ్యేది. దీనివల్ల ప్రదర్శనకు అంతరాయం ఏర్పడేది. అందువల్ల మట్టితో చేసిన వాద్యం పనికిరాదని భావించి చట్రాన్ని చెక్కతో తయారు చేయించి దానికి చర్మాన్ని అతికించి వాయించేవారు. తప్పెటగుళ్ళు కళాకారులు కళాప్రదర్శనలో లీనమైపోయి ఉద్రేకస్థితిలో వాయించేటప్పుడు ఇష్టమొచ్చిన రీతిలో చాలా గట్టిగా తప్పెటగుళ్ళను వాయిస్తారు. ఇలా వాయించినప్పుడు చర్మం పగిలిపోయేది. అందువల్ల చర్మంతో చేసిన తప్పెట పనికిరాదని ఇనుపరేకుతో తయారుచేసిన తప్పెటను వాడుతున్నారు. ప్రస్తుతం తప్పెటగుళ్ళు కళాకారులందరూ ఇనుపరేకుతో తయారు చేసిన తప్పెటగుండునే ఉపయోగిస్తున్నారు.

తప్పెటగుండు కళాయి ఆకారంతో ఉంటుంది. దీని అడుగు భాగం కళాయి లాగా కాకుండా గిన్నె లాగా సమతలంగా ఉంటుంది. ఈ అడుగు భాగంలోని మధ్యభాగంలో ఉన్న రేకును కత్తిరించి పెద్ద రంధ్రాన్ని ఏర్పాటుచేస్తారు. ఇలా రంధ్రం ఉండడం వల్ల తప్పెటగుండు బాగా శబ్దాన్ని ఇస్తుంది. పై భాగాన్ని ఇనుపరేకుతో మూసివేస్తారు. ఈ ఇనుపరేకు కింది భాగంలో వేలంత వెడల్పు, పొడవు ఉన్న పది చిన్నరేకు ముక్కలను గుండ్రటి ఆకారంలో వెల్డింగుచేసి అతికిస్తారు. ఇనుపరేకుకు వాటికి మధ్యన ఖాళీ ఉండేటట్లుగా రేకు ముక్కల మొదళ్లను మాత్రమే అతికిస్తారు.



చివరలు మాత్రం ఇనుపరేకుకు అతుక్కోకుండా కొంచెం పైకి లేచి ఉంటాయి. ఇలా ఉండడం వల్ల తప్పెటగుండును వాయించినప్పుడు, లోపల ఉన్న ఈ రేకులు చలించడం వల్ల మంచి శబ్దం వస్తుంది. ఈ రేకు ముక్కలు ఒకదాని పక్కన ఒకటి ఉంటూ గుండ్రంగా ఉంటాయి. ఒక్కొక్క దాని మధ్య ఖాళీ ప్రదేశం ఉంటుంది. తప్పెటగుండు కింది భాగంలో ఉన్న రంధ్రంలో నుంచి పరిశీలనగా చూస్తేనే ఈ రేకు ముక్కలు కనిపిస్తాయి. తప్పెటగుండు వాయించడం వల్ల వెల్డింగు ఊడిపోయి ఈ రేకు ముక్కలు రాలిపోతూ ఉంటాయి. తప్పెటగుండు పై భాగంలో ఉన్న రేకు గూడా ఎక్కువ కాలం ఉండదు. తప్పెటగుళ్ల కళాకారులు చేతులతో గట్టిగా కొట్టి వాయించడం వల్ల పై భాగంలో ఉన్న రేకు పగిలపోవడం గానీ అతుకు ఊడిపోవడం గానీ జరుగుతుంది. దీన్ని మరమ్మత్తు చేయడం జరగదు. దాన్ని పారవేసి కొత్త తప్పెటగుండును కొనుక్కోవాలి. తప్పెటగుండుకు ఎడమ వైపు పైన, కింద రెండు రంధ్రాలు, కుడివైపు పైన, కింద రెండు రంధ్రాలుంటాయి. ఈ నాలుగు రంధ్రాల నుంచి నాలుగు తాళ్లు కడతారు. తప్పెటగుండును చాతికి ఆనించి పైరెండు తాళ్లను చేతులు మీదుగా భుజాలకు కట్టుకుంటారు. కింది రెండు తాళ్లను కలిపి నడుముకు కట్టుకుంటారు. ఇలా కట్టుకోవడం వల్ల కళాకారులు ఎన్ని రకాల విన్యాసాలు చేసిన తప్పెటగుండు కదలకుండా చాతిని అంటిపెట్టుకొని ఉంటుంది.

తప్పెటగుళ్లను విజయనగరంలో తయారు చేస్తారు. విజయనగరంలో గంటస్థంభం దగ్గర ఉన్న మార్కెట్లో కొడవళ్ళు, కత్తులు, కత్తిపీటలు మొదలైన ఇనుప వస్తువులు అమ్మే అంగట్లో అమ్ముతారు. ఒక్కొక్క తప్పెటగుండు ఖరీదు యాభై రూపాయలు. తప్పెటగుళ్ల కళాకరులు ప్రదర్శన సమయంలో వాటిని గట్టిగా వాయించడం వల్ల అవి ఆరు నెల్లకు మించి పనిచెయ్యవు. అవి పాడైతే వాటిని మరమ్మత్తు చేయరు. పాడైనదాన్ని పారవేసి కొత్తది కొనుక్కోవాలి.

ఉత్తరాంధ్ర జిల్లాల్లోని యాదవులు ఎక్కువగా ఉన్న గ్రామాల్లో కనీసం ఒక్క తప్పెట గుళ్ళ బృందమైనా ఉంటుంది. కొన్ని పెద్దగ్రామాల్లో ఒకటికి మించి తప్పెటగుళ్ళ బృందాలు ఉంటాయి. గ్రామాల్లోనే కాకుండా విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం మొదలైన పట్టణాల్లో కూడా తప్పెటగుళ్ళ బృందాలు ఉన్నాయి. ఒక్కొక్క బృందంలో ఇరవై నుంచి ముప్ఫై మంది వరకు సభ్యులు ఉంటారు. వీరు గురువు ద్వారా తప్పెటగుళ్ళ ప్రదర్శనను నేర్చుకుంటారు. నేర్చుకోవడానికి ఆరు నెలల నుంచి రెండు సంవత్సరాల కాలం పడుతుంది. నేర్చుకొనేటప్పుడు ఇరవై నుంచి ముప్ఫై మంది యువకులు ఒక బృందంగా ఏర్పడి గురువును ఏర్పాటు చేసుకుంటారు.

సాధారణంగా గురువు వేరే ఊరికి చెందినవాడై ఉంటాడు. గురువుకు రోజు భోజనం, ఇతర ఖర్చులు కాకుండా నెల జీతం కూడా ఇవ్వాలి. ప్రస్తుతం తప్పెటగుళ్ళు నేర్చుకోవాలంటే గురువుకు బృందంలోని సభ్యులందరూ కలిసి మూడువేల రూపాయలు నెల జీతం ఇస్తున్నారు. అంటే ఒక బృందంలో ముప్పైమంది యువకులు ఉంటే ఒక్కొక్కరు నెలకి వంద రూపాయలు వేసుకొని అందరూ కలిపి మూడు వేల రూపాయలు వసూలుచేసి గురువుకు నెలజీతం ఇచ్చుకోవాలి. ఇది కాకుండా ఒక్కొక్క సభ్యుడు ఒక్కొక్క రోజు తన ఇంట్లో గురువుకు మూడు పూటలా మంచి భోజనం పెట్టి, చుట్ట, బీడి, కాఫీ మొదలైన వాటికి అయ్యే ఆ రోజు ఖర్చు ఇరవై రూపాయలు గానీ, ముప్పై రూపాయలు గానీ ఇవ్వలసి ఉంటుంది. ఇది కాకుండా గురువు మధ్యలో తన ఊరికి వెళ్ళవలిసివస్తే అతను వెళ్ళి రావడానికి రానుపోను చార్జీలు ఇతర ఖర్చులు కూడా బృంద సభ్యులే ఇవ్వవలసి ఉంటుంది. ఈ విధంగా ఇన్ని ఖర్చులు భరించి గురువు ద్వారా యాదవ యువకులు తప్పెటగుళ్ళ కళా ప్రదర్శనను నేర్చుకుంటారు.

తప్పెటగుళ్ళ ప్రదర్శనను నేర్చుకొనే యువకులు చాలావరకు బీదవారే. వీరందరూ పగటిపూట గొర్రెల, మేకల మందను కాయడం గానీ లేక కూలి పనికి వెళ్ళడం గానీ చేస్తుంటారు. అందువల్ల వీరు పగటిపూట తప్పెటగుళ్ళు ప్రదర్శనను నేర్చుకొనే అవకాశం ఉండదు. రాత్రి భోజనం చేసిన తరువాత ఎనిమిది గంటల ప్రాంతం నుంచి విశాలమైన ఖాళీ ప్రదేశంలో తప్పెటగుళ్ళ ప్రదర్శనను నేర్చుకోవడం ప్రారంభిస్తారు. పగలంతా కష్టపడి పని చేయడంవల్ల రాత్రిపూట కళా ప్రదర్శన నేర్చుకోవడానికి అలపట కారణంగా కొంత ఇబ్బందిగానే ఉంటుంది. ఐనప్పటికీ యాదవ యువకులు ఎంతో ఆసక్తితో తమ అలసటను లెక్క చేయకుండా తప్పెటగుళ్ళ ప్రదర్శనను అభ్యసించడం ప్రారంభిస్తారు. సాధారణంగా తప్పెటగుళ్ళు కళాప్రదర్శన మీద ఆసక్తి ఉన్న వారందరూ రెక్కాడితేగాని డొక్కాడని నిరుపేదలు. తప్పెటగుళ్ళ కళాప్రదర్శన నేర్చుకోవడం వల్ల దాన్ని వృత్తిగా చేసుకొని డబ్బు సంపాదించే అవకాశం ఉండదు. అంటే ఎలాంటి స్వార్థం లేకుండా కేవలం తమ కులానికి చెందిన తప్పెటగుళ్ళ కళ పట్ల ఉన్న ఆసక్తి, అభిమానం కారణంగా మాత్రమే యాదవ యువకులు ఈ కళాప్రదర్శనను నేర్చుకుంటారు. ఈ కళాప్రదర్శన వంశపారంపర్యంగా చేసేది కాదు. ఎప్పటికప్పుడు కొత్తకొత్త యువకులు ఒక బృందంగా ఏర్పడి తప్పెటగుళ్ళ ప్రదర్శనను అభ్యసిస్తారు. కొంతవరకు చదువుకొని రాగతాళ జ్ఞానం ఉండి తప్పెటగుళ్ళ ప్రదర్శనలో మంచి నైపుణ్యం సంపాదించిన వారు గురువులై కొత్తగా నేర్చుకోవాలనుకొనే బృందానికి తప్పెట గుళ్ళ ప్రదర్శనను నేర్పిస్తూ ఉంటారు. ఈనాడు



యాదవ యువకులే గాకుండా కొంతమంది ఇతర కులాల యువకులు కూడా తప్పెటగుళ్ళ కళాప్రదర్శను అభ్యసిస్తున్నారు. ఐతే ఇలాంటి వారి సంఖ్య చాలా తక్కువ.

తప్పెటగుళ్ళు ప్రదర్శనను నేర్పించేటప్పుడు గురువు మొదట, శిష్యులకు చేతితో గుండు మీద లయబద్ధంగా కొట్టడం నేర్పిస్తాడు. గుండు మీద శిష్యులందరూ లయబద్ధంగా కొట్టడం నేర్చుకున్న తర్వాత తాళాలకు సంబంధించిన విషయాన్ని చెబుతాడు. తర్వాత గురువు మౌఖిక సంప్రదాయంలో అనేక కథాగేయాలను శిష్యులకు నేర్పిస్తాడు. శిష్యులు ఈ కథాగేయాలను నేర్చుకుంటూ తప్పెటగుండు వాద్యానికి అనుగుణంగా అడుగులు వేయడం నేర్చుకుంటారు. తప్పెటగుళ్ల ప్రదర్శనలో తప్పెట గుండు వాయిద్యానికి తగినట్లుగా అడుగులు వేయడం చాల ముఖ్యమైనది. లయబద్ధంగా అడుగులు పడినప్పుడే ప్రదర్శన బాగుంటుంది. చూసేవారికి ఆనందం కలిగిస్తుంది. ఈ అడుగులు వేయడం ఒక్కొక్క పాటకు ఒక్కొక్క విధంగా ఉంటుంది. నేర్చుకోవడం ప్రారంభించిన తర్వాత ఆరునెల్లకు విద్యార్థులు అడుగులు వేయడం నేర్చుకొని ప్రదర్శన ఇవ్వడానికి తగిన అర్హత సాధిస్తారు. ఆ తర్వాత రకరకాల విన్యాసాలు చేయడం నేర్చుకోవడానికి సంవత్సరం పైన పడుతుంది. వీరు చేసే విన్యాసాలు కష్టసాధ్యమైనవి. వీటిని చాల ఏకాగ్రతతో అభ్యసించాలి. ఏకగ్రతతో సాధన చేసి శిష్యులు విన్యాసాలను నేర్చుకుంటారు. ఈ విధంగా తప్పెటగుళ్ల కళా ప్రదర్శన పూర్తిగా నేర్చుకోవడానికి రెండు సంవత్సరాల కాలం పడుతుంది. ఆ తర్వాత శిష్యబృందం కొంతకాలం గురువు పర్యవేక్షణలోనే ప్రదర్శనలు ఇస్తుంది. తర్వాత ఆ బృందంలోనే నైపుణ్యం సంపాదించిన వ్యక్తి ఆ బృందానికి నాయకుడుగా ఉండి తన బృందాన్ని నడిపిస్తాడు.

**వేషధారణ :** తప్పెటగుళ్లు కళాకారులు తమ ప్రదర్శన సమయంలో ప్రత్యేకమైన వేషధారణ చేసుకుంటారు. వీరందరు ఒకే రంగు, ఒకే రకమైన దుస్తులను వేసుకుంటారు. ఎరుపు, ఆకుపచ్చ, నీలిమందు రంగు మొదలైన ముదురు రంగు దుస్తులను వేసుకుంటారు. వీరందరూ ముందు లంగోటీ కట్టి దానిపైన బిగువుగా ఉండే నిక్కరు వేసుకుంటారు. వీరు ప్రదర్శన సమయంలో ఎగిరి దూకుతూ, రకరకాలైన విన్యాసాలను చేస్తున్నప్పుడు వృషణాలకు దెబ్బతగలకుండా లంగోటీ రక్షణగా ఉంటుంది. వీరు వేసుకునే నిక్కరుకు ముందు భాగంలో మూడు, నాలుగు వరుసల్లో మువ్వలు కుట్టి ఉంటాయి. కొంతమంది మువ్వలను నిక్కరు మీద కట్టుకుంటారు. నిక్కరు మీద అదే రంగు ఉన్న బనియన్ వేసుకుంటారు. బనియన్‌కు చేతుల దగ్గర, కంఠం దగ్గర ప్రత్యేకమైన నగిషీ ఉంటుంది. తప్పెటగుళ్ల కళాకారులు కొందరు గిరజాల జుత్తు పెంచుకుంటారు. ప్రదర్శన సమయంలో జుట్టు అందంగా ఎగురుతూ ఉంటుంది.

కొన్ని తప్పెటగుళ్ళ బృందాలవారు తలపాగాలు చుడతారు. అందరూ ఒకే రంగు గల తలపాగాలను ధరిస్తారు. ఇవి గట్టిగా తలను పట్టుకొని ఉండేలాగా తయారుచేస్తారు. కొందరు గుడ్డతో టోపీలాగా కుట్టించుకుంటారు. ఆరు సెంటీమీటర్ల వెడల్పు, ఒక మీటరు పొడవు ఉన్న రంగు గుడ్డను పట్టీలాగా కుట్టించి దాన్ని మువ్వల నిక్కరు మీద నడుము దగ్గర నుంచి ముందు వైపు వెనుక వైపు వేలాడేలాగా కట్టుకుంటారు. ప్రదర్శన సమయంలో వారి నృత్యానికి తగినట్లుగా ఈ గుడ్డ అటూ ఇటూ ఊగుతూ ఉంటుంది. పాదాలపైన కాళ్లకు గజ్జులు కుట్టిన పట్టీలను కట్టుకుంటారు. ప్రదర్శనలో పాల్గొన్న తప్పెటగుళ్ల కళాకారులందరూ పైన చెప్పిన విధంగా ఒకే విధంగా వేషధారణ చేసుకుంటారు. ఈ విధంగా ఒకే విధమైన వేషధారణ ఉండడం వల్ల ప్రదర్శనకు ఒక విధమైన అందం వస్తుంది.

తప్పెటగుళ్ల కళా ప్రదర్శనలో ఇంతమంది ఉండాలనే నియమం ఏమీ లేదు. ఒక్కొక్క బృందంలో 20 నుంచి 30 మంది వరకు సభ్యులు ఉంటారు. కళా ప్రదర్శనలో అందరూ పాల్గొనరు. కొందరికి వేరే పనులు ఉండడం వల్ల ప్రదర్శనలో పాల్గొనరు. అయితే ఎంత ఎక్కువ మంది పాల్గొంటే ఈ కళాప్రదర్శన అంత బాగుంటుంది. మొత్తానికి పదిహేను మందికి తగ్గకుండా కళాప్రదర్శనలో పాల్గొంటారు.

## యాదవ కులకథాఖ్యాన కళలు - స్వరూపస్వభావాలు - చరిత్ర :

ఆంధ్రదేశంలోని ఎక్కువ కులాలకు కులపురాణాన్ని చెప్పే జానపదకళలు ఒక్కొక్కటి మాత్రమే ఉన్నాయి. ముదిరాజులు, పద్మసాలీలు, మాదిగలు మొదలైన కొన్ని కులాలకు రెండు లేక మూడు కులకథాఖ్యాన కళలున్నాయి. కానీ యాదవులకు మాత్రం గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, తెరచీరల వారు, మందెచ్చులవారు, బైకాని వారు అనే ఆరు కులకథాఖ్యాన కళలున్నాయి. వీరందరూ యాదవకుల మిరాసీ హక్కుదారులు. మిరాశి అంటే వంశ పారంపర్యంగా వచ్చే సొత్తు లేక హక్కు. వీరు తమకు వంశ పారంపర్యంగా సంక్రమిస్తున్న యాదవ కులస్థుల గ్రామాలకు మూడు సంవత్సరాలకు ఒకసారి పోయి తమను పోషిస్తున్న యాదవులను దర్శించి వారిని, పొగడి, దీవించి, కాటమరాజు కథలను చెప్పి వారి నుంచి ధన, ధాన్య, వస్తువులను స్వీకరిస్తారు. యాదవకులకథాఖ్యాన కళాకారులందరూ యాదవభారతంగా పిలువబడుతున్న కాటమరాజు కథలను పాడుతారు. అందువల్ల మొదట కాటమరాజు కథలను గురించి కొంత వివరించవలసివుంది.

కాటమరాజు కథలు తెలుగు జానపద సాహిత్యంలోని కథాగేయాల విభాగంలో



చిన్నకథాగేయాలు, పెద్దకథాగేయాలు, కథాగేయచక్రాలు అనే మూడింటిలో మూడవదైన కథాగేయచక్రాల శాఖకు చెందుతాయి. ఈకాటమరాజు కథలగురించి ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు గారు విశేషమైన పరిశోధన చేశారు. వీరి పరిశోధనను తెలుగు సాహిత్య అకాడమీ కాటమరాజు కథలు అనే పేరుతో రెండు సంపుటాలుగా ప్రచురించింది. ఈరెండు సంపుటాలను 1998లో తెలుగు విశ్వవిద్యాలయం రెండవసారి ముద్రించింది. ఈగ్రంధాల పీఠికల్లో సుబ్బారావు గారు కాటమరాజు కథల సంఖ్యను వాటి వరుస క్రమాన్ని, వాటి స్వరూపస్వభావాలను వివరించారు. దాని సారాంశం ఇది.

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుడు. ఇతడు విష్ణుమూర్తికి 74వ తరం వాడు. శ్రీకృష్ణునికి 23వ తరం వాడు. ఈకథల్లో కాటమరాజు పితామహుడైన ఆవుల వలురాజు నుంచి కాటమరాజు వరకు మొత్తం మూడు తరాలకు సంబందించిన 32 కథలు వరుసగా ఒక దాని తర్వాత ఒకటి పెద్ద ఇతిహాసం లాగా చెప్పబడ్డాయి. వరుసగా వాటి పేర్లు ఇవి. 1. వలురాజు కథ 2. పంపాద్రి కథ 3. పెద్దిరాజు కథ 4.సింహాద్రిరాజు కథ 5. ఎరనూకరాజు కథ 6. నలనూకరాజు కథ 7. పోలురాజు కథ 8. బల్లికురువ పోట్లాట కథ 9. కాటమరాజుకు పట్టం కట్టిన కథ 10. కరియావులరాజు కథ 11. పాపనూక కథ 12.ఆవులమేపు కథ. దీనికే ఉత్తరాది ఆవులమేపు, ఆవులమేపులు- ఉత్తరకాండం అనే పేర్లున్నాయి. 13.పాలేటి కథ లేక గంగతర్కం లేక గంగ - కాటమరాజు రాజు తరకవాదం కథ, 14.పుల్లరి కథ 15. జన్నివాడ కథ. దక్షిణాది ఆవులమేపు, ఆవులమేపులు - దక్షిణకాండం అనే నామాంతరాలున్నాయి. 16. భట్టురాయబారం కథ 17. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ 18. బొంగరాల కథ 19. ఎర్రగడ్డపాటి పోట్లాట కథ. ఈఎర్రగడ్డపాటి పోట్లాట కథలో చల్లవారి జగడం, బొల్లావు జగడం, బీర్నీని యుద్ధం, కరియావులరాజు యుద్ధం, బాలరాజుల యుద్ధం, ఆవుల ఎద్దుల జగడం, ఎర్రయ్యల యుద్ధం, కాటమరాజు యుద్ధం అనే ఏడు కాండలున్నాయి. 20. అగుమంచి కథ 21 భక్తిరన్న కథ.

వీటిలో సింహాద్రిరాజు కథ, నలనూకరాజు, పుల్లరి కథ అనే మూడు కథలు లభించలేదు. ఎర్రగడ్డపాటి పోట్లాటలో చెప్పిన ఏడు కాండలు ప్రత్యేకమైన కథగా చెప్పతగినంత పెద్దగా ఉన్నాయి. ఆందువల్ల వాటిని కూడా కథల వరుసలో కలపాలి. అప్పుడు వీటి సంఖ్య 27 అవుతాయి. ఇవి కాకుండా ఇంకా పాపనూక వలపోత కథ, అగుమంచి వలపోత కథ, పల్లికొండ పుట్టుక కథ, గంగపుట్టుక కథ, భైరవకురువ యుద్ధం కథ అనే ఐదు లభించవలసి ఉంది. పై27 కథలకు లభించవలసిన 5 కథలు కలిపితే మొత్తం 32 కథలు అవుతాయి. వీటిలో గంగ పుట్టుక, పల్లికొండ పుట్టుక,

సింహాద్రిరాజు కథ, నలనూకరాజు కథ, భైరవకురువ యుద్ధం కథ, పుల్లరికథ, పాప నూక వలపోత కథ, అగుమంచి వలపోత కథ అనే ఎనిమిది కథలు లభించలేదని తంగిరాల సుబ్బారావు గారు తెలిపారు.

మందెచ్చులవారు తెలంగాణా ప్రాంతంలో కాటమరాజు కథలను చెప్పే యాదవకుల కథాఖ్యాన కళాకారులు. వీరు చెప్పే కాటమరాజు కథల్లో గంగరాజుకథ ఒకటి ఉంది. గంగరాజు వలురాజు తండ్రి. తంగిరాలవారి ప్రకారం కాటమరాజు కథలు వలురాజుకథతో ప్రారంభమవుతాయి. తంగిరాలవారు గంగరాజు కథను ప్రస్తావించలేదు. ఈగంగరాజుకథను గురించి మందెచ్చులవారి సాహిత్యాంశాల్లో వివరించాను. దీన్ని బట్టి కాటమరాజుకథల్లో మొదటికథ గంగరాజుకథ అని తెలుస్తూ ఉంది. తంగిరాలవారు చెప్పినట్లు కాటమరాజుకథలు వలురాజుకథతో కాకుండా వలురాజు తండ్రి అయిన గంగరాజు కథతో ప్రారంభమవుతాయి.

గంగపుట్టుక కథను ప్రకాశం జిల్లాలో ఉన్న కొమ్ములవారు చెబుతారు. ఈకథ గేయరూపంలో కాకుండా వచనంలో ఉంది. కొమ్ములవారు చెప్పే గంగ కథను "కొమ్ములవారు - స్వరూప స్వభావాలు" అనే ప్రకరణంలో ఇచ్చాను. ఈకథను చదివితే ఇది కాటమరాజుకథల్లోని కథగా అనిపించదు. అయితే మరి కొమ్ములవారు దీన్ని ఎందుకు చెబుతున్నారు అనే ప్రశ్న వస్తుంది. యాదవకథాఖ్యాన కళాకారులు కృష్ణభాగవతాన్ని కూడా పాడుతారు. ఈకృష్ణభాగవతం కాటమరాజుకథల్లోది కాదు. కృష్ణుడు యాదవుడు కాబట్టి వీరు అతని కథను చెబుతారు. అలాగే గంగ యాదవుల కులదైవం కాబట్టి ఆమె కథను యాదవకుల కథాఖ్యాన కళాకారులైన కొమ్ములవారు చెబుయున్నారు. అందువల్ల తంగిరాల చెప్పినట్లుగా గంగపుట్టుక కథ కాటమరాజు కథల్లోని కథ కాదని చెప్పవచ్చు. దీనికి బదులుగా పొడపోతుల వారు చెప్పే గంగరాజుకథను కాటరాజుకథల్లో ఒకటిగా చేర్చుకోవాలి. అప్పుడు కాటమరాజు కథలు గంగరాజు కథతో మొదలవుతాయని చెప్పవచ్చు.

తంగిరాల వారు కాటమరాజు కథల్లో లభించని కథల్లో ఒకటిగా చెప్పిన పాపనూక వలపోతకథను పొడపోతులవారు చెబుతారు. వీరు చెప్పే పాపనూక వలపోత కథను అనుబంధంలో ఇచ్చాను. ఈకథను గురించి పొడపోతుల వారి సాహిత్యాంశాల్లో విశ్లేషించాను. పైన చెప్పినట్లుగా గంగపుట్టుక కథను కాటమరాజు కథల నుంచి తీసివేస్తే అప్పుడు కాటమరాజు కథల్లో పల్లికొండ పుట్టుక, సింహాద్రిరాజు కథ, నలనూకరాజు కథ, భైరవకురువ యుద్ధం, పుల్లరి కథ, అగుమంచి వలపోత అనే ఆరు కథలు లభించవలసి ఉంది.



పైకథలను బట్టి కాటమరాజు కథల్లోని ఇతివృత్తాన్ని ఇలా చెప్పవచ్చు. ఎలమంచిని పాలించే కవులావుల గంగరాజుకు వలురాజు, హరిపాలుడు, నందగోపాలుడు, గోవర్ధనుడు అనే నలుగురు కుమారులు పుట్టారు. వీరందరూ పరోపకారం కోసం ఖండమొండెముల కోటను పాలించే కలభూతగంగురాజుతో యుద్ధం చేసి మరణిస్తారు. మొదటి వాడైన ఆవుల వలురాజుకు భార్య అయిన వల్లమ్మ వల్ల సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు అనే ఐదుగురు కుమారులు, కొమరమ్మ అనే కుమార్తె పుడతారు. పల్లికొండ సలహానుసరించి వలురాజు తర్వాత అతని పెద్దకుమారుడైన సింహాద్రిరాజుకు బదులుగా రెండవ కుమారుడైన పెద్దిరాజు సింహాసనమెక్కి ఎలమంచిని ఏడేండ్లు పాలిస్తాడు. తర్వాత ఇతడు పంపాద్రికి వచ్చి అక్కడ మరొక ఏడేండ్లు పాలిస్తాడు. పెద్దిరాజుకు తప్ప మిగిలిన నలుగురు సోదరులకు సంతానం ఉంటుంది. సంతానం కోసం పెద్దిరాజు తన భాగం ఆవులను పంచుకొని భార్యతో ఆవులతో కలిసి కళ్యాణం పట్టణంలో ఉన్న సోమేశ్వర స్వామిని సేవించడానికి వెళ్తాడు. ఆస్వామి దయవల్ల పెద్దిరాజుకు మొదట కాటమరాజు, అతని తర్వాత ఏడేండ్లకు పాపనూక అనే కూతురు కలుగుతారు. పాపనూక తండ్రి గండంలో దుష్టనక్షత్రంలో జన్మించడం వల్ల పెద్దిరాజు వాలికేతువరాజుతో యుద్ధం చేసి ఆర్లపెంట యుద్ధంలో చనిపోతాడు. అప్పటికి ఏడు సంవత్సరాల బాలుడైన కాటమరాజు వాలికేతువరాజు మీదికి దండెత్తి వెళ్ళి అతణ్ణి చంపి తండ్రి పగ తీర్చుకుంటాడు. పెద్దమ్మ సహగమనం చేస్తుంది.

పెద్దిరాజు చనిపోయిన సమయంలోనే అతని నలుగురు సోదరులు పరోపకారం కోసం వేర్వేరు ప్రాంతాల్లో యుద్ధాలు చేసి చనిపోతారు. సింహాద్రిరాజు శ్రీకూర్మంపైకి దండెత్తి వెళ్ళి సింధుభళ్ళాని రాజుతో యుద్ధం చేసి, ఎరనూకరాజు ఏనుగనాధుని కొండకు పోయి ఎర్రభూపతితో యుద్ధం చేసి, నలనూకరాజు నున్నబెజవాడకు పోయి దాన్ని పాలించే నందికేశవరాజుతో యుద్ధం చేసి, పోలురాజు చెరుకూరు దగ్గర శ్రీరంగపట్టణాన్ని పాలించే చోడానిరాజు పంపిన ముక్కంటి అనే వానితో యుద్ధం చేసి చనిపోతారు. పోలురాజు కుమారుల్లో రెండవవాడైన ఐతమరాజు దొనకొండకు రాజు అవుతాడు. పోలురాజు పెద్దకుమారుడైనన భక్తిరన్నడు కాశీకి పోతూ కళ్యాణ పట్టణంలో ఉన్న కాటమరాజును, అతని చెల్లెలు పాపనూకను తెచ్చి దొనకొండలో ఉంచుతాడు. విష్ణుస్వరూపుడైన కాటమరాజును యాదవులు తమ గోగణానికంతటికీ రాజుగా అభిషేకిస్తారు. కాటమరాజు శ్రీశైలం ప్రాంతంలోని అడవుల్లో ఆవులను మేపుతూ ఉంటాడు. పాపనూక దుష్టనక్షత్రంలో జన్మించిందని ఆమెను దొనకొండ ఊరి బైట

ఒక మేడలో ఒంటరిగా ప్రత్యేకంగా ఉంచుతారు. తనను అందరితో పాటు ఉంచకుండా ఒంటరిగా ఉంచినందుకు ఆమె దు:ఖిస్తూ యాదవులందరినీ శపిస్తూ ఉంటుంది.

కాటమరాజు శ్రీశైలం దగ్గర ఆవులను మేపుతున్నప్పుడు భయంకరమైన కరువు వస్తుంది. ఆవులు నీరు మేత లేక అల్లాడుతూ ఉంటాయి. కాటమరాజు నెల్లూరి రాజైన నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం చేసుకొని కొంత కాలంపాటు ఆరాజ్యంలో ఆవులను మేపాలని నిర్ణయిస్తాడు. అందుకు నల్లసిద్ధిరాజు కూడా అంగీకరిస్తాడు. కాటమ రాజు ఆలమందలు నెల్లూరులో ఉన్నంతకాలం ఆలమందలో పుట్టిన కోడెదూడ లన్నింటనీ నల్లసిద్ధిరాజుకు ఇచ్చేటట్లు, కాటమరాజు ఆలమంద నెల్లూరిలో ఉన్నంత కాలం నల్లసిద్ధిరాజు వాటికి రక్షణ కల్పించేటట్లు పుల్లరి ఒప్పందం చేసుకుంటారు.

కాటమరాజు తన ఆలమందను నెల్లూరు పచ్చికబయళ్ళలో మేపుతూ ఉంటాడు. అతని గోగణం పెద్దది కావడం చేత పచ్చికబయళ్ళ పక్కన ఉన్న పంటపొలాలను కూడా కాటమరాజు ఆలమంద అప్పుడప్పుడు మేస్తూవుండేది. పంట నష్టపోయిన రైతులు నల్లసిద్ధిరాజు భార్య అయిన కుందమాదేవికి ఫిర్యాదులు చేసేవారు. ఇలా ఉండగా ఒకరోజు కుందమాదేవి పెంపుడు చిలుక తప్పించుకొని అడవిలోకి వెళ్ళి కాటమరాజు ఆలమంద దగ్గర గట్టిగా కూస్తూ ఉంటుంది. దాని అరపులకు ఆలమంద బెదరి చెల్లాచెదరు అవుతూ ఉంటుంది. అది చూచి కాటమరాజు మిత్రుడైన పద్మ రాఘవుడు ఆచిలుకను బాణంతో కొడాతాడు. చిలుక కుందమాదేవి వద్దకు వచ్చి చనిపోతుంది. తమ రాజ్యంలోని పంటపొలాలను మేపడమే గాకుండా తన పెంపుడు చిలుకను చంపినందుకు కుందమాదేవి కోపగించి కొంతమంది బోయలను పంపించి కాటమరాజు ఆలమందను చంపిస్తుంది. ఈగోహత్య నల్లసిద్ధిరాజే చేయించాడని కాటమరాజు భావించి ఒప్పందం ప్రకారం నల్లసిద్ధిరాజు తన ఆలమందకు రక్షణ కల్పించలేకపోయాడు కాబట్టి తాను కూడా ఒప్పందాన్ని గౌరవించనవసరం లేదని భావించి తాను ఇవ్వవలసిన కోడెదూడలను నల్లసిద్ధిరాజుకు ఇవ్వకుండా తన ఆలమందలను నెల్లూరిసీమ నుండి తోలుకొనివెళ్ళి ఎర్రగడ్డపాడు దగ్గర విడిది చేస్తాడు. కుందమాదేవి చేయించిన గోహత్య విషయం నల్లసిద్ధిరాజుకు తెలియదు. అందువల్ల కాటమరాజు కావాలని పుల్లరి ఎగవేసి వెళ్ళిపోయాడని భావించి ఒక రాయబారిని కాటమరాజు దగ్గరికి పంపించి పుల్లరి చెల్లించమని కోరుతాడు. పుల్లరి ఇవ్వనవసరం లేదని కాటమరాజు చెబుతాడు. దీనితో కాటమరాజుకు, నల్లసిద్ధిరాజుకు ఎర్రగడ్డపాడు వద్ద యుద్ధం జరుగుతుంది. ఎర్రగడ్డపాడు పోట్లాట అనే కథాగేయంలో ఏడు కాండల్లో వివరింపబడిన ఈయుద్ధంలో కాటమరాజు జయించినట్లు నల్లసిద్ధి



రాజు ఓడిపోయినట్లు చెప్పబడింది. ఇది క్లుప్తంగా కాటమరాజు కథలోని ప్రధానకథ.

ఈప్రధానకథతోపాటు ప్రాసంగికంగా గంగరాజుకథ, ఆవుల వలరాజుకథ మొదలైన కథలు ఈకథాగేయ చక్రంలో ఉన్నాయి. ఈకథలన్నీ ఒకదానికొకటి పరస్పర సంబంధం కలిగి ఉన్నాయి. కాటమరాజు కథల్లోని ముప్పైరెండు కథల్లో చాల వాటిని గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతువారు, తెరచీరలవారు, మందెచ్చుల వారు, బైకానివారు తమ కళాప్రదర్శన సందర్భంగా పాడుతారు. అందువల్ల కాటమరాజు కథలను చెప్పే ఆకళల స్వరూపస్వభావాలను, చరిత్రను ఈప్రకరణంలో వివరిస్తున్నాను.

## గొల్లసుద్దులు - స్వరూప స్వభావాలు - చరిత్ర :

గొల్లసుద్దులవారు రాయలసీమ ప్రాంతంలోను, తెలంగాణ ప్రాంతంలోను ఉన్నారు. వీరు ఎర్రగొల్ల శాఖకు చెందిన యాదవులు. వీరు కాటమరాజు కథలను చెబుతారు. కాటమరాజు కథలతోపాటు కృష్ణునికి సంబంధించిన కథలను కూడా చెబుతూ యాదవులను యాచించి జీవిస్తారు. రాయలసీమ ప్రాంతంలో వీరిని సుద్దులగొల్లలు అని, సుద్దులన్నలు అని, సుద్దులోళ్లు అని పిలుస్తారు. గొల్లసుద్దుల వారిని గురించి తంగిరాల సుబ్బారావుగారు ఇలా రాశారు."గొల్లసూక్తులు' అను శబ్దము నుండి 'గొల్లసుద్దులు' అను శబ్దమేర్పడి కాలక్రమమున నిది కాటమరాజు కథలను పాడెడి ఒక వర్గమునకు పేరుగా మారినది. ఈ గొల్లసుద్దులవారు బడుగుల ఆచారమునకు చెందిన గొల్లలలో ఒక శాఖ. వీరు యాదవులను యాచింతురు. సుద్దులను పాడు గొల్లలగుటచే వీరికి 'సుద్దుల గొల్లలు' అనియు నామాంతరము రాయలసీమలో వీరిని 'సుద్దులన్నలు' అందురు. నెల్లూరు, ప్రకాశము మండలములలో వీరిని 'యాచకులు' అనియు 'తెరచీర భక్తులు' అనియు పిలుతురు. వీరు పూజగొల్లలు, తెలంగాణములో 'ఎర్రగొల్లలు' ఈ వృత్తిలోనున్నారు. ఈ సుద్దులవారు మేకలను పెంచెదరు".[17]

కాటమరాజు పినతండ్రి అయిన పోలురాజు పెద్దకుమారుడు భక్తి రన్నడు. ఇతడు కాశీకి వెళ్ళి అక్కడ నుంచి పండ్రెండు మంది శిష్యులను తీసుకొని వచ్చాడని, వారిని కాటమరాజు కథలను పాడుకుంటూ యాదవులను యాచిస్తూ జీవించమని చెప్పాడని, ఆ పండ్రెండుమంది శిష్యుల సంతానం అప్పటి నుంచి వంశపారంపర్యంగా కాటమరాజు కథలను చెబుతూ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారని, వారి వారసులే ఇప్పటి గొల్లసుద్దులవారమని ప్రస్తుతమున్న గొల్లసుద్దులవారు చెబుతారు.

క్రీ.శ. 1750 ప్రాంతానికి చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడు తన

"హంశ వింశతి" కావ్యంలోని ద్వితీయాశ్వాసంలో 87 నుంచి 89 వరకు ఉన్న మూడు గద్యపద్యాల్లో సుద్దుల గొల్లలను, వారు కథ చెప్పే విధానాన్ని, వారి వేషధారణను చక్కగా ఇలా వర్ణించాడు.

ఉ. కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాఁతలు కృష్ణలీలం
గ్రమ్ము గుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలున్ నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్

వ. ఇట్లు వచ్చి

సీ. ఫెళ ఫెళ వీరణాల్ ఖళిఫెళి వాయించి
పోటుబోఁగొమ్ములు నాట నూఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతి చేసి
కృష్ణునకతి భక్తి ఁగేలు మోడ్చి
యాది కాలపు గొంద్ర నందఱఁ గొనియాడి
తాత తండ్రుల పేళ్ళు తలఁచి పొగడి
బిరుదులు సరుదుగాఁ బేర్కొని మొరయించి
దీవించి వీరుల త్రోవ లెన్ని

తే. కులము పెద్దల కతలాముకొనఁగఁ జెప్పి
సివము పుట్టించి పుత్రులఁజెందఁ గలరు
వీరులను గొల్వుఁడని తెల్పి వీడు కొల్పఁ
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి"

సుద్దుల గొల్లలు కొమ్ములు వీరణాలు ధరించి, కృష్ణలీలలను వివరించే అందమైన బొమ్మలున్న గుడార్లతో, కాటమరాజు కథలను తెలిపే మంచి పుస్తకాలతో, తలలకు రుమాలలు చుట్టుకొని, నుదుట నామాలు పెట్టుకొని, అందమైన సొమ్ములు ధరించి వచ్చారు. వచ్చి ఫెళఫెళమనే శబ్దంతో వీరణాలు వాయించి, కొమ్ములను గట్టిగా ఊది, మొదట యాదవుల కులదేవత అయిన గంగను ప్రార్థించి, కృష్ణునికి గొప్ప భక్తితో నమస్కరించి, పూర్వకాలం నాటి యాదవులను ప్రస్తుతించి, తాత తండ్రుల పేర్లను తలచుకొని పొగిడి, వాయిద్యాలు వాయిస్తూ యాదవుల వంశావళిని, బిరుదులను ప్రామాణికంగా పేర్కొని, దీవించి, యాదవ వీరుల త్రోవలను ఎన్ని, యాదవకుల పెద్దల కథలను వినేవారికి శివం ఎక్కేవిధంగా ఉద్రేకస్థాయిలో చెప్పి, చివరగా కాటమరాజు మొదలైన యాదవ వీరులను కొలిస్తే పుత్రసంతానాన్ని పొందుతారని



చెప్పి వెళ్లిపోయారు. నారాయణామాత్యుడు తన కాలం నాడు సుద్దులగొల్లలు చేసే పనిని పై పద్యగద్యంలో చక్కగా వివరించారు.

గొల్లసుద్దులవారు యాదవుల గ్రామాలకు మూడు సంవత్సరాలకొకసారి వెళ్ళి కాటమరాజు కథలను చెప్పి వారిని యాచిస్తారు. ఇలా వెళ్ళినప్పుడు వీరు యాదవులను ఇలా పొగడుతారు. "అయోధ్యానందనా, యాదవ కులశేఖరా, ఘనుడవు నీవు, కాటమరాజా, వర్ధిల్లు యాదవేంద్రా, నీ కులము రామకులము......" ఇలా ఇది సాగిపోతుంది. వీరు పెద్దిరాజు కథ, చంద్రగుప్త మహారాజు కథ, కంసునికథ, పోలురాజు కథ, బీరనాయుని కథ, గంగకాటమరాజు తరకవాదం కథ, గంగ కథ, ముమ్మయ్య పోచయ్య కథ మొదలైన కథలను చెబుతారు. కథలను చెప్పేటప్పుడు కొమ్ము, వీరణము, తాళాల్కు, చిన్నతప్పెట అనే నాలుగు వాద్యాలను ఉపయోగిస్తారు. గతంలో వీరు కథలను చెప్పేటప్పుడు కొమ్ములవారి లాగా గుడారువేసి అందులో కాటమరాజు కథావృత్తాంతాలను బొమ్మల రూపంలో చిత్రించిన తెరలను కట్టి వాటిని చూపిస్తూ కథను చెప్పేవారు. ఐతే ప్రస్తుతం వీరు ఈ గుడారును వేయడం లేదు. మామూలుగా వేదిక మీదకు వచ్చి కాటమరాజు కథలను చెబుతున్నారు. కథను చెప్పడంలో తెలంగాణ ప్రాంత గొల్లసుద్దులవారికి, రాయలసీమ ప్రాంతంలోని గొల్లసుద్దుల వారికి తేడా ఉంది. ఈ తేడాను గురించి ప్రదర్శనా విధానంలో వివరించాను.

## కొమ్ములవారు – స్వరూప స్వభావాలు – చరిత్ర :

యాదవులను ఆశ్రయించి జీవిస్తున్న వారిలో కొమ్ములవారు ఒకరు. వీరు మాదిగ కులానికి చెందినవారు. వీరు తాము జాంబవంతుని వంశానికి చెందినవారమని చెప్పుకుంటారు. కొమ్ములవారు రాయలసీమ జిల్లాల్లోనూ, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా జిల్లాల్లోనూ ఉన్నారు. వీరు వాయించే వాద్యాల్లో కొమ్ము ప్రధానమైంది. ఈ వాద్యాన్ని బట్టి వీరికి కొమ్ములవారు అనే పేరు వచ్చింది. వీరిని "కొమ్ముసుద్దులు" అని కూడా పిలుస్తారు. చిత్తూరు ప్రాంతంలో వీరిని "భట్టువారు" అని పిలుస్తారు. కాటమరాజు కథలను పాడేటప్పుడు వీరు వీరణం, తిత్తి, తాళాలు, కొమ్ము మొదలైన వాద్య పరికరాలను ఉపయోగిస్తారు. తమ వంశం వాడైన కాటమరాజు కథలను పాడుతూ తరతరాలుగా కాటమరాజు కథలను రక్షిస్తూ వస్తున్న కొమ్ములవారి మీద యాదవులకు చాల అభిమానం ఉంటుంది. కొమ్ములవారు అంటరాని వారైన మాదిగ కులానికి చెందిన వారైనప్పటికీ యాదవులు వీరిని అభిమానంగా, గౌరవంగా చూస్తారు.

కొమ్మువారు యాదవుల ఇళ్ళకు వచ్చినప్పుడు మొట్టమొదట కొమ్మును

గట్టిగా ఊది వారి కులగోత్రాలను ప్రశంసిస్తారు. కాటమరాజు కథలను చెప్పేటప్పుడు కూడా మొదట కొమ్మును ఊదిన తరువాతే కథను ప్రారంభిస్తారు. అంతేగాకుండా కథను చెప్పేటప్పుడు మధ్యమధ్యలో సందర్భానుసారంగా కొమ్మును వాయిస్తుంటారు. ఈ విధంగా కొమ్ము వాద్యాన్ని ప్రధానంగా ఉపయోగిస్తారు కాబట్టి వీరికి కొమ్ముల వారు అని పేరు వచ్చింది. వీరు చెప్పే కథలను "కొమ్ము కథలు" అంటారు. వీరి కొమ్ము పుట్టుకను గురించి ఒక కథ ఉంది.[18] కాటమరాజు సైన్యంలో బీర్నీడు అనే పేరుగల ఒక మాతంగవీరుడు ఉంటాడు. ఇతడు కాటమరాజు సైన్యంలో ప్రముఖ మైనవాడు. ఈ బీర్నీడు కాటమరాజు శత్రువైన నల్లసిద్ధిరాజు సైన్యాన్ని ఎదిరించడానికి ముందు కొమ్ము వాయించి తన సైన్యాన్ని ఉత్తేజపరచాలను కుంటాడు. నాగలోకంలో (పాతాళలోకంలో) ఉన్న 'పచ్చావు' కొమ్ములను ఇప్పించవలసిందిగా గంగను ప్రార్థిస్తాడు. వెంటనే నాగలోకంలోని పచ్చావు రెండు కొమ్ములూ పుట్టలో నుంచి బీర్నీడు దగ్గరకి వస్తాయి. బీర్నీడు ఆ రెండు కొమ్ములను తన నోట్లో పెట్టుకొని గట్టిగా ఊదుతాడు. ఆ శబ్దం శ్రీశైలం, మహానందికి వినిపిస్తుంది. ఆ శబ్దాన్ని విని యాదవ సైన్యం ఉత్తేజం పొందుతుంది. ఆనాటి యుద్ధంలో బీర్నీడు చనిపోతాడు. అతను చనిపోయిన నాటి నుంచి అతని తెగకు సంబంధించిన మాదిగలు ఆనాడు అతను ఊదిన కొమ్ముల వంటి వాటిని ఊదుతూ కాటమరాజు కథలను, గంగ కథలను ప్రచారం చేస్తున్నారు".

కొమ్ములవారు కాటమరాజు కథలను చెప్పడానికి గల కారణాలను గురించి కాటమరాజు కథల మీద విశేషమైన పరిశోధన చేసిన తంగిరాల సుబ్బారావుగారు ఇలా చెప్పారు. "యర్రగడ్డపాటి పోట్లాట తరువాత భక్తిరన్న బీరినీని సంతతివాడగు మాదిగలను పిలిచి యాదవ కథలను లోకమునకు వ్యాప్తి చేయుటకై, అనుమతిని చ్చెనని చెప్పెదరు. భక్తిరన్న కాశీ నుండి తనతోపాటు పండ్రెండుమంది శిష్యులను తెచ్చెను. వారందరునూ యాదవకథలను వ్యాప్తి చేయుటకే నియోగింపబడిరి. తన శిష్యులతోపాటు కొమ్ములవారును, పదమూడవ భాగమునకు అర్హులని భక్తిరన్న నిశ్చ యించెనట. కాటమరాజు కథలను చెప్పుచూ యాదవులనాశ్రయించి జీవించవలసినదని భక్తిరన్న కొమ్ముల వారితో చెప్పెనట".[19]

భక్తిరన్న కాటమరాజు పినతండ్రి అయిన 'పోలురాజు' పెద్ద కొడుకు. ఇతడు ఈశ్వరాంశతో పుట్టిన శివభక్తుడు. 'పుల్లరి' విషయమై కాటమరాజుకు, నల్లసిద్ధి రాజుకు యర్రగడ్డపాడు దగ్గర యుద్ధం జరిగినప్పుడు భక్తిరన్న కాశిలో ఉంటాడు. యుద్ధంలో మరణించిన తన సోదరులను చూసి దుఃఖించి వారికి కైలాస బండ దగ్గర పిండ ప్రదానం చేస్తాడు. ఆ తరువాత భక్తిరన్న మంగలిపాడు రాణాకు పోయి అక్కడ



పడి ఉన్న బీరునీని చూసి ఇలా దుఃఖించినట్లుగా కాటమరాజు కథల్లోని భక్తిరన్న కథలో చెప్పబడింది.

"బీరునాయని జూచి పేరెత్తి యడలి– మాను వొరిగిన రీతి మరియుండ జూచి
తను గొలుచు గోసంగి దళములు చుట్టు - అనువుగ రణములో హతమైన జూచి
పగవారు గోసంగి బలముల మీద - తెగబడి చెల్లిన తీరెల్ల జూచి
గుర్రాలు యేనుగులు కుంభిణి మీద - వర్రుగా చెల్లిన వైనము జూచి
భక్తుడు పల్లికొండ పరగ నిట్లనియె - 'వంతుకెక్కిన జాంబవంశ వర్ధనుడ
అలనాడు మసిలినీడు ఆరువదేండ్ల మున్ను - బల్లికురువను పోరి బలముల గూల్చి
కల్లుగా పోట్లాడి చెల్లె మీ తండ్రి - నేటికి బీరన్న నీవు యిచ్చోట
పాటి తప్పక పోరి పగతుల జంపి - గాటంపు అలుగుల గాయాల నాటి
వొరిగితివి ధరమీద వో బీరినాయుడ! - సిరిదేవి నిను బెంచి చేసే పెద్దగను
వేరు బంధము లేక వీరాజిలోను - గురుతుగా బాగాది గుండు సన్నిధిన
బీరినాయుని గుండు పేరెన్నబడును - వీర గోసంగుల బీరన్న నీకు
కలియుగమందున గంగ సన్నిధిని - కొలుతురు నిన్ను కోర్కెతో నెపుడు
కాశితీర్థం బిడి గోసంగి వీరునకు".[20]

భక్తిరన్న, బీరినీడు యుద్ధంలో చనిపోయినందుకు దుఃఖించి గంగ సన్నిధిలో జాతర చేసేటప్పుడు బీరన్నను యాదవులు కొలుస్తారని చెబుతాడు. తాను కాశి నుంచి వచ్చే వరకు యుద్ధరంగంలో చనిపోయిన తన బంధువుల పీనువులు చెడిపోకుండా యుద్ధ భూమిని కాపాడుతున్న గంగాదేవికి ఏటేటా జాతర చేయించి బలులు, బోనాలు ఇస్తారని చెబుతాడు. అంతేగాకుండా భక్తిరన్నడు బీరినీడు సంతతివారైన మాదిగలను పిలిచి యాదవ కథలను వ్యాప్తి చెయ్యమని చెబుతాడు. ఆనాటి నుంచి బీరునీని సంతతికి చెందిన మాదిగలు యాదవ వీరుల గాథలను ప్రచారం చేస్తూ వారినాశ్రయించి జీవిస్తున్నారు.

కొమ్ములవారు ఏ యాదవుని ఇంటిముందు కాటమరాజు కథలు చెబితే ఆ ఇంటి యాదవుడు కొమ్ముల వారిని తప్పనిసరిగా సన్మానించాలి. ఒకవేళ సన్మానించక పోతే కొమ్ములవారు వారి ఇంటిముందు గుడారాన్ని ఎత్తుతారు. అప్పటికైనా ఆ ఇంటి యాదవులు వారిని సన్మానించాలి. గుడారును ఎత్తినప్పటికీ ఆ ఇంటివారు కొమ్ముల వారిని సన్మానించకపోతే ఎత్తిన గుడారును కూల్చివేయమని భక్తిరన్న కొమ్ములవారి పూర్వులకు చెప్పాడట. ఇలా గుడారు కూలిస్తె ఆ ఇంటిలోని యాదవులందరూ నశించిపోవాలని భక్తిరన్న శాపం పెట్టినట్లుగా కొమ్మువారు చెబుతారు. ఈ శాపం సంగతి వాస్తవమైనా కాకపోయినా యాదవులు తమ ఇంటికి వచ్చిన కొమ్ములవారిని

చక్కగా గౌరవించి భోజనం పెట్టి తమకు తోచిన సంభావన ఇస్తూ ఉంటారు.

యాదవుల ఇష్టదైవం గంగ. గంగ అంటే నీరు. అంటే ఈమె జలాధి దేవత. ప్రాణికోటి జీవించడానికి మొదట కావలిసినది వాయువు, ఆ తరువాత కావలిసినది నీరు. నీరు లేకుండా భూమి మీద ఏ ప్రాణి జీవించలేదు. అంతేకాదు నీరు లేకుండా పంటలు పండవు. పంటలు పండకపోతే మనిషి జీవించడం కష్టం. యాదవులకు సంబంధించినంత వరకు గంగమ్మ కులదేవత ఇష్టదేవత కూడా, ఎందుకంటే యాదవుల కులవృత్తి పూర్వం గోపాలన, నేడు గొర్రెల, మేకలపాలన. ఈ పశువులు జీవించడానికి కావలసిన ఆహారం లభించడానికి నీరు చాల అవసరం. అందువల్లనే యాదవులు గంగను కులదేవతగా పూజిస్తారు. ఈమెకు నియమం ప్రకారం అంటే సంవత్సరానికి ఒకసారిగానీ, రెండేళ్ళకు లేదా మూడేళ్ళకొకసారిగానీ పండుగ చేస్తారు. దీన్నే 'గంగజాతర' అంటారు. భక్తిరన్న తాను కాశి నుంచి వచ్చేవరకు ఎర్రగడ్డపాడు యుద్ధంలో చనిపోయిన యాదవుల శవాలు చెడిపోకుండా యుద్ధభూమిని రక్షించిన గంగకు జాతర చేయిస్తానని ప్రకటించడం వల్ల కూడా ఈనాటి యాదవులు గంగకు జాతర చేయిస్తుంటారు. ఈ జాతరలో కొమ్ములవారు పాల్గొని కొమ్మును ఊదడం, తానకాలు పాడడం, కాటమరాజు కథలను చెప్పడం చేస్తుంటారు.

యాదవులు గంగజాతరను ఐదు రోజుల పాటు చేస్తారు. సాధారణంగా మే నెలలో ఈ జాతరను నిర్వహిస్తారు. ఆదివారం నాడు మొదలుపెట్టి గురువారంతో ముగిస్తారు. ఆదివారం మొదటిరోజు చేసే ఉత్సవాన్ని 'పాలవెల్లి' అని, రెండవరోజు సోమవారం చేసే ఉత్సవాన్ని 'సిరిమాను' అని, మూడవరోజు మంగళవారం చేసే ఉత్సవాన్ని 'యాదవ పురాణం' అని, నాల్గవ రోజు బుధవారం చేసే ఉత్సవాన్ని 'బండ్లు ప్రభలు కట్టి పొంగల్లు పెట్టి నైవేద్యాలు చెల్లించడం' అని, ఐదవ రోజు 'గావు వేషాలు వేయడం' అని అంటారు. ఈ ఐదు రోజుల్లో కొమ్ములవారు పాల్గొని కొమ్మును ఊదుతూ, కాటమరాజు కథలను చెప్పుతూ ఉంటారు. గంగజాతర మొదటిరోజు రాత్రి కొమ్ములవారు గంగ కథను చెబుతారు. వారు చెప్పే గంగకథ ఇది.[21]

"గంగమ్మ ఓం అనే శక్తి బీజాక్షరిలో జన్మించింది. ఆనగా 'ఓంకార' శబ్దం నుంచి పుట్టినది. అమ్మా అని పిలిచిన వెంటనే పలుక గలిగిన మహాశక్తి రూపం గంగమ్మ. గంగమ్మ త్రినేత్రం కలిగి, చతుర్ముఖంతో ఉద్భవించింది. గంగమ్మ దుత్తెడు రెట్టల్ని, పెట్టెడు ముఖాన్ని, చీమ తలల వంటి కళ్లను, శిరస్సున జడల్ని, అరచేతిలో పల్లికల్ని, జక్కోలను, ముష్టిపాదాలను, ఒక చేతిలో కత్తి, ఒక చేతిలో గజంబు, ఒక చేతిలో డెక్క, ఇంకోచేతిలో డమరుకం, మరో చేతిలో రాయిఅంపం, బండేరుకొడవలి,



శూలం, గాలం వంటి ఆయుధాలను కలిగిన మహాశక్తి. అదేవిధంగా ఏడు మణువులు గన్నేరాకుల గజన్నర శులాన్ని ఎడమ స్థానంలో ఉంచుకొని ఉన్నది. ఆమె పన్నెండు హస్తాలు కలిగిన అపర భాగవతురాలు గంగమ్మకు ముందుచూస్తే మూడు వందల కన్నులు, వెంట్రుకల్లో జూస్తే వేయి లక్షల కన్నులు, పాపట సంధులో జూస్తే పది లక్షల కన్నులు కనిపిస్తాయట. అమ్మవారు కత్తుల చీరను, తొమ్మిది ముడుల దంతాల రవికను తొడిగి, నిప్పుల పెడవార ముసుగును వేసుకుని ఉంది. అమ్మవారికి పైన ఆకాశం, కింద భూదేవి, లోపల నాలుక కలిగి ఉందట. క్రమక్రమంగా అమ్మవారికి పదునాలుగు సంవత్సరాల వయసు వచ్చి పుష్పవతి అయినది. అమ్మవారికి యవ్వనం వచ్చి కోరిక కలగడంతో పురుషుడు అవసరం అయ్యాడు. అప్పటికి విష్ణు, ఈశ్వర, బ్రహ్మలు ఎవ్వరూ లేరు. కొండలు, వృక్షాలు, సప్త సముద్రాలు ఏమీలేవు. అప్పుడు అమ్మవారు మిన్నుకు, చన్నుకు, మెడ అను దగ్గర, ఒక ప్రక్కకోసి, చేతిలో నేత్రాలను పట్టుకొని కుంచెలోకి కుడేసెమ్ జేర్చి, ఆకాశం తీర్థాన్ని, విభూదిని, బండారాన్ని ఘల్లున మీటుతుంది. అప్పుడు మహావిష్ణువు ప్రత్యక్షమవుతాడు. అప్పుడు అమ్మవారు "ఓ విష్ణూ" అని పిలుస్తుంది. అప్పుడు విష్ణువు 'ఏమి తల్లి' అని సంబోధిస్తాడు. ఆ మాట విన్న గంగమ్మ విష్ణువు. తన యవ్వనపు కోర్కెను తీర్చడని, విష్ణువును దూరంగా ఉంచుతుంది. తరువాత గంగమ్మ నాలుగు శిరస్సులు కలిగిన బ్రహ్మను సృష్టిస్తుంది. ఓ బ్రహ్మదేవా! అని గంగ పిలుస్తుంది. అందుకు బ్రహ్మదేవుడు ఏమిటి తల్లి! అని పలుకుతాడు. ఆ మాటల్ని విన్న గంగమ్మ బ్రహ్మను కూడా దూరంగా పెడుతుంది.

మళ్ళీ కుంచెలోనికి కుడెసెమ్ జేర్చి ఆకాశం తీర్థం, విభూది, బండారును తీసుకొని మంతరించి ఘల్లున మీటుతుంది. అప్పుడు వొళ్ళంతా విభూది, వాలారి గోళ్ళు, పడతూల కక్షబాల, పిండుకున్న జడలు, జంధ్యాలు, కంఠంలో రుద్రాక్షలు, కాయవస్త్రాలు, పేము బెత్తం, జగన్నాథశూలం, బంగారు పావుకోళ్ళు, సన్నరుద్రాక్ష దండలు, జపమాలికలు, దేవదత్తం వాటివంటిని కలిగి, పులితోలును వస్త్రంగా తొడిగి, ఒక చేతిలో డెక్కను, మరో చేతిలో శూలాన్ని ఉంచుకొని, జింకతోలు ఆసనంతో గంగమ్మకు ప్రత్యక్షమవుతాడు. అప్పుడు అమ్మవారు ఈశ్వరా నా కోర్కెను తీర్చాలని తనలో ఉన్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, యౌవన్నాలను కూడా తీర్చాలని కోరుతుంది. అందుకు ఈశ్వరుడు చిరునవ్వు నవ్వి నీవు చూస్తే ఆదిశక్తి, ఆకాలశక్తిలా ఉన్నావు, నీకు పైన ఆకాశం, కింద భూదేవి, నీ లోపల నాలుక, నీ చుట్టూ సూర్య చంద్రులు, ముక్కోటి దేవతలు, మునులు, మునేంద్రులు, యోగీశ్వరులు, సకల సంపన్నులు, సాధవులు, సిద్ధులు, నంబులు, వైష్ణవులు, మునికన్యలు, మునేంద్ర

కన్యలు, దేవకన్యలు, దేవేంద్రకన్యలు, దేవాది దేవతలంతా అమరి ఉన్నారని ఈశ్వరుడు పలుకుతాడు.

ఆ మాటలు విన్న అమ్మవారు ఈశ్వరునికి ఏం కావాలో కోరుకొమ్మంటుంది. అందుకు ఈశ్వరుడు అమ్మవారు మూడో కన్నునిస్తే తన కామకోర్కెను తీరుస్తానంటాడు. దానితో గంగమ్మ సంతోషించి ఎడమ చేతి బొటనవేలితో తన మూడోకన్నును తీసి ఈశ్వరునికిస్తుంది. ఆ మూడో కంటిని ఈశ్వరుడు నొసట దాల్చుకొని అమ్మవారిని ఏలుకుంటాడు. అమ్మవారిని (గంగను) అలా ఏలుకోవడం వల్ల ఆమె శరీరం, కట్టిన తెల్లచీర రక్తమండలమైపోతుంది. ఆ మంటకు, బాధకు అమ్మవారు తట్టుకొనలేక ఆకాశ తీర్థాన్ని, బండారుని తీసుకొని మంత్రించి ఘల్లని మీటుతుంది. అప్పుడు వాయుదేవుడు (గాలిదేవుడు) సుడిగాలిగా మారి అమ్మవారిని గగన మార్గాన సూర్యమండలం, చంద్రమండలం, సప్తసముద్రాల పైకి ఎగిరిపోతాడు. అమ్మవారు సముద్రాలను పట్టుకొచ్చి, ఆ సముద్రాల ఒడ్డున ఒక దేర కట్టుకొని ఒక జీలిభరథాన్ని నిర్మించుకొంటుంది.

ఆ రథంలో అమ్మవారు ఒక తెప్పను తయారు చేసి వేపాకుతో తడికలను నాలుగు వైపుల ఏర్పాటు చేసుకొని, ఆ సముద్రం ఈ దరికి, ఆ చల్లని గాలికి చల్లగా తూలుతూ నిద్రపోతుంటుంది.

గగన మార్గంలో గంగమ్మ సముద్రాల ఒడ్డుకి పోవడాన్ని మహావిష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మదేవులు చూస్తారు. ఇక రాబోయే కలియుగంలో మానవులు జన్మిస్తారని, ఆ కలియుగంలో తామే దేవుళ్ళు, సృష్టికర్తలు, లయకర్తలని, తమకు మించిన దైవాలు ఒక్కరు కూడా ఉండబోరని, అందుకోసం త్రిమూర్తులు శ్రీగంధం చెక్కలు, నెయ్యితో హోమగుండాన్ని వేసి హోమం చేస్తుంటారు. గంగమ్మ వెళ్ళిపోయి నందుకుగాను యతీశ్వరులు, మునీశ్వరులు, నారద, కిన్నెర, కింపురుషులు, ముని కన్యలు, మునేంద్రకన్యలు, దేవకన్యలు, దేవేంద్రకన్యలు వంటి దేవాదిదేవతలు మంగళ హారతులు తీసుకొని ఆమె దగ్గరికి పోతుంటారు. వాళ్ళు పోవడాన్ని గమనించిన త్రిమూర్తులు, తాము చేస్తున్న హోమాన్ని చాలించి, వీళ్ళు కూడా గంగమ్మ దగ్గరికి వెళ్తారు. సముద్రాల తీరాన చల్లగా నిద్రిస్తున్న గంగమ్మకు త్రిమూర్తులు శరణు కోరుతో సాష్టాంగ నమస్కారాలు చేస్తారు. అప్పుడు గంగమ్మ ఈశ్వరుడు తన కోర్కెను తీర్చక పోగా, తన మూడోకన్నును కూడా తనకు తిరిగి ఇవ్వలేదనే కోపంతో త్రిమూర్తులను తన మహిమతో ముగ్గుర్ని స్త్రీలుగా మార్చివేస్తుంది. అప్పటి నుండి ఆ ముగ్గురు స్త్రీలు గంగమ్మకు పరిచర్యలు చేయసాగారు. కొంతకాలానికి గంగమ్మ తన మనస్సు



మార్చుకొని తను సృష్టించిన పురుషులను స్త్రీలుగా మార్చడం ధర్మం కాదని, వారిని యధావిధిగా పురుషులను చేస్తుంది. అప్పుడు ఈశ్వరుడు రాబోయే కలియుగంలో మానవ సంతతి జన్మిస్తుందని, ఆ యుగంలో గంగమ్మే నూట మహాశక్తులని, ఆమె చోటు గంగ, చాటు గంగ, గుంటిగంగ, నడీధిగంగ, దొడ్డిగంగ, దొరసాని గంగలుగా ఊరికొక శక్తిగా ఉద్భవించాలని అంటాడు.

గంగమ్మకు ఏడు మానువుల గన్నేరాకులుగ జన్నారశూలం వుంటుందని, త్రిమూర్తులకు రామచక్రం వుంటుందని, ఆ చక్రాన్ని, శూలాన్ని కలియుగంలో ప్రయోగించాలని ఈశ్వరుడు చెబుతాడు. గంగమ్మతో శివుడు ఈవిధంగా వివరిస్తాడు. గ్రామాలకు వ్యాధులు, ఏనుగుకు పెద్దగజ్జి, శరీరాలకు వ్యాధులు, పోటులు, గుర్రానికి కడుపునొప్పి, గొర్రెలకు మిడగురోగాలు, మేకలకు గాలెమ్మ, కోళ్ళకు కొక్కెర తెగులు, చంకబిడ్డలకు సందులు, దగ్గులు, పడిశాలు, తీటలు, తిమ్ముర్లు, తట్టమ్మ, ముత్తమ్మ, అట్సాటమ్మ, నల్లమ్మ, పెద్దమ్మ వంటి రోగాలను జీవులకు కలిగించాలని గంగకు చెపుతాడు. అప్పుడే మానవులు ఆ పోరుకు, మంటలకు, గాలికి తట్టుకొనలేక గంగమ్మను చూసి భయభక్తులతో ఆరాధిస్తారని ఈశ్వరుడు అంటాడు.

భక్తులు గంగమ్మకు వేపాకుతోను, మామిడాకులతోను తోరణాలు కట్టిస్తారని, పెద్ద గంగాళాలకు అంబళ్ళు పెడ్తారని, చలువపందిర్లు వేయిస్తారని, ఆరెకూడు (ఆరికకూడు) కుంభాలను, వరికూడు కుంభాలను సమర్పిస్తారని దున్నపోతులను, మేకపోతులను, పెద్దగొర్రెల్ని, పొట్టేళ్ళను, కోళ్ళను బలిస్తారని ఈశ్వరుడు అంటాడు. అలాగే ప్రతి సంవత్సరం మే నెలలో గంగమ్మకు జాగారణ చేస్తారని, జాతరలను జరిపిస్తారని, ఆమెకు లాలిపాటల్ని, జోలపాటల్ని పాడుతారని ఈశ్వరుడు చెబుతాడు. బండబూతు మాటల్ని, బూతు పాటల్ని పాడతారని ఈశ్వరుడు చెబుతాడు. అలా భక్తులు బూతుపాటలు పాడి గంగమ్మ కామ, లోభ, యౌవనాన్ని తీర్చి ఆమెకు ఎంతో ఉల్లాసాన్ని, సంతోషాన్ని కలుగ జేస్తారని ఈశ్వరు డంటాడు. భక్తులను చల్లగా కాపాడి, వారికి సకల సంపదలు కలుగుజేయమని ఈశ్వరుడు గంగను కోరుతాడు.

ఈశ్వరుని మాటలకు గంగ సంతోషించి ఇసుకను నాలుగు భాగాలుగా చేయమని ఈశ్వరుని కోరుతుంది. ఈశ్వరుడు అలాగే చేస్తాడు. ఒక భాగం మహా విష్ణువు భార్య లక్ష్మిగాను, ఇంకొక భాగం ఈశ్వరుని భార్య పార్వతిగాను, ఇంకొక భాగం బ్రహ్మ భార్య సరస్వతిగాను చేసి త్రిమూర్తులను తీసుకోమంటుంది. నాలుగో భాగాన్ని భూమిపై చల్లమంటుంది. అదేవిధంగా చల్లుతారు. అమ్మవారు నూటా మహా శక్తులుగా మారుతుంది. ఈ నూట మహాశక్తులే నేటి వివిధ ప్రాంతాల్లో పలుపేర్లతో

వెలసిన గంగమ్మ రూపాలు".

గంగజాతర మూడవరోజు "యాదవుల పురాణం" లేదా "గంగ జాతర రాయబారం"గా జరుపుకుంటారు. ఈ రోజున కొమ్ములవారు కాటమరాజు కథలను చెబుతారు. అంతేగాకుండా గంగాదేవికి సంబంధించిన పురాగాథలను కూడా వీరు చెబుతారు. ఇలాంటి పురాగాథలను చెప్పేటప్పుడు భక్తులకు పూనకాలు వస్తాయి. అంతేకాకుండా భక్తిలో పరవశించిపోయి నాట్యం చేస్తారు. ఈ రోజున కొమ్ములవారు గంగ జాతరకు చెందిన అనేక రంగురంగుల గుడ్డలను, కాటమరాజు కథలను తెలిపే ముద్రికలున్న పరదాలను డేరాలాగా కట్టి కాటమరాజు కథల్లోని కొన్ని కథలను చెబుతారు. ఈ కథల్లో ముఖ్యమైనవి. కాటమరాజు కథ, భక్తిరన్న కథ, ఎరనూకరాజు కథ, ఎర్రయ్య తరకవాదం, అలుగులపోలు, ముమ్మయ్య పోచయ్య బొంగరాల కథ, ఎర్రగడ్డపాడు పోట్లాట కథ, గంగమ్మ పుట్టుక కథ, గంగశక్తి కథ మొదలైనవి ఉంటాయి. ఈ కథలను కొమ్ములవారు ఉద్వేగరీతిలో, శ్రోతలు పూనకాలు తెచ్చు కొనేలాగ చెబుతారు. ఈ రోజున యాదవ రాయబారాన్ని ఒక నాటకంలాగా నిర్వహిస్తారు. ఆ నాటకం ఈ విధంగా ఉంటుంది.

పది సంవత్సరాలు వయస్సు ఉన్న యాదవ బాలునికి భక్తిరన్న వేషం వేస్తారు. ఇతడు కాశికావడి పట్టుకొని ఒక చేతిలో గంటను పట్టుకొని జంగం వేషంలో ఉంటాడు. ఆ సమయంలో కొమ్ములవారు కథను చెబుతూ ఉంటారు. కథ ప్రారంభించడానికి ముందే కథ చెప్పే దగ్గర ఒక గుంట తవ్వి ఒక మాదిగ కులస్థునికి బీర్నీని వేషం వేయించి ఆ గుంటలో వెల్లకిలా చనిపోయినవానిలాగా పడుకోబెడతారు. అతని చేతిలో ఒంపు తిరిగిన కత్తి (కొంగ నాలుకత్తి) ఉంటుంది. బీర్నీని మీద చనిపోయిన మనిషికి తెల్లగుడ్డ కప్పినట్లుగా ఒక తెల్ల గుడ్డను కప్పుతారు. అతనికి దగ్గరలోనే ఒక మర్రిచెట్టు కొమ్మను నాటి ఉంచుతారు. ఇదంతా కొమ్ములవారు కథను ప్రారంభించడానికి ముందే జరుగుతుంది. భక్తిరన్న వేషధారుడైన బాలుడు బీర్నీడు పడుకున్న గుంటకు కొంచెం దూరంలో ఉన్న చెట్టు వెనుక ఉంటాడు.

కొమ్ములవారు కథను ప్రారంభించి చెబుతూ ఉంటారు. కథా సమయంలో బీర్నీని యుద్ధం గురించి కథను చెప్పేటప్పుడు గుంటలో ఉన్న బీర్నీడు వేషధారి ఉగ్రరూపంతో లేచి తన కొంగ వాలుకత్తితో గుంట పక్కనే ఉన్న మర్రిచెట్టు కొమ్మను ఒక్క దెబ్బకు నరికి వేస్తాడు. అంతేగాకుండా ఉగ్రరూపంతో చిందులు తొక్కుతాడు. బీర్నీడు చిందులు తొక్కడం మానివేసిన తరువాత చెట్టుచాటు నుంచి భకిరన్నడు ఏడ్చు కుంటూ వస్తాడు. ఇతడు కాశి కావడి భుజంమీద పెట్టుకొని, శంఖం ఊదుకుంటూ



మరొక చేత గంటను వాయిస్తూ ఎర్రగడ్డపాడు యుద్ధంలో యాదవులు చనిపోయారని గట్టిగా ఏడుస్తూ చుట్టుపక్కల తిరుగుతాడు. భక్తిరన్నని వేషధారి అయిన బాలుడు ఈ విధంగా చేస్తున్నప్పుడు ఆ బాలునికి తన పూర్వజీవితం గుర్తు ఉండదట. కొమ్ముల వారు చెబుతున్న కథ చేత ప్రేరితుడై పూర్వం ఎప్పుడో జరిగిన యాదవ యుద్ధ సంఘటనలను తన ముందు జరిగినట్లుగా భావించి దుఃఖిస్తాడు. భక్తిరన్నడు ఇలా ఏడ్చుకుంటూ తిరుగుతున్నప్పుడు చుట్టూ ఉన్న భక్తులు వారికి తోచినంత డబ్బును అతని కావడిలో వేస్తారు. అదే సమయంలో కొమ్ములవారు కూడా ఒక దుప్పటిని అక్కడ పరుస్తారు. భక్తులు ఆ దుప్పటి మీద కూడా తమకు తోచిన డబ్బును వేస్తారు. గంగ జాతరలో అత్యంత ముఖ్యమైన ఘట్టం ఈ యాదవ రాయబారం.

గంగజాతర సమయంలో కొమ్ములవారు తానకాలు పాడతారు. తానకం అంటే పరాక్రమ వర్ణన. యర్రగడ్డ పాడు యుద్ధంలో యాదవుల పక్షాన కొన్ని ఆవులు, ఎద్దులు భయంకరంగా యుద్ధం చేసి, శత్రువుల చేతిలో చనిపోతాయి. అలాంటి ఎద్దుల పరాక్రమాన్ని వర్ణించడమే తానకం. ఈ తానకాల్లో వెల్లెద్దు తానకం, బొల్లెద్దు తానకం, బోడెద్దు తానకం, కర్రెద్దు తానకం మొదలైనవి ఉన్నాయి. ఈ ఎద్దుల తానకాల్లో ఎద్దు మేయడం, నీరు తాగడం, గంతులువేయడం, యుద్ధంలో అది చూపిన పరాక్రమం మొదలైనవి చెప్పబడతాయి. ఈ తానకాలు ఆవులకు ఎద్దులకు మాత్రమే గాకుండా యాదవ వీరులకు సంబంధించినవి కూడా ఉన్నాయి. ఇలాంటివి 1) కాటమరాజు తానకం, 2) భక్తిరన్న తానకం, 3) బాలరాజుల తానకం 4) పల్లికొండ తానకం అనే నాలుగు తానకాలున్నాయి. ఈ తానకాలను కొమ్ములవారు పాడతారు. ఈ విధంగా యాదవులు చేసే గంగ జాతరలో కొమ్ముల వారికి మంచి ప్రధాన్యత ఉంటుంది.

## పొడపోతులవారు - స్వరూప స్వభావాలు - చరిత్ర :

పొడపోతులవారు విజయనగరం జిల్లాలో ఉన్నారు. ఈ జిల్లాలో గజపతి నగరం మండలం మరుపల్లి గ్రామంలోను, గంట్యాడ మండలం కొండదామరపల్లి గ్రామంలోను, సీతానగరం మండలం చినంకలం గ్రామంలోను, బాడింగి మండలం కూనవలస గ్రామంలోను ఉన్నారు. పొడపోతులవారు జంగం కులానికి చెందినవారు. జంగం కులంలో శారదజంగాలు, మెట్టు జంగాలు, పరమటజంగాలు, ఊరజంగాలు, చెరుకూరి జంగాలు, బుడగజంగాలు మొదలైన అనేక రకాల వారు ఉన్నారు. పొడ పోతులవారు చెరుకూరిజంగం శాఖకు చెందినవారు. వీరు ప్రధానంగా ఉత్తరాంధ్ర

జిల్లాల్లోని యాదవుల్లో ఒక శాఖ అయిన ఆలగొల్లలను యాచిస్తారు. ప్రస్తుతం వీరు ఉత్తరాంధ్ర జిల్లాలతోపాటు, ఉభయగోదావరి జిల్లాలు, కృష్ణా జిల్లాలోని ఎర్రగొల్లలు, పూజగొల్లలు మొదలైన వారిని కూడా యాచిస్తున్నారు. శ్రీకాకుళం జిల్లా నుంచి గతంలో ఎప్పుడో కొన్ని యాదవ కుటుంబాలవారు అండమాన్ నికోబార్ దీవులకు వెళ్ళి అక్కడే నివసిస్తున్నారు. ప్రస్తుతం అక్కడ ఆరు వందల యాదవ కుటుంబాలవారు ఉన్నారని పొడపోతులవారు చెబుతున్నారు. పొడపోతుల వారు ఆదీవులకు కూడా వెళ్ళి అక్కడ ఉన్న యాదవ కుటుంబాలవారిని యాచిస్తున్నారు.

పొడపోతులవారి ప్రధాన వృత్తి కాటమరాజు కథలను చెప్పడం. వీరు సంవత్సరంలో ఆరు నెలలపాటు సంచార జీవనం చేస్తుంటారు. అంటే వీరు యాదవులున్న గ్రామాలకు వెళ్ళి కాటమరాజు కథలను చెప్పి వారిని యాచిస్తుంటారు. వీరు కాటమరాజు కథల్లో పోలురాజుకథ, కాటమరాజు పుట్టుక (పెద్దిమాదేవి నోములు), చంద్రగుప్త మహారాజు కథ, దూర్వాస మహాముని కథ (ముసలందుడ్డు పుట్టుక కథ), పల్లికొండ పుట్టుక, యాదవులు దక్షిణాది ఆవులుమేపడం కథ, ఆలవారి పాపమ్మ సువ్వి పాటలు, పాపనూకకథ (పాపనూక వలపోత), కొచ్చర్లవారి కొమరమ్మ కథ, ఎర్రన్న కోటపాడు కోదాడు తేవడం, బొల్లావు పుట్టుక, బొల్లావు యుద్ధం, బత్తుడన్న కథ మొదలైన కథలను చెబుతారు.

పొడపోతులవారు కాటమరాజు కథలను చెప్పడానికి గల కారణం కాటమ రాజు కథల్లోని పోలురాజు కథలో చెప్పబడింది. పోలురాజు చెరుకూరి దగ్గర ఆల మందతో ఉన్నప్పుడు శ్రీరంగ పట్టణాన్ని పరిపాలించే 'చోడానిరాజు' చెరుకువాడలోని కొంతమంది జంగాలను తాను కట్టిస్తున్న కావేరి చెరువుకు వెట్టి చేయడానికి తీసుకొని రమ్మని తన మనుషులను పంపిస్తాడు. ఈ జంగాలు చోడానిరాజు వెట్టి చేయలేక తమను చోడాని బారినుంచి కాపాడమని పోలురాజును శరణు కోరతారు. పోలురాజు కల్లందుల మారినీడు, మసిలినాయుడు మొదలైన వీరులను తోడుగా ఇచ్చి జంగాలను శ్రీశైలానికి పంపిస్తాడు. దీనితో చోడాని రాజు మండిపడి పోలురాజు మీదకు 'ముక్కంటి' అనే వీరుని సైన్యంతో పంపిస్తాడు. పోలురాజుకు, ముక్కంటికి చెరుకువాడ దగ్గర ఉన్న చిలుకలమర్రితాన్యం దగ్గర భయంకర యుద్ధం జరుగుతుంది. యాదవ వీరులెందరో ఆ యుద్ధంలో చనిపోతారు. చివరకు పోలురాజు కూడా చనిపోతాడు. శ్రీశైలానికి వెళ్ళిన చెరుకూరి జంగాలు బతికిపోతారు. అప్పటి నుంచి వారు కాటమ రాజు కథలను చెప్పి యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు.

గజపతి నగరం మండలం మరుపల్లి గ్రామంలో పొడపోతులవారు ఇంచు



మించుగా యాభై కుటుంబాల వారున్నారు. వీరిలో కర్నకోట సూర్యారావుగారు, గంట అప్పారావు గారు, పానుగంటి వెంకటరావుగారు అనే ముగ్గురి నుంచి నేను పొడపోతుల వారికి సంబధించిన విషయాన్ని సేకరించాను. ఈగ్రామంలోని పొడపోతులవారు ఉత్తరాంధ్ర జిల్లాల్లోని యాదవుల గ్రామాలను పంచుకున్నారు. ఒక్కొక్క కుటుంబానికి యాభై నుంచి వంద వరకు గ్రామాలున్నాయి. ఐదేళ్ళకొకసారి తమ ఇలాకాలో ఉన్న గ్రామాలకు వెళ్తారు. ఉత్తరాంధ్ర ప్రాంతంలోని గ్రామాలే కాకుండా సామర్లకోట, అమలాపురం, రామచంద్రాపురం, ద్రాక్షారామం, రాజమండ్రి, విజయవాడ మొదలైన పట్టణాలకు కూడా వీరు వెళ్ళి యాదవులను యాచిస్తారు. ఇలా గ్రామాలకు వెళ్ళినప్పుడు ఒక కుటుంబంలో ముగ్గురు వ్యక్తులు కలిసి వెళతారు. వీరిలో ఒకరు ప్రధాన కథకుడు గాను మిలిగిన ఇద్దరూ వంతలుగాను ఉంటారు. గ్రామంలోని యాదవ కుటుంబాల వారి సంఖ్యను బట్టి వీరు ఒక్కొక్క గ్రామంలో పదిహేను రోజుల నుంచి మొదలుకొని నెలరోజుల వరకు ఉంటారు. గ్రామంలో ఉన్నంతకాలం వీరు భోజన, స్నానపానాల న్నింటినీ యాదవుల ఇళ్ళలోనే చేస్తారు. ఐతే అన్ని రోజులూ ఒకే ఇంట్లో ఉండరు. ఒక్కొక్క ఇంట్లో ఒక పూట మాత్రమే భోజనం చేస్తారు. భోజనానికి వస్తున్నట్టు ముందుగానే యాదవులకు చెబుతారు. యాదవులు కూడా వీరిని గురువులుగా భావించి సంతోషంగా వీరికి భోజనం పెట్టడంతో పాటు చందా కూడా ఇస్తూ ఉంటారు. యాదవులు తమ శక్తిని బట్టి 20, 30, 50, 100 ఇలా ఎంతో కొంత ఇస్తారు. ఊర్లో ఉన్న యాదవులందరూ డబ్బు ఇచ్చిన తరువాత మరొక ఊరికి వెళతారు.

పొడపోతుల వారిని యాదవులు పొడపోతులవారు అనే పేరుతోనే పిలుస్తారు. ఐతే పొడపోతులవారు తాము "పొడపాటుకులము" అని తమను గురించి తాము చెప్పుకుంటారు. యాదవులను గురించి తాము పొగడ్తలతో పాటలు పాడతాం కాబట్టి తమకు పొడపాటకులు అనే పేరు వచ్చిందని కర్నకోట సూర్యారావుగారు చెప్పారు. వీరు గ్రామాల్లో గొర్రెల మేకల మందవున్న యాదవుల ఇంటికి వెళ్లినప్పుడు వారిని ఇలా పొగుడుతారు.

"యాదవ కుల చంద్ర,సూర్యునికి మొక్కరాదు, సుక్క బొట్టు పెట్టరాదు. అడ్డకట్టు కట్టరాదు, అయ్యవారికి మొక్కరాదు, పారేటి గంగలోను మొగమాజన చేయ రాదు. ఓ గొల్లరాజా, ఔదుల వల్లభులు, దానవాలు మీరు, కుడిచిన కంచానికి కుల స్వాములు మీరు, కట్టిన చీరకు మైలులేని రాజా, తొడిగిన పాగాకు దూలిలేని రాజా, ఆ కొని వచ్చిన ఏ ఒక్క జంగానికైనా, ఏ ఒక్క బ్రాహ్మణుకైనా అమృత వర్తమాని నివర్తంబుగ నీవు దానంబులు చేసేవు. పంచగట్టిన రాజా, కృష్ణావతారాన కృష్ణమూర్తుల

గొల్ల, బౌద్ధావతారాన బుద్ధులకు గొల్ల, వేదములకు రాజు వాది చెప్పిన గొల్ల, వార్తనాభుడు గొల్ల, కమలనాభుడు గొల్ల, కాటమరాజా,మచ్చావతారుడు, మాదవు దావులమ్మ, అంబోదురాజు, యాదవారాజు, గోవులకు రాజు గోపాలకుండు, పశువు గల రాజు పశుపతి రాజు, డబ్బై ఏడు ప్రజలు చెల్లించిన రాజు, విజయశంకర బిరుదు, రాజశంకర బిరుదు, రత్నశంకర బిరుదు, అంబోది బిరుదు, మాదవాబిరుదు, వెండ కొండ జల్లీడు, సురమని జల్లీలు, సూర్యాపుటాలు శార్దూలమన్నె బిరుదు, సర్వశార్దూలమన్న బిరుదు, గోచేతలాటంబు బూచక్రమన్నబిరుదు, వృష్ణ ప్రజావళి, మత్స్య ప్రజావళి, సింహతలాటమన్న బిరుదు, చంద్రప్రజావళి, అనుమంతు ప్రజావళి, ఆకాలపిడుగులు, అంత్ర బాసికాలు శ్రీ పూర్ణపడిగలు, రొయ్య బాసికాలు, ఈపునమోపున వివరంపు ముళ్ళు, కాసికొప్పున మంచు సింగినీవిల్లు, ఉభయ మాణిక్యంబు పట్టుకెరటంబు, యాకాల పిడుగంట, అందెబట్టిన పిడుగు ఆలపట్నంబు, బసవశంకర బిరుదు, శక్కులు వీరనాలు సర్వాంగ డోలీలు, గజగజాలని యేటి గనుల పెద్ద పల్లకీలు, గజగజా బలవంతు కలశరాగాలు, ఆవుల మందపేరు ఐవోజపర్వము, గొర్రెమంద పేరు గోనగిరి పర్వతము, మేకల మందపేరు మేదినీ పర్వతము, - ఎచ్చోటకిచ్చిన ఎలిసినీ మేక, గోములకు నోములకు పలుసనీమేక, మూర్చా బత్తులకు మూడు హంగులనీ మేక, గుర్రము పల్లీలకి గొరివలయునీమేక, ఆపిడి బూతాలకి అచ్చరమునీమేక ఈరతనిమేక ఊరల్ల పండుగు, తల్లిలేని బిడ్డలకు కన్నతల్లినీమేక తల్లి గల బిడ్డలకి దాతునీమేక, పెరుగోరు గుణాలకి పెరుగునీమేక, డోలి దమామీలు ఏ వూరి బ్రామ్మలు యజ్ఞం చేసినా మేక తలకాయ లేనిదే యజ్ఞం పారిందిలేదు, నాలుగు వేదములు, పది పురాణాలు పల్లవంశాబ్ది చంద్ర, మదుపర్ల గోత్రీక అప్పారావు నామధేయ దీర్ఘవిజయీభవ".[22]

ఇందులో చివర చెప్పిన "పల్లవంశాబ్ది చంద్ర"లో "పల్ల" అనేది ఇంటి పేరు. "మధుపర్ల" అనేది గోత్రం పేరు. అప్పారావు అనేది పేరు. పొడపోతులవారు నగరాల్లో ఉన్న యాదవుల ఇళ్ళకు వెళ్ళినపుడు వారిని ఇలా పొడుగుతారు. "బ్రహ్మయ బ్రహ్మయ, బహు కుటుంబదారా, దన్యతయాదవ, రాజీవచంద్ర, శుభమస్తు నీకు, శోభానతేజ కళ్యాణమస్తు నీకు, ఆర్తమందార పారిజాతకవోయి, ఓ బామనంద గారస్తరా నీకు, గోపాల చూడామణీ శబరమస్తరా నీకు, కరనంద పార్థవా అభినమందకార అన్నవస్తరా నీకు, యాత్రయామనగోత్ర, అరిసేవకుండ వసుధాన్య సమజమస్తరా నీకు జయము, జయము పెద్ద జనపాలతనయా, అన్నదాన గోదాన అమలగోదాన కనకబూదాన, కామినీ పక్ష పలదానా, కాటమరాజ తనయా పల్లవాయనేత్ర, ఓ రాజేశ్వరా, బట్టును



వచ్చినాను, జనహంకార, దాటయ్యకోటా, బొట్ట వంశాబ్ది చంద్ర బోగుల గోత్రీక, బాబూరావు నామధేయ దీర్ఘవిజయీభవ".[23]

ఇందులో బొట్టవంశాబ్ది చంద్ర అనే దానిలో బొట్ట అనేది ఇంటిపేరు. బోగుల అనేది గోత్రంపేరు. బాబూరావు అనేది ఇంటి యాజమాని పేరు.

పొడపోతులవారు యాదవుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు పై విధంగా పొగిడి వారి ఇళ్ళలో భోజనం చేసి వారిచ్చే దక్షిణను స్వీకరించిన తర్వాత వారిని ఇలా దీవిస్తారు. "శుబోజ్జయము గలిగి, శుభకర్మగలిగి, ఏరువాగంగ దీవన గలిగి, కన్నతల్లిని బోలు చుట్టంబులేదు. ఇంటన బోలు ఆయుదంబు లేదు గంగాభవానీ దీవన గలిగి, కాటమరాజులాగ కలిమి గలిగి, సింహాద్రిరాజు లాగా సిరిసంపదలు గలిగి, నలనూక రాజులాగ నగాము గలిగి, ఆలపోలురాజు దీవెన గలిగి .................... పొడపోతలవారి దీవన గలిగి ఆడబిడ్డ దీవన గలిగి".[24]

పై దీవెనలో చివర "పొడపోతులవారి దీవన గలిగి, ఆడబిడ్డ దీవన గలిగి" అని చెప్పడం జరిగింది. అంటే పొడపోతులవారు యాదవులకు వారి ఆడపడుచుల వంటి వారని ఆడపడుచులకు ప్రతిసంవత్సరం చీరసారెలు ఏవిధంగా పెట్టి వారిని సంతోష పెడతారో అలాగే తాము కూడా యాదవులకు ఆడపడుచుల వంటి వారమని తాము యాదవుల ఇళ్ళకు వచ్చినప్పుడు తమకు భోజన పానాదులు పెట్టి దక్షిణ ఇచ్చి సత్కరించాలని పొడపోతులవారి అభిప్రాయం.

తెలంగాణా ప్రాంతంలో యాదవులను యాచించే మందెచ్చులవారు కూడా తాము యాదవుల "అర్తివార" మని, అర్తివారు ఆడబిడ్డవంటివారమని చెబుతారు. దీన్నిబట్టి ఆంధ్రదేశంలో కాటమరాజు కథలను చెబుతూ యాదవులను యాచించి జీవించే ఆశ్రిత కులాల వారందరూ యాదవులకు ఆడబిడ్డల (ఆడపడుచు) వంటి వారని తెలుస్తుంది. ఆడబిడ్డ లేక ఆడపడుచు పుట్టింటికి వచ్చినప్పుడు తనకు కావలసిన సారె చీరెలను ఏవిధంగా అడిగి తీసుకుంటుందో అలాగే యాదవులను యాచించే ఆశ్రిత కులాల వారందరూ ఊర్లోని యాదవులందరినీ అడిగి డబ్బు ఇప్పించుకుంటారు, పుట్టింటివారు తనకు సారెచీరెలు పెట్టకపోతే ఆడపడుచు పుట్టింటి వారితో దెబ్బలాడుతుంది. అలాగే యాదవులను యాచించే ఆశ్రిత కులాల వారు కూడా తమకు యాదవులు డబ్బు ఇవ్వడం వారి విద్యుక్త ధర్మం అని, యాదవుల నుంచి డబ్బును ఇప్పించుకోవటం తమ హక్కు అని గట్టిగా దెబ్బలాడి యాదవుల నుండి చందా తీసుకుంటారు. ఆడపడుచు పుట్టింటివారి నుంచి మాత్రమే సారె చీరెలను ఆశిస్తుంది. ఇతరులను అడగదు. అలాగే యాదవులను ఆశ్రయించి జీవిస్తున్న

పొడపోతులవారి వంటి ఆశ్రితకులాల వారు యాదవులను మాత్రమే యాచిస్తారు. మిగిలిన ఏ ఇతర కులాల వారినీ యాచించరు.

గ్రామంలోని యాదవులందరూ డబ్బు ఇచ్చిన తరువాత చివరిరోజు పొడపోతుల వారు తమ వద్ద ఉన్న తెరపటాన్ని విప్పి అందులో ఉన్న బొమ్మలను చూపిస్తూ కాటమరాజు కథల్లో ఏదో ఒక కథను చెబుతారు. ఆ మరుసటిరోజు ఆ ఊరు విడిచి మరో ఊరికి వెళతారు. పొడపోతులవారి ప్రదర్శన లేక కథాఖ్యానం ఆంధ్రదేశంలో కళింగాంధ్ర, ఉభయ గోదావరి, కృష్ణాజిల్లాలకు మాత్రమే పరిమితం. పొడపోతులవారు కథను రాత్రిపూట మాత్రమే చెబుతారు. పగలు చెప్పరు. కథను చెప్పేటప్పుడు పురుషులు మాత్రమే పాల్గొంటారు. ఇందులో స్త్రీలు పాల్గొనరు. వీరు కథాఖ్యానం సందర్భంలో కాటమరాజు కథలను చెబుతారు. అందువల్ల వీరి ప్రదర్శన సాహిత్యం ఉన్న జానపద కళ కిందికి వస్తుంది. వీరు తరతరాల నుంచి సాంప్రదాయకంగా తమ కళను ప్రదర్శిస్తున్నారు. అందువల్ల వీరి కళ వీరికి మాత్రమే పరిమితం. వీరు తమ కళను యాదవుల ఇళ్ళ దగ్గర యాదవులకోసం మాత్రమే ప్రదర్శిస్తారు. ఐతే మిగిలిన కులాలవారు కూడా వీరు చెప్పే కథలను వినడానికి వస్తారు.

## తెరచీరల వారు- స్వరూపస్వభావాలు- చరిత్ర :

తెరచీరల వారు విశాఖపట్నం జిల్లా నర్సీపట్నం మండలం పెదబొడ్డేపల్లి గ్రామంలో ఉన్నారు. పెదబొడ్డేపల్లి ప్రస్తుతం నర్సీపట్నంలో కలిసిపోయింది. తెరచీరల వారు పూజగొల్ల శాఖకు చెందిన యాదవులు. వీరు కాటమరాజు కథలను చెబుతారు ఈకథలను చెప్పేటప్పుడు వీరు ఒక పెద్ద తెరను ఉపయోగిస్తారు. ఈతెరను తెరచీర అని పిలుస్తారు. తెరచీరనుపయోగించి కథను చెప్పడం వల్లనే వీరికి తెరచీరల వారు అనే పేరు వచ్చింది. ఈ తెరచీరలవారు పదం వ్యవహారంలో తెలసీరవారు అయింది. గ్రామీణులు వీరిని తెలసీరవారు అని పిలుస్తారు. వీరు విశాఖపట్నం, విజయ నగరం, తూర్పుగోదావరి జిల్లాల్లోని ఆలగొల్లలను, ఎర్రగొల్లలను యాచించి జీవిస్తున్నారు.

తెరచీరలవారు పెదబొడ్డేపల్లిలో కొల్లి, బర్ల, చెల్లిబోయిన, గొంప అనే నాలుగు ఇంటి పేర్లకు చెందిన ఎనిమిది కుటుంబాల వారు మాత్రమే ఉన్నారు. వీరిలో కొల్లి రమణ గారి దగ్గర నుంచి నేను తెరచీరల వారికి సంబంధించిన విషయాన్ని సేకరించాను. ఉత్తరాంధ్ర జిల్లాల్లో పూజగొల్ల శాఖకు చెందిన యాదవులు లేరు. ఈప్రాంతంలో ఎర్ర,ఆల, గౌడ శాఖలకు చెందిన యాదవులు మాత్రమే ఉన్నారు. ఈమూడు శాఖల వారు గాకుండా మిగిలిన శాఖలకు చెందిన యాదవులు ఎవరైనా



ఈప్రాంతలో ఉంటే వారు మిగిలిన ప్రాంతాలనుంచి వలస వచ్చినవారై ఉంటారు. అలాగే పూజగొల్ల శాఖకు చెందిన తెరచీరల వారు కూడా గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, రాయలసీమ జిల్లాల నుంచి వలస వచ్చిన వారై ఉంటారు. తెరచీరల వారు కథ చెప్పేటప్పుడు వంత పలికేవారిని "బలకొట్టేవారు" వారు అని పిలుస్తారు. వంత పాడేవారిని బలకొట్టేవారు అని రాయలసీమ ప్రాంతలో పిలుస్తారు. అందువల్ల తెరచీరల వారు రాయలసీమ ప్రాంతం నుంచి వలస వచ్చిన వారై ఉండవచ్చు.

తెరచీరల వారిలోని ఎనిమిది కుటుంబాల్లో ఒక్కొక్క కుటుంబానికి వంద గ్రామాల్లో యాచించే అధికారం ఉంది. వీరు మూడు సంవత్సరాలకొకసారి తమ గ్రామాలకు వెళ్ళి ఆగ్రామాల్లో ఉన్న యాదవుల ఇళ్ళ దగ్గర కాటమరాజు కథలను చెప్పి వారిని యాచిస్తారు.యాదవులు వీరికి ఇచ్చే డబ్బు, గొర్రెపిల్ల, మేకపిల్ల మొదలైన వాటిని మందెచ్చులవారి లాగా "తాగం" అని పిలుస్తారు. యాచనకు వెళ్ళేటప్పుడు వీరు ఇద్దరు లేక ముగ్గురు వెళ్తారు. వీరిలో ఒకరు ప్రధానకథకుడుగా ఉంటే మిగిలిన ఒకరు లేక ఇద్దరు వంతలుగా ఉంటారు. ఇలా యాచనకు వెళ్ళేటప్పుడు వీరు పురుషులు మాత్రమే వెళ్తారు. స్త్రీలు వెళ్ళరు. తమ స్వగ్రామమైన పెదబొడ్డేపల్లికి దగ్గరగా ఉన్న గ్రామాలకు యాచనకు వెళ్తే ఉదయం వెళ్ళి రాత్రికి తిరిగి తమ ఇంటికి వస్తారు. దూరంగా ఉన్న గ్రామాలకు వెళ్ళినప్పుడు ఏదైనా ఒక ఊర్లో మకాం వేసి ఉదయమే చుట్టుపక్కల ఉన్న గ్రామాలకు వెళ్ళి యాచించి రాత్రికి మకాంకు చేరుకుంటారు.

తెరచీరల వారు యాదవుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు వారిని ఇలా ప్రశంసిస్తారు.

" సుబోజ్జయం గలిగి సుబకరుణ గలిగి-ఒక ఇంటి పట్టు రాజా వెయ్యిళ్ళు గలిగి
ఒక దూడ పట్టు రాజా వెయ్యి దూడలు గలిగి-సాలువా బంగారి రాజా సౌజన్యం గలిగి
బంగారి సెరుగులు రాజా పౌరుసంబులు గలిగి-అన్నము గలిగి రాజా వస్త్రము గలిగి
యానామంతాను రాజా ఎద్దయినా గలిగి-సముద్రమంతాను రాజా సల్లయినా గలిగి
కడిపిగుండా రాజా దనరాసులు గలిగి-కలికి సక్కని మంచి కుమారులు గలిగి
సాలితే నీమంద రాజా సల్లగా ఉండి-పాలోసి నీమంద రాజా పదివేలు గలిగి
నీలోసి నీమంద రాజా వెయి లచ్చ గలిగి- యగ్నంబుత్రా రాజా దివ్వన గలిగి
కంచంబుత్రా రాజా దివ్వన గలిగి-కొడుకులు గలిగి రాజా కోడళ్ళు గలిగి
అల్లుళ్ళు గలిగి రాజా ఆడబిడ్డలు గలిగి-మనుమలు గలిగి రాజా మనుమరాళ్ళు గలిగి
సీతాదేవి వంటి రాజా సిరిసంపదలు గలిగి- బత్తుడు బసవన్న రాజా దివ్వన గలిగి
బొల్లావంతాను రాజా బాగార్తులు గలిగి-సిరిదేవియంతాను రాజా సిరిసంపదలు గలిగి
అదిగాక ముందు ఆదవా కులము-సుక్కబొట్టు పెట్టరాదు సూర్యుడికి మొక్కరాదు

అడ్డబొట్టు పెట్టరాదు అరవసాని ఎక్కరాదు-సదురు మీద రాజుకి సలాము సేయరాదు
తోవనొక్క రాజుకి తోవన తొలగరాదు-కోడి పిల్లను పెంచరాదు గొంతి వారి కులము
ఎద్దును వేరు గట్టి ఎవసాయం సేయరాదు- ఎక్కువైన కులము వియ్యాద్రి సంపద
ఆవుగరబాన పుట్టిన రాజా ఆదవారాజు-గోవు గరబాన పుట్టిన రాజా మరి గొల్లరాజా
ఆవే మన తల్లి రాజా ఆబోతు మన తండ్రి- ఎరతోటకూర రాజా ఎయ్యరాదు
కొయ్యరాలు రాజా బోంచేయరాదు- ముక్కున పల్లెరువు రాజా అది పెట్టరాదు
సేతికి సందాన కడిమి రాజా సక్కని వర్ణము-గాజుల వానికి రాజా సెయ్యివ్వరాదు
కాలు మెట్టోయి రాజా కలుక్కుమనరాదు-యాదవా కులానికి రాజా ఎగ్గయిన రాజా
వల్లబుల కులానికి రాజా అది గొల్లరాజు-గుబ్బురు మీసాలు రాజా పెద్దనుదురు
కార్తీకసెంద్రుండు రాజు గనుడు కాటమరాజు-వీరశంకర బిరుదు సెల్లినరాజు
బసవశంకర బిరుదు సెల్లిన రాజు- సారాసురి మేకలు సాలినన్ని గలిగి
ముచ్చపొడి మేకలు మూడేలు గలిగి-కొమ్మలా గొర్లు రాజా కొదమలు ఈని
జాడిగొర్లమంద రాజా ఒక లచ్చ గలిగి-పాడిగొర్లమంద రాజా పదివేలు గలిగి
తూరుపున నీమంద తులతూగుతుండు-పడమట నీమంద బలసాగుతుండు
దచ్చినాన నీమంద రాజా వెయిలచ్చ గలిగి- పాడిగొర్లమంద రాజా పదివేలు గలిగి
వీనితే నీమెక విల్లల్ల పండుగ-పొల్లితే నీమేక రాజా పొలమల్ల పండుగ
యగ్నంబుత్రా రాజు దివ్వన గలిగి- మెట్టబంతికూర రాజా మేకల మజ్జిగ
అడవి పంది కూర రాజా ఆవుల మజ్జిగ-ఆదిగాక ముందు రాజా ఆదవాకులము
డెబ్బైయేదు బిరుదులు చెల్లిన రాజు-పూసపాటి మహరాజుకు రాజా సెల్లదీబిరుదు
అంజంబుత్రా రాజూ దివ్వన గలిగి - వీరశంకర బిరుదు రాజా సెల్లినరాజు
బసవశంకర బిరుదు సెల్లిన రాజు- కంచికాల బిరుదు రాజా సెల్లినరాజు
నక్కపావడాలు రాజా సెల్లిన రాజు- సువ్వారి గొడుగులు రాజా సెల్లిన రాజు
యగ్నంబుత్రా రాజు దివ్వన గలిగి- సుబోజ్జయంగా వుండి"

గ్రామాల్లో గొర్రెలమంద వున్న యాదవులు ఒక్కొక్క ఇంటి పేరు గలవారు కలిసి వీరికి గొర్రెపిల్లను గానీ మేకపిల్లను గానీ ఇస్తారు. మంద ఉన్నవారు వీరికి తప్పనిసరిగా గొర్రెపిల్లను గానీ, మేకపిల్లను గానీ ఇస్తారు. మంద వున్న వారి దగ్గరి నుంచి వీరు డబ్బు తీసుకోరు. తప్పని సరిగా జీవాన్నే తీసుకుంటారు. మంద లేనివాళ్ళు డబ్బు ఇస్తారు. డబ్బు ఇచ్చేవారు వంద, రెండువందలు, మూడువందలు- ఇలా వారి ఆర్థిక స్థోమతను బట్టి డబ్బు ఇస్తారు.

యాదవులు తమ ఇంటికి వచ్చిన తెరచీరల వారిని యాచకులుగా చూడరు.



తమ ఆడబిడ్డల మాదిరిగా గౌరవంగా చూస్తారు. తెరచీరల వారు ఒకటికి నాలుగైదు సార్లు యాదవుల ఇళ్ళకు వెళ్ళి తరతరాలుగా తాము యాదవుల అర్తివారుగా జీవిస్తున్నామని, అందువల్ల వారు తమకు తాగం ఇవ్వాలని బ్రతిమాలే ధోరణిలో మాట్లాడుతూ యాదవుల దగ్గరనుంచి తాగం వసూలు చేస్తారు. దాదాపుగా యాదవులందరూ వీరికి తాగం ఇస్తారు. ఐతే ఎక్కడైనా ఒకరు ఇద్దరు తాగం ఇవ్వకుండా మొండికేస్తారు. అలాంటి వారిని తెగుడుతూ తెరచీరల వారు ఇలా చెబుతారు.

"అందగాలపోడికాంకారమొచ్చినా - పెంపుడోడికి పెద్దానమొచ్చినా
కోతికి శివాలు వచ్చినా - తక్కువోడికి దొరతనమొచ్చినా
గుడిసేటికి రెండోకళ్ళొచ్చినా - గుడ్డికన్నోడద్దం జూసుకున్నా
నడమంతానికి సిరి గలిగినా - నరాల మీన పుండు పుట్టినా
ఎన్నాళ్ళు బాబయ్యా"

ఇలా తెగడడం అన్ని చోట్లా చేయరు. ఊర్లో తమకున్న ఆదరాన్ని బట్టి, అండ ఆసరాను బట్టి చేస్తారు. సాధారణంగా యాదవులు అంతవరకు తెచ్చుకోరు. తెరచీరలవారు తాగం కోసం రెండు మూడు సార్లు తిరగ్గానే తమ కష్టాన్ని, ఆర్థికస్థోమతను వారికి వివరించి ఎంతోకొంత డబ్బు ఇచ్చి పంపిస్తారు.

తెరచీరల వారు తమ కళాప్రదర్శన సందర్భంగా యాదవభారతంగా పిలువబడుతున్న కాటమరాజు కథలను చెబుతారు. అందువల్ల ఇది సాహిత్యమున్న కళ. వీరు తమ కళను పగలు రాత్రీ తేడా లేకుండా అన్నివేళలా ప్రదర్శిస్తారు. ఈకళాప్రదర్శనలో పురుషులు మాత్రమే పాల్గొంటారు. స్త్రీలు గానీ పిల్లలు గానీ పాల్గొనరు. ఈకళ ఉత్తరాంధ్ర జిల్లాల్లో మాత్రమే ప్రదర్శింపబడుతూ వుంది. అందువల్ల ఇది ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమైన కళ. ఈకళను తెరచీరల వారు మాత్రమె ప్రదర్శిస్తారు. వేరే ఎవ్వరూ ఈకళను ప్రదర్శించడం లేదు. అందువల్ల ఇది తెరచీరల వారికి మాత్రమే పరిమితమైన కళ. తెరచీరల వారు తమ పోషకులైన యాదవుల ఇళ్ళ దగ్గర యాదవుల కోసం మాత్రమే ఈకళను ప్రదర్శిస్తారు. ఐతే ఇతర కులాల వారు కూడా ఈకళను చూడవచ్చు.

తెరచీరలవారు తమ కళకు ఆధారమైన తెరచీరను చాల పవిత్రంగా చూస్తారు. తెరచీరను విప్పి కథ చెప్పేటప్పుడు కాళ్ళకు చెప్పులు వేసుకోరు. అంతేగాదు తెరచీరను మడిచి సంచిలో పెట్టుకొని ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వెళ్ళేటప్పుడు తెరచీర ఉన్న సంచిని పట్టుకున్న వ్యక్తి కాళ్ళకు చెప్పులు వేసుకోడు. ఎంత ఎండలోనైనా తెరచీరను పట్టుకున్న వ్యక్తి కాళ్ళకు చెప్పులు లేకుండా ఎంత

దూరమైనా నడుచుకుంటూ వెళ్తాడు. దీనికి కారణం తెరచీర మీద శక్తిస్వరూపిణిగా ఉన్న గంగమ్మతల్లి ఉండడమే. ఆతల్లి బొమ్మ ఉన్న తెరను పట్టుకోవడం గంగమ్మ తల్లిని మోసుకెళ్ళడం లాంటిదని వీరు భావిస్తారు. దేవతా విగ్రహాలను తల మీద పెట్టుకని మోసుకొని వెళ్ళేవారు ఏవిధంగా చెప్పులు వేసుకోరో అలాగే గంగమ్మతల్లి బొమ్మ ఉన్న తెరచీరను తీసుకొని వెళ్ళేవారు గూడా చెప్పులు వేసుకోరు. అంతేగాదు వీరు ప్రతిసోమవారం తెరచీర మీద ఉన్న గంగమ్మకు కోడిని బలి ఇస్తారు. అలా చేయక పోతే గంగమ్మ కోపగిస్తుందని వీరు చెబుతారు.

## మందెచ్చులవారు - స్వరూప స్వభావాలు - చరిత్ర :

మందెచ్చువారు జానపద గాయక భిక్షుకులు. వీరు బుడుగజంగం కులానికి చెందినవారు. బుడగజంగాలు షెడ్యూల్డ్ కులాల జాబితాలో ఉన్నారు. వీరు తెలంగాణా ప్రాంతంలోని కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ, రంగారెడ్డి, హైదరాబాదు జిల్లాల్లో ఉన్నారు. వీరిని మందపిచ్చోళ్ళు, మందుచ్చోళ్లు, పాడపాత్రపోల్లు , పొగడపోల్లు అని గూడా పిలుస్తారు. మందెచ్చులవారు అంటే మందను హెచ్చు చేసేవారు అని అర్థం. మంద అంటే యాదవుల గొర్రెల మేకల మంద. వీరు కాటమరాజు కథలను చెప్పడం వల్ల, మందకు 'బలి' చల్లడం వల్ల తమ మంద పెరుగుతుందని, అంతేగా కుండా తమ పొలాలు చీడపీడ లేకుండా మంచి పంటను ఇస్తాయని యాదవుల నమ్మకం. మందను పెంచడానికి వీరు దోహదం చేస్తారు కాబట్టే మందెచ్చులవారు అనే పేరు వీరికి వచ్చింది.

మందెలచ్చులవారు తెలంగాణా ప్రాంతంలో ఉన్న పాకనాటి గొల్ల, పూజగొల్ల, ఎర్రగొల్ల మొదలైన అన్ని శాఖల గొల్లలను యాచిస్తారు. వీరు తాము యాదవుల 'అద్దివారు' లేక 'అర్తివారు' గా చెప్పుకుంటారు. 'అద్దె' అనే పదం 'అర్థి' అనే పదం నుంచి వచ్చింది. అర్థి > అర్తి > అద్ది గా ఈ పదం వ్యవహారంలో రూపాంతరం చెందింది. కొందరు 'అర్తోళ్ళు' అనే మాటను గూడ ఉపయోగిస్తారు. అర్థివారు అంటే అర్థించేవారు. అంటే యాచించేవారు. వీరు తమకు తరతరాల నుంచి హక్కుగా వస్తున్న యాదవుల గ్రామాలకు వెళ్ళి వారి ఇళ్ల దగ్గర కాటమరాజు కథలను చెప్పి వారు ఇచ్చే ధనంతో జీవిస్తారు. యాదవుల దగ్గర వీరు తీసుకునే ధన, ధాన్య, వస్తువులను 'తాగం' అని పిలుస్తారు. యాదవులు గూడ వీరు తమ 'కుల అద్దె' వారని గౌరవంగా చూస్తారు. ఈ అద్దివారు ఆడబిడ్డ (ఆడపడుచు) తో సమానం. ఆడబిడ్డకు తల్లిదండ్రులు గానీ, సోదరులు గానీ చీరెసారెలను ఇచ్చి గౌరవంగా ఎలా చూస్తారో



తమ కులగాథలను కీర్తించే మందెచ్చుల వారు గూడ తమకు అలాగే గౌరవింపదగిన వారని యాదవులు భావిస్తారు. ఆడబిడ్డకు పుట్టింటివారి మీద ఏ విధంగా ప్రేమాభిమానా లుంటాయో అలాగే మందెచ్చుల వారికి తమను పోషించే యాదవ కులస్థుల మీద ప్రేమాభిమానాలు, భక్తి గౌరవాలుంటాయి.

మందెచ్చులవారు అయోధ్యాగిరి నుంచి ఎలమంచికి వలస వచ్చిన కవులావుల గంగురాజు కథతో కథను ప్రారంభించి వరసగా వలురాజుకథ, సింహాద్రి రాజు కథ, ఎరనూకరాజు కథ, పెద్దిరాజు కథ, నలనూకరాజు కథ, పోలురాజు కథ, పంపాద్రి కథ, బల్లికురువ పోట్లాట కథ, కాటమరాజు కథ, కరియావులరాజు కథ, ఆవుల మేపు పుల్లరి కథ, పాలేటి కథ, ఎర్రయ తరకవాదం కథ, జన్నివాడ కథ, భట్టురాయబారం కథ, కోటపాటితాటివృక్షం తెచ్చే కథ, కాటమరాజు యుద్ధం కథ, పాపనూక వలపోత కథ, అగుమంచి వలపోత కథ, పల్లికొండ పుట్టుక కథ, గంగపుట్టుక కథ, భైరవకురువ యుద్ధం కథ, అగుమంచి కథ, భక్తిరన్న కథ అనే ఇరవై అయిదు కథలను వీరు చెబుతారు. అయితే మందెచ్చులవారందరూ పైన చెప్పిన అన్ని కథలను చెప్పలేక పోవచ్చు. కనీసం పదికి పైగా కథలను వీరు చెబుతారు. వీరు దాదాపు నిరక్షరశ్యులు. అయినప్పటికీ కాటమరాజు కథలను అలవోకగా రాగతాళయుక్తంగా గానం చేస్తారు. వీరి కథాగానం చూస్తే వారి ధారణాశక్తికి, శృతపాండిత్యానికి ఆశ్చర్యం వేస్తుంది.

మందెచ్చులవారు సంచార జీవనం చేస్తూ ఉంటారు. వీరు నాలుగు, అయిదు కుటుంబాల వారు కలిసి తమ మిరాశీ గ్రామాలకు వెళ్లి ఒక్కొక్క గ్రామంలో నెల నుంచి మూడు, నాలుగు నెలల వరకు మకాం వేసి యాదవుల ఇళ్ళ దగ్గర కాటమరాజు కథలను చెబుతూ యాచిస్తూ ఉంటారు. వరంగల్ జిల్లా హనుమకొండ దగ్గర ఉన్న గోపాలపురంలో ఊర పర్వతాలు, ఇతని భార్య అయిలమ్మ, ఊర బజారు, ఊర రాజమల్లు, ఊర కొమరుమల్లు, ఇతని భార్య సాలమ్మ, ఊర అయిలమల్లు, కడెం మల్లయ్య ఇతని భార్య ఇస్తారమ్మ అనే మందెచ్చులవారు స్టేషన్ ఘనాపురం దగ్గర ఉన్న ఇప్పగూడెం (ఇప్పగూడ) అనే ఊర్లో ఉన్నప్పుడు 2007 మే నెల 11వ తేదీన నేను వీరిని కలుసుకొని మందెచ్చుల వారికి సంబంధించిన విషయాలను సేకరించాను.

వీరు అప్పటికే మూడు నెలల నుంచి ఆ ఊర్లో ఉన్నారు. ఇంకా నెల రోజులు అక్కడే ఉంటామని చెప్పారు. వీరిలో ఊర పర్వతాలు, ఊర బజారు, కథాగానం చేసేటప్పుడు ప్రధాన కథకులుగా వ్యవహరిస్తారు. వీరు మంచెచ్చుల ఉత్పత్తిని గురించి నాలుగ రకాల కథలను చెప్పారు.

1. ఒక గ్రామంలో ఊరి బైట కొంతమంది శారద కాంద్రు గుడిశెలు వేసుకొని జీవిస్తున్నారు. అక్కడికి దగ్గరలోనే ఒక గొల్ల కులస్థుడు తన మందతో ఉండేవాడు. శారద కాంద్రలో ఒక స్త్రీకి మంద యజమానికి శారీరక సంబంధం ఏర్పడడంవల్ల ఆ స్త్రీ గర్భవతి అయింది. శారదకాంద్రు ఆమెను వెలివేశారు. ఆ స్త్రీ గొర్రెల మంద దగ్గర ఉండేది. మంద కాసే గొల్లలు ఆమెకు భోజనం పెట్టేవారు. తొమ్మిది నెలల తర్వాత ఆమె మంద దగ్గరనే ఒక బాలుని ప్రసవించింది. ఆ బాలుడు అక్కడే గొర్రెలమంద దగ్గర ఉచ్చలో, రొచ్చులో పెరుగుతూ ఉంటాడు. మంద కాసే గొల్లలు ఆ పిల్లవానికి పొడలున్న మేకపోతును ఇచ్చారు. ఆ పిల్లవాడు అలాగ మంద దగ్గర పెరిగి పెద్దవాడయ్యాడు. మంద ఉచ్చలో పెరగడం వల్ల 'మందుచ్చోడని' పొడలున్న పోతును పెంచడం వల్ల 'పొడ పోతులవాడని' అతనికి పేరు వచ్చింది. అతని సంతతి వారే మందెచ్చులవారని, తమ మూలపురుషుని బట్టి తమకు మందు చ్చోళ్ళని, పొడపోతులవారని, పొడపోత్రపోళ్ళని పేర్లు వచ్చాయని వీరు చెప్పారు.

2. కాటమరాజు శ్రీశైలం అడవుల్లో తన ఆలమందను మేపుతున్నప్పుడు పండ్రెండు సంవత్సరాల పాటు గొప్ప కరువు వస్తుంది. ఆలమంద నీరు, మేత లేక అలమటిస్తుంటాయి. సిద్దిరాజు పరిపాలిస్తున్న నెల్లూరులో వర్షాలు బాగా కురుస్తూ ఉంటాయి. నెల్లూరుకు పోతే మీమంద మీరు బతుకుతారని" దేవతలు కాటమరాజుకు చెబుతారు. కాటమరాజు ఆలమందతో నెల్లూరుకు బయలుదేరుతాడు. కాని శ్రీశైలం పొలిమేర దాటించేటప్పుడు గంగాదేవి మహిమ వల్ల ఆలమంద ఆగిపోతుంది. గంగను శాంతింప జేయడానికి కాటమరాజు తెల్లపిండి, పచ్చపిండి, నల్లపిండి, పసుపు కుంకుమ లతో గంగపట్నాలు వేయిస్తాడు. గోవుపాలతో అరిశెలు చేయించి గావు పట్టడానికి గొర్రెను తెప్పించి పాకనాటిగొల్ల, కర్నెగొల్ల, గంపగొల్ల, ఎర్రగొల్ల, కర్రెగొల్ల, ముష్టిగొల్ల, పూనాటి గొల్ల, పూజగొల్ల, ముదిటిగొల్ల, ఏకాటిగొల్ల, ఆలగొల్ల, మందగొల్ల అనే పన్నెండు రకాల గొల్లలను పిలిపించి వారిలో ఎవరైనా గొర్రెను గావుపట్టి ఆలమంద మీద బలి చల్లిన వారికి మంచి బహుమానం ఇస్తానని చెబుతాడు. గొర్రె గొంతును నోటితో కొరకడాన్ని గావుపట్టడం అంటారు. కాటమరాజు ఆలమంద చాల పెద్దది. పన్నెండు ఆమడల దూరం అది వ్యాపించి ఉంటుంది. ఇంత దూరం వ్యాపించిన ఆలమంద చుట్టు గావుపట్టి బలి చల్లడం తమ వల్ల కాదని గొల్లలందరూ పారిపోతారు. మందగొల్ల నేను చల్లుతానని ముందుకు వచ్చి గజ్జలలాగు తొడుక్కుని గొర్రెను గావు పడుతూ మంద చుట్టూ తిరుగుతుంటాడు. మధ్యలో లాగు ఊడిపోతుంది. అయినప్పటికి ఆగకుండా దిగంబరంగా మంద చుట్టూ తిరిగి ఒళ్లంతా రక్తపు మరకలతో కాటమ



రాజు దగ్గరికి వస్తాడు. కాటమరాజు అతణ్ణి మెచ్చుకొని మంచి బహుమానం ఇచ్చి, రాగిపత్రం రాసి ఇస్తాడు. మందగొల్ల ఈ విధంగా గొర్రెను గావు పట్టి మంద మీద బలి చల్లి మందకు ఎలాంటి అరిష్టం కలగకుండా మంద హెచ్చడానికి కారకుడయ్యాడు. కాబట్టి అతను 'మందెచ్చు' అయ్యాడని అతని సంతతివారమే తామని, కాబట్టి తాము మందెచ్చుల పేరుతో పిలువ బడుతున్నామని వారు చెప్పారు.

3. ఈమూడవ కథ రెండవ కథలాంటిదే. ఇందులో కాటమరాజు ఆలమంద చుట్టు గొర్రెను గావుపట్టి బలి చల్లిన వ్యక్తి ఆలగొల్ల కులానికి చెందిన జగ్గన్న, ఇతణ్ణి ఆలగొల్ల జగ్గన్న అని అంటారు. ఇతను ఆలమంద చుట్టు గావు పట్టి బలి చల్లి మంద హెచ్చడానికి కారకుడయ్యాడు కాబట్టి ఇతను మందెచ్చు అయ్యాడు. ఆ తర్వాత యాదవ కులానికి అర్తివాడు కావాలని, అతను యాదవకుల కథలను చెప్పాలని అందుకు ఎవరైతే బాగుంటారని యాదవ రాజులు ఆలోచించి, దానికి తగిన వ్యక్తి మందెచ్చు అయిన ఆలగొల్ల జగ్గన్న అని నిర్ణయిస్తారు. అతను ఏ పని చేయనవసరంలేదు. యాదవులను కీర్తిస్తూ వారి కుల కథలను గానం చేస్తూ ఉండాలి. దానికి ప్రతిగా మంద ఉన్న యాదవులు మూడు మేకలను, ఏడు ఆవులను ఇవ్వాలి. పాలేరు తనమున్న యాదవులు పదిహేనురోజుల జీతాన్ని ఇతనికి ఇవ్వాలి. అతని సంతతి వారే మందెచ్చులవారు. అతని తర్వాత అతని వారసులు పరంపరగా యాదవుల కుల కథలను కీర్తిస్తూ యాదవులకు అర్తివారుగా జీవిస్తూ వారి చేత పోషింపబడుతున్నారు.

4. పోలురాజు సిరిదేవుల కుమారుడు ఐతమరాజు. పాపనూక దుష్టనక్షత్రంలో జన్మించినందువల్ల ఆమెను అడవిలో ఒంటరిగా ఒక మేడలో ఉంచాలని భావించిన సిరిదేవి తన కుమారుడు ఐతమరాజును ఆలా చేయమని ఆజ్ఞాపిస్తుంది. తల్లి ఆజ్ఞ ప్రకారం ఐతమరాజు అడవిలో మేడ కట్టించి పాపనూకను అందులో ఉంచుతాడు. తనను అందరితోపాటు ఉంచకుండా ఒంటరిగా ఉంచిన ఐతమరాజును నువ్వు వచ్చే జన్మలో యాదవుల అర్తివాడుగా పుట్టాలని పాపనూక శపిస్తుంది. ఆ శాపం ప్రకారం ఐతమ రాజు మరుసటి జన్మలో అర్తివాడుగా జన్మిస్తాడు. అతని సంతతి వారమైన తాము యాదవుల 'అర్తివారు'గా జీవిస్తున్నామని వారు చెప్పారు.

పై నాలుగు కథల్లోని వాస్తవాలను హేతుబద్ధంగా పరిశీలించవలసి ఉంది. మొదటి కథలో మందెచ్చుల వారి మూలపురుషుడు యాదవ పురుషునికి శారద కాంద్ర స్త్రీకి జన్మించిన అక్రమ సంతానంగా చెప్పబడింది. రెండవ కథలో మందెచ్చుల వారి మూలపురుషుడు మందగొల్ల శాఖకు చెందిన గొల్ల వ్యక్తి అని చెప్పబడింది. ఈ కథ ప్రకారం మందెచ్చుల మూలపురుషుడు మందగొల్ల శాఖకు చెందిన గొల్ల

కులస్థుడు. అప్పుడు మంధెచ్చులవారు గూడా గొల్లలే అయిఉండాలి. మూడవ కథలో మందెచ్చులవారి మూలపురుషుడు గొల్లలలో ఒక శాఖ అయిన ఆలగొల్ల శాఖకు చెందిన జగ్గన్న. ఇతను గూడ గొల్ల కులస్థుడే. ఈ కథ ప్రకారం ఇప్పటి మందెచ్చులు గొల్లలు అయి ఉండాలి. నాలుగవ కథలో యాదవ కులానికి చెందిన ఐతమరాజు తన ఆడపడుచు అయిన పాపనూక శాపం కారణంగా మరసటి జన్మలో, గొల్లల 'అర్తివాడు'గా జన్మించినట్లు చెప్పబడింది. ఈ నాల్గవ కథలో వీరి కులం చెప్పబడలేదు.

పై కథల్లో రెండు, మూడు కథల ప్రకారం మందెచ్చుల వారి కులం యాదవ లేక గొల్ల అయి ఉండాలి. కాని వీరు యాదవులు లేక గొల్లలు కాదు. జంగాలలో ఉన్న స్థిర జంగాలు, చరజంగాలు, విశేషజంగాలు, సామాన్యజంగాలు, మాహేశ్వరజంగాలు, గణాయత జంగాలు, స్థావరజంగాలు, ఊరజంగాలు మొదలైన అనేక ఉపకులాల్లో బుడగజంగం అనే ఉపకులానికి చెందినవారు. జంగాలలో మాలజంగం, బేడజంగం, బుడగజంగం కులాలు నిమ్న కులాలుగా పరిగణింపబడి షెడ్యూల్డ్ కులాల జాబితాలో చేర్చబడ్డాయి. కాబట్టి రెండు మూడు కథలు హేతువుకు నిలిచేవి కావు. నాల్గవ కథలో పాపనూక శాపం కారణంగా ఐతమరాజు 'గొల్లల అర్తివాడు'గా జన్మించినట్లు చెప్పబడింది. శాపవృత్తాంతం హేతువుకు నిలచేది కాదు. దీన్ని మందెచ్చుల వారు కల్పించి ఉంటారు. ఇక మిగిలినది మొదటి కథ. ఇది హేతుబద్ధమైనదిగా, నమ్మదగినదిగా కనిపిస్తూ వుంది. మందెచ్చుల వారి మూలపురుషుడు గొర్రెలమంద యజమానికి, శారద కాంద్ర స్త్రీకి జన్మించినవాడు. శారదకాంద్ర స్త్రీ తమ కులస్థుడు కాని యాదవునితో అక్రమ సంబంధం పెట్టుకని గర్భవతి అయింది. కాబట్టి శారదకాంద్రు ఆమెను తమ కులం నుంచి వెలివేశారు. ఇది నమ్మదగినదే. గాయక భిక్షుకులు తమ స్త్రీలు వ్యభిచారం చేస్తే కులబహిష్కరణ చేయడం ఆచారం. ఆ రోజుల్లో కులపట్టింపులు ఎక్కువగా ఉండేవి కాబట్టి ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకున్న మంద యజమాని ఆమెను పెళ్లి చేసుకోవడం గానీ, ఆమెను ఆదరించడం గానీ చేయలేకపోయాడు. ఆసహాయురాలూ, ఏ దిక్కులేని శారద కాంద్రస్త్రీ ఎక్కడికీ వెళ్లలేక మంద దగ్గరనే ఉండడం, మంద దగ్గర ఉన్న యాదవులు దయదలచి ఆమెకు అన్నం పెట్టడం, ఆమెకు పుట్టిన బాలుడు మంద దగ్గరే పెరగడం కూడా నమ్మదగినదిగా ఉంది. బాలునికి శారదకాంద్ర లక్షణమైన కథలు చెప్పడం వచ్చి ఉంటుంది. లేదా అతని తల్లి అతనికి చిన్నప్పటి నుంచి కథలు చెప్పడం నేర్పించి ఉంటుంది. శారదకాంద్ర స్త్రీలు మగ వారితో కలిసి కథలు చెబుతూ ఉంటారు. అందువల్ల ఈమెకు గూడ కథ చెప్పడం వచ్చి ఉంటుంది. తనకు వచ్చిన కథలను ఆమె తన కుమారునికి నేర్పించి ఉంటుంది. తర్వాత ఆబాలుడు యాదవకథలైన



కాటమరాజు కథలను చెప్పడం ప్రారంభించి ఉంటాడు. అందుకు యాదవులు ఆ బాలునికి ధనం, ధాన్యం ఇచ్చి ఉంటారు. ఆ బాలుడు, ఆ తర్వాత అతని సంతానం వారు తరతరాలుగా కాటమరాజు కథలను చెబుతూ తెలంగాణా ప్రాంతంలోని యాదవులను యాచిస్తూ జీవిస్తూ ఉంటారు. అయితే వీరికి మందెచ్చులవారు అనే పేరు తర్వాత కాలంలో వచ్చి ఉంటుంది. వీరు తర్వాత కాలంలో యాదవుల మందకు దిష్టి తగలకుండా మంద ఎక్కువ కావడానికి బలి చల్లడం మొదలైన పూజా కార్యక్రమాలు చేస్తూ ఉంటారు. ఆ విధంగా యాదవుల మంద హెచ్చడానికి దోహదం చేస్తుండడం వల్ల వారికి మందెచ్చుల వారనే పేరు వచ్చి ఉంటుంది.

మందెచ్చుల వారికి ఉన్న 'మందుచ్చోళ్లు' అనే పేరును గురించి పరిశీలించ వలసి ఉంది. చదువు సందెలు లేని ప్రజల వ్యవహారంలో 'మందెచ్చులోళ్లు' అనే పేరు 'మందుచ్చోళ్లు'గా మారి ఉంటుంది. మొదటి కథ ప్రకారం వీరికి ఉన్న మరొక పేరు పొడపోతులవారు. ఈ పేరు వీరికి అంత ప్రసిద్ధంగా లేదు. వీరిని ఈ పేరుతో ఎవరూ పిలువరు. ఒకవేళ వీరికి ఆ పేరు ఈ కథలో చెప్పినట్లుగా వీరి మూలపురుషునికి యాదవులు పొడలు ఉన్న పోతును ఇవ్వడం వల్ల వచ్చి ఉండవచ్చు. పై కారణాల చేత మందెచ్చుల వారి కులోత్పత్తి గాథల్లో మొదటి కథ సరి అయినదని, హేతుబద్ధమైనదని చెప్పవచ్చు. రెండు, మూడు, నాలుగు కథలను తర్వాత కాలంలో తమ మూలపురుషుడు కాటమరాజు కాలం నాటి వాడు అని గొప్పగా చెప్పుకోవడానికి వీలుగా మందెచ్చుల వారు కల్పించి ఉంటారు.

మందెచ్చులవారు జానపద గాయకభిక్షుకుల శాఖను చెందుతారు. వీరు ప్రదర్శించే కళ కులకథాఖ్యానశాఖకు చెందుతుంది. వీరు తమ కళాప్రదర్శనలో కాటమరాజు కథలను మరికొన్ని ఇతర కథలను గానం చేస్తారు. కాబట్టి ఇది సాహిత్యం ఉన్న జానపద కళ. ఈ కళ తెలంగాణ ప్రాంతంలో మాత్రమే ప్రదర్శింపబడుతూ వుంది. కాబట్టి ఇది ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమైన కళ. ఈ కళా ప్రదర్శనలో పురుషులు స్త్రీలు గూడా పాల్గొంటారు. సాధారణంగా వీరు తమ కళను రాత్రిపూట మాత్రమే ప్రదర్శిస్తారు. ఈ కళను మందెచ్చులవారు వంశ పారంపర్యంగా ప్రదర్శి స్తున్నారు. ఈకళను వీరు యాదవుల కోసమే యాదవుల ఇళ్ళ దగ్గర ప్రదర్శిస్తారు. ఐనప్పటికీ మిగిలిన కులాల వారు గూడా వీరి కళను చూడడానికి వస్తారు.

## బైకాని వారు- స్వరూప స్వభావాలు- చరిత్ర :

బైకాని వారు ఎర్రగొల్ల శాఖకు చెందిన యాదవులు. వీరు తెలంగాణాలోని

వరంగల్ జిల్లా తొర్రూరు మండలంలో పోలేపల్లి, చీకటాయపాలెం గ్రామాల్లోనూ, తుంగతుర్తి మండలం వెంపటి గ్రామంలోనూ, మహబూబాబాద్ మండలంలోని జయ్యారం గ్రామంలోనూ, నల్గొండ జిల్లా తిరుమలగిరి మండలం వడ్డెకొత్తపల్లి, మామిడాల గ్రామాల్లోనూ ఉన్నారు. ఈగ్రామాల్లో తండు, మట్ట, దొంగర, ఎర్రబోయిన, చెన్నెబోయిన, దండెబోయిన, మెట్టు, కనకబండి, గొడ్డటి, జవ్వాది, బురుక, తరాల మొదలైన ఇంటిపేర్లతో వీరున్నారు. వీరు వరంగల్, నల్లగొండ జిల్లాల్లోని సద్దనపు గొల్ల, ఎర్రగొల్ల, పూజగొల్ల, పాకనాటిగొల్ల, పెదవీటిగొల్ల మొదలైన శాఖలకు చెందిన యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు. ఈయాదవులు వీరిని తమ కులగురువులుగా భావించి గౌరవిస్తారు. బైకానివారు కంసునికథ లేదా కృష్ణభాగవతం, వలరాజు కథ, పంపాద్రి కథ, పెద్దిరాజు కథ, జన్నివాడ కథ, పాపనాశి కథ, నల్లనూకరాజు కథ, ఎర్రయ్య కథ, కర్రావులరాజు కథ, కాటమరాజు కథ, నెల్లూరి యుద్ధం, గంగతర్క వాదం, ఎరనూకరాజు కథ, మొదలైన కాటమరాజు కథలతో పాటు సౌనమ్మ కథ, బొంగురాళ్ళ కథ, సారంగధర కథ, బైకారం కథ మొదలైన ఇతర కథలను గూడా చెబుతారు. యాదవులు, మిగిలిన గ్రామీణులు వీరిని బైకాన్లు, బైకానోళ్ళు అని పిలుస్తారు. వీరి ప్రధానవృత్తి తమకు హక్కుగా వస్తూవున్న గ్రామాల్లో ఉన్న యాదవుల ఊర్లకు వెళ్ళి కాటమరాజు కథలను చెప్పి వారి దగ్గర తాగం తీసుకోవడం.

" బైకాని " పదం " బయకాడు " శబ్దం నుంచి వచ్చినట్లుగా కనిపిస్తూ వుంది. ఈపదానికి శబ్దరత్నాకరం " రాగమును బయలుపరుచువాడు, గాయకుడు" అనే అర్థాలను, ఆంధ్రశబ్దరత్నాకరం" స్వరాదులను ప్రకటించువాడు, వైణికుడు, పాటపాడువాడు, గానము నేర్పు ఉపాధ్యాయుడు, జంత్రగాత్రములు రెండింటి యందును నేర్పుగల గాయకుడు" అనే అర్థాలను, సూర్యరాయాంధ్ర నిఘంటువు "స్వరాదులను ప్రకటించు వాడు, వైణికుడు, గాయకుడు, పాటపాడువాడు, రాగమును వెలువరించు వాడు, గానవిద్యోపాధ్యాయుడు, జంత్రగాత్రములు రెండింటి యందును నేర్పుగల గాయకుడు" అనే అర్థాలను ఇచ్చాయి. అంతేగాకుండా శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువులు అవి చెప్పిన అర్థాల్లో ప్రాచీన కవులు ప్రయోగించిన ప్రయోగాలను గూడా ఇచ్చాయి. పైఅర్థాల్లో" రాగమును బయలుపరుచువాడు, గాయకుడు, పాటపాడువాడు, జంత్రగాత్రములు రెండింటి యందును నేర్పుగల గాయకుడు" మొదలైన అర్థాలు బైకాని వారికి సరిపోతాయి. బైకాని వారు కథ చెప్పేటప్పుడు చక్కగా రాగం తీస్తారు. వీరు కాటమరాజు కథలను ఎక్కువగా గేయరూపంలో పాడుతారు. వీరిలో ప్రధానకథకుడు కాళ్ళకు గజ్జలు కట్టుకొని



లయబద్ధంగా చిన్ననాట్యం చేస్తూ పాట రూపంలో కథను చెబుతాడు. ఇతని పక్కన నలుగురు వ్యక్తులు రెండు జతల చిన్నతాళాలను, రెండు జతల వీరణాలను శ్రుతిబద్ధంగా వాయిస్తూ ప్రధాన కథకుని పాటకు సంగీతాన్ని సమకూరుస్తారు. అందువల్ల బైకాని పదం బయకాడు పదం నుంచి వచ్చి ఉంటుందని చెప్పవచ్చు. బయకాడు వ్యవహారంలో బైకాడు అవుతుంది. బైకాడు ఏకవచనం. బహువచనంలో 'లు' చేరి బైకాడు+లు = బైకాడ్లు అవుతుంది. అదే వ్యవహారంలో బైకాండ్లు అవుతుంది. అదే బైకాన్లు అవుతుంది. అలాగే 'బైకాడు' పదానికి 'వారు' చేర్చినప్పుడు బైకాడులోని 'డు' నిగా మారి 'బైకానివారు' అవుతుంది. బైకానివారు వ్యవహారంలో బైకానివాళ్ళుగా, ఆదే బైకానోళ్ళుగా మారుతుంది.

బైకాని వారి దగ్గర తాము చెప్పే కాటమరాజు కథలకు సంబంధించిన తాళపత్రగ్రంథాలున్నాయి. నేను పోలేపల్లి గ్రామంలో ఉన్న తండు భిక్షం గారిని కలుసుకొని బైకానివారి గురించిన వివరాలను రాసుకున్నాను. భిక్షం గారి దగ్గర కృష్ణభాగవతం, పెద్దిరాజు కథ, నల్లనూకరాజు కథ, ఎరనూకరాజు కథ, సింహాద్రి కథ, పోలురాజు కథ, ఆవులమేపు, గంగ తరకవాదం, నెల్లూరు యుద్ధం, బొల్లావు యుద్ధం, భక్తుని కథ మొదలైన కాటమరాజు కథలకు సంబంధించిన పద్యాలుగు తాళపత్ర గ్రంధాలున్నాయి. వీరు తమ దగ్గరున్న తాళపత్రగ్రంధాల్లోని కథలనే చెబుతున్నారు. భిక్షం గారికి 90 సంవత్సరాలకు పైగా వయస్సు ఉంది. నోట్లో పళ్ళన్నీ ఊడిపోయాయి. అయినప్పటికీ వీరు ఎంతో స్పష్టంగా కాటమరాజు కథలను ధారాళంగా ఎలాంటి తడబాటు లేకుండా పాడగలుగుతున్నారు. వీరి ధారణాశక్తి అద్భుతమైనది, అమోఘమైనది. తెలుగువిశ్వవిద్యాలయం జానపద కళారంగంలో 2006వ సంవత్సరపు ప్రతిభా పురస్కారాన్ని 2007 ఆగష్టు 27వ తేదీన భిక్షం గారికి ప్రదానం చేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు వీరికి నెలకు 500 రూపాయలు పించను ఇస్తున్నారు. వీరితో నేను పోలురాజు కథను, కృష్ణభాగవతాన్ని పాడించాను.

బైకానివారు మూడు సంవత్సరాలకొకసారి తమకు హక్కుగా వస్తున్న గ్రామాలకు యాచనకు వెళ్తారు. అలా వెళ్ళేటప్పుడు వీరు ఎనిమిది మంది వరకు వెళ్తారు. ఎనిమిది మందిలో ఒకరు ప్రధానకథకుడుగాను, ఒకరు ప్రధానకథకుడు గేయరూపంలో చెప్పిన దాన్ని వచనంలో అర్థం చెప్పేవాడుగానూ(ఇతణ్ణి అర్థగాడు అంటారు.), నలుగురు రెండు జతల వీరణాలను, రెండు జతల తాళాలను వాయించే వారుగానూ, మిగిలిన ఇద్దరు వంతలుగాను ఉంటారు. వీరు తమ వెంట స్త్రీలను తీసుకు వెళ్ళరు. పురుషులు మాత్రమే వెళ్తారు. మొదట వీరు గ్రామంలోని పెద్దగొల్ల ఇంటికి వెళ్ళి కైవారం చేస్తారు. కైవారం అంటే పొగడ్త లేక ప్రశంశ, ఆకైవారం ఇలాగుంటుంది.

"విజయీభవ యాదవనందన అయోజ్య నందన కుంబినూతురంగమ యదుష్టి బోజాంతక వుత్తర పురూకాంతక విష్ణుముద్ర పడిగెలు వింజామరములు ఆందున్న పడిగెలు ఆలవట్నమూలూ ఈనితే నీమేక ఇల్లల్ల పండుగ సస్తే నీమేక చాలా పండుగ డోలుడమామీలు దొరసాని నీమేక యాదవముకదీరా రాను మావొంతు రక్షించ మీవంతు విజయీభవ దుర్గవిజయీబవ "

ఆతర్వాత వీరు ఊర్లో వున్న మిగిలిన యాదవుల ఇళ్ళకు వెళ్ళి వారికి గూడా కైవారం చేసి యాదవుల అడ్డివారమైన తాము వచ్చినట్లుగా తెలియజేస్తారు. పెద్దగొల్ల బైకానివారు ఉండడానికి ఒక ఇళ్ళు చూపించి వారి వంటకు అవసరమైన బియ్యం, పప్పు, ఉప్పు మొదలైన అన్ని వస్తువులను కొట్టులో ఇప్పిస్తాడు. ఆవస్తువులతో వారు అవూర్లో ఉన్నంత కాలం వంట చేసుకుంటారు. మరుసటి రోజు బైకానివారు ఊర్లో ఉన్న గొర్రెలమంద దగ్గరికి వెళ్ళివస్తారు. ఆరోజు రాత్రి పెద్దగొల్ల ఇంటి దగ్గర కాటమ రాజు కథల్లో యాదవులు చెప్పమన్న కథను చెబుతారు. మూడవనాడు యాదవుల ఇళ్ళకు వెళ్ళి వారి దగ్గర నుంచి తాగం ఇప్పించుకొని వేరే ఊరికి వెల్లి పోతారు. ఒక వేళ ఎవరైనా ఆరోజు తాగం ఇవ్వకపోతే మరుసటి రోజుండి తాగం తీసుకున్న తర్వాతనే మరొక ఊరికి వెళ్ళిపోతారు. యాదవుల నుంచి తాగం తీసుకున్న ప్పుడు వీరు యాదవులను ఇలా దీవిస్తారు. "సర్వేశ్వరా కొండలింగమా ఆచంద్రతారార్క సంపద గలిగి సౌదమ్మంత సంపద గలిగి గంగంత కల్మి గలిగి లింగమంత కరుణ గలిగి పుత్రా కుమార్లు పవిత్రా మనమలు ఒక్కింటి పట్టు వెయ్యిండ్లు గలిగి విజయీభవ యాదవనందన ఆయోజ్య నందన కోటి వెయిల గొర్రె కొదమలు బెట్టి, ఆరు వెయిల మేక అమడాలు బెట్టి బసవన్నంత బాగ్గెములు గలిగి బొల్లావంత భోగం గలిగి ఒక్కింటి పట్టు వెయ్యిండ్లు గలిగి ఎప్పటికి మీవంశం ఎగరాశి గలిగి వంశం వంశాభివృద్ధిరస్తు గలిగి గోత్రం గోత్రాభివృద్ధిరస్తు గలిగి సుభోజ్జయం గలిగి విజావిజయీభవ దుర్గవుజయీభవ".

బైకానివారు తమ కళాప్రర్శన సందర్భంగా కాటమరాజు కథలను పాడుతారు. అందువల్ల ఇది సాహిత్యమున్న కళ. వీరు తమ కళను పగలు రాత్రి అనే తేడా లేకుండా అన్ని వేళలా చెబుతారు. ఈకళాప్రదర్శనలో పురుషులు మాత్రమే పాల్గొం టారు. స్త్రీలు గానీ పిల్లలు గానీ పాల్గొనరు.ఈకళను బైకాని వారు మాత్రమే ప్రదర్శిస్తారు. ఇతరులు ప్రదర్శించరు. అందువల్ల ఇది బైకానివారికి మాత్రమే పరిమితమైన కళ. అంతేగాకుండా ఈకళను తెలంగాణాలో మాత్రమే ప్రదర్శిస్తారు. అందువల్ల ఇది తెలంగాణాకు పరిమితమైన కళ అని చెప్పవచ్చు. బైకానివారు ఈకళను తమ పోషకులైన యాదవుల ఇళ్ళ దగ్గర యాదవుల కోసమే మాత్రమే ప్రదర్శిస్తారు. ఐతే మిగిలిన కులాల వారు గూడా వీరి కళను చూడడానికి రావచ్చు. వస్తున్నారు కూడా.



## పాదసూచికలు

1. జానపద కళ గౌరవ సంప్రదాయం - డా॥ బి. రామాచార్యులు, పుట 63
2. బసవ పురాణం - 3 - 769, 770.
3. బసవ పురాణం - 5 - 731, 732.
4. కుమార సంభవం - 7 - 38 వ పద్యం.
5. కుమార సంభవం - 7 - 43 వ పద్యం.
6. కాశీఖండం - 2 - 30 వ పద్యం.
7. క్రీడాభిరామం - 143వ పద్యం.
8. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, డా॥ బి. రామాచార్యులు, పుటలు 80-83.
9. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, డా॥ బి. రామాచార్యులు, పుటలు 86,87.
10. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, డా॥ బి. రామాచార్యులు, పుటలు 115, 116.
11. మున్నీరు - నేదునూరి గంగాధరం, పుట 334.
12. పల్నాటి వీరచరిత్ర - బాలచంద్రుని యుద్ధం, శ్రీనాథుడు, పుట 34.
13. ఒగ్గుడోళ్ల నృత్యం - ఒక పరిశీలన, దూదిమెట్ల శ్రీనివాస్, పుటలు 49-53
14. చుక్కా సత్తయ్య గారు చెప్పినది.
15. తప్పెటగుళ్లు జానపద కళ - పల్లి తిరుపతి రావు, పుటలు 3,4
16. ఉత్తరాంధ్ర జానపదకళలు - బద్రి కూర్మారావు, పుట 73.
17. కాటమరాజు కథలు - మొదటి సంపుటం, పుటలు బీబీరిఖీరిరి
18. నెల్లూరు జిల్లా గంగ జాతరలు - కళారూపాలు - ఒక పరిశీలన, అముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం, దేరింగుల శ్రీనివాసులు, పుటలు 96,97
19. కాటమరాజు కథలు - మొదటి సంపుటం, పుటలు బీబీరిరిఖీ.
20. కాటమరాజు కథలు - మొదటి సంపుటం, పుట 558
21. నెల్లూరు జిల్లా గంగ జాతరలు - కళారూపాలు - ఒక పరిశీలన, దేరింగుల శ్రీనివాసరావు, పుటలు 43-45.
22. మరుపల్లి నివాసి పానుగంటి వేంకటరావుగారు చెప్పినది.
23. మరుపల్లి నివాసి పానుగంటి వేంకటరావుగారు చెప్పినది.
24. మరుపల్లి నివాసి పానుగంటి వేంకటరావుగారు చెప్పినది.

# యాదవుల జానపద కళలు - ప్రదర్శనా విధానం

ఈఅధ్యాయంలో నేను పరిశోధనకు స్వీకరించిన పదకొండు జానపదకళల ప్రదర్శనా విధానాన్ని గురించి వివరిస్తాను.

## గొరవయ్యలు - ప్రదర్శనా విధానం :

గొరవయ్యలు కురవ కులస్థులకు, మిగిలిన కులాల్లోని మైలారు స్వామి భక్తులకు గురువులు. వీరు భక్తుల ఇళ్ళలో జరిగే అన్ని శుభకార్యాలకు ముందు గొరవ పూజ చేస్తారు. ఈ గొరవపూజనే "ఒగ్గసేవ" అని అంటారు. దీన్నే "పాలు తాగడం" అని కూడా అంటారు. ఒగ్గసేవలో చివర గొరవయ్యలు పాలు తాగుతారు. అందువల్లనే దీన్ని "పాలుతాగే కార్యక్రమం" అని అంటారు. భక్తులు దీన్ని "పాలు పొయ్యడం" అంటారు. మైలారుస్వామి భక్తులు తమ ఇంట్లో గొరవపూజ చేయాలనుకున్నప్పుడు ఆ ఇంటి యజమాని కొత్తగుడ్డలో బండారు (పసుపు), ఒక రూపాయి కట్టి, గొరవయ్యలకు ఇచ్చి తమ ఇంటికి వచ్చి పూజ చేయమని కోరుతారు. అలాగే గణాచారిని కూడా ఆహ్వానిస్తాడు. నిర్ణయించిన రోజు గణాచారి, గొరవయ్యలు కలిసి తమను ఆహ్వానించిన భక్తుని ఇంటికి వస్తారు. భక్తుడు మొదట గణాచారి పాదాలను, ఆ తరువాత గొరవయ్యల పాదాలను కడిగి తన ఇంటిలోకి ఆహ్వానిస్తాడు. ఇంట్లో పూజాస్థలంలో గణాచారి కంబడిని చతురస్రంగా మడిచి సింహాసనాన్ని తయారు చేసిన తర్వాత గొరవపూజా కార్యక్రమాన్ని ప్రారంభిస్తాడు. గొరవయ్యలు గణాచారి ఎదురుగా తమ పానపాత్రలు అయిన దోణులను ఉంచుతారు. భక్తుడు ఆ దోణుల్లో పాలు, పెరుగు, పంచదార, అరటిపళ్ళు, నెయ్యి మొదలైన వాటిని వేస్తారు. గొరవయ్యలు తమ వేషంతో గణాచారి దగ్గర కూర్చుంటారు. గణాచారి పూజ పూర్తి చేసిన వెంటనే గొరవయ్యలు దేవుని మీద బండారును చల్లుతూ ఖడ్గాలను చెబుతారు. ఖడ్గాలు అంటే వచన రూపంలో చెప్పే దండకాలు. ఒక గొరవయ్య ఖడ్గం చెబుతూ ఉంటే మిగిలిన వాళ్ళంతా "అహహా దేవా" అని వంత పలుకుతూ ఉంటారు. ఖడ్గాన్ని గొరవయ్య వీరావేశంతో చెబుతాడు. ఒక్కొక్క వాక్యానికి ఒక తూగును ఇస్తూ చెబుతూ ఉంటాడు. ఒక వాక్యం పూర్తికాగానే మిగిలిన గొరవయ్యలు అహహా దేవా అని ముక్త కంఠంతో వంత పలుకుతూ ఉంటే చూడడానికి ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. గొరవ సంప్రదాయం కర్ణాటక నుంచి వచ్చినది కావడంవల్ల ఖడ్గాలు కొన్ని కన్నడ



భాషలో చెప్పేవి కూడా ఉంటాయి. తెలుగులో చెప్పేవి ఎలాగూ ఉంటాయి. ఈ ఖడ్గాలన్నీ ఈశ్వరుని మాహాత్మ్యాన్ని మైలారు దేవుని మహిమను చెప్పేవిగా ఉంటాయి.

శివుడు దక్షయాగాన్ని ధ్వంసం చేసిన సన్నివేశాన్ని వర్ణిస్తూ చెప్పిన ఈ ఖడ్గాన్ని గొరవయ్యలు దేవుని మీద బండారు చల్లుతూ చెబుతారు.

"అహహా దేవా! అహహా శివా ! భళిరే ఈశ్వరా !
ఈబూది ఒక చేత ఈరంగమొక చేత- గణగణా గణగణా ఘంట ఘల్లుమనగ
పచ్చాకుకు వేరై పైనిండ ఈబూది- వన్నె వస్త్రము నీది వీర పలక
పలక దాటించితే పగులునే భూమండలం- కులగిరి పర్వతం క్రుంగునే ధరణిలో
అహహా! దేవా ! అహహా శివా! భళిరే ఈశ్వరా- చేతి గజ్జెలు కూడా చెలరయ్యరిగితే
గడగడ భూతాలు గడుగుచుండవె మల్ల-అంతలోపల బంతి కావరించిన వానిని బట్టి
కండలు చెండి చెందవే నీచక్రాన- కోటి నాగుబాములు పైభూషణములు
కుడి యెడమ నరకంగ పెడబొబ్బ పెట్టంగ- దక్షయాగం బెల్ల తల్లడిల్లె
దక్షయాగానికి వచ్చె చేటని- చొచ్చిరి దేవతలు మూలముల
ఔర భద్ర! వీరభద్రా! మార్తాండ భైరవ యోగి- బహు పరాక్ ........ ఏలుకో"[1]

గొరవయ్యలు విఘ్నేశ్వరుని మీద కూడా ఖడ్గాలను చెబుతారు. ఈ కింది దండకం విఘ్నేశ్వరుని గురించి చెప్పినది. విఘ్నేశ్వరుని దండకం చెప్పే సందర్భంలో విఘ్నేశ్వర, పార్వతినందన, గజానన అని సంబోధిస్తూ ఉంటారు. విఘ్నేశ్వరునికి ఆరగింపు పెట్టే పదార్థాల గురించి దండక రూపంలో ఇలా చెబుతారు.

"అహహా దేవా! భళిరే ఈశ్వరా - ఈశ్వర కుమార విఘ్నేశ్వరా!
పార్వతినందన గజాననా -అహహా దేవా! భళిరే ఈశ్వరా!
విఘ్నేశ్వరుని ఏకోదండములు - మాగురువు పాదములకు ఏకోదండములు
తోరువు నీ బొజ్జకు ఏమేమి ఆరగింపులయా - గంద్రించిన చెరుకులు
గండదీయాలు పేరిన నేతులు బెల్లపచ్చులు - మీగడ పెరుగులు మినపానములు
చప్పటి వెన్నముద్దలు సద్దనానవాలు - బెల్లముతో చేసిన అతురాక్షులు
నూనెతో చేసిన నూరారు వంటలు - పప్పుతో చేసిన పదహారు వంటలు
కల్లంగి మాగిన ఖర్జుర ఫలములు - నిలువుగా మాగిన నిప్పపండ్లు
అందముగ మాగినా అరటి గెలలు - ఇటువంటి వన్ని నీకారగింపులయ్య
విద్యకు నీవాది బుద్ధికి నీవాది - చదువుకు నీవాది శాస్త్రంబునకు నీవాది
అహహా దేవా! భళిరే ఈశ్వరా - ఈశ్వర కుమార విఘ్నేశ్వరా
నాలుగు వేదములు ఆరు శాస్త్రములు-పజ్జెనిమిది పురాణములు

ఇరవై యొక్క దివ్యకోదండములలో - నిన్ను తలపని శబ్దంబు
ఒక్క నిమిషమైన జరగదయ్య - ఆఖండేశ్వరా బహుపరాక్ ఏలుకో".[2]

ఈ కింది ఖడ్గం మైలారు దేవుని గురించి చెప్పబడింది.

"అహహా దేవా
తెల తెల గుర్రంబులు మొజాగజంజాలు- మొగలి రేకులు బొంగుల గుర్రంబు
మేటి వసంతనంబు రాజాన రాజనంబు- ఉన్ని వస్త్రంబులు వచ్చెరా చేటని
ముక్కోటి దేవతలు మూలామూల ఉరకుతుండ- ఆకాశా గిరులన్ని ఆదిరి పడెను
బొంగుల గుర్రంబు మేటి వసంతనంబు- ఎదురొచ్చిన దైవాల ఏదురు శూల
గురి దప్పిన దైవాల గుండెల గూర్చి- ఆకలి గొంటినని అలుగులారగించి
నీ బొజ్జకి ఏమేమి ఆరగింపులయా- పండిన చెరుకులే పేరిన నేతులే
తెల్లంగ మాగిన టెంకాయ గెలలే- ఇటు వంటివన్ని నీ బొజ్జకి ఆరగింపులయా
ఈసుని కుమార విఘ్నేశ్వరా- సాంబశివ మైలారు లింగా!
మల్లికార్జునా ! ఏలుకో".[3]

కన్నడంలో చెప్పిన ఈ కింది ఖడ్గాన్ని కూడా గొరవయ్యలు చెబుతారు.

"అహహా దేవా! అండ పిండ బ్రహ్మాండవాద గిరియ మేళె
కట్టిద్దారే నమ్మ మల్లికార్జున స్వామి గుడి
నమ్మమల్కికార్జున స్వామి గుడిక్కె నాలుక్కు బాగిల్లయా
ఒందు ఒందు బాగిళింగే ఒందుఒందు దేవురే కావలయా- అహహా దేవా!
ఈ తూర్పు దిక్కు బాగిళిగే సూర్య దేవురే కావాలయా- అహహా దేవా !
ఈ పరమట దిక్కు బాగిళిరె చంద్రదేవురే కావాలయా- అహహా దేవా !
ఈ దక్షిణ దిక్కు బాగిళిరే నమ్మసిద్ధేశ్వరునే కావాలయ- అహహా దేవా !
ఈ ఉత్తర దిక్కు బాగిళిగే నమ్మ చౌడేశ్వరిదేవి కావాలయా- ఆహహా దేవా !
అండ పిండ బ్రహ్మాండ వాదగిరియ మేళె కట్టిద్దారే
నమ్మ మల్లికార్జున స్వామి గుండిముందు
ఒందు వజ్రస్తంభ వుట్టి ఇరవదనోడయా!
ఆస్తంభక్కి ఒందు సర్పిణి వుట్టి ఇరవద నోడయా
ఆసర్పిణి యిదు కందు తుంతి మీడదంతి
గొరవనన్నిరే జగత్తిరే పరమనన్నే రే
శ్రీగిరియ ఆదిమీన గొంది మల్లేశ్వరా బహుపరాక్".[4]

అండ పిండ బ్రహ్మాండాల్లో గొప్పదైన పర్వతం మీద మల్లికార్జునస్వామికి గుడి కట్టారు.



ఆ గుడికి నాలుగు వైపుల నాలుగు వాకిళ్లు ఉన్నాయి. తూర్పువైపున సూర్యుడు, పడమర దిక్కున చంద్రుడు, దక్షిణం వైపున సిద్ధేశ్వరుడు, ఉత్తరం వైపున చౌడేశ్వరీదేవి ఉన్నారు. స్వామి గుడి ముందు ఒక వజ్రస్తంభం ఉంది. దానికి కట్టి ఉన్న ఇనుప గొలుసును గొరవయ్య తంత్రిని మీటినట్లుగా సులభంగా తెంచుతాడు అని పై కన్నడ ఖడ్గం యొక్క భావం.

ఇలా ఖడ్గాలు చెప్పిన తరువాత గొరవయ్యలు కొన్ని పాటలు పాడతారు. ఈ పాటలు శివుని గురించి శివుని అవతారమైన మల్లయ్యస్వామిని గురించి వారి మహాత్మ్యాన్ని గురించి చెప్పబడతాయి.

"దండుతో వచ్చినాడా స్వామి- మల్లయ్య కొండపై నిలిచినాడా
శివశివ కొండపై నిలిచినాడా- కండె పరాక్కుడమ్మా మల్లయ్య
జగతికె కండేరాయుడమ్మా- ముత్యాల పేరు వాడాస్వామి
ముక్కంటి ఈశుడమ్మా- హరహర ముక్కంటి ఈశుడమ్మా
శివశివ ముక్కంటి ఈశుడమ్మా- తాను నమ్మిన కాపు నట్టింట్లో
తానై యుండు మైలార దేవుడు- కనక చెవ్వల కుంకుమ సోమారి
తన కొలువు నీ కొలువులో- దాపుట వలపుట దండినరులు
కండేరాయుని కొలువులు- దండుతో వచ్చినాడా స్వామి
మల్లయ్య కొండపై నిలిచినాడా- శివశివ కొండపై నిలిచినాడా
హర హర కొండపై నిలిచినాడా".[5]

గట్టు మల్లయ్య కొండ ప్రాముఖ్యతను, ప్రాశస్త్యాన్ని మహిమను తెలియజేసే పాట ఇది. గొరవయ్యలు పూజా సమయంలో గట్టుమల్లయ్య కొండ మాహాత్మ్యాన్ని తెలిపే కింది పాటను పాడుతూ ఉంటారు.

"శ్రీమించు ఇలలోన చెలగుచుండెడి కొండ- ఘనుల కాశ్రయమైన గట్టుకొండ
నవదుర్గముల కెల్ల సొగసు మించెడికొండ- దీనుల కాపాడు దేవకొండ
వేదవేదాంతులెల్ల విశ్రమించెడి కొండ- సాదు యోగులనెపుడు సాకు కొండ
అజ్ఞానులకు బోధమార్గంబుగల కొండ- భవబాములను బాపు పరమ కొండ
భూరి పనసాది పొన్నలు పొలువుగను- నారికేళాది ఖర్జూర నగము కలిగి
ఘనత మించిన కోనలు గబ్బి దేవళంబులు- గలిగి యుండెడి కొండ".[6]

గొరవయ్యలకు గట్టుమల్లయ్యకొండ చాలా ఇష్టమైన పుణ్యక్షేత్రం. ప్రతి దసరా పండుగకు ఆంధ్రదేశంలోని గొరవయ్యలే కాకుండా కర్నాటక నుంచి కూడా కొందరు గొరవయ్యలు ఈ పుణ్యక్షేత్రానికి వచ్చి మల్లయ్యస్వామిని దర్శించి తరిస్తూ ఉంటారు. అందువల్ల

ఆ పుణ్యక్షేత్రం మీద గొరవయ్యలు ఎక్కువ గీతాలను చెప్పారు. అలాంటి వాటిలో ఈ కింది గీతం ఒకటి. ఈ గేయంలో గట్టుమల్లయ్యకొండ శివకేశవులు, వీరభద్రుడు, విఘ్నేశ్వరుడు, గంగిమాళమ్మ, తుప్పదుమాలమ్మ, ఆదిశేషుడు, రామ లక్ష్మణులు, గోవిందరాజులు మొదలైన దేవతలు వెలసిన కొండ అని కీర్తించ బడింది.

"శివపురానికి పరమట దిక్కు- సిద్దులేలే మల్లయ్య కొండ
సాదులేలే మన స్వామి కొండ- శివ భక్తులాకు పూలహారాలే
శివ మల్లయ్యతాత కొండ- విష్ణువీశ్వరుడు నిలిచిన కొండ
వీరభద్రుడేలిన కొండ- విఘ్నేశ్వరుడు నిలిచిన కొండ
శివభక్తూలాకు పూలహారాలే- శివమల్లయ్యతాత కొండ
గిరియ మల్లయ్య నిలిచిన కొండ- గంగి మాళమ్మ నిలిచిన కొండ
శివభక్తులాకు పూలహారాలే- శివ మల్లయ్యతాత కొండ
అకండాలే వెల్గిన కొండ- ఆదిశేషుడే మోసిన కొండ
శివభక్తులాకు పూలహారాలే- శివమల్లయ్యతాత కొండ
రామలక్ష్మణులు నిలిచిన కొండ- రాజ్యమునకే పేరైన కొండ
రాజ్యమునకే వెలుగైన కొండ- శివభక్తులాకు పూలహారాలే
శివమల్లయ్యతాత కొండ- వెలుగుల మల్లమ్మ నిలిచిన కొండ
ఎక్కువైన మల్లయ్య వెలసిన కొండ- నిత్యపూజ జరిగేటి కొండ
శివభక్తులాకు పూలహారాలే- శివమల్లయ్యతాత కొండ
గోవిందస్వామి నిలిచిన కొండ- గొబ్బి ఆటలు ఆడిన కొండ
గోపాలస్వామి నిలిచిన కొండ- శివభక్తూలకు పూలహారాలే
శివమల్లయ్యతాత కొండ". [7]

ఈ విధంగా పాటలు పాడిన తరువాత గొరవయ్యలందరూ సింహాసనం చుట్టూ తిరుగుతూ నాట్యం చేస్తారు. నాట్యం చేస్తున్నంత సేపూ కుడిచేత డమరుకాన్ని, ఎడమ చేత పిల్లనగోవి పట్టుకొని వాయిస్తూ ఉంటారు. నృత్యం చేయడం పూర్తైన తరువాత చేతులను భూమిపైన పెట్టి కుక్కలాగ అరుస్తూ కుక్కలను అనుకరిస్తూ దోణిలో పోసిన పాలను తాగుతారు. పాలు తాగిన తరువాత భోజనం చేసి ఇంటి యజమాని ఇచ్చే దక్షిణలు కానుకలు తీసుకొని ఇంటిలోని వారందరికీ బండారు బొట్టు పెట్టి వారిని దీవిస్తూ దీవెనలు పలుకుతారు. దీవెనలు పలకడాన్ని "దీవనార్తి" అని అంటారు. వారి దీవెన పాట రూపంలో ఇలా ఉంటుంది.

"సాంబశివా మైలారులింగా మల్లికార్జునా- ఒకింటికి బట్టి వెయ్యిండ్లు గలుగనీ



మాళమ్మల్లాంటి ఆడుబిడ్డలు గలుగనీ- మల్లేసుడిలట్ల మగబిడ్డలు గలుగనీ
కోటి ఆవులు గలిగి తలుపు పాగలు కలిగి- మా ఒగ్గ దీవెన బ్రహ్మ దీవెనై
గొరవయ్యగారిచ్చిన దీవెన బ్రహ్మ దీవెనై- శిరోమాణిక్యములై చిరంజీవులై
కొడుకులు కుమారులై కోటి సంపదలు కలిగి- గొల్లమందలు పదిలక్షలు కలిగి
అన్నదమ్ములై ఆస్తి అనంతమై- బావమరుదులు బంధుత్వమై
మా గొరవయ్య దీవెన బ్రహ్మదీవెనై- సాంబశివ మైలారులింగ జయజగంబత్తి
ఏళుకోటి". [8]

పై విధంగా దీవించి గొరవయ్యలు తమ ఇళ్ళకు వెళ్ళిపోతారు. భక్తులు మైలారు క్షేత్రాల్లో జాతరల సమయంలో తప్పనిసరిగా గొరవయ్యలతో ఒగ్గసేవ చేయిస్తారు. అంతేగాక తమ ఇళ్ళలో జరిగే అన్ని శుభకార్యాలకూ ముందుగా ఒగ్గసేవ చేయిస్తారు.

గొరవయ్యల పూజా విధానంలో ఇంకొకటి "ఏళ్కోటి" పెట్టడం. మైలారు దేవునికి "ఏళుకోటి" అనే పేరు ఉంది. ఇది కన్నడం నుంచి వచ్చిన పదం. శివుడు ఏడుకోట్ల సైన్యంతో మణిమల్లాసురులతో యుద్ధం చేసి వారిని సంహరించినట్లుగా కన్నడ గొరవ సాహిత్యంలో చెప్పబడింది. అందువల్లనే శివునికి "ఏళుకోటి" అనే పేరువచ్చింది. గట్టు మల్లయ్య కొండలో దసరాపండుగ నాడు జరిగే జాతరకు మైలారు స్వామి భక్తులు ఎక్కువ సంఖ్యలో పాల్గొంటారు. ఆ సందర్భంగా భక్తులు మల్లయ్య స్వామికి ఏళుకోటి పెడతారు. ఏళుకోటి పూజను గొరవయ్యలు జరిపిస్తారు. ఈ పూజా సందర్భంగా భక్తులు గొరవయ్యలను తమ విడిదికి ఆహ్వానించి వారి కాళ్ళు కడిగి పూజించి వారి మెడలో పూల దండలు వేసి ఊరేగింపుగా దేవుని దగ్గరికి వెళతారు. ఇలా వెళ్ళేటప్పుడు దారి వెంట గొరవయ్యలు డమరుకం వాయిస్తూ పిల్లనగోవిని ఊదుతూ నృత్యం చేస్తూ పోతారు. దేవాలయానికి వెళ్ళి మల్లయ్యస్వామికి కొబ్బరికాయ, పూలు, పళ్ళు సమర్పిస్తారు. భక్తులు దేవుని ఎదుట గొరవయ్యలతో నృత్యం చేయిస్తారు. ఖడ్గాలు చెప్పించి పాటలు పాడిస్తారు. ఆ తరువాత దేవాలయం నుంచి మళ్ళీ ఊరేగింపుగా తమ విడిదికి వస్తారు. వచ్చేటప్పటికీ వంటకాలు సిద్ధంగా ఉంటాయి. వచ్చిన తరువాత గొరవయ్యలు విడిది స్థలంలో ఒకచోట నీళ్ళు చల్లి ముగ్గు వేసి పసుపు కుంకుమలను చల్లుతారు. అక్కడ త్రిశూలం, డమరుకం ఉంచుతారు. విస్తరాకు వేసి అందులో వండిన పదార్థాలన్నింటినీ పెడతారు. ఒక గొరవయ్య కొబ్బరి కాయ కొడతాడు. మిలిగిన గొరవయ్యలు బండారును తీసుకొని చల్లుతూ ఖడ్గాలు చెబుతారు. తరువాత పాటలు పాడతారు. నృత్యం చేస్తారు. ఇదంతా అయిపోయిన తరువాత చివర ఒక గొరవయ్య "జయ జగంబత్తి మల్లారి మార్తండ ఏళుకోటి" అని పలకగానే

మిలిగిన గౌరవయ్యులందరూ డమరుకం వాయిస్తూ "ఏలుకోటి ఏలుకోటి" అని గట్టిగా అరుస్తారు. ఆ తరువాత గౌరవయ్య లందరూ వరుసగా కూర్చొని భోజనం చేస్తారు. భోజనమైన తరువాత భక్తులు గౌరవయ్యులకు తమ శక్తికొద్దీ దక్షిణ ఇచ్చి నమస్కరిస్తారు. గౌరవయ్యులు వారికి బండారు బొట్టు పెట్టి దీవిస్తారు. ఆ తరువాత భక్తులు భుజిస్తారు. గట్టు మల్లయ్యకొండలో భక్తులు చేసే ఏలుకోటి సంప్రదాయం ఇప్పటికీ జరుగుతూనే ఉంది.

**గౌరవయ్యల నృత్యం :** జానపదుల జీవితం లాగా జానపద నృత్యం కూడా సరళంగాను, సహజంగాను, నిరాడంబరంగాను ఉంటుంది. ఈ నృత్యం నేర్చుకోవడానికి పెద్దగా కష్టపడనవసరం లేదు. అంతేకాదు గురువు కూడా అవసరం లేదు. గౌరవయ్యల నృత్యం జానపద నృత్యం కాబట్టి ఇది కూడా సరళంగాను, సహజంగాను, నిరాడంబరంగాను ఉంటుంది. దీన్ని సులభంగా నేర్చుకోవచ్చు. గౌరవదీక్షను తీసుకున్న కొత్త గౌరవయ్య కొంతకాలం పాటు పాత గౌరవయ్యల దగ్గర వారి నృత్యాన్ని చూసి వారిని అనుకరిస్తూ గౌరవయ్య నృత్యాన్ని నేర్చుకుంటాడు. అలాగే ఖడ్గాలను చెప్పడం, గేయాలను పాడటం, డమరుకం వాయించడం పిల్లనగోవిని ఊదటం మొదలైనవి నేర్చుకుంటాడు. గౌరవయ్యల నృత్యం జనాకర్షణగా ఉంటుంది. అసలు వీరి వేషమే కొత్తగా, ప్రత్యేకమైనదిగా ఉంటుంది. ఆవేషంతో వీరు నృత్యం చేస్తుంటే ప్రజలు తన్మయులై చూస్తుంటారు. గౌరవయ్యల నృత్యం మతసంబంధమైనది, శైవభక్తి ప్రధానమైనది. అంతేగాదు ఇది సామూహిక నృత్యం. గౌరవయ్యలు పండుగల సమయాల్లో గట్టు మల్లయ్యకొండ, శ్రీశైలం, మహానంది మొదలైన శైవక్షేత్రాలకు వెళ్ళి భక్తిపూర్వకరంగా నృత్యం చేసి భగవంతుని ఆరాధిస్తారు. మల్లారుస్వామి భక్తులైన ప్రజలు ఒగ్గసేవ తమ ఇంట్లో జరిపించేటప్పుడు గౌరవయ్యలు ఒగ్గసేవలో భాగంగా నృత్యం చేస్తారు. అలాగే భిక్షాటనకు వెళ్ళినప్పుడు గౌరవయ్యలు ప్రతి ఇంటికి వెళ్ళి నృత్యం చేసి ప్రజలు ఇచ్చే ధనాన్ని తీసుకొని వారిని ఆశీర్వదిస్తారు.

గౌరవయ్యలు నృత్యం చేసేటప్పుడు ఒకరి నుంచి మొదలుకొని ఎంతమందైనా ఉండవచ్చు. సాధారణంగా ఒకరి కంటే ఎక్కువమంది ఉంటే సరిసంఖ్య ఉండేలాగ చూసు కుంటారు. ఊరిలో ఇంటింటికీ తిరుగుతూ భిక్షమెత్తుకొనే సందర్భంలో వీరు ఎంతమంది ఉన్నప్పటికీ ఒకరు మాత్రమే నృత్యం చేస్తారు. ఇంటిముందు కుడిచేత డమరుకాన్ని వాయిస్తూ ఎడమచేత పిల్లనగోవిని పట్టుకొని ఊదుతూ గుండ్రంగా తిరుగడం, ఒక్కొక్క కాలిని నేలపై కొట్టడం, తల అటు, ఇటు తిప్పడం, డమరుకాన్ని ఉన్నట్టుండి ఒక్కసారిగా పెద్ద శబ్దం వచ్చేలాగ గట్టిగా వాయించడం, పిల్లల వెంటబడి పరిగెత్తడం, నడుమును వయ్యారంగా ఆడించడం మొదలైనవి గౌరవయ్యలు చేస్తారు.



గౌరవయ్యలు వాయించే డమరుక ధ్వనిని బట్టి గౌరవయ్యల నృత్యాన్ని "పెద్దచిటుకు", "చిన్నచిటుకు" అని రెండు రకాలుగా డా॥ బి. రామాచార్యులుగారు[9] వర్గీకరించారు.

**పెద్ద చిటుకు :** పెద్దచిటుకులో గౌరవయ్యలు డమరుకాన్ని పెద్దగా తారాస్థాయిలో వాయిస్తూ దానికి సమానస్థాయిలో పిల్లనగోవిని ఊదుతూ ఉంటారు. ఈ సమయంలో వీరు చేసే నృత్యాన్ని "పొట్టేళ్ళ అడుగు" అని అంటారు. రెండు పొటేళ్ళు ఒకదానితో ఒకటి పోట్లాడుకున్నట్లుగా వీరి నృత్యం ఉంటుంది. ఇందులో గౌరవయ్యలు రెండు వర్గాలుగా విడిపోయి వలయాకారంలో ఒకరికొకరు ఎదురెదురుగా నిలుచుంటారు. ఇలా నిలుచున్న తరువాత వీరందరూ డమరుకాన్ని పెద్దగా వాయిస్తూ తాము నిలబడి ఉన్న చోటనే ఒకసారి కుడి కాలును, మరొకసారి ఎడమకాలును పైకెత్తి ఎగురుతారు. అలా రెండుసార్లు ఎగిరిన తరువాత ఎదుటి వరసలోకి ఢీకొన్నట్లుగా ఎగిరి దూకుతారు. అలా దూకిన తరువాత తమ చుట్టూ తాము ఒక్కసారి తిరిగి వెంటనే కూర్చొని లేస్తారు. తరువాత మళ్ళీ కూర్చొని కుడికాలును ఒకసారి, ఎడమకాలును ఒకసారి పక్కకు చాచి మళ్ళీ వెనక్కు తీసుకుంటారు. నృత్యంలో పాల్గొన్న గౌరవయ్యలందరూ ఇలాగే చేస్తారు. తరువాత మొదటిసారి లాగానే మళ్ళీ అడుగులు వేసి మొదట వరసలోకి ఢీకొన్నట్లుగా ఎగిరి దూకి వస్తారు. ఇలాగ నాలుగైదు నిముషాలు చేస్తారు. నృత్యం చేస్తున్నంతసేపు కుడి చేత డమరుకాన్ని పట్టుకొని వాయిస్తూ ఎడమచేత పిల్లనగోవిని పట్టుకొని నోటితో ఊదుతూ ఉంటారు. గౌరవయ్యలు ఒక విధమైన వీరావేశంతో తారాస్థాయిలో డమరుకాన్ని వాయిస్తూ ఉంటే చూసే వారికి ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

**చిన్న చిటుకు :** డమరుకాన్ని చిన్నగా వాయిస్తూ చేసే నృత్యాన్ని చిన్నచిటుకు అంటారు. ఇందులో "గగ్గిరపోటు అడుగు, బజారుకోపు, బన్నిఅడుగు, ఒంటితిప్పుల అడుగు, కునుసు అడుగు అని ఐదురకాలున్నట్లుగా డా॥ బి. రామాచార్యులుగారు[10] చెప్పారు.

**గగ్గిరపోటు అడుగు :** ఇందులో గౌరవయ్యలందరూ ఒకే వరుసలో గుండ్రంగా నిల్చుంటారు. మొదట ఎడమకాలి పాదాన్ని పూర్తిగా నేలపై తాకించి కుడికాలి మొనవేళ్ళను నేలమీద తాకిస్తూ తన చుట్టూ తాను గుండ్రంగా తిరుగుతారు. ఇలా ఒకసారి చేసి వెంటనే మళ్ళీ వెనక్కు తిరుగుతారు. రెండవసారి కుడికాలి పాదాన్ని నేలపై పూర్తిగా తాకిస్తూ ఎడమకాలి మొనవేళ్ళమీద తన చుట్టూ తాను తిరుగుతారు. వెంటనే మళ్ళీ వెనక్కు తిరుగుతారు. ఇలా నాలుగైదు నిముషాల పాటు చేస్తారు. నృత్యం చేస్తున్నంత సేపు డమరుకాన్ని గౌరవయ్యలందరూ బుడబుడక్ అని వాయిస్తుంటారు. ఈ ధ్వనికి అనుగుణంగా పిల్లనగోవిని ఊదుతూ ఉంటారు.

**బజారు కోపు :** ఈ నృత్యాన్ని గౌరవయ్యలు సాధారణంగా ఊరేగింపు సమయంలో

చేస్తుంటారు. ఇందులో గౌరవయ్యలు పొడవుగా రెండు వరుసల్లో నిల్చుంటారు. అడుగులో అడుగు వేసుకుంటూ డమరుకం వాయిస్తూ పిల్లనగోవిని ఊదుతూ కొంత దూరం ముందుకు వెళ్ళి అందరూ గుండ్రంగా మారిపోతారు. ఇలా గుండ్రంగా ఉన్నప్పుడు ఏదో ఒక నృత్యానికి సంబంధించిన అడుగువేస్తూ కొంచెం సేపు ఉంటారు. తరువాత మళ్ళీ అందరూ రెండు వరుసలుగా విడిపోయి అడుగులో అడుగు వేసు కుంటూ మరలా కొంత దూరం వెళతారు. తరువాత మళ్ళీ గుండ్రంగా మారిపోతారు. ఈవిధంగా దారివెంట కాసేపు రెండు వరుసలుగాను, మరి కాసేపు గుండ్రంగాను ఏర్పడి మళ్ళీ రెండు వరసలుగా ఏర్పడి నృత్యం చేసుకుంటూ వెళతారు.

**బన్ని అడుగు :** ఇందులో గౌరవయ్యలందరూ గుండ్రంగా నిల్చుని ఉంటారు. ఒక్కొక్క గౌరవయ్య ఎడమకాలి పాదాన్ని పైకెత్తి నేలమీద కొడుతూ వెంటనే కుడికాలి పాదాన్ని వలయం లోపలికి తీసుకొనిపోయి నేల మీద కొట్టి మళ్ళీ వెంటనే వలయం వెలుపలికి తీసుకొనివచ్చి నేలమీదకు తీసుకొని వస్తారు. ఇలా మూడు నాలుగుసార్లు చేసిన తరువాత ఇంకొక భంగిమలోకి మారుతారు.

**ఒంటె తిప్పుల అడుగు :** ఇందులో కూడా గౌరవయ్యలు గుండ్రంగా నిలబడి ఉంటారు. ఎడమ కాలి మడమను పైకి లేపి కాలిమొనవేళ్ళను నేలపై తాకిస్తూ కుడికాలును పూర్తిగా పైకెత్తి ఎడమ కాలి వెనుక వైపుకు తీసుకొని పోయి నేలపై కొడతారు. ఇదేవిధంగా కుడికాలి మడమను పైకిలేపి ఎడమకాలిని పైకెత్తి కుడికాలు వెనుకకు తీసుకొనిపోయి నేలపై కొడతారు. ఇలా ఒక కాలు తరువాత మరొకకాలితో చేస్తూ కొద్దిసేపు అయిన తరువాత మరొక భంగిమలోకి వెళ్ళిపోతారు.

**కునుసు అడుగు :** దీన్ని "తిప్పుటడుగు" అని అంటారు. ఇందులోకూడా గౌరవయ్య లందరూ గుండ్రంగా నిల్చొని ఉంటారు. గౌరవయ్యలు మొదట ఎడమకాలును ముందుకు వేసి కుడికాలును దాని వెనుక పోనిస్తూ, మళ్ళీ కుడికాలును ముందుకు వేసి దాని వెనుక ఎడమ కాలును పోనిస్తూ అడుగువేస్తారు. ఇలా కొద్దిసేపు చేస్తారు. తర్వాత వేరే భంగిమలోకి మారిపోతారు.

ఇలా గౌరవయ్యలు వివిధ భంగిమల్లో నృత్యం చేస్తూ ఉంటారు. ఏ భంగిమలో నృత్యం చేసినా డమరుకం మోగిస్తూ ఉంటారు. డమరుకం ధ్వనికి అనుగుణంగా పిల్లనగోవిని వాయిస్తూ ఉంటారు. ఈ రెండు శబ్దాలకు అనుగుణంగా అడుగులు వేస్తూ ఉంటారు. అడుగులు వేసేటప్పుడు వారి కాళ్ళకు ఉన్న గజ్జెలసవ్వడి డమరుకం పిల్లనగోవి శబ్దంతో కలిసిపోతూ ఉంటుంది. గణాచారి మెడలో మద్దెలు వేసుకొని మద్దెలను వాయిస్తూ ఉంటాడు.



గౌరవయ్యలు నృత్యం చేసిన తరువాత నృత్యాన్ని ఆపేసి ఒకరు పాటను పాడతారు. మిగిలినవారు డమరుకాన్ని ఒక పక్క మాత్రమే నాలుగు వేళ్ళతో వాయిస్తూ వంత పాడుతూ ఉంటారు. ఇలా వంత పాడేటప్పుడు కొంతమంది ఒక కాలితో నేలపై కొడుతూ ఉంటారు. అలా కొట్టినప్పుడు వారి కాలిగజ్జెలు శబ్దం చేస్తూ ఉంటాయి. అలాంటి సందర్భంలో పాడేపాట ఇది.

"శివుడు నీవయ్య శ్రీశైలమల్లయ్య- కానగ రావయ్యా శివయ్యా
సిక్కు జడలవాడు శివనీలకంటుడు- పైనిండ యీబూది మహాశివుని
మెడలోన రుద్రాచ్చలు దేవాదిదేవా ॥శివుడు॥
సన్నా కమ్మాడి తెచ్చి సరిమడత వేయించి- గుండు మల్లెల పోసి దేవాదిదేవా
గుండు మల్లెలపైన శివుని కొప్పురి పెట్టి- పాలు బెల్లం పోసెనే మహాశివుని
మనసార తను కొలిసెను దేవాదిదేవా- వారమారము నాడు సోమవారము నాడు
నానందమయ్యేడు శివుడు వానందమయ్యేడు ॥శివుడు॥[11]

పై గేయంలో శ్రీశైలం మల్లికార్జునస్వామిని తనకు దర్శనమిమ్మని భక్తుడు ప్రార్థిస్తున్నాడు. కంబడితో సింహాసనం తయారుచేసి సోమవారం నాడు శివుని పూజిస్తే శివుడు ఆనందపడతాడని కూడా ఆ భక్తుడు భావిస్తున్నాడు.

ఇలాంటి సందర్భంలోనే మరొక గేయాన్ని కూడా గౌరవయ్యలు పాడతారు. ఈ గేయాన్ని కూడా ఒక గౌరవయ్య పాడుతూ ఉంటే మిగిలిన వాళ్ళు డమరుకాన్ని వేళ్ళతో వాయిస్తూ వంత పాడుతూ ఉంటారు.

"యాట వెళ్లెను చూడరే మల్లేసుడు- యాట వెళ్లిన చూడరే మల్లేసుడు
స్వామి యాట ఎళ్ళిన చూడు - సాటిలేని గట్టసామి మల్లేసురుడు ॥యాట॥
సామి మెరుపు చందన కాయ - మెడనిండా తెల్పాలు ముందు గంగవ పాలు
ముడిసి పుట్టన బోసి క్రన్నులు దాగిన గురనీల జంగాము
కన్నె జింకను యీబూదిని బట్టి- తనలోన బల్కిన శివ నీలకంటూడు ॥యాట॥
సామి మేలు బందరినాద మేటి వసంతూరు- భార్య బండేశ్వరుల బంగారు గొలుసులు
పైరేన 'ఒగ్గూలు' పెద్ద గంగుళమ్మ- సేరితుప్పెదవేళె సెలియ లిద్దరు గూడి
సేవ సేవకులంత సేసేరు నీసేవ- వాలూక జగమెల్ల యేలేటి సామి ॥యాట॥
చూడరమ్మా వందనిండ్లు చూడరమ్మ- చురటీలు జమిటీలు చూడుగ వెలుగాయె
గగనకి ముట్టంగ కదిలార నీ పరస- కదులు కర్నూలు వరకు
ఏ వంక చూసినా వెలలేక నీ పరస" ॥యాట॥[12]

పై గేయంలో గట్టుమల్లయ్యస్వామి వేటకు వెళ్ళిన విధం చెప్పబడింది. వేటలో జంతువుల

వెంట పరుగెత్తడం ఉంటుంది. అదేవిధంగా గౌరవయ్య ఈ పాటను వేగంగా పాడతారు. మిగిలిన గౌరవయ్యలు డమరుకాన్ని వేగంగా వాయిస్తారు. అంటే పాట అంతా వేగంగా నడుస్తుంది.

ఈ విధంగా ఈశ్వరునికి సంబంధించిన కొన్ని గేయాలను పాడిన తరువాత చివరిగా మంగళ గీతం లాంటి కింది గేయాన్ని పాడి తమ నృత్య ప్రదర్శనను ముగిస్తారు. దీన్ని కూడా ఒక గౌరవయ్య పాడితే మిగిలిన వారందరూ డమరుకాల్ని వాయిస్తూ వంత పాడతారు.

"శివ బండారు తలలో మల్లయ్య- యిబూది బండారు తలలో
శ్రీశైల మల్లయ్య యిబూది- శివ మానంది యీశురుని యిబూది ॥బండారు॥
గట్టుమల్లయ్యసామి బండారు- మాగంగమాళమ్మదేవి బండారు ॥బండారు॥
మైలారు లింగయ్య బండారు - శివసామి గోవింద రాజుని బండారు ॥బండారు॥
సువ్వెక్క లాడెనె బండారు - సామి కల్యాన మాడెనె బండారు
వైబోగమాడెనె బండారు[13]

ఈ విధంగా గౌరవయ్యల పూజ, నృత్య ప్రదర్శన జరుగుతుంది.

## సేవగరిడి - ప్రదర్శనా విధానం :

సేవగరిడి వైష్ణవ భక్తి ప్రధానమైన జానపదకళ. ఈ కళాప్రదర్శన చేసే వారిని దాసులు అని అంటారు. దాసులు తమ కళా ప్రదర్శన సందర్భంలో విష్ణువు యొక్క దశావతార కథలను గానం చేస్తారు. ఈ కథలు "హరిహరి నారాయణాది నారాయణ, కరుణించి మమ్మేలు కమలలోచనుడా" అనే వరుసలో ఉంటాయి. ఉత్తరాంధ్ర ప్రాంతంలో ఈ సేవగరిడి కళను కొన్ని యాదవ కుటుంబాల వారు తరతరాలుగా వంశ పారంపర్యంగా ప్రదర్శిస్తున్నారు. ఐతే ఈ కళాప్రదర్శన వీరి వృత్తి కాదు. ప్రవృత్తి మాత్రమే యాదవులే గాకుండా జాలరి, రెడ్డిక, కాళింగ, శెట్టిబలిజ, హరిజన కులాల వారు కూడా సేవగరిడి కళను ప్రదర్శిస్తున్నారు. ఐతే వారి సంఖ్య చాల తక్కువ.

సేవగరిడి కళలో బెత్తు, నెమలి కుంచె, కోల, తాళాలు అనే పరికరాలను ఉపయోగిస్తారు. ఈ పరికరాలను గురించి కొంత వివరించవలసి ఉంది.

**బెత్తు :** ఈ బెత్తును పేపరుచెట్టు కర్రతో చేస్తారు. ఇది తేలికగా మూడు అడుగుల నుంచి నాలుగు అడుగుల పొడవు ఉంటుంది. దీనికి మూడు గానీ, ఐదు గానీ కణుపులు ఉంటాయి. ప్రతి కణుపు దగ్గర, రెండు చివరల వెండి తొడుగు గానీ, రాగి తొడుగు గానీ ఉంటుంది. కళాప్రదర్శన సందర్భంలో ప్రధాన కథకుడు బెత్తును



ఎడమచేత మధ్యలో పట్టుకొని కథను చెబుతాడు. ఇలా బెత్తును పట్టుకొని కథను చెప్పే ప్రధాన కథకుణ్ణి బెత్తుదాసుడు అంటారు.

**నెమలి కుంచె :** దీన్ని నెమలి ఈకలతో చేస్తారు. ఇది నెమలి ఈకలతో చేసిన చీపురు కట్టలాగా ఉంటుంది. సేవగరిడి కళాప్రదర్శనలో ప్రధాన కథకుడు ఈ నెమలి కుంచెను కుడిచేత పట్టుకొని కథను చెబుతాడు.

**కోల :** కోలను ఇనుముతో చేస్తారు. ఇది రెండు రకాలుగా ఉంటుంది. ఒక దాన్ని "సాయిశిలల కోల" అని, ఇంకొక దాన్ని "బండి తిరపతి కోల" అని అంటారు.

**సాయిశిలల కోల :** ఇది మూడు అడుగుల పొడవు ఉన్న గొట్టం లాగా ఉండి చివర గొట్టం కన్నా వెడల్పుగా గిన్నె లాగా ఉంటుంది. ఈ గిన్నెలో వరితౌడు గానీ, లేక ఎండిన వరిగడ్డి గానీ ఉంచి దానిపైన గిన్నె చుట్టూ బాగా మందంగా గుడ్డను చుడతారు. గుడ్డ ఊడి రాకుండా పైన ఇనుపతీగను గట్టిగా చుడతారు. గుడ్డ మీద నూనె పోసి దాన్ని వెలిగిస్తారు. సేవగరిడి కళా ప్రదర్శనలో కోలను తిప్పే దాసుని కోలదాసుడు అంటారు. కోలదాసుడు సాయిశిలల కోలలను రెండింటిని రెండు చేతులతో పట్టుకొని తిప్పుతూ ఉంటాడు.

**బండి తిరపతి కోల :** దీని గొట్టం సాయిశిలల కోల కంటె పొడవుగాను, మందంగాను ఉంటుంది. చివర గిన్నెలాంటిది సాయిశిలల కోలలాగా నిలువుగా కాకుండా గొట్టానికి చివర ఒక వైపుకు ఉంటుంది. ఈ బండి తిరుపతి కోల సాయిశిలల కోల కంటె పెద్దగా, బరువుగా ఉంటుంది. దీన్ని సాయిశిలల కోల లాగానే వెలిగిస్తారు. ఇది పెద్దగా బరువుగా ఉండడం చేత కోల దాసుడు దీన్ని ఒక దాన్ని మాత్రమే రెండు చేతులతో పట్టుకొని తిప్పుతూ ఉంటాడు.

**తాళాలు :** తాళాలు చాలపెద్దగా ఒక అడుగు వ్యాసార్థం కలిగి ఉంటాయి. వీటిని చక్రాలు అని కూడా అంటారు. వీటిని కంచుతో చేస్తారు. ప్రతి తాళం మధ్యలో ఒక రంధ్రం ఉంటుంది. ఈ రంధ్రంలో నుంచి ఒక బద్దెను కడతారు. ఈ బద్దె తాళాన్ని పట్టుకోవడానికి వీలుగా ఉంటుంది. సేవగరిడి కళాప్రదర్శన సమయంలో తాళాలను వాయించే వారిని 'సేవదాసులు' అంటారు. సేవదాసులు రెండు చేతులతో రెండు తాళాలు పట్టుకొని వాటిని ఘంఘం అని వాయిస్తూ ఉంటారు. ఒక్కొక్క సేవగరిడి సంఘంలో ఈ తాళాల సంఖ్య ఒక్కొక్క విధంగా ఉంటుంది. కొన్నింటిలో పన్నెండు జతలు, మరి కొన్నింటిలో ఇరవై, ఇరవైఅయిదు జతలు ఉంటాయి. కొన్ని పెద్ద సంఘాల్లో యాభై వరకు తాళాల జతలు ఉంటాయి. ఈ తాళాల సంఖ్య ఎంత ఎక్కువగా ఉంటే ఆ సేవగరిడి సంఘం అంత పెద్ద సంఘంగా పరిగణింపబడుతుంది.

**ప్రదర్శనా విధానం :** ఈ కళా ప్రదర్శనలో ప్రధానంగా దశావతారాలను గానం

చేయడం ఉంటుంది. ప్రధాన కథకుడు కుడిచేత నెమలికుంచెను ఎడమచేత బెత్తును పట్టుకొని దశావతార కథలను పాడుతూ కథానుగుణంగా ముందుకు, వెనుకకు కదులుతూ చేతులు పైకెత్తి కిందికి దించుతూ కథను చెబుతూ ఉంటాడు. ప్రధాన కథకుడు బెత్తును పట్టుకొని ఉంటాడు కాబట్టి ఇతణ్ణి బెత్తుదాసుడు అంటాడు. ఈ బెత్తుదాసుని చుట్టూ సేవదాసులు నిలబడి తాళాలను "ఘంఘం" అని వాయిస్తూ బెత్తుదాసుడు చెప్పిన కథను తిరిగి వంతగా పాడుతూ ఉంటారు. కోలదాసుడు వెలుగుతున్న కోలను పట్టుకొని వంగి కథానుగుణంగా కుడి నుంచి ఎడమకు, ఎడమ నుంచి కుడివైపుకు, ఆ తరువాత నిటారుగా నిలబడి తన తలమీదుగా కోలను తిప్పుతూ ఉంటాడు. స్థూలంగా సేవగరిడి కళాప్రదర్శన స్వరూపం ఇది. ఇందులో కథాఖ్యానం ప్రధానంగా ఉంటుంది. అందువల్ల ఈ కళా ప్రదర్శనలో ప్రధాన కథకుడైన బెత్తుదాసుడు సూత్రధారి అని చెప్పవచ్చు.

బెత్తుదాసుడు దైవప్రార్థనతో కథను ప్రారంభిస్తాడు. ప్రార్థన "హరిహరి నారాయణాది నారాయణ కరుణించు మమ్మేలు కమలలోచనుడా" అనే చరణాలతో ప్రారంభమౌతుంది. ఆ ప్రార్థన ఇది.

"హరిహరి నారాయణాది నారాయణ-కరుణించు మమ్మేలు కమలలోచనుడా
శెంకు శెక్కారాల దాశవతారుడా- మీకు దండం సామి నీల ఎన్నుండ
నారాయణచ్చరము మాకు చెప్పిన గురువు- కంటమున బయలెల్లు గగనాయకుండ
నారాయణచ్చరము మాకు మొదలయ్యింది- పాడుదుము సిమ్మాద్రి భక్తులందరము
నారాయణో శివన్నారాయణో- నారాయణందురోయ్ నల్లనాసోమి"

అని విష్ణువును గురించి ప్రార్థిస్తారు. ఆ తరువాత విఘ్నేశ్వరుని ప్రార్థన ఇలా చేస్తారు.

"తొలుత శుభమస్తనచు ధూర్జటీ తనయుండ- దైవ గణనాథ మిము దలచి మొక్కుదుము
సర్వ విఘ్నంబులకు సమయింపగను జాలు- సర్వ విఘ్నేశ మిము సన్నుతించెదము
యేనుగా తొండాము ఎలుక సిరివాహనము- చాయెత్తు బంగారు చాయగలవాడా
పార్వతీ సుతుడనగ బ్రహ్మాదులెరుగుదురు- పాయకా నిను దలుతు పరలు గననాథా
హరి నిన్ను దలతుమో అన్ని జింహముగా- శివ నిన్ను దలతుమో స్వామి గననాథా
గందమచ్చింతాలు గరిక పూసలతోను- గననాద మీ పూజ గనముగా జేతు
మందార పుష్పములు చందనంబులతో- గననాద మీ పూజ గనముగా జేతు
కొట్టిన కొబ్బెరలు కొమ్మరిటి పల్లతో- గననాద మీ పూజ గనముగా జేతు
మదరాసి తేనెలు మాదిఫలములు తోను- గననాద మీ పూజ గనముగా జేతు"

ఆ తరవాత సరస్వతిని గురించి ఇలా ప్రార్థిస్తారు.





సేవగరిడి కళా ప్రదర్శన (నమ్మి అప్పలస్వామి బృందం, శివాజీపాలెం, విశాఖపట్నం)



సేవగరిడి కళా ప్రదర్శన (గొలగాని సింహాద్రి బృందం, శివాజీపాలెం, విశాఖపట్నం)



సేవగరిడి కళా ప్రదర్శన (నమ్మి అప్పలస్వామి బృందం, శివాజీపాలెం, విశాఖపట్నం)



సేవగరిడి కళా ప్రదర్శన (గొలగాని సింహాద్రి బృందం, శివాజీపాలెం, విశాఖపట్నం)

"శారదాంబా నీకు సన్నుతులు జేతును- జింహయందున నీవు తిరుగాడవమ్మా
అన్ని విద్యలుకెల్ల ఆటపట్టయినట్టి- అంబుజోద్భొరాణి ఆత్మలోదలతు"

ఆ తరవాత తమ ఇష్టదైవమైన సింహాద్రి అప్పన్నను తాముచేసే గరిడిసేవ దగ్గరకు రమ్మని ఇలా ప్రార్థిస్తారు.

"కొండమీదున్నావా కోదండ నరహరీ- కోటి దివ్వెలు పైన బెలుగుతున్నావా
దిగిరమ్మి నాస్వామి దివ్యతిరపతికి- ఆరగడియ మాగరిడిలానుకోవయ్యా
ఆరగడియ మాగరిడి లానుకుంటేని- అనుకోని మీసేవ పూని సేసెదము
కాశి నుండొచ్చేము కన్ని దాసులుము-మీసేవ కొచ్చేము మిమ్ము పాడేము
ఎండి జన్నదాలు ఏదాను యోదులము- నీ సేవకొచ్చేము నీల యెన్నుండా
పైడి జన్నీదాలు పట్టాబి దాసులుము-నీ సేవకొచ్చేము నీల యెన్నుండ
బండి తిరుపతి కోల బలువైన దాసులుము- నీ సేవ కొచ్చేము నీల యెన్నుండా
పున్న పెన్నెలు కోల పువ్వంటి దాసులుము- నీ సేవ కొచ్చేము నీల యెన్నుండా
ఎండి బెత్తులు వారు యోదానుయోదులము-నీ సేవ కొచ్చేము నీల యెన్నుండా
తోడ పెద్దావారము, తాళాలు వారుము-నీ సేవ కొచ్చేము నీలయెన్నుండా
ఏ గరిడి లున్నావు యేగేశపరుడా-మా గరిడికే రమ్మి మత్స్యావతారా
అరగడియ మాగరిడి లానుకుంటేని-అనుకొని మీసేవ పూని చేసెదము
ఎన్నూట అయివాద్య ఎనబయీ గరిడిలో-ఏ గరిడి లున్నావు ఏగేశ పరుడా
మా గరిడికే రమ్మి మత్స్యావతారా-అరగడియ మా గరిడి లానుకోవయ్యా
అరగడియ మాగరిడి లానుకుంటేని-ఆనుకొని మీసేవ పూని చేసెదము
లక్షడబ్బయికోట్లు దివ్యతిరపతిలోను-ఏ గరిడిలున్నావు యేగేశ పరుడా
మాగరిడికే రమ్ము మత్స్యావతారా"

ఏ పుణ్యక్షేత్రంలో ఉన్నా, ఏ గరిడి సేవలో ఉన్నా అక్కడ నుంచి తాము చేసే గరిడీకి రమ్మని పై విధంగా సింహాద్రి అప్పన్నను ప్రార్థిస్తారు.

ఈ దశావతార కథలన్నింటిని చెరసాలలో ఉన్న దేవకీదేవికి ఆమె గర్భంలో ఉన్న కృష్ణుడు చెబుతాడు. తన చెల్లెలైన దేవకికి పుట్టిన ఎనిమిదవ సంతానం వల్ల తనకు మరణం కలుగుతుందని జ్యోతిష్యుల ద్వారా విన్న కంసుడు దేవకి వసుదేవులను చెరసాలలో పెట్టి, ఆమెకు పుట్టిన ఏడుగురు కుమారులను నరికి చంపుతాడు. ఎనిమిదవ సారి గర్భం ధరించిన దేవకి కృష్ణుడు జన్మించడానికి ముందుగా తన అన్న దుర్మార్గాన్ని, అతని శక్తి సామర్థ్యాలను తలచుకొని పుట్టబోతున్న ఎనిమిదవ సంతానాన్ని కూడా తప్పనిసరిగా చంపివేస్తాడని భావించుకుంటూ దుఃఖిస్తూ ఉంటుంది. ఆ సమయంలో

ఆమె గర్భంలో ఉన్న కృష్ణుడు తాను సాధారణమైన వాణ్ణి కాదని అంతకుముందు తొమ్మిది అవతారాలు ధరించి అనేక ఘనకార్యాలు చేసిన శ్రీమహావిష్ణువునని, పదవ అవతారంగా శ్రీకృష్ణుడుగా జన్మించి కంసుని సంహరిస్తానని చెబుతాడు. అప్పుడు దేవకి అంతకుముందు ఎత్తిన అవతారాల గురించి అడుగుతుంది. దానికి సమాధానంగా తాను ఎత్తిన ఒక్కొక్క అవతారం గురించి ఒక్కొక్క కథగా కృష్ణుడు ఆమెకు చెబుతాడు. బెత్తుదాసుడు ఈ కళాప్రదర్శనలో మొదట విష్ణువును, తరువాత విఘ్నేశ్వరుని ఆ తరువాత సరస్వతీదేవిని తరువాత సింహాద్రి అప్పన్నను ప్రార్థించిన తరువాత కృష్ణుడు తన తల్లికి తాను ఎత్తిన అవతారాల గురించి చెబుతున్న విషయాన్ని ఇలా పాడతాడు.

"అమ్మలమ్మల తల్లి తల్లి దేవాకి- పగరాజు చెల్లెలా బత్తిగల మాతల్లి
ఎత్తినవు తారాల ఏద మిన్నావా-ముందటవుతారాల ముచ్చటిన్నావా
ఆ పలుకులిన్నాది తల్లి దేవాకి-ఏమంట పలుకుతది తల్లి దేవాకి
నాయనా నాయబ్బ నాముకుమారా-అష్టబూలోకాల కాదినారాయణ
పుట్టలేదురా కొడుక పొట్టలున్నావు- నువ్వేది అవుతారాలు ఎత్తినావురా
ఎత్తినవుతారాల ఏదమేమిటిరా- చెప్పరా ఒరె కొడకా చెవుల నింతాను
ఆపలుకులిన్నాడు నీలయెల్లుండు- ఏమంట పలుకుతడు నీల యెల్లుండు
అమ్మలమ్మలతల్లి తల్లి దేవాకి- అవుతారముల ముచ్చటమ్మ ఇంటావా"

అని తాను ఎత్తిన విష్ణువవతారాన్ని గురించి

"యిష్టుమౌతారాలు ఎత్తుండినాను-చెప్పుతానే తల్లి చెవులాలకించు"

అని విష్ణువవతార కథను చెబుతాడు. బెత్తుదాసుడు ఆ తరవాత విష్ణువవతార కథను పాడతాడు. బెత్తుదాసుడు రెండు పాదాలను పాడగానే అతని చుట్టూ ఉన్న సేవదాసులు అతను పాడిన ఆ రెండు పాదాలను తిరిగి వంత పాడుతూ ఉంటారు. బెత్తుదాసుడు కథను చెప్పేటప్పుడు కుడిచెయ్యిని పైకెత్తి ముందుకు వెనుకకు కదులుతూ ఉంటాడు. సేవదాసులు అతను పాడిన రెండు పాదాలను పాడుతూ తాము పట్టుకున్న తాళాలను ఘంఘం అని గట్టిగా వాయిస్తుంటారు. కోలదాసుడు కోలను తిప్పుతూ ఉంటాడు. ఇలాగ సేవగరిడి కళా ప్రదర్శన సాగుతూ ఉంటుంది. బెత్తుదాసుడు కథను చెబుతూ ఉన్నప్పుడు తమ గరిడి లోని దాసుడు గానీ లేక వేరే గరిడిలోని దాసుడు గానీ బెత్తుదాసుడికి ప్రశ్న వేస్తాడు. ఇలా ప్రశ్నించడాన్ని ఈ కళాకారులు "పంతం" అని అంటారు. ఈ పంతాలు దశావ తార కథలన్నింటిలోను ఉంటాయి. బెత్తుదాసుడు ని దాసుడు పంతాన్ని పాట రూపంలో అడుగుతాడు. ఉదాహరణకు విష్ణువవతారంలోని పంతాన్ని గురించి ఇలా ప్రశ్నిస్తాడు.



"పవను పట్నం సోమి పవ్వళించిననాడు- ఎవరెవరు వున్నారు సోమి సన్నతన
చెప్పండి దాసుల్లు చెవులనింతాను"

అని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా బెత్తుదాసుడు కూర్చొనే ఇలా పాడతాడు.

"అలయాగ మమ్మడుగు వోయి దాసులారా- సెప్పుతను దాసన్న చెవులాలకించు
పానుపట్నం సోమి పవ్వలించిన నాడు- వద్దున్న దేవతలు మద్దెలేసేరు
తుంబురులు నారదులు దండసుతి బట్టేరు- నెమలి పిట్టలు కొన్ని నాట్యంబు
లాడగ పానుపట్నం సోమి పవ్వలించేను- ఆదిలచ్చిమి తల్లి అస్త్రాల బట్టెను
మగవ లచ్చిమిదేవి మడమలొత్తేను- సింహలచ్చిమితల్లి శిరసులొత్తేను
పానుపట్నం సోమి పవ్వలించేను- దేవాన దేవతలు కూడుకున్నారు
సురకోటి దేవతలు కూడుకున్నారు- అష్టదిరి పాలకులు కూడుకున్నారు
ఆరందరు కూడి అరిసేవ జేసేరు- పానుపట్నం సోమి పవ్వలించేను
మరిసి నిద్దరవోయె మాదముడు సోమి- ఆర్నెల్లు నిద్దర ఆది కిష్టుడికి
ఎవరెవరు యున్నారు సోమి సన్నతన- ఇసనకర్రలవారు ఇలమూడు లచ్చలు
ఇరుబగల సురటీలు ఇసురుతున్నారు- అద్దంపు సెక్కిల్లు అయిసాని కూతుల్లు
పెదదిప్పి నాంచారి లాడుతున్నారు- వారంత యున్నారు సోమి సన్నతన"

ఈ విధంగా బెత్తుదాసుడు సమాధానం చెప్పగానే అతణ్ణి ప్రశ్నించిన దాసుడు -

"సెబయాసు దాసుడా సెల్లు నీపెగ్గు- ఎయ్యండి దాసునికి యెండి జన్నితము
కట్టండి దాసునికి గాజు కంకనము- నిన్ను మించినవాడు లోకమున లేడు
ఉన్నట్టు చెప్పేవు ఊగము లోపలను"

అని అతణ్ణి మెచ్చుకొని కూర్చొని ఉన్న అతనికి తన చేతిని ఆసరాగా ఇచ్చి లేపుతాడు. ఆ తరవాత బెత్తుదాసుడు తిరిగి మళ్ళీ కథను చెబుతూ ఉంటే అతని చుట్టూ ఉన్న సేవదాసుళ్ళు అతను పాడిన కథను తిరిగి పాడుతూ ఉంటారు.

కృష్ణావతారంలో ఇలాంటి పంతాలు ఎక్కువగా ఉన్నాయి. దేవకి చెరసాలలో ఉండి తనకు పుట్టబోయే ఎనిమిదవ సంతానాన్ని తన అన్న కంసుడు చంపివేస్తాడని దుఃఖిస్తూ ఉన్నప్పుడు ఆమె గర్భంలో ఉన్న కృష్ణుడు ఆమెతో తాను తప్పనిసరిగా పుట్టి కంసుడ్ని చంపుతానని చెబుతాడు. అప్పుడు దేవకి తనకు సంతానం కలిగిన వెంటనే కంసునికి తెలియజేయడానికి కంసుడు చాలా "కాపులను" పెట్టాడని ఇన్ని కాపులు ఉండగా ఏవిధంగా జన్మిస్తావని అడుగుతుంది. దీన్నే పంతంగా బెత్తుదాసుని మరొక దాసుడు ఇలా ప్రశ్నిస్తాడు.

"ఇన్నోటి కాపులు ఈ రీతిగున్నాయి- ఏరీతి జల్మాల కొచ్చాదు కృష్ణుడు

చెప్పండి దాసులు చెవుల నింతాము"

ఈ పంతానికి బెత్తుదాసుడు ఈ విధంగా సమాధానం చెబుతాడు.

"అలయాగ మమ్మడుగు వొయి దాసులారా- నెప్పుతను దాసన్న సెవులాలకించు
ఆలకించుమి దాసన్న అరగడియ రొద్దు-ఏటికే సారాలు ఆటి కేసితేను
మేపులా సందమున కాపు మరిసేను -ఆ సందుజల్మాల కొద్దునే తల్లి
ఆ పలుకులిన్నాది తల్లి దేవాకి-నాయనా నాయబ్బా నాముకుమారా
ఏటికేసారాలు ఎరగనోయి తండ్రి-ఆమాట లిన్నాడు నీల ఎన్నుండు
అమ్మరో నను గన్న తల్లిరో దేవాకి-ఏమేమి కాపులో ఎరిగింపవమ్మా
పగరాజు చెల్లెలా బత్తిగల మాతల్లి-ఏమేమి కాపులో ఎరిగించవమ్మా
చెప్పవే నాతల్లి చెవుల నింతాను-అప్పుడే మన్నాది తల్లి దేవాకి
పుట్టగానే బాలుణ్ణి మట్టి జంపామని-మదమత్తు ఏనుగులు కాపులుంచేడు
పుట్టగానే బాలుణ్ణి పొడిచి సంపామని-పోట్ల గఱ్ఱావుల్ని కాపులుంచేను
పుట్టగానే బాలుణ్ణి కరిసి చంపామని-కాట్ల బెబ్బులు తెచ్చి గయినొద్ద నుంచె
పుట్టగానే బాలుణ్ణి, నూరు చంపామని-నాగుపామును తెచ్చి నట్టింట నుంచె
పుట్టగానే బాలుణ్ణి, కల్లు పొడవమని-కరుకోటి పుంజలను కాపులెట్టేను
పుట్టగానే బాలుణ్ణి పిసికి సంపామని-పురుడు పీసాచుల్ని కాపు లెట్టేను
కాటి రాచ్చసుల్ని కాపులెట్టేను-ఇన్నోటి కాపులు ఈతీరు గుండె
ఆ పలుకులిన్నాడు నీల ఎన్నుండు- అమ్మరో ననుగన్న తల్లిరో దేవాకి
ఆలకించే తల్లి అరగడియ సేపు-మట్టి చంపామన్న మదమత్తు ఏనుగులకు
మఱ్ఱి రొడ్డారాలాటి కెయ్యమ్మా-పొడిచి చంపమన్నా పొట్లా గఱ్ఱావులకు
పచ్చ గడ్డారాలు వాటి కెయ్యమ్మా-కల్లు పొడవామన్న కరుకోడి పుంజులకు
దానరాసుల మీద దాకలపవమ్మా-కలిసి చంపమన్నా కాట్ల బెబ్బులకు
దోనిగెంజారాలు వాటి కెయ్యమ్మ-నూరు చంపమన్నా నాగుపాముల కెల్లా
పట్టుమీద కోడుగుడ్డార మెయ్యమ్మ- సంది గొట్టమన్నా కాటి రాకాసులకు
చలికూడు పొలికూడు వాటి కెయ్యమ్మా-పిసికి చంపమన్న పురుడు పీశాచులకు
ఎఱ్ఱకూడు పచ్చకూడార మెయ్యమ్మా-ఆ మాటలిన్నాది తల్లి దేవాకి
నాయనా నా యబ్బా నాముకుమారా-సెంకు సెక్కారాల దశావతారుడా
అష్టబూలోకాల కాది నారాయణ-ఏటికే ఎదురీత ఎవ్వరీదుతారు
ఏటికేసారాలు ఎవరేసుతారు-మీ తండ్రి వసుదేవుడు సంకెల్ల నున్నాడు
ఏటి కేసారాలు ఎవరేసుతారు-ఆ పలుకులిన్నాడు నీల ఎన్నుండు



తల్లాడ్ని మాటలకు తామసించేను-దివియ గ్యాన్నం బట్టి దీష్టించి జూస్తే
ఇనప సంకెల్లన్నీ ఈడిపోనాయి -కంచు సంకెల్లన్ని కదిలిపోనాయి
రాగి సంకెల్లన్ని రాలిపోనాయి-వచ్చె నొసుదేవుడు దేవిమేడలకు
ఏటి కేసారాలు వాటి కేసేను-మట్టి చంపామన్న మదమత్తు ఏనుగులకు
మఱ్ఱి రొడ్డారా లాటికేసీనాడు-పొడిచి చంపామన్న పోట్ల గఱ్ఱావులకు
పచ్చగడ్డారాలు వాటి కేసేను-కల్లు పొడవమన్న కరుకోడి పుంజులకు
దానరాసుల మీద దాకలిపినాడు-కరిసి చంపామన్న కాట్ల బెబ్బులకు
దోనిగెంజారాలు వాటి కేసేను-నూరు చంపామన్న నాగుబాములకు
పట్టుమీద కోడిగుడ్డార మేసేను-సంది గొట్టామన్న కాటిరాకాసులకు
చలికూడు పొలికూడు వాటికేసేను- పిసికి చంపామన్న పురుడు పీశాచులకు
ఎఱ్ఱకూడు పచ్చకూడు వాటికేసేను- ఏటికేసారాలు వాటి కేసేను
మేపుల చందమున కాపుమరిసేను- ఆ సందుజల్మాల కొచ్చాడు కృష్ణుడు"

అని బెత్తుదాసుడు సమాధానం చెప్పగానే పంతం అడిగిన దాసుడు

"సెబయాసుదాసుడా సెల్లు నీపెగ్గ- ఎయ్యండి దాసుడికి ఎండి జన్నిదము
కట్టండి దాసునికి గాజు కంకనము- నిన్ను మించినవాడు లోకమున లేడు."

అని ప్రశంసించి బెత్తుదాసునికి తన చేతిని ఆసరాగా ఇచ్చి లేపుతాడు. ఈ విధంగా సేవగరిడి కళాప్రదర్శన జరిగేటప్పుడు పంతాలు అడగడం, ఆ పంతాలకు బెత్తుదాసుడు సమాధానం చెప్పడం జరుగుతూ ఉంటుంది. ఇలా పంతం అడిగినప్పుడు, దానికి సమాధానం చెప్పినప్పుడు కోలదాసుడు కోల తిప్పకుండా కూర్చొని విశ్రాంతి తీసుకుంటూ ఉంటాడు. పంతానికి సమాధానం చెప్పగానే దాసులు మళ్ళీ సేవగరిడి కళను ప్రదర్శిస్తూ దశావతార కథలను గానం చేస్తూ ఉంటారు. ఇలా కొంతసేపు సేవగరిడి కళను ప్రదర్శించిన తరువాత ఆ కళా ప్రదర్శనను ముగించాలనుకున్నప్పుడు బెత్తుదాసుడు ఇలా మంగళం పాడి ముగిస్తాడు.

"చేతిడు బెత్తాము చెంగల్వ పూదండ- బంగారు మొలతాడు పట్టుదట్టి
సందిట తాయితులు సిరిమువ్వ గజ్జెలు- మూపురం తిరగాల మువ్వనటక
సంబరం చేదును జాగరం చేదును- ఒప్పైన కోనేట్లో తానమాడి
వన్నెగిరులు కులగిరులు - కొమ్మలు చెండాడి గోవిందుడై
నిలిచి గోవుల కాచి యవలగొండెత్తిన- ఎన్నుడు తమ్ముడు యాదగిరి కృష్ణమ్మకే
జయమంగాలం సుబమంగాలం- వారాది గట్టేసి వనచరుల నడిపించి
లంక మీదన మిగుల దండు నడిపి- లంగ గుంకము జేసి రామనేసుని గొట్టి

చెలియన్నిబియీసు లంకపట్నము గట్టి- లచ్చిమి దేవిని దెచ్చిన రాగవులకే

జయ మంగాలం సుబ మంగాలం"

సేవగరిడి కళా ప్రదర్శనలో ఇంతమంది మాత్రమే పాల్గొనాలనే నియమం లేదు. ఎన్ని జతల తాళాలుంటే అంతమంది పాల్గొంటూ ఉంటారు. కోలను తిప్పడం గానీ కంచు తాళాలను వాయించడం గానీ ఎక్కువ సేపు చేయలేరు. ఎందుకంటే ఇవి బరువుగా ఉంటాయి. అందువల్ల వాటిని వాయిస్తూ ఉన్నప్పుడు అలుపు వస్తుంది. అలుపు వచ్చినప్పుడు ఇతరులు వచ్చి కోలను, తాళాలను తీసుకుంటారు. అందువల్ల దాసులు అవసరమైన దానికంటే ఎక్కువ మంది ఉంటారు.

సేవగరిడి కళను తరతరాలుగా చేస్తున్న దాసులు సంక్రాంతి పండుగ ముందు వచ్చే శనివారం చాలా ముఖ్యమైనదిగా భావిస్తారు. ఆశనివారం రోజు దేవుడు గదిలో అటక మీద ఉన్న సేవగరిడి పరికరాలను కిందికి దింపి వాటిని పూజించి ఇంటి దగ్గర కొంచెం సేపు గరిడి చేసి ఆ తరువాత సింహాచలానికి వెళ్ళి, నడుచుకుంటూ మెట్ల ద్వారా కొండపైకి ఎక్కి సింహాద్రి అప్పన్నను దర్శించి ఇంటికి వచ్చిన తరువాత ఆ రోజు రాత్రి కోల వెలిగించి గరిడిసేవ చేస్తారు. ఆమరుసటి రోజు నుంచి సంక్రాంతి పండుగ కనువ రోజు వరకు తమ ఊరిలోను, చుట్టుపక్కల ఊర్లలోను గరిడిసేవ చేస్తూ చందాలు వసూలు చేస్తారు. సేవగరిడివారు సంక్రాంతి పండుగను గొప్ప పవిత్ర మైనదిగా భావించి ఇలా చేస్తారు. సింహాద్రి అప్పన్నకు జరిగే డోల్లయాత్ర, చందన యాత్ర మొదలైన ఉత్సవాలకు సేవగరిడి వాళ్ళందరూ సింహాచలం వెళ్ళి, కొండపైకి నడుచుకుంటూ వెళ్ళి పైన గరిడిసేవ చేస్తారు. సేవగరిడి వారికి సింహాద్రి అప్పన్న ఇష్టదైవం కావడంవల్ల ఆ స్వామికి జరిగే అన్ని ఉత్సవాలకు సేవగరిడి వాళ్ళందరు తప్పక వెళ్ళి అక్కడ సేవగరిడి కళను ప్రదర్శించి దశావతార కథలను పాడతారు.

సేవగరిడి కళాకారులు శివరాత్రి రోజు రాత్రంతా తప్పనిసరిగా సేవగరిడి కళను ప్రదర్శిస్తూ దశావతారాలను గానం చేస్తూ జాగరణ చేస్తారు. అలాగే కృష్ణాష్టమి రోజు కూడా సేవగరిడి కళను తమ ఇంటి దగ్గరగానీ, కృష్ణుని కోవెల దగ్గర గానీ ప్రదర్శిస్తారు. పై మూడు రోజులు అంటే సంక్రాంతి పండుగ ముందు శనివారం, శివరాత్రి రోజు రాత్రి, కృష్ణాష్టమి రోజు తప్పనిసరిగా సేవగరిడి కళను ప్రదర్శిస్తారు. తోడపెద్దు ఉన్నవారు తాము ఎక్కడ సేవగరిడి కళను ప్రదర్శించినా అక్కడికి దాన్ని పట్టుకొని వెళ్ళి దాని ఎదురుగా తమ కళను ప్రదర్శిస్తారు. తోడపెద్దు లేనివారు తాము మాత్రమే సేవగరిడి కళను ప్రదర్శిస్తారు.

విశాఖపట్నం పెరిగి చుట్టుపక్కల గ్రామాలను తనలో కలుపుకొని నగరంగా



మారిపోయినప్పటికి ఈ ప్రాంతం ప్రజల్లో జానపదత్వం బలంగా ఉంది. అందువల్ల ఇక్కడి ప్రజలకు సేవగరిడి కళ పట్ల భక్తిప్రపత్తులు ఉన్నాయి. ఈ కళను ప్రదర్శింప జేయిస్తే గొప్ప పుణ్యం వస్తుందని ఈ ప్రాంతంవాళ్ళు భావిస్తారు. అందువల్లనే ఈ ప్రాంత ప్రజలు అనేక సందర్భాల్లో సేవగరిడి కళాకారుల చేత కళా ప్రదర్శన చేయిస్తారు. ఇలా ప్రజలు సేవగరిడి కళను ప్రదర్శింప జేయించినపుడు వారి వద్ద నుంచి కొంత డబ్బును గరిడివారు తీసుకుంటారు. ఈ డబ్బు సేవగరిడివారు కాల్చే నూనెను బట్టి ఉంటుంది. అంటే సేవగరిడి వారు కోలను వెలిగించి దాని మీద నూనె పోస్తూ దాన్ని చేతులతో పట్టుకొని తిప్పుతూ ఉంటారు. ఇలా చేయడాన్ని నూనె కాల్చడం అంటారు. నూనెను గూడా గరిడిని ప్రదర్శింప జేసేవారే ఇస్తారు. రెండు కే.జీ.ల నూనె కాలిస్తే వెయ్యి రూపాయల వరకు డబ్బును సేవగరిడి వారు తీసుకుంటారు. అంటే కోలను వెలిగించి దాని మీద నూనె పోస్తూ రెండు కే.జీ.ల నూనె పూర్తిగా అయిపోయేవరకు సేవగరిడి కళను ప్రదర్శించాలి. అలా ప్రదర్శిస్తే ప్రదర్శింపజేసే వారు వెయ్యి రూపాయలిస్తారు. విశాఖపట్నం ప్రాంతంలోని ప్రజలు ఈ కింది సమయాల్లో సేవగరిడి కళను ప్రదర్శింప జేయిస్తారు.

1. పెళ్ళి ముహూర్తానికి ముందు శనివారంనాడు.
2 గృహ ప్రవేశం సందర్భంలో
3. సంతానం లేనివారు సంతానం కోసం
4. గ్రామదేవతల పండుగల సందర్భంలో
5. పుట్టువెంట్రుకలు తీయించే సందర్భంలో
6. తిరుపతికి వెళ్ళి వచ్చాక మొదటి శనివారం నాడు
7. వినాయక చవితి, దసరా పండుగుల సందర్భంలో
8. వీరుల సంస్మరణ సందర్భంలో
9. శవాన్ని స్మశానికి తీసుకొని వెళ్ళే సందర్భంలో

**1. పెళ్ళి ముహూర్తానికి ముందు శనివారంనాడు :** జానపదులు శనివారం రోజును పవిత్రమైన రోజుగా భావిస్తారు. తిరుపతి, సింహాచలం మొదలైన వైష్ణవ క్షేత్రాలను శనివారం రోజు ఎక్కువగా దర్శిస్తూ ఉంటారు. సేవగరిడి వైష్ణవ సంప్రదాయానికి చెందిన జానపద కళ కావడం వల్ల జానపదులు ఎక్కువగా శనివారం రోజున ఈ కళను ప్రదర్శింప జేయిస్తారు. పెళ్ళి ముహూర్తానికి ముందు శనివారం నాడు ఉత్తరాంధ్ర జిల్లాల్లోని ప్రజలు సేవగరిడి కళను తమ ఇంటి ముందు ప్రదర్శింప జేయిస్తారు. సేవగరిడి కళను ప్రదర్శింప జేయించాలనుకున్న వారు గరిడి వారి దగ్గరకు వెళ్ళి

ఆకు, వక్క, అరటిపళ్ళు, రెండు లేక మూడు రూపాయలు దక్షిణ కలిపి గరిడి వారికి ఇచ్చి ఫలానా శనివారం నాడు తమ ఇంటి దగ్గర సేవగరిడి చేయాలని కోరతారు. ఇలా ఆకు, వక్క, అరటి పళ్ళు దక్షిణ ఇవ్వడాన్ని 'పత్రి ఇవ్వడం' అంటారు. పత్రి తీసుకొని తప్పనిసరిగా వచ్చి గరిడి చేస్తామని గరిడి వారు చెబుతారు. తాము చెప్పి నట్లు శనివారం ఉదయం పది గంటల ప్రాంతంలో గరిడివారు తోడపెద్దును పట్టుకొని వారి ఇంటికి వెళతారు. వారి ఇంటికి కొంచెం దూరం నుంచి తాళాలు వాయిస్తూ ఏదో ఒక అవతార కథను పాడుతూ వారి ఇంటి ముందుకు వస్తారు. ఇంటి ముందుకు వచ్చాక సేవదాసులు గుండ్రంగా నిలబడి తాళాలు వాయిస్తూ ఉంటే, బెత్తుదాసుడు వారి మధ్యలో నిలబడి ఏదో ఒక అవతార కథను పాడుతూ ఉంటాడు. సేవదాసులు బెత్తుదాసుడు పాడిన కథను పాడుతూ గరిడిసేవ చేస్తుంటారు. అప్పుడు ఇంట యజమాని భార్య బిందెతో నీళ్ళు తెచ్చి మొదట తోడపెద్దు నాలుగు కాళ్ళను కడిగి, కాళ్లకు సాంబ్రాణి పొగ వేసి నాల్గు కాళ్ళకు, నుదిట మీద కుంకుమ పెట్టి మొక్కుతుంది. ఆ తరవాత అమె బెత్తుదాసుని పాదాలను, సేవదాసుల పాదాలను కడిగి వారి పాదాలకు సాంబ్రాణి పొగవేస్తుంది. ఇలా పాదాలు కడిగేటప్పుడు గరిడి వారు ఈ కింది పాట పాడుతారు.

"ఆదిలచ్చిమి తల్లి కాశి బైలెల్లి- కాశిలో నుతకాలు గరివితో తెచ్చి
ముందొచ్చి ములహరుడు పాదాలు కడిగె- పాదాల కిందెల్లి పారు గంగమ్మ
పారేటి జలనిధులు పై జల్లుకొని -గుగ్గిలం దూపాలు గోరు విల్లాడి
సాంబ్రాణి దూపాలు సమగలిపినాది"

ఈలోగా కోలదాసుడు కోల వెలిగిస్తాడు. తర్వాత దాసులందరూ ఇంట్లో దేవుడు ఉండే మూలకు వెళ్ళి ఇలా పాడుతారు. దీన్ని మూల పూజింపు పాట అంటారు.

"ఆదిలచ్చిమి తల్లి ఆలమందకు ఎల్లి- ఆవు మూలము దెచ్చి దరణి సాదకము జేసి
ముదముతో ముత్యాల ముగ్గులోసేను- వరిపిండి ముగ్గులు ఓనిలోసేనాది
సామపిండి ముగ్గు సదురువోసేను- ఆకంచు పళ్ళాలు కంటు దోమేను
ఈ బూది పళ్ళాలు ఇమ్ముగనె దోమి- మంచి నీళ్ళా తోటి మైల తోమేసి
నేత్రాన్నె వత్తేసి నెయిసాల వోసేను- బెలగమని బెమ్మాండ్ల జ్యోతి వెలిగిస్తే
ఆకంచు పళ్ళాని కంటు దగిలేను- బెమ్మాండ్ల ఆ జ్యోతి బెలగడం లేదు
అటు కండ్ల జూసి లచ్చిమీదేవి- కుమ్మరింటికి ఎల్లి కుసును పమ్మిక దెచ్చి
నేత్రాన్ని వత్తేసి నేయి సాల వోసి- బెలగమని బెమ్మాండ్ల జ్యోతి ముట్టిస్తే
బెమ్మాండ్ల ఆ జ్యోతి బెలుగుతున్నాది- పూజించు దేవుణ్ణి పూలగందంతో "



ఈ పాట ఇంకా చాల ఉంది. ఈ మూల పూజింపు పాట పూర్తి అయిన తరువాత దాసులందరూ ఇంట్లో నుంచి బయటకు వచ్చి ఇంటి ముందు సేవగరిడి కళను ప్రదర్శిస్తూ దశావతార కథలను పాడుతూ ఉంటారు. ఇలా గరిడి సేవ మధ్యాహ్నం వరకు చేస్తారు. గరిడిసేవ చేస్తున్నంతసేపు కోలదాసుడు వెలుగుతున్న కోలను తిప్పుతూ ఉంటాడు. కోలను వెలిగించడానికి అవసరమైన మంచి నూనె ఇంటివారే ఇస్తారు. మధ్యాహ్నం అయిన తరువాత బెత్తుదాసుడు ఇంటివారు సకల సౌభాగ్యాలతో తులతూగాలని ఇలా దీవిస్తాడు.

"సిరిసంపదలు గలిగి, సిమ్మాద్రప్పన్న దీవన్లు గలిగి కొడుకులు కోడళ్లు కోటి సంపదలు గలిగి, అల్లుళ్లు ఆడబొట్లు అతిక సంపదలు గలిగి, కోటికి మీ యిల్లు కొనలు సాగాల, ఇలమీద మీ యిల్లు ఇరిసి పండాలి. ఏటేట సిమ్మాద్రప్పన్న పేరు మీద యాత్ర ఎల్లాలి. దీవించిపోతాడు దివ్వెరచ్చకుడు".

దీవెన అయిపోయిన తరువాత కోలను ఆర్పివేసి సేవగరిడి ముగిస్తారు. ఆ రోజు ఉదయం నుంచి ఇంటి యజమాని, అతని భార్య ఉపవాసం ఉంటారు. భోజనం సమయంలో ఇంటివారు ప్రత్యేకంగా చేసిన పదార్థాలను అరిటాకులో పెట్టి మొదట తోడపెద్దుకు పెడతారు. ఆ తరువాత సేవగరిడి దాసులకు భోజనాలు వడ్డిస్తారు. ఇంటి యజమాని, అతని భార్య ఐదుగురు దాసుల విస్తర్ల నుంచి అయిదు పిడికిళ్ల అన్నం వారితో పెట్టించుకొని దాన్ని ప్రసాదంగా భుజించి ఉపవాసం వదులుతారు. తరువాత దాసులందరూ భోజనాలు చేస్తారు. భోజనం చేసిన తరువాత ఇంటి యజమాని దాసులకు వెయ్యి రూపాయలు గానీ, అంతకంటె ఎక్కువ గానీ దక్షిణ సమర్పిస్తారు.

ఈ విధంగా సేవగరిడి కళను తమ ఇంటి దగ్గర ప్రదర్శింపజేసేవారు సేవగరిడి కళాకారులైన దాసులను ఎంతో పవిత్రతతో పూజ్యభావంతో చూస్తారు.

**2. గృహప్రవేశ సందర్భంలో :** ఉత్తరాంధ్ర ప్రజలు కొత్తగా ఇంటిని కట్టుకున్నప్పుడు ఆ ఇంట్లో గృహప్రవేశం చేసే రోజున ఇంటిముందు సేవగరిడి కళను ప్రదర్శింప జేయిస్తారు. ఈ సందర్భంలో చేయించే ప్రదర్శన యావత్తు పెళ్ళి ముహూర్తానికి ముందు శనివారంనాడు లాగానే జరుగుతుంది. ఈ సందర్భంలో కూడా గృహప్రవేశం చేసే ఇంటి యజమాని దక్షిణగా డబ్బును గరిడివారికి సమర్పిస్తాడు.

**3. సంతానం లేనివారు సంతానం కోసం :** ఉత్తరాంధ్ర ప్రజల ఇష్టదైవం సింహాచలంలో ఉన్న వరాహనృసింహస్వామి. సంతానం లేని దంపతులు తమకు సంతానం కలిగితే సేవగరిడితో సింహాచల స్వామిని దర్శిస్తామని మొక్కుకుంటారు. అలా మొక్కుకున్నప్పుడు సంతానం కలిగితే సేవగరిడి వారితో కలిసి కొండ కింద నుంచి మెట్ల మీదుగా

నడుచుకుంటూ గరిడిసేవ చేస్తూ కొండ పైకి వెళతారు. సాధారణంగా శనివారం రోజు దీన్ని నిర్వహిస్తారు. దంపతులు మొదట సేవగరిడి వారికి పత్రి ఇచ్చి ఫలానా శనివారం నాడు సింహాచలానికి వెళ్ళాలని చెబుతారు. ఆరోజు దంపతులు ఉపవాసం ఉంటారు. ఇంటివారు చెప్పిన సమయానికి గరిడివారు గరిడి చేసుకుంటూ దంపతుల ఇంటికి వెళ్తారు. ఈ సందర్భంలో గరిడివారు గూడా ఉపవాసం ఉంటారు. ఇంటి యాజమానురాలు మొదట తోడపెద్దుకు తరువాత సేవగరిడి దాసులకు పాదాలు కడిగి సాంబ్రాణి పొగ వేస్తుంది. తరువాత దాసులు కోలను వెలిగించకుండా కొంత సేపు గరిడిసేవ చేస్తారు. ఆ తరువాత దంపతులు వారికి పుట్టిన శిశువుతో కలిసి సేవగరిడి దాసులను తీసుకొని సింహాచలానికి వెళతారు. గతంలో అందరూ నడిచి గానీ లేక ఎడ్లబళ్ళలో గానీ సింహాచలానికి వెళ్ళేవారు. వీరి వెంట తోడపెద్దును కూడా పట్టుకొని వెళ్ళేవారు. కాని ప్రస్తుతం విశాఖపట్నంలోని వారు ఎవరూ నడిచి వెళ్ళడం లేదు. బస్సుల్లో గానీ లేక ప్రత్యేకంగా ఏదైనా వ్యాన్ గానీ, కార్లలో గానీ సింహాచలానికి వెళుతున్నారు. ఇలా వాహనాల్లో వెళ్ళేవారు తోడపెద్దును పట్టుకొనిపోవడం లేదు. సేవగరిడి కళాకారులు మాత్రమే వెళ్తారు. వీరితోపాటు వంట సామాను, వంటవారిని గూడా తీసుకొని వెళ్తారు. వంటవారు కొండ కింద వంట చేసే పనిలో ఉంటారు. దంపతులు, శిశువుతో కలిసి సేవగరిడి వారు గరిడిసేవ చేస్తుండగా మెట్లమీదుగా నడుచుకుంటూ వెళతారు. దంపతులు తమ శిశువుతో సింహాచలస్వామిని దర్శించి మొక్కు తీర్చుకుంటారు. స్వామి దర్శనం అయిపోయిన తరువాత మళ్ళీ అందరూ మెట్ల మీదుగా కిందకు నడుచుకుంటూ వస్తారు. ఇలా వచ్చేటప్పుడు కూడా సేవ గరిడివారు గరిడి సేవ చేస్తూ వస్తారు.

అందరూ కొండ దిగి వచ్చేటప్పటికి వంటవారు వంట సిద్ధం చేసి ఉంటారు. మొదట సేవగరిడి దాసులు భోజనానికి కూర్చుంటారు. వారిలో ఐదుగురు విస్తర్ల నుంచి ఐదు పిడికిళ్ల ఆహారాన్ని తమ విస్తర్లో వేయించుకొని దంపతులు ఉపవాసం వదులుతారు. ఆ తరువాత అందరూ భోజనాలు చేశాక ఇంటికి తిరిగి వస్తారు. ఇంటికి వచ్చిన తరువాత గరిడివారు దంపతుల ఇంటిముందు కోల వెలిగించి ఒక గంటసేపు గరిడిసేవ చేస్తారు. తరువాత బెత్తుదాసుడు దంపతులు సుఖసంతోషాలతో వర్థిల్లాలని దీవించి కోలను ఆర్పివేసి గరిడిసేవను ముగిస్తారు. దంపతులు గరిడివారికి తాము మాట్లాడుకున్న దక్షిణను సమర్పించుకుంటారు.

**4. గ్రామదేవతల పండగల సందర్భంలో :** విశాఖపట్నం బాగా విస్తరించి చుట్టుపక్కల ఉన్న గ్రామాలను తనలో కలుపుకొని నగరంగా మారిపోయినప్పటికీ ఇక్కడి ప్రజల్లో



జానపదత్వం బలంగానే ఉంది. విశాఖపట్నంలోని చినవాల్తేరు, మువ్వలవానిపాలెం, కంచరపాలెం, శ్రీరంగాపురం, శివాజీపాలెం మొదలైన అన్ని ప్రాంతాల్లోనూ గ్రామ దేవతలు ఉన్నారు. ఈ ప్రాంతాల ప్రజలు తమ ఊరిలో ఉన్న గ్రామదేవతకు నిర్ణీత కాలంలో అంటే సంవత్సరానికి ఒకసారి గానీ, రెండేళ్ళకొక సారి గానీ లేక మూడేళ్ళ కొకసారి గానీ పండుగ చేస్తారు. ఇలా పండుగ చేసినప్పుడు నిర్వాహకులు తప్పనిసరిగా కనీసం రెండు సేవగరిడి సంఘాలవారి చేత గరిడిసేవ చేయిస్తారు. సాధారణంగా గ్రామదేవత పండుగ రాత్రిపూట చేస్తారు. అందువల్ల సేవగరిడి కళాప్రదర్శన కూడా రాత్రిపూటనే ఉంటుంది. ఈ సందర్భంలో గరిడివారు తమ దేవుడుగది అటక మీద నుంచి గరిడి సామాగ్రిని దింపి వాటికి సాంబ్రాణి పొగవేసి సామగ్రిని తీసుకొని గ్రామదేవత దేవాలయం దగ్గరికి వస్తారు. ఈ సందర్భంలో సేవగరిడి దాసుల కాళ్ళు కడగడం లాంటి కార్యక్రమం ఉండదు. గరిడివారు గ్రామదేవత ఆలయం దగ్గరికి రాగానే నిర్వాహకులు వారికి మంచినూనె ఇస్తారు. గరిడివారు ఆ నూనెతో కోల వెలిగించి గరిడసేవ చేస్తారు. సాయంకాలం ఏడుగంటల ప్రాంతం నుండి రాత్రి తొమ్మిది, పది గంటల వరకు గరిడి సేవ చేస్తారు. ఆ తరువాత కోల ఆర్పివేసి గరిడిని ముగించి నిర్వాహకుల దగ్గర నుంచి తాము మాట్లాడుకున్న దక్షిణను తీసుకొని గరిడివారు వెళ్ళిపోతారు.

**5. పుట్టువెంట్రుకలు తీయించే సందర్భంలో :** ఉత్తరాంధ్ర జిల్లాల్లోని ప్రజలు తమ ఇష్టదైవమైన సింహాద్రి అప్పన్న పేరును తమ సంతానానికి పెట్టుకుంటారు. పేరు పెట్టు కున్నా పెట్టుకోకపోయినా ఈ ప్రాంతంలోని ప్రజలు ఎక్కువమంది తమ పిల్లల పుట్టు వెంట్రుకలను సింహాచలం కొండపైన తీయిస్తారు. ఇలా పుట్టువెంట్రుకలు తీయించే సందర్భంలో కొంతమంది ప్రజలు గరిడిసేవ చేయిస్తారు. ఈ సందర్భంలో పుట్టువెంట్రుకలు తీయించే వారు ఇచ్చిన పత్రిని స్వీకరించి వారు చెప్పిన రోజున ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో ఉపవాసంతో గరిడివారు వారింటికి వెళ్ళి గరిడిసేవ చేస్తుంటారు. ఇంటి యజమాని, అతని భార్య కూడా ఉపవాసం ఉంటారు. యజమాని భార్య సేవగరిడి దాసులకు పాదాలు కడిగి సాంబ్రాణి పొగ వేస్తుంది. దాసులు కోల వెలిగించకుండా గరిడిసేవ చేస్తారు. ఆ తరువాత అందరూ కలిసి వంట సామాగ్రితో వంటవారిని తీసుకొని సింహాచలానికి వెళతారు. వంటవారు కొండ కింద వంట ప్రయత్నాల్లో ఉంటారు. దంపతులు, వారికుటుంబ సభ్యులు పుట్టువెంట్రుకలు తీయించే బాలిక లేక బాలునితో కలిసి సేవగరిడివారు గరిడిసేవ చేస్తుండగా మెట్లమీదుగా నడుచుకుంటూ కొండపైకి వెళతారు. కొండపైన బాలునికి పుట్టువెంట్రుకలు తీయించే వరకు సేవగరిడి చేస్తూనే ఉంటారు.

పుట్టువెంట్రుకలు తీసే కార్యక్రమం అయిపోయిన తరువాత గరిడివారు కోల ఆర్పివేసి గరిడిని ముగిస్తారు. తరువాత వెంట్రుకలు తీయించిన బాలునికి స్నానం చేయించిన తరువాత అతని తల్లి దండ్రులు స్నానం చేసి సింహాచల స్వామిని దర్శించి మెట్లమీదుగా నడుచుకుంటూ దిగివస్తారు. ఇలా దిగివచ్చేటప్పుడు కూడా గరిడివారు గరిడిసేవ చేస్తారు. వీరు కిందికి దిగివచ్చేటప్పటికి వంటవారు వంట సిద్ధం చేసి ఉంటారు. దంపతులు మొదట సేవగరిడి దాసులకు భోజనాలు వడ్డించి అయిదుగురు దాసుల విస్తర్లలో నుంచి ఐదు పిడికిళ్ల ఆహారాన్ని తమ విస్తర్లలో వేయించుకొని దాన్ని తిని ఉపవాసం వదులుతారు. ఆ తరువాత అందరు కలిసి తమ ఊరికి వస్తారు. వచ్చిన తరువాత గరిడివారు మళ్ళీ కోల వెలిగించి వారి ఇంటి దగ్గర గంటసేపు గరిడిసేవ చేస్తారు. ఆ తరువాత ఇంటివారి దగ్గర నుండి దక్షిణ స్వీకరించి గరిడివారు వెళ్ళి పోతారు. కొంత మంది బీదవారు సింహాచలంలో పుట్టువెంట్రుకలు తీయించుకొని ఇంటికి వచ్చిన తర్వాత తమ ఇంటి ముందు గరిడిసేవ చేయిస్తారు.

**6. తిరుపతికి వెళ్ళి వచ్చాక మొదటి శనివారంనాడు :** ఉత్తరాంధ్ర ప్రాంతంలోని ప్రజలు కొంతమంది తిరుపతికి వెళ్ళి వెంకటేశ్వర స్వామిని దర్శించి తమ ఇంటికి తిరిగి వచ్చిన తరువాత మొదటి శనివారం నాడు ఇంటిదగ్గర దేవునికి బట్టలు పెట్టి పూజ చేస్తారు. ఈ సందర్భంలో ఇంటివారు గరిడిసేవ చేయిస్తారు. ఇంటివారు ఇచ్చిన పత్రిని స్వీకరించి శనివారం ఉదయం ఉపవాసంతో గరిడివారు వారింటికి వెళ్ళడం, యజమాని భార్య గరిడివారి కాళ్ళు కడిగి సాంబ్రాణి పొగ వెయ్యడం, గరిడివారు ఇంట్లోకి వెళ్ళి దేవుని మూలన మూల పూజింపు పాటను పాడడం, తరువాత బయటకు వచ్చి కోల వెలిగించి మధ్యాహ్నం వరకు గరిడిసేవ చేయడం, మధ్యాహ్నం అయిన తరువాత కోల ఆర్పివేసి గరిడిని ముగించడం, ఇంటి వారు గరిడి వారికి భోజనాలు పెట్టడం ఐదుగురు దాసుల్ల విస్తర్ల నుండి ఐదు పిడికిళ్ల ఆహారాన్ని ఇంటి యజమాని, అతని భార్య తమ విస్తర్లో వేయించుకొని దాన్ని భుజించి ఉపవాసాన్ని వదలడం, గరిడివారు భోజనం చేసి ఇంటివారి నుండి దక్షిణ స్వీకరించి వెళ్ళడం జరుగుతుంది.

**7. వినాయక చవితి, దసరాపండుగల సందర్భంలో :** ఈ మధ్య కాలంలో ఆంధ్ర దేశమంతటా ముఖ్యంగా నగరాల్లో వినాయక చవితి పండుగ సందర్భంగా వినాయకుని బొమ్మను పెట్టి నవరాత్రులు చేయడం, అలాగే దసరా పండుగ సందర్భంలో ఆదిశక్తి బొమ్మను పెట్టి అమ్మవారి నవరాత్రులు చేయడం ఎక్కువగా జరుగుతూ ఉంది. ఈ రెండు పండగల సందర్భంలో దేవత బొమ్మలను పెట్టినవారు నవరాత్రుల్లో ఏదో ఒక



రాత్రి బొమ్మముందు గరిడిసేవను చేయిస్తారు. నిర్వాహకుల దగ్గర నుంచి పత్రిని స్వీకరించిన గరిడివారు వారు చెప్పిన రోజున రాత్రి ఏడు గంటల ప్రాంతంలో బొమ్మ దగ్గరకు వెళ్ళి కోల వెలిగించి గరిడిసేవ చేస్తారు. కోలను వెలిగించడానికి అవసరమైన మంచి నూనెను నిర్వాహకులే ఇస్తారు. ఈ సందర్భంలో ఏడు గంటలతో ప్రారంభిం చిన గరిడి సేవను సుమారు రాత్రి పదిగంటల వరకు చేస్తారు. ఆ తరువాత కోల ఆర్పివేసి గరిడిని ముగించి నిర్వాహకుల దగ్గర నుండి దక్షిణను స్వీకరించి గరిడివారు వెళ్ళిపోతారు. ఈ సందర్భంలో కొంతమంది ప్రజలు తమ ఇంటిముందు తాము ఒక్కరే దేవతాబొమ్మను పెట్టడం జరుగుతుంది. ఇలాంటి వారు విగ్రహం ముందు సేవగరిడిని ఏర్పాటు చేస్తే ఆ ఇంటి యజమానురాలు గరిడివారి పాదాలను కడిగి సాంబ్రాణి పొగవెయ్యడం మొదలైన కార్యక్రమం ఉంటుంది. ఒక ఇంటివారు కాకుండా అందరూ కలిసి అంటే యూనియన్ వారందరూ కలిసి (ఉదా: ఆటో యూనియన్, ముఠా పనివాళ్ల యూనియన్ లాంటి యూనియన్‌వారు) దేవుడు బొమ్మను పెట్టి సేవగరిడి ఏర్పాటుచేస్తే ఈ సందర్భంలో గరిడివారి కాళ్లు కడగడం లాంటివి ఉండవు.

**8. వీరుల సంస్మరణ సందర్భంలో :** యుక్తవయస్కులైన పెళ్ళి కాని యువకులు చనిపోతే అలాంటివారు వీరులు అవుతారని ఉత్తరాంధ్ర ప్రాంతంలోని ప్రజలు భావి స్తారు. చనిపోయిన తమ కుమారుని సంస్మరణ కోసం అతడు చనిపోయిన రోజున గానీ లేదా శివరాత్రి పండుగనాడు గానీ ఆ యువకుని ఫోటో ముందు కొత్తబట్టలు పెట్టి బంధుమిత్రులను, చుట్టుపక్కల వారిని ఆహ్వానించి ప్రత్యేకమైన వంటకాలతో భోజనాలు పెడతారు. ఇలాంటి సందర్భంలో ఆ ఇంటి వారు గరిడిసేవను ఏర్పాటు చేయిస్తారు. ఈ గరిడి ప్రదర్శనా విధానం మొదటి శీర్షిక అయిన "పెళ్లి ముహూర్తానికి ముందు శనివారంనాడు" లో చెప్పినట్లుగానే ఉంటుంది.

**9. శవాన్ని స్మశానానికి తీసుకొని వెళ్ళే సందర్భంలో :** ఈ సందర్భంలో గరిడివారి ప్రదర్శన మిగిలిన సందర్భాల్లో కంటె కొంత భిన్నంగా ఉంటుంది. ఉత్తరాంధ్ర ప్రాంతం లోని ప్రజలు చనిపోయినవారి ఆత్మశాంతి కోసం మనిషి చనిపోయిన రోజున గరిడ సేవ ఏర్పాటు చేయిస్తారు. ఇలాంటి సందర్భంలో గరిడిసేవ చేయడాన్ని దాసులు "చావుకు వెళ్ళడం" అని అంటారు. ఇలా చావుకు వెళ్ళేటపుడు సేవగరిడి సామగ్రిని దేవుని గదిలో ఉన్న అటక మీది నుండి కిందికి దింపినప్పుడు వాటిని పూజించడం, సాంబ్రాణి పొగవేయడం లాంటివి చేయరు. అటక మీద నుండి సామగ్రిని దింపి ఆ పరికరాలను తీసుకొని చనిపోయిన వారి ఇంటికి వెళ్ళి కోల వెలిగించి గరిడిసేవ ప్రారంభిస్తారు. ఈ సమయంలో ఇంటి యజమాని భార్య దాసుల పాదాలు కడగడం

సాంబ్రాణి పొగవెయ్యడం మొదలైనవి కూడా ఉండవు. శవాన్ని స్మశానానికి తీసుకొని వెళ్ళేటప్పుడు గరిడివారు గరిడిసేవ చేస్తూ శవం ముందు నడుస్తారు. స్మశానంలో శవాన్ని పాతిపెట్టడం గానీ, దహనం చేయడం గానీ పూర్తి చేసే వరకు గరిడిసేవ చేస్తారు. ఆ తరువాత దాసులు అక్కడ నుంచి సముద్రానికి వెళ్ళి సముద్రంలో సేవగరిడి పరికరాలను కడిగి, తాళాలకు కట్టిన బద్దీలను తీసిపారవేసి ఇంటికి వచ్చి ఆ సామగ్రికి సాంబ్రాణి పొగ వేసి అటకమీద పెడతారు. దాసులు సేవగరిడి చేసేటప్పుడు తప్పని సరిగా చెప్పులు వేసుకోరు. సేవగరిడి పవిత్రమైన కళ కాబట్టి ఆ కళా సందర్భం లో చెప్పులు వేసుకోవడం అపవిత్రంగా భావించి అలా చేస్తారు. ఎండాకాలంలో ఒక్కొక్క సారి మిట్టమధ్యాహ్నం సమయంలో శవం ముందు గరిడివారు గరిడిసేవ చేస్తూ నడవ వలసి ఉంటుంది. ఇలాంటి సమయంలో కాళ్ళు బాగా కాలుతూ ఉంటాయి. ఐనప్పటికీ దాసులు ఆ బాధను సహించి కాలికి చెప్పులు వేసుకోకుండానే గరిడిసేవ చేస్తారు. వారి కళపట్ల గరిడివారికి ఉన్న భక్తి అంత గొప్పది.

పైన చెప్పిన సందర్భాల్లో గరిడిసేవ చేయించిన ప్రజల నుంచి సేవగరిడి వారు ఒక్కొక్కరి దగ్గరనుంచి వెయ్యి రూపాయలకు పైగా దక్షిణ స్వీకరిస్తారు. ఇలా వచ్చిన డబ్బును సేవగరిడి వారు తమ సొంత ఖర్చులకు వినియోగించరు. ఆ డబ్బు మొత్తాన్ని పక్కన తీసిపెడతారు. కొందరు ఆ డబ్బును ప్రత్యేకంగా బ్యాంకులో వేసి జాగ్రత్త చేస్తారు. ఆ డబ్బును సేవగరిడికి సంబంధించిన వాటికి మాత్రమే ఖర్చు చేస్తారు. సేవగరిడి సంఘంవారు తోడపెద్దును పెంచుతూ ఉంటే దాని ఆహారానికి అవసరమైన తౌడు, చిట్టు, గంట్లు మొదలైనవ వాటి కోసం దక్షిణగా స్వీకరించిన డబ్బును ఖర్చు చేస్తారు.

అంతేగాకుండా శివరాత్రి, కృష్ణాష్టమి, శ్రీరామనవమి మొదలైన పండుగల సందర్భంలో గరిడివారు తమ ఇంటి ముందు గానీ లేక ఆయాదేవుళ్ళ ఆలయాల వద్ద గానీ గరిడిసేవ చేస్తారు. ఇలా సేవ చేసినప్పుడు కోలను వెలిగించడానికి మంచినూనె అవసరం అవుతుంది. దక్షిణగా వచ్చిన డబ్బును ఇలాంటి సందర్భంలో ఖర్చు చేస్తారు. దాసుల ఇష్టదైవం సింహాద్రప్పన్న. సింహాచలేశ్వరునికి డోలయాత్ర, చందనయాత్ర మొదలైన ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి. ఈ ఉత్సవాలకు సేవగరిడి వాళ్ళు తమ సంఘ సభ్యులతో కలిసి సింహాచలానికి వెళ్ళి కొండపైన గరిడిసేవ చేసి స్వామిని దర్శించి వస్తారు. ఈ సందర్భంలో సింహాచలం వెళ్ళి రావడానికి అక్కడ గరిడిసేవ చేయడానికి కొంత డబ్బు అవసరం అవుతుంది. దక్షిణగా వచ్చిన డబ్బును ఈ



సందర్భంలో ఉపయోగిస్తూ ఉంటారు. కొన్ని సేవగరిడి సంఘాలవారు తమ సంఘ సభ్యులందరితో కలిసి కాశీ, రామేశ్వరం మొదలైన పుణ్యక్షేత్ర దర్శనానికి వెళతారు. ఈ సందర్భంలో సంఘ సభ్యులెవరూ తమ సొంత డబ్బును వినియోగించరు. సేవగరిడి సంఘానికి దక్షిణగా వచ్చిన డబ్బును ఈ సందర్భంలో వినియోగిస్తారు.

## గంగిరెద్దులాట - ప్రదర్శనా విధానం :

గంగిరెద్దులాట ఆంధ్రదేశమంతటా బాగా ప్రసిద్ధి పొందిన జానపదకళ. మిగిలిన కళలను గురించి తెలియని వారు ఉండవచ్చు కానీ గంగిరెద్దులాట గురించి, గంగిరెద్దుల వారిని గురించి తెలియనివారు ఆంధ్రదేశంలో ఎవరూ ఉండరు. తెలుగు వారి జీవన విధానంలో అంత బాగా కలిసిపోయిన కళ గంగిరెద్దులాట. గంగిరెద్దుల వారు ఎద్దును బాగా అలంకరించి దాన్ని పట్టుకొని ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు గ్రామాల్లో తిరుగుతూ యాచన చేస్తారు. వీరు ఇలా చేసేటప్పుడు ఇద్దరు వ్యక్తులు పాల్గొంటారు. ఒకరు సన్నాయిని నోటితో ఊదుతూ నడుముకు కట్టుకున్న డోలును వాయిస్తూ ఉంటారు. ఇంకొక వ్యక్తి పెద్ద సన్నాయిని వాయిస్తూ అవసరాన్ని బట్టి చమత్కారంగా గ్రామస్తులను ఆకట్టుకొనే విధంగా మాట్లాడుతూ ఇంటింటికీ వెళుతూ భిక్షాటన చేస్తారు. ఇలా ఇంటింటికీ తిరిగేటప్పుడు మాటలను పాట రూపంలో ఇలా చెబుతారు.

"డూడూ బసవన్న - దొడ్డ దొరండి బసవన్న
అయ్యగారికి దణ్ణంపెట్టు - అమ్మగారికి దణ్ణంపెట్టు
కోటి లాభాలు కలగాలండి - కోటి వేల్పుల దయగలవాలి
మహాప్రభో మా బసవన్న - మనలాగ మాట్లాడ లేదుగాని
మనమాటలన్నీ గురుతేనండి"

అని ఇంట్లోని వారిని పొగుడుతారు. ఇంటి ఇల్లాలు కొంత ధాన్యాన్ని తీసుకొని వచ్చి గంగిరెద్దులతని జోలెలో వేస్తుంది. అప్పుడు ఆమెను చూసి గంగిరెద్దులతను ఇలా దీవిస్తాడు.

"పగటి ఎర్రయ్యగారు పొంక నల్లయ్యగారు- బజారు నల్లయ్యగారు బోడి బిక్కయ్యగారు
దీవెనలు కలిగి శుభోజ్జయం కలిగి- బాబయ్యగార్లు ఏలినవార్లు
లచ్చీమకదికార్లు కాకబోరు- బలమైనవారు ఫలమైనవారు
లచ్చీతల్లి గారు అమ్మాయిగారు- కూతుళ్ళు కలిగి కుమాళ్లు కలిగి
సిరిసంపదలు కల్గి సీతమ్మతల్లిగారి కోసం- పొంక నల్లయ్యగారి దీవెనలే కల్గి
బజారు నల్లయ్యగారి సహాయం కల్గి- శుభోజ్జయం కలగాలి శుభోజ్జయం గలగాలి"

పై పొగడ్తలో మొదట చెప్పిన నలుగురి పేర్లు గంగిరెద్దులవారి గురువులు. గంగిరెద్దు లాటకు వారే మూల పురుషులుగా చెప్పదగినవారు.అందువల్లనే గంగిరెద్దుల వారు వారి పేర్లు మొదట తలచుకొని వారి దీవెనలు తమకు ఉండాలని కోరుకుంటారు. ఆ తరువాత తనకు భిక్షం వేసిన ఇల్లాలు లక్షాధికారి కావాలని కూతుర్లు, కొడుకులతో సిరి సంపదలతో వారి ఇల్లు కళకళలాడాలని దీవిస్తారు.

గంగిరెద్దులవారు ఇలా ఇంటింటికీ తిరిగి ఆడుక్కొనేటప్పుడు "పాతబట్టలు ఏమైన ఉంటే ఇవ్వండి బాబయ్యా" అని అడుగుతారు. స్త్రీలు తమ ఇంట్లో ఉన్న పాతచీరలు, చొక్కాలు, పంచెలు మొదలైనవి వీరికి ఇస్తారు. అలాంటి సందర్భంలో అతను ఈ విధంగా పాడతాడు.

"అయ్యగారికి దణ్ణం పెట్టు - అమ్మగారికి దణ్ణం పెట్టు
అమ్మగారిచ్చిన చీర తీసుకో- అయ్యగారిచ్చిన చొక్కా తీసుకో
గంగిరెద్దుల వారమండి - పెళ్ళి బాసికాల అబోతండి
పెళ్లి కంకణాల అబోతండి- ముత్యాల బాసికాలు ముట్టమ్మట కడతారు
ఫలమైన బాసికాలు పక్కమ్మట కడతారు- పగటి నల్లయ్య పొంక నల్లయ్య
బజారు నల్లయ్య దీవెనలు గలిగి- శుభోజ్జయం కలిగి శుభోజ్జయం కలిగి
సిరిసంపదలు గలిగి ధనధాన్యములు కలిగి- మీలోగిళ్ళన్నీ సల్లగుండాలి బాబయ్య
వెళ్ళొత్తాం బాబయ్య మళ్ళొత్తామ్ బాబయ్య"

గంగిరెద్దులవారు ఇలా భిక్షమెత్తుకొనేటప్పుడు ఇంట్లోని పిల్లలను చక్కగా పొగుడుతారు. ఆ పొగడ్త విని పిల్లలు సిగ్గుపడి తమ తల్లిదండ్రుల చాటుకు వెళతారు. ఆ పొగడ్త ఇలా ఉంటుంది.

"బుజ్జిబాబు గారు పెళ్ళికొడుకు- అత్తమామలకు ముద్దులల్లుడు
మోటరే తూటరే మామయ్యగారు పంపి- రెండెకరాల అనబతోట
మూడెకరాల మునగతోట- నాలుగెకరాల నల్లేరుతోట
ఐదెకరాల బొబ్బాసి తోట- ఆరెకరాల అల్లంతోట
మామగారిచ్చిన మోటారు మీద- అత్తవారింటికి ఆయగ వెళ్ళె
అన్నీ సూసి శుభోజ్జంగా రావాలి- శుభోజ్జయం కలగాలి"

ఒక్కొక్క విధంగా పొగిడి వారిని సంతోషపెట్టి, వారి నుంచి డబ్బు ధాన్యం మొదలైనవి భిక్షగా స్వీకరిస్తారు. గ్రామాల్లో కొత్తగా పెళ్లైన దంపతుల బాసికాలను గంగిరెద్దుల వారు తమ ఇంటికి వచ్చినప్పుడు వారికి ఇస్తారు. గంగిరెద్దులవారు ఆ బాసికాలను గంగిరెద్దు రెండు కొమ్ములకు కట్టి ఈ విధంగా పాడతారు.[14]



"పన్నెండు స్తంభాల పందిటిలోన - పన్నెండు స్తంభాల పందిటిలోన
ఒంటి స్తంభం కాడ ఒక రాట కాట - శూలాల బాలుణ్ణి పెళ్ళిళ్ళనాడు
వీరింట్లో ఉన్నాదీ పెద్దాడ బడుసు - పరుగూ పరుగూనొచ్చి పైట చెంగరసి
పడుచూ నిస్తావాదినా పాడినిస్తావా - ఇచ్చేటి సాచ్యంబు ఎవరూ సొచ్చి
కంకణము కట్టేటి కౌమూడి సాచ్చి - బ్రమ్మ ముళ్ళేసేటి బ్రామ్మలే సాచ్చి
కాళ్ళు గోళ్ళు తీసేటి మంగాలి సాచ్చి - గౌరీకళ్యాణమే శృంగారమో
నిత్య కళ్యాణమో వైభోగమో - పెద్దపెద్ద రుద్రాచ్చ పేరుమెడలేసి
పెత్తిరపతి వెంకన్న నీకూ నివాళి - నివ్వాలు కవ్వాలు నీకూ నివాళి
కూర్చున్న పెళ్ళి కొడకా లేచీ రావయ్య - తలనిండ సమురోసి తాంబూలమిచ్చి
గౌరీ కళ్యాణమో శృంగారమో - నిత్యకళ్యాణమై పచ్చతోరణమై"

ఇలా బాసికాలు గంగిరెద్దులవారికి ఇచ్చినప్పుడు బాసికాలతోపాటు కొంత డబ్బును కూడా గంగిరెద్దులవారికి ఇస్తారు. ఇలా గంగిరెద్దులవారు చక్కని మాట తీరుతో ధారాళంగా మాట్లాడుతూ గ్రామీణులను పొగుడుతూ వారి నుంచి భిక్ష స్వీకరిస్తారు. ఈ విధంగా ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు ఇల్లిల్లూ తిరిగి భిక్షమెత్తుకొని ఆ రోజు రాత్రి గంగి రెద్దులాటను ప్రదర్శిస్తారు. వీరి ఆటను తిలకించడానికి గ్రామీణులు చాల మంది వస్తారు.

గంగిరెద్దులాట ప్రదర్శనలో గంగిరెద్దులవారు ఐదుగురు వరకు పాల్గొంటారు. ఒకరు వీరణం, ఒకరు డోలు, ఒకరు పెద్ద సన్నాయి, ఇంకొకరు చిన్న సన్నాయి, ఒకరు గంట పట్టుకుంటారు. అంటే ఆటలో పాల్గొన్నవారందరూ తలా ఒక వాయిద్యాన్ని పట్టుకొని వాయిస్తూ మధ్యమధ్యలో చక్కగా మాట్లాడుతూ ఉంటారు. ఈ ప్రదర్శనలో ఒక గంగిరెద్దును గానీ లేక రెండు గంగిరెద్దులను గానీ లేక ఒక ఎద్దు ఒక ఆవును గానీ ఉపయోగిస్తారు.

ఈ సందర్భంగా గంగిరెద్దును చక్కగా అలంకరిస్తారు. ఆవుకు గూడా చిన్నపాటి అలంకరణ చేస్తారు. ప్రదర్శన ప్రారంభంలో డోలు, సన్నాయిలతో సినిమా పాటలను సంగీత రూపంలో ఆలపిస్తారు. దీనితో మరికొంతమంది వీరి చుట్టూ గుమికూడతారు. గంగిరెద్దులాటలో ప్రధాన ఆటగాడు సమయస్ఫూర్తిగా మాట్లాడుతూ ప్రజలను ఆకట్టుకొనే ప్రయత్నం చేస్తాడు. ఇలా మాట్లాడేటప్పుడు ఒక వ్యక్తి వంత పలుకుతూ "ఆహా, ఔను, అలాగే, అదిరా భాయ్, శుభోజ్జయం" మొదలైన పదాలు తగిన రీతిలో పలుకుతుంటాడు. ఆటలో రెండు గంగిరెద్దులు ఉంటే రామలక్ష్మణులని పేర్లు పెట్టి ప్రదర్శన సమయంలో అలాగే పిలుస్తుంటారు. ఒక గంగిరెద్దు ఒక ఆవు ఉంటే వాటికి సీతారాములని పేరుపెట్టి సీతారామ కళ్యాణాన్ని ఎంతో చమత్కారంగా,

హాస్యయుక్తంగా ప్రదర్శిస్తారు. పిల్లలు బొమ్మలు పెళ్ళిళ్ళు చేసినట్టుగా గంగిరెద్దులవారు రాముని పేరుతో పిలవబడే గంగిరెద్దుకు, సీతగా పిలవబడే ఆవుకు కళ్యాణం చేస్తారు. ఆంధ్రదేశంలోని గంగిరెద్దులవారందరూ సీతారామ కళ్యాణాన్ని ప్రదర్శిస్తారు. మాటల్లో చిన్నచిన్న తేడాలు తప్ప అందరూ సీతారామ కళ్యాణాన్ని ఒకే విధంగా ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనలో రాముడి పక్షాన ఒక వ్యక్తి అతని తండ్రి పాత్రను పోషిస్తాడు. మరొక వ్యక్తి సీతపక్షాన సీత తండ్రిపాత్రను పోషిస్తాడు. మిగిలిన ముగ్గురు గంగిరెద్దులవారు తమ వాయిద్యాలు వాయిస్తూ ఈ ఇద్దరికీ సహకరిస్తూ ఉంటారు.

సీతారామ కళ్యాణం ప్రదర్శన పెళ్ళిచూపులతో ప్రారంభమౌతుంది. గంగిరెద్దును, ఆవును ఎదురెదురుగా ఉంచుతారు. అలా కొంచెం సేపు ఉన్న తరువాత ఆవు దూరంగా వెళ్ళిపోతుంది. రాముని తండ్రిగా వ్యవహరించే వ్యక్తి సీత తండ్రిగా వ్యవహరించే వ్యక్తి దగ్గరకువచ్చి ఎందుకు మీ అమ్మాయి అలా వెళ్ళిపోయింది అని అడుగుతాడు. అప్పుడతను మీ అబ్బాయి మా అమ్మాయికి నచ్చలేదు. మీ రాముడు నల్లనివాడు, దోణికడుపువాడు, దొడ్డికాళ్లవాడట అందువల్ల మీ రాముని మా సీత పెళ్ళి చేసుకోదట అని చెబుతాడు. ఇలా చెప్పగానే ప్రజలు బాగా నవ్వుతారు. అప్పుడు రాముని తండ్రి సీత తండ్రి గడ్డం పట్టుకొని "పిల్లనీమామ, పిల్లనీమామ" అని అడుగుతాడు. చివరికి సీత తండ్రి తన అమ్మాయిని ఇవ్వడానికి అంగీకరిస్తాడు. అప్పుడు రాముని తండ్రి గంగిరెద్దు దగ్గరికి వెళ్ళి సీతను పెళ్ళి చేసికుంటావా అని అడుగుతాడు. గంగిరెద్దు పెళ్ళి చేసుకోనని తల అడ్డంగా ఊపుతుంది. ఎందుకు పెళ్ళి చేసుకోవని రాముని తండ్రి పాత్రధారి అడుగుతాడు. అంతేగాకుండా సీతా బాగోలేదనా? సీతకు పనిపాట తెలీదనా? అనే ప్రశ్నలు వేస్తాడు. గంగిరెద్దు కాదు అని అడ్డంగా తల ఊపుతుంది. చివరకు అతను సీతకు సొమ్ములు లేవనా? అని అడుగుతాడు. అప్పుడు గంగిరెద్దు ఆవును అని తల అంగీకార సూచకంగా ఊపుతుంది. అప్పుడు రాముని తండ్రి సీత తండ్రివద్దకు వెళ్ళి మీ అమ్మాయికి నగనట్రా ఏమీలేవు. అందువల్ల మారాముడు మీ అమ్మాయి సీతను పెళ్ళి చేసుకోడంట అని అంటాడు.

అప్పుడు సీత తండ్రి అమ్మాయికి కావలసింది నగా నట్రా కాదు. అమ్మాయి గుణగణాలు, రూపురేఖలు మంచిగుండాలి. వినయ విధేయతలుండాలి, అత్తమామలను తల్లిదండ్రుల్లాగ గౌరవించాలి. ఇలాంటి లక్షణాలన్నీ మా సీతలో ఉన్నాయి. కాబట్టి మా సీతను మీ రాముడికి ఇచ్చి పెళ్ళి చేసుకోమని చెబుతాడు. రాముని తండ్రి గంగిరెద్దు దగ్గరకు వెళ్ళి సీత చూడచక్కనిదని, మంచి గుణగణాలు కలిగినదని, కాబట్టి సొమ్ములు అక్కర లేదని, సీతను పెళ్ళి చేసుకోమని చెబుతాడు. గంగిరెద్దు అంగీకార



సూచకంగా తల ఊపుతుంది. అప్పుడు నిశ్చయ తాంబూళాలు పుచ్చుకుందామని సీత తండ్రి రాముని తండ్రితో అంటాడు. అలాగే అని రాముని తండ్రి తాంబూలమిస్తాను దోసిలిపట్టు అని సీత తండ్రితో అంటాడు. సీత తండ్రి దోసిలి పడతాడు. అప్పుడు రాముని తండ్రి అతని దోసిటిలో కాలు పెడతాడు. వెంటనే సీత తండ్రి దోసిలి తీసేసి తన కూతురిని ఇవ్వనని కోపంగా చెబుతాడు. అలా చేయగానే ప్రేక్షకులందరూ గొల్లున నవ్వుతారు. అప్పుడు రాముని తండ్రి సీత తండ్రితో సీతను నువ్వు ఇచ్చేదేమిటి? నేనే సీతను తీసుకొనిపోయి మా రామునికి ఇచ్చి పెళ్ళి చేస్తానని చెప్పి ఆవు దగ్గరకు వెళ్ళి, "అమ్మా సీతమ్మా ఆడపిల్ల ఎప్పటికైనా అత్తవారిల్లు చేరాలి. పుట్టినిల్లు పనికిరాదు, లచ్చనంగా మా రాముని పెళ్ళి చేసుకొని మా ఇంటికి ఒచ్చెయ్" అని చెప్పగానే ఆవు అతని వెంట వెళ్ళడానికి సిద్ధపడుతుంది. అప్పుడు సీత తండ్రి "నీవు పోతే నాకు అన్నం పెట్టేవారు లేరు తల్లో, నీవు పోతే నేను బాయిలో పడి చచ్చిపోతాను తల్లో" అని ఏడుస్తాడు. అప్పుడు రాముని తండ్రి సీత తండ్రికి కొంత డబ్బు ఓలిగా ఇస్తానని చెప్పి అతన్ని ఒప్పించి పెళ్ళికి సిద్ధపడతాడు.

అప్పుడు సీత తండ్రి ఆవుని తీసుకొని వెళుతూ ఉంటాడు. రాముని తండ్రి అతణ్ణి ఆపి ఏమయ్యా ఎక్కడికి పోతున్నావ్? అని అడుగుతాడు. దానికి సీత తండ్రి వేరే ఊరిలో మా అమ్మాయికి ఎక్కువ ఓలి ఇస్తామన్నారు. అందువల్ల నేను వారికే మా అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేస్తానని చెబుతాడు. అప్పుడు రాముని తండ్రి "సీత రాముని కోసమే పుట్టిందని అలాగే రాముడు కూడా సీతకోసమే పుట్టాడని వారిద్దరూ ఆదర్శ దంపతులని కాబట్టి వారిద్దరికీ పెళ్ళి చెయ్యాలని" చెబుతాడు. దానితో సీత తండ్రి కూడా అంగీకరించి సీతారాముల పెళ్ళికి అన్నీ సిద్ధం చేస్తారు. ఈ వివాహంలో హిందువుల పెళ్ళిలో జరిగే అన్ని రకాల ఆచారాలను, తంతులను జరిపిస్తారు. సీతారాములని ఎదురెదురుగా నిలబెట్టడం, ఇద్దరిమధ్య తెరకట్టడం, ఇద్దరికీ బాసికాలు కట్టడం, సీత తండ్రి రాముని కాళ్ళు కడిగి కన్యాదానం చేయడం, ముందు రాముని వెనుక సీతను సప్తపది నడిపించడం, పెళ్ళి అయిన తరువాత అరుంధతిని చూపించడం మొదలైన అన్ని రకాల ఆచారాలను గంగిరెద్దులవారు ప్రదర్శిస్తారు. వివాహం చేసేటప్పుడు గంగిరెద్దులవారు డోలు, సన్నాయి మొదలైన వాయిద్యాలతో నిజంగా పెళ్ళి జరుగుతుందేమో అన్న భావనను ప్రేక్షకులకు కలిగిస్తారు. సీతారామ కళ్యాణం అయిపోయిన తరువాత ఎద్దును, ఆవును పక్కపక్క పడుకోబెడతారు. అప్పుడు గ్రామీణ స్త్రీలు ఎద్దుకు ఆవుకు పసుపుకుంకుమలు పెట్టి హారతి ఇస్తారు. ప్రేక్షకులు తమకు తోచినంత డబ్బును గంగిరెద్దుల వారికి ఇస్తారు.

సీతారామ కళ్యాణం సందర్భంగా గంగిరెద్దులవారు సన్నాయి, డోలు మొదలైన వాయిద్యాలతో అనేక రాగాలు ఆలపిస్తారు. వీటిలో జానపదులు పాడుకునే పెళ్ళిపాటలు, తలుపుదగ్గరి పాటలు, మంగళహారతి పాటలే కాకుండా అనేక రకాల సినిమా పాటలు కూడా తమ సంగీత వాయిద్యాల ద్వారా వాయిస్తూ తమ సీతారామ కళ్యాణ ప్రదర్శనను గొప్పగా రక్తి కట్టిస్తారు. ఈ ప్రదర్శనలో వీరు ఎన్నో నీతులు, ధర్మబద్ధమైన మాటలు చక్కటి తెలుగులో తెలియజేస్తారు. స్త్రీకి బంగారు ఆభరణాలు ముఖ్యం కాదని, మంచి నడవడిక, గుణగణాలు, సహనం, ఓర్పు, పెద్దలను గౌరవించడం మొదలైన లక్షణాలు ఉండాలని తమ ప్రదర్శన ద్వారా తెలియజేస్తారు. ఈ విధంగా గంగిరెద్దులవారు సీతారామ కళ్యాణాన్ని అపూర్వమైన రీతిలో ప్రదర్శిస్తారు. ఆంధ్రదేశంలోని గంగిరెద్దుల వారందరూ ఈ సీతారామ కళ్యాణాన్ని అతి ప్రాచీన కాలం నుంచి ప్రదర్శిస్తున్నారు.

ఈనాడు గంగిరెద్దులవారు అనేక రకాల విన్యాసాలను గంగిరెద్దుతో చేయిస్తున్నారు. గంగిరెద్దును డాక్టరులాగ నటింపజేయడం, చిన్నపీట మీద గంగిరెద్దు నాలుగు కాళ్ళూ పెట్టి నిలబెట్టడం, గంగిరెద్దు ముందు కాళ్ళను మనిషి మీద పెట్టి దానిచేత సినిమా పాటలకు అనుగుణంగా నాట్యం చేయించడం, అత్తాకోడళ్ల ప్రదర్శన మొదలైన వాటిని తమ ప్రదర్శనలో చూపిస్తూ ప్రేక్షకులను బాగా ఆకట్టుకొనే ప్రయత్నం చేస్తున్నారు.

**1. గంగిరెద్దు డాక్టరులాగ ప్రవర్తించడం :** ఈ ప్రదర్శనలో గంగిరెద్దు, ఇద్దరు వ్యక్తులు పాల్గొంటారు. ఒక వ్యక్తి కింద పడుకుంటాడు. రెండవ వ్యక్తి గంగిరెద్దు దగ్గరికి వచ్చి "రామచంద్ర ప్రభో నీ విద్యలు చూడడానికి చిన్నా పెద్దా జనం పదిమంది వచ్చారు. వారు చూసేది కంటి సరదా, మనం ఆడేది జానెడు పొట్టగురించి కాబట్టి రామచంద్ర ప్రభో నీ విద్యలు ప్రదర్శించు" అని చెప్పగానే గంగిరెద్దు పడుకున్న వ్యక్తి దగ్గరకు వస్తుంది. అప్పుడు రెండవ వ్యక్తి "అయ్యా రామచంద్ర ప్రభో మనవాడు రోగం వచ్చి చలిచీమలాగా పడుకొన్నాడు. ఇప్పుడు నీవు డాటరై పోవాల. జబ్బుచేసిన మనిషికి డాటరు ఏవిధంగా నాడిపట్టి పరీక్ష చేస్తాడో నువ్వు కూడా అలాగ పరీక్ష చెయ్యాల" అని చెబుతాడు. అప్పుడు గంగిరెద్దు పడుకున్న వాడికి మరింత దగ్గరగా వచ్చి నిలబడుతుంది. రెండవ వ్యక్తి చేయమన్న పనులన్నీ గంగిరెద్దు చేసి చూపుతుంది. అప్పుడు రెండవ వ్యక్తి మావాడి చెయ్యి బట్టి నాడి కొట్టుకుంటుందో లేదో చూడమని చెబుతాడు. గంగిరెద్దు తన ముందు కాలు ఒకటి పడుకున్న వాడి చేతి మీద పెట్టి డాక్టరు పరీక్ష చేస్తున్నట్టుగా తలకిందకు వంచి అలాగే కాసేపు ఉండి నాడి కొట్టుకుంటుంది అన్నట్టుగా తల ఊపుతుంది. అప్పుడు మావాడి గుండె కొట్టుందో లేదో





మనిషి తొడ మీద ఒక కాలు, పొట్ట మీద ఒక కాలు పెట్టి విన్యాసం చేస్తున్న గంగిరెద్దు



మనిషి తొడ మీద ఒక కాలు, తల మీద ఒక కాలు పెట్టి విన్యాసం చేస్తున్న గంగిరెద్దు



నాలుగు కాళ్ళు పీట పెట్టిన గంగిరెద్దు

చూడమని చెబుతాడు. గంగిరెద్దు పడుకున్న వ్యక్తి గుండె మీద కాలుపెట్టి కొట్టు కుంటుందన్నట్టుగా తల ఊపుతుంది. రెండవ వ్యక్తి పీక పరీక్షించి చూడమని చెబుతాడు. గంగిరెద్దు పడుకున్నవాడి పీక మీద కాలుపెట్టి పరీక్షిస్తున్నట్టుగా నిలబడుతుంది. అప్పుడు రెండవ వ్యక్తి చుట్టూ ఉన్న ప్రేక్షకులతో "అయ్యా మహాప్రభువులార ఇప్పుడు గంగిరెద్దు డాక్టరు లాగా నాడి చూడమంటే చూసింది. గుండె చూడమంటే చూసింది. పీక చూడమంటే చూసింది, నోరులేని ఎద్దు మూడు పాదాలమీద నిలబడి డాటరు పరీచ్చ చేసింది అని చెబుతాడు.

**2. సినిమా పాటలకు అనుగుణంగా గంగిరెద్దు నృత్యం చేయడం :** ఇందులో ప్రధాన ఆటగాడు చేయమన్న పనులన్నింటినీ గంగిరెద్దు చేసి చూపిస్తుంది. ప్రధాన ఆటగాడు ప్రేక్షకులతో ఇలా చెబుతాడు. "అయ్యా చూడండి. ఇంతకుముందు గంగిరెద్దు డాటరు లాగ పరీచ్చ చేసింది. ఇప్పుడు గంగిరెద్దు కింద పడుకున్న వాడి అరిచేతిలో ఒక పాదంపెట్టి, పొట్టమీద ఒకపాదం పెట్టి, అలాగే నిలబడి సోగ్గాడు పాటకి డాన్సు చెయ్యాలి" అని చెబుతాడు. వెంటనే గంగిరెద్దు కింద పడుకున్న వాడి దగ్గరకు వచ్చి తన ముందుకాళ్ళలో ఒక కాలును అతని అరచేతిమీద రెండవ కాలును అతని పొట్ట మీద పెడుతుంది. మిగిలిన గంగిరెద్దులవారు సన్నాయి, డోలు మొదలైన వాయిద్యాలతో "సోగ్గాడె చిన్నినాయన" అనే పాటను చక్కగా వాయిస్తారు. వారి వాయిద్యానికి అనుగుణంగా గంగిరెద్దు తన శరీరం మొత్తాన్ని ఊపుతూ చూసే వారికి అది నృత్యం చేస్తుందన్న భావను కలిగిస్తుంది. ఇలా కాసేపు చేసిన తరువాత ప్రధాన ఆటగాడు మళ్ళీ ఇలా చెబుతాడు. "ఇప్పుడు చేసిన దానికంటే ఇంకా గొప్ప ప్రదర్శన గంగిరెద్దు చేస్తుంది. అదేమంటే ఒక కాలు పొట్ట మీద, ఒకకాలు పీకమీద పెట్టి గంగిరెద్దు 'మాయదారి మల్లిగాడు' డాన్సు చేస్తుందని" చెబుతాడు. వెంటనే గంగిరెద్దు పడుకున్న వాడి పొట్ట మీద ఒక కాలు, పీక మీద మరొక కాలు పెట్టి నిలబడుతుంది. మిగిలిన గంగిరెద్దులవారు తమ డోలు, సన్నాయిలతో మాయదారి మల్లిగాడు సినిమాలో "తలకి నీళ్ళోసుకొని తడియార బోసుకొని" అనే పాటను చక్కగా వాయిస్తారు. ఈ పాటకు అనుగుణంగా గంగిరెద్దు అది నిల్చున్న భంగిమలో శరీరాన్ని ఊపుతూ ప్రేక్షకులకు నృత్యం చేస్తున్న భావనను కలిగిస్తుంది. ఈ ప్రదర్శనలో గంగిరెద్దు తన బరువు మొత్తాన్ని వెనుక కాళ్ల మీద మోపుతుంది. ఇలా చేయడానికి గంగిరెద్దుకు మంచి తర్ఫీదు ఉండాలి. ఈ భంగిమలో గంగిరెద్దు కేవలం నిలబడడం కాకుండా నాట్యం చేస్తున్నట్లుగా శరీరం మొత్తం ఊపడం చాలా కష్టమైన పని. గంగిరెద్దు తన బరువును ఏ మాత్రం ముందుకాళ్ళ మీద మోపినా కింద పడుకున్న వ్యక్తి ప్రాణాలకు అపాయం

కలుగుతుంది. అందువల్ల ఇది సాహసంతో కూడుకున్న ప్రదర్శన అని చెప్పాలి.

**3. పీటమీద గంగిరెద్దు నాలుగు కాళ్ళనూ ఒక దగ్గరపెట్టి నిలబడడం :** గంగిరెద్దుల వారి నాయకుడు ఈ ప్రదర్శనలో ఇలా మాట్లాడతాడు. "అయ్యా చూడండి ప్రభువులు గంగిరెద్దు ఇప్పటి వరకూ చేసినవన్నీ ఒక ఎత్తు, ఇప్పుడు చేసే విద్య ఒక ఎత్తు. ఇది చిన్నపీట. దీనిమీద మనిషి కూర్చుంటే విరిగిపోతుంది. ఇలాంటి పీటమీద గంగిరెద్దు తన నాలుగు కాళ్ళూపెట్టి అరగంటసేపు నిలబడుతుంది అని చెప్పి గంగిరెద్దును పీట దగ్గరకు తీసుకొని వచ్చి ముందు దాని రెండు కాళ్లను పీట మీద పెట్టించి వెనుక రెండు కాళ్ళను మెల్లమెల్లగా ముందుకు జరుపుతూ మొత్తం నాలుగు కాళ్ళను పీట మీద పెట్టే లాగ చేస్తాడు. అలా కాసేపు నిలబడిన తరువాత గంగిరెద్దునాయకుడు పీట మీద నుండి గంగిరెద్దును దిగమని చెబుతాడు. ఐతే అది దిగదు. అప్పుడు అతను ఇలా మాట్లాడతాడు.

"దిగుస్వామి అంటే దిగనంటుంది
అయ్యగారు జలతారు ఇస్తారంటున్నారు దిగవయ్యా
అయ్యగారు పాత పంచెలసాపు ఇస్తారంటున్నారు దిగవయ్యా
అప్పారావుగారు శాలువా ఇస్తానంటున్నారు దిగవయ్యా
రామారావుగారు పొందూరు కండువా ఇస్తానంటున్నారు దిగవయ్యా
నీకు మోపురం మీద వేసుకోవడానికి కొత్త కండువా ఇస్తారంట దిగవయ్యా"

అని అనేక రకాలు బ్రతిమాలతాడు. అయినా సరే గంగిరెద్దు దిగదు. అప్పుడు ప్రధాన ఆటగాడు ప్రేక్షకుల్లో ఒకరి దగ్గరికి వెళ్ళి అయ్యా! బాబుగారు మీరైనా చెప్పండి దిగి పొమ్మని అని చెబుతాడు. ఆ వ్యక్తి గంగిరెద్దును పీట మీద నుంచి దిగిపొమ్మని చెబుతాడు. వెంటనే గంగిరెద్దు పీట మీద నుంచి దిగిపోతుంది. ఈ విధంగా గంగిరెద్దుల వారు తమ ప్రదర్శనలో ప్రేక్షకులను కూడా భాగస్వామ్యులను చేస్తారు.

**4. అత్త - కోడలు ప్రదర్శన :** ఈ ప్రదర్శనలో గంగిరెద్దులవారు ముగ్గురు లేక నలుగురు వ్యక్తులు పాల్గొంటారు. గంగిరెద్దు కోడలి పాత్రను పోషిస్తుంది. సాధారణంగా లోకంలో అత్త కోడలును ఏదో ఒక నెపం మీద తిట్టడం, కోడలు మూతి ముడుచుకోవడం, అలగడం జరుగుతూ ఉంటుంది. అత్త సాధింపులు రోజురోజుకూ పెరిగిపోతూ ఉంటే ఆ సాధింపులు పడలేక కోడలు తన భర్తతో వేరే కాపురం పెట్టాలని ప్రయత్నిస్తుంది. ఇందుకోసం కోడలు భర్త చెవిలో ఇల్లు గట్టుకొని వేరేపోదాం అని చెబుతూ ఉంటుంది. ఐతే ఆమె భర్త వేరు పోవడానికి అంత తొందరగా ఒప్పుకోడు. గంగిరెద్దులవారు లోకంలో జరిగే ఈ విషయాన్ని ఆధారంగా చేసుకొని అత్తా-కోడలు ఆటను ప్రదర్శిస్తారు.

ఈ ప్రదర్శనలో అత్త కోడలును బూతుమాటలతో తిట్టడం, కోడలు పాత్రను



పోషిస్తున్న గంగిరెద్దు మోర ఎత్తుకొని అలిగి వెళ్ళిపోయిన కోడలు లాగా గునగున నడుచుకుంటూ వెళ్ళి దూరంగా నిల్చోవడం, చుట్టుపక్కల అమ్మలక్కలు వచ్చి కోడలుకు నచ్చజెప్పడం మొదలైన విషయం అంతా చక్కటి హాస్యంతో ప్రేక్షకులు కడుపుబ్బ నవ్వు కొనే విధంగా ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శన ఒక అరగంట సేపు పడుతుంది. ఇందులో అత్త గారుగా ఒక వ్యక్తి, ఇరుగుపొరుగు అమ్మలక్కలుగా ఇద్దరు వ్యక్తులు, కోడలుగా గంగిరెద్దు పాల్గొంటారు. మొదట అత్తగారు పాత్రను పోషించే వ్యక్తి ప్రదర్శనను ప్రారంభిస్తాడు.

అత్త : సూరమ్మ పిన్నీ, సత్తెమ్మ పిన్నీ, వెంకాయమ్మత్తా ఇటురండే బాబు. మా మాయదారి కోడలుముండ ఉత్తుత్తినే అలిగి వెళ్లిపోతుందమ్మా.

సూరమ్మ : అత్తగారింట్లో అత్తమీద అలిగిన కోడలు ఎలాగ వెళ్ళిపోతుందమ్మా

గంగిరెద్దు : (మోర ఎత్తి పట్టి గునగున నడుచుకుంటూ ఒక మూలన నిలుచుంటుంది)

వెంకాయమ్మ : అమ్మాయి గోతులచ్చిమి గోతులచ్చిమీ

సూరమ్మ : కోడలు పేరు గోతులచ్చిమి గాదు జ్యోతిలచ్చిమి

వెంకాయమ్మ : అలాగా నాకు నోరు తిరక్క అలా అన్నానులే. అత్తమీద అలిగి వెళ్ళిపోయిన కోడలు ఏ తీరుగా వస్తుంది.

సూరమ్మ : ఇరుగు పొరుగు వారు వెళ్ళి పిలిస్తే వస్తుంది.

వెంకాయమ్మ : సరే అత్తగారి పేరు ఏంటమ్మ

సూరమ్మ : అత్తగారి పేరు ఆదిలచ్చిమి

వెంకాయమ్మ : సరే మామగారి పేరేంటి.

సూరమ్మ : అప్పారావు

వెంకాయమ్మ : సరే వాళ్ళాయన పేరేంటి

సూరమ్మ : సిమ్మాద్రి

వెంకాయమ్మ : ఒసే గనిసత్తిరేక నీవు అత్తగారింటికి ఒచ్చేయమ్మా

సూరమ్మ : అది రాదు సెయ్యదు, పోదాం పదవే.

అత్త : అలాగంటే ఎలాగమ్మా మనం మనం ఒకటి. ఇఖాల నా కోడలైంది. రేపు నీ కోడలవుతుంది.

వెంకాయమ్మ : అవునమ్మా ఎవరైనా ఒకటే. సరే నేను పిలుత్తానుండు. ఏమమ్మా కోడలు పిల్లా నీకేంగావాలో చెప్పు.

సూరమ్మ : దానికి నగలు కావాలేమో అడిగి చూడవే.

అత్త : ఓ సూత్రదారి గనిసత్తిరేక నీకు ముక్కులో పుల్లెడతాను రావే

వెంకాయమ్మ : అదేంటమ్మా కోడలికి ముక్కులో పుల్లెడతావా

అత్త : పుల్లంటే పుల్లకాదే, ముక్కుపుడక

సూరమ్మ : ఒసే కోడలా నీకు యానాం సిలుకుచీర కొని పెడతాం రావే, తాళ్ళరేవు తలుకుచీర కొనిపెడతాం రావే.

వెంకాయమ్మ : ఊర్కొండే. అవన్నీ పాతబడిపోయిన చీరలే బాబు. ఇప్పుడు కొత్త కోడలికి కొత్తకొత్త చీరలు కావాలి. నేను పిలుత్తాను సూడు. ఒసే కొత్తకోడలా నీకు అడవిరాముడు చీర కొనిపెడతాం రావే,ప్రేమ నగర్ చీర కొనిపెడతాం రావే, దసరాబుల్లోడు చీర కొనిపెడతాం రావే.

సూరమ్మ : ఊరుకోవమ్మ అవన్నీ పాత సినిమా చీరలు. ఇప్పుడు శివాజీచీరలు నయనతార చీరలు, త్రిష చీరలు, లయ చీరలు కావాలంట. (అలా పిలిచినా రావడం లేదు)

అత్త : నగలు వద్దు, బట్టలు వద్దు ఏరే కాపురం పెడితే వొత్తాదేమో పిలండి.

వెంకాయమ్మ : ఏమే కోడలు పిల్లా, ఏరే కాపురం ఎడతారట మొగుడూ పెల్లాం ముసుగేసుకొని తినొచ్చు రావే.

గంగిరెద్దు : (సంతోషంగా పరుగు పరుగున వస్తుంది).

అత్త : అమ్మ నాలంజో. దీనికి ఏరే కాపురం అనే సరికి ఎంత సరదా వచ్చిందో

సూరమ్మ : మరి సరదా రాదా. ఇద్దరే కదా బాదర బందీ ఉండదు.

అత్త : సరే వేరే కాపురం ఎడతాను గానీ ఇంటి పెత్తనం, పొలం పెత్తనం గానీ డబ్బు పెత్తనం గానీ, తాలం పెత్తనం గానీ ఇవ్వను.

గంగిరెద్దు : (వెంటనే మోర పైకెత్తుకొని గునగున పరిగెత్తుకుంటూ వెళ్ళి దూరంగా నిల్చుంటుంది).

వెంకాయమ్మ : అమ్మ నాయారాలో దీనికెంత ముట్టు పొగరే

అత్త : సరే అన్నీ రాగి పత్రం మీద రాసి ఇత్తాను రావమ్మ

గంగిరెద్దు : (వెంటనే పరుగు పరుగున వస్తుంది).

ఈ విధంగా అత్తాకోడళ్ల ప్రదర్శన మంచి హాస్యంగా ప్రేక్షకులను ఆకట్టుకొనే విధంగా సాగుతుంది.

గంగిరెద్దులవారు ఆట ప్రదర్శించేటప్పుడు గ్రామీణులు పళ్లేలతో, చేటలతో బియ్యాన్ని తీసుకొని వచ్చి వీరికి ఇస్తూ ఉంటారు. కొందరు డబ్బులు కూడా చదివిస్తారు. వారి పేర్లను అడిగి తెలుసుకొని గంగిరెద్దులవారు తమ సహజమైన ధోరణిలో వారిని దీవిస్తూ, పొగుడుతూ చక్కటి మాటలు పలుకుతారు. అవి ఇలా ఉంటాయి. "నల్లా పెద్దకాపుగారు బాబయ్య, లోగిట మనం ఆట కట్టుమని వచ్చి మన ఎద్దు బుద్ధిచూసి,



గేనాన్ని చూసి మహానుబాబులు నూటపదహార్లు కట్నం ఇచ్చారు బాబయ్య. అంటే నల్లావారి సంస్థానం ఎల్లప్పుడూ కూడా పాడిపంటలతోనూ, ఆవుల గోవులు, సిరి సంపదలు కూడి ఎల్లప్పుడూ ఆ ఎంకన్నబాబు కొమ్ముతో ఎగరాసులు కలిగి, నల్లావారి లోగిళ్ళు ఒకింటికి వెయ్యి కలగాలని, మన గంగిరెద్దుల వారికి పతి సమచ్చరం ఇలాగే ఇత్తున్నారయ్యా. పెదకాపుగారి సంస్థానాన్ని ఏడాదికోసారి వచ్చి దీవించి వెళ్లిపోతున్నా మయ్యా శుభోజ్జయం గలిగి శుభోజ్జయం".

ఈ విధంగా గంగిరెద్దులవారి ప్రదర్శన రెండు గంటలపాటు సాగుతుంది. ఇది గ్రామీణులకు మంచి వినోదాన్ని కలిగిస్తుంది. అందుకే నేటికి గంగిరెద్దులాటకు మంచి ఆదరణ ఉంది.

## ఒగ్గుకథ - ప్రదర్శనా విధానం :

నాకు తెలిసినంతలో ఒగ్గుకథను మించిన జానపదకళ మరొకటి లేదు. అసలు మనిషై పుట్టినవాడు తప్పనిసరిగా ఒక సారైనా ఒగ్గుకథా ప్రదర్శనను చూచి తీరాలి. అలా చూడకపోతే అది ఒక లోపమే . ఒగ్గుకథా ప్రదర్శనను చూడడం ఒక మహత్తరమైన అనుభవం. ఈకథకులు కథను అనేక రకాల బాణీల్లో, వరుల్లో చెబుతారు. ఇంచుమించుగా జానపదగేయాల్లోని అన్ని బాణీలను వరుసలను వీరు తమ కథను చెప్పే సందర్భంలో ఉపయోగిస్తారు. ఇంత గొప్పకళ తెలంగాణాకు మాత్రమే పరిమితం కావడం ఆశ్చర్యం. ఇది తెలంగాణ ప్రాంతంలో గొప్ప ప్రచారాన్ని, ప్రసిద్ధిని పొందిన జానపద కళ. ఇది కథను చెప్పడమే ప్రధానంగా ఉన్న కళ. అంటే కథాఖ్యానాత్మక కళ. దీన్ని గొల్ల, కురుమ కులాలకు చెందిన వారు ప్రధానంగా చెబుతారు. ఒగ్గుకథ ప్రదర్శన లో ఐదుగురు లేక ఆరుగురు వ్యక్తులు పాల్గొంటారు. వీరిలో ఇద్దరు ప్రధాన కథకులుగా ఉంటారు. ఈ ఇద్దరిలో ఒకరు స్త్రీవేషాన్ని ధరిస్తారు. మిగిలినవారు వాద్య పరికరాలను వాయిస్తూ వంతలుగా ప్రధాన కథకులకు తోడ్పడుతూ ఉంటారు. వీరు అవసరం అయి నప్పుడు కథలో వచ్చే అనేక పాత్రలుగా నటించి తిరిగి వాద్యకారులుగా, వంతలుగా తమ స్థానాల్లోకి వెళ్ళిపోతూ ఉంటారు. అందువల్ల ఒగ్గు కళాప్రదర్శనలో పాల్గొనే వారందరూ కథలో వచ్చే అన్ని పాత్రలను పోషించగల సామర్థ్యం కలిగినవారై ఉంటారు.

**వాయిద్యాలు - పరికరాలు :** జానపదకళ ప్రసిద్ధికి, దాని ప్రదర్శన విజయవంతం కావడానికి వాద్యాలు ఎంతగానో తోడ్పడతాయి. కొన్ని జానపద కళలు వాయిద్యం పేరుతోటే ప్రసిద్ధి చెందుతాయి. ప్రస్తుత కళ అయిన ఒగ్గుకథ అలా వాయిద్యం పేరుతో ప్రసిద్ధి పొందినదే. ఈ కళా ప్రదర్శనలో "ఒగ్గు" అనే పరికరాన్నే గాకుండా డోలు,

కర్రలు, తాళాలు నపీర మొదలైన వాయిద్యాలను కట్లకోల, చేతిరుమాలు, గజ్జలు మొదలైన పరికరాలను ఉపయోగిస్తారు.

**1. ఒగ్గు :** ఒగ్గు కథకులు ఉపయోగించే వాయిద్యల్లో ఒగ్గు ముఖ్యమైంది. ఐతే ఒగ్గును ఈ కళా ప్రదర్శనలో ఎక్కువగా ఉపయోగించరు. మల్లన్న కథ, బీరప్ప కథలను ఒగ్గుకథగా చెప్పేటప్పుడు మల్లన్న పాత్రను పోషించే ప్రధాన కథకుడు అప్పుడప్పుడు మాత్రమే ఒగ్గును ఉపయోగిస్తాడు. ఐనప్పటికీ ఈ కళకు ఒగ్గుకథ అనే పేరు రావడానికి ఈ కథను చెప్పే కురుమలు శైవులు కావడం, శైవాంశ సంభూతులైన మల్లన్న, బీరప్పల గురించి కథలను చెప్పడం, శివుని ప్రధాన వాద్యమైన దమరుకాన్ని జానపదులు ఒగ్గు అనే పేరుతో పిలుస్తూ ఉండడం కారణం కావచ్చు. అంటే శైవులైన కురుమలు శైవమతానికి సంబంధించిన కథను చెప్పేకళకు శివుని ప్రధాన వాద్యం పేరుపెడితే బాగుంటుందనే ఉద్దేశ్యంతో వారు తమ కళకు ఒగ్గుకథ అనే పేరు పెట్టి ఉండవచ్చు. ఈ ఒగ్గును జానపదులు జగ్గు, జెగ్గు అని కూడా పిలుస్తారు. దీన్ని చెక్కతోగాని ఇత్తడితో గానీ చేస్తారు. ఇది మధ్యలో సన్నగా ఉండి రెండు చివరలా కొంచెం వెడల్పుగా గొట్టం లాగా ఉంటుంది. రెండు వైపులా మేకచర్మాన్ని అతికిస్తారు. మధ్యలో సన్నటి తాడుగట్టి ఆ తాడుకు రెండు కొనలు వదిలివేసి ఆ కొనల చివర ముడివేస్తారు. దీన్ని మధ్యలో పట్టుకొని అటూ ఇటూ వేగంగా తిప్పితే మధ్యలో కట్టిన తాళ్ల ముడి ప్రదేశం చర్మానికి తగిలి చక్కటి శబ్దం వస్తుంది. ఒగ్గు కథకులు ఈ ఒగ్గును ఒగ్గుకథా ప్రదర్శనలో మాత్రమే గాకుండా తమ ఆచార సంప్రదాయాల్లో గూడ ఉపయోగిస్తారు. కురుమలు మల్లన్న పండుగ సందర్భంలో తెల్లపాలు తీసేటప్పుడు మైలపోలు వద్ద నాగవెల్లి పటం మీద ఈ ఒగ్గును పెడతారు. అంతేగాకుండా మల్లన్న లగ్న సమయంలో, వీరబోనం తీసేటప్పుడు ఒగ్గును చేత పట్టుకొని వాయిస్తారు.

**డోలు :** ఒగ్గుకథలో డోలును ఎక్కువగా ఉపయోగిస్తారు. దీన్ని ఒగ్గుడోలు అని అంటారు. ఇది ఒక మీటరు పొడవు ఉన్న చిన్న డ్రమ్ము లాగా ఉంటుంది. దీన్ని ఇత్తడితోగాని, ఇనుముతో గాని చేస్తారు. ఎక్కువగా ఇత్తడితో చేసినదాన్నే వీరు ఉపయోగిస్తారు. ఈడ్రమ్ము లాంటి దానికి శుద్ధిచేసి ఆరబెట్టిన మేక చర్మాన్ని బిగిస్తారు. ప్రదర్శన సమయంలో మేక చర్మానికి కట్టిన తాళ్ళను గట్టిగా లాగి కడతారు. ఇలా లాగి కట్టడం వల్ల మంచి శబ్దం వస్తుంది. ప్రదర్శన అయిపోగానే తాళ్ళను వదులుగా ఉంచుతారు. ఇలా చేయడం వల్ల డోలుకు కట్టిన చర్మం దెబ్బతినకుండా ఉంటుంది. డోలును కురు మలు నేలమీద పెట్టరు. నేలమీద పెట్టడాన్ని అపవిత్రంగా భావిస్తారు. చాప మీద గానీ, గొంగడి మీద గానీ లేదా అరుగు మీద గానీ పెడతారు. లేకపోతే చిలుకకొయ్యకు తగిలిస్తారు. డోలు



రెండు ఆడుగుల పొడవు, మూడు అడుగుల వెడల్పు ఉంటుంది.

ఒగ్గుకథ మొదలు పెట్టేటప్పుడు కథా ప్రారంభ సూచకంగా డోలును వాయిస్తారు. డోలును కర్రలతో వాయిస్తూ తాము ఒగ్గుకథ చెప్పిన ఊర్ల పేర్లను, తనకు ఆర్థిక సహాయం చేసిన వ్యక్తుల పేర్లను, ఒగ్గుకథను చెప్పించిన వారి పేర్లను పొగుడుతూ చెబుతారు. ఈ డోలు శబ్దాన్ని బట్టి ఒగ్గుకథ ప్రారంభమౌతూ ఉందని ఊర్లో ఉన్న ప్రజలు తెలుసుకొని ఒగ్గుకథను వినడానికి వస్తారు.

డోలును ఒగ్గుకథా ప్రదర్శనలోనే కాకుండా ఆచార సంప్రదాయాల సమయంలో కూడా బాగా ఉపయోగిస్తారు. కురుమలు మల్లన్న పండుగ సందర్భంలో మల్లన్నను ఊరేగించేటప్పుడు, జలదికి వెళ్ళేటప్పుడు, మైలపోలు తీసినప్పుడు, నాగవెల్లి, వీరబోనం చేసినప్పుడు, పటం ఎక్కేటప్పుడు డోలును ఉధృతంగా వాయిస్తారు. ఈ సందర్భాల్లో ఎక్కువ డోల్లను ఉపయోగిస్తారు. అంతే గాకుండాపై సందర్భాల్లో కురుమలు డోల్లతో విన్యాసాలు చేస్తారు. వలయాకారంలో తిరుగుతూ నృత్యం చేయడం, ఇద్దరు వ్యక్తులు ఒకరి డోలును మరొకరు వాయించడం, డోలు తాడును పళ్ళతో పట్టుకొని నృత్యం చేస్తూ వాయించడం, కూర్చొని డోలును వీపుకు ఆనించి చేతులు వెనక్కితిప్పి డోలును వాయించడం లాంటి అనేక రకాల విన్యాసాలను వీరు చేస్తారు. ఈ విన్యాసాల సందర్భంలో డోలు శబ్దం చెవులు గింగురుమనేలాగా ఉంటుంది. అంతేగాకుండా గుండెలు అదిరిపోయేలాగా ఉంటుంది. ఈ డోలుకు తోడుగా పెద్దతాళాలు, నపీర శబ్దాలన్నీ కలిసి భయాన్ని, భక్తిని, పరవశాన్ని కలిగిస్తాయి. ఈ పరవశత్వం జానపదులకు ఒక్కొక్కసారి పూనకాన్ని తెప్పిస్తుంది.

డోలును వాయించడానికి రెండు కర్రలను ఉపయోగిస్తారు. ఇవి ఒక్కొక్కటి అడుగు పొడవు, ఒకటిన్నర ఇంచి వెడల్పు ఉంటాయి. ఈ కర్రలుగా సితపాలకర్ర, జిల్లేడుకర్ర, పాలకుర్సె కర్ర, టేకుకర్ర, భూతంకుర్సకర్ర, ఉడుగుకర్రల్లో ఏదైనా ఒక దానికి ఉపయోగిస్తారు.

**తాళాలు :** ఒగ్గుకథకులు కథను చెప్పేటప్పుడు పెద్దతాళాలను, చిన్నతాళాలను ఉపయోగిస్తారు. పెద్ద తాళాలను ఒగ్గుకథను ప్రారంభించడానికి ముందు ప్రారంభ సూచకంగా ఉపయోగిస్తారు. చిన్న తాళాలను కథను చెప్పే సమయంలో ఎక్కువగా ఉపయోగిస్తారు. పెద్ద తాళాలను ఒగ్గువారు మల్లన్న పండుగ సమయంలో మల్లన్నను ఊరేగించేటప్పుడు వీరబోనం తియ్యడం, పటం తొక్కడం లాంటి ఉత్తేజపూరితమైన ఘట్టాల్లో ఉపయోగిస్తారు.

**నపీర :** దీన్ని ఇత్తడితో చేస్తారు. దీని శబ్దం కొమ్ముువాద్య శబ్దం లాగా ఉంటుంది. ఐతే

ఇది కొమ్ములాగా వంకరగా ఉండదు. కొమ్ము అంతపొడవుగా కూడా ఉండదు. కొమ్ములో సగం పొడవు ఉంటుంది. ఇది నోటి దగ్గర పెట్టుకొని వాయించే వైపు సన్నగా ఉండి గాలి వెళ్ళే వైపు వెడల్పుగా ఉంటుంది. ఒగ్గుకథా ప్రారంభంలో కథ ప్రారంభ మవుతుందని చెప్పడానికి దీన్ని ఊదుతారు. దీన్ని ఊదడానికి మంచి శక్తి అవసరం. దీన్ని నోట్లో పెదవులకు ఎడమ వైపు ఆనించి కడుపు నిండా గాలి బాగా పీల్చి కడుపు బిగపట్టి గట్టిగా ఊదుతారు. నపీరను ఒగ్గుకథలోనే కాకుండా మల్లన్న, బీరన్న పండుగ సమయాల్లో జలదికి వెళ్ళేటప్పుడు చేసే ఊరేగింపులో, వీరబోనం తీసేటప్పుడు, అగ్ని గుండం తొక్కేటప్పుడు ఊదుతారు.

**కనకడప్పు :** ఇది చిన్న డప్పు లాగా ఉంటుంది. దీన్ని ఇత్తడితో గానీ, స్టీలుతో గానీ చేస్తారు. దీని అంచు వెంట చిన్న చిన్న ఇనుపబిళ్ళలు ఉంటాయి. దీన్ని ఎడమ చేత్తో పట్టుకొని కుడిచేత వాయిస్తున్నప్పుడు ఈ బిళ్ళలు శబ్దాన్ని కలిగిస్తాయి.

**గజ్జెలు :** ఒగ్గు కథకులు రవ్వగజ్జెలు, చిరుగజ్జెలు, పిక్కగజ్జెలు అనే మూడు రకాల గజ్జెలను ఉపయోగిస్తారు. రవ్వగజ్జెలను కట్లకోలకు ఒక చివర కడతారు. ఈ కట్లకోలను పురుష రూపంలో ఉన్న ప్రధాన కథకుడు పట్టుకొని ఉంటాడు. చిరుగజ్జెలను ప్రధాన కథకులిద్దరూ కాళ్ళకు కట్టుకుంటారు. మల్లన్న, బీరన్న పండుగుల సందర్భాల్లో ఊరే గింపు సమయంలోను వీరబోనం తీసినప్పుడు ఒగ్గువారు పిక్కగజ్జెలు కట్టిన లాగులను తొడుక్కొని నృత్యం చేస్తారు. అంటే పిక్క గజ్జెలను లాగులకు కడతారు. వీటిని ఒగ్గు కథా సమయంలో వినియోగించరు.

**కట్లకోల :** ఇది నల్లగా ఉన్న కర్ర. దీనికి ఇత్తడికట్లు వేయబడి ఉంటాయి. దీనికి ఒక చివర మూడు లేదా నాలుగు రవ్వల గజ్జెలు ఉంటాయి. పురుష వేషధారి అయిన ప్రధాన కథకుడు దీన్ని పట్టుకుంటాడు. ఇతడు కథను చెప్పేటప్పుడు సందర్భాన్నిబట్టి ఈ కట్లకోలను కత్తిగా, గదగా, గుర్రాలను అదిలించే చర్నకోలగా గుర్రపు కళ్ళెంగా ఉపయోగిస్తాడు. అంతేగాకుండా ప్రేక్షకులకు ఆ కర్రను ఆయా సమయాల్లో పైన చెప్పిన వస్తువుల లాగా భ్రమకలిగించేలా చేస్తాడు.

**చేతి రుమాలు :** చేతిరుమాలను స్త్రీ వేషాన్ని ధరించిన ప్రధాన కథకుడు పట్టుకుంటాడు. ఇతని చేతిలో అది అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. కథలో వచ్చే సందర్భాన్ని బట్టి చేతిరుమాలు గంప, చేట, జోలె మొదలైన అనేక వస్తువుల లాగా ఉపయోగ పడుతుంది. ఇది కథకుని చేతిలో ఒక అవయవం లాగా పనిచేస్తుంది. కథ చెప్పినంతసేపు ఇది కథకుని చేతిలో ఉంటుంది. ఇది లేకపోతే కథకుని చెయ్యి విరిగినట్లుగా ఉంటుంది. సందర్భాన్ని బట్టి ఈ జేబురుమాలు అనేక రసాలను అభినయించడానికి వీలుగా



ఉంటుంది. కరుణరస సన్నివేశాల్లో కళ్ళు తుడుచుకోవడానికి, శృంగార సన్నివేశాల్లో హొయలు వలకబోస్తూ వయ్యారాలు చూపించడానికి ఇది బాగా ఉపయోగపడుతుంది.

**పట్టుసెల్ల :** పట్టుసెల్ల అంటే పట్టువస్త్రం. ప్రధాన కథకుడు దీన్ని భుజంమీద వేసుకో వడం గానీ, నడుముకు కట్టుకోవడం గానీ చేస్తాడు. కథలో వచ్చే సమయ సందర్భా లను బట్టి కథకుడు దీన్ని చీరగా, కండువాగా, తలపాగగా నడుముకు కట్టుకొనే వస్త్రంగా, ఆయుధంగా, ఇంకా పాత్రోచిత పరికరంగా ఉపయోగించుకుంటాడు. స్త్రీ పాత్రను పోషించ వలసి వచ్చినప్పుడు ఈ పట్టుసెల్లాను భుజం మీద పైటగా వేసు కోవడం వల్ల, తలమీద కొంగుగా వేసుకోవడం వల్ల దాన్ని చీరగా మలుచుకుంటాడు. పురుష పాత్రను పోషించేటప్పుడు నడుముకు దట్టీ లాగా కట్టుకుంటాడు. లేకపోతే భుజంమీద కండువా లాగా వేసుకుంటాడు.

పైన చెప్పినవే కాకుండా నాగబంధం, ఒక గజ్జెల చొక్కా, గజ్జెల లాగు, వీరడోలు, ముగ్గు పలకలు, తెల్లపిండి, పచ్చపిండి, తంగేడుపిండి, బొగ్గుపొడి, పసుపు, కుంకుమ మొదలైన వాటిని కూడా ఒగ్గుకథకులు ఉపయోగిస్తారు.

**ఒగ్గుకథకుల వేషధారణ :** ఒగ్గుకథలో ప్రధానకథకులు ఇద్దరుంటారు. వీరిలో ఒకరు స్త్రీవేషాన్ని ధరిస్తారు. పురుష వేషంలో ఉన్న ప్రధానకథకుడు ఎర్రంచు ఉన్న ముతక దోవతిని గానీ, ఎర్రరంగు ఉన్న ముతక దోవతిని గానీ కడతాడు. తలకు తలపాగ చుడతాడు. ముంజేతికి కడియాలు, కుడికాలు రెండవ వేలికి మట్టె, బొడ్లో కీలుకత్తి, చేతిలో కట్లకర్ర పట్టుకుంటాడు. నాగబంధాన్ని అప్పుడప్పుడు నడుముకుగాని తలకు గాని చుట్టుకుంటాడు.

స్త్రీవేషంలో ఉన్న రెండవ ప్రధాన కథకుడు ఒగ్గుకథలో ప్రత్యేకమైన ఆకర్షణగా ఉంటాడు. ఇతని చేతిలో చేతిరుమాలు ఉంటుంది. ఇతను కండువాను లేదా పట్టు సెల్లాను చీరకొంగు లాగా వేసుకుంటాడు. లేకపోతే చీరకట్టుకుంటాడు. ఎక్కువగా చీరనే కట్టుకుంటాడు. తలవెంట్రుకలను కిందికి జారవిడుస్తాడు. లేకపోతే కొప్పు లాగా ముడివేసు కుంటాడు. ఇతని స్త్రీ వేషం సహజంగా ఉంటుంది. చూసేవారికి కృత్రిమంగా కనిపించదు. ఎందుకంటే స్త్రీవేషాన్ని ధరించే కథకుడు ఆడవారి లాగా తలవెంట్రుకలు పొడవుగా పెంచుతాడు. చెవులకు, ముక్కుకు, ఆభరణాలు పెట్టు కోవడానికి రంధ్రాలు ఉంటాయి. గడ్డం, మీసం తీసివేసి ముఖాన్ని నునువుగా ఉంచుకుంటాడు. కాళ్ళకు గజ్జెలు, మట్టెలు, చేతులకు గాజులు, నడుముకు వడ్డాణం, మెడలో నగలు, నుదుట పెద్దబొట్టు, జడకుప్పె జడలో పువ్వులు పెట్టుకుంటాడు. ఇలాంటి వేషధారణతో అతను నిజంగా స్త్రీయే అన్న భ్రాంతిని కలిగిస్తాడు.

వంతలు దోవతి కట్టుకొని దానిపైన లాల్చీ లేదా చొక్కాను వేసుకొని ముదురు రంగు శాలువాను నడుముకు కట్టుకుంటారు. మిగిలిన వాద్యకారులు సాధారణ వేషంలోనే ఉంటారు.

**ప్రదర్శనా విధానం :** ఒగ్గుకథ చాల ఆసక్తికరంగా ఉండడం చేత దాన్ని వినడానికి చాల మంది వస్తారు. అందువల్ల విశాలమైన ప్రదేశంలో అంటే ఎక్కువ మంది కూర్చోవడానికి వీలున్న ప్రదేశంలో వేదికను ఏర్పాటు చేస్తారు. వేదిక ముందు ప్రేక్షకులు కూర్చోడానికి వీలుగా విశాలమైన ఖాళీ ప్రదేశం ఉండేలాగా చూసుకుంటారు. కథకులు అలసిపోయినప్పుడు విశ్రాంతి తీసుకోవడానికి వీలుగా వేదిక మీద ఒకటి రెండు చాపలు పరుస్తారు. లేదా నాలుగైదు కుర్చీలు గానీ, పొడవైన బల్లను గానీ వేస్తారు. లేకపోతే జంఖానా పరుస్తారు. ప్రస్తుతం ఆధునిక పద్ధతుల్లో వేదిక మీద మైకులు అమర్చి విద్యుద్దీపాల వెలుగులో అన్ని హంగులతో కథను చెప్పిస్తున్నారు.

కథను ప్రారంభించడానికి ముందు ఒగ్గుకథా బృందంలోని ఇద్దరు సహాయకులు ఒకరు ఒగ్గుడోలును, ఇంకొకరు పెద్ద తాళాలను గట్టిగా వాయిస్తూ కథ ఏ ప్రాంతంలో చెప్పబడుతుందో ఊర్లోని వారందరికీ తెలిసేలా చేస్తారు. అంతేగాకుండా ఒగ్గుకథ ప్రారంభమవుతూ ఉందనే విషయాన్ని కూడా వాద్యాలను వాయించడం ద్వారా తెలియజేస్తారు. ఈ వాయిద్యాలు విన్నవెంటనే ప్రజలు ప్రదర్శనా స్థలానికి చేరుకుంటారు. ప్రేక్షకులందరూ వచ్చిన తరువాత మొదట ప్రధాన కథకుడు, ఆ తరువాత వంతలు వాద్యకారులు వేదిక మీదకు వస్తారు. వేదిక మీద పసుపు కుంకుమలు చల్లి, కొబ్బరి కాయ కొట్టి, అగరువత్తులు వెలిగించి అందరూ ప్రేక్షకులకు నమస్కరిస్తారు. అప్పటి వరకు ఒగ్గుడోలు, పెద్దతాళాలు ఉధృతంగా మోగుతూనే ఉంటాయి. వేదిక మీద పూజ అయిపోయిన తరువాత ప్రధాన కథకుడు వేదిక మీద నిలబడగా అతనికి ఇరువైపులా ఇద్దరు సహాయకులు నిలబడతారు. వీరి వెనుక వాద్యకారులు కూర్చుంటారు. ప్రధాన కథకుడు రెండడుగులు ముందుకు వేసి యాదవుల కులదేవత అయిన గంగాదేవిని ఇలా ప్రార్థిస్తాడు. సహాయకులు వంతపలుకుతూ ఉంటారు.

"శరణు శరణు మాయంబా రాణీ శంబావో రాణీ ! శంబావోరాణీ
కరుణ జూడు మాకన్నాతల్లీ గంగా రావమ్మా దేవీ మాయమ్మా ॥శరణు॥
అమ్మా పుట్టుబంతూలు మాయి పుల్లెడ్లు మాయీ పుల్లెడ్లు మాయీ
పున్నెమైనా దొనకొండ పుట్నిల్లు మాది కట్నిల్లు మాది ॥శరణు॥
కట్టూబంతూలు మాయి కర్రెడ్లు మాయి కర్రెడ్లు మాయి
కాపురాన దొనకొండ కట్నిల్లు మాది పుట్నిల్లు మాది ॥శరణు॥





ఒగ్గు కథ ప్రదర్శన (ఒగ్గు సోమయ్య బృందం, ఉప్పల్, హైదరాబాద్)



ఒగ్గు కథ ప్రదర్శన (ఒగ్గు సోమయ్య బృందం, ఉప్పల్, హైదరాబాద్)

అమ్మా బాగలపూవంటీదమ్మా కర్రెబోల్లావు కర్రెబొల్లావు
బొల్లావు బసవదేవుడు బోయూడైతన్న బోయూడైతన్న ॥శరణు॥
ఐదు గొంగూల చీరె అద్దాలరైకె అద్దాలరైకె
ఐతమన్న గొలువంగ ఆనందమమ్మా శివానందమమ్మా ॥శరణు॥
ముందు మాయాదవులకు మూలదేవతా మూలదేవతా
మందలోన నెలకొన్నా భగవ సౌదమ్మా దేవి సౌదమ్మా ॥శరణు॥
గంగా వచ్చే సూడారమ్మ గాలీమేగాన గాలిమేగాన
ఓనువందు ముత్యాలపేరు ఒళ్ళందు మెరయా ఒళ్లందు మెరయా ॥శరణు॥
గంగ నిన్ను కొలిచేటి ఘనులెవ్వారమ్మా ఘనులెవ్వరమ్మా
గనమైన మట్టేవాడా గంగ చెలికాడూ గంగాచెలికాడూ ॥శరణు॥
ఎర్రంగ పూసిన ఎంపల్లా క్రిందా ఎంపల్లా క్రిందా
ఎత్తి నిన్ను కొలిసింద్రూ ఎరగొల్లా రాజూ ఎరగొల్లారాజు ॥శరణు॥
పట్టుమూటలు కట్టి పాలేరు మీదా పాలేరు మీద
పాలతోటి పూజలు కొన్నా పరమ కళ్యాణీ పరమకళ్యాణీ ॥శరణు॥
నీలిమూటలు కట్టి నీలేరు మీదా నీలేరు మీదా
నీళ్ళతోటి పూజలు గొన్నా నీరజాక్షివమ్మా గంగాభవానీ ॥శరణు॥

గంగ ప్రార్థన అయిపోయిన తర్వాత గంగ ప్రార్థనకు గల కారణాన్ని గురించి ప్రధాన కథకుడు ఇలా చెబుతాడు. "ఈగంగనెందుకు ప్రార్థించాలంటే గంగవల్ల రుతుగా వర్షాలు పడ్తున్నాయ్, హనువుగా పంటలు పండుతున్నాయ్, గంగ కరుణించకపోయినా రుతుగా వర్షాలు పడకపోయినా హనువుగా పంటలు పండకపోయినా ఏగవర్నమెంటైనా ప్రజల కష్టాలు కడతేర్పదు కాబట్టి గంగప్రార్తన అవసరముంది." అని చెప్పి ఆతర్వాత విఘ్నేశ్వరుని ఇలా ప్రార్థిస్తారు.

"ఆది గణాధిపతీ ఆనందామూర్తీ ఆనందామూర్తీ
ఆది గణాధిపతీ ఒనరైన మూలశక్తీ
ముందుపూజలు నీకే కదా మూల కిన్నెరలు మ్రోగంగా
ఎలుక వాహన మెక్కితివయ్యా ఎల్లలోకముల నేలితివయ్యా ॥ఆది॥
తొండాముతో నీళ్ళు తెచ్చి తోరంబు బొజ్జ కడిగి
తండ్రి చేత పూజలు గొన్నా స్వామి గణాదిపతీ నీకు మొక్కెదా ॥ఆది॥
భాద్రపద శుద్ధచవితీ భక్తి మీర గొలుతుమయ్యా
నాగవాసులైనా మీకు నమ్మి మ్రొక్కులిడుదుమయ్యా ॥ఆది॥

జాలి చెంబూ నీళ్ళు తెచ్చి జలకములూ చేపింతుమయ్యా
ఇరవయ్యొక్కా పత్రితోను ఇంపుగా పూజింతుమయ్యా ॥ఆది॥
ఊరు చుట్టూ వరిచేన్లూ, ఉండ్రాళ్ళ పాయసమూ
మెత్తటి కుడుములు సప్పిందుండ్రములు అవి నీకు
ఆరగింపుడూ ఆరగింపుడూ ॥ఆది॥
శరణు శరణు మని వేడితివయ్యా
నీదు కరుణ కాశించితిమయ్యా ॥ఆది॥

ఆ తరువాత ఒక గేయంలో ఈశ్వరుని, భూదేవతను, ఒగ్గువారి కులదేవతలైన మల్లన్న, బీరప్పలను, విద్య నేర్పించిన గురువులను, జన్మనిచ్చిన తల్లిదండ్రులను స్త్రీ దేవత అయిన పోచమ్మను తలుచుకుంటారు.

"హర హర మహాదేవా శంబో శంకరా- శంబోశంకరా శరణయ్య మహాదేవా
ఆదేవి దండాము తల్లి బూదేవి దండాము- తొక్కిన బూదేవతా తోడై ఉండుమా
మొక్కిన బూదేవతా మోక్షము నీమ్మా- మాదేవుడు మల్లయ్యా కులగురువు
బీరయ్యా మోగె రణబేరి యెండి పిల్లన గొయ్య- మోగేటి తాళాము పాదాన గజ్జెలూ
పాదాన గజ్జెలకు పదివేల దండాలు- విద్యాబుద్దులు నేర్పిన పెద్దలకూ దండాలు
తల్లిదండ్రి పాదాలకూ పదివేల దండాలు- పోచమ్మ దండాము తల్లీ బొడ్రాయి దండాము"

ఈ విధంగా దైవప్రార్థన చేసిన తరువాత తాము తిరిగిన దేశదేశాల పేర్లను ప్రస్తావిస్తారు. తరువాత తాము అప్పుడు కథను చెబుతున్న ఊరిని గురించి, కూడా వివరిస్తారు. ఆ తరువాత తమతో కథను చెప్పిస్తున్న వారి పేర్లను, వారి తల్లిదండ్రుల పేర్లను, వారి వంశ గౌరవాన్ని కీర్తిస్తారు. ఆ తరువాత ప్రధాన కథకుడు కథను ప్రారంభిస్తాడు. ఇతను కథను చెప్పేటప్పుడు ఎడమ చేతిని ఎడమ చెవి మీద పెట్టు కొని కుడిచేతిని పైకెత్తి కథను చెబుతాడు.ఇతడు కథను వచనంలోనూ గేయరూపం లోనూ చెబుతాడు. గేయంలో చెప్పేటప్పుడు రాగయుక్తంగా చెబుతూ ఉంటే వంతలు" రామరామరామా రామాఒయ్‌రామా" అంటూ వంత పాడుతూ ఉంటారు. ప్రధాన కథకుడు వచనంలో కథను చెప్పేటప్పుడు గూడా రాగయుక్తంగానే చెబుతాడు. ఉదాహరణకు బీరప్ప కథను వచనంలో ఇలా మొదలు పెడతాడు.

"గాజులకొండపట్నమేలేటి దొంతిరాజు ఏమంటయున్నాడే, దొంతి మీద దొంతి ఏడు దొంతులు వెట్టంగ ఏడో కొడుకు పుట్టిండు కావట్టి దొంతిరాజని పేరు వెట్టిండ్రటా. గాజులకొండ పట్నం పరిపాలిస్తుంటే మరి అమరగన్నెను లగ్గమాడిండటా, వాళ్ళు రాజ్యపరిపాలన జేస్తున్నరమ్మా, వారికి పిల్లల్లేకపాయే లేకపాయే, పిల్లల్లేని ఇల్లు



పీర్లకొట్టమన్నరు బాలల్లేని ఇల్లు బర్లకొట్టమన్నరే అమ్మా, గొలగొల వలపోస్తున్నది అమరగన్నె, అప్పుడు వేదమూర్తుల పిలిచి సంతాముందా లేదాని చూపెట్టగా, మీరు అందమైన బాయి తొవ్వాల్లమ్మో, ఆబాయిలో ఉన్న నీళ్ళతోటి పూజల్జేస్తే మీకు సంతాన మైతాదని చెప్పవట్రి పెద్దలే రామరామో, ఆలుమొగలు సేతులకు కంకణాలు గుట్టుకు న్నారు గడ్డపారలకు కంకణం కట్టినారే, వందమంది వేదమూర్తులతోటి అటువంటి బాయికి మూర్తాలు వెట్టించైనా,

పైన చెప్పిన కథలో ప్రధానకథకుడు కామాలు పెట్టిన వరకు కథను చెప్పి చివరి పదం చివరి అక్షరాన్ని దీర్ఘంగా రాగం తీస్తూ చెబుతాడు. వంతలు తమ వాద్యాలైన డప్పు గజ్జలు తాళాలు మొదలైన వాటిని తగిన మోతాదులో వాయిస్తూ ఆ ....... అని కొంచెం సేపు రాగం తీస్తారు. ప్రధానకథకుడు వచనంలో ఇలా కథను చెప్పేటప్పుడు ఒక్కొక్కసారి వంతలందరూ కలిసి ఒక్కసారిగా వాద్యాలను వాయిస్తూ ఓ ........... అని ఒక సారి, ఏ............ అని మరొకసారి అని గట్టిగా గోల చేస్తున్నట్లుగా రాగం తీస్తారు. ఒక్కొక్కసారి వంతలు "రామరామో" అని వంత పలుకుతారు. ఈవిధంగా వంతలు వంత పలుకుతూ ఉంటే కథకుడు వచనంలో కథను చెబుతాడు. కథకుడు గేయరూపంలో కథను చెప్పేటప్పుడు చెప్పే పద్ధతి వేరుగా ఉంటుంది. ఉదాహరణకు కింది గేయభాగాన్ని తీసుకుందాం.

"చల్ బాయి దోడా వట్టీరీ రామన్నరామా -ముత్తాలకాబాయీ మూలనందమమ్మా
పొడాలకాబాయీ పాకులందమేమీ"

పైగేయంలో మొదటి పాదాన్ని కథకుడు మంచి ఊపు మీద పాడతాడు. వంతలు దానికి తగినట్లుగా వాద్యాలను వాయిస్తూ అదే ఊపు మీద అపాదాన్ని తిరిగి పాడుతారు. కథకుడు అలాగే రెండవపాదాన్ని గూడా పాడితే వంతలు తమ వాద్యాలను వాయిస్తూ అలాగే వంత పాడుతారు. లేకపోతే "రామరామరామా రామాఒయ్‌రామా" అనే పాదాన్ని వంతగా పాడుతారు. ఇదే పద్ధతిలోనే కింది వచనాన్ని గేయబాగాన్ని కథకుడు వంతలు కలిసి ఎంతో రమణీయంగా ఆసక్తికరంగా పాడుతారు.

**వచనం :**"అటువంటి బాయి తోడిచ్చిండ్రో, ఆబాయినీళ్ళు తీసుకోని గనకనేమి ఆనీళ్ళ తోటి నారింజతోట వెట్టిండ్రూ, నారింజతోట పూవులుబూసి కాయలు గాసి పండ్లు వండినాయో. వచ్చేపోయే పచ్చులా పండ్లు దింటున్నయమ్మా, ఆపండ్లు దిన్న పచ్చుల దీవనార్తి పెడ్తే ఆదీవనార్తిలో కొడ్కు వుడ్తున్నడమ్మో నారదా, నారింజపండ్లు దిన్న పచ్చులు దీవనార్తి వెట్టినాయంట, ఆదీవనార్తి వల్ల బుట్టిండు

**గేయం :** "రాజరాజరాజా రాజ నారదుడూ

అందమైన కొడుకు పుట్టెనూ రామ ఓరామా"

**వచనం:** కొడ్కు వుట్టిండని సంతోషపడ్తున్నరటా వాళ్ళు, మరివొక్క బిడ్డుంటే బాగుండు మరి తమ్మల్లేని పెళ్ళి జెయ్యరాదు ఆడివిల్ల లేని సావు సావరాదూ, ఆడివిల్ల గావాలంటున్నారమ్మో, అదే బాయి నీళ్ళతోటి సూర్యనమస్కారాల్ చేయవట్టిరి అరటితోట పండ్లతోటి పూజల్ సేయవట్టిరమ్మా అమ్మలారో, సూర్యనమస్కారాల్ జేయంగ వుట్టిందీ

**గేయం :** "అలుగులాది సూరమ్మా దేవీ సూరమ్మా

ఆడివిల్ల జన్మమైతధే రామ ఓరామా"

ఈవిధంగా ప్రధానకథకుడు, వంతలు కథను రసవత్తరంగా నడుపుతారు.

మిగిలిన కథాఖ్యాన కళలకు ఒగ్గుకథకు ప్రదర్శనలో తేడా ఉంది. మిగిలిన కథాఖ్యాన కళల ప్రదర్శనలో ప్రదర్శకులు కేవలం కథను చెప్పుకుంటూ పోతారు. వీటిలో ప్రదర్శనకారులు నటించడం ఉండదు. ఒగ్గుకథలో ప్రదర్శకులు కథను చెప్పడంతో పాటు అవసరమైనప్పుడు కథలో వచ్చే అనేక సంఘటనల్లో నటులుగా మారిపోయి తలా ఒక పాత్రను ధరించి పాత్రోచితమైన సంభాషణలతో హావభావాలతో నాటకం మాదిరిగా రక్తి కట్టించి ప్రేక్షకులకు నాటకం చూస్తున్న భావాన్ని కలిగిస్తారు. ప్రధాన కథకుల్లో ఒకరు స్త్రీవేషాన్ని ధరించి వుంటారు. ఈస్త్రీవేషధారి కథలో వచ్చే అన్ని స్త్రీపాత్రలను చాల సహజంగా పోషిస్తూ ఉంటాడు. మిగిలిన కళల్లో లేకుండా ఒగ్గుకథలో మాత్రమే ఉన్న గొప్ప లక్షణం ఇది. ఈలక్షణం ప్రేక్షకుల మీద ఎంత గొప్ప ప్రభావాన్ని చూపిస్తుందంటే ప్రేక్షకుల్లో కొంత మంది స్త్రీలు భక్తి సన్నివేశాలు వచ్చినప్పుడు పూనకం వచ్చి ఊగిపోతుంటారు. కొంత మంది పూనకంతో వేదిక మీదకు వచ్చి ఊగిపోతూ ఉంటారు. దీన్నిబట్టి ఒగ్గుకథ ప్రేక్షకుల మీద ఎంత గొప్ప ప్రభావాన్ని చూపిస్తుందో స్పష్టమవుతుంది. భయంకరమైన సన్నివేశాలు వచ్చినప్పుడు ఒగ్గుకథా కారులు తమ అరపులతో డోలు మొదలైన వాద్యాల శబ్దాలతో ప్రేక్షకులు భయపడే విధంగా చేస్తారు. అంతేకాదు కథలో వచ్చే శృంగారం హాస్యం కరుణం, రౌద్రం మొదలైన నవరసాలను నాటకంలోనో సినిమాలోనో ప్రదర్శిస్తున్నట్లుగా వీరు ఎంతో నైపుణ్యంగా చాకచక్యంగా వేదిక మీద నటించి ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేస్తారు. ఇది నిజంగా అద్భుతమైన విషయం. ఒగ్గుకథ ప్రదర్శన గురించి ఎంత చెప్పినా తీరదు. దాని గొప్ప తనాన్ని తెలుసుకోవాలంటే ప్రత్యక్షంగా దాన్ని చూసి తెలుసుకోవల సిందే. ఇంత గొప్పగా ఈకళను తీర్చి దిద్దినవారు అద్భుతమైన మేధాసంపత్తి కలవారు అని చెప్పడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. అందుకనే జీవితంలో ఒక సారైనా ఒగ్గు



కథా ప్రదర్శనను తప్పనిసరిగా చూడాలి. చూడకపోతే నిజంగా అది ఒక లోపమే. ఈ కారణంగానే ఒగ్గుకథ మిగిలిన కళల కంటే గొప్ప ప్రసిద్ధిని, ప్రచారాన్ని సంపాదించింది.

ఒగ్గుకథకులు పైన చెప్పిన విషయాన్ని తమ ప్రదర్శనా చాతుర్యంతో ఎలా రక్తి కట్టిస్తారో కొన్ని సన్నివేశాలను వివరించే ప్రయత్నం చేస్తాను. బీరన్నకథలో రాజ నారదుడు ప్రతినాయకుడు. ఇతని ఏడుగురు కుమార్తెలు బీరన్న మీద నింద వేస్తారు. దానికి భయపడి బీరన్న లింగరూపంలో ఒక చెరువులో దాకుంటాడు. అతని అక్క మహంకాళి అతని కోసం వెదికి వెదికి తమ్ముడు కనిపించక పోవడం చేత చెరువు కట్టమీద కూర్చొని తమ్ముని కోసం దు:ఖిస్తూ ఉంటుంది. ఈసన్నివేశంలో ప్రధాన కథకుడు బీరన్న పాత్రను, స్త్రీపాత్రధారి అక్క పాత్రను పోషిస్తారు. స్త్రీపాత్రధారి వేదిక మీద కూర్చొని కొంగు తలకు అడ్డం పెట్టుకొని ఎక్కడికి పోయినావురా తమ్ముడా ఏమైపోయినావురా తమ్ముడా అని దు:ఖిస్తూ ఉంటాడు. అతని దు:ఖాన్ని చూసి కొంత మంది ప్రేక్షకులు కన్నీటి పర్యతమవుతారు. ఆమె దు:ఖాన్ని విని బీరన్న చెరువు లోనుంచి బైటకు వచ్చినట్లుగా ప్రధానకథకుడు వస్తాడు. ప్రధానకథకుణ్ణి బీరన్నగా భావించి స్త్రీపాత్రధారి సంతోషంతో బీరన్నను చిన్నపిల్లవాని లాగా చంకకెత్తుకొని ఎవరు నిన్ను కొట్టినారు బీరయ్యా ఎవరు నిన్ను తిట్టినారు బీరయ్యా అని చాల ఆప్యాయంగా ప్రేమ ఉట్టిపడే విధంగా అడుగుతాడు. ఈసన్నివేశాన్ని చూస్తే నిజంగా అక్క తమ్ముణ్ణి ఎత్తుకొని లాలిస్తున్నట్లుగా ఉంటుంది. ఐతే బీరన్న పాత్రధారి పెద్దవాడుగా ఉండడం చేత అంతపెద్దవాణ్ణి వేదిక మీద స్త్రీపాత్రధారి ఎత్తుకోవడం చూస్తే ప్రేక్షకులకు మంచి హాస్యం కూడా కలుగుతుంది. ఈవిధంగా ఈసన్నివేశం ద్వారా ఒగ్గుకథకులు ప్రేక్షకులకు కరుణ హాస్యరసాలను కలిగింప జేస్తారు.

బీరన్న తన మేనమామ ఏడవకూతురైన కామరతిని పెళ్ళి చేసుకోవాలనుకొని గొర్రెలమంద దగ్గరనుంచి అక్క మహంకాళి దగ్గరకు వచ్చి తనకు పెళ్ళి చేయమని అడిగే సన్నివేశం రసవత్తరంగా ఉంటుంది. బీరన్న పాత్రను ప్రధానకథకుడు అక్క మహంకాళి పాత్రను స్త్రీపాత్రధారి పోషిస్తారు. బీరన్నను చూడగానే మహంకాళి "గొర్రెలు ఎట్లున్నయ్ గొర్రెపిల్లలు ఎట్లున్నయ్" అని అడుగుతుంది. చాల కాలం తర్వాత తాను ఇంటికి వస్తే తన గురించి అడగకుండా గొర్రెల గురించి అడుగుతున్నందుకు బీరన్న చిరాకుపడి అక్క మీద అలుగుతాడు. అక్క అతణ్ణి ఓదారుస్తుంది. ఆతర్వాత బీరన్న అక్కను బైటికి తీసుకొని వచ్చి జంటగా ఉన్న పక్షులను, ఉడుతలను చూపించి అవి ఏమిటని అడుగుతాడు. అక్క ఒకటి మగది ఇంకొకటి ఆడది అని సమాధానం చెబుతుంది. అవన్నీ జంటగా హాయిగా ఉన్నాయని తాను మాత్రం ఉంటరిగా ఉన్నానని

బీరన్న విచారిస్తూ ఉంటాడు. అక్క అతనికి దేవతల కూతుర్లను తెచ్చి పెళ్ళి చేస్తానని చెబుతుంది. బీరన్న తాను మేనమామ కూతురును పెళ్ళి చేసుకుంటానని చెబుతాడు. మేనమామ దుర్మార్గుడని అతడు బీరన్న తల్లిని, బీరన్న కడుపులో ఉన్నప్పుడు బీరన్నను చంపడానికి ప్రయత్నించినవాడని పగవాడని అందువల్ల అతని కూతురును చేసుకో వద్దని అక్క చెబుతుంది. కానీ బీరన్న తాను మేనమామ కూతురినే చేసుకుంటానని చెప్పి అక్కను ఒప్పించి తన మేనమామ నారదుని ఊరైన నాగులకొండ పట్నానికి గుర్రం మీద బయలుదేరుతాడు. అతడు గుర్రం మీద ప్రయాణం చేస్తున్నట్లుగా అభిన యిస్తూ కట్లకర్రను గుర్రపు కళ్ళెంలాగా పట్టుకొని గజ్జల శబ్దం చేస్తూ ముందుకు వెళ్తూ ఉంటాడు. ఇలా వెళ్తున్నప్పుడు మిగిలిన ప్రదర్శకులు

"ఎయ్ .... అక్కపాదం మొక్కెనా గుర్రం మీద ఎక్కెనా
ఆ మడియె తన్ను దన్నెనా తోఁదెబ్బ కొట్టెనా
గుర్రం బోత యున్నదా గురుత బోత యున్నదా........"

అని పాడుతూ బీరన్న నిజంగా గుర్రం మీద పోతున్న భావాన్ని ప్రేక్షకులకు కలిగిస్తారు. ఎల్లమ్మ కథలో శివుడు శిశువుగా ఉన్న ఎల్లమ్మను తెచ్చి పార్వతికి ఇస్తాడు. ఆమె ఆశిశువుకు ఎల్లమ్మ అని పేరు పెట్టి ఉయ్యాల్లో వేసి జోలపాట పాడుతుంది. ఈసన్ని వేశాన్ని ఎంతో అద్భుతంగా ఒగ్గుకథకులు ప్రదర్శిస్తారు. ఈ సన్నివేశంలో స్త్రీపాత్రధారి పార్వతి పాత్రను పోషిస్తాడు. వంతల్లో ఇద్దరు ఒక వస్త్రాన్ని చెరొక చివర ఉయ్యాల లాగా పట్టుకొని ఉంటే స్త్రీపాత్రధారి ఆఉయ్యాల్లో శిశువును వేసి ఊపుతున్నట్లుగా నటిస్తూ కింది జోలపాటను పాడుతాడు.

" జోఅచ్యుతానందా జోఅచ్యుతానందా జోబాలకుందా
ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏటి ఎల్లమ్మా
ఏడిస్తే నిన్నెవరు ఏడిస్తే నిన్నెవరు ఎత్తుకుంటారు.
జో...... ఆయమ్మా జో .... ఆయమ్మ ఆయీ – జో అచ్యుతానందా
కాళ్లగజ్జలు గొందు కాళ్లగజ్జలు గొందు కట్నాలు గొందు
కాదూరి వారింట్లో కాదూరి వారింట్లో నెలకొన్న తల్లీవి
నీయొక్క బట్టాలు నీయొక్క బట్టాలు వద్ద గూకుండ్రు
జో.... ఆయమ్మా జో .... ఆయమ్మా ఆయీ – జో అచ్యుతానందా
ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏటి ఎల్లమ్మా
తన్నోడి నీతండ్రి తన్నోడి నీతండ్రి వద్ద గూకుండు
ఎన్నీల గాయంగ ఎన్నీల గాయంగ మంది నడవంగా



మందీలో ఎల్లమ్మ మందీలో ఎల్లమ్మ ముందు నడవంగా
జోఅచ్యుతానందా జోఅచ్యుతానందా జోబాలకుందా
ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏటి ఎల్లమ్మా "

ఈపాటను స్త్రీపాత్రధారి ఒక్కొక్క పాదాన్ని పాడుతూ ఉంటే వంతల్లో ఒకరు చిన్నపిల్ల ఏడుస్తున్నట్లుగా మధ్యలో ఏడుస్తూ ఉంటాడు. మిగిలిన వారు జోలపాటకు వంత పాడుతూ ఉంటారు. ఈసన్నివేశాన్ని చూస్తే వేదిక మీద నిజంగా చిన్నపిల్ల ఏడుస్తున్నట్లు ఆమెను తల్లి ఉయ్యాల్లో వేసి ఊపుతూ శ్రావ్యమైన గొంతుతో జోలపాట పాడుతున్నట్లుగా ప్రేక్షకులు భావించి మైమరచిపోయి చూస్తారు. అంతేగాదు అసన్ని వేశాన్ని మళ్ళీమళ్ళీ చూడాలనిపిస్తుంది.

మల్లన్న కథలో నీలమ్మ శివుని ఆగ్రహానికి గురై పుట్టింటికి వచ్చినప్పుడు ఆమె అన్నా వదినలు ఆమెను ఇంట్లోకి రానివ్వకుండా పంపించివేస్తారు. ఊళ్లో ఎవరింటికి వెళ్ళినా ఆమెను చీపుళ్ళతో కొడుతూ ఉంటారు. ప్రధాన కథకుడు ఈ సన్నివేశాన్ని వర్ణిస్తూ ఉన్నప్పుడు అతనికి ఇరువైపులా ఉన్న సహాయకులు తమ చేతిలో ఉన్న చేతిరుమాల, కట్లకర్రలతో స్త్రీ వేషధారిని కొడుతున్నట్లు నటిస్తారు. ఈ సన్నివేశాన్ని చూస్తే నిజంగా నీలమ్మను చీపుళ్లతో కొడుతున్న భావన కలుగుతుంది.

మల్లన్న మేనమామ కూతుళ్ళను తీసుకొని వచ్చి తన అన్నలకు వివాహం జరిపిస్తాడు. కథలో ఈ పెళ్ళి సన్నివేశం వచ్చినప్పుడు వేదికమీద నిజంగా పెళ్ళి కార్యాన్ని కథకులు నిర్వహింప చేస్తారు. దీనికోసం వేదిక మీద గొంగడి పరచి, కింద కూర్చొన్న ప్రేక్షకుల చేత బియ్యం తెప్పిస్తారు. బియ్యాన్ని గొంగడిలో పోసి పసుపు కుంకుమలు చల్లుతారు. స్త్రీ వేషధారి పెళ్ళికూతురుగా ఒక వంత పెళ్ళికొడుకుగా కూర్చొని అక్కడ నిజంగా పెళ్ళి జరుగుతున్న అనుభూతిని ప్రేక్షకులకు కలిగిస్తారు. పెళ్ళి అయిపోయిన తరువాత ఎవరైనా కట్నాలు చదివిస్తారా! అని ప్రేక్షకులను ప్రశ్నించి, కట్నాలు చదివించిన వారిని పేరుపేరునా ప్రశంసిస్తారు. ముందు కూర్చున్న ప్రేక్షకులకు బొట్టు పెడతారు. ఈ విధంగా వివాహ ఘట్టంలో ఒగ్గుకథకులు ప్రేక్షకులను భాగ స్వాములను చేస్తారు.

మల్లన్న వదిన అయిన వన్నమ్మ మల్లన్నను అపనిందల పాలు చేయడానికి ఒక పథకం సిద్ధం చేసుకొని, ఆమె గదిలో ఉండి తాను ఉన్న గదిలోకి పాము వచ్చిం దని తనను కాపాడమని తోడికోడళ్ళతో మల్లన్నకు చెప్పించి, అతణ్ణి గదిలోకి రప్పించు కుంటుంది. గదిలోకి వచ్చిన మల్లన్నతో వన్నమ్మ తనకు అతని మీద కోరిక ఉందని, తన కోరిక తీర్చమని అడుగుతుంది. ఈ సన్నివేశాన్ని ప్రధాన కథకుడు చెబుతున్నప్పుడు

స్త్రీ వేషధారి అయిన కథకుడు వన్నమ్మ లాగా నటిస్తూ మల్లన్న మీదకు వగలు వలక పోస్తూ వస్తుంది. ఆ సమయంలో స్త్రీ వేషధారి నడిచే నడకతీరు, వయ్యారాలు, మూతి విరుపులు మొదలైన వాటిని చూసి ప్రేక్షకులు గొప్పగా నవ్వుకుంటారు.

మల్లన్న గొల్లకేతమ్మను వివాహం చేసుకొని ఆమెను ముందుగా శ్రీశైలానికి పంపిస్తాడు. కేతమ్మ శ్రీశైలంలో గంపనెత్తిన పెట్టుకొని పెరుగు మజ్జిగ అమ్ముతూ ఉంటుంది. ఈ సందర్భంలో కేతమ్మ పాత్రను పోషిస్తున్న స్త్రీవేషధారి గంపకు బదులుగా ఒగ్గును తల మీద పెట్టుకొని వయ్యారంగా నడుస్తూ పెరుగు, మజ్జిగను అమ్ముతున్నట్లుగా నటిస్తాడు. అప్పుడు మ్యాడలదేవి కేతమ్మను పిలిచి పెరుగు, మజ్జిగ ఎలా పోస్తున్నావని ధర అడుగుతుంది. ఈ సందర్భంలో మ్యాడలదేవి పాత్రను ఒక సహాయకుడు పోషిస్తాడు. అప్పుడు కేతమ్మ "ముత్యానికి మూడు, పగడానికి పది, వజ్రానికి ఒక్కటి" అని చెబుతుంది. అప్పుడు మ్యాడలదేవి ఇంతవరకు ఎక్కడైనా అమ్మావా! అని వ్యంగ్యంగా అడుగుతుంది. కేతమ్మ అంతకంటే వ్యంగ్యంగా నీవు ఎప్పుడైనా కొన్నావా! అని అడుగుతుంది. ఈ విధంగా ఇద్దరి మధ్య గొడవ మొదలై తారాస్థాయికి చేరుతుంది. ఈ సన్నివేశంలో ఇద్దరు స్త్రీ పాత్రధారులు అద్భుతంగా నటించి ఇద్దరు స్త్రీలు గొడవపడుతున్న దృశ్యాన్ని ప్రేక్షకుల కళ్ల ముందు నిలుపుతారు. వారిద్దరూ చేతులు తిప్పడం, మూతి విరవడం, సూటిపోటి మాటలు మాట్లాడడం, తిట్టుకోవడం అతి సహజంగా ఉండి ప్రేక్షకులు వారి వైపు మంత్రముగ్ధులై చూసే లాగా ఉంటుంది. వీరి తగాద శృతి మించుతున్నప్పుడు ప్రధాన కథకుడు మల్లన్న పాత్రధారిగా వచ్చి వారిద్దరికీ రాజీ కుదురుస్తాడు.

ఈవిధంగా ఒగ్గుకథాకారులు ఒగ్గుకథను చెబుతూ, నటిస్తూ సన్నివేశాన్ని రక్తి కట్టిస్తూ తమ ప్రదర్శనను కొనసాగిస్తారు. కథలో కోపాన్ని ప్రదర్శించేటప్పుడు ప్రయాణాన్ని వర్ణించేటప్పుడు కథ వేగంగా సాగుతుంది. ఇలా కథను వేగంగా చెప్పేదాన్ని "చలీధాటి" అంటారు. చలీధాటీలో కథ జరిగేటప్పుడు ప్రధాన కథకుడు వేదిక మీద నాలుగడుగులు ముందుకు వేసి వెంటనే వెనక్కి తిరిగి యధాస్థానంలోకి వస్తాడు. అతనికి ఇరువైపులా ఉన్న వంతలు ప్రధాన కథకుని అనుకరిస్తూ అతనితో పాటు ముందుకు వచ్చి వెనక్కు వెళుతుంటారు.

ప్రధాన కథకుడు చేతులతో కట్లకర్రను, ఒగ్గును పట్టుకొని ఉంటాడు. కొందరు కథకులు సందర్భాన్ని బట్టి తోలుపట్టీ, కొరడా కూడా చేతిలో పట్టుకుంటారు. అతనికి ఇరువైపులా ఉన్న సహాయకుల్లో ఒకరు డోలును వాయిస్తూ ఉంటాడు. మరొక సహాయకుడు చిన్నతాళాలు వాయిస్తాడు. ఈ కథకులందరూ కథలో వచ్చేపాత్రలను



స్వేచ్ఛగా, ఎంతో ఔచిత్యవంతంగా నిర్వహిస్తారు.

స్త్రీ వేషాన్ని ధరించిన ప్రధాన కథకుడు కథలో వచ్చే స్త్రీ పాత్రలకు తగినట్లుగా తన గొంతును మార్చి మాట్లాడుతూ ఉంటాడు. ఇతడు నడుము మీద చేతులు పెట్టు కొని స్త్రీలాగా హొయలు వలకబోస్తాడు. దుఃఖ సన్నివేశంలో దుఃఖాన్ని, కోప సన్నివేశం లో కోపాన్ని ఎంతో చక్కగా సన్నివేశానికి తగినట్లుగా అచ్చం స్త్రీమాదిరిగా నటిస్తాడు.

ఒగ్గుకథకులు మధ్యమధ్యలో ప్రేక్షకులను రంజింపజేయడానికి పిట్టకథలను హాస్య సంభాషణలను చేస్తుంటారు. అంతేగాకుండా కథకుడు పొడుపుకథల వంటి చిత్రమైన ప్రశ్నలు వేస్తూ ఉంటాడు. సహాయకులు ఆలోచించి చెప్పేలోగా ప్రేక్షకులు వాటికి సమాధానాలు చెబుతూ ఉంటారు. ఈ విధంగా ప్రేక్షకులను భాగస్వాములను చేయడం ఒగ్గుకథలోని ఒక ప్రత్యేకత.

ప్రధాన కథకుడు సందర్భాన్ని బట్టి తన చేతిలోని ఒగ్గును, కర్రను అనేక రకాలుగా ఉపయోగిస్తాడు. కథలోని పాత్ర తల మీద బరువు ఎత్తుకొని వచ్చే దృశ్యం ఉంటే కథకుడు ఒగ్గును తలమీద పెట్టుకొని బరువు మోస్తున్నట్టుగా నటిస్తాడు. కట్లకర్రను కత్తిగా, గదగా, గుర్రపుకళ్ళెంగా అవసరాన్నిబట్టి వాడుతూ ఉంటాడు. అతను ఆవస్తువులను పట్టుకొని నిజంగా వాడుతున్న భ్రమను ప్రేక్షకులకు కలిగిస్తాడు. అదేవిధంగా పట్టుసెల్లాను గూడా అనేక రకాలుగా ఉపయోగిస్తాడు. కథకుడు స్త్రీ పాత్రను అభినయించ వలసి వస్తే పట్టుసెల్లాను కొంగులాగా వేసుకొని స్త్రీలాగా హొయలు వలకబోస్తాడు. పురుషునిగా ధైర్యాన్ని ప్రదర్శించ వలసివస్తే దాన్ని నడుముకు కట్టుకుంటాడు. ఈ విధంగా ఒగ్గుకథకులు తమ దగ్గర ఉన్న వస్తువులను ఉపయోగిస్తూ కథను చెబుతూ ప్రేక్షకులకు నాటకాన్ని చూస్తున్న అనుభూతిని కలుగజేస్తారు. కథ చెప్పడం పూర్తి అయిన తరువాత కథకులు మంగళం పాటతో ఒగ్గుకథను ముగిస్తారు. మంగళం పాట కథను బట్టి మారిపోతూ ఉంటుంది. మల్లన్న కథను చెప్పినప్పుడు కింది విధంగా మంగళం పాటను పాడుతారు.

"ఆరతివ్వాళి మంగళ ఆరతివ్వాళి- దీరుడా శ్రీశైలవాసా ఇదిగో నివాళి
గనగన నాడింతు గంట నాడింతును-గన్నేరు పువ్వుల్ల నిన్ను పూజింతును
ఎప్పుడూ పూజింతు యాక చిత్తారిణి- సిత్తారి చాపిన సిరి మేడలమ్మమా
సర్వమై ఉన్న గొల్ల కేతమ్మనూ ॥ఆరతి॥
పుట్టమీద కొమ్మ పూతరించిన కొమ్మ- అండ్లదే ఓ కొమ్మ ఆరతుల కివ్వంగ
ఎల్ల పర్వతాల మల్లయ్యకూ- మాయింటి మావురాలెల్లమ్మకూ
చిన్న చెంబుతో నీళ్ళు చీకాయ ఉత్కాలు- అల్లాలు, బెల్లాలు, అరటిపండ్లూ

తేనెతో మాగిన తియ్య మామిడిపండ్లు- ఆరుదా అయిలోని మల్లన్నకూ ॥ఆరతి॥
గుర్రాలు ఎక్కేరు స్వారీలు చేసేరు- గుర్రంపు రాజులు పేరునే తెచ్చేరు
ఆరెబూములు దిరిగి ఆరె బాషలు నేర్చి ఔర పెండ్లికొడుకునకూ ॥ఆరతి॥
కొండలోన పెరిగి కొండలోన తిరిగి- కొండలన్ని పిండి పంటలొండి
అమ్మ గౌరమ్మకూ ఆ వెంకటేశునకూ- దిగ దేవతలకెల్ల దిష్టారతి॥ఆరతి॥"

ఈ విధంగా ఒగ్గుకథకులు గంగాదేవి ప్రార్థనతో కథను ప్రారంభించి మంగళంతో కథను ముగిస్తారు. ఒగ్గుకథ ప్రధానంగా కథాఖ్యాన జానపద కళ అయినప్పటికీ బుర్రకథ, శారదకథ, జముకుల కథ, పంబకథ మొదలైన కథాఖ్యాన జానపద కళలకు ఒగ్గు కథకు తేడా ఉంది. మిగిలిన కథల్లో కథకులు వంతల సాయంతో కథను మాత్రమే చెబుతారు. వీటిలో కథకులు నటించడం ఉండదు. ఒగ్గుకథలో ప్రధాన కథకుడు కథను చెబుతున్న సన్నివేశానికి అనుగుణంగా స్త్రీ పాత్రధారి, వంతలుగా ఉన్న సహాయకులు వాద్యకారులు, ప్రధానకథకుడూ అందరూ తాత్కాలికంగా ఆ సన్నివేశంలో వచ్చే పాత్రలుగా మారిపోయి తమ నటనా కౌశలంతో ప్రేక్షకులకు నాటకం చూస్తున్న అనుభూతిని కలిగిస్తారు.

ఒగ్గుకథ వైశిష్ట్యాన్ని, ప్రజాదరణను గమనించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రజా ఉద్యమకారులు తమతమ కార్యక్రమాల్లో ఒగ్గుకథను చక్కగా వినియోగించుకుంటున్నారు. తమ కార్యక్రమాలకు అనుగుణంగా ఒగ్గుకథను మలుచుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కులమత భేదాలు వద్దు, వరకట్న నిషేధం, పరిశుభ్రత - పచ్చదనం, కుటుంబ నియంత్రణ, వయోజన విద్యా ప్రచారం లాంటి ప్రజోపయోగ కార్య క్రమాలను ఒగ్గుకథా బాణీలో ప్రచారం చేయిస్తుంది. ఒగ్గుకథా బృందం వారు ఒగ్గు కథలను స్వయంగా రూపొందించి ప్రభుత్వం వారు చేపట్టే అనేక ప్రజోపయోగ కార్య క్రమాలను ఒగ్గు కథ బాణీలో ప్రచారం చేస్తున్నారు.

ప్రజా ఉద్యమకారుల్లో ఒగ్గుకథా కళారూపాన్ని వినూత్నమైన పద్ధతిలో ఉపయోగించుకున్న వారు గద్దర్. గద్దర్ తెలంగాణ ప్రజల్లో ఒగ్గుకథ మీద ఉన్న మక్కువను గ్రహించి ఒగ్గుకథా బాణీలో రైతుకూలీ విజయం ఒగ్గుకథ, నక్సల్‌బరీ ఒగ్గుకథ, రగల్‌జండా ఒగ్గుకథ, కొమరమ్‌భీమ్ ఒగ్గుకథ, రైతుకూలీ పోరాటం ఒగ్గుకథ మొదలైన వాటిని రాసి బాగా ప్రచారం చేశారు. వీటివల్ల గద్దర్‌కు గూడా మంచిపేరు ప్రసిద్ధులు వచ్చాయి.

రైతుకూలీ పోరాటం ఒగ్గుకథలో గ్రామాల్లో కష్టజీవుల వర్ణనను గద్దర్ ఇలా చేశారు. ఈగేయాన్ని ఎం. సునీత గారు ఒగ్గుకథ-ఒక పరిశీలన అనే తమ లఘు



సిద్ధాంత వ్యాసంలో ఇచ్చారు.

"పల్లెలు సూడు పోరు పల్లెలు సూడు- తెలుగు తల్లికి వన్నెలు తెచ్చిన
పల్లెలుసూడు పోరు పల్లెలలు సూడు- గున్న మామిళ్ళ గుడిసెల గుంపులు
వంకర టింకర పెంకుటిండ్లురా- ఊరి గుండె మీద దొరవారి మేడలు
సిమ్మున సీకటి రాత్రిలో గుడ్డి దీపమోలుంటాయి- పున్నమి వెన్నెల రాత్రిలో
వన్నెలాడిలా వుంటాయి ॥పల్లె॥

సిన్న సెల్లెలు సిట్టి సెల్లెలు - ఏడ్సే తమ్మున్ని ఎత్తుకుంటారు
అన్నం పిసికి తినిపిస్తారు - పాటలు పాడి జోకొడతారు
అక్కడ దిక్కడ తెచ్చి పెడ్తారు - ఇక్కడ దక్కడ అందిస్తారు
సిట్టిపొట్టి సెల్లెండ్లు పుట్టెడు పన్లు చేస్తారు - కన్నతల్లి కెంతో అండదండ గుంటరు
॥పల్లె॥

పొద్దు పొడుపుతో తల్లులు లేసి - పసి పిల్లలకు పాలు పడ్తారు
బువ్వకుండలు బిరబిర కడిగి- పొయి మీదకి ఎక్కిస్తారు
సలసల ఎసరు మసిలే వరకు- కడిగేదేదో కడుగుతుంటారు
కోసేదేదో కోస్తుంటారు - పొద్దెక్కి పోతే పోతది కూలని
ఆదరా బాదరా అద్దం దిద్దం- ఉడికీ ఉడకని గట్కాకారము
సద్ది కట్టుకొని కూలికి పోతారు - పొద్దుగూకులు ఎద్దులాగా పని చేస్తరు
సాలీసాలని సంసారం సగం బరువు మోస్తరు ॥పల్లె॥
కమ్మరి తిత్తి వూదుతుంటడు - కుమ్మరి సారె తిప్పుతుంటడు
మంగలి గడికి వురుకు తుంటడు- సాకలి ఏటికి బాట పడ్తడు
పొద్దు పొడవుతోడి పోటీ పడుతుంటరు- బుక్కెడు బువ్వ కొరకు యుద్ధం చేస్తుంటరు
॥పల్లె॥

పై గేయంలో గద్దర్ రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవుల జీవన విధానాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిన్నచిన్న తెలుగు పదాలతో జానపద గేయాల లాగా చక్కగా రచించారు. ఈవిధంగా ఒగ్గుకథ ఒకవైపు సాంప్రదాయకంగా మల్లన్న కథ, బీరప్పకథ మొదలైన కథలను చెబుతూనే, ఆధునిక కాలానికి అనుగుణంగా కొన్ని మార్పులతో ప్రజోపయోగ కార్యక్రమాల ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేస్తూ, ప్రజానాట్య మండలి లాంటి ఉద్యమకారుల ద్వారా విప్లవ చైతన్యాన్ని కలిగించడానికి తోడ్పుతూ ఉంది.

## తప్పెటగుళ్ళు - ప్రదర్శనా విధానం :

తప్పెటగుళ్ళు కళా ప్రదర్శనలో పదిహేను నుంచి ఇరవై మంది వరకు పాల్గొంటారు. ప్రదర్శనలో పాల్గొన్న వారందరూ తప్పెటగుండులను ధరిస్తారు. వీరిలో ఒకరు నాయకుడుగాను, గురువుగాను ఉంటాడు. ఇతను మధ్యలో ఉండి కథను చెబుతూ ప్రదర్శనను నడిపిస్తాడు. మిగిలిన వాళ్ళందరూ అతని చుట్టూ గుండ్రంగా నిలబడి అతడు చెప్పే కథను వంత పలుకుతూ ఉంటారు. గురువు కథను గేయ రూపం లోను, వచన రూపంలోను చెబుతూ ఉంటాడు. దీనికి మిగిలిన వారందరూ వంత పాడుతూ ఉంటారు. మొదట గురువు తమ కులదేవత అయిన గంగమ్మకు మొక్కి, కొబ్బరికాయ కొట్టి వినాయక ప్రార్థనతో ప్రదర్శన ప్రారంభిస్తాడు. ప్రార్థన ఇలా ఉంటుంది.

"శివ శివ మూర్తివి గణనాథ - నీవు శివుని కుమారునివి గణనాథ
గన్నేరు పువ్వులతో గణనాథ - నీకు ఘనంగా పూజింతు గననాథ"

ఇలా అనేక రకాల పువ్వులతో వినాయక పూజ చేస్తున్నట్లుగా పాడతారు. ప్రార్థనాగీతం పాడేటప్పుడు గురువు అడుగు ముందుకు వేసి మళ్ళీ వెనక్కు తీసుకొని వంగుతూ లేస్తూ తప్పెటగుండును వాయిస్తుంటాడు. విఘ్నేశ్వర ప్రార్థన తరువాత యాదవ కులదేవత అయిన గంగమ్మను గురించి ఈ విధంగా పాడతారు.

"శోభనమేయమ్మ శోభనమే తల్లి శోభనమేతల్లి
శోభనమే గంగ శోభనమే గంగ శోభనమే గంగ
మూడు ముళ్ళ నరులమే మురికి జన్మంమాది మురికి జన్మంమాది
ఎంగిలి కంఠమేమెంచి పిలువంగ లేము పిలువంగ లేము
పాచినోరుతోను పాలించలేమోయమ్మ పాలింపలేమోయమ్మ
నీకు వందనమమ్మ లోకమాతవు నీవు లోకమాతవు నీవు
దబ్బవనములోన దాగుండినావు తల్లి దాగుండినావు తల్లి
నిమ్మవనములోన నిలిచి ఉన్నావు తల్లి నిలిచి ఉన్నావు తల్లి
నీకు వందనమమ్మ లోకమాతవు నీవు లోకమాతవు నీవు"

గురువు ఈ పాటను పాడేటప్పుడు మిగిలిన వాళ్ళందరూ చివరి పదాలైన శోభనమె తల్లి, మురికి జన్మంమాది మొదలైన పదాలను తిరిగి పలుకుతూ ఉంటారు. ఈపాట పాడేటప్పుడు వీరు కుడికాలు కొంచెం ముందుకు వేసి వెంటనే వెనక్కి తీసుకొని మళ్ళీ ఎడమకాలు ముందుకువేసి దాన్ని వెనుక్కు తీసుకొని పాటపాడుతూ తప్పెటగుండును వాయిస్తూ ఉంటారు. ఇలా ఒక కాలు తరువాత మరొక కాలును మారుస్తూ అడుగులు వేస్తూ ఉంటారు. గంగ ప్రార్థన తరువాత తల్లిదండ్రులను, గురువును స్మరిస్తూ ఇలా పాడతారు.



"తల్లి దండ్రికి మ్రొక్కి తన గురువుకే మ్రొక్కి- యీ వేళ నా గురువు మా గరిడీ లుండగ
విరివిగా మరుపల్లి పురమందు వెలసిన- మాకు చెప్పిన గురువా దుక్క అప్పులస్వామి
రావయ్య మా గురువా మా గరిడీ కే రమ్ము-నీకు మ్రొక్కెదనయ్యా మాకు చెప్పిన గురువా!"

పై గేయంలో తప్పెటగుళ్ళ కళాకారులు తమ గురువు అయిన దుక్కా అప్పల స్వామిని తలచుకొని అతని ఊరి పేరును కూడా స్మరించి అతన్ని దేవుడుతో సమానంగా భావిస్తూ తమ గరిడికి రమ్మని ప్రార్థిసున్నారు. వీరి కళ తప్పెటగుళ్ళ ప్రదర్శన. కానీ వీరు తమ గరిడికి రమ్మని గురువును కోరుతున్నారు. దీనికి కారణమేమంటే కొంత మంది తప్పెటగుళ్ళ కళాకారులు సేవగరిడి కళను కూడా ప్రదర్శిస్తూ ఉంటారు. వీరు సేవగరిడి కళా ప్రదర్శనలో పాడే ప్రార్థనా గీతాన్ని తప్పెటగుళ్ళ కళా ప్రదర్శనలో పాడుతూ ఉంటారు. ఇలా పాడడం వల్ల పై గేయంలో గరిడీ అనే మాట వచ్చింది.

ఈ కింది గేయంలో తప్పెటగుళ్ళ కళాకారులు తమ గురువు అయిన అప్పల స్వామిని దశావతారాల స్వరూపుడుగా భావించి పాడుకుంటున్నారు.

"మా గరిడీకే రమ్మి మత్స్యావతారుడా- బంగారు పూబంతీ బాలుడప్పలస్వామీ
ఈవేళ మా గురువా మా గరిడీలుండగా- మా గరిడీ లుండాలా మత్స్యావతారుండా
గరుతువా రావయ్య కూర్మావతారుండా"

పై గేయాన్నిబట్టి తప్పెటగుళ్ళ కళాకారులకు ఎంతటి గురుభక్తి ఉందో స్పష్టమవుతుంది. గురువు తరువాత సరస్వతిని, పార్వతిని కూడా తలచుకుంటూ గేయాలు పాడతారు. ఈ దైవ ప్రార్థన గేయాలన్నింటినీ తప్పెడగుళ్ళు కళాకారులు నెమ్మదిగా అడుగులు ముందుకు వేస్తూ వెనక్కి తీస్తూ తప్పెటగుండును వాయిస్తూ పాడతారు. ఆ తరువాత గురువు ఏదైనా కథను ప్రారంభించి పాడతాడు. తప్పెటగుళ్ళ కళాకారులు పాడే కథల్లో రామాయణానికి సంబంధించి లక్ష్మణుని వృత్తాంతం చెప్పుకోదగినది. లక్ష్మణుని భార్య ఊర్మిల నిద్రపోతున్న విధానాన్ని ఒకవైపు, అడవిలో లక్ష్మణుడు తన అన్న వదినలకు సేవ చేస్తున్న విధానాన్ని మరొక వైపు చెబుతూ గేయాన్ని ఇలా పాడతారు.

"ఓరోరి లచ్మణా ఎక్కడున్నావు ఎక్కడున్నావు
ఊర్మిలా నీదేవి నిదరపోతుంది నిదరపోతుంది
అన్న దగ్గర నీవు హాయిగున్నావా హాయిగున్నావా
ఊర్మిలా నీదేవి ఆదమరిచింది ఆదమరిచింది
ఓరోరి లచ్మణా ఏంజేస్తుంటువి ఏంజేస్తుంటివి
ఊర్మిలా నీదేవి ఊరు మరిచింది ఊరు మరిచింది

వదిన దగ్గర నీవు ఊసులాడుతుంటే ఊసులాడుతుంటే
ఊర్మిలా నీదేవి ఊసుమరిచింది ఊసుమరిచింది
ఓరోరి లచ్మణా ఏకోనలుంటివి ఏ కోనలుంటివి
ఊర్మిలా నీదేవి ఉలుకు లేకుంటే ఉలుకు లేకుంటే
అన్న దగ్గర నీవు సేవసేత్తుంటే సేవ సేత్తుంటే
ఊర్మిలా నీదేవి సింతతో ఉంది సింతతో ఉంది"

పై గేయాన్ని గురువు ఒక్కొక్కపాదం పాడుతూ ఒకడుగు ముందుకువేసి మళ్ళీ అదే అడుగును వెనక్కి తీసుకొని నడుము కొంచెం ముందుకు వంచుతూ పైకి లేస్తూ తప్పెట గుండును వాయిస్తూ పాడతాడు. ఇది కొంచెం వేగంతో సాగే ప్రదర్శన. చుట్టూ ఉన్న మిగిలిన ప్రదర్శనకారులు గురువు పాడిన పాదంలోని చివరి మాటను వంతగా పలుకుతూ గురువు లాగానే అడుగులు వేస్తూ అతన్ని అనుకరిస్తూ ఉంటారు.

రామాయణకథలో హనుమంతుడు రాముని ఉంగరాన్ని సీతకు ఇచ్చినప్పుడు సీత తన వారినందరినీ ఇలా తలచుకుంటూ ఆవేదన చెందుతుంది. దాన్ని తప్పెట గుళ్ళ కళాకారులు ఇలా పాడతారు.

"ఉంగరమా ముద్దుటుంగరమా నీవు ఏ రీతిగొస్తివే ॥ఉంగరమా॥
నడవ కాలు లేవు ఎగుర రెక్కలు లేవు

| | | |
|---|---|---|
| ఎలాగు నొస్తివే | - | ఉంగరమా |
| మామామా దశరధుడు | - | ఉంగరమా |
| బాగానే ఉన్నారా? | - | ఉంగరమా |
| ఘా అత్త కౌసల్య | - | ఉంగరమా |
| బాగానే ఉన్నారా? | - | ఉంగరమా |
| మా మరిది లక్ష్మణా | - | ఉంగరమా |
| బాగానే ఉన్నారా | - | ఉంగరమా |
| ఉంగరమా ముద్దుటుంగరమా | - | ఉంగరమా" |

పై గేయాన్ని గురువు ఒక్కొక్క పాదం మందగతిలో పాడుతూ ఉంటే చుట్టూ ఉన్న మిగిలిన ప్రదర్శనకారులు ఉంగరమా ఉంగరమా అని వంత పాడుతూ గురువును అనుకరిస్తూ అడుగులు వేస్తూ ఉంటారు. ఈ విధంగా తప్పెటగుళ్ళ కళాప్రదర్శనలో గురువు పాత్ర అధికంగా ఉంటుంది. ప్రదర్శన అంతా అతనిని బట్టే నడుస్తుంది. అతడు చెప్పినట్లుగా మిగిలిన ప్రదర్శనాకారులందరూ ఏకాగ్రతగా నడుచుకుంటారు. ప్రదర్శనలో కథను నడిపే భారం గురువు మీదనే ఉంటుంది. ప్రదర్శన మొదట



మందగతిలో మొదలై పోనుపోను వేగం పెరిగి ప్రదర్శనకారులందరూ ఎగురుతూ గెంతుతూ, కేకలువేస్తూ కేరింత లాడుతూ ఆనందంతో వలయాకారంగా తిరుగుతూ తప్పెటగుళ్ళను అదే ధోరణిలో వాయిస్తూ సుదీర్ఘంగా రాగాలాపన చేస్తూ వెంటనే మళ్ళీ మంద గతిలోకి వచ్చి ప్రేక్షకులను ఆనందంలో ముంచెత్తుతారు.

తప్పెటగుళ్ళ ప్రదర్శనలో కథలో వచ్చే పాత్రలను బట్టి కళాకారులు ఆయా పాత్రలుగా మారిపోయి కొంచెం ముందుకు వచ్చి ఆ పాత్రలను అభినయిస్తూ ఉంటారు. ఉదాహరణకు రామాయణంలో సుందరకాండ పాడేటప్పుడు రాముడుగా ఒకరు, లక్ష్మణుడుగా ఒకరు, హనుమంతుడుగా ఒకరు ముగ్గురు వ్యక్తులు ముందుకు వచ్చి ఆయా పాత్రలను అభినయిస్తారు. అభినయం రసానుగుణంగా చేస్తారు. అలాగే 'చెంచులక్ష్మి కథ' పాడేటప్పుడు ఒకరు చెంచు భామగాను, మరొకరు కృష్ణుడుగాను ముందుకు వచ్చి ఇలా పాట పాడతారు.

| | | |
|---|---|---|
| "కృష్ణుడు | : | రావె రావె భామ నందాన |
| | | నీవు రమణి ముద్దులగుమ్మ చెంచీతా |
| చెంచుభామ | : | పోవయ్యా పోవయ్యా చినవాడ |
| | | నువు పోకిరీలు మానుకొమ్ము కుర్రోడా" |

ఇద్దరు వ్యక్తులు పై విధంగా పాడుతూ, సన్నివేశానికి అనుగుణంగా అభిన యిస్తుంటే మిగిలిన కళాకారులు వారికి కోరస్‌గా పాడుతూ ఉంటారు.

తప్పెటగుళ్ళు కళాప్రదర్శనలో ఇంతవరకు చెప్పినది ఒక భాగం. మరొక భాగంలో ఆశ్చర్యకరమైన విన్యాసాలు ఉంటాయి. ఈ విన్యాసాలు ప్రేక్షకులను ఆశ్చర్యంలో ముంచెత్తుతాయి. ఈ విన్యాసాల్లో కొన్ని ఒక్కొక్కరు చేసేవి, కొన్ని ఇద్దరు ముగ్గురు చేసేవి, మరికొన్ని అందరూ కలిసి సమిష్టిగా చేసేవి ఉంటాయి. తప్పెటగుళ్ళ కళాకారులు ఈ విన్యాసాలను నేర్చుకునేటప్పుడు ఎంతో ఏకాగ్రతతో కష్టపడి నేర్చుకుంటారు. ఇవి నేర్చుకోవడానికి దాదాపు సంవత్సరంన్నర కాలం పడుతుంది. వీటిని ప్రదర్శించేటప్పుడు ప్రదర్శనకారులు ఏకాగ్రతతో చాలా జాగ్రత్తగా వ్యవహరించవలసి ఉంటుంది.

**ఒక్కొక్కరూ చేసే విన్యాసాలు :** తప్పెటగుళ్ళ కళాకారులు తప్పెటగుళ్ళను వాయిస్తూ అడుగులు వేస్తూ ఉన్నప్పుడు ఒక వ్యక్తి ముందుకు వచ్చి వెనక్కు ధనస్సు ఆకారంలో వంగి నేలకు చేతులు ఆనించి ఆ తరువాత మెల్లగా కాళ్ళు పైకెత్తి కాసేపు అలాగే ఉండి తరువాత కాళ్ళను భూమిమీద ఉంచుతాడు. దీన్ని వేగంగా చేస్తే పిల్లిమొగ్గలు వేసినట్లుగా ఉంటుంది. ఈ మొగ్గలను ముందు వైపు నుంచి కూడా వేస్తారు. ఇలా మొగ్గలు వేస్తున్నప్పుడు కూడా తప్పెటగుండును అతడు ధరించే ఉంటాడు. ఇలాగ

ఒక్కొక్కరు వచ్చి మొగ్గలు వేసి వెళ్ళిపోతారు.

2. నేలమీద నాణాన్ని గానీ లేక కరెన్సీ నోటును గానీ ఉంచుతారు. తప్పెట గుళ్ళు కళాకారులు తప్పెటగుండును వాయిస్తూ ఒక్కొక్కరూ ముందుకు వచ్చి ధనస్సు ఆకారంలో వెనక్కు ఒంగి చేతులు నేలకు ఆనించి భూమి మీద పెట్టిన వస్తువు వైపు మెల్లగా జరిగి దాన్ని రెండు పెదవులతో మెల్లగా పట్టుకొని పైకి లేచి నెమ్మదిగా తప్పెట వాయిస్తూ తాను తీసిన వస్తువును అందరికీ చూపిస్తాడు. ఈ ప్రదర్శన చేస్తున్నంత సేపు మిగిలిన కళాకారులందరూ లయబద్ధంగా తప్పెటగుండును వాయిస్తుంటారు. ఈ విధంగా ఒక్కొక్కరు వచ్చి ఈ విన్యాసం చేసి వెళ్ళిపోతారు.

3. తప్పెటగుళ్ళ కళాకారులు ప్రదర్శన చేస్తున్నప్పుడు వారిలో ఒకరు ముందుకు వచ్చి రేపల్లెలో గొల్లభామలు పాలు, పెరుగు, నెయ్యి మొదలైనవాటిని అమ్మే విధానాన్ని అభినయిస్తారు. తలమీద నీళ్ళ చెంబును పెట్టుకొని ఆ చెంబు కింద పడకుండా నీరు తొలగకుండా తప్పెట గుండును వాయిస్తూ గోపికాస్త్రీ పాలు పెరుగు మొదలైన వాటిని అమ్ముతున్న దృశ్యాన్ని తన ప్రదర్శన ద్వారా ప్రేక్షకుల కళ్ళకు కట్టిస్తారు. తలమీద ఒక చెంబును మాత్రమే గాకుండా వరుసగా ఐదారు చెంబులను పెట్టి అవి కిందపడకుండా తప్పెటగుండును వాయిస్తూ మెల్లగా అడుగులు వేస్తారు.

4. నీటితో నింపిన మట్టి కుండను ఇసుక మీద ఉంచుతారు. దాని మీద వెదురు బద్దలతో చేసిన మూతను పెడతారు. ఒక తప్పెటగుళ్ళ కళాకారుడు, ఇద్దరి భుజాలు పట్టుకొని ఎగిరి మూతమీద నిలబడి, ఆ మూత మీద తప్పెటగుండును వాయిస్తూ పాడుతూ ఆడతాడు. ఇలా చేసినప్పుడు మట్టి కుండ పగలదు. ఇలా మట్టి కుండ పగలకుండా ఇలాంటి విన్యాసం చెయ్యాలంటే ఎంతో ఏకాగ్రత అవసరం.

5. ఇందులో నాల్గవదాని లాగానే నీటితో నింపిన మట్టికుండను తెస్తారు. ఒక తప్పెటగుళ్ళ కళాకారుడు ఇద్దరు వ్యక్తుల సహాయంతో మట్టికుండ అంచుమీద నిలబడి తప్పెటగుండును వాయిస్తూ పాట పాడుతూ ఆట ఆడతాడు. ఇలా ఆట ఆడేటప్పుడు అతను ఎవరి సహాయం తీసుకోడు. ఎంతో సున్నితమైన మట్టికుండ పగలకుండా దాని అంచుమీద ఇలాంటి విన్యాసం చేయడం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

**ఇద్దరు కలసి చేసే విన్యాసాలు :**

1. ఇందులో ఒక కళాకారుడు నేల మీద కూర్చొని కాళ్ళు రెండూ చాపి పాట పాడుతూ తప్పెటగుండును వాయిస్తూ ఉంటాడు. మరొక కళాకారుడు తప్పెట గుండును వాయిస్తూ పాట పాడుతూ వచ్చి కూర్చున్నవాని రెండు కాళ్ల మీద తన రెండు పాదాలను పెట్టి నిలబడి పాట పాడుతూ తప్పెటగుండును కొడుతూ ఉంటాడు.



తప్పెటగుళ్ళు బృందం విన్యాసం (షేర్ మహమ్మద్‌పురం, శ్రీకాకుళం జిల్లా)



తప్పెటగుళ్ళు బృందం విన్యాసం (షేర్ మహమ్మద్‌పురం, శ్రీకాకుళం జిల్లా)

కింద కూర్చున్న వ్యక్తి అతని బరువును వహిస్తూ తన కాళ్ళను గానుగ లాగా చుట్టూ తిప్పి మళ్ళీ యధాస్థానంలోకి తెచ్చి పెడతాడు. కింద కూర్చున్న వాడి బలాన్ని బట్టి ఎన్ని సార్లైనా తిరగవచ్చు. తిరిగేటప్పుడు పాదాల మీద నిలుచున్న వ్యక్తి కిందపడకుండా తప్పెట వాయిస్తూ పాడపాడుతూ ఉంటాడు. ఈ ప్రదర్శనను కొంత మంది చేసి చూపిస్తారు.

2. నీటితో నింపిన మట్టికుండ అంచు మీద ఒక కళాకారుడు మొదట నిలబడి తప్పెటగుండును వాయిస్తూ ఉంటాడు. ఆ తరువాత ఇద్దరి వ్యక్తుల సహాయంతో మరో కళాకారుడు కుండ మీద నిలబడిన వ్యక్తి భుజాల మీద కాళ్లు పెట్టి నిలబడి తప్పెటగుండును వాయిస్తూ పాట పాడతాడు. ఈ విన్యాసం చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఎందుకంటే సున్నితమైన మట్టికుండ పగలకుండా దాని అంచు మీద ఒక వ్యక్తి నిలబడి ఉండడమే కష్టం. అలాంటిది ఒక వ్యక్తి మీద మరొక వ్యక్తి నిలబడి మట్టికుండ పగిలిపోకుండా విన్యాసం చేయడం చాలా గొప్ప విషయం. దీన్ని ఎంతో ఏకాగ్రతతో చెయ్యాలి. ఏ మాత్రం అజాగ్రత్త వహించినా మట్టికుండ పగిలిపోయి ఇద్దరు వ్యక్తులు కిందపడే అవకాశం ఉంది.

**అందరూ కలసి చేసే విన్యాసాలు :** ఈ విన్యాసంలో కొంతమంది కళాకారులు గుండ్రంగా నిలబడి ఒకరి భుజాల మీద ఒకరు చేతులు వేసుకొని ఉంటారు. నలుగురు కళాకారులు వారి పైకి ఎక్కి వారి భుజాల మీద నిలబడి తమ నాలుగు తలలూ ముందుకు వంచి ఒక దగ్గరకి చేరుస్తారు. అప్పుడు మరొక కళాకారుడు ఆ నలుగురి మీదకు ఎక్కి నిలబడి తప్పెటగుండును వాయిస్తూ పాటపాడుతూ ఆట ఆడతాడు. ఈ విన్యాసాన్ని చెట్టు కట్టడం అంటారు. ఈ విన్యాసంలో పాల్గొనకుండా ఉన్న మిగిలిన వారు ఈ విన్యాసం చేస్తున్నంత సేపు తప్పెటగుండును వాయిస్తూ చిన్నగా నృత్యం చేస్తూ ఉంటారు.

ఈ విధంగా తప్పెటగుళ్ళ కళాకారులు అనేక రకాల విన్యాసాలు చేస్తారు. ఇవే కాకుండా జట్టు సభ్యులు రెండు జట్లుగా విడిపోయి ఒకరికొకరు పోటీగా తప్పెట గుళ్ళను ఉధృతంగా రకరకాల గమకాల్లో వాయిస్తూ ఎగిరి దూకుతూ పిల్లిమొగ్గలు వేస్తూ నృత్యం చేస్తారు. ఇలా పోటీ పడినప్పుడు వేగంగా వెళ్ళే రైలుధ్వని కంటే మించిన వేగంతో తప్పెటగుండులను ధ్వనింపజేస్తారు. అలాగే కృష్ణుడు ఉట్టిమీద పెట్టిన పాలు పెరుగు మొదలైన వాటిని దొంగిలించే విధానాన్ని, కాళీయ మర్ధన ఘట్టాన్ని సంఘ టితంగా ప్రదర్శిస్తారు. ఇలా ఎన్ని రకాలు విన్యాసాలు చేసినా నిక్కరుకు కట్టిన మువ్వలు, కాళ్ళకు కట్టిన గజ్జెలు, గుండెలు మీద కట్టిన తప్పెటగుళ్ళు మ్రోగుతూనే ఉంటాయి. పాట సాగుతూనే ఉంటుంది. అంతేగాకుండా ఇదంతా సమిష్టిగా జరుగుతుంది. ఇది తప్పెట

గుళ్ళ కళలో ఉన్న గొప్పతనం. అందువల్లనే ఈ కళకు ఇప్పటికీ మంచి ఆదరణ ఉంది.

తప్పెటగుళ్ళ కళను ఉత్తరాంధ్ర జిల్లాల్లో యాదవులు తమ కులదేవత అయిన గంగమ్మ తల్లికి చేసే గావు పండుగ జాతరలో తప్పనిసరిగా ప్రదర్శింప జేస్తారు. గ్రామదేవతల పండుగ సందర్భంలో కూడా నిర్వాహకులు తప్పెటగుళ్ళ కళాప్రదర్శనను నిర్వహింప జేస్తారు. ఈనాడు వినాయకచవితి, దసరా పండుగుల సందర్భంలో వినాయకుని విగ్రహాలను, అమ్మవారి విగ్రహాలను పెట్టి నవరాత్రులు చేస్తున్నారు. ఇలా చేసేవారు తొమ్మిది రోజుల్లో ఏదో ఒక రోజున తప్పెటగుళ్ళ కళను ప్రదర్శింప జేస్తారు. రాజకీయ పార్టీల వాళ్ళు తమ నాయకులకు స్వాగతం పలికేటప్పుడు తప్పెట గుళ్ళ కళను ప్రదర్శింప జేయిస్తారు. రాష్ట్రప్రభుత్వం నిర్వహించే అనేక రకాల ఉత్సవాల్లో, కేంద్ర ప్రభుత్వం ఢిల్లీలో స్వాతంత్ర్య దినోత్సవం, గణతంత్రదినోత్సవం మొదలైన అనేక రకాల ఉత్సవాల్లో ఈ కళను ఆయా ప్రభుత్వాలు ప్రదర్శింప జేస్తున్నాయి. అంతే గాకుండా రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలోని సమాచార శాఖ, రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే పరిశుభ్రత - పచ్చదనం, అక్షరజ్యోతి, కుటుంబ నియంత్రణ, జలయజ్ఞం మొదలైన కార్యక్రమాల్లో తప్పెటగుళ్ళ కార్యక్రమాల ద్వారా ప్రచారం చేస్తున్నారు. ఈవిధంగా తప్పెటగుళ్ళ జానపద కళ నేటి ఆధునికతకు ఎదురొడ్డి తనను తాను నిలుపుకొని ప్రదర్శింప బడుతూ ఉంది.

## గొల్లసుద్దులు - ప్రదర్శనా విధానం :

తెలంగాణ ప్రాంతంలోని గొల్లసుద్దులవారు మూడు సంవత్సరాలకు ఒకసారి యాదవులున్న గ్రామాలకు వెళ్ళి వారి గోత్రాలను పొగడి వారి ఇళ్ళ దగ్గర గానీ, గంగమ్మ గుడి ఎదురుగా గానీ, కాటమరాజు కథలను చెబుతూ ఉంటారు. వీరు కథను చెప్పేటప్పుడు సాధారణంగా ముగ్గురు వ్యక్తులు పాల్గొంటారు. వీరిలో ఒకరు ప్రధాన కథకుడు. మిగిలిన ఇద్దరూ వంతలు. ప్రధాన కథకుడు ఎర్రని అంచు ఉన్న పంచెను మోకాళ్ళ వరకు మడిచి కట్టుకుంటాడు. భుజం మీద గొంగడి వేసుకుంటాడు. కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటాడు. తలకు పెద్ద తలపాగా, చెవులకు దుద్దులు, చేతులకు తెల్లని మురుగులు ధరిస్తాడు. చేతిలో పెద్ద కర్రను పట్టుకుంటాడు. ఇతనికి పెద్ద మీసాలు ఉంటాయి. పై భాగాన ఎలాంటి వస్త్రాన్ని ధరించకుండా ఉంటాడు. వంతల్లో ఒకరు ప్రధాన కథకుని లాగానే పంచె కట్టుకుంటాడు. ఇతను కూడా పై భాగంలో ఎలాంటి వస్త్రాన్ని ధరించడు. మొలకు వెండి బిళ్ళల మొలతాడు ధరిస్తాడు.

గొల్లసుద్దులవారు కథను చెప్పేటప్పుడు వేదిక మీదకు అందరూ ఒకేసారి



రారు. వీరు ప్రేక్షకుల్లో ఆమూలనుంచి ఒకరు, ఈమూల నుంచి ఒకరు వేదిక మీదకు వస్తూ గొర్రెల మందను అదిలిస్తున్నట్లు తప్పిపోయిన గొర్రెలను వెదుకుతున్నట్లు తోడేళ్ళను తమ కేకలతో బెదరగొడుతున్నట్లు కేకలు వేస్తూ హడావుడి చేస్తూ వస్తారు. మొదట ప్రధాన కథకుడు, ఒక వంత వేదిక మీదకు వస్తారు. వచ్చిన వెంటనే వంత రెండవ వంత కోసం ప్రేక్షకుల్లోకి చూస్తాడు. రెండవ వంత ప్రేక్షకుల మధ్యలో నుంచి మిగిలిన ఇద్దరు కథకుల లాగానే గొర్రెలమందను అదిలిస్తునట్టుగా కేకలు వేస్తూ వేదిక మీదకు వస్తాడు. అందరూ వేదిక పైకి వచ్చిన తరువాత ఆ గ్రామంలోని మోతుబరు లందరినీ పేరుపేరునా ప్రస్తావిస్తూ వారందరూ వచ్చారా లేదా అని పరామర్శ చేస్తారు. ఆ తరువాత మంచి చలోక్తులతో హాస్యాన్ని ఒలికిస్తూ ప్రేక్షకులను ఆకట్టుకుంటారు. కథను ప్రారంభించడానికి ముందు వీరు గణపతి ప్రార్థన ఇలా చేస్తారు.

"గణనాయకా శివగణనాయకా- గరళాకంధరుడవు గణనాయకా
హరహరా మహదేవ గణనాయకా- హరుని కొమారుడవు గణనాయకా
శివశివా మహదేవ గణనాయకా- శివుని కొమారుడవు గణనాయకా
బ్రాహ్మణులే నిను గొల్వ గణనాయకా- బ్రహ్మదేముడందురయ్య గణనాయకా
రాజులె నిను గొల్వ గణనాయకా- రాయబారమందురయ్య గణనాయకా
కోమట్లే నిను గొల్వ గణనాయకా- కోటి లాభ మందురయ్య గణనాయకా
వెలమలే నినుగొల్వ గణనాయకా- వేణునాద మందురయ్య గణనాయకా
ఎరుకలే నినుగొల్వ గణనాయకా- కొల్లాపురి యందురయ్య గణనాయకా"

తరువాత యాదవుల కులదేవత అయిన గంగను ఇలా ప్రార్థిస్తారు.

"శ్రీమహాదేవుని శృంగార రాణి - కామితార్థము లిచ్చు కంజాతపాణి
మౌనుల పాలిటి మందార వల్లి- దీనుల పాలిటి దివ్య గీర్వాణి
కొల్హాపురంబున గొలువిచ్చు దేవి- చల్లంగ రక్షించు చంద్రికా దేవి
కనకము గురియించు కనక దుర్గాంబ- శ్రీధనుము కొండలో స్థిరముగా నున్న
నీకు మ్రొక్కెదమమ్మ నీరజవేణి- బ్రహ్మగవేంద్రుని పాళెంబుతల్లి
సీత నీ పుట్నిల్లు శ్రీ పర్వతములు- మగువ నీ పుట్నిల్లు మాల్యవంతములు
తుంగభద్ర వార్ధాసి దీర్ఘండ నిధులు- గంగాజల నిధులు కలుగని నాళ్ళు
ఎవని మీదుంటివే ఎవని తలమీద- ఉత్తరాదిని పుట్టి ఉంటి మేల్గిరుల
దక్షిణాదిని వెలసి ధనము కొండను నిలిచి - పాలేట పూజగొను పరమ కల్యాణి
కొమ్మ! లేవమ్మ! ఓ కొమ్మ గంగమ్మ!- కొమ్మ! ముగ్గురి గన్న కోమలీ లేవె!
కామధేనువు అరచె గంగ మేల్కోవె- మేలుకో శాంభవీ! మేలీయవమ్మ!

వాక్కివ్వవే మాకు ఓ శారదాంబ- నీసేవ నే జేతు నీతి మార్గమున
పరసేవ నేనెరుగ పరమ కల్యాణి- నిండు చేతులను పన్నెండాయుధముల
పట్టిన గంగమ్మ పరమ కల్యాణి- నీ కథల్ చెప్పంగ నిశ్చయించితిని
వినరయ్య జనులార! విశదంబుగాను"

ఆ తరువాత కాటమరాజు కథల్లో ఏదో ఒక కథను చెప్పడం ప్రారంభిస్తారు. కథను చెప్పేటప్పుడు ప్రధాన కథకుడు ఎడమచేతిని ఎడమ చెవిమీద పెట్టుకొని, కుడి చేయి పైకెత్తి ఒక్కొక్క పాదాన్ని పాడుతూ, పాదం చివర ఉన్న అక్షరాన్ని దీర్ఘం తీసి రాగం మొదలు పెడతాడు. మొదలు పెట్టగానే వంతలు ఆ రాగాన్ని ఎత్తుకొని "ఆ" అని వంత పలుకుతారు. తర్వాత ప్రధాన కథకుడు తర్వాత పాదాన్ని అలాగే పాడుతాడు. వంతలు మొదటి పాదం లాగానే వంత పలుకుతారు. ఇలా 7,8 పాదాలు పాడతారు. ఉదాహరణకు గొల్లసుద్దులవారు పెద్దిరాజు కథను ఇలా పాడుతారు.

"పంపాద్రినేలుచు పరగ పెద్దన్న- సంతుకొరకును తాను సతియు పెద్దమ్మ
కళ్యాణ సోమప్పను సేవింప కడు నిశ్చయించి- అన్నల తమ్ముల అందరిని బిలిచి
కులకోటి బాంధవుల గొబ్బున పిలిచి- ఆ వేళ పెద్దిరాజు అతివేడ్కతోను
కొలువున కూర్చుండి పల్లికొండను చూచి"

ఇలా ఏడు, ఎనిమిది పాదాలు పాడిన తర్వాత ఇద్దరు వంతల్లో ఒక వంత ప్రధాన కథకుడు పాడిన గేయంలోని కథకు సులభమైన మాటలతో వచన రూపంలో చెబుతాడు. ఆ తర్వాత ప్రధాన కథకుడు తర్వాత కథను పాడడం ప్రారంభించి 7,8 పాదాలు పాడతాడు. ఈ పాదాల్లోని విషయాన్ని వంత మళ్లీ వచనంలో చెబుతాడు. ఈ విధంగా గొల్లసుద్దుల వారు కథను చెబుతారు.

గొల్లసుద్దులవారి ప్రదర్శన సులభమైనది. తేలికైనది. ప్రదర్శకుల వేషం, వారి భాష, కథను గానం చేసే పద్ధతి, వచనంలో చెప్పేవిధానం మొదలైనవి ఆసక్తి కరంగా ఉండడం చేత తెలంగాణ ప్రాంతంలో ఈ కళకు మంచి ఆదరణ ఉండేది. అందువల్లనే ఆంధ్రప్రజా నాట్యమండలివారు ఈ కళను తమ రాజకీయ ప్రచారానికి బాగా ఉపయోగించు కున్నారు. తిరునగరి రామాంజనేయులు గారు తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలన్న ఇతివృత్తంతో 1952లో "రాష్ట్రవాంఛ" అనే పేరుతోనూ, అల్లూరి సీతారామరాజు కథను "మన్య విప్లవం" అనే పేరుతోనూ గొల్లసుద్దుల బాణీలో రాసి ప్రదర్శించినట్లు అలాగే వారణాసి సత్యనారాయణశాస్త్రి గారు "సతీ ముసలమ్మ" అనే కథను గొల్లసుద్దుల బాణీలో రచించినట్లు మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తిగారు[15] తెలియజేశారు.



తెలంగాణ ప్రాంతంలో గొల్లసుద్దులవారి కళకు మంచి ప్రచారం ఉండడం వల్లనే గద్దర్ గొల్లసుద్దుల వారిలో ప్రధాన కథకుని వేషాన్ని ధరించి అనేక రకాల విప్లవ గీతాలను పాడి ప్రజలను విప్లవోన్ముఖులను చేసే ప్రయత్నం చేశారు. గొల్లసుద్దుల వారు

"గొల్లల గోత్రాలు గొర్రెల కెరుక - గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక
వీరి వారి గోత్రాలు తోడేళ్ల కెరుకో"

అని పాడతారు. దీని ఆధారంగా చేసుకొని గద్దర్ పల్లెసుద్దులు అనే పేరుతో చెప్పిన సుద్దులు గొప్ప చైతన్యాన్ని కలిగించేవిగా ఉన్నాయి. ఈగేయాన్ని ఎం. సునీత గారు ఒగ్గుకథ-ఒక పరిశీలన అనే లఘుసిద్ధాంత వ్యాసంలో ఇచ్చారు.

"పల్లెల బతికెటోల్ల గోత్రాలు పట్నమోని కెరుక
పట్నంల బతికెటోల్ల గోత్రాలు పల్లెటూరోని కెరుక
వారి వీరి గోత్రాలు అడివిలో బతికెటోల్ల కెరుక
చెరువుల గోత్రాలు చేపల కెరుకా -చేపలగోత్రాలు చెరువుల కెరుకా
వారి వీరి గోత్రాలు బెస్తోల్ల కెరుకో-మైసమ్మగోత్రాలు పోశమ్మ కెరుకా
పోశమ్మగోత్రాలు మైసమ్మ కెరుక-వారి వీరి గోత్రాలు లింగాన్నే మింగిన పోతలింగాని కెరుకో
వందల ఎకరాల దొరల గోత్రాలు-వేల ఎకరాల దొరల కెరుకా
వేల ఎకరాల దొరల గోత్రాలు-వందల ఎకరాల దొరల కెరుక
వారి వీరి గోత్రాలు చస్తే బొందల స్థలం- కూడా లేనోని కెరుకా
దొరవారి గోత్రాలు దొరసానమ్మ కెరుక-దొరసానమ్మ గోత్రాలు దొరవారి కెరుక
వారి వీరి గోత్రాలు జీతగాల్ల కెరుకా"

ఈ విధంగా పాడుతూ గద్దర్ గొల్లసుద్దుల ప్రధాన కథకుని వేషాన్ని బాగా ప్రాచుర్యం లోని తెచ్చారు.

రాయలసీమలోని గొల్లసుద్దుల వారి కళాప్రదర్శన తెలంగాణ ప్రాంతం గొల్లసుద్దుల కళా ప్రదర్శన కంటే భిన్నంగా ఉంటుంది. రాయలసీమలోని గొల్లసుద్దుల వారు ప్రధానంగా గంగ, కాటమరాజు తరకవాదం కథను చెబుతారు. ఈ కథను వీరు గ్రామంలో ఉన్న గంగ దేవత గుడి ఎదురుగా చెబుతారు. ఊర్లో గంగ గుడి లేక పోతే యాదవుల ఇళ్ళ దగ్గర విశాలమైన ప్రదేశంలో కథను చెబుతారు. గొల్లసుద్దుల వారు ప్రస్తుతం ట్యూబులైట్ల వెలుతురులో మైకులు పెట్టుకొని కథను చెబుతున్నారు. విశాలమైన ప్రదేశం మధ్యలో రెండు వరుసలుగా నాలుగు కర్రలను నిలువుగా భూమిలో పాతుతారు. ఈ రెండు వరుసల మధ్య నిలబడి వీరు కథను చెబుతారు. అంటే గొల్లసుద్దులవారు నిలబడి కథను చెప్పడానికి వీలైనంత ఖాళీ ఉండేటట్లుగా కర్రలను

పాతుతారు. ఒక్కొక్క వరుసలోని రెండు కర్రలను కలుపుతూ పైన ఒక కర్రను కడతారు. రెండు వరుసలకు ఇలా కర్రలను కడతారు. ఈ రెండు కర్రల పైన అడ్డంగా రెండు వరుసలను కలుపుతూ ఇంకొక కర్రను కడతారు. ఈ కర్రకు మధ్యలో రెండు అడుగుల దూరంలో రెండు మైకులను కడతారు. నిలువుగా పాతిన కర్రలకు ట్యూబు లైట్లు కడతారు. ఈ కర్రలకు ఆనుకొని రెండు బల్లలు ఉంచుతారు. అంటే ఈ రెండు బల్లలు ఎదురెదురుగా ఉంటాయి. ఒక బల్ల మీద గంగవేషం ధరించిన కళాకారుడు, ఎదురుగా ఉన్న బల్లమీద కాటమరాజు వేషం ధరించిన కళాకారుడు నిలబడతారు. ఇలా బల్లమీద నిలబడడం వల్ల ఈ వేషధారులు కథ వినడానికి వచ్చిన ప్రజలకు స్పష్టంగా కనిపిస్తుంటారు. వీరిద్దరికీ అందుబాటులో చెరొక మైకును పైన ఉన్న కర్రకు కడతారు. వీరిద్దరూ ఒకరి తరువాత ఒకరు గంగ, కాటమరాజు తరకవాదం కథను గేయరూపంలో పాడతారు.

పైన చెప్పిన విధంగా గొల్లసుద్దులవారు కథ చెప్పడానికి రంగాన్ని ఏర్పాటు చేసుకుంటారు. వీరు కథను చెప్పేటప్పుడు 8 నుంచి 10 మంది వరకు పాల్గొంటారు. వీరిలో ఒకరు గంగ వేషాన్ని, మరొకరు కాటమరాజు వేషాన్ని ధరిస్తారు. గంగ వేషాన్ని ధరించిన వ్యక్తి స్త్రీలాగా చీర, రవిక ధరించి మెడలో హారం మొదలైన గిల్టు నగలను వేసుకుంటాడు. తలకు రాణులు పెట్టుకొనే చిన్న కిరీటం పెట్టుకుంటాడు. మెడలో పూలదండ వేసుకుంటాడు. కాటమరాజు వేషాన్ని ధరించిన వ్యక్తి సిల్కు పంచ సిల్కు అంగీ ధరిస్తాడు. మెడలో ఒక గిల్టురాళ్ళ హారాన్ని వేసుకొని తల మీద కిరీటాన్ని పెట్టుకుంటాడు. మెడలో పూలదండ వేసుకుంటాడు. ముఖానికి శ్రీకృష్ణుని లాగా నీలిరంగును పూసుకుంటాడు. వీరిద్దరూ ఎదురెదురుగా ఉన్న చెరొక బల్ల మీద నిల్చొని గేయరూపంలో గంగ, కాటమరాజు తరకవాదం కథను ఒకరి తరువాత ఒకరు పాడ తారు. వీరిద్దరి మధ్యలో మిగిలిన ఆరుగురు వ్యక్తులు కింద రెండు వరుసల్లో నిలబడి ఉంటారు. ముందు వరుసలో నిలబడ్డ ముగ్గురు వంతలుగా వ్యవహరిస్తారు. వెనుక వరసలోనిలబడ్డ ముగ్గురు తాళాలు, కొమ్ము, వీరణం అనే వాద్యాలను ధరించి వాయిస్తూ ఉంటారు. ముందు వరుసలో నిలబడి వంతలుగా వ్యవహరించే వారికి దగ్గరగా రెండడుగుల దూరంలో పైన అడ్డంగా కట్టిన కర్రకు మైకులు వేలాడదీసి ఉంటాయి. గంగ కాటమరాజు వేషాలను ధరించిన కళాకారులు ఒక్కొక్క పాదాన్ని పాడుతూ పాదం చివర రాగం తీస్తున్నప్పుడు మధ్యలో ఉన్న వంతలు ఆ రాగాన్ని ఎత్తుకొని ఆ ............ అని దీర్ఘంగా రాగం తీస్తూ వంత పాడతారు. ఇలా ఏడు ఎనిమిది పాదాలు పాడిన తరువాత వంతలుగా వ్యవహరించే వాళ్ళలో ఇద్దరు వ్యక్తులు గేయ





గొల్ల సుద్దులవారి ప్రదర్శన (ధర్మరాజు బృందం, ప్రొద్దుటూరు, కడప జిల్లా)

రూపంలో పాడిన కథను సులభమైన వచనంలో ప్రజలకు అర్థమయ్యేలాగ చెబుతారు. ఇలా చెప్పేవారిని "అర్థగాళ్ళు" అంటారు.

గంగ కాటమరాజు తరకవాదం కథను కాటమరాజు వేషధారి ఇలా ప్రారంభిస్తాడు.

"శ్రీరాజాధిరాజు రాజు కాటమరాజు- దక్షిణాదికి ఆవుల తర్లించుకోని
బలువైన సంపదలు పాలేట నిలచె- ఆరునూరు గుత్తి కవ్వము యాదవులు కొందరు
తరమునాటి గోకులము వచ్చి తాళ్లూరు మిట్టల దిగెను- బొల్లావు యెద్దులు భోగావతి నర్రలు వచ్చి
బొమ్మిరెడ్డిపల్లి మిట్టలవారి బోడావులు దిగెను- జలతారు గుడార్లు జగజంపు గొడుగులు
చల్లవారు యేగురు సాహసఘనులు-సకలాంబర భూషిత సంపన్నులై వచ్చి
చాకిరేల మిట్టవారి సలుగుటావులు దిగెను"

కాటమరాజు వేషధారి "శ్రీరాజాధిరాజు రాజు కాటమరాజు" అనే మొదటి పాదాన్ని పాడి పాదం చివర ఆ........ అని దీర్ఘంతో రాగం మొదలు పెడతాడు. వెంటనే వంతలు ఆ రాగాన్ని ఎత్తుకొని కాసేపు ఆ ......... అని వంత పాడతారు. ఈ వంతలు వంత పాడటం ఆపివేయగానే కాటమరాజు వేషధారి రెండవ పాదాన్ని మొదటిపాదం లాగనే పాడి పాదం చివర ఆ .......... అని రాగాన్ని ఎత్తుకుంటాడు. వెంటనే మళ్ళీ వంతలు ఆ రాగాన్ని ఎత్తుకొని కాసేపు వంత పాడతారు. ఈ విధంగా పైన చెప్పిన అన్ని పాదాలను పాడిన తరువాత వంతల్లో ఒక వ్యక్తి అంతవరకు గేయరూపంలో పాడిన కథను సులభమైన తెలుగు పదాలతో వచనంగా చెబుతాడు. ఆ తరువాత మళ్ళీ గేయరూపంలో కాటమరాజు వేషధారి గానీ, గంగవేషధారి గానీ ఒక్కొక్క పాదాన్ని పాడుతూ కథను నడుపుతారు. వంతలు వారికి వంత పలుకుతూ ఉంటారు. వంతలు మధ్యమధ్యలో హాస్యంకోసం పిట్టకథలను చెబుతూ ఉంటారు.

గొల్లసుద్దులవారు రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో కథను చెప్పడం ప్రారంభించి తెల్లవారుజామున నాలుగు గంటల వరకు కథను చెబుతారు. వీరు చెప్పే కథ ఆసక్తిగా ఉండడంవల్ల తెల్లవారే వరకు ప్రజలు వారి కథను వింటూ అక్కడే ఉంటారు. గొల్లసుద్దుల వారు యాదవుల కోసమే కథను చెబుతారు. వీరు చెప్పే కథ ఆసక్తిగా ఉండడంవల్ల మిగిలిన కులాలవారు కూడా వీరు చెప్పేకథను వినడానికి వస్తారు. వీరు పెద్దిరాజు కథ, బీర్నీనికథ, ముమ్మయ్య పోచయ్య కథ మొదలైన కథలను చెబుతారు. ఈ కథలను చెప్పేటప్పుడు వీరు ఆ కథలోని ప్రధాన పాత్రల వేషాన్ని ధరించి కథాగానం చేస్తారు.

## కొమ్ములవారు - ప్రదర్శనా విధానం :

కొమ్ములవారు యాదవుల ఆశ్రితులు. వీరు ప్రధానంగా కాటమరాజు కథలను, గంగ కథలను, విష్ణు భాగవతం అనే నామాంతరం ఉన్న కంసుడు కథను చెబుతారు. వీరు కథలను చెప్పేటప్పుడు గుడారు, కొమ్ము, వీరణం, స్వరతిత్తి, తాళాలు, బొల్లావు, వీరత్రాడు, బసవదేవుడు అనే వాద్యాలను పరికరాలను ఉపయోగిస్తారు.

**గుడారు** : కొమ్మువారు తమ కథలను యాదవుల ఇళ్ళ దగ్గర గానీ, లేదా గంగమ్మ గుడి ఎదురుగా గానీ చెబుతారు. కథను చెప్పే ప్రదేశంలో వీరు పెద్దగుడ్డతో గుడారాన్ని వేస్తారు. ఈ గుడారం లోపల గోడలకు యాదవుల కులదేవత అయిన గంగ బొమ్మను, కాటమరాజు కథల్లోని ప్రధాన ఘట్టాలను తెలుపుతూ చిత్రింపబడిన కొన్ని గుడ్డలను అతికిస్తారు. కథను చెప్పేటప్పుడు వీరు ఈ గుడ్డల మీద చిత్రింపబడిన బొమ్మలను చూపిస్తూ కథలను చెబుతారు. వీరు గుడారు లోపల ఉండి కథలను చెబుతారు.

**కొమ్ము** : దీన్ని ఇత్తడితో తయారు చేస్తారు. ఇది జంతువు కొమ్ములాగా వంకర తిరిగి కొమ్ము కంటే చాల పెద్దగా ఉంటుంది. దీని మొదలు సన్నగా ఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది. అంటే నోట్లో పెట్టుకొని ఊదే దగ్గర సన్నగాను గాలి వెళ్ళే వైపు వెడల్పుగాను ఉంటుంది. కొమ్ములవారు యాదవుల ఇళ్ళకు వచ్చినప్పుడు మొదట ఈ కొమ్మును వాయించి ఆ తరువాత వారి గోత్రాలను పొగుడుతారు. అలాగే కథాగానం ప్రారంభించడానికి ముందు తానకాలు పాడే సమయంలో కొమ్మును ఊదుతారు. కొమ్ము శబ్దం శంఖారావం లాగా ఉత్తేజభరితంగా ఉంటుంది. ఈ కొమ్ము వాద్యాన్ని వీరు ఎక్కువగా ఉపయోగించడం వల్ల వీరికి కొమ్ములవారు అనే పేరు వచ్చింది. కొమ్ముల వారు తమ వెంట ఎల్లప్పుడూ ఈ కొమ్మువాద్యాన్ని తెచ్చుకుంటారు. అర్ధచంద్రాకారంలో ఉన్న ఈ కొమ్ము రెండు చివరల ఒక తాడుతోకట్టి భుజానికి తగిలించుకుంటారు.

**వీరణం** : కొమ్ములవారు ఉపయోగించే వీరణం రెండు భాగాల కలయికగా ఉంటుంది. ఒక భాగాన్ని రేలచెక్కతో గానీ, వేపచెక్కతో గానీ తయారు చేస్తారు. రెండవ భాగాన్ని ఇత్తడితో తయారు చేస్తారు. రెండింటికి మేక చర్మంతో గానీ, గొర్రెచర్మంతో గానీ చివరల మూసివేస్తారు. కొయ్యతో చేయబడిన వీరణ శబ్దానికి ఇత్తడితో చేయబడిన వీరణ శబ్దానికి తేడా ఉంటుంది. ఈ రెండు శబ్దాల కలయిక ఇంపైన శబ్దాన్ని కలిగిస్తుంది. ఈ శబ్దం కొమ్మువారి కథకు సరిజోడుగా ఉంటుంది. ఈ వీరణాన్ని ఎడమవైపు చేతివేళ్ళతోను కుడివైపు సన్నని కర్రపుల్లతోను వాయిస్తారు. కొన్ని ప్రాంతాల్లో రెండు వైపులా పుల్లలతోను, రెండు వైపుల చేతి వేళ్ళతోను వాయిస్తారు.

**స్వరతిత్తి** : దీన్ని పలుచటి తోలుతో తయారుచేస్తారు. ఇది గుండ్రటి సంచిలాగా ఉండి



ఒకచోట సన్నగా గాలి వెళ్ళేదారి కలిగి ఉంటుంది. అక్కడ నుంచి గాలి బయటకు వస్తుంది. ఇలా గాలి బయటకు వచ్చేటప్పుడు ఒక రకమైన ధ్వని వెలువడుతుంది. ఈ ధ్వని కొమ్ములవారి కథాగానం సమయంలో శృతిని కలుగజేస్తుంది. కొమ్ములవారిలో ఒక వ్యక్తి దీన్ని నోటితో పట్టుకొని గాలి ఊదుతూ ఉంటాడు.

**తాళాలు** : తాళాలు ఇత్తడితో చేసిన బిళ్ళల లాగా పలచగా చేయబడి వృత్తాకారంలో ఉంటాయి. వీటి వెలుపలి భాగం మధ్యలో ఉబ్బెత్తుగా ఉంటుంది. ఈ ఉబ్బెత్తు ప్రదేశం మధ్యలో రంధ్రం ఉంటుంది. ఈ రంధ్రంలో నుంచి సన్నని గుడ్డతో ముడివేసి ఆ గుడ్డను పట్టుకొని రెండు తాళాలను రెండు చేతులతో పట్టుకొని వాయిస్తారు. ఈ తాళాలు కథా సమయంలో పాటలు పాడేటప్పుడు ఎక్కువగా ఉపయోగిస్తారు.

**బొల్లావు** : బొల్లావు అంటే తెల్లని ఆవు అని అర్థం. ఈ బొల్లావు కాటమరాజు ఆల మందలో ఉంటుంది. ఇది శ్రీకృష్ణుని అవతారంగా భావిస్తారు. ఎర్రగడ్డపాడు దగ్గర జరిగిన యుద్ధంలో ఈ బొల్లావు యాదవుల పక్షాన సిద్ధిరాజు సైన్యంతో పోరాడి చివరకు చనిపోతుంది. ఈ బొల్లావుకు ఒక కొమ్ము మాత్రమే ఉంటుంది. అందుకే దీన్ని "ఒంటి కొమ్ము బొల్లావు" అంటారు. చనిపోయిన బొల్లావుకు గుర్తుగా కొమ్ములవారు కథను చెప్పేటప్పుడు ఒంటికొమ్ము బొల్లావు బొమ్మను తమ వద్ద ఉంచుకుంటారు. ఈ బొల్లావు బొమ్మను చెక్కతో గానీ, ఇత్తడితో గానీ చేస్తారు.

**వీరతాడు** : ఇది జనుపనారతో పేనినతాడు. "పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయుడు జరిపిన శివనందుల కోట యుద్ధములో యాదవులతనికి తోడ్పడిరట. అందుచే నతడు యాదవులకు శివనందుల కోట దోపులో లభించిన గుడారు, వీరద్రాళ్ళు, గంగ - పోతురాజుల విగ్రహములు బహూకరించెనట. తానకములు పాడునప్పుడు శివమెత్తి గంతులు వేయు వారికి వీర ద్రాళ్ళతో కాళ్ళమీదను చేతుల మీదను కొట్టుదురు. ఈ వీరద్రాళ్ళు మూడు ముళ్ళతో నుండు బారెడేసి పగ్గములు"[16] వీరతాడును ఉత్సవ సమయాల్లో బొల్లావు మెడలో వేసి ఊరేగిస్తారు. అలాగే ఉత్సవ సమయంలో భక్తులకు శివాలు వచ్చినప్పుడు ఈ తాళ్ళతో టపటప శబ్దాలు వచ్చేటట్లుగా తమను తాము కొట్టుకుంటారు. ఈ వీరతాడు పుట్టకను గురించి, దానితో యాదవులు తమను తాము కొట్టుకోవడాన్ని గురించి ఒక కథ ఉంది.[17]

"పూర్వం యాదవ రాజ్యంలోకి సమీపంలో ఉన్న అడవిలో నుంచి ఒక ముని వచ్చి యాదవులకు భవిషత్తులో జరగబోయే విషయాలను గురించి ముందుగానే చెప్పి తిరిగి అడవిలోకి వెళ్ళేవాడు. ఒకసారి ఆ ముని యాదవుల రాజ్యంలోకి వచ్చి తిరిగి అడవికి వెళ్ళేటపుడు ఆలమందను కాసే కొంతమంది గోపాలకులు ఆ మునిని ఆట

పట్టించడానికి తమలో ఒకరికి గర్భవతి అయిన స్త్రీగా వేషం వేసి అతణ్ణి ముని దగ్గరకు తీసుకొని వెళ్ళి ఈ బాలిక గర్భంలో ఉన్నది బాలుడా, బాలికా అని ప్రశ్నిస్తారు. ముని తన దివ్యదృష్టితో విషయాన్ని పసిగట్టి కుర్రవాడి గర్భంలో రాయి రూపంలో ఉన్న పిండం పుడుతుందని దానివల్ల యాదవులకు అరిష్టం జరుగుతుందని శపిస్తాడు. గోపాలకులు ఈ విషయాన్ని తమ పెద్దలకు తెలియజేస్తారు. వెంటనే యాదవులందరూ కలిసి ముని దగ్గరకు వచ్చి గోపాలకులు చేసిన తప్పును మన్నించి యాదవజాతిని కాపాడమని ప్రార్థిస్తారు. అప్పుడు ముని తన శాపానికి విముక్తి మార్గాన్ని ఇలా చెబుతాడు. కుర్రవాడి గర్భం నుంచి ఉద్భవించిన రాయిని నీటిలో ఒక రాతిమీద గంధపు చెక్కను సాదినట్లు సాదాలని, ఆ రాతి నుంచి వచ్చిన రసం నుంచి నీటితుంగ పుడుతుందని, ఆ నీటితుంగతో చేసిన తాళ్ళతో గంగ జాతర సమయంలో శివాలు వచ్చినప్పుడు మీకై మీరు కొట్టుకోవాలని శాపాన్ని తగ్గించి ముని వెళ్ళిపోతాడు.

ముని చెప్పినట్టుగానే గోపాలకుని గర్భం నుంచి రాయి రూపంలో పిండం పుడుతుంది. ఆ పిండాన్ని నీటిమధ్యలో ఉన్న కటిక రాతి మీద సాదిసాది చివరకు ఒక చిన్నరాయి మిగిలితే దాన్ని పారుతున్న నీటిలో పడవేస్తారు. గోపాలకుని గర్భం నుంచి పుట్టిన రాయిని నీటిలో సాదినప్పుడు దాని రసం ఎంత వరకు ప్రవహించిందో ఆ ప్రదేశమంతా నీటి తుంగ పుడుతుంది. ముని చెప్పినట్లుగా యాదవులు గంగమ్మను కులదేవతగా భావించి ఆమెకు జాతరలు చేసేటప్పుడు నీటి తుంగతో తయారు చేసిన తాళ్ళతో తమను తాము కొట్టుకోవడం ప్రారంభిస్తారు. ఇది తమ గోపాలకులు మునిని అవమానించినందుకు శిక్షగా యాదవులు భావిస్తారు".

మహాభారతంలోని మౌసల పర్వంలో చెప్పబడిన దుర్వాసుని శాపవృత్తాంతాన్ని అనుసరించి పైకథను కొమ్ములవారు కల్పించారు.

**బసవదేవుడు :** యాదవవీరులు ఎర్రగడ్డపాడు యుద్ధంలో చనిపోయారనే వార్తను దొన కొండకు తెచ్చినది బసవదేవుడు. దీనికి కృతజ్ఞతగా కొమ్ములవారు కథను చెప్పేటప్పుడు తమ దగ్గర బసవదేవుని విగ్రహాన్ని ఉంచుకుంటారు. బసవదేవుని బొమ్మను చెక్కతో తయారు చేస్తారు.

సాధారణంగా యాదవులందరూ శైవులు. శివుని వాహనమైన బసవదేవుని వారు ఆరాధ్య దైవంగా కొలుస్తారు. గంగ జాతర సమయంలో దుప్పటి లాంటి మంద మైన గుడ్డమీద బసవదేవుని బొమ్మను ముద్రించి ఆ గుడ్డను కర్రకు జెండా లాగా కట్టి ఉత్సవ సమయంలో ఊరేగిస్తారు. దీన్ని అంటే గుడ్డమీద బసవదేవుని బొమ్మగల జెండాను కొమ్ములవారు "బసవ శంకర బిరుదు" అని పిలుస్తారు. బిరుదు అంటె




కొమ్ముల వారి ప్రదర్శన (గంగవరం కనకయ్య బృందం, ప్రకాశం జిల్లా)

ముద్ర అని చెప్పవచ్చు. బసవ శంకర బిరుదును గంగజాతర జరిగే అయిదు రోజుల ఊరేగింపులోనూ ప్రదర్శిస్తారు.

**కొమ్ము కథకుల వేషధారణ :** కొమ్ములవారు కథను చెప్పేటప్పుడు నలుగురు సభ్యులు ఉంటారు. వీరిలో ఒకరు ప్రధాన కథకుడు, మిగిలిన ముగ్గురు వంతలుగా ఉంటూ వాయిద్యాలను వాయిస్తారు. ప్రధాన కథకుడు మోకాళ్ళ కింది వరకు వచ్చిన నిలువు టంగీని ధరిస్తాడు తలకు పంద్రెండు మూరల పొడవు గలిగిన గుడ్డను తలపాగాగా చుట్టుకుంటాడు. కాళ్ళకు గజ్జెలు, నడుముకు కండువా కట్టుకుంటాడు. చేతుల్లో కొమ్మును పట్టుకొని ఉంటాడు. వాయిద్యాలను వాయిస్తూ వంతలు పలికే వారికి ప్రత్యేకమైన వేషధారణ ఉండదు. మామూలుగా ఎప్పుడూ ధరించే బట్టలనే వేసుకొని ఉంటారు. కాకపోతే కండువాను నడుముకు చుట్టుకుంటారు. ఈ ముగ్గురు వంతలు ఒకరు వీరణాన్ని, మరొకరు తిత్తిని, ఇంకొకరు తాళాలను పట్టుకొని వాయిస్తుంటారు. 'గంగ కాటమరాజు తర్కం" కథను చెప్పేటప్పుడు ఒకరు గంగ వేషాన్ని, ఇంకొకరు కాటమ రాజు వేషాన్ని వేసుకొని ఎదురెదురుగా నిలబడతారు. ఇద్దరూ చేతిలో కత్తిపట్టుకొని ఆ కత్తిచివర నిమ్మకాయను గుచ్చుతారు. అంతేగాకుండా వీరిద్దరూ కాళ్ళకు గజ్జెలు కట్టుకొని గంతులు వేస్తూ కత్తిని తిప్పుతూ గంగా కాటమరాజు పరస్పరం వాదించు కున్నట్లుగా నటిస్తారు.

**ప్రదర్శనా విధానం :** కొమ్ములవారు తమ కథను గంగజాతరలు జరిగే సమయంలో గంగ గుడి దగ్గర చెబుతారు. కొంతమంది యాదవులు తమకు సంతానం కలగనప్పుడు గంగ తిరునాల చేయించి ఆ సందర్భంగా కొమ్ములవారి చేత కాటమరాజు కథలను చెప్పిస్తారు. అలాగే యాదవుల్లో ఎవరైనా ప్రసిద్ధమైన వ్యక్తులు చనిపోయినప్పుడు ఇంటివారు కొమ్ములవారి చేత కథను చెప్పిస్తారు. కొమ్ములవారు సాధారణంగా తమ కథను గంగమ్మ గుడి ఎదుట గానీ, లేక కథను చెప్పించే యాదవుల ఇంటి ముందు గానీ చెబుతారు. కథను చెప్పే ప్రదేశంలో మొదట వీరు గుడారు వేస్తారు. దానిలోపల గోడలకు గంగమ్మ బొమ్మను, కాటమరాజు కథల్లో వచ్చే పాత్రల బొమ్మలను అతికించి వీరు గుడారు లోపల ఉండి కథను చెప్పడం ప్రారంభిస్తారు. కథను చెప్పడానికి ముందు ప్రధాన కథకుడు తప్పనిసరిగా కొమ్మును వాయిస్తాడు. కథను పూర్తిగా ప్రధాన కథకుడే చెబుతాడు. వంతలు అతనికి సహాయంగా వంత పలుకుతూ ఉంటారు.

కథను ప్రారంభించడానికి ముందు ప్రధాన కథకుడు విఘ్నేశ్వరుని ప్రార్థన ఇలా చేస్తారు.

"గణనాయకా శివగణ నాయకా-గరళాకంధరుడవు గణనాయకా ।

హరహరా మహదేవ గణనాయకా - హరుని కొమారుడవు గణనాయకా ।

శివశివా మహాదేవ గణనాయకా - శివుని కొమారుడవు గణనాయకా"

తరువాత యాదవుల కులదేవత అయిన గంగను ఇలా ప్రార్థిస్తారు.

"గంగ రావా గంగ ధనమకొండ గంగా
గంగ పాప సొమ్ములకున్న నేడు పాలేటి లోను
పాలేటి శ్రావణి గంగ మా పశువులు శ్రామం నేడు
మా పశువులు శ్రామం గంగ అంతరి శ్రావణి గంగ
మా యాదవులు శ్రామం పాలు పొంగిన రీతిగా
నేడు మా పాలేరు పొంగో తాను తలచింత
తలమరాల మండపం అన్నదమ్ముల పెళ్ళిళ్ళు
మరణయాటపాలు అక్కడ నీ పేరు యాదిలక్ష్మమ్మో
సభలోన నా మాట సభకోర్చు తల్లి
పూస గుచ్చినట్లు గంగ నేడు బుద్ధి మాకివ్వవే
వాగ్వివ్వ శార్థంబు వందనంబు తెప్పతెప్పల గంగ నేడు
తెప్పలాగంగ తెప్పలయ్యి మాపాల నేడు తేలాడు ఊహ
స్థిరమందుల వారు గొలిచేరు తేనె వెలుపల గంగ
వొల్లవలవారు కొలిచేరు వజ్ర మాణిక్యాల గంగ
ఎనిమిది చేతుల గంగ నేడు ఏపారు గంగ
ఎనిమిది చేతుల గంగ నేడు ఏపారు గంగ
తొమ్మిది చేతుల గంగ నేడు ధనుమకొండ గంగో
పన్నెండు చేతుల గంగ నేడు భాగ్యత్తు గంగో
మాకు సాయమే గావే గంగ మాకు సాయముగా గంగ
మంచి సమయంబులోను గంగని తలవందే నేడు
కథ మరియెంద రాదా! నిన్ను ప్రార్థన చేయ నేను
ఎంతటి వాడనో ఊహ నిను ప్రార్థన చేయ
నీ సేవ తప్ప నేను పరసేవ ఎరుగనమ్మా నేడు
పరమ కళ్యాణీ గంగ దనము కొండగంగా"

ఇలా గంగ ప్రార్థన చేసిన తరువాత ప్రధాన కథకుడు కాటమరాజు కథల్లో ఏదైనా కథను చెప్పడం ప్రారంభిస్తాడు. కొమ్ములవారు చెప్పే కథల్లో భట్టురాయబారం కథ చెప్పదగినది. కాటమరాజు నెల్లూరును పాలించే నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం చేసుకొని అతని రాజ్యంలో కొంతకాలం ఆవుల మందను మేపుకుంటాడు. ఐతే



కుందమాదేవి కాటమరాజు ఆలమందను చంపించడం చేత కాటమరాజు ఒప్పందం ప్రకారం తాను ఇవ్వవలిసిన పుల్లరిని నల్లసిద్ధిరాజుకు ఇవ్వకుండా నెల్లూరు నుంచి ఆలమందను తోలుకొని కనిగిరి సీమలో ఉన్న యర్రగడ్డపాడు దగ్గరికి వచ్చి విడిది చేసి ఉంటాడు. నల్లసిద్ధిరాజు తమకు ఇవ్వవలసిన పుల్లరిని ఇవ్వవలిసినదిగా కోరుతూ ఒక భట్టును కాటమరాజు దగ్గరికి రాయబారిగా పంపిస్తాడు. భట్టు కాటమరాజు దగ్గరకు వచ్చి పుల్లరిని చెల్లించవలసిందిగా కోరతాడు. భట్టు చెప్పేమాటలను ప్రధాన కథకుడు గేయరూపంలో ఒక్కొక్క పాదాన్ని పాడుతూ ఉంటాడు. పాదం చివర ఓ........ అంటూ దీర్ఘం తీయడం ప్రారంభిస్తాడు. వెంటనే వంతలు ఓ........ అంటూ అతనికి సహాయంగా అందుకొని కొంతసేపు రాగం తీస్తారు. వంతలు రాగం ఎత్తుకో గానే ప్రధాన కథకుడు రాగం ఆపేస్తాడు. అలా రాగం తీసేటప్పుడు తమ వాద్యాల శబ్దాన్ని ఎక్కువ చేస్తారు. ఆ విధంగా కొంతసేపు వంతలు రాగం చేస్తూ వాద్యాలను వాయించిన తరువాత ప్రధాన కథకుడు తరువాత పాదాన్ని పాడి పాదం చివర మళ్ళీ ఓ......... అంటూ రాగం ఎత్తుకుంటాడు. వంతలు మళ్ళీ అతనికి సాయంగా వచ్చి ఆ రాగాన్ని అందుకొని తమ వాద్యాలను గట్టిగా వాయిస్తూ కాసేపు రాగం ఆలపిస్తారు. ప్రధాన కథకుడు నల్లసిద్ధిరాజు భట్టు చెబుతున్నట్టుగా ఇలా పాడతాడు.

"వశదీశ నందన వంశావతారా
పశువతి వరపుత్ర బవ్య చారిత్ర"

ప్రదాన కథకుడు పైన చెప్పిన రెండు పాదాల్లో మొదటి పాదం పాడి చివర వంశావ తార దగ్గర 'రా'ను దీర్ఘం తీస్తున్నప్పుడు వంతలు ఆ దీర్ఘాన్ని అందుకొని రాగాన్ని ఆలపిస్తూ వాద్యాల శబ్దాన్ని ఎక్కువ చేస్తారు. ఆ తరువాత ప్రధాన కథకుడు రెండవ పాదమైన "పశుపతి వరపుత్ర బవ్యచారిత్ర" అనే పాదాన్ని ఆలపించి పాదం చివరన ఆ....... అంటూ దీర్ఘం తీస్తాడు. ఇలాగ ఐదు లేక ఆరు పాదాలు ప్రధాన కథకుడు చెప్పిన తరువాత వంతలు ప్రేక్షకులకు కథ అర్థం కాలేదని దాన్ని వివరించమని చెబుతారు. అప్పుడు ప్రధాన కథకుడు అంతవరకూ గేయరూపంలో చెప్పిన కథకు మళ్ళీ వచనంలో చెబుతాడు. మధ్యమధ్యలో ప్రధాన కథకుడు కొమ్మును వాయిస్తూ ఉంటాడు. ఈవిధంగా కొమ్ములవారి కథాగానం సాగుతుంది. కథ పూర్తి అయిన తరువాత చివర ప్రధాన కథకుడు గంగమ్మకు ఇలా మంగళం పాడి కథను ముగిస్తాడు.

"వేగమా నీకథకు భాగమో - పంచ వన్నెల పద్మముఖం అదిగో
పద్మాల లోపల బాలవై కూర్చొన్న- బాల సింహాసనం గంగమ్మను
జయ మంగళం శుభమంగళం-వేలు ఉంగరాలు కీలు కడియాలు

వేలు ఉంగరాలు కీలు కడియాలు- పాతైన ముత్యాలు పాచికాలు
పాచికాల లోపల బాలవై కూర్చున్న- బాల సింహాసనం గంగమ్మకు
జయ మంగళం శుభ మంగాళం- మాను సుంగారించి మించిమి కొలిబెట్ట
యాదవుల కొలిచిరి యమ్మ నిన్ను- జయ మంగాళం గంగమ్మకు
శుభ మంగాళం గంగమ్మకు- తొల్లి మా పెద్దలకు తోడునీడంబై
గట్టిగా ఓ తల్లి అవసరంబు- జయ మంగళం శుభ మంగళం
జాతరై యాటలో జండేని గంపలో- జాతరై యాటలో జండేని గంపలో
ముందుగా నడిచేము ముద్రగడిలో- అక్కలకు తమ్ముడ మిక్కిలి పోతన
చిక్కని కోటయ్య జయము జయము"

పై విధంగా మంగళం పాడి కథను ముగిస్తాడు.

## పొడపోతులవారు - ప్రదర్శనా విధానం :

పొడపోతులవారి కళ ఆఖ్యానాత్మకమైనది. వీరు కాటమరాజు కథల్లోని కొన్ని కథలను చెబుతారు. వీరు యాదవులున్న గ్రామాలకు వెళ్ళినప్పుడు యాదవుల వద్ద నుంచి చందాలు తీసుకొని చివరిరోజు తమ కళను ప్రదర్శిస్తారు. వీరు కథను చెప్పేటప్పుడు ముగ్గురు వ్యక్తులు పాల్గొంటారు. అందులో ఒకడు ప్రధాన కథకుడు, మిగిలిన ఇద్దరు అతనికి వంతలు. ప్రధాన కథకుడు తెల్లటి పంచ కట్టుకొని దాని మీద లాల్చి వేసుకొని భుజం మీద కండువా గానీ, శాలువ గానీ వేసుకుంటాడు. ఇతను మధ్యలో నిలబడి కథను చెబుతూ ఉంటే వంతలు అతనికి రెండు వైపులా నిలబడి "ఆ" కొడుతూ ఉంటారు. వీరు కథను చెప్పేటప్పుడు ఎలాంటి వాయిద్యాలను ఉపయోగించరు. జానపద కళల్లో ఇది చాల సామాన్యమైన, సాధారణమైనకళ.

పొడపోతులవారి దగ్గర ఒక పెద్ద తెరపటం ఉంటుంది. ఇది 14 మూరల పొడవు 10 మూరల వెడల్పు ఉంటుంది. అంటే ఇది 35 ఎమ్.ఎమ్. సినిమా తెర అంత ఉంటుంది. ఈ తెర మధ్యలో యాదవుల కులదైవమైన గంగ పన్నెండు చేతులతో పన్నెండు ఆయుధాలను ధరించిన బొమ్మ పెద్దదిగా ఉంటుంది. ఈబొమ్మకు పైన కింద కుడివైపు, ఎడమవైపు త్రిమూర్తుల బొమ్మలు, వారి భార్యలైన పార్వతి, లక్ష్మి, సరస్వతి కల్పవృక్షం, కామధేనువు, ధ్వన్వంతరి మొదలైన బొమ్మలు, కాటమరాజు కథల్లోని అనేక పాత్రలైన కాటమరాజు, పెద్దిరాజు, ఖడ్గతిక్కన, పాపనూక, కరియావులరాజు, భక్తిరన్న, పోలురాజు, ఎలమ పద్మరాగవుడు, బీరినీడు మొదలైన వారి బొమ్మలు ఉంటాయి. పొడపోతుల వారు యాదవులు ఇళ్ళ దగ్గర





పొడపోతుల వారి తెర పటం



కథను చెబుతున్న పొడపోతుల కళాకారుడు గంట అప్పారావు (మరుపల్లి, విజయనగరం జిల్లా)

విశాలమైన ప్రదేశంలో మొదట పొడవుగా ఉన్న మూడు వెదురు కర్రలను పాతుతారు. వీటిని అడ్డంగా కొన్ని కర్రలను కడతారు. అప్పుడు తమ దగ్గర ఉన్న తెరపటాన్ని ఈ కర్రలకు కట్టి దానిపైన, పక్కల కరెంటు దీపాలు వేసి ఆ వెలుగులో బొమ్మలను చూపిస్తూ ప్రధానకథకుడు కథను చెబుతారు. కథను ప్రారంభించే ముందు వీరు విఘ్నేశ్వరుడు, సరస్వతి, గంగ మొదలైన దేవతలను వచనంలో ప్రార్థిస్తారు. ప్రార్థన ప్రధానకథకుడు చేస్తూ వుంటే వంతలు "ఆ" అని "ఔను" అని వంత పలుకుతూ ఉంటారు. వీరి ప్రార్థన వచనంలో ఇలా ఉంటుంది.

"శ్రీగణనాథ పరాత్పర వాగీశ, సురేంద్రవంద్య గుణగణసాంద్ర వేగనిను గొలిచెదము బాగుగా పాలింపవయ్య పార్వతీ తనయ, అంజలిజేసి మొక్కెద మదాంబకు, దివ్యసరోజమాలికా పుణ్యసుగంధ గంధా, గజపుస్తరా రసప్రమదాంబకున్ రంజిత కంఠహార, నవరత్న విలాసిత వజ్రకింకనీ మంజుల మేఖలావలయు, మజ్జసుదాంబకు శారదాంబకు జగదాంబకున్ పాలింపవేమమ్ము పద్మసంభవ రాణీ, బహుశాస్త్ర పుస్తకా పాణివాణి రక్షింప వేమమ్ము రాజ బింబానన, దయచూడవే మమ్ము దవళవదనా మదనిచ్చగించవే మనవి యాలించవే ఓ మాదవు కోడలా, ఓ మరుల వదనా నిన్ను ఎప్పుడు సేవింతు నీలవేణి, నన్ను కిన్నడసేయకే నీలనేత్ర భారతీదేవి నామదిని బాయ కుండు జనన మహాలచ్చిమిదాంబ శారదాంబ, అంజలి జేసి మొక్కెద మదంబకు దివ్యతనూజ మాలికా పుణ్య సుగంధగంధా, గజపుష్కర రసప్రమదాంబకున్ రంజిత కంఠహార చూడీచూడామణీ, శోభనాకారి కాళీమవాంకాళీ గంగాభవానీ, కల్మశంబులు లేని కమలగర్భుని యొక్క కల్పాంతరమున ఏడేడు భువనాలు ఏకమై యుండుచు, తొలుకుచునుండుచు తుమ్మెదలాడుచు అంతకంతకు బొంది యానందమొంది, ఆవిశ్వ నాథుకి ఆవారిజ గర్భుకి వందనం చేసి, పరమకాల్యానీ ఆపంజోతకీ ఆమరంగ పిలువంగ శిముడమ్మపాపనా, శిముజ్జలాదీ వల్లభులవారి గంగ వలపుణ్య కాంతవట, తిరుమందులవారి గంగా తిరుగనేర్చుదువమ్మా మగువ నీపుట్టిల్లు మాయమంత్రాలు, సూత నీపుట్టిలు సూర్యకొండాలు బిత్తర చూపులు బాగీరతీగంగ, ఉరుములు నీ నవ్వు ఊపిరి నీయాయువ, వేగంబు నీ కొప్పు సఖియ నీరూపు శివుని జటల్లోని శిలుకలా గంగ, అయ్యజటల్లోనూ వలపులా కాంత అమ్మ నీపుట్టిల్లు అశోక వనము తల్లీ, విద్యగంగా భవానీ పన్నిండు చేతులతో పన్నిండు ఆయుధములు ధరించినావు, డప్పు ఒకచేత డమరుకం ఒకచేత, డాలు ఒకచేత సుత్తి ఒకచేత శూలామొకచేత అసుల మొలచదానికి ఆయుధమొకచేత, దూతను వధించడానికి దుడ్డు ఒకచేత శెంబు ఒక చేత పట్టినావు, పన్నిండు చేతులలోని పన్నిండు ఆయుధములు ధరించినావు, నీవు

ధరించినంత్రాలు చెప్పితేగనకనేమి, నత్తుబాసిరికమ్మి కనసమున కుంటెల్లు జుజ్జులు జూకాలు కోనబావలీలు, వేళ్ళు కుత్తుగంటు చిలకపేట పేర్లు ఇనగసరులు, మిరియాల పేర్లు కటానగుళ్లు జమున్నాన గుళ్ళు, గరగడియాలు నడుముకు ఒడ్డానము మువ్వల వడ్డానము, మోరీలు మంత్రాలు గోమవంత్రాలు కాళ్ళకు కడియాలు, పావడాలు పావంజీలు నెమలియడుగులు గుళ్ళగొలుసులు, గుబ్బలకాయ పిల్లెలు మెట్టెలు భూలోక మాత మేలుకోవమ్మ వల్లబులవారి కాటమరాజు వరుసతో పండుగ జేస్తున్నాడు". 18

ప్రధానకథకుడు పైవిధంగా వచనంలో పలుకుతుంటే వంతలు ఆ.... అని వంత పలుకుతూ ఉంటారు. ప్రార్థన చేసిన తరువాత కాటమరాజు కథల్లో ఏదో ఒక కథను చెప్పడం ప్రారంభిస్తారు. ఉదాహరణకు బొల్లావు పుట్టుక కథను ప్రధానకథకుడు మొదట వచనంతో ఇలా ప్రారంభిస్తాడు.

**ప్రధానకథకుడు** : "ఆనాడు దేవతలు రాక్షసులు, వారు వారు అక్కచెల్లెళ్ళ పిల్లలైనప్పటికిన్నీ, వారికి వారికి నప్పేదికాదు. నప్పకపోతే, ఈయొక్క రాక్షసులు వెళ్ళి దేవతల్ని గాని చంపినట్లైతే దేవతలు చనిపోవడమే. దేవతలు వెళ్ళి రాక్షసుల్ని చంపితే, ఆయొక్క రాక్షసుని రక్తపుబొట్టు దరణిపై పడితె, కోటి మంది రాక్షసులై మళ్ళీ జన్మిస్తున్నారు. ఇలా ఆయొక్క రాక్షసులతో పోరాడలేక, క్రూరులు పెట్టిన బాదలకు తాళలేక, దారుణిలో దేవతలు యావన్మంది బయలుదేరి"

ఇంతవరకు వచనంలో చెప్పి ఆతర్వాత గేయరూపంలో ఒక పాదాన్ని ప్రధానకథకుడు పాడతాడు. ప్రధానకథకుడు వచనాన్ని కామా పెట్టిన దగ్గరికి చెప్పి ఆగిపోతాడు. అప్పుడు వంతలు ఆ.. అని గానీ ఆహా అని గానీ, అవును అని గానీ వంత పలుకుతూ ఉంటారు. వచనభాగం ఐపోయిన తర్వాత గేయరూపంలో ఒక పాదాన్ని ప్రధానకథకుడు పాడతాడు.

"విష్ణుమూర్తి వద్దకేమో ప్రయాణం గట్టినారా"

ఇలా పాడగానే వంతలు ఇద్దరూ ఆ... అని ఇంచుమించుగా ఒక ఐదు ఆరు క్షణాల కాలం పాటు రాగం తీస్తారు. ఆతర్వాత ప్రధానకథకుడు మళ్ళీ వచనంలో కథను ఇలా చెప్పడం ప్రారంభిస్తాడు.

"మహాశయా రాక్షసులు పెట్టిన బాదలకు మేం ఓర్వలేకపోతున్నాం, దీనికేదైనా మార్గం చెప్పమనగా, విష్ణుమూర్తి చూసి, ఓరాక్షసులు దేవతలు మీరూమీరూ అక్కచెల్లెళ్ళ పిల్లలె, మీకూమీకూ వైరమనగా ఎందుకు, ఇదిగో నేంచెప్తున్నాను వినండి, మనకి సప్తసముద్రాలున్నాయ్, అందులో క్షీరసముద్రం దగ్గరికి వెళ్ళి, కులగిరి పర్వతం గోనగా చేసి, మహేంద్రగిరి పర్వతం మట్టుగా చేసి, శైలేంద్రగిరి పర్వతం చల్లకవ్వంగా చేసి,



ఆదిశేషువని పట్టి ఉరదాడు పన్ని, రాక్షసులు క్రూరులు గనుక శిరసు బాగము, దేవతలు సత్యవంతులు గనుక తోకబాగము పట్టుకొని, క్షీరసముద్రాన్ని తరచండి, అందులో అమృతం పుడతాది, ఆయొక్క అమృతాన్ని ఏవరైతె సేవిస్తారో వాళ్ళు చిరం జీవులు అని ఆయొక్క విష్ణుమూర్తి చెప్పగానే, ఈయొక్క రాక్షసులు దేవతలు ఇరువురు కూడా బైలుదేరి, క్షీరసముద్రం దగ్గరికి వెళ్ళి మహేంద్రగిరి పర్వతం మట్టుగావించి, కులగిరి పర్వతం గోనగా చేసి, శైలేంద్రగిరి పర్వతాన్ని చల్లకవ్వాముగా చేసి, ఆది శేషువను తాడుగా చేసి రాక్షసులు దేవతలు చిలికిననాడు అందులో కొన్ని జన్మించాయి, అటు తర్వాత అమృతం పుట్టే ముందున ఆయొక్క అమృతపు చుక్కనేది నులుపు నూరాడమడ, వెడల్పు ఎయ్యామడ దశాపదకొండామడలు గల మద్యలో"

ప్రధానకథకుడు పైవచనాన్ని చెప్తున్నప్పుడు కామాలు పెట్టిన దగ్గర ఆగిపోతూ ఉంటాడు. ఆతడు ఆగిపోగానే వంతలు ఆ.. అని గానీ ఆహా.. అని గానీ, అవును అని గానీ వంత పలుకుతారు. వచనం అయిపోయిన తర్వాత మూడు పాదాలను గేయరూపంలో పాడాడు.

"అమృతపు చుక్కేమో యడవిల్లోకి తుళ్ళిందా
అమృతపు చుక్కేమో యడవిలోన గనక
మొక్కేగానేమో జననమైనాదా "

మొదటి పాదాన్ని పాడగానే వంతలు ఐదు ఆరు క్షణాల పాటు ఆ...... అంటూ రాగం తీస్తారు. తర్వాత రెండవ పాదాన్ని ప్రధాన కథకుడు చెప్పగానే మళ్ళీ వంతలు ఆ... అంటూ మళ్ళీ రాగం తీస్తారు. అలాగే మూడం పాదం కూడా.

ఈవిధంగా పోడపోతుల వారి ప్రదర్శన సాగుతుంది. వీరు కథను ఎక్కువ భాగం వచనంలో చెబుతారు. ప్రధాన కథకుడు వచనాన్ని చెబుతున్నప్పుడు వంతలు ఆ.. అని గానీ, ఆహా.. అని గానీ, అవును అని గానీ వంత పలుకుతారు. గేయ రూపంలో కథను చెప్పేటప్పుడు ప్రతి పాదం తర్వాత వంతలు ఆ..... అంటూ ఎక్కువ సేపు రాగం తీస్తారు. ప్రధాన కథకుడు మధ్యలో అప్పుడప్పుడు హాస్య యుక్తంగా కథను చెబుతూ ప్రేక్షకులకు విసుగు కలగకుండా చేస్తాడు. ఈవిధంగా పొడపోతులవారి ప్రదర్శన సాగుతుంది.

పొడపోతులవారు రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటల ప్రాంతంలో కథను చెప్పడం ప్రారంభించి అర్థరాత్రి 11, 12 గంటలవరకు కథను చెబుతారు. వీరు ఒక్కొక్క ఊరిలో ఒక్కరోజు మాత్రమే కథ చెబుతారు. ప్రధాన కథకుని చేతిలో సన్నటి పొడవైన కర్ర ఒకటి ఉంటుంది. ఈ కర్రతో తెరపటం మీద బొమ్మలను చూపిస్తూ

కథను చెబుతాడు. ఎలాంటి వేషధారణ ఎలాంటి వాయిద్యాలు లేకపోయినప్పటికీ పొడపోతులవారు తాము చెప్పే కథను రసవంతంగా చెబుతూ రక్తి కట్టిస్తారు. అందు వల్లనే వీరు చెప్పేకథలు వినడానికి యాదవులే కాకుండా మిగిలిన కులాలవారు వస్తారు.

## తెరచీరల వారు- ప్రదర్శనా విధానం :

తెరచీరల వారి ప్రదర్శన పొడపోతుల వారి ప్రదర్శన లాగా ఉంటుంది. పొడపోతుల వారు కథను చెప్పేటప్పుడు ఒక పెద్ద తెరపటాన్ని ఉపయోగిస్తారు. వీరి తెరపటం దళసరిగా ఉంటుంది. తెరచీరల వారు గూడా కథను చెప్పేటప్పుడు ఒక తెరను ఉపయోగిస్తారు. దీన్ని వీరు తెరచీర అంటారు. ఇది పొడపోతుల వారి తెరపట మంత దళసరిగా ఉండదు. దానికంటె పలుచగా ఉంటుంది. దీని పొడవు వెడల్పు ఇంచుమించుగా పొడపోతుల వారి తెరపటమంత ఉంటాయి. ఇందులో బొమ్మలు పొడపోతుల వారి తెరపటంలో లాగా పెద్దగా ఉండవు. అంతే గాకుండా తెరచీర మీద బొమ్మలు పొడపోతుల వారి తెరపటం మీద ఉన్నట్లుగా త్రిమూర్తులు, వారి భార్యలు మొదలైన దేవతల బొమ్మలుండవు. తెరచీర మీద కాటమరాజు కథలకు సంబంధించిన బొమ్మలు మాత్రమే ఉంటాయి. తెరచీర మధ్యలో యాదవుల కులదైవమైన గంగాదేవి పన్నెండు చేతులతో పన్నెండు రకాల ఆయుధాలను ధరించి మెడలో రాక్షసుల తలలను దండగా కూర్చిన మాలను ధరించి శక్తిస్వరూపిణిగా ఉంటుంది. పొడపోతుల వారి తెరపటం మధ్యలో ఉన్న గంగమ్మ మెడలో రాక్షసుల తలలదండ ఉండదు. ఐతే ఈమె గూడా పండ్రెండు రెండు చేతులతో పండ్రెండు ఆయుధాలు ధరించి ఉంటుంది. తెరచీరలవారి తెరచీర మీద గంగాదేవి బొమ్మకు కుడిఎడమల వైపు కాటమరాజు కథల్లోని ప్రధాన సంఘటనలకు సంబంధించిన అనేక బొమ్మలుంటాయి. పెద్దిరాజు సింహాసనమెక్కడం, అన్నదమ్ములతో ఆవులను పంచుకొని సంతానం కోసం కళ్యాణ పట్టణానికి వెళ్ళడం, కాటమరాజు పాపనూకల జననం, పెద్దిరాజు వాలికేతువరాజుతో యుద్ధం చేసి చనిపోవడం, కాటమరాజు వాలికేతువరాజును చంపడం, పెద్దమ్మ పెద్ది రాజుతో సహగమనం చేయడం మొదలైన సంఘటనలకు సంబంధించిన బొమ్మలుంటాయి. తెరచీరల వారు ఈబొమ్మలను చూపిస్తూ కథను చెబుతారు.

తెరచీరల వారు తమ కళాప్రదర్శన సందర్భంలో పొడపోతుల వారి లాగానే ప్రత్యేకమైన వేషధారణ చేసుకోరు. మామూలుగా రోజూ వారు వేసుకునే దుస్తులనే కథాగాన సందర్భంలో గూడా ధరిస్తారు. అంతేగాదు వీరు పొడపోతులవారి లాగానే తమకళా ప్రదర్శన సందర్భంలో ఎలాంటి వాద్యాలను ఉపయోగించరు. తెరచీరలవారి





తెర చీరల కళాకారుడు కొల్లి రమణ కథను చెబుతున్న దృశ్యం (పెద బొడ్డేపల్లి గ్రామం, నర్సీపట్నం మండలం, విశాఖ జిల్లా)

ప్రదర్శన చాల సరళమైనది, సులభమైనది, సామాన్యమైనది. వీరి ప్రదర్శన ఆఖ్యానాత్మకమైనది.

వీరు కాటమరాజు కథలను పగలు రాత్రి అనే తేడా లేకుండా అన్ని వేళలా చెబుతారు. ముఖ్యంగా యాదవులు చెప్పమన్న సమయంలో చెబుతారు. వీరు కథను చెప్పేటప్పుడు ముగ్గురు వ్యక్తులు పాల్గొంటారు.ఒకరు ప్రధాన కథకుడు, మిగిలిన ఇద్దరు వంతలు. తెరచీరల వారు ఇద్దరు మాత్రమే వచ్చి ఉంటే ఒకరు ప్రధానకథకుడుగా మరొకరు వంతగా ఉంటారు. ఆవూర్లో ఉన్న యాదవుల్లో ఒక వ్యక్తిని రెండవ వంతగా తీసుకుంటారు. మొత్తానికి తెరచీరల వారు కథను చెప్పేటప్పుడు ఇద్దరు వంతలుండాలి. మొదట వీరు వరుసగా మూడు పొడవాటి కర్రలను నిలువుగా పాతి వాటికి తమ తెరచీరను కడతారు. రాత్రిపూట కథను చెబితే నిలువు కర్రలకు తెరచీర పైన రెండు ట్యూబ్ లైట్లను కడతారు. పగటిపూట లైట్లను కట్టరు. నిలువుకర్రలకు తెరచీరను కట్టిన తర్వాత తెరచీర మధ్యలో పన్నెండు చేతులతో పన్నెండు ఆయుధాలను ధరించి శక్తి స్వరూపిణిగా ఉన్న గంగమ్మకు మొదట పూలు పళ్ళు ఆకువక్క పసుపు కుంకుమ పెట్టి అగరుబత్తిలు వెలిగించి కొబ్బరికాయ కొట్టి కర్పూరం వెలిగించి హారతి ఇస్తారు. ప్రేక్షకుల్లో కొందరు వచ్చి గంగమ్మకు మొక్కి బొట్టు పెట్టుకొని హారతి తీసుకుంటారు.

సోమవారం కథను చెబితే గంగమ్మకు కోడిని బలి ఇస్తారు. ఇలా చేయకపోతే శక్తిస్వరూపిణి అయిన గంగమ్మ కోపగించి తమకు అపకారం కలిగిస్తుందని తెరచీరల వారు చెబుతారు.వీరు తెరచీరను చాల పవిత్రంగా భావిస్తారు. వీరు తెరచీరను విప్పి కథను చెప్పేటప్పుడు కాళ్ళకు చెప్పులు వేసుకోరు.

ఆతర్వాత తెరచీరల వారిలో ప్రధానకథకుడు గంగ ప్రార్థనతో కథను మొదలు పెడతాడు. గంగ ప్రార్థన ఇలా చేస్తారు.

"గంగోయ్ మేలుమేలు జగదమ్మ గంగతల్లి మేలీయే నాతల్లి గంగతల్లి
మేలిచ్చి యాదవులకు బలిమియ్యవమ్మా
బలిమిచ్చి యాదవులకు కలిమియ్యవమ్మా
తేనెపూస గుచ్చినట్టు తేటి మాకియ్యమ్మా – గంగోయ్
నీకొట్టేటి రవదూలి గంగతల్లి నీకడ రవదూలో నాతల్లి గంగతల్లి
మెరిసేటి మెరుపులమ్మ మెల్లన సూపులు తల్లి
కొట్టేటి రవదూలి నీకళ్ళ రవదూలి– గంగోయ్
నువు నాగుబాములు పట్టావు తల్లో గంగతల్లి
నువు నడికట్టు గాయించావు గంగోయ్
జెర్రిపోతుల బట్టినావు జెటల గాయించినావు

ఉల్లిపుట్రాలు పట్టినావు ఉరిగజ్జులు గాయిచినావు
పెసరపాములు పట్టినావు పయ్యాటలు గాయించినావు- గంగోయ్
మేలుమేలు జగదమ్మ గంగతల్లో గంగతల్లి మేలీయే నాతల్లి గంగోయ్
మేలిచ్చి యాదవులకు అమ్మ బలిమియ్యే నాతల్లి
ఆరుక్కూడు కుంబాలు ఆరు మెట్ల పొడుగు
సామకూడు కుంబాలు చట్రాల పొడుగు
వరికూడు కుంబాలు వరిమెట్లా పొడుగు
కొఱ్రకూడు కుంబాలు కోరిమెట్లా పొడుగు - గంగోయ్
నీవు కోరినట్లు పొడుగు గంగోయ్ గంగతల్లి
కుంబాల మీదే నాతల్లి జోతులు వెలిగించారు - గంగోయ్
నువు సల్లగా కాపాడు నాతల్లో గంగతల్లి
ఒక చెంప గొడితేని వస గారునమ్మా
ఒక చెంప గొడితేను పాలు గారును తల్లీ - గంగోయ్
పెద్దల పాలొచ్చావు తల్లీ పెద్దలను కొలవగాను
చిన్నల పాలొచ్చావు తల్లీ చిన్నలను కొలవగాను
నీకు తలిసేటి నాతల్లో గంగతల్లి నువు సల్లగా కాపాడు నాతల్లి గంగతల్లి "

ఈవిధంగా గంగ ప్రార్థన చేసిన తర్వాత కాటమరాజు కథను చెప్పడం ప్రారంభిస్తారు. కాటమరాజు కథలు ఆవుల వలురాజు కథతో ప్రరంభమవుతాయి. కొల్లి రమణగారు ఆవుల వలురాజు కథను గేయంలో ఇలా ప్రారంభించారు.

"పుట్టుక ఎలమంచిలి పూరము దనుకొండ
ఏలిక ఎలమంచిలి ఏక దనుముకొండ
ఏలే గొల్లరాజు ఆవుల వల్రాజు
ఆవుల వల్రాజు బార్య ఆవుల వలవాదేవి
అప్పుడు వారికైదావులుండేవి"

అని ప్రధానకథకుడు గేయరూపంలో ఐదు లేక ఆరు పాదాలు పాడతాడు. ఇతడు ఒక్కొక్క పాదాన్ని చివరి దాకా పాడి ఆ.... అంటూ రాగం తీయడం మొదలు పెట్టగానే పక్కనే ఉన్న ఇద్దరు వంతలు ఆ.... అంటూ కొంచెం సేపు రాగం తీసి ఆతర్వాత ప్రధానకథకుడు పాడిన గేయపాదాన్ని పునరావృత్తి చేస్తారు. వంతలు రాగం తీయడం ప్రారంభించగానే ప్రధానకథకుడు రాగం ఆపేస్తాడు. వంతలు గేయపాదాన్ని పునరావృత్తి చేసిన తర్వాత ప్రధానకథకుడు తర్వాత పాదాన్ని చివరి దాకా పాడి చివర



మళ్ళీ ఆ.... అంటూ రాగం తీయడంమొదలు పెట్టగానే వంతలు ఆ..... అంటూ రాగం తీసి మళ్ళీ ప్రధానకథకుడు పాడిన గేయపాదాన్ని పాడతారు. ఇలా ప్రధాన కథకుడు ఒక పాదం తర్వాత ఒక పాదం పాడుతూ ఐదు, ఆరు పాదాలు పాడిన తర్వాత కాసేపు వచనంలో కథను ఇలా చెబుతాడు.

"ఆవుల వలరాజు అవుతారమెత్తినప్పుడు ఐదావులుండేవి. ఐదావుల్ని గూడా దివానుగిరి పర్వతానికి తోలుకెళ్ళేవాడు ఆవుల వల్రాజు. అయిదావులు గూడా కవు దొడ్డి దగ్గర ఐదు కావుళ్ళ పాలిస్తూ ఉండేవి. ఆవుల వలవాదేవికి ఐదు కావుళ్ళ పాలు ఇచ్చేవాడు. అందులో పెదగంగమైలావు అనే ఒకావు శివన్నారాయుడికి పాలివ్వడం మరిగింది. అప్పుడు ఆవుల వలవాదేవి భర్తను అడుగుతుంది. ఎలాగడుగుతుంది."

ప్రధానకథకుడు వచనంలో పైవిధంగా కథను చెబుతుంటే వంతలు అ .. అని, ఆహా.. అని, భళీభళీ అని వంతపలుకుతూ ఉంటారు. ఇలా కొంచెం సేపు వచనంలో కథ చెప్పిన తర్వాత మళ్ళీ గేయరూపంలో ప్రధానకథకుడు కథను చెబుతాడు.

"ఓయ్ ఆవల వలరాజా
ఒరే నెయ్యంటి దనుముకొండ నాయినా
ఒరే నెల గలిపావురా దేవో
ఒరే బాగాసు దనుముకొండ దేవో
ఒరే బొగ్గులు రాజేశావురా దేవో
ఒరే మచ్చ లేని జాతికి మచ్చ దెచ్చినావు"

ఈగేయభాగాన్ని కూడా మొదటి దాని లాగానే ప్రధానకథకుడు పాడినదాన్ని వంతలు పునరావృత్తి చేస్తూ పాడుతారు.

ప్రధానకథకుడు కొంతసేపు ఇలా గేయరూపంలోను, వచనరూపంలోనూ కథను చెబుతాడు. ఆతర్వాత అతను కొంతసేపు పూర్తిగా వచనంలోనే కథను చెబుతాడు. వచనంలో కథను చెప్పేటప్పుడు వంతలు ప్రధానకథకుడు కథను చెబుతున్న పద్ధతిని బట్టి భళీభళీ, అని అయ్యోఅయ్యయ్యో అని రసానుగుణంగా వంత పలుకుతూ ఉంటారు. ఈవిధంగా తెరచీరల వారి ప్రదర్శన సాగుతుంది. వీరు రాత్రిపూట కథను చెబితే తొమ్మిది, పది గంటల ప్రాంతలో కథను చెప్పడం ప్రారంభించి తెల్లవారే వరకూ కథను చెబుతారు. పగటిపూట కథను చెబితే గంట లేక రెండు గంటల సేపు మాత్రమే కథను చెబుతారు. ఎందుకంటే పగటిపూట ప్రజలకు పనులుంటాయి. కాబట్టి ప్రేక్షకులు ఎక్కువసేపు వీరి ప్రదర్శన దగ్గర ఉండలేరు.

తెరచీరల వారు యాదవుల కోసమే కథను చెబుతున్నప్పటికీ వీరి చెప్పే కథ

ఆసక్తికరంగా ఉండడం వల్ల గ్రామంలో ఉన్న ఇతర కులాలవారు గూడా వీరి కథను వినడానికి వస్తారు. ఇలా వచ్చినవారిలో కొంతమంది వీరు కథను చెబుతున్నప్పుడు పది, ఇరవై, ముప్పై- ఇలా కొంత డబ్బు ఎవరికి తోచినంత వారు కానుకగా ఇస్తారు. ఈ డబ్బు యాదవులే గాకుండా మిగిలిన కులాలవారు గూడా ఇస్తారు. ఇలా డబ్బు ఇచ్చిన వారిని తెరచీరలవారు ఇలా ప్రశంసిస్తారు.

"ఈదిలో ఎత్తిన చేయి విర్తి బొందాల- సబలో ఎత్తిన చేయి సల్లగుండాల
తల్లికుమారులు దర్మరాజులవాల- కచేరిలో వారిమాట ఎచ్చుగుండాల"

అని పలికి డబ్బు ఇచ్చిన వారి పేరు, వారు ఇచ్చిన డబ్బు ఎంతో చెప్పి వారిని, వారి కుటుంబాన్ని గంగమ్మతల్లి చల్లగా చూడాలని, వారికి సాయంగా ఉండాలని దీవిస్తారు. కథ చెప్పడం పూర్తి అయిన తర్వాత తెరచీరలవారు తెరచీర మీద ఉన్న గంగ బొమ్మకు హారతి ఇచ్చి ప్రదర్శన ముగిస్తారు. ఈవిధంగా తెరచీరలవారి ప్రదర్శన సాగుతుంది.

## మందెచ్చులవారు - ప్రదర్శనా విధానం :

మందెచ్చులవారు తమకు వంశపారంపర్యంగా మిరాసీగా సంక్రమించిన గ్రామాల్లో ఉన్న యాదవులను యాచించడానికి వెళ్లినప్పుడు మూడు విధాలైన పనులు చేస్తారు. 1.కథలను గానం చేయడం 2.చనిపోయినవారి ఇంట్లో బొమ్మలను ప్రదర్శించడం 3.యాదవుల మంద హెచ్చు కావడానికి వారి మంద చుట్టు 'బలి' చల్లడం. ఈ మూడింటిని గురించి వివరంగా తెలుసుకుందాం.

### 1. కథలను గానం చేయడం :

మందెచ్చులవారు కాటమరాజు కథల్లో గంగురాజు కథ, వలురాజు కథ, ఆవుల మేపు, కరియావులరాజు కథ, పోలురాజు కథ, కాటమరాజు యుద్ధం, బత్తిరన్న కథ, బొల్లావు యుద్ధం, నెల్లూరు కథ మొదలైన కథలను ప్రధానంగా చెబుతారు. ఇవేగాకుండా ఇంకా అయిదు మల్లెపూల కథ, సారంగధర కథ, మండోదరి కథ, గోవర్ధనగిరి మారాజు కథ, భూనాంచారి కథ, మాంధాత కథ, కుర్నసేనమారాజు కథ మొదలైన ఇతర కథలను గూడ చెబుతారు. వీరు యాదవుల ఇళ్ల దగ్గర యాదవుల కోసమే యాదవులు చెప్పమన్న కథలనే చెబుతారు. కాబట్టి 'యాదవరాజుల కథలు'గా, 'యాదవ భారతం' గా పేరు పొందిన కాటమరాజు కథలనే సాధారణంగా చెబుతారు. యాదవులు ఎవరైనా కాటమరాజు కథను కాకుండా వేరే కథను చెప్పమంటే అప్పుడు ఇతర కథను చెబుతారు. మందెచ్చుల వారు యాదవుల కోసం యాదవుల ఇళ్ల దగ్గర కథ చెప్పినప్పటికీ, వీరు కథ చెప్పే విధానం చాల ఆసక్తికరంగా, గొప్పగా ఉంటుంది



కాబట్టి ఊర్లో ఉండే అన్ని కులాలవారు వీరి కథను వినడానికి వస్తారు. వీరు రాత్రి 9-10 గంటల ప్రాంతంలో కథను చెప్పడం ప్రారంభించి తెల్లవారుజాము 5 గంటల వరకు కథను చెబుతారు. సాధారణంగా ఒక కథను ఒకే రోజులో పూర్తి చేస్తారు. ఒక వేళ ఒక రాత్రి కథ పూర్తి కాకపోతే మరుసటి రోజు రాత్రి ఆ కథను పూర్తి చేస్తారు.

మందెచ్చులవారు ప్రేక్షకులు కూర్చోవడానికి వీలుగా విశాలమైన ప్రదేశాన్ని తమ కథాగానానికి రంగ స్థలంగా ఎంచుకుంటారు. కథ చెప్పడానికి వీరు 7 గురు నుంచి 9 మంది వరకు పాల్గొంటారు. అంతేగాకుండా వీరు కథాగానం సమయంలో అనేక రకాల బొమ్మలను చూపిస్తూ కథను చెబుతారు. ఈ బొమ్మలను వెదురుకర్రలతో చేసిన రెండు బుట్టల్లో ఉంచుతారు. ఈ రెండు బుట్టలు కొంచెం పెద్దగా ఉంటాయి. కథ చెప్పేటప్పుడు ఈ రెండు బుట్టలు వీరి పక్కనే ఉంటాయి. ఇవి గాకుండా వీరు కథను చెప్పేటప్పుడు కొన్ని వాద్యాలను ఉపయోగిస్తారు. అందువల్ల కథాగాన సమయంలో వీరు9 మంది కూర్చోవడానికి, వారి వాద్యాలు ఉంచడానికి, రెండు పెద్ద బుట్టలు ఉంచడానికి వీలుగా కొంచెం విశాలమైన స్థలాన్ని ఎంచుకుంటారు.

**కథాగాన సామగ్రి :** మందెచ్చులవారు కథ చెప్పేటప్పుడు డోలు, గజ్జలు, జగ్గు, రెండు జతల తాళాలు, నపీర, అనుసుల కర్ర అనే వాద్య పరికరాలను ఉపయోగిస్తారు. ఇవి గాకుండా వీరు కథను చెప్పేటప్పుడు మధ్యమధ్యలో కొన్ని బొమ్మలను బుట్టలో నుంచి బైటికి తీసి వాటిని ప్రేక్షకులకు చూపిస్తూ కథను చెబుతారు. వీరి దగ్గర 60 వరకు బొమ్మలుంటాయి. ఈ బొమ్మలు ఎక్కువ భాగం కాటమరాజు కథలకు సంబంధించినవిగా ఉంటాయి. కొన్ని ఇతర బొమ్మలు కూడా ఉంటాయి.

వీటిలో వాద్య పరికరాలను గురించి కొంత వివరించవలసి ఉంది.

**డోలు :** వీరు ఉపయోగించే వాద్యాల్లో డోలు ముఖ్యమైంది. దీన్ని వీరు 'రడవీర' అని గూడ అంటారు. ఇత్తడితో డోలు చేయించి గొర్రె లేక మేక చర్మాన్ని ఎండబెట్టి దాని మీద ఉన్న వెంట్రుకలను తీసివేసి డోలుకు రెండు వైపులా మూతల లాగా పెట్టి దాన్ని తాళ్లతో కట్టి గట్టిగా బిగిస్తారు. ఈ డోలు కొంచెం పెద్దదిగా ఉంటుంది. ఈ డోలును ఎడమ వైపు ఎడమ చేతితో వాయిస్తారు. కుడివైపు కుడిచేత చిన్న కర్రపట్టుకొని దానితో వాయిస్తారు.

**జగ్గు :** ఇది ఈశ్వరుని డమరుకం లాగా ఉంటుంది. ఇది చాలా చిన్నడోలు లాంటిది. కాకపోతే ఇది మధ్యభాగంలో చిన్నగాను రెండు చివరల పెద్దగాను ఉంటుంది. దీన్ని గూడ కంచుతో తయారు చేసి ఎండిన మేకతోలును రెండు వైపులా మూతలుగా బిగిస్తారు. జగ్గు మధ్యలో నుంచి రెండు వైపులా దారాలు కట్టి వీటి చివర ముడి వేస్తారు. ఈ జగ్గును మధ్యలో పట్టుకొని అటు ఇటు ఊపుతూ వాయిస్తే దారాలముడి

మూతగా అతికించిన మేక చర్మాన్ని తగిలి మంచి శబ్దం వస్తుంది. దీన్ని తయారు చేసినప్పుడు మొదటిసారి గంగాదేవి ముందు ఉపయోగిస్తారు. దీన్ని ఒగ్గు కథ చెప్పేవారు జగ్గు అని పిలుస్తారు.

**తాళాలు :** మందెచ్చులవారు ఒక జత చిన్న తాళాలను, మరొక జత పెద్ద తాళాలను ఉపయోగిస్తారు. వీటిని ఇత్తడితో చేస్తారు. వీటిని పట్టణం దుకాణాల్లో కొంటారు.

**గజ్జలు :** గజ్జలను ప్రధాన కథకులు ఇద్దరు తమ కాళ్లకు కట్టుకుంటారు. అందువల్ల రెండు జతల గజ్జలు వీరి వద్ద ఉంటాయి. వీటిని గూడ పట్టణంలోని దుకాణంలో కొనుక్కుంటారు.

**అనుసుల కర్ర :** అనుసు అంటె తొడుగు అని అర్థం. ఈ కర్ర మూడు అడుగుల పొడవు ఉంటుంది. బూతంకూస లేక జిట్టిరేగు చెట్టునుంచి ఈ కర్రను తెచ్చి వడ్రంగితో దాన్ని బాగా నునుపు చేయించి ఆ తర్వాత దానికి కంసాలితో రాగితో గానీ, ఇత్తడిలో గానీ మధ్యలో తొడుగులు వేయిస్తారు. కథ చెప్పేటప్పుడు ప్రధాన కథకుడు దీన్ని కుడిచేత పట్టుకుని రసానుగుణంగా, సమయానుగుణంగా దాన్ని తిప్పుతూ కథ చెబుతాడు.

**నపీర :** ఇది కొమ్ము లాంటిది. అయితే ఇది కొమ్ములాగా వంగి ఉండదు. రెండు అడుగుల పొడవుతో వంకర లేకుండా చక్కగా ఉంటుంది. దీన్ని నోటితో ఊదుతారు. నోటిలో పెట్టుకునే వైపు సన్నగా ఉండి పోనుపోను వెడల్పుగా ఉంటుంది. అంటే ఇది సన్నాయి లాగా ఉంటుంది. శబ్దం మాత్రం సన్నాయి లాగా ఉండదు. కొమ్ము శబ్దానికి దగ్గరగా ఉంటుంది. దీన్ని ఇత్తడితో చేస్తారు. మందెచ్చులవారు తమ ప్రదర్శన ప్రారంభానికి ముందు దీన్ని గట్టిగా ఊదుతారు. దీని శబ్దం విని ప్రజలు వీరి కథాగానం వినడానికి వస్తారు. కథ చెప్పేటప్పుడు మధ్య మధ్యలో గూడ దీన్ని ఊదుతారు.

మందెచ్చులవారు కథను చెప్పేటప్పుడు 7గురు నుంచి 9 మంది వరకు పాల్గొంటారు. ముందు భాగంలో ప్రధాన కథకులు ఇద్దరు ఉంటారు. వీరిలో ఒకరు స్త్రీ వేషాన్ని ధరిస్తారు. కొన్ని సందర్భాల్లో ఇద్దరూ పురుష వేషంలోనే ఉంటారు. వీరి వెనుక నలుగురు వ్యక్తులు డోలు, తాళాలు, నపీర, రెండు జగ్గులు, పట్టుకొని కూర్చొని వాయిస్తూ ఉంటారు. మిగిలిన వారు అవసరమైనప్పుడు బుట్టలో ఉన్న బొమ్మలను ప్రధాన కథకులకు అందిస్తూ సాయంగా ఉంటారు. వెనుక కూర్చున్న నలుగురు వ్యక్తుల్లో స్త్రీలు గూడా ఉంటారు. పురుష వేషంలో ఉన్న ప్రధాన కథకుడు కొంత ప్రత్యేకమైన వేషధారణ చేసుకుంటాడు. ఇతడు తెల్లధోవతి, తెల్లటి అంగీని ధరిస్తాడు. కుడిచేతితో ఇత్తడి కట్లు బిగించిన కట్ల కర్రను పట్టుకుంటాడు. కాళ్లకు గజ్జలుంటాయి. మెడలో రెండుమూడు వరుసలున్న వెండిగొలుసు వేసుకుంటాడు. తలకు పాగా





మందెచ్చుల వారి ప్రదర్శన (ఊరవర్వతాలు బృందం, హనుమకొండ)



కళా ప్రదర్శన సమయంలో మందెచ్చుల వారు ఉపయోగించే బొమ్మలు

రుమాలు చుట్టుకొని నడుముకు వోనిగుడ్డ కట్టుకుంటాడు. రెండవ ప్రధాన కథకుడు గూడా కాళ్లకు గజ్జలు కట్టుకుంటాడు.

యాదవుల కులదేవత అయిన గంగాదేవి ప్రార్థనతో వీరు కథను ప్రారంభిస్తారు. గంగాదేవి ప్రార్థన ఇలా సాగుతుంది.

"శరణు శరణు మా కన్నతల్లీ శాంబావరాణి శాంబవరాణి
శరణు జూడు మా కన్నతల్లీ దేవి మాయమ్మా గంగా మాయమ్మా
ముందుగా యాదవులకు ముచ్చర్తివమ్మా ముచ్చర్తివమ్మా
మందలో మేలుకున్న మాయాలగంగా మాయాలగంగా ॥శరణు॥
గుట్టు పుట్టాలు గట్టి పాలేట నిలిపి పాలేట నిలిపి
పాలేటి పూజలు గొన్న పరమ కళ్యాణి దేవి కళ్యాణి ॥శరణు॥
జోడు పుట్టంబు గట్టి దొనకొండ నిలిపి దొనకొండ నిలిపి
దొనకొండా యాదవులకు దొరసానివమ్మా దొరబిడ్డవమ్మా ॥శరణు॥
మూడు రంగుల సీరె ముత్యాల రైకె ముత్యాల రైకె
ముమ్మయ్య నిను గొలువ మురిశాడవమ్మా ఎరిశాడవమ్మా ॥శరణు॥
నాలుగు రంగుల సీరె నడిమంచు రైకె నడిమంచు రైకె
నల్లనయ్య నిను గొలువ నడిశాడవమ్మా మురిశాడవమ్మా ॥శరణు॥
అయిదు రంగుల సీరె అద్దాల రైకె అద్దాల రైకె
యాదవరాజు నిను గొలువ యానందమాడు శివనందమాడు ॥శరణు॥
తొమ్మిది రంగుల సీరె దోరంచు రైకె దోరంచు రైకె
దొనకొండా యాదవులకు దొరసానివమ్మా దొరబిడ్డవమ్మా ॥శరణు॥
గంగా నిన్ను గొలిసేటి గనులెవ్వరమా గనులెవ్వరమ్మా
గినమైనయట్టి వాడు గంగా సెలికాడు కాటమరాజు ॥శరణు॥
మేలు మేలాయెనమ్మా మేలాయెనమ్మా యేలాయెనమ్మా
మేలు గల ఎములవాడ పూలాయెనమ్మా పూలాబంతాయెనమ్మా ॥శరణు॥
నచ్చుత్రరచ్చమాల నడిమోరంగల్లు నడిమోరంగల్లు
కలిసి యుద్ధం చేసే కరియావులరాజు మా గొల్లరాజు ॥శరణు॥
సింగం బేతాల శిరసు తొలగించి శిరసు తొలగించి
సెరిసెర్ల కత్తి గడిగె రాజు కరియావుల కరియావుల రాజు ॥శరణు॥
పుట్టుబంతులు మాయి పుల్లెడ్లు మాయి పుల్లెడ్లు మాయి
పూలసిరులు దొనకొండ గంగ పుట్టినిల్లు దేవి పుట్టిల్లు ॥శరణు॥

కట్టుబంతులు మాయి కర్రెడ్లు మాయి కర్రెడ్లు మాయి

కాపుసిరుల దొనకొండ గంగ పుట్టిల్లు దేవి పుట్టిల్లు ॥శరణు॥

నీసుబోయని బిడ్డ నీలారిగంగా నీలారి గంగా

కవుసుబోయని బిడ్డ కాలారి గంగా కాలారిగంగా ॥శరణు॥

ప్రధాన కథకుడు పై పాటను పాడుతుంటె పక్కన ఉన్న ఇంకొక కథకుడు అతనికి సహాయంగా కోరస్‌గా పాడుతూ ఉంటాడు. వీరి వెనుక ఉన్న ఒకరు డోలు, ఒకరు తాళాలు, ఇంకొకరు రెండు జగ్గలు, వేరొకరు నపీర పట్టుకొని వాయిస్తూ "శరణు శరణు మాకన్నతల్లి శాంభావ రాణి" అని వంతపాడుతూ ఉంటారు. ఈ గేయం అయిపోయిన తర్వాత విఘ్నేశ్వరుని ప్రార్థిస్తూ కింది పాట పాడుతారు.

"హరహరమూర్తివయ్య గణనాదా ఓ లోకనాత

నువ్వు హరుని కుమారుడవు లోకనాత

శివ శివ మూర్తివయ్య గణనాదా ఓ లోకనాత

నువ్వు శివుని కొమారుడవు లోకనాత ॥హరి॥

తొండముతోడ నీళ్లు దెచ్చి తోరంపు బొజ్జను గడిగి

తల్లితోడ పూజలు గొన్న సామి గణనాయక

కోమట్లు నిన్ను గొలువ గణనాదా ఓ లోకనాత

నిన్ను గొప్పదేవుడందురయ్య లోకనాత ॥కోమట్లు॥

సాలోల్లు నిన్ను గొల్వ గణనాదా ఓ లోకనాత

నిన్ను సర్వేసుడందురయ్య లోకనాయక ॥సాలోల్లు॥

గొల్లోల్లు నిన్ను గొల్వ గణనాదా ఓ లోకనాత

నిన్ను సిరికిట్టుడందురయ్య లోక నాయక ॥గొల్లోల్లు॥

గౌండ్లోల్లు నిన్ను గొల్వ గణనాదా ఓ లోకనాత

నిన్ను కాటమయ్య అందురయ్య లోకనాయక ॥గౌండ్లోల్లు॥

కుర్మోల్లు నిన్ను గొలువ గణగాదా ఓ లోకనాత

నిను బీరప్ప అందురయ్య లోకనాయక ॥కుర్మోల్లు॥

బామ్మర్లు నిన్ను గొల్వ గణనాదా ఓ లోకనాత

నిన్ను బగవంతుడందురయ్య లోకనాయక ॥బామ్మర్లు॥

తర్వాత గాంధీ మహాత్ముని గురించి ఇలా పాడతారు.

"తాత నిన్ను దులుతునా గాంధీ మహాత్మ నిన్ను దలుతునా

పోరుబందరులో పుట్టితివయ్యా తాత



పుట్టంగ నీ పేరు మోహన్‌దాసందురయ్యా

పెరుగంగ నీ పేరు గాంధీయని తలుతురయ్యా

కత్తికొడవలి లేక తెస్తివయ్య రాజ్యంబు"

ఇలా గంగాదేవిని, గణనాయకుని, గాంధీని ప్రార్థించిన తర్వాత కాటమ రాజు కథల్లో ఏదో ఒక కథను చెప్పడం ప్రారంభిస్తారు. ఉదాహరణకు కరియావుల రాజు కథను ఇలా ప్రారంభిస్తారు.

"రామరామా రాజ్యామేలే దొనకొండ పట్టణమేలే

వలరాజు కొడుకులయ్యో వల్లమ్మా కొడుకులయ్యో

రామరాజే సింహాద్రి రాజు- రామరాజు పెద్దిరాజు

రామరాజే ఎరనూకరాజు- రామరాజే పోలు రాజు

ఐదుగురి తోడ గూడాను- ఆడబిడ్డా కొమరమ్మ

దొనకొండా పోతున్నాది- దొనకొండ పట్నమేలే యాదవులు ......... ఆహో......"

ఇలా మొదటి ప్రధాన కథకుడు కథను పాడతాడు. అతనితోపాటే రెండవ ప్రధాన కథకుడు పాడుతూ అతనికి సహాయం చేస్తూ ఉంటాడు. ఇలాగా ఎనిమిది పాదాలు గానీ లేక పది పాదాలు గానీ మొదటి ప్రధానకథకుడు పాడిన తర్వాత రెండవ ప్రధాన కథకుడు మొదటి ప్రధాన కథకుడు పాడిన విషయాన్ని వచనంలో ఇలా వివరించి చెబుతాడు.

"వలరాజు కొడుకులు వల్లమ్మదేవి కొడుకులు వారి ఐదుగురు అన్నదమ్ములు ......... ఆహో ............ పెద్దకొడుకు సింహాద్రి రాజు, నడిపి కొడుకు పెద్దిరాజు, మూడోకొడుకు ఎరనూకరాజు, నాల్గోకొడుకు నలనూకరాజు, ఐదో కొడుకు పోలురాజు..... ..... ఆహో ......... వీరితోటి ఆడుబిడ్డ కొమరమ్మ ........... దొనకొండ పట్నం పోతున్నది". ఇలా రెండవ ప్రధాన కథకుడు వచనంలో కథను వివరించి చెబుతూ ఉంటే వెనక ఉన్న వాళ్లు "ఆహో" అని వంత పలుకుతూ ఉంటారు.

మొదటి ప్రధాన కథకుడు కథను గానం చేసేటప్పుడు దానికి తగినట్లుగా అభినయాన్ని జోడిస్తూ ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తాడు. రెండవ ప్రధాన కథకుడు మిగిలిన బృందంతో కలిపి వంత కలుపుతూ కథాగానంలో మొదటి ప్రధాన కథకునికి అలుపు రాకుండా సాయం చేస్తూ ఉంటాడు. ఈ ఇద్దరు ఒకరి తర్వాత ఒకరు కథను రాగయుక్తంగా పాడుతూ వివరిస్తారు. పాట పాడేటప్పుడు పాటకు అనుగుణంగా లయాత్మకంగా చిన్న నృత్యం చేస్తారు. తాళానికి అనుగుణంగా ముందుకు, వెనక్కు పక్కలకు జరుగుతూ ఒకరి ఎదురుగా మరొకరు వస్తూ గుండ్రంగా తిరుగుతూ చిందులు వేస్తూ ప్రదర్శనను రక్తి కట్టిస్తూ ప్రేక్షకులకు కన్నుల పండువు చేస్తారు. ప్రధాన కథకుల కాళ్ల

గజ్జల సవ్వడికి తోడుగా వీరి వెనుక కూర్చున్నవారు వాయించే వాద్యాలైన డోలు, జగ్గు, చిరతలు, తాళాల సవ్వడి కలిసి మంచి సంగీతాన్ని లయను కల్పిస్తూ ప్రేక్షకులకు వీనుల విందు చేస్తారు.

కథను చెప్పేటప్పుడు మొదటి ప్రధాన కథకుని చేతిలో ఉన్న కట్లకర్ర బాగా ఉపయోగపడుతుంది. యాదవుల చేతిలోని కర్ర ఆవులను, మేకలను, గొర్రెలను మల్లెయ్యడానికి ఎలా ఉపయోగపడుతుందో ప్రధాన కథకుని చేతిలోని కట్లకర్ర గూడ కథను చెప్పడంలో ఎంతో ఉపయోగపడుతుంది. ప్రధాన కథకుడు ఏదైనా బొమ్మను చూపిస్తూ చెప్పేటప్పుడు ఈ కర్ర బొమ్మలను చూపించడానికి సూచిక లాగా ఉపయోగిస్తుంది. వీరరస ప్రధానంగా కథ సాగే సమయంలో కర్ర కత్తిగానూ, విల్లుగానూ, గొడ్డలిగాను మారిపోతూ ఉంటుంది. అవసరాన్ని బట్టి వంతల్లో ఉన్న ఒకరు ఇద్దరు పాత్రలుగా మారిపోయి ప్రేక్షకులకు తాము చూస్తున్నది నాటకమేమో అన్న భ్రాంతిని కలిగిస్తారు. ప్రధానకథకులు మధ్యమధ్యలో అవసరాన్నిబట్టి హాస్య సంభాషణ చేయడం, జానపద గేయాలు పాడడం చేస్తూ ఉంటారు.

వీరి పాటల్లో, మాటల్లో మంచి జాతీయాలు సామెతలు చోటుచేసుకొని ప్రేక్షకులకు ఆనందాన్ని కలిగిస్తాయి. మందెచ్చులవారి కళాప్రదర్శనలో వారి కథాగానం, వచనం, వారి మాటలతో ఊరంతా మారుమోగుతుంది. దీనికి తోడుగా వాద్యాలైన సపీరా, డోలు, జగ్గులు, తాళాలతో కూడిన లయబద్ధమైన సంగీతం ఊర్లో ఉన్న ప్రజలందరినీ తమ ముందుకు రప్పించేలాగా చేస్తుంది. అందువల్లనే మందెచ్చులవారి కళాప్రదర్శనకు ఊరు ఊరంతా కదిలివచ్చి వీరి కళా ప్రదర్శనను కళ్లారా చూసి, చెవులారా విని ఎంతగానో ఆనందిస్తారు.

**మందెచ్చులవారి బొమ్మల ప్రదర్శన :**

మందెచ్చులవారు కాటమరాజు కథలను చెప్పేటప్పుడు కొన్ని బొమ్మలు చూపించి వాటిని వర్ణిస్తూ కథ చెబుతారు. ఈ బొమ్మలు 60 వరకు ఉంటాయి. ఇవి ఎక్కువగా కాటమరాజు కథల్లో వచ్చే పాత్రల బొమ్మలు. ఇవి గాకుండా కొన్ని దేవతల బొమ్మలు, పశుపక్షుల బొమ్మలు ఉంటాయి. ఈ బొమ్మలను తెలంగాణా ప్రాంతంలోని 'నకాషి' అనే పేరుతో పిలువబడేవారు చేస్తారు. నకాషీవారు తెల్లని పునికి కర్రను బొమ్మలుగా చెక్కి దానికి చింతంబలి, రంపపుపొట్టు కలిపిన మిశ్రమాన్ని పూసి బొమ్మల రూపాన్ని పూర్తి చేస్తారు. ఆ తర్వాత ఈ బొమ్మలకు రంగులు వేస్తారు. రంగులు వేసిన తర్వాత ఈ బొమ్మలు చక్కని జీవకళతో ఉట్టిపడుతూ ఉంటాయి. మందెచ్చులవారు ఉపయోగించే 60 బొమ్మలను తయారుచేయడానికి నకాషీవారు



20వేల రూపాయలకు పైగా తీసుకుంటారు. నకాషీవారు వరంగల్ జిల్లా చేర్యాల, అన్నపురం, వరంగల్ ప్రాంతంలోనూ, నిర్మల్, సిరిసిల్ల, జనగాం, నిజామాబాద్ ప్రాంతాల్లోనూ ఉన్నారు. ఈ బొమ్మలను మందెచ్చులవారు చాలా జాగ్రత్తగా ఉపయోగిస్తారు. ప్రతి బొమ్మకు మంచిగుడ్డను కప్పి ఉంటారు.

ఈ బొమ్మలను వెదురు బొంగులను చీరి తీసిన పెద్ద ఈనెలతో అల్లిన రెండు పెద్దబుట్టల్లో ఉంచుతారు. ప్రతి బొమ్మను గుడ్డలో చుట్టి చాలా జాగ్రత్తగా బుట్టలో పెడతారు. బొమ్మలను బైటికి తీసేటప్పుడు గుడ్డతోపాటె బైటికి తీసి, గుడ్డను తీసి ప్రేక్షకులకు చూపించి, దాని గురించి వర్ణించిన తర్వాత వెంటనే గుడ్డలో చుట్టి పక్కన పెడతారు. కథను చెప్పేటప్పుడు ప్రేక్షకులకు చూపించే సమయంలో మాత్రమే మందెచ్చులవారు బొమ్మల మీద గుడ్డను తీసివేస్తారు. మిగిలిన అన్ని సమయాల్లోను బొమ్మలకు గుడ్డకప్పి ఉంటారు. గుడ్డ లేకుండా ఉంటే బొమ్మల మీద రంగు పోయి బొమ్మలు పాతపడిపోతాయనే ఉద్దేశ్యంతో మందెచ్చులవారు ఎల్లప్పుడూ బొమ్మలను గుడ్డలో చుట్టి ఉంచుతారు. చాల కాలం వాడడం వల్ల బొమ్మల మీద రంగులు వెలసిపోయినప్పుడు వాటిని మళ్లీ నకాషీవారి దగ్గరకు తీసుకొని పోయి కొత్తగా రంగులు వేయిస్తారు.

మందెచ్చులవారు ఉపయోగించే బొమ్మల పేర్లు ఇవి - గంగురాజు, వలురాజు, పెద్దిరాజు, సింహాద్రిరాజు, ఎరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, కాటమరాజు, ముమ్మయ్య, పోచయ్య, ఎర్రయ్య, పల్లికొండ, భక్తిరన్న, ఐతమరాజు, పుత్తమరాజు, పద్మరాఘవుడు, తిరుమందుల పాపయ్య, నాచకూళ్లనాయుడు, దామసాని మల్లయ్య, పుల్లావుల కేశవులు, కరియావుల రాజు, ఆలగొల్ల జగ్గన్న లేక మంద జగ్గన్న, విఘ్నేశ్వరుడు, శ్రీకృష్ణుడు, రుక్మిణి, రాధ, గంగాదేవి, ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, సరస్వతి, వల్లవదేవి, పెద్దమ్మ, ఆవుల సీత, నలలాక్షి, ఎలలాక్షి, సిరిదేవి, కరియావుల మల్లమ్మ, నల్లమేడ, కొమరమ్మ, అగుమంచి, పాపనూక, కుందమాదేవి, ఆలగొల్ల మల్లమ్మ, గొల్ల బయ్యమ్మ, పెద్దపులి, చిరుతగండు, కుక్కదుము, తోడేలు, రెండు కుక్కలు 1. మందకాసే మైలారుకుక్క 2. దొడ్డికాడి దోరగండు, బసవన్న, చల్లవారి పుల్లకోడె, ఒంటికొమ్ము బొల్లావు, మర్లవారి మంకిరి కోడె, ఎగోలం, చిలుక, జాంబవంతుడు, హంస, పావురం, కర్రతో చేసిన కత్తి, మట్టితో చేసిన పాత్ర.

మందెచ్చులవారు కథను చెప్పేటప్పుడు పై బొమ్మల్లో అవసరమనుకున్న వాటిని బుట్టలో నుంచి బైటికితీసి దాన్ని గురించి వర్ణించి మళ్లీ బుట్టలో పెడతారు.

మందెచ్చులవారు మూడు సంవత్సరాలకు ఒకసారి తమకు హక్కు ఉన్న

గ్రామాలకు వెళ్లి యాదవులను యాచిస్తూ ఉంటారు. అలా వెళ్లినపుడు యాదవుల ఇళ్లలో ఎవరైనా చనిపోయి ఉంటే ఆ చనిపోయిన వారి ఆత్మ శాంతికోసం మందెచ్చుల వారితో బొమ్మల ప్రదర్శన చేయిస్తారు. చనిపోయినవారు చనిపోయి ఎన్నాళ్లయినా కావచ్చు. అంటే నెల, సంవత్సరం, సంవత్సరం పైనా, ఇలా ఎంత కాలమైనా కావచ్చు. తమ ఊరికి మందెచ్చుల వారు వచ్చినప్పుడు వారితో బొమ్మల ప్రదర్శన చేయిస్తారు. దీన్ని ఒక ఆచారంగా భావించి యాదవులు బొమ్మల ప్రదర్శన చేయిస్తారు. ఇలా బొమ్మల ప్రదర్శన చేసినప్పుడు ప్రదర్శన చేయించిన యాదవుల ఆర్థిక స్థోమతను బట్టి వారి నుంచి "తాగం" గా వెయ్యి రూపాయలకు పైగా డబ్బు తీసుకుంటారు. బొమ్మల ప్రదర్శనను గురించి రంగు రాజపాపయ్య గారు తమ మందెచ్చులావారు- జీవన విధానం లఘు సిద్ధాంతవ్యాసంలో తెలియజేశారు.

బొమ్మల ప్రదర్శన రోజున వీరు స్నానం చేసి నిష్ఠగా ఉంటారు. ప్రదర్శనను మంచి రోజు ఉదయం ఏడు గంటల నుంచి ప్రారంభిస్తారు. చాపలు గొంగళ్ళు పరిచి, చనిపోయిన వ్యక్తి (స్త్రీ అయినా పురుషుడైనా) ఫోటోను బల్ల మీద గానీ, కుర్చీ మీద గానీ పెట్టి, దానికి దండ వేసి, ఫోటో ముందు బియ్యం పోసిన గ్లాసును పెట్టి, అందులో వెలిగించిన అగరువత్తులను ఉంచుతారు. ఫోటోకు ఎదురుగా కొంచెం దూరంలో మందెచ్చుల వారిలో ప్రధాన కథకులు ఇద్దరు పీటల మీద కూర్చుంటారు. వీరి వెనుక వంతలుగా వ్యవహరించే వారు తమ వాద్యాలతో కూర్చుంటారు. ప్రధాన కథకుల ఎదురుగా పూలు, కుంకుమ, పసుపు ఒక పళ్ళెంలో పెట్టి సాంబ్రాణి పొగ వేస్తారు. తర్వాత ఒక్కొక్క బొమ్మను బైటికి తీసి వాటిని గురించి వర్ణిస్తారు. వర్ణన పాట రూపంలో వచనంలో ఉంటుంది. మొదట గంగాదేవిని ప్రార్థిస్తారు. గంగాదేవి ప్రార్థన సమయంలో గంగాదేవి బొమ్మను బైటికి తీయరు. అన్ని బొమ్మల గురించి చెప్పిన తర్వాత చివర గంగాదేవి బొమ్మను తీస్తారు. బొమ్మల ప్రదర్శన ప్రారంభంలో గంగాదేవిని ఇలా ప్రార్థిస్తారు.

"శరణు శరణమ్మా రాణి శరణమ్మా రాణి
శరణమ్మా నాపాలి శాంబవారాణి గంగా బవానీ
ముందుగా మా యాదవులకు ముప్వర్తివమ్మా ముప్వర్తివమ్మా
మందలో మేలుకున్న మాయల గంగా మాచౌడలమ్మా
పట్టుగుడ్డాలు గట్టి పాలేరు నిలిపి పాలేరు నిలిపి
పాలేరు పూలుగొన్న పరమ కళ్యాణి దేవికళ్యాణి
జోడు పుట్టంబుగట్టి దొనకొండ నిలిపి దొనకొండ నిలిపి



దొనకుండా యాదవులకు దూరసానివమ్మా దొరబిడ్డవమ్మా"

ఈ ప్రార్థన ఇలా సాగిపోతుంది. గంగ ప్రార్థన అయిపోయిన తర్వాత ఒక ప్రధాన కథకుడు విఘ్నేశ్వరుని బొమ్మను బైటికి తీసి చేత పట్టుకొని గేయరూపంలో - " హర హర మూర్తివయ్య గణనాదా ఓ లోకనాత " అంటూ గణనాయకుని ప్రార్థన చేసి, ఆ బొమ్మను పక్కన పెడతాడు. తర్వాత తోడేలు, ఎగోలం, చిరుతగండు చిలుక మొదలైన యాదవుల మందలకు శత్రువులైన జంతువుల పక్షుల బొమ్మలను ఒక్కొక్కదాన్ని బైటికి తీసి వాటిని గురించి వర్ణిస్తారు. ఉదాహరణకు తోడేలును గురించి వచనంలో ఇలా చెబుతారు.

"అల్లుడు తోడేలు, ఆడుబిడ్డ గొర్రె వొడ్డుసాటు చేసుకొని ఒంపుల్లో వచ్చి గుంపులో ఉన్న గొర్రెను ఎత్తుకుపోతుందయ్యా మందకాడి తోడేలు".

కుక్కల గురించి ఇలా చెబుతారు. "కుర్రో కుర్రో ఎర్రవెల్లి కుర్రో కుర్రో కర్రవెల్లి మందకాడివి మైలారుకుక్కలు దొడ్డి కాసెడి దొరగండు ........ ఇవి రెండు కుక్కలు, తోడేలు వచ్చి తోడ్తనే గొర్రెపిల్లను ఎత్తుకపోతాయి. మందకాడి కుక్కలు ఉస్కో అంటే ఉరికి నోట్లో ఉన్న గొర్రెపిల్లను యిడిపించుకొస్తాయి మందకాడి కుక్కలు".

చిలుకను గురించి ఇలా చెబుతారు.

వంత : ఎర్ర ఎర్రగా ముక్కు ఉన్నది- పచ్చ పచ్చగా రెక్కలున్నవి
తోక జానెడున్నది-ఈపున ముల్లు ఉన్నది
ఏ రాజ్యాన, ఏ దేశాన ఇది ఉన్నది.

ప్రధాన కథకుడు: అయ్యా నీకు తెలవదా - అయ్యయ్యోపరందామా ......ఆ...ఆ....
గజ్జెల కొండల్ల రామరామ రాఘవ రామా-నెల్లూరు ఏలేటి రామ
రామ రాఘవ రాజాఏడుగురన్నదమ్ములు ఉన్నరేమో ఉన్నారేమో-
ఎర్రగొల్ల కులములో ఉన్నరేమో ఉన్నారేమో ఎలసిద్ధి రాజులు
ఉన్నరేమో ఉన్నారేమో- రాజులతోడ పుట్టినాది పుట్టినాదా చెల్లె
కుందమదేవి ఉన్నదేమోఉన్నాదేమో-కొడుకు కూతుళ్లు లేరు
రామరామ రామరామ బిడ్డ పాపలేరు రామరామ రాఘవ రాజా-
చిలుకను సాదుకున్నదే కుందమాదేవి

వచనం : ఆడితల్లి కుందమదేవి బిడ్డ పాపల్లేక చిలుకను సాదుకున్నది. రామచిలుక గొల్లవారి ఆవుల తొక్కాడి, తోలాడి కొల్లకొల్ల యావుల కోగి వచ్చింది. కాటమరాజు గొల్లదొర తాండవవీరుడు చిలుకను పట్టి బానం ఏస్తాడు. ఎన్నునబడ్డ బానం జానెడెల్లింది. మెడలు వంచుకొని చిలుక ఇడిసింది పానం. చిలుక చిన్నది, చిలుక చేసిన

కత అగోరమైన యుద్ధం. అయిదు రోజులు సెప్పినా ఒగనాటి కొడవదోయి"
అని చెప్పి చిలుక బొమ్మను పక్కనుపెట్టి ఇంకొక బొమ్మను తీసుకొని పాటపాడతారు.
కృష్ణుని బొమ్మను తీసుకొని ఇలా పాడుతారు.

"బాలపాయంనాడు గోపాల నీవు బండి గిర్రున తన్న లేదా ఓ రామా
చిన్నచిన్న బోయల గూడి గోపాల నీవు చిన్న లేగాల కాయలేదా ఓరామా
పెద్దపెద్దబోయల గూడి గోపాల నీవు పెద్ద లేగల కాయలేదా గోపాల
అత్త పూతికను చంపి గోపాల నీవు అయోధ్య ఏలలేదా గోపాల
మామ కంసుని చంపి గోపాల నీవు మదురపట్నం ఏలలేదా శీరామా
గోవర్దన గోలకొండ గోపాల నీవు గోటిపైన నిలుపలేదా ఓ రామా
గోకులాష్టమినాడు గోపాల నీవు గోటి పైన నిలుప లేదా ఓ రామా
పదహారు వేల గోపిక స్త్రీలు రేపల్లె పట్నములో ఓ దేవా
గోపిక స్త్రీల గొల్ల బామల దొరికించుకొని
పొన్న రుచ్చము మీద పెట్టి చదరంగములాడే వాడు కృష్ణదయ్య
పంచ పాండవుల తోడ కృష్ణావతారమెత్తిండు
కిష్ణుడు లేని బాగోతం ఇలలో లేదు జగమందు లేదు
బాగవతంలో శీకిష్ణుడే బారతంలో కిష్ణమూర్తి
యాదవకతల్లో కిష్ణుడే, కిష్ణుడు లేని బాగోతం ఎందునా లేదయ్య ఆ..."

పాపనూకను గురించి ఇలా చెబుతారు.

"ఎర్రగొల్ల పాపవ్వ తల్లి సిరిదేవి, పాపవ్వకు అడవిలో ఒంటి స్తంబంమేడ కట్టించి అడవిలో ఉంచుతుంది. పాపవ్వ పాడరాని పాటలు పాడుతుంది. చివరకు బత్తిరన్న ఈమెను కాపాడుతాడు".

"సువ్వి సువ్వన్న లాలి సువ్వన్న లాలి- సువ్వన్ని పాడరె రాజు సెల్లెల
లాలిలాలమ్మ లాలిలాలమ్మ లాలి లాలమ్మ - లాలి పాటలు వాడె రాజు సెల్లెల
ఉత్తర దచ్చినాది ఎరగడ్డపాడు ఎరగడ్డ పాడు- ఎలమంచి తుమ్మపురి తల్లి పుట్టిల్లు
పచ్చల్లు దంచిరమ్మ పాలల్ల మోత పాలల్ల మోత- ఆ యొక్కు దొనకొండ అమ్మగారిల్లు
మెత్తటి పాదాలు మెరుగు నీళ్లల్లో మెరుగు నీళ్లల్లో -నేనొక్క కమలగిరి మేనకోడల్ని
పచ్చెరువు కట్టమీద పెంజెర్ల మోత పెంజెర్ల మోత-పెద్దగా పల్లికొండ పెరుగు మరదల్ని
నల్ల సెరువు కట్ట మీద నాగిండ్ల మోత -నలుపు వన్నె నాయునికి నన్నడగ రారు
గంటల్లు గొట్టినాయి ఎర్రన్న ఎడ్లు ఎర్రన్న ఎడ్లు-ఎగురుకుంట వాయెనమ్మ ఏటి నీళ్లకు
ఎండికొండ నుండి ఎర్రన్న ఎల్లె ఎర్రన్న ఎల్లె-పైడికొండల నుంచి పాపవ్వ వచ్చె



పైడి యొక్క పక్కకచ్చె పక్క సంసారం-గజ్జల్లు గట్టినాయి గంగురాజు ఎడ్లు
గంగురాజు ఎడ్లు వచ్చె గంగ నీళ్లకు- మువ్వల్లు గట్టినాయి ముమ్మయ్య ఎడ్లు
మురుసుకుంట వచ్చెనమ్మ బాయి నీళ్లకు- పచ్చని వన్నె సీరె గట్టి బత్తిని బారియ
ఎన్నటికి రావె బత్తిన్ని వదినె - నులుక వన్నె సీరెగట్టి ముమ్మయ బారియ
ఎన్నటికి రావే ఏడుకతో నీవే- కారివన్నె సీరెగట్టి కరియావురాజు బారియ
ఎన్నటికి రావే ఏడుకతో నీవే- నచ్చత్ర కుంట్లవారి నడి వరంగల్లు
కలిసి యుద్దము జేసే కరియావుల రాజు- ఒంటి గుర్రామువాడు ఒయ్యారికాడు
ఒరంగంటి మాయన్న ఒక్కడే సాలు- సెరిసెర్ల కత్తి గడిగె కరియావుల రాజు
గంగలో తానమాడే ఆ గొల్ల రాజు-గంగలా తానమాడే ఆ గొల్ల లరాజు
తిరుపతి పాపాలు వాపె పెద్ద గొల్లరాజు- గండసెయి ఊపంగ దండు గదులంగ
గుండంల యూబిది గుబులు కోపంగ-గుండంల యూబిది గుబులు కోపంగ
కాట్లల్ల యూబిది కలిసి పోవంగ-పాండువల్ల యూబిది పవ్వలించంగో
పాడుగుళ్లె మాయన్న పండు కొన్నాడు"-

"సిరిదేవి కడుపు కాలిపోను, అయితమరాజుతోని ఒంటిమేడ కట్టిచ్చి కానరాని గట్లల్ల ఉంచింది. బ్రమతో బత్తిరన్న బొచ్చె కలుపుకొని ఓసెల్లెలా ఎవరి బాలవె నువ్వు అంటూ ఇంటికి తీసుకెళతాడు.

అయిదుగురితోడ పుట్టిన ఆడబిడ్డ కొమరమ్మ "వలపోత"ను గురించి ఇలా పాడుతారు.

"నా అన్నో ఓ అన్న పెద్దిరాజు ఓఓ - సెల్లె నిడిసి పోతవా నా అన్నా ఆఅ
బావ నిడిసి పోతవ నాఅన్నో ఓఓ - అన్నవయిన, తండ్రివయిన నువ్వే నాఅన్నా
నేనెవలింటికి పోవాలె నా అన్నో ఓఓ - కానుగ సెట్టు కింద నా అన్నా ఆఅ
కంచెందుకు నాటాలె నా అన్నా ఆఅ - నువ్వు ఏబాటకత్తవని నా అన్నా ఆఅ
నేను ఎదురు సూడాలె నా అన్నా ఆఅ - నేను కలువ వోయినా కొయ్య వోయినా
నేను ఏమని తెలపాలె నా అన్నా ఆఅ - జట్టి రేగుళ్లు నా అన్నా ఆఅ
నన్ను జిల్లేడు సెట్టును జేసి పోతవా నా అన్నా - వలవల ఆసెల్లె వలపొయ్యవట్టె"

పెద్దిరాజు అతని నలుగురు అన్నదమ్ములు ఆస్తులు పంచుకొని వేరు అయిపోతారు. అప్పుడు వారి ఆడుబిడ్డ కొమరమ్మ వలపోస్తుంటుంది. అన్నదమ్ములు కొమరమ్మకు ఒక 'సందుగ' (పెట్టె) ను ఇస్తారు. ఈ పెట్టెను ఎత్తుకొని కొమరమ్మ వెళ్లిపోతూ దుః ఖిస్తూ ఉంటుంది. ఆమె వలపోత గంగాదేవికి తెలిసి పెట్టెలో గంగాదేవిగా నిలుస్తుంది. అప్పుడు కొమరమ్మ పెట్టె దించి గంగను చూస్తుంది.

కొమరమ్మ వలపోతను పైవిధంగా చెప్పిన తర్వాత ప్రధాన కథకుడు గంగాదేవి బొమ్మను బైటకు తీసి చేత పట్టుకుంటాడు. గంగాదేవి బొమ్మను తీసేటప్పుడు యాదవ స్త్రీలు బియ్యంలో పసుపు కలిపి వండిన బోనంను పసుపు కుంకుమలతో అలంకరించి తీసుకుని వచ్చి ప్రధాన కథకుని ఎదురుగా పెడతారు. ఆ బోనం మీద ఒక గిన్నెను ఉంచి, అందులో నూనె పోసి పత్తితో చేసిన వత్తి వేసి దాన్ని వెలిగిస్తారు. ఒక మోదుగాకులో పసుపు కలిపిన బియ్యాన్ని అక్షింతలు ఉంచుతారు. కొబ్బరికాయ పెడతారు. ఎండు కొబ్బరిలో పెరుగుపోసి గంగ ముందు ఉంచుతారు. అక్కడ ఉన్న వారందరికి పసుపు బొట్టు పెడతారు. గంగాదేవి బొమ్మను రెండు చేతులతో పట్టుకొని ప్రధాన కథకుడు ఇలా పాట పాడుతూ పూనకం వచ్చి తూలుతూ ఉంటాడు.

"ఉప్పొంగి ఉప్పొంగి జిల్లెడు మాను- ఎవలసేను కొరిగినావె జిల్లెడు మాను
నీకున్న ఆవులమంద జిల్లెడు మాను- నాకు లేదు గాదె సెల్లె జిల్లెడు మాను"

ఇలా పాడి తన ముంజేతిని కొరుక్కుంటాడు. చేతి నుంచి రక్తం వస్తుంది. అప్పుడు అతను మామూలు స్థితికి వస్తాడు. గంగాదేవి బొమ్మ మీద అందరూ అక్షింతలు చల్లుతారు. ఆ ఇంటి వారిలో ఎవరైనా ఒకరు కొబ్బరికాయ కొడతారు. ప్రేక్షకులు గంగా దేవికి చనిపోయిన వారి పేర్లమీద ఒసుకులు (చదివింపులు) చదివిస్తారు. ఆ సమయంలో చనిపోయిన యాదవులను తలుసుకుంటూ ప్రధాన కథకుడు ఇలా పాడతాడు.

"లచ్చం రామాదిరామ అనంతరామాది రామ- ఏడి మీ అన్న రామా
ఏడ గనరాడు రామా- నా పేరు పొగిడించు రామా
నా మీద దయుంచు రామా- పాపకారి యముడు రామా
పాపుక పోయిండు రామా- దోసకారి యముడు రామా
దొబ్బక పోయిండు రామా- శివుడు సెట్టు వెట్టె రామా
యముడు కొంటయె రామా"

తర్వాత గంగాదేవి బొమ్మను యాదవుని ఇంట్లోకి తీసుకొనిపోయి వారు మాట్లాడు కున్న డబ్బును 'తాగం'గా తీసుకొని మందెచ్చులవారు ఇలా మంగళం పాడతారు.

"ఒడివాలు వొయ్య వట్టిరి గంగమ్మ గౌరమ్మ - నీకు ఒడికుడక వొళ్లో వెట్టిరి
అచ్చంతలెయ్య వట్టిరి మా గంగమ్మ గౌరమ్మ - నీకు ఒడికుడక వొళ్లో వెట్టిరి
మంగళామెత్తు శాంబవి మాశారదాంబ - గొల్లవారి సేనులాట
ఎలుమల ఎల్లావులాట - బాపనోరి బంతులాట
అచ్చంతలెయ్య వట్టిరి మా గంగమ్మ గౌరమ్మ - నీకు ఒడికుడకు ఒళ్లో వెట్టిరి"

ఆ రోజు వడ్లు, జొన్నలు చనిపోయిన వ్యక్తి దుస్తులతోపాటు గొర్రెను గానీ గొర్రెపిల్లను





గానీ 'తాగం'గా ఇంటివారిని అడిగి తీసుకుంటారు. ఇంటివారు గంగాదేవికి ఒక చీర రెండు నుంచి అయిదు వరకు రైక గుడ్డముక్కలు సమర్పించుకుంటారు. కొందరు యాదవులు గంగాదేవికి వారు మొక్కుకున్నట్లుగా బోలుకడియం, కాలుబేడి (వెండితో గానీ, రాగితోగానీ చేయించిన కుడికాలు కడియం) మెడలోకి వెండికంటె చేయించి గంగాదేవికి ధరింపజేస్తారు. మరి కొంతమంది యాదవులు ఎడ్ల బొమ్మలకు వెండితో కొమ్ములు చేయించి బొమ్మలకు ధరింప జేస్తారు. ఈ వెండి కొమ్ములను మందెచ్చుల వారు వారి అవసరాలకోసం అమ్ముకుంటారు. బొమ్మల ప్రదర్శన రోజున ప్రదర్శన చేయించిన వారి ఇంట్లో మందెచ్చుల వారు భోజనాలు చేస్తారు. ఆ రోజు రాత్రి మద్యమాంసాలతో భోజనాలు చేస్తారు.

ఆ రోజు ఆ ఇంటివద్దనే కథను చెబుతారు. బొమ్మల ప్రదర్శనలో బొమ్మలను గురించి చెప్పేటప్పుడు మందెచ్చులవారు డోలు, జగ్గు, నపీర, చిన్న తాళాలు, చిన్న గంటను వాద్యాలుగా ఉపయోగిస్తారు. ఈ విధంగా మందెచ్చుల వారు చనిపోయిన యాదవుల ఇళ్లలో యాదవుల కోరిక మేరకు బొమ్మల ప్రదర్శన చేస్తారు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. అయితే ఈ ఆచారాన్ని ఈనాడు చాల అరుదుగా పాటిస్తున్నారు.

**బలి చల్లడం :** మందహెచ్చులవారు వ్యావహారికంలో మందెచ్చులవారు అయింది. మందెచ్చులవారితో కథ చెప్పిస్తే యాదవుల గొర్రెల మేకలమంద హెచ్చుతుందని యాదవుల నమ్మకం. యాదవుల మందకు దిష్టి తగలకుండా, రోగాలు, రొష్టులు లేకుండా పీడలు, పిశాచాలు వారి మంద వద్దకు రాకుండా, వారి చేలకు చీడపీడ పట్టకుండా మందెచ్చుల వారు బలి చల్లుతారు. ఇలాంటివన్నీ చేసి యాదవుల మంద హెచ్చేలాగా చేస్తారు. కాబట్టే వీరికి మందెచ్చుల వారు అనే పేరు వచ్చింది. తమ మందకు 'బలి' చల్లమని యాదవులు కోరినప్పుడు వీరు 'బలి' చల్లే కార్యక్రమాన్ని చేస్తారు.

బలి చల్లే రోజున మందెచ్చులవారు యాదవుల మంద దగ్గరికి ఉదయం పూట వెళ్తారు. మంద ఒకరి మందకాదు. ఊర్లో ఉన్న యాదవుల మందలన్నింటినీ ఒక చోట చేర్చుతారు. అంటే ఊర్లో ఉన్న యాదవులందరూ కలిసి బలిచల్లే కార్య క్రమాన్ని ఏర్పాటు చేస్తారు. ఈ కార్యక్రమానికి ఊర్లో ఉన్న యాదవులందరూ వస్తారు. మందెచ్చులవారు మంద చుట్టు యాదవ కులదేవతల బొమ్మలను పెడతారు. తర్వాత మందెచ్చులవారిలో ఒక వ్యక్తి బట్టలన్నీ తీసివేసి మొలకు వేపకొమ్మలను కట్టుకొని గొర్రెను గావు పట్టి (గొర్రెమెడను నోటితో కొరకడాన్ని గావు పట్టడం అంటారు) దాని రక్తాన్ని ఒక గిన్నెలో పట్టి, ఆ రక్తంలో మొక్కజొన్నరవ్వ, పసుపు, నల్లవాయిలి, అడవి నిమ్మ, పన్నెండు నిమ్మకాయలు, పన్నెండు గుమ్మడికాయలు, ఒక చెట్టుది ఈతకల్లు,

ఒక చెట్టుది తాటికల్లు మొదలైనవన్నీ కలిపి యాదవుల మందమీద, వారి పొలాలు మీద బలిచల్లుతారు. ఇలా బలిచల్లినందుకు యాదవుల వద్దనుండి ఒక గొర్రెను, ఆరువందల రూపాయలను తాగంగా తీసుకుంటారు. బలి చల్లె రోజున వీరికి యాదవులే మద్యమాంసాలతో భోజనం పెడతారు.

ఈవిధంగా మందెచ్చులవారు యాదవులను యాచించడానికి వెళ్లినప్పుడు కథలను చెప్పడం, చనిపోయిన వారి ఇళ్లలో బొమ్మలను ప్రదర్శించడం, యాదవుల మందకు బలి చల్లడం అనే మూడు పనులను చేస్తారు.

## బైకానివారు - ప్రదర్శనా విధానం :

బైకానివారు తమ కళా ప్రదర్శనలో గుడారు, రెండు వీరణాలు, రెండు జతల చిట్టితాళాలు, కాళ్ళగజ్జలు ఉపయోగిస్తారు. వీటిలో గుడారును గురించి కొంత వివరించవలసి ఉంది. ఇది చాల పెద్దదైన గొడుగు లాగా ఉంటుంది. గుడారి స్థంభం పది మూరల పొడవుతో కింద లావుగా ఉండి పోనుపోను సన్నగా ఉంటుంది. పైన గుబ్బెచెక్క ఉంటుంది. దానిపైన గొడుగు లాగా గుడారి ఉంటుంది. దానిపైన పసిని కుండ ఇత్తడిది ఉంటుంది. ఇది గర్భగుడి పైన ఉన్న దాని లాగా ఉంటుంది. దానిపైన రెండు పొరల తెల్లగుడ్డ చాల వెడల్పుగా గొడుగు లాగా ఉంటుంది. కొందరు కింది పొరను నల్లగుడ్డతో చేస్తారు. ఈగుడారి ఇంచుమించుగా వంద గజాల చుట్టుకొలతతో ఉంటుంది. దీని కింది పొరకు గతంలో కాటమరాజు కథలో వచ్చే సంఘటనలకు సంబంధించిన బొమ్మలుండేవి. కాని ఈనాడు ఈబొమ్మలు ఉండడం లేదు. బైకాని వారు ఈగుడారి కింద నిలబడి కథను చెబుతారు. ప్రేక్షకులు గూడా గుడారి కిందనే కూర్చుంటారు.

వీరణం రెండు భాగాలుగా ఉంటుంది. ఒకటి పెద్దదిగా, ఇంకొకటి చిన్నదిగా ఉంటుంది. పెద్దదాన్ని కంచుకొయ్య అని, చిన్నదాన్ని జల్లి అని అంటారు. పెద్దదాన్ని ఇత్తడితో, చిన్నదాన్ని కంచుతో చేస్తారు. ఈరెండింటనీ ఒక వ్యక్తి మెడలో వేసుకుంటాడు. పెద్దదాన్ని మొదట వేసుకొని, దానిపైన చిన్నదాన్ని వేసుకుంటాడు. పెద్దదాన్ని ఎడమ చేతితో, చిన్నదాన్ని కుడిచేత పుల్లతో వాయిస్తాడు. గజ్జలను ప్రధాన కథకుడు కాళ్ళకు కట్టుకుంటాడు.

బైకానివారు తమ కళాప్రదర్శనలో మొత్తం ఎనిమిది మంది పాల్గొంటారు. ఒక్కొక్కసారి మనుషులు తక్కువగా ఉన్నప్పుడు ఆరుగురు పాల్గొంటారు. ఎనిమిది మంది పాల్గొన్నప్పుడు ఒకరు ప్రధానకథకుడుగానూ, ఒకరు అర్థగాడుగానూ, నలుగురు వ్యక్తులు రెండు వీరణాలను, రెండు జతల చిట్టి తాళాలను వాయించేవారుగానూ, ఇద్దరు వంతలుగానూ ఉంటారు. ఆరుగురు పాల్గొన్నప్పుడు ఒకరు వీరణాన్ని, ఒకరు



ఒక జత చిట్టితాళాలను వాయించేవారుగానూ ఉంటారు. మిగిలిన వారందరూ ఎనిమిది మంది పాల్గొన్నప్పుడు లాగానే ఉంటారు.

బైకాని వారు మొదట శారద ప్రార్థనతో కథను ప్రారంభిస్తారు. ఆప్రార్థన ఇలాగుంటుంది.

"శారదా....
శారద నిన్ను నేతలచెద శారదవై మది మాకు చాలా ఇమ్ము
వేగువవై రచ్చింపుము శారద మాపాల గల్గు శారదదేవీ
అంబ రావేమమ్మా మమ్మేలిన శారదాంబ రావేమమ్మా
అల్క ఏమమ్మా పిలచీన నాతో పల్కవేమమ్మా
అలుక ఏలనే చిలుకలకొలికి ములుకునవ్వుకళలొలుకుచు - అంబరావేమమ్మా
పంతమేమమ్మా నీకింత బలవంతమేమమ్మా
నూనమేమమ్మా నీకింత అనుమానమేమమ్మా
నూనమేలనే వారిజనేత్రి దూరమంచు వేసారకు తల్లి - అంబరావేమమ్మా
ప్రేమ గనవేమమ్మా పాములపాటి దామ వినవమ్మా
వేమరుపరుచు వెత్రయ్యకు నిజకామితార్థములు కరుణించిన కనకాంబ
అంబా రావే అంబా రావే తదిక తదిక ధింతా"

తర్వాత విఘ్నేశ్వరుని ఇలా ప్రార్థిస్తారు.

"గననాయుకా బ్రహ్మం గనన్నాయకా గరుడా మమ్మేలవయ్యా స్వామిన్నాయకా
మూషకా వాహనా గనన్నాయకా మూకుందా మాదేవ స్వామిన్నాయకా
విద్యలాకు ఆదివయ్యా గనన్నాయకా ముద్దులా కడియాల తండ్రి స్వామిన్నాయకా
ముందుగాను నిన్ను దలతు గనన్నాయకా మూకుందా మాదేవ స్వామిన్నాయకా
తొండమూతో నీరు దెచ్చి తోరంపు బొజ్జయు గడిగి హరిచేత పూజలు గొన్న స్వామిన్నాయకా
జింకపిల్ల ఎక్కినావు జీలిగంధం బూసినావు కళ్యాణం బోదమయ్యా గనన్నాయకా
బ్రాహ్మన్లు నిన్ను గొలువ గనన్నాయకా బ్రమ్మచారి అందురయ్యా స్వామిన్నాయకా
కోమట్లు నిన్ను గొలువ గనన్నాయకా కోటి లాభామందురయ్యా స్వామిన్నాయకా
గొల్లాలు నిన్ను గొలువ గనన్నాయకా గోపాలుడందురయ్యా స్వామిన్నాయకా
గావుండ్లు నిన్ను గొలువ గనన్నాయకా కంటమాముని అందురయ్యా స్వామిన్నాయకా
తురుకాలే నిన్ను గొలువ గనన్నాయకా అల్లహోదా అందురయ్యా స్వామినాయకా"

ఆతర్వాత యాదవుల కులదైవమైన గంగను ఇలా ప్రార్థిస్తారు.

"శరణు శరణు ఓగంగ నీకు శంభూరాణీ కరుణతో రచ్చింపూ శంభూరాణీ

ముందూ మాయాదవులా మూరితీవమ్మా కన్యారో దనుముకొండ గంగ నువు రావే
ఆకాశా బాణాలే చంద్రజోతూలూ వచ్చేనే ఎలమంచీ వనమూ పాలింప
సుట్టేడు కొండల్లు నడుమ దొనకొండ దొనుముకొండ వెలసీన దుర్గా భావానీ
సుట్టేడు వాగుల్లు నడుమ పాలేరు పాలేట పూజలు గొన్న పరమ కళ్యాణీ
నీరందూ నీవమ్మా నాయందూ నీవు నీరందీ నీపూజ నీలవైరాణీ
ఓంకారివే మాంకాలివే శరణమ్మా నీకు ఊదరీ ఓంకారివమ్మా శరనమ్మా నీకు
ఉండేటీ లంకల్లో నీవుంటీవమ్మా ముందొచ్చి కుంబిస్లు గూల్చీనా తల్లి
వేరువమ్మా నీకు మొక్కేద భాగావతీ గంగ ఇస్తనన్నా వరము దప్పాకు
పాలేటి ఒడ్డున నిలచేవు బాగవతీ గంగ భగ్గూ భగ్గున మండేవు
ఉసికే నిప్పూలు జేసేవు భాగవతి గంగ జలధీ మంటలు బెట్టేవు
ఏపేపై ప్రైమాకులెత్తేవు భాగవతి గంగా ఎద్దులావులా మల్ల విడచేవు
భక్తూడు పల్లికొండ గంగను గొలువంగ నిత్యాము సత్యాము ఇహపరులూ మెచ్చ
మూడు గొంగుల చీరె ముత్యాల రవికె ముమ్మయ్య గొలువంగ మురిశాడే గంగ
ఆరుకొంగుల చీరె ఆది వేరుపరచి ఐతన్న గొలువంగ ఆనందమాడే
ఏడు కొంగుల చీరె ఎర్రన్నీ రవికె ఎర్రయ్య గొలువంగ వేడూకలాయే
సిరిదేవి గొలువంగ శివమాడే గంగ కొమరక్క గొలువంగ కొంగొడ్డె గంగ "

తర్వాత శ్రీమహాలక్ష్మిని ఇలా ప్రార్థిస్తారు.

" శ్రీమహాదేవీ శృంగారా వాణి - మందులా పాలిటి మందారావెల్లీ
దివిజులా పాలిటి తల్లీ దివిజ గిర్వాణీ - అమ్మా వేరువమ్మా నిను దల్వ వేలాయే నేడు
అమ్మా లేవమ్మా ఆమరులా తల్లి - కొమ్మా ముగ్గురనీ గన్న కోమలీదేవీ
నచ్చత్రవీరమండలి నాదభయంకారీ - మేలుకోవే ఆదిలక్ష్మి మేలుకోవమ్మా
మేలుకొని మాకు ఒక్కా మేలివ్వావమ్మా - ఇప్పుడు గాకున్నా తల్లీ ప్రొద్దుమాపాటి
కర్పూర గందివై కలయందూ రమ్మీ - సభయందు నామాట సమకూర్చవమ్మ
ముత్యమూలు దాపినట్లు ముక్తి నాకిమ్మా - వజ్రమూలు దాపినట్లు వాక్కునా రమ్మీ
వాక్కున సిద్ధింప వరయునూ తల్లీ - కత చెప్ప నేర్చినాను కమలమోనీకా
మునులారా చప్పున కుదురుకోండయ్యా - తప్పులు ఎన్నైనా గాణి దైవంబూ సాచ్చి"

ఇలా ప్రార్థించిన తర్వాత యాదవకథలను రాసిన కనకబండి ఘట్టయ్య గురించి ఇలా గేయంలోనూ తర్వాత వచనంలోనూ చెబుతారు.

**గేయం:**

"వినిపించే యాదవా వృత్తాంతామెల్ల
అయ్యా వారుణి కనకబండి వంశవర్ధానూడూ
వారుణి కనకబండి వంశవర్ధనూడు
కొమనాల గోత్రూడూ గుణవిశాలుండూ
కొమరొప్పా యాదావాకులవంశాజుండూ
అంగనామణి చెన్నమాంబా పుత్రుండూ
కొండయ్యా నందనూడు కులపావనుండు
అండజగము గట్టయ్య అరిశావ గోరి
గట్టయ్య ఉపమున కత ఎట్టీదనిన "

**వచనం:** యాదవకులానికి చెందిన కనకబండి ఇంటిపేరున జన్మించినవాడు, కొమనాల గోత్రుడు, కొండయ్య చెన్నమాంబల కుమారుడైన ఘట్టయ్య చెప్పిన కథ ఎలాంటి దంటే" అని చెప్పి కాటమరాజు కథల్లో బాగా ప్రచారం పొంది, ప్రసిద్ధి పొందిన పోలురాజు కథను తండు భిక్షం గారు చెప్పడం ప్రారంభించారు. కాటమరాజు కథలను చెప్పే మిగిలిన కళాకారులకు ఈబైకానివారికి (తండు భిక్షం గారికి) ఒక తేడా ఉంది. మిగిలిన కళాకారులు కథ చెప్పేటప్పుడు తాము చెప్పే కథ రాసిన వారి పేరు చెప్పరు. ఆకథ తమదే అయినట్లుగా భావించుకొని వారు చెబుతూ ఉంటారు. కానీ తండు భిక్షం గారు తాను చెబుతున్న పోలురాజు కథను కొమనాల గోత్రుడైన కనకబండి ఘట్టయ్య అనే అతను రాశాడని చెప్పి కథను చెప్పడం ప్రారంభించారు. మొదట ప్రధాన కథకుడు కథను మొదలు పెడితే మధ్యలో వంతలు కలగజేసుకొని మాట్లాడడం, అర్థగాడుగా ఉన్న వ్యక్తి వచనంలో ప్రధానకథకుడు చెప్పిదాన్ని వివరించడం జరుగు తుంది. శ్రీరంగపట్టణాన్ని పాలించే చోడానిరాజు పోలురాజు గొప్పతనాన్ని తెలుసు కొని, ఆతని జన్మవృత్తాంతాన్ని తెలుసుకోవాలనుకుంటాడు. ఈవిషయాన్ని ప్రధాన కథకుడు, అర్థగాడు, వంతలు ఇలా చెబుతారు.

**ప్రధానకథకుడు :**

"ఇంతభాగ్యంబు ఇంతా సంపదా ఇంత బలిమి వీనికి ఏదేవుడూ ఇచ్చె
ఏదేవుణ్ణి పూజించె యాదవారాజు వాని పూర్వాజన్మము వాని కత ఏమి "

**అర్థగాడు** : చూడు బాబు నీవు జెప్పే కథ అమవాస్య చీకటి ఉలికెగూడు ఉసిరికాయ పీసు ఈనాలుగు కలిపేతట్లుండాలె.

**వంతలు** : ఎట్లా చెప్పాలనయ్యా, ఏవిదంగా

**ప్రధానకథకుడు** : యాదవపురాణమంటె కలగూరగంప ఆర్థము లేని కథ మరి వ్యర్థమన్నదు.

**వంతలు:** అర్థం చెప్పాల్నయ్యా ఎట్లెట్లా సబకు మనము

ప్రధానకథకుడు :చోడానిరాజెవ్వరు? ఈపోలురాజెవరు? ఆయనవీలాంటికత ఎందుకొచ్చాది?

**అర్థగాడు :** చోడానిరాజంటే శ్రీరంగపట్నవాసాన్ని ఏలే మహావీరుడు క్షత్రియరాజు, చోడానిరాజు రెండు ఏర్లకడ్డం గట్టిచ్చాడు ఒక చెరువును, దానికి ఏం నామమంటే ఏం పేరంటే కావేరిచెరువని చెప్పారు. కావేరి చెర్వు రెండు ఏర్లకు అడ్డం కట్టించాడు కట్ట. దానికి ముందు జల్మానా బ్రాహ్మణులు పెట్టిన శాపంబు సేత ఏడు గండ్లుగా పడిపోయాయి ఆకావేరి చెర్వు. చోడానిరాజంటే యాబై దేశాల రాజులే కానీ చప్పన్నదేశాల చక్రవర్తులే కానీ శాట బట్టి సెరిగినప్పటికైనా జల్లెడ బట్టి తిప్పినప్పటికైనా ఆయనను మించిన ఘనుడు ఏరాజ్యాన లేడంట. అందుగురించే తన బలిమిచేత ధనానికి, మంత్రశాస్త్రానికి అన్నిటికి ఘనుడాయన. చోడానిరాజు, తనఉపదేశంబు చేత ఆకాశాన బోయే పక్షుల్ని నేల బారేటి నాలుగ్గాళ్ళ జీవజంతువుల రమ్మంటే వచ్చి వెట్టి చేసిపోతాయి కావేరి చెర్వుకు, మళ్ళీ సాయంత్రం వరకు గండ్లు ముగుస్తా ఉన్నయ్. తెల్లవారె వరకు ఎప్పుడు జూసినా గండ్లు పడిపోతున్నయ్. పోయించిపోయించి చోడానిరాజు వేసారాడు. అప్పుడేమన్నాడు ఒహో బుద్ధిమంతుడా సుమంతుడా నీఎరిక ఎవరన్నా ఘనద్రవ్యానికే కానీ భక్తిపరులున్నారా? భక్తిపరుల్ని గనుక తీసుకొచ్చినట్టైతే కావేరి చెర్వు గండి ముగుస్తాదని ఆయొక్క చోడానిరాజు ఆలోసించాడు. ఆలోసించి బుద్ధిమంతుడు సుమంతుడనే మంత్రిని ప్రధానుల్ను అడిగే వరకు మంత్రి సలహా ఎం జెప్పారు?

పైవచనాన్ని అర్థగాడు చెబుతూవుంటే వంతలు అ.. అని అహా.. అని ఓహో.. అని వంత పలుకుతూ ఉంటారు. అర్థగాడు వచనం చెప్పడం పూర్తి అయిన వెంటనే ప్రధానకథకుడు గేయరూపంలో మళ్ళీ కథను మొదలు పెడతాడు.

**ప్రధానకథకుడు :**

> "వలురాజు కుమారుండు వంశవర్ధానుండు
> అందరికన్న చిన్నవాడు అసహాయశూరుడు
> తన ముద్దుకుమారుడయ్యో గర్వబూషితుడు"

ప్రధానకథకుడు పైన చెప్పిన గేయంలోని మొదటి పాదాన్ని చివరదాకా చెప్పిన వెంటనే వంతలు పాదంలోని చివరి మాట అయిన వంశవర్ధానుండూ అనే దాన్ని వంతగా పునరావృతి చేస్తూ చివర చిన్నరాగం తీస్తారు. తర్వాత ప్రధానకథకుడు రెండవ పాదాన్ని పూర్తిగా చెప్పిన వెంటనే వంతలు అందులోని చివర మాట అయిన అసహాయశూరుడూ అని వంత పాడుతూ రాగం తీస్తారు. అదే విధంగా మూడవ పాదాన్ని పాడుతారు. అప్పుడు అర్థగాడుగా ఉన్న వ్యక్తి వచనంలో ఇలా చెబుతాడు.

**అర్థగాడు :** వలురాజు వంశం, వలురాజు చిన్నకుమారుడు, మహాభక్తి పరుడు,



పోలురాజు, మహాభక్తిగలవాడు, మహాత్మా, అశంకంకోటి గోవులు, అలక్షకోటి గోపాలురు, డెబ్భైయ్యేడు కోట్ల గుడార్లు, తండోపతండంగా ఉన్నవాడు, ఆయొక్క పోలురాజు గనుక వాళ్ళను తీసుకవచ్చి, కావేరి చెర్వుకు మట్టి పోయిస్తే, గండి ముగుసుద్దని బుద్ధిమంతుడు సుమంతుడు చోడానిరాజుతోని చెప్పారు. అప్పుడా చోడానిరాజు కొన్ని వేల సైన్యాన్ని బుద్ధిమంతునికి సుమంతునికిచ్చి ఎక్కడికి పంపించాడు? చిలకలమర్రితాండాన పోల్రాజు ఉన్నాడు, పోల్రాజును పట్కరమ్మని పంపించాడు. చోడానిరాజు సైన్యం వెళ్ళాది, పోల్రాజు సుట్టు మందసుట్టు జేస్కోని ఉన్నాడు. ఓమహాత్మా !

ఇక్కడ గూడా అర్థగాడు వచనాన్ని చెబుతూ వుంటే వంతలు అ.. అని, అహా..అని, ఓహో అని వంత పలుకుతూ ఉంటారు. వచనం అయిపోయిన తర్వాత ప్రధానకథకుడు పాటరూపంలో కథను చెబుతాడు.

**ప్రధానకథకుడు:**

> "యాదవరాజేంద్రా యదుకులాసాంద్రా
> వహిదా వైరులా చేత్ర వలురాజూపుత్రా
> ఆర్థిజనమిత్రా ఆర్తిజనాశూద్రా
> వినువిను పోలురాజా విడువుము శాతేజా
> యాదవరాజేంద్రా యదుకులాసాంద్రా
> కావేటి చెర్వు వెట్టికి గ్రక్కునా నిన్ను
> చోడానిరాజు తెమ్మానే సోజ్జవేజ్జామూనా"

**అర్థగాడు :** ఓమహాత్మా, యాదవరాజా, మేము భట్రాజులమండీ, చోడానిరాజు కింద ఉండేటువంటి ఆయన బుద్ధిమంతుడు నేను సుమంతుణ్ణి ప్రధాని, మంత్రి మేమిద్దరమూ, సైన్యాన్ని పంపించాడు, కావేరి చెరువు గండి పూడబొయ్యాలంట, తమర్ని తీసుకరమ్మన్నడు మహాత్మా.

**ప్రధానకథకుడు :**

> "ఆమాటకు పోలురాజు అల్లునా నవ్వి
> యాదవులే మునులు మునులె దేవతూలూ
> యయాతి వంశంబు వెలిసినంతట
> యదు వృష్టి భోజాంతకూలు
> ఒకరి వెట్టికి మేము పోయేటి వారమే కాము
> అశంకంకోటి గోవులయ్యో ఆతాండవమున"

**అర్ధగాడు:** చోడానిరాజుకు జడవక మేము ఎవరమనుకొని పంపించాడో వెట్టికొచ్చే వారము కాము మునులే దేవతలు దేవతలే యాదవులు, యాదవులు వెట్టికిరారు.

ఈవిధంగా బైకాని వారి ప్రదర్శన మొదట ప్రధానకథకుడుగా వ్యవహరించే వ్యక్తి కథను గేయ రూపంలో చెప్పిన తర్వాత అర్ధగాడుగా వ్యవహరించే వ్యక్తి ఆకథాభాగాన్ని వచనంలో చెప్పడం, అది పూర్తి అయిన తర్వాత మళ్ళీ ప్రధానకథకుడు కథను గేయరూపంలో చెప్పడం, వంతలుగా వ్యవహరించేవారు ఇద్దరికీ వంత పలకడం జరుగుతుంది. ప్రధానకథకుడు కథను చెప్పేటప్పుడు గజ్జలు కట్టుకున్న పాదాలతో కథానుగుణంగా చిన్న నృత్యం చేస్తూ ప్రదర్శనను రక్తి కట్టిస్తాడు. రెండు జతల తాళాలను, రెండు జతల వీరణాలను ధరించిన నలుగురు వ్యక్తులు తమ వాద్యాలను శ్రుతిబద్ధంగా వాయిస్తూ చక్కటి సంగీతాన్ని సమకూర్చుతారు. మధ్యమధ్యలో వంతలు ప్రధానకథకునితో చక్కటి హాస్యప్రసంగాలు సేస్తూ ఉంటారు. ప్రధానకథకుని గజ్జల సవ్వడితో కూడిన నృత్యం, వీరణాల, తాళాల సవ్వడి, వంతల మాటలతో హాస్య ప్రసంగాలతో బైకానివారి ప్రదర్శన కనువిందుగా, వీనులవిందుగా ఉండి ప్రేక్షకులను ఎంతగానో అలరిస్తుంది. మొదటి నుంచి అంటే కథ ప్రారంభించినప్పటి నుంచి చివరి వరకు ఒకరే ప్రధానకథకుడుగా ఉండాలనే నియమం ఏదీ వీరికి లేదు. అందువల్ల ప్రధానకథకుడు కథను చెప్పి అలసిపోయినప్పుడు వంతల్లో ఒక వ్యక్తి గానీ, వాద్యాలను వాయించేవారిలో ఒకరుగానీ కొంచెం సేపు ప్రధానకథకుడిగా వ్యవహరించి కథను చెబుతాడు. కొంచెం సేపు అలసట తీర్చుకున్న తర్వాత మళ్ళీ ప్రధానకథకుడు తన పాత్రను పోషిస్తాడు. ఈవిధంగా బైకాని వారి ప్రదర్శన సాగుతుంది. పూర్తి అయిన తర్వాత మంగళంతో ప్రదర్శనను ముగిస్తారు. మంగళం పాట ఇలాగుంటుంది.

"హారతులె గొను శ్రీనందబాలా హారతులే గొను
ఓగోపాల గుణశీల గోపీకలోల హారతులే గొను
కరిమొర విని బ్రోసిన కరుణాకర ఓధరణీధర ఓదామోదరా - హారతిదే గొనుమా
మదుసూదన మాదవా కిష్ణ హరే నందాబాలా
ముకుందా హరే గోవిందా హరే గోపాలా హరే
మంగళం శంభురాణీ మముగన్న తల్లీ గంగదరా నీలావేణీ
దండామక్షంతాలమ్మా రంగైనా మందహారాలు కొమ్మా
స్త్రీలు పురుషులు గూడి శృంగారమైన ఆటలు పాటలు పాడి
చెంత లేక కంకణాలు పొంతముతో బట్టుకోని
ఆస్తములా బట్టుకోని అక్షంతా లేసుదుము - మంగళము శంభురాణీ
దండీదేవతావమ్మా ఈమండలమందు నిన్నే కొలుతుము కొమ్మా



వాసుడైన తుమ్మలగూడెం దాసుడైన విశ్వనాదం
దాసుని దరిజేర్చుకోవమ్మా ముల్లోకమాత దోసిలొడిగి ఇదిగో కొమ్మా
మంగళం పుండరీకాక్షం మంగళం శాశ్వతం"

ఈవిధంగా బైకాని వారి ప్రదర్శన సాగుతుంది.

## పాదసూచికలు

1. గౌరవ నాగన్నవారు చెప్పినది. వీరి వయసు 65 సంవత్సరాలు. వీరి స్వగ్రామం ఉరవకొండ, అనంతపురం జిల్లా.
2. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు చెప్పినది.
3. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు చెప్పినది.
4. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, డా॥ బి. రామాచార్యులు, పుట 160.
5. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు పాడిన గేయం.
6. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు పాడిన గేయం.
7. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, పుటలు 145, 146.
8. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు పాడినది.
9. జానపద నృత్య కళ గౌరవ సంప్రదాయం - డా॥ బి. రామాచార్యులు, పుట 164.
10. జానపద నృత్య కళ గౌరవ సంప్రదాయం - డా॥ బి. రామాచార్యులు, పుట 165.
11. జానపద నృత్య కళ - డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డి, పుటలు 125, 126.
12. అనంతపురం జిల్లా, పాతూరు గ్రామ నివాసి గౌరవ రామాంజనేయులుగారు పాడిన గేయం.
13. ఉరవకొండ నివాసి గౌరవ నాగన్నగారు పాడినది.
14. ఉభయగోదావరి జిల్లా జానపద కళలు - తరపట్ల సత్యనారాయణ, పుట 261.
15 తెలుగువారి జానపద కళారూపాలు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, పుట 452.
16. కాటమరాజు కథలు - మొదటి సంపుటం, పుట బీబీరిఖీరి
17. నెల్లూరు జిల్లా గంగజాతరలో - కళారూపాలు - ఒక పరిశీలన, పుటలు 68,69.
18. మరుపల్లి నివాసి కర్నకోట సూర్యారావుగారు చెప్పినది.

# యాదవుల జానపద కళలు - సాహిత్యాంశాలు

నేను పరిశోధనకు విషయంగా తీసుకున్న పదకొండు జానపద కళల్లో గొరవయ్యులు తప్ప మిగిలిన పది కథాఖ్యానం ప్రధానంగా ఉన్న జానపద కళలు. సేవగరిడి కళాకారులు దశావతార కథలను గానం చేస్తారు. గంగిరెద్దులవారు అనేక జానపద గేయాలను, గొల్లలవీరమ్మపాట, ఈశ్వరమ్మ పాట, గంగరాజు పాట మొదలైన అనేక కథాగేయాలను పాడతారు. ఒగ్గుకథకులు మల్లన్నకథ, బీరప్పకథ మొదలైన అనేక కథాగేయాలను పాడతారు. తప్పెటగుళ్ళ కళాకారులు రామాయణానికి సంబంధించిన లక్ష్మణమూర్ఛ, కృష్ణావతారంలోని కంసవధ, గొల్లభామలతో గోటకాలాడడం మొదలైన ముఖ్యమైన ఘట్టాలను, ఇంకా అనేక కథాగేయాలను, జానపదగేయాలను పాడతారు. గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, తెరచీరల వారు, మందెచ్చులవారు, బైకానివారు కాటమరాజు కథల్లోని అనేక కథాగేయాలను పాడతారు. ఈపది యాదవ జానపదకళలన్నీ గొప్ప సాహిత్యాంశాలతో విరాజిల్లుతున్నాయి. ఇంత గొప్ప సాహిత్యమున్న జానపదకళలు అంధ్రదేశంలో ఒక్క యాదవకులానికి మాత్రమే ఉన్నాయి. ఇంక మరేకులానికి లేవు.

కాటమరాజు కథలు కాకుండా మిగిలిన సాహిత్యమంతా మౌఖిక ప్రసారం లోనే ఉంది. సేవగరిడి కళాకారులు పాడే దశావతార కథలను నేను వెయ్యి పుటల వరకు సేకరించాను. ఈకథలను పాడే దాసులు చదువు లేనివారు, రెక్కాడితే తప్ప డొక్కాడని కష్టజీవులు, వంటినిండా బట్టలు వేసుకోవడానికి కూడా స్థోమత లేని బీదవారు. ఐనప్పటికీ వీరు దశావతారకథలను గొంతెత్తి అలవోకగా, ఎలాంటి తడబాటు లేకుండా ధారాళంగా పాడుతూ ఉంట ఆశ్చర్యం వేస్తుంది. వీరి ధారణాశక్తి అద్భుతమైనది. ఇన్ని కథాగేయాలను గుర్తుంచుకొని పాడడం అపూర్వం. తాము గొప్ప కళాకారులమని గానీ, తమ సాహిత్యం అపురూపమైనదని గానీ తెలియని అమాయకులు వీరు. వీరికి వచ్చినన్ని కథాగేయాలు నాగరికుల్లో ఎవరికైన వస్తే వారిని పట్ట పగ్గాలుండవు. గర్వంతో విర్రవీగిపోతారు. లోకం తనను గుర్తించలేదని, సభలు సమావేశాలు పెట్టి తన గొప్పతనాన్ని చాటిచెప్పలేదని, తనకు బిరుదులు, సత్కారాలు జరిపించలేదని లోకాన్ని ప్రజలను ఆడిపోసుకుంటారు. సేవగరిడి కళాకారులు మాత్రం తమకు ఏమీ తెలియనట్లుగా, తమకు తెలిసిన, తాము పాడుకునే సాహిత్యం చాల మామూలుదిగా భావించి చాల నిరాడంబరంగా జీవిస్తూ ఉంటారు.

అలాగే గంగిరెద్దులవారు గూడా గొప్ప ప్రతిభావంతులు. వీరు అనేక



గేయాలను, కథాగేయాలను అశువుగా కల్పించి చెప్పగల గొప్ప ప్రతిభావంతులు. వీరికి నాగరికుల మాదిరిగా చదువు సంధ్యలుంటే వీరు మహాకవులుగా చెలామణి కాగల గొప్ప సాహిత్యాన్ని సృష్టించగలరు. చదువు లేకపోవడం చేత, పొట్టకూటికి గడవక పోవడం చేత, పొద్దున లేవగానే గంగిరెద్దును పట్టుకొని భిక్షాటనకు వెళ్తేతప్ప పూట గడవని గర్భదరిద్రులు కావడంచేత వారి ప్రతిభాపాటవాలు వెలుగు చూడడం లేదు.

ఒగ్గుకథకులు, పౌరాణిక, చారిత్రక, సాంఘిక మొదలైన ఏవిషయాన్నైనా ఒగ్గుకథగా మార్చి చెప్పగల ప్రతిభావంతులు. ఏదైనా ఒక కథను చెప్పి దాన్ని ఒగ్గు కథగా మార్చమంటే వీరు అలవోకగా ఆకథను ఒగ్గుకథగా మార్చి చెబుతారు. అంటే ఒగ్గుకథకుల్లో సృజనాత్మక సాహిత్యాన్ని సృష్టించగల ప్రతిభాపాటవాలు పుష్కలంగా ఉన్నాయన్నమాట. వీరు పెద్దగా చదువుకున్నవారు కాదు. ఐనప్పటికీ తాము చెప్పే ఒగ్గుకథ మీద, దాని నిర్మాణం మీద పూర్తి పట్టు సాధించినవారు. వారం రోజులపాటు చెప్పే కథను దాని మూలతత్వం చెడకుండా కుదించి క్లుప్తంగా ఒక్కరోజులో చెప్పగలరు. అలాగే ఒక్కరోజులో చెప్పేకథను పెంచి ఐదు రోజులపాటు వివరంగా చెప్పగలరు. ఇలా చెప్పడం సాధారణమైన విషయం కాదు. ఒగ్గుకథకులు మాత్రమే ఈపనిని చాల సమర్ధవంతంగా చేయగలరు.

తప్పెటగుళ్ళ కళాకారులు దాదాపుగా నిరక్షరాశ్యులు. వీరు కథాగేయాలను పూర్తిగా పాడరు. ఈకళ నృత్యప్రధానమైనది కావడంవల్ల పౌరాణిక, చారిత్రక, సాంఘిక కథాగేయాల్లో ముఖ్యమైన ఘట్టాలను తమకళాప్రదర్శనకు అనుగుణంగా మార్చి పాడుకుంటారు. అంటే వీరుగూడా ఒగ్గుకథకుల లాగా ఎలాంటి ఇతివృత్తాన్నైనా తమ కళాప్రదర్శనలో పాడడానికి వీలుగా దాన్ని మార్చుకోగల ప్రతిభావంతులని స్పష్టమవుతూ వుంది.

కాటమరాజు కథలు మాత్రం లిఖితరూపంలో ఉన్నాయి. కాటమరాజు కథలు మొత్తం 32 ఉన్నాయి. ఇవన్నీ ఒకదానికొకటి సంబంధాన్ని కలిగి ఒక ఇతిహాసంలాగా యాదవగాధాకారులచేత పాడబడుతూ ఉన్నాయి ఇంత పెద్దకథాగేయచక్రం తెలుగులోనే గాదు, ఇతర భారతీయ భాషల్లో గానీ, ప్రపంచభాషల్లో గానీ మరొకటి లేదు. దీనికి యాదవభారతం అని, యదుశాస్త్రం అని నామాంతరాలున్నాయి. ఈకథలన్నింటినీ యాదవకవులే రాశారు. ఐతే ఈకథాగేయకర్తలందరి పేర్లు తెలియడం లేదు. కొన్ని కథాగేయాల రచయితల పేర్లు తెలుస్తున్నాయి. వీటిలో ఆవుల వలురాజు కథను వడరుప మద్దులేటి కవి, పంపాద్రి కథను మల్లయ్య, పోలురాజు కథను కనకబండి ఘట్టయ్య, కరియావులరాజు కథను పినయెల్లన, కాటమరాజుకు పట్నం గట్టిన కథను

కట్టెబోయిన మారయ్యకవి, పాపనూక కథను మంగళపురి వెంకటాద్రి, అగుమంచి కథను జరుగుపల్లి చెన్నయ్య రాశారు. మిగిలిన కథలను ఎవరు రాసినది తెలియడం లేదు. ఈకాటమరాజు కథలన్నీ వర్ణనలు, రసపోషణ, పాత్రచిత్రణ, కథాకథనం మొదలైన సాహిత్యాంశాల విషయంలో శిష్టసాహిత్యంలోని మహాకవుల స్థాయికి దీటుగా ఉన్నాయి.

ఈకథలు లిఖితరూపంలో ఉన్నప్పటికీ ఈకథలను చెప్పే గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, తెరచీరల వారు, మందెచ్చులవారు, బైకానివారు - వీరందరూ లిఖితరూపంలో ఉన్న కథలను ఉన్నవి ఉన్నట్లుగా కాకుండా అవి స్వంత మైనట్లుగా అనేక కల్పనలు, మార్పులు చేర్పులు చేసి తమ కళాప్రదర్శన సందర్భంగా పాడుతారు. అంటే ఈకళాకారులందరూ సృజనాత్మకసాహిత్యాన్ని సృష్టించగల ప్రతి భావంతులని స్పష్టమవుతూ ఉంది.

మన ఆలంకారికులు కావ్యహేతువులుగా ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం అనే మూడింటిని చెప్పారు. యాదవ జానపద కళాకారులందరూ గొప్ప ప్రతిభావంతులు. వీరిలో ప్రతిభకు లోపం లేదు. రెండవది వ్యుత్పత్తి. వ్యుత్పతి అంటే శాస్త్రాలను, పూర్వకవుల కావ్యాలను అధ్యయనం చేసి, కవిత్వం బాగా రాయగల వారిని సేవించి కవిత్వాన్ని ఎలా రాయాలో గ్రహించడం. వ్యుత్పత్తి సాధించాలంటే ముందు బాగా చదువుకోవాలి. యాదవకళాకారులందరూ పొద్దున లేచినప్పటినుంచి జీవిక కోసం వెదుక్కోవలసిన కటిక బీదవారు కావడం చేత వీరికి చదువుకునే అవకాశం కలగడం లేదు. వీరందరూ చదువు లేని వారు కావడం చేత, కొందరు చదువుకున్నా రెండవ మూడవ తరగతి వరకు మాత్రమే చదువుకున్నవారు కావడం చేత వీరు శిష్టకవుల లాగా వ్యుత్పత్తిని సాధించలేక పోతున్నారు. గొప్పకావ్యాలను రాయలేకపోతున్నారు. వీరు శిష్టకవుల లాగా బాగా చదువుకొని వ్యుత్పత్తిని సాధిస్తే వీరు గూడా మహాకావ్యాలను రాయగల శక్తిసామర్థ్యాలు ఉన్నవారని చెప్పడంలో ఎలాంటి సందేహం లేదు.

మొదట ఆవులను, ఆతర్వాత గొర్రెలను మేకలను కాయడం వృత్తిగా కలిగి ఎల్లప్పుడు అడవుల వెంట పొలాల వెంట తిరుగుతూ నాగరికతకు దూరంగా అనేక మూఢనమ్మకాలతో కులచైతన్యం లేకుండా ఉన్న యాదవులు ఇంత గొప్ప సాహిత్యమున్న జానపదకళలను సృష్టించి పోషించడం చూస్తే గొప్ప అశ్చర్యం కలుగుతుంది. నిన్న మొన్నటి వరకు యాదవులు నిరక్షరాశ్యులు. నిరక్షరాశ్యులు, పసువులకాపరులైన యాదవులు ఇంతగొప్ప సాహిత్యసంపదను సృష్టించుకోవడం, తరతరాలుగా వారి వారసులు దాన్ని కాపాడుకుంటూ రావడం సామాన్యామైన విషయం కాదు. యాదవులు



ఇంతగొప్ప సాహిత్యమున్న జానపదకళలను సృష్టించుకోవడానికి, తరతరాలుగా వాటిని పోషిస్తూ కాపాడుతూఉండడానికి బలమైన కారణమే ఉండాలి.

మన సమాజంలో యాదవులు అజ్ఞానులుగా అమాయకులుగా పరిగణింప బడుతూ ఉన్నారు. "ఎంత మంచి గొల్లవాడికైనా వేపకాయంత వెర్రి ఉంటుంది" లాంటి సామెతలు యాదవులు మన సమాజంలో అజ్ఞానులుగా పరిగణింప బడుతున్నారనే విషయానికి ఉదాహరణగా చెప్పవచ్చు. సుమతీ శతకకారుదు చెప్పిన

"అల్లుని మంచితనంబును
గొల్లని సాహిత్యవిద్య కోమలి నిజమున్
పొల్లున దంచిన బియ్యము
తెల్లని కాకులును లేవు తెలియుర సుమతీ"

అనే పద్యంలో గొల్లవారికి సాహిత్యవిద్య లేదని చెప్పాడు. సమాజంలో తమ కులం మీద ఉన్న ఇలాంటి తేలికభావాన్ని సవాలుగా స్వీకరించి దాన్ని తొలగించు కోవడానికి యాదవులు ఇంత గొప్ప సాహిత్యమున్న కళలను సృష్టించుకొని ఉండవచ్చు. మన సమాజంలోని దాదాపు అన్ని కులాలవారు తమ కులం గొప్పతనాన్ని చాటిచెప్ప డానికి ఒక కులపురాణాన్ని కల్పించుకొని దాన్ని పాడడానికి ఒక ఆశ్రితకులాన్ని ఏర్పాటుచేసుకొని ప్రచారం చేసినట్లుగానే యాదవులు సమాజంలో తమ కులం మీద ఉన్న చులకన భావాన్ని తొలగించుకోవడానికి సాహిత్యాన్ని సృష్టించడంలో గానీ దాన్ని కాపాడంలో గానీ తాము ఏకులానికి తీసిపోమని చెప్పడానికి, తమ కులం గొప్పత నాన్ని చాటి చెప్పడానికి ఇంత గొప్ప సాహిత్యమున్న జానపదకళలను సృష్టించుకొని వాటిని తరతరాలుగా కాపాడుకుంటూ వస్తున్నారని చెప్పవచ్చు.

ఈఅధ్యాయంలో యాదవ జానపదకళాకారులు పాడే గేయాల్లోని, కథాగే యాల్లోని సాహిత్యాంశాలను గురించి వివరిస్తాను.

## గొరవయ్యలు - సాహిత్యాంశాలు :

గొరవయ్యలు శివభక్తులు. వీరు ప్రధానంగా శివునికి సంబంధించిన పాటలు పాడుతూ నృత్యం చేస్తారు. ఈ నృత్యం సాధారణంగా సామూహికమైనది. ఇందులో పాట కంటే నృత్యానికే ప్రాధాన్యత ఉంటుంది. గొరవయ్యలు మల్లారుస్వామి భక్తుల ఇళ్ళలో జరిగే అన్ని శుభకార్యాలకూ ముందు గొరవపూజ చేస్తారు. ఈ పూజ సందర్భంగా వీరు శివునికి సంబంధించిన పాటలను పాడతారు. నృత్యం చేస్తారు. ఈ పాటల్లో శివుని గొప్పతనం, మహత్మ్యం చెప్పబడుతూ ఉంటుంది. గొరవయ్యల ఇష్టదైవం గట్టు

మల్లయ్య కొండ క్షేత్రంలో ఉన్న మల్లేశ్వరస్వామి. ఈ స్వామిని మల్లయ్యస్వామి **అంటారు.** వీరు పాడేపాటలు ఎక్కువగా ఈ స్వామికి సంబంధించినవే. ఈ కింది గేయం **అలాంటిదే.**

"చూడబోదము రారమ్మ - మల్లయ్యను సేవింతము రారమ్మ
చూడబోదము రారమ్మ - చూచిన వారికి చేసిన వారికి
వేదుక వరమిచ్చె వేదుక రజేపల్లి - మల్లయ్యలను చూడబోదము రారమ్మ
మ్రొక్కిన వారింట్లో మిక్కిలి వరమిచ్చు - అక్కర దేవుడు అతడెవరమ్మ
రాయడే మీనగొంది రాయడే మీనెగొంది - మల్లయ్యను చూడరమ్మ
వన్నెవన్నె చీరలు వనితలందరు గూడి - పళ్లాలు కలశాలు తీసికొనరమ్మ
భక్తితో బండారు పట్టుక మనమంతా - ఘనముగ గంగిమాళమ్మను
మల్లయ్యను సేవింతుము రారమ్మ"

పై గేయంలో మల్లయ్యస్వామిని దర్శించి సేవించుదాం రమ్మని భక్తులకు చెప్పడం జరిగింది.

ఈ కింది గేయంలో కూడా గట్టుమల్లయ్య కొండలో ఉన్న మల్లయ్యస్వామి దర్శించడానికి రమ్మని భక్తులకు చెప్పడం జరిగింది.

"శివా! కొండకని పోదాము రారమ్మా
మల్లయ్య కొండలో స్వామినే చూతాము రారమ్మా ॥శివా॥
శివా! శివపురానికి పరమటంట- సిద్దులేలే మల్లయ్యకొండ
సిన్నగనే పోదాము రారమ్మ - ఆ పరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మా
శివా! మల్లెపూవులు కోనలోన- మల్లికార్జునుడున్నడంట
ఇష్టముతో పూజించే వారికి - కష్టములు ఎడబాపే దేవుడు
సిన్నగనే పోదాము రారమ్మా - ఆ పరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మా
శివా! కొండపైన దేవళంబు - కొండ దిగువన మందిరంబు
మందిరంబులో వెలిగేటి - మల్లికార్జునుడున్నడంట
సిన్నగనే పోదాము రారమ్మ - ఆ పరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మా
శివా! లోతైన కోనేరంట - గాతమెవరికి తెలియదంట
అందులో స్నానంబు చేసిన - ముందు మోక్షము కలుగునంట
సిన్నగనే పోదాము రారమ్మ - ఆపరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మా
శివా! సుట్టు తిరిగెడి కొండలవిగో - నట్టనడుమ దేవళంబు
ఒంటి స్తంబము మేడలోన - ఒక్కడే మల్లయ్య వెలసెను
సిన్నగనే పోదామము రారమ్మా -ఆపరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మా



శివా! నెరణికి కొండలలోన - మల్లికార్జునుడున్నడంట
ఇష్టముతో పూజించు వారికి - ఇష్టములు ఎడబాపె దైవము
కొండకని పోదాము రారమ్మా - మల్లయ్య కొండలో స్వామినే
చూతాము రారమ్మా - సిన్నగనే పోదాము రారమ్మా
ఆపరవతాలకు మెల్లగనే - పోదాము రారమ్మా"

పై గేయంలో మల్లయ్య కొండలో సిద్దులు ఉంటారని అలాంటి కొండకు వెళదాం రమ్మని ఆ కొండ పై ఉన్న మల్లికార్జున స్వామిని ఇష్టంతో పూజిస్తే, పూజించేవారి కష్టాలను ఆ స్వామి పోగొడతాడనీ, కొండమీద ఉన్న కోనేరు లోతైనదీ, మహాత్మ్యం కలిగినదీ అనీ, అందులో స్నానం చేస్తే మోక్షం వస్తుందని చెప్పబడింది.

గొరవయ్యలు పాడే పాటలన్నీ దాదాపుగా పైన చెప్పిన గేయాల వంటివే. ఈ గేయాల్లో గట్టుమల్లయ్య కొండ, శ్రీశైలం, మహానంది మొదలైన శైవక్షేత్రాల మహాత్మ్యాన్ని గురించి ఆ క్షేత్రాల్లో ఉన్న శివుని గొప్పతనం గురించి చెప్పబడుతూ ఉంటుంది. ఈ గేయాల్లో పెద్దగా సాహిత్యపు విలువలు ఉండవు. ఇవి కేవలం భక్తి ప్రధానమైనవి, ఆధ్యాత్మికపరమైనవి.

## సేవగరిడి కథలు (దశావతార కథలు) - సాహిత్యాంశాలు :

సేవగరిడి భక్తి ప్రధానమైన జానపద కళ. ఈ కళాకారులు కళాప్రదర్శన సందర్భంగా విష్ణువవతారం, కూర్మావతారం, మత్స్యావతారం, కొమ్మలవరాహావతారం, నరసింహావతారం, వామనావతారం, పరుశురామావతారం, వరాహావతారం, కృష్ణావతారం అనే తొమ్మిది కథాగేయాలను పాడతారు. ఈ తొమ్మిది కథలతోపాటు ఎనిమిదవదైన వరాహావతారానికి అనుబంధంగా సింహాచలం దేవళం కట్టుబడి అనే కథా గేయాన్ని పాడతారు. దీనితో కలసి ఇవి మొత్తం పది కథాగేయాలవుతాయి. రామావతారకథను సేవగరిడి కళాకారులు తమ కళాప్రదర్శన సందర్భంగా పాడరు. కళాప్రదర్శనలో రామావతారం ఎక్కదని వీరు చెబుతారు. అందువల్లనే ఈఅధ్యాయంలో రామావతారకథను గురించి చర్చించలేదు. ఐతే కొంత మంది సేవగరిడి దాసులు విడిగా రామావతారకథను పాడుతారు.

కవుల కల్పనలు రెండు రకాలు. ఊహాశక్తిగల కవి సహృదయరంజకమైన కల్పనలతో కావ్యాన్ని సృష్టిస్తాడు. కళాపూర్ణోదయ కావ్యం ఇలాంటిదే. ఇది ఇతివృత్తానికి సంబంధించిన కల్పన. ప్రబంధాల్లో అనేక కల్పనలు ఉన్నాయి. ఈ కల్పనల్లో కవి ప్రధానంగా చూసేది రసానందాన్ని. అంటే కవి సహృదయులకు రసానందాన్ని కలిగించే

కల్పనలను చేస్తాడు. ఇది మొదటి రకం కల్పన.

రెండవ రకపు కల్పనలు విచిత్రమైనవి. అవి కల్పనలని వాటిని కల్పించిన వారు అనుకోరు. రాముని కథకు సంబంధించి వాల్మీకి రామాయణం ఒక్కటే ఆధి కారికమైనది. కానీ సంస్కృత భాషలో కల్పిత రామాయణాలు చాల ఉన్నాయి. తెలుగులో ఇలాంటి కల్పిత రామాయణాల సంఖ్య చాల ఎక్కువ. జానపదుల్లో రామాయణానికి సంబంధించి అనేక కల్పితకథలు ప్రచారంలో ఉన్నాయి. అలాగే భారత, భాగవత కథలకు సంబంధించి అనేక కల్పిత కథలు ఉన్నాయి. భారతదేశంలో ఏ పురాతన ఆలయాన్ని చూసినా అనేక కల్పితకథలతో క్షేత్రపురాణాలు చెప్పబడ్డాయి. ఆ పురాణాలను అవాస్తవం అంటే భక్తులు అంగీకరింపరు. కానీ చారిత్రక దృష్టితో పరిశీలిస్తే ఈ పురాణకథలన్నీ అభూత కల్పనలే. లిఖితరూపంలో ఉన్న శిష్టసాహిత్యంలోనే ఇన్ని కల్పనలు ఉంటే మౌఖికప్రసారంలో ఉన్న జానపద సాహిత్యంలోని కల్పనలు గురించి చెప్పనవసరం లేదు. జానపదులు తాము విన్న పురాణ కథలను వాస్తవాలుగా భావించి వాటిని తమ మనస్తత్వానికి అనుగుణంగా కల్పనలు జోడించి కథలను అల్లుతారు. ఇలాంటి కల్పనలతో కూడిన దశావతార కథాగేయాలలోని సాహిత్యాంశాలను గురించి పరిశీలించుదాం.

**1. విష్ణువవతారం :**

ఇది ఇరవైరెండు పుటల కథాగేయం. దశావతార కథల్లో విష్ణ్వవతారకథ మొదటిది. ఇది నాలుగు గంటల కాలంలో పాడదగినంత పరిమాణంలో ఉంది. శిష్ట సాహిత్యంలోని దశావతార కథల్లో ఇది లేదు. ఈ కథ కేవలం జానపదుల కల్పన. త్రిమూర్తుల్లో విష్ణువు గొప్పవాడని చాటి చెప్పడానికి ఈ కథ కల్పింపబడింది. ఇందులో సృష్టి ప్రారంభం వివరింపబడింది. ఈ కథ ఇలా ప్రారంభమవుతుంది.

"బూమి బూలోకాలూ పుట్టాకా ముందలా- ఆది శక్త్యవతార మెత్తాకా ముందలా
ఓంకారములు పుట్టు ఆకాలమందున- ఓంకారమందునా జాంకారమే పుట్టి
జాంకారమందునా మూలజేనుండు- మూలజేనుడుగురువు ముందు జలమించె"

సృష్టి ప్రారంభ సమయంలో విశ్వమంతా ఓంకారమయంగా ఉంటుంది. ఓంకారం నుండి జాంకారం పుడుతుంది. జాంకారం నుండి విష్ణువు మూలజేనుడు అనే పేరుతో ఆదిపురుషుడుగా ఉద్భవించి "ఆర్నెల్లు ఆరిపూజ మూన్నెల్లు శివపూజ" చేసి ఆదిశక్తిని పక్షి రూపంలో పుట్టించి తన "తంత్రమంత్రాలు, తన చేతిబెత్తాము, తన మూడోనేత్రము" ఆమెకు ఇస్తాడు. ఆదిశక్తి పెరిగి పెద్దదవుతుంది. అప్పుడు విష్ణువు ముందుముందు మూడు మూరలు ఉన్న నరులు పుడతారని తల్లిదండ్రులు లేకుండా పిల్లలు ఎలా



పుడతారని వారు ప్రశ్నిస్తారని ఆదిశక్తి కడుపున పుట్టడానికి ఆమె గర్భంలోని ప్రవేశిస్తాడు. విష్ణువు శక్తి గర్భంలోకి ప్రవేశించగానే శక్తికి గుడ్లు పెట్టే సమయం వస్తుంది. అయితే గుడ్లు పెట్టడానికి ఎక్కడా చోటు దొరకదు. విశ్వమంతా నీటితో నిండివుంటుంది. చివరికి శక్తి తన కుడిరెక్కను గూడుగా చేసి, అందులో మూడు గుడ్లు పెడుతుంది. వాటిని పొదగడానికి వాటి మీద కూర్చుంటుంది. అయితే శక్తికి ఆకలివేయడం వల్ల ఒక గుడ్డును తింటుంది. ఆదిశక్తి కాలు తగిలి మరొక గుడ్డు పగిలిపోతుంది. పగిలి పోయిన గుడ్డుయొక్క కింది పెంకు భూమిగానూ, పైపెంకు ఆకాశంగానూ మారుతాయి. గుడ్డులో ఉన్న తెల్లసొన సప్తసముద్రాలు, పచ్చసొన సూర్యచంద్రులు అవుతారు. 'గుడ్డు నుంచి రాలి కిందపడిన నలకలు భూమి మీద కొండలవుతాయి. ఎగిరిన రవ్వలు ఆకాశంలో చుక్కలవుతాయి. మిగిలిన ఒక గుడ్డు మీద శక్తి పన్నెండు రోజులు కూర్చొని పొదుగుతుంది. ఆ గుడ్డు నుంచి విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మ పుడతారు. త్రిమూర్తులు పెరిగి పెద్దకావడాన్ని జానపదకవి ఇలా వివరించాడు.

"పన్నిద్దరు దాదులను బలపరిచినాది- పాలట్టు నొకదాది పట్ట నొకదాది
ఉగ్గొయ్య నొకదాది ఊపనొకదాది - సేదట్ట నొకదాది సెంద నొకదాది
ఉయ్యాల సేరట్టి ఊపనొకదాది - ఇంతటంతట బాలలిల మీద పెరిగి
ఉగ్గులూ దాగేరు ఊసులాడేరు - సేదులు దాగేరు సెరుగులాడేరు
అంతటింతట బాలలిల మీద పెరిగి - పైడి గిన్నెల్లోను పాలు దాగీడాయె
ఎండి గిన్నెల్లోను ఎన్నదిన నీడాయె - మంచమట్టుకు బాల మసిలాడ నీడాయె
ఇంతటంతట బాల లిలమీద పెరిగి - యవన కాలం రాజులకేరిపోటాయె
కరకొయ్య పంచెలు కట్టనీడాయె"

పిల్లలు పుట్టిన తర్వాత వారు పెరిగి పెద్ద కావడాన్ని దాదాపుగా కథాగేయా లన్నింట లోనూ పైవిధంగానే చెప్పబడుతూ ఉంటుంది. సాధారణంగా కథాగేయాల్లో కనిపించే ఇలాంటివాటినే వారానువర్తనాలు అంటారు. ఇలాంటి వారానువర్తనాలు అన్ని కథా గేయాల్లోనూ ఉంటాయి.

యవ్వనంలోకి వచ్చిన త్రిమూర్తులను చూసి శక్తికి వారి మీద కోరిక కలుగుతుంది. శక్తి మొదట బ్రహ్మనుపిలిచి -

"గుడ్డు నా కూతురు గువ్వ మనమలు గద - అవ్వల మనవలకది మంచి వరస
పొందరోరిల బ్రహ్మ నాతోటి పొందు"

అని అంటుంది. గుడ్డు తన కూతురు, గుడ్డు నుంచి పుట్టిన త్రిమూర్తులు తనకు మనమలవుతారు. అవ్వలకు మనుమలకు వరస కుదురుతుంది కాబట్టి బ్రహ్మను

తనను పొందమంటుంది. దానికి బ్రహ్మ ఇలా అంటాడు.

"ముందలా నరయావతరముడతాదమ్మ - మూడుమూలే నరులు పుట్టనున్నారు
తల్లితో పొందిన తనయులంతారు - కన్నతల్లితోటీ కల్లేల మందితే
ఉండదే కలియుగం మండిపోతాది -పెక్కినే నయనాలు పేలిపోతాలయి"

భవిష్యత్తులో మూడు మూరలున్న నరులు పుడతారని, వారు తనను కన్నతల్లిని పొందిన దుర్మార్గుడని నిందిస్తారని, తల్లిని పొందితే కళ్ళు పేలిపోతాయని అందువల్ల తాను ఆదిశక్తిని పొందలేనని బ్రహ్మ చెబుతాడు. వెంటనే శక్తి కోపంతో తన మూడవ నేత్రాన్ని తెరచి బ్రహ్మను బూడిద చేస్తుంది. తర్వాత శక్తి ఈశ్వరుని పిలిచి తనను పొందమంటుంది. ఈశ్వరుడు గూడా బ్రహ్మ లాగానే సమాధానం చెబుతాడు. శక్తి ఈశ్వరుణ్ణి గూడా భస్మం చేస్తుంది. శక్తి చివరకు విష్ణువును పిలిచి తనను పొందమంటుంది. దానికి విష్ణువు -

"ఔదువే శక్తమ్మ ఔనంతదానా - శక్తితో పొందేటి సత్తువులు లేవు
నీతంత్రమంత్రాలు నాకిచ్చితేను - అందుతానే దైత నిను పొందుతానే
నీచేతి బెత్తాము నాకిచ్చితేను - అందుతానే దైత నిను పొందుతానే
నీమూడో నేత్రాము నాకిచ్చితేను - అందుతానే దైత నిను పొందుతానే"

అంటాడు. ఇందులో విష్ణువు ఆదిశక్తిని దైత అని సంబోధించాడు. ఈపదం ఇప్పుడు కళింగాంధ్ర ప్రాంతంలో వ్యవహారంలో లేదు. ఐతే ఈపదం రాయలసీమలో ఇప్పటికీ వ్యవహారంలో ఉంది. ఇంచుమించుగా దయ్యం అనే అర్థంలో అంటే ఒక విధమైన నిందార్థంలో ఈపదాన్ని ఉపయోగిస్తారు. ఆదిశక్తిని పొందే బలం తన దగ్గర లేదు కాబట్టి, శక్తి దగ్గరున్న మంత్రతంత్రాలు, బెత్తం, మూడవకన్ను తనకు ఇస్తే ఆమెను పొందుతానని విష్ణువు శక్తికి చెబుతాడు. వెంటనే శక్తి విష్ణువు అడిగినవన్నీ ఇచ్చి తనను పొందమంటుంది. అప్పుడు విష్ణువు ఆమె శరీరంలో మూడు మైలలున్నాయని చెబుతాడు.

"నువ్వు పుట్టిన మైల నేను పుట్టినమైల యవనకాలం మైల"

ఆదిశక్తి తాను పుట్టినప్పటి మైల, ఆమె పుష్పవతి అయినప్పటి మైల, ఆమె త్రిమూర్తులను కన్నప్పటి మైల అనే మూడు మైలలు ఆమెలో ఉన్నాయని, స్నానం చేసి వాటిని పోగొట్టుకొని రమ్మంటాడు. వెంటనే శక్తి స్నానం చేయడానికి సముద్రం వైపు పరుగెడుతుంది. అప్పుడు విష్ణువు తన చేతిలో ఉన్న బెత్తాన్ని సముద్రంలో విసిరేసి అందులో ఉన్న నీళ్ళన్నీ ఇంకిపోయే లాగా చేస్తాడు. స్నానం చేయడానికి శక్తికి ఎక్కడా నీరు కన్పించదు. శక్తి కోపంతో ఇదంతా విష్ణుమాయ అని గ్రహించి తిరిగి విష్ణువు దగ్గరికి వచ్చి

"బాబురా ఒకే బాబు నీలయెన్నుండా - ఇలపాలసంద్రల కెళ్ళ మన్నావు



ఇలపాల సంద్రాల ఇంకుడోనాయి - ఎక్కడికి స్నానాని కెళ్ళమంటావు"

అని అడుగుతుంది. విష్ణువు గోదారికి వెళ్ళమంటాడు. శక్తి గోదారికెళ్ళి అక్కడ గోవు అడుగులో ఉన్న దోసెడు ఒంద్రు నీళ్ళలో పొర్లాడి విష్ణువు దగ్గరికి వస్తుంది. విష్ణువు వెంటనే మూడవ కన్ను తెరచి శక్తిని భస్మం చేస్తాడు.

తరువాత విష్ణువు తన మంత్రతంత్రాల చేత బ్రహ్మను, ఈశ్వరుణ్ణి బ్రతికిస్తాడు. ఆ తరువాత విష్ణువు ఆదిశక్తి బూడిదను నాలుగు భాగాలుగా చేసి మూడు భాగాల నుంచి లక్ష్మి, పార్వతి, సరస్వతులను సృష్టించి, సరస్వతిని బ్రహ్మకు, పార్వతిని ఈశ్వరునికి, లక్ష్మిని తనకు భార్యలుగా చేస్తాడు. నాలుగవ భాగం నుంచి మళ్ళీ శక్తిని సృష్టిస్తాడు. శక్తి లేచిన వెంటనే ఆకలి ఆకలి అని విష్ణువును అర్థిస్తుంది. విష్ణువు "కొర్రకూడు, సామకూడు, వరికూడు" రాసులుగా పోసి శక్తిని తినమంటాడు. శక్తి ఆ ఆహారాన్నంతటిని మూడు ముద్దలుగా చేసి మింగి మళ్ళీ ఆకలి అంటుంది. అప్పుడు విష్ణువు ఆదిశక్తితో ఇలా అంటాడు.

"ఔదువే శక్తమ్మ ఔనంతదానా - నీకన్ని జీవులశక్తి అమరి ఉండాలమ్మ
నువ్వు కలియ దాపారాలు ఎలిసుండాలమ్మ - ఎయ్యగల తల్లివై యెల్లమ్మ తల్లివై
కలియ దాపారాలు నువ్వు ఎలిసుండాలమ్మ - అమ్మ ఊరికో అమ్మోరివై నువ్వుండు
నీకు ఊరూరు పండుగలు ఉజ్జడీబళ్ళు- నువ్వు ఊరికో పేరెట్టి ఎలిసుండాలమ్మా
గామాల పండుగలు గంపజాగరాలు - నువు ఊరికో పేరెట్టి ఎలిసుండాలమ్మ
నీకు మేదరోడిస్తాడు మెట్టిజంగిళ్లు - అమ్మ నీయాలము ముందు నడుసు
కుమ్మరోడిస్తాడు కూటిగటాలు - అమ్మనీయాలము ముందు నడుసు
కాపు వోరిస్తారు కంచుగటాలు - అమ్మనీయాలము ముందు నడుసు
ఎలము వోరిస్తారు ఎనుబోతు నీకమ్మా - అమ్మనీయాలము ముందు నడుసు
గొల్లవోరిస్తారు గొర్రె బద్దీనీ - అమ్మ నీయాలము ముందు నడుసు
ఇంటి కొకయాట నీకు ఇస్తారు - ఏడుకొమ్ముల యాట నీకు ఇస్తారు
బాపనోళ్ళిస్తారు బరిణికుంకాలు - మాదిగొళ్లిస్తారు డోలుడప్పులు
బారికోడిస్తాడు డోలు దరుగూలు - మేలైన కత్తులు మేకపోతులతోటి
ఆదూపదీపాలు ఆరుతీర్చెదరు - అమ్మ ఎరిపెరుపుదండలు మెరిపించె కత్తులు
అరిపించి నరుకుతారమ్మ నీయెదుట - కొర్రకూడు కుంబాలు నీకారమేసెదరు
పప్పుకూడారాలు ఆరమేతూరు - ఏడాది కొగ్గాస మిత్తురే నీకు
ఇలమీదికెళ్ళి ఎలిసి నువ్వుండు - ఆదిశక్తికి వరము నాడిచ్చినాడు
ఇలమీద శక్తమ్మ నిడిచేసినాడు"

భవిష్యత్తులో నరులు పుడతారని, ఆ సమయంలో ఆదిశక్తి ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క గ్రామదేవతగా ఉండాలని, ఆ గ్రామంలోని అన్ని కులాలవారు కలిసి ప్రతి సంవత్సరం ఆమెకు పండుగ చేసి అనేక రకాల ఆహార పదార్థాలు, జంతుబలులు, ధూపదీప నైవేద్యాలు సమర్పిస్తారని విష్ణువు ఆదిశక్తికి చెప్పి ఆమెను భూమి మీదకు పంపిస్తాడు.

"ముగ్గురు రాజులు మూలమైనారు - ఒకనాటి సమయమున వాదులాడేరు
పాయకన బూముల పంపకా లేసేరు - ఇల మూడులోకాలు ఒకవంతు నేసే
బ్రమ్మాండ ఏదాలు ఒక వంతు నేసే - ఇలపాల సంద్రాలుఒక వంతు నేసె"

త్రిమూర్తులు ఒకరోజు సామాన్య జానపదుల లాగా వాదులాడుకోవడం జరుగుతుంది. ఇక కలిసి ఉండలేమని వారు భావించి వేరు పోవాలనుకొని విశ్వ మంతటిని మూడు భాగాలుగా విభజిస్తారు. ముల్లోకాలు ఒక భాగం, వేదాలు ఒక భాగం, సప్త సముద్రాలు ఒక భాగం. త్రిమూర్తుల్లో బ్రహ్మ చిన్నవాడు కాబట్టి ముందుగా అతణ్ణి వంతు (భాగం) కోరుకోమంటారు. బ్రహ్మ వేదాలను కోరుకుంటాడు. అప్పుడు విష్ణువు బ్రహ్మతో ఇలా అంటాడు.

"ఔదువో ఇల బ్రహ్మ ఔనంతటోడా - ఏదాల కాసపడి వంతెత్తినావు
నిలపలేవిల బ్రహ్మ నిముషమొక గడియ - కలియదాపారాలు అందలున్నాయి
ఇష్ణు యావుసు మొదలు బ్రహ్మయావును మొదల - ఈశ్వరుండావు సులందలున్నాయి
నిలుపలేవిల బ్రహ్మ నిమిషమొక గడియ - దొడ్డవారేదాలుదోపుడౌతాయి".

అన్ని విషయాలు వేదాల్లో ఉన్నాయని, అంత ముఖ్యమైన వేదాలను బ్రహ్మ రక్షించ లేడని, అవి దోపిడికి గురి ఔతాయని విష్ణువు బ్రహ్మతో చెబుతాడు. అయినప్పటికి బ్రహ్మ వాటినే కోరుకుంటాడు. ఈశ్వరుడు ముల్లోకాలను కోరుకుంటాడు. మిగిలిన భాగమైన సప్త సముద్రాలను విష్ణువు తీసుకుంటాడు. బ్రహ్మ సరస్వతిని తీసుకొని బ్రహ్మలోకానికి, ఈశ్వరుడు పార్వతిని తీసుకొని కైలాసానికి వెళ్ళిపోతారు. విష్ణువు లక్ష్మిని తీసుకొని ఐదుగురు దాసులతో కలిసి సముద్రం దగ్గరికి వస్తాడు. అప్పుడు లక్ష్మి విష్ణువుతో

"అయ్యశెంకు సెక్కారాల దాశావతార - బ్రమ్మాండ ఏదాలు బ్రమ్మకిచ్చావు
ఇలమూడు లోకాలు ఈశ్వరుడికిచ్చావు - వట్టి సంద్రం కూడ వొంతు దెచ్చినావు
నీటి మీదన కాలు నిలవకున్నాది - ఏరీతి గుందువోయి ఎన్నుడా సోమి"

అని అంటుంది. దానికి విష్ణువు నవ్వి "నీరు నానిద్దుర పాము నా పానుపు - నీరేమి జేసును నీలయెన్నుడిని" అని చెప్పి, సముద్రం పక్కన ఉన్న మర్రిచెట్టు ఆకు తుంచి సముద్రంలో వేస్తాడు. వెంటనే ఆ మర్రిఆకు తెప్పగా మారిపోతుంది. ఆ మర్రిచెట్టు కింద పెద్దపుట్ట ఉంటుంది. ఆ పుట్టలో ఉన్న ఆదిశేషుడు బైటకి వచ్చి మర్రిఆకు మీద



తన తోక భాగాన్ని విష్ణువుకు పీఠంగా, నడుము భాగాన్ని పానుపుగా, తల భాగాన్ని గొడుగుగా పడతాడు. విష్ణువు ఆ మర్రాకు పానుపు మీద పవలిస్తాడు. అష్టదిక్పాలకులు, ముక్కోటి దేవతలు హరి సేవ చేస్తూ వుంటే విష్ణువు నిద్రలోకి జారుకుంటాడు. ఇంతటితో విష్ణువవతార కథ ముగుస్తుంది.

జానపద సాహిత్యంలో సృష్టి ప్రారంభాన్ని తెలియజేసే కథలన్నీ ఇంచుమించు విష్ణువవతార కథలాగానే ఉన్నాయి. ఉదాహరణకు జాంబపురాణాన్ని తీసుకుంటే ఇది శివుని పరంగా ఉంది. సృష్ట్యాదిలో అంతా జలమయంగా ఉండేది. మొదట ఆదిశక్తి పక్షి రూపంలో ఉద్భవించి మూడు గుడ్లు పెట్టి వాటిని పొదుగుతుంది. అందులో మొదటి గుడ్డునుంచి బ్రహ్మ, రెండవ గుడ్డు నుంచి విష్ణువు, మూడవ గుడ్డు నుంచి ఈశ్వరుడు పుడతారు. త్రిమూర్తులు పెరిగి పెద్దయిన తర్వాత, యవ్వనంలో ఉన్న త్రిమూర్తులను చూచి గుడ్లు నా బిడ్డలు గుడ్ల నుంచి పుట్టిన పిల్లలు నా మనుమలు, వీరితో రతి చేస్తానని శక్తి అనుకొని మొదట బ్రహ్మను పిలిచి తనతో రతి చేయమంటుంది. బ్రహ్మ దానికి అంగీకరించకపోవడం వల్ల ఆదిశక్తి మూడు మంత్ర ప్రయోగాలు చదివి అతణ్ణి కొడుతుంది. బ్రహ్మ చనిపోతాడు. అలాగే విష్ణువును గూడా అడుగుతుంది. విష్ణువు గూడా అంగీకరించక పోవడం వల్ల ఆదిశక్తి అతణ్ణి కూడా చంపివేస్తుంది. శివుడు ఆదిశక్తి వద్ద ఉన్న చిత్రకన్ను, గద, శూలం, మూడు మంత్ర ప్రయోగాలు తనకు ఇస్తే ఆమె కోరిక తీరుస్తానని చెబుతాడు. కామాంధకారంలో ఉన్న శక్తి శివుడు అడిగినవన్నీ ఇస్తుంది. అప్పుడు శివుడు, శక్తి గుడ్డుపెట్టిన అంటులో ఉందని, అందువల్ల ఆమె స్నానం చేసి వస్తే ఆమెతో రతి చేస్తానని చెబుతాడు. శక్తి స్నానం చేయడానికి పోతుంది. వెంటనే శివుడు యోగంతో విష్ణు, బ్రహ్మలను లేపుకుంటాడు. శక్తి స్నానం చేసి కొండలాగా వస్తూ ఉంటే శివుడు మూడు మంత్ర ప్రయోగాలు చదివి ఆమెను కొడతాడు. శక్తి చనిపోతుంది. త్రిమూర్తులు ఆమె శరీరానికి దహనక్రియలు చేసి బూడిద చేస్తారు. అప్పుడు ఈశ్వరుడు ఆ బూడిదను నాలుగు భాగాలుగా చేసి మూడు భాగాల నుంచి సరస్వతి, లక్ష్మి, పార్వతులను పుట్టించి నాల్గవ భాగం నుంచి ఓంకార శక్తిని పుట్టిస్తాడు.

విష్ణువవతార కథలో ఆదిశక్తి చనిపోయి మళ్ళీ బ్రతికే వరకు ఉన్న కథ ఉత్తరాంధ్ర ప్రాంతంలో ఆదిశక్తి కథ అనే పేరుతో వచన కథగా ప్రచారంలో ఉంది. అయితే ఇందులో బ్రహ్మ విష్ణువులను శక్తి భస్మం చేసిన తర్వాత ఈశ్వరుడు చాకచక్యంగా శక్తి దగ్గర ఉన్న మూడవ కన్ను, చేతిబెత్తం, ఆమె బలం తీసుకొని ఆమెను భస్మం చేస్తాడు. ఇదేగాదు ఇంచుమించు ఇలాంటి కథలన్నీ ఈశ్వరుని పరంగానే ఉన్నాయి. నుదుట

కన్ను ఈశ్వరునికే ఉంది. కాబట్టి ఈశ్వరుడే నైపుణ్యంగా ఆదిశక్తి దగ్గర నుంచి మూడవ కన్ను, బెత్తం తీసుకున్నట్లు చెప్పిన కథలే ఔచిత్య వంతమైనవిగా భావించాలి. ఈశ్వరుని పరంగా ఉన్న కథల ననుసరించి విష్ణువు గొప్పతనాన్ని చాటి చెప్పడానికి వైష్ణవులు ఈ విష్ణువవతార కథాగేయాన్ని కల్పించి వుంటారు. ఐతే దేవతలకు కష్టాలు వచ్చినప్పుడు నేర్పుతో వాటిని తొలగించేది విష్ణువేనని చాల పురాణాలు చెబుతున్నాయి. చివరకు శివుణ్ణి రక్షించేది గూడా విష్ణువే. శివుడు బోళాశంకరుడు ముందూ వెనుకా చూడకుండా వరాలిచ్చి కష్టాలు కొనితెచ్చుకుంటూ ఉంటాడు. అప్పుడు మళ్ళీ అతణ్ణి రక్షించేది విష్ణువే. ఇందుకు మంచి ఉదాహరణ భస్మాసురుని కథ.

జానపద సాహిత్యంలోని చాల కథల్లో ఆదిశక్తి తన కుమారులైన త్రిమూర్తులను కామించినట్లుగా చెప్పబడింది. ఈ కథలన్నీ మానవుడు ఆటవికుడుగా జీవించే దశలోని అతి ప్రాచీనమైన ఒక పద్ధతిని తెలియ జేస్తున్నాయి. మానవులు ఆటవికులుగా గుంపులు గుంపులుగా జీవించే దశలో ఒక్కొక్క గుంపుకు ఒక స్త్రీ నాయకురాలుగా ఉండేది. ఆ దశలో వివాహం గానీ వావివరుసలు గానీ ఉండేవి కావు. తల్లీ కొడుకు, తండ్రీ కూతురు, అన్నా చెల్లెలు మొదలైన వరుసలు, కట్టుబాట్లు లేకుండా స్త్రీ పురుషులు స్వేచ్ఛగా లైంగిక సంబంధాలను కలిగి వుండేవారు. నాయకురాలుగా ఉన్న స్త్రీ తన అధికారంతో యవ్వనంలో ఉన్న పురుషులతో శృంగారం సాగించేది. అప్పుడప్పుడే యవ్వనంలోకి ప్రవేశించిన యువకులను మొదటిసారి ఆమే అనుభవించేది. వారు తన కడుపున పుట్టినవారు కావచ్చు, ఇతరుల కడుపున పుట్టినవారు కావచ్చు. ఆ దశలో ఇది తప్పుకాదు. ఆహారం నిద్ర ఎలాంటిదో లైంగిక వాంఛ కూడా అలాంటిదే. అతి ప్రాచీనమైన ఈ ఆచారాన్ని ఆదిశక్తి తన కుమారులైన త్రిమూర్తులను కామించి నట్లుగా చెప్పుతున్న కథలు చెబుతున్నాయి. జానపద విజ్ఞానం మానవుని అతి ప్రాచీన పద్ధతులను తెలియజేస్తుందని చెప్పడానికి విష్ణువవతార కథ మిగిలిన ఇలాంటి కథలు మంచి ఉదాహరణలు.

విష్ణువవతార కథ అతి ప్రాచీనమైన పై ఆచారాన్ని చెప్పడంతో పాటు అన్న దమ్ములు ఆస్తిని పంచుకుంటారన్న ఆధునికమైన ఆచారాన్ని గూడా తెలియజేస్తూ వుంది. గ్రామాల్లో ఒక తండ్రికి ఇద్దరు గానీ అంతకంటె కంటె ఎక్కువ మంది గానీ కుమా రులున్నప్పుడు, వారు పెద్దగా గొడవలు లేకుండా తలావొక పని చేసుకుంటూ కాలం గడుపుతూ ఉంటారు. అన్నదమ్ములకు వివాహమైన తర్వాత వారి మధ్య స్త్రీల కారణంగా అభిప్రాయ భేదాలు రావడం, తరచుగా కొట్లాడుకోవడం, చివరకు విడిపోవడం జరు గుతూ వుంటుంది. విష్ణువవతార కథలో త్రిమూర్తులకు వివాహం కానంత వరకు వారు



కలిసి బాగానే ఉన్నారు. వారికి వివాహమైన తర్వాత వాదులాడుకొని విశ్వం మొత్తాన్ని మూడు భాగాలు చేసి ఎవరి భాగాన్ని వారు తీసుకొని వారివారి పట్టణాలకు వెళ్ళి పోయినట్లుగా ఇందులో చెప్పబడింది.

జానపదుల దృష్టిలో వేదాలు చాల పురాతనమైనవి, గొప్పవి. సృష్టిలోని రహస్యాలన్నీ అందులో ఉన్నాయని వారి విశ్వాసం. అందువల్లనే ఈ కథాగేయ రచయిత విష్ణువుచేత వేదాలను గురించి –

"ఇలమూడు లోకాలు అందలున్నాయి- కలియదాపారాలు అందలున్నాయి

ఇష్ణుయావుసు మొదలు బ్రహ్మయావును మొదల-ఈశ్వరుండావుసులందలున్నాయి"

అని చెప్పించాడు. అంత గొప్పవి గనుకనే త్రిమూర్తులు విశ్వమంతటినీ పంచుకునే టప్పుడు ముల్లోకాలను ఒక భాగంగా, సప్త సముద్రాలు ఒక భాగంగా, వేదాలను మాత్రమే ఒక భాగంగా చేసినట్లుగా ఇందులో చెప్పబడింది. వేదాలు బ్రహ్మ దగ్గర ఉంటాయని, వాటిని చూసి అతడు చరాచర జగత్తును సృష్టిస్తాడని జానపదుల విశ్వాసం. అందువల్ల బ్రహ్మ వేదాలను తన భాగంగా కోరుకున్నట్లుగా ఈ కథాగేయంలో చెప్పబడింది. శివుడు కైలాస పర్వతం మీద నివసిస్తున్నాడు కాబట్టి శివుడు ముల్లో కాలను తన భాగంగా కోరుకున్నట్లుగా, విష్ణువు నీటిలో నివాసముంటాడు కాబట్టి అతడు సప్త సముద్రాలను కోరుకున్నట్టుగా ఇందులో చెప్పబడింది.

గ్రామాల్లో అన్నదమ్ములు భాగాలు పంచుకునేటప్పుడు ఆస్తినంతటినీ సమాన భాగాలుగా విభజించిన తర్వాత మొదటఅన్నదమ్ముల్లో చిన్నవాణ్ణి భాగం కోరుకోమంటారు. అలాగే ఈ కథాగేయంలో విష్ణువు చిన్నవాడైన బ్రహ్మను మొదట భాగం కోరు కోమన్నట్టుగా, బ్రహ్మవేదాలను కోరుకున్నట్లుగా చెప్పబడింది.

భారతదేశంలోని ప్రతి గ్రామంలో కనీసం ఒక గ్రామదేవత అయినా ఉండడం, ఆగ్రామదేవతకు ప్రతి సంవత్సరం పండుగ చేయడం జరుగుతూ ఉంది. ఇలా ప్రతి గ్రామంలోను ఒక గ్రామదేవత ఉండడానికి, ఆ గ్రామదేవతకు ప్రతి సంవత్సరం పండుగ చేసి మేకలు గొర్రెలు కోళ్ళు మొదలైన జంతువులను బలి ఇవ్వడానికి గల కారణాన్ని గూడా జానపదకవి ఈ విష్ణువవతార కథలో చక్కని కల్పన చేశాడు. విష్ణువు ఆదిశక్తిని బూడిద చేసి మళ్ళీ ఆమెను బ్రతికించినప్పుడు ఆమె ఆకలి ఆకలి అని అలమటిస్తుంటే, విష్ణువు ఆమెను భూలోకానికి వెళ్ళి ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క దేవతగా వెలవాలని, గ్రామ ప్రజలు ఆమెకు సంవత్సరానికి ఒకసారి పండుగ చేసి అనేక జంతువులను బలి ఇచ్చి నైవేద్యం పెడతారని ఆమెకు వరమిచ్చినట్లుగా ఈ కథాగేయంలో చెప్పబడింది. సమకాలంలో ఉన్న గ్రామదేవతారాధనను గమనించి

అలనాడు విష్ణువు ఆదిశక్తికి వరమివ్వడం వల్లనే ఈనాడు భూలోకంలో గ్రామ దేవతలకు నరులు పండుగలు చేస్తున్నారని జానపద కవి చెప్పడం వల్ల ప్రజలకు గ్రామదేవతల మీద మరింత భక్తి విశ్వాసాలు కలుగుతాయి. ఈవిధంగా సంఘంలో ఉన్న గ్రామా దేవతారాధనకు ప్రామాణికతను కల్గించడానికి, ఎంతో ప్రాచీనకాలం నుంచీ కొనసాగుతున్న ఆ సంప్రదాయాన్ని తప్పనిసరిగా ఆచరించాలని, అలా ఆచరించడం వల్ల గ్రామానికి మంచి కలుగుతుందనీ, నిర్లక్ష్యం చేస్తే గ్రామానికి ఆపద సంభవిస్తుందనీ చెప్పడానికి విష్ణువవతార కథలో ఈ కల్పన చేయబడింది.

**2. కూర్మావతారం :**

దశావతార గాథాకారుల్లో కొందరు ఈ కథను రెండవ అవతారంగా పాడతారు. మరికొందరు మత్స్యావతారాన్ని రెండవ అవతారంగా కూర్మావతారాన్ని మూడవ అవతారంగా పాడతారు. కూర్మావతారకథ ఇరవై పుటల కథాగేయం. ఇందు లోని కథ శిష్టసాహిత్యంలో ఉన్నదే అయినప్పటికీ జానపదకవి అనేక మార్పులు చేశాడు. రాక్షసులు దేవతలు అమృతం కోసం పాలసముద్రాన్ని చిలకడం, చిలుకుతు న్నప్పుడు పర్వతం మునిగిపోకుండా విష్ణువు తాబేలు రూపంలో పర్వతం కింద ఉండడం, పాల సముద్రం నుంచి తులసిచెట్టు, కల్పవృక్షం, కామధేనువు, అగ్నిస్తంభం, వీబూది స్తంభం, పంచకన్యలు, బట్టలు నేయటానికి సాలెన్న మొదలైన వారు పుట్టడం, చివరకు అమృతం పుట్టడం, విష్ణువు మంచి అందమైన స్త్రీవేషంలో వచ్చి రాక్షసులను, దేవతలను వేరువేరుగా కూర్చోబెట్టి దేవతలకు మాత్రమే అమృతాన్ని పంచడం మొదలైన కథ ఇందులో చెప్పబడింది.

ఈ కథాగేయం దేవతలు, రాక్షసులు సమావేశమై అమృతంకోసం సముద్రాన్ని చిలకాలని నిర్ణయించిన కథతో ఇలా మొదలవుతుంది.

"అరులూను సురులూను మునులూను దేవతలు - వారందరొక చోట కూడుకున్నారు
ఏడురోజుల పొద్దు ఏదాంత మాడినారు - అమురుతము తరుదుమని అయితి పడ్డారు"

సముద్రాన్ని చిలకడానికి కొండను కవ్వంగా చేయాలనుకున్నారు. వెంటనే వారందరూ కొండను తవ్వడానికి గల సామాగ్రితో బయలు దేరారు.

"పారలు గునపాలు పట్టుకున్నారు - తరిగొండ వద్దకు తరిలెల్లినారు
గునపాలతో కొండ గుందనము జేసేరు - పారతో నడిగొండ పాదొట్టితవ్వేరు
మామేల పర్వతం మట్టు గాయించి - గోనగిరి పర్వతం గోన గాయించినడు
సలచ్చ పరవతం సల్లరాటేసి - కనక తిరుమలకొండ తరికవ్వమాయె"

కవి వేంకటేశ్వర స్వామి భక్తుడు. కాబట్టే అతడు తిరుమల కొండను కనక తిరుమల కొండగా మార్చి దాన్ని దేవతలు, రాక్షసులు సముద్రాన్ని చిలకడానికి కవ్వంగా



చేసుకున్నట్లుగా రాశాడు. శిష్టసాహిత్యంలో మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని సముద్రాన్ని చిలికినట్లుగా చెప్పబడింది. జానపద కవి తిరుమల కొండను కవ్వంగా చేయవచ్చునా చేయకూడదా అని అతను ఆలోచించడు. తిరుమలకొండ తనకు ఇష్టం కాబట్టి ఆ కొండను తాను రాసే కథలో కవ్వంగా చేశాడు. ఇలాంటి మార్పులను శిష్ట కవులు కూడా తమ రచనల్లో చేశారు. నన్నయ్య తన భారతంలో తీర్థయాత్రలకు బయలు దేరిన అర్జునుడు వ్యాసభారతంలో లేని తెలుగునాట గల అనేక పుణ్యక్షేత్రాలను దర్శించినట్లుగా రాశాడు.

సముద్రాన్ని చిలకడానికి కనక తిరుమల కొండను తీసుకొని వచ్చారు. కానీ అంత పెద్ద కొండను చిలకడానికి తాడు లభించలేదు. తాడు కోసం దేవతలు, రాక్షసులు నలువైపులా వెదికారు. కానీ తాడు లభించలేదు. అప్పుడు వారు విష్ణువు దగ్గరకు వెళ్ళారు.

"పాలయంబుది మీద పయనమానారు - శెంకుసెక్కారాలు దశావతారుడా
కవ్వనికి తగ్గిన ఉరదాడు లేదు - ఏమి ఉరదాడెట్టి అంబుదులు దరిసేము
ఆ మాటలిన్నాడు నీలయెన్నుండు - శెంకుసెక్కారాలు దాశావతారుడు
ఇలపాలసంద్రాల జలిదొడ్డు కొచ్చెను - తన సేతి సెక్కరం దరిని నాటేసి
దరిని ముట్టిన నాగుశేషువై పుట్టెను - దరిమీద పారేటి శేషువును బట్టి
దరి కవ్వమాచుట్టు ముమ్మారు దిప్పె"

విష్ణువు ఆదిశేషుని సృష్టించి దాన్ని కవ్వానికి తాడుగా చేశాడు. మునులు దేవతలు ఒకవైపు రాక్షసులు మరొక వైపు ఆదిశేషుని పట్టుకొని సముద్రమథనం చేస్తున్నారు. అలా చేస్తున్నప్పుడు పొరపాటున మునులు, దేవతలు శివశివా! అని శివుని తలచు కున్నారు. తాను దగ్గర ఉండి సముద్రమథనానికి సహాయం చేస్తుంటే తనని తలచు కోకుండా ఎక్కడో దూరంగా ఉన్న శివుణ్ణి తలచుకున్నందుకు విష్ణువు కోపగించి మునులు దేవతల వైపు కొండను ముంచి వేస్తాడు. అప్పుడు వారు హాహాకారాలు చేస్తూ, అంతలోనే తాము చేసిన తప్పు జ్ఞాపకం వచ్చి నారాయణా అని విష్ణువును తలచుకుంటారు. అప్పుడు విష్ణువు తాబేలు రూపంలో కొండ కిందకు వెళ్ళి దాన్ని లేపి నిలబెట్టి తిరిగి కవ్వంగా చేసి సముద్రమథనానికి తగిన విధంగా చేస్తాడు.

జానపద కవులు తమ సాహిత్యంలో దేవతలకు కూడా జానపద మనస్తత్వాన్ని ఆపాదిస్తూ ఉంటారు. లోకంలో ఎవరైనా మరొకరికి సహాయం చేస్తూన్నప్పుడు సహాయం పొందినవారు సహాయం చేసిన వ్యక్తిని తలచుకోకుండా ఇతరులను తలచుకుంటే సహాయం చేసిన వ్యక్తికి కోపం రావడం మానవ సహజం. మానవ సహజమైన ఇలాంటి మనస్తత్వాన్ని జానపదకవి విష్ణువుకు అంటగట్టాడు.

ఆ తరువాత మునులు రాక్షసుల సముద్ర మథనాన్ని చేయడం ప్రారంభించారు. దాన్ని జానపదకవి ఇలా వర్ణించాడు.

"అనుకోనంబుదులు పూని దరిసేరు - పట్టి తరసీనారు పాలసంద్రాలు
గుబగుబన సంద్రాలు గూనదరిసేరు - పట్టిదరిసీనారు పాలసంద్రాలు
మిన్నందు సంద్రాలు మిడతలై దూలె - ఎన్నముద్దల నాగ ఎగిరె సంద్రాలు
అనుకోనంబుదులు పూని దరిసేరు - సల్లనురగలు గమ్మె సత్తి సంద్రాలు
గంగ వలన సల్ల సమకరిల్లేను - అనుకోనంబుదులు పూని దరిసేరు
అళ్ళుపట్టి దరిసీనారు పాలసంద్రాలు"

పై వర్ణన పెరుగును పెద్ద కుండలో పోసి కవ్వంతో చిలికేటప్పుడు ఉన్న పరిస్థితిని చక్కగా కవి వివరించాడు. అలా చిలుకుతున్నప్పుడు మొట్టమొదట సముద్రంలో నుంచి తులసి చెట్టు పుట్టింది. తులసి చెట్టును దేవతలు తీసుకొని వెళ్ళి నల్లరేగడి భూమిలో నాటి నీళ్ళు పోశారు. తులసిచెట్టు పెద్దపెద్ద కొమ్మలతో విస్తరించిందట. ఆ తర్వాత సముద్రమథనం చేస్తూఉంటే అందులోనుంచి పుట్టిన అనేక వస్తువులు ఇలా చెప్ప బడ్డాయి.

"కోటేల జీవులు పుట్టెనంబుదిలో - ఎలకనగ చిలకనగ పామనగ పచ్చనగ
కోటీల జీవులు పుట్టెనంబుదిలో - అయిదీసి దేవత లొడ్డునేసేరు
ఇలమీద జీవులను ఇడిచేసినారు - మళ్ళేమి గలుగునని మళ్ళ దరిసేరు
కల్పరుచ్చం బుట్టె అంబోదిలోన - అయిదీసి దేవతలొడ్డు నేసేరు
మళ్ళేమి గలుగునని మళ్ళ దరిసేరు - కామధేనువు బుట్టె అంబోదిలో
అయిదీసి దేవతలొడ్డు నేసేరు - మళ్ళేమి గలుగునని మళ్ళదరిసేరు
కామధేనువు గాయ నందురుడు బుట్టె"

సముద్రమథన సందర్భంలో జీవులన్నీ సముద్రం నుంచి పుట్టాయని జానపద కవి చెబుతున్నాడు. ఎలక, చిలుక, పాము, పక్షి మొదలైనవన్నీ అందలో నుంచి పుట్టాయట. ఆ తర్వాత కల్పవృక్షం, కామధేనువు, కామధేనువును కాయడానికి నందుడు, తెల్ల ఏనుగైన ఐరావతం, సన్నజాజి, సంపెంగ మొదలైన పూలచెట్లు, వస్త్రాలను తయారు చేయడానికి అవసరమైన పత్తిచెట్టు మొదలైనవి పుట్టాయి. ఆ తర్వాత వ్యవసాయ పనిముట్లు తయారు చేయడానికి అవసరమైన కమ్మరి కొలిమి, సుత్తి, కారు మొదలైనవి పుట్టాయి. సముద్రాన్ని ఇంకా చిలుకుతూ ఉంటే వీబూది స్తంభం, అగ్నిస్తంభం, నామసిరిస్తంభం అనే మూడు స్తంభాలు పుడతాయి. వీబూది స్తంభాన్ని ఈశ్వరుడు, అగ్నిస్తంభాన్ని బ్రహ్మ, నామసిరి స్తంభాన్ని విష్ణువు తీసుకుంటారు. ఆ తర్వాత మండోదరి, తార, ఆవెల్లి అనే ముగ్గురు కన్యలు పుడతారు. మండోదరిని రావణునికి,



తారను వాలికి, ఆవెల్లిని అగస్త్యమహర్షికి ఇచ్చివేస్తారు. ఆకాలంలో స్త్రీపురుషులందరూ ఎలాంటి ఆచ్ఛాదన లేకుండా దిగంబరంగా ఉంటారు. అందుకని విష్ణువు తన చంకలో నుంచి సాలెన్నను పుట్టించి మనుష్యులు కట్టుకోవడానికి అవసరమైన వస్త్రాలను నేయమని చెబుతాడు. సాలెన్న అనేక రకాల చీరలను నేస్తాడు. ఆ చీరలను మండోదరి, తార మొదలైన స్త్రీలకు ఇస్తారు.

ఆ సమయంలో ఏనుగుకు, దోమకు ఉన్నంత తేడా ఆడవారికీ మగవారికీ ఉందట. అందువల్లనే ఆడవాళ్ళకి ప్రతినెల ఐదు రోజులపాటు ముట్టులో రక్తం పోయే లాగా చేసి వారి బలాన్ని విష్ణువు తగ్గించినట్లుగా జానపదకవి ఇలా రాశాడు.

"ఏనుక్కి దోమకి ఏరీతిగున్నాది - ఆడోరికి మగవారి కారీతిగున్నాది
ఈరీతి కలియుగము నిలవదని - నేనాడవారి లావు రదమడుపుతాను
రత్తమాంసాలు రయిము జేసి - అయిదు రోజులు రత్తమాంసాలు రయిము జేసి
సేనాడవారి లావు రదమడిపినాను"

ఆ సమయంలో ఎవరికీ తినడానికి తిండి లేదట. అప్పుడు విష్ణువు పై లోకానికి వెళ్ళి అగ్నిదేవుణ్ణి తెచ్చి అగ్గికి - కర్రకు, నీళ్ళకు - బియ్యానికి, ఉప్పుకు - కారానికి, స్త్రీకి - పురుషునికి లంకె ఏర్పాడు చేసినట్లుగా జానపదకవి ఇలా రాశాడు.

"తినవకూడు నేదు తిరిలోకమందునా - ఎగవ లోకం మిగల ఎలిసె నాసోమి
అగిని దేముణ్ణి కోరి తెచ్చె నాసోమి - అగ్గికి కర్రాకి జత చేసినాడు
నీళ్ళకు బియ్యానికి తోడు జేసేను - ఉప్పుకీ వర్రకీ జత చేసినాడు
అన్నానికి ప్రాణానికి నంకేసినాడు - స్తిరియకు పురుసున్ని తోడు జేసేను"

ఆ తరువాత దేవతలు రాక్షసులు ఇంకా సముద్రాన్ని మథిస్తూ ఉంటారు. అప్పుడు ఆదిశేషుడు అలసిపోయి రక్తం కక్కాడట.

"అనుకోనంబుదులు పూని దరిసేరు - మలయేసి శేషువును మళ్ల దరిసేరు
రయిదప్పి శేషువుడు రత్తాలు గక్కె - మంచు వల్లన యిసము ముందుకెళ్ళేను
వానచినుకు కన్న వడితరచు నెళ్ళేను - కలియ దాపారాలు కమ్ము కెళ్ళేను
నేను పానుపట్నం నుండి చూసినానమ్మ - ఈ రీతి కలియుగం నిలవదన్నాడు
ఇక ఉండదో కలియుగం మండిపోతాదని - పోకన్న యాయిసము పోగుజేసేను
మూడు వంతులు జేసి పంచినానమ్మ - రావయ్య యిల బ్రమ్మ రమ్మంట బిలిచి
ఎత్త రాయిల బ్రమ్మ వొంతెత్తమంటే - ఒంతువల్లన బ్రమ్మ ఓడిపోనాడు
పాలు వల్లన బ్రమ్మ పాలిపోనాడు - ఆ వంతు ఈవంతు కలిపేసుకొని
ఈ యిసము ఆ యిసము కలిపేసి - అస్త్రాల ఆయిసము అందుకొనె శివుడు

అందుకో నాసోమి అంగుడిలో బోసె - నోపలికి పోకన్న పైకి రాకన్న
కంఠాన్ని ఆయిసము కాలిపోతన్నాది - యిసము యేడికి సోమి నిలవ లేపోనాడు
శివగంగను దెచ్చి శిరసుపై నిలిపినాను - మూర్చాదులైనాడు ఆయేళ శివుడు
దేవాన దేవతలు కూడుకున్నారు - సురకోటి దేవతులు కూడుకున్నారు
సుట్టేసి దేవుతులు కూడుకున్నారు - తెల్లవోరిన దాకా జాగరం జేసినరు
శివరాతిరామాస శివుడి జాగరము- తెల్లగా తెల్లోరి సల్లగాలూరె"

ఆదిశేషుని కొండకు చుట్టి దేవతలు రాక్షసులు చెరొక పక్క పట్టుకొని చాల రోజుల నుంచి చిలుకుతూ ఉండడం వల్ల అతడు అలసిపోయి రక్తం కక్కాడు. రక్తంతో పాటు విషం కూడా కక్కాడు. ఆ విషం మంచులాగా ముంచుకెళ్తూ ఉంది. వాన చినుక కంటే వేగంగా వ్యాపిస్తూ ఉంది. అప్పుడు విష్ణువు చూసి ఆ విషం నుంచి ముల్లోకాలను రక్షించాలని భావించి విషం మొత్తాన్ని పోగుజేసి త్రిమూర్తులకు ముగ్గురికీ మూడు భాగాలుగా చేస్తాడు. మొదటి భాగాన్ని బ్రహ్మను తీసుకోమని చెబుతాడు. ఐతే ఆ విషాన్ని మింగడానికి బ్రహ్మ భయపడతాడు. అప్పుడు శివుడు బ్రహ్మ భాగానికి వచ్చిన విషాన్ని, తన భాగానికి వచ్చిన విషాన్ని కలిపి నోట్లో వేసుకొని కంఠం దగ్గర ఉంచుతాడు. ఆవిషాగ్నికి ఈశ్వరుని కంఠం కాలిపోతూ ఉంటుంది. విషతీవ్రతను తట్టుకోలేక ఈశ్వరుడు మూర్ఛపోతాడు. అప్పుడు విష్ణువు అతనికి చల్లదనం కలిగించడానికి గంగను తెచ్చి శివుని శిరస్సు మీద పెడతాడు. దేవతలందరూ అక్కడకు వచ్చి తెల్లవారే వరకు ఈశ్వరునికి సేవలు చేస్తూ జాగరణ చేస్తారు. తెల్లవారిన తర్వాత విష్ణువు మంత్రించిన వీబూది శివుని మీద చల్లగానే శివుడు మూర్ఛ నుండి తేరుకుంటాడు. శివునికి పరిచర్యలు చేస్తూ దేవతలందరూ జాగరణ చేసిన ఆ రోజు శివరాత్రిగా పరిగణింపబడింది. అప్పటి నుంచి ప్రజలు శివరాత్రినాడు జాగరణ చేస్తూ ఉన్నారు.

శిష్ట సాహిత్యంలో పాలసముద్రం నుంచి హాలాహలం పుట్టినట్లుగా చెప్ప బడింది. జానపదకవి ఇక్కడ కథను మార్పు చేసి విషాన్ని ఆదిశేషుడు కక్కినట్లుగా చెప్పాడు.

చివరకు పాలసముద్రం నుంచి అమృతం పుడుతుంది. అమృతం కోసం దేవతలు, రాక్షసులు దెబ్బలాడుకుంటూ ఉంటారు. అప్పుడు విష్ణువు అందమైన స్త్రీ వేషాన్ని ధరించి అక్కడకు వచ్చి దేవతలను, రాక్షసులను శాంతింప జేసి దేవతలను ఒక వరుసలో రాక్షసులను ఒక వరుసలో కూర్చుండబెట్టి రాక్షసులు ఎవరూ దేవతల వరుసలో కలవకుండా సూర్యుణ్ణి, చంద్రుణ్ణి కాపలాగా ఉంచి మొదట దేవతల వరుసలో అమృతాన్ని పంచుతూ ఉంటాడు. అప్పుడు రాక్షసుల్లో ఒకరు దేవతల్లో కలసిపోయి ఉంటాడు. ఆ విషయాన్ని సూర్యుడు, చంద్రుడు స్త్రీ వేషంలో ఉన్న విష్ణువుకు చెబుతారు.



విష్ణువు కోపంతో అతని శిరస్సుని ఖండిస్తాడు. అతను అప్పటికే అమృతం తాగటం వల్ల శిరస్సు ఖండింపబడినప్పటికీ చనిపోకుండా మొండెం రాహువుగాను, శిరస్సు కేతువుగాను మారి సూర్యుణ్ణి, చంద్రుణ్ణి పట్టుకుంటారు. అప్పుడు లోకాలన్నీ చీకటితో నిండిపోతాయి.

"సూరుసెంద్రాజులని పట్టుబట్టేరు - సూరుసెంద్రాజులని పట్టుబట్టితేని
అష్టలోకము సిట్టిసీకటైనాది - ముందలా నరయావతారముడతాది
మూడుమాలే నరులు పుట్టనున్నారు - ఇక ఈ రీతిగ కలియుగం నిలవదని
అష్టభూలోకాల కాదినారాయణ - అవునోయి రాచ్చసులు ఔనంతవారు
ఎప్పుడా రూపాలు మీకిచ్చుతాను - సూరుసెంద్రాజులను పట్టు లొదలాల
ఏమంట పలికారు రాచ్చసు లప్పుడు - ఈలోక మాలోకమున్నంత కాలము
సూరు సెంద్రాజులు పట్టులుండాల - ఏడాదికొకసారి పట్టులుండాల
పాపాత్ములందరూ పాము పట్టంటారు - గేనస్తులందరు గ్యాన పట్టంటారు
ఏడాది కొగ్గాసమిచ్చెనా సోమి"

రాహువు కేతువులు సూర్యచంద్రులను పట్టుకోవడం వల్ల ఏర్పడిన చీకటిని పోగొట్టడానికి విష్ణువు వారితో ఒక రాజీ సూత్రాన్ని చెప్పి ఒప్పిస్తాడు. దాని ప్రకారం రాహుకేతువులు అప్పటికి సూర్యచంద్రులను వదలిపెట్టాలి. సంవత్సరానికి ఒకరోజు వారు సూర్యచంద్రు లను పట్టుకోవచ్చు. వారు అలా పట్టుకోవడాన్ని సూర్యగ్రహణం, చంద్రగ్రహణం అంటారు.

తరువాత జానపదకవి రావణుని గురించి ఒక కల్పన చేశాడు. అమృతం మొత్తాన్ని దేవతలకు పంచిన తరువాత రావణుడు వచ్చి విష్ణువును అమృతమిమ్మని ఇలా అడిగాడట.

"రావణాపురి నుండి రావణుడొచ్చేను - ఏదోయి ఆదిష్ణు ఆవురుతములేయి
ఏమంట పలికేను నీలయెన్నుండు - ఆవురుతము లేదురా రావణా అన్నాడు
అమూర్తకుంబాన్ని వరము లడిగేను - అముర్తకుంబాన్ని వరము లిచ్చాను
అముర్త కుంబాన్నే మింగేసినాడు - ఇక కుడిపక్క అవురుతము కుమ్మరాయేను
ఎడమ పక్కవురుతము కమ్మరాయేను - కమ్మరి కుమ్మరి యిద్దరానారు"

అమృతం లేకపోవడం చేత రావణాసురుడు అమృతం పంచిన కుండను విష్ణువు దగ్గర నుంచి తీసుకొని మింగుతాడు. అది అతని కడుపులో కుడి ఎడమల చేరుతుంది. కుడి పక్క చేరిన అమృతం కుమ్మరిగా, ఎడమ పక్కన చేరిన అమృతం కమ్మరిగా అవుతుంది. ఇంతటితో కూర్మావతారకథ ముగుస్తుంది.

ఈ కథాగేయంలో ముఖ్యమైన విషయం ఇప్పుడు లోకంలో ఉన్న అన్ని జీవులు సముద్రమథన సందర్భంగా పుట్టాయని చెప్పడం. అంతేగాకుండా ప్రస్తుతం లోకంలో

ఉన్న చాలా విషయాలను విష్ణువు ఇదే సమయంలో ఏర్పాటు చేసినట్లుగా కవి చెప్పాడు. మనుషులకు వస్త్రాలను నేసే సాలెన్నను సృష్టించడం, ఆడవారి బలాన్ని తగ్గించడానికి వారికి ప్రతినెలా ముట్లు ఏర్పాటుచేయడం, వంట వండుకోవడానికి అగ్గిని తేవడం, స్త్రీ పురుషులకు శారీరక సంబంధాన్ని కల్పించడం మొదలైనవి ఇలాంటివి. దశావతార కథా గేయాలను పాడే గాథాకారులు ఈ కథాగేయంలో చెప్పిన విషయాలు కవుల కల్పనలుగా భావించరు. అవన్నీ నిజాలని వీరు గట్టిగా నమ్ముతారు.

**3. మత్స్యావతారం :**

దశావతార కథల్లో ఇది మూడవది. ఇది ఇరవై అయిదు పుటల కథాగేయం శిష్టసాహిత్యంలో ఉన్న మత్స్యావతార కథకు జానపద కవి అనేక కల్పనలు చేశాడు. కూర్మావతారంలో పాలసముద్రాన్ని చిలుకుతున్నప్పుడు అందులో నుంచి మూడు స్తంభాలు పుట్టాయి వాటిలో వీబూది స్తంభాన్ని శివుడు, నామసిరి స్తంభాన్ని విష్ణువు, ఉక్కు స్తంభాన్ని బ్రహ్మ తీసుకొని ఉంటారు. బ్రహ్మ ఉక్కు స్తంభాన్ని ఒక చోట పాతి దాని చుట్టూ గడ్డివిత్తనాలు చల్లితే గడ్డి బాగా మొలుస్తుంది. బ్రహ్మ ఆ గడ్డికి కాపలా ఉంచుతాడు. దేవలోకం నుంచి ఒక గోవు ఆ గడ్డి తినడానికి వస్తుంది. కాపలా ఉన్నవాళ్ళు దాన్ని దూరంగా తోలుతారు. మరుసటి రోజు మళ్ళీ వస్తుంది. ఆ రోజు దాన్ని మళ్ళీ దూరంగా తోలబోతే అది పొడవబోతుంది. కాపలావాళ్ళు వెళ్లి బ్రహ్మకు గోవు విషయాన్ని ఇలా విన్నవించారు.

"కంబాన్ని మేము కాపులున్నప్పుడు- దేవేంద్ర సభ నుంచి దేనువొచ్చింది
సెంగలికి దేనువ చేను మరిగేను- తొలినాడు దేనువను తొలగదోలేము
మరునాడు దేనువ మళ్ళ తిరిగొచ్చె- మరునాడు దేనువ మళ్ళ దోలేము
మూడు రోజుల పొద్దు మళ్ళ తిరిగొచ్చె- చుట్లేసి దేనువును పట్టుకోబోతే
మంచాయి వస్తోంది మేగమై పోతోంది- అలవి గల దేనువ నాపలేపోనాము
నీ కొలువు కొలలేము మేముండలేము"

పచ్చని గడ్డి చుట్టూ గోవులు తిరగడం జానపదకవికి బాగా పరిచయం. పచ్చగడ్డి పట్ల గోవులకు గల ఆకర్షణ పై వాక్యాల్లో అతి సహజంగా వర్ణింపబడింది. ఈ వర్ణనతో పాటు కింది ఉపమానం ఎంతో రమణీయంగా ఉంది.

"చుట్లేసి ధేనువును పట్టుకోబోతే- మంచాయి వస్తోంది మెగమై పోతుంది"

శీతకాలంలో మంచు వర్షాకాలంలో మేఘం అందరికీ తెలిసినవే. మంచును కానీ మేఘాన్ని కానీ చూడని వారులేరు. పట్టుకొనగలగిన వారూ లేరు. జానపదకవి చక్కని సజీవమైన ఉపమానాన్ని ప్రయోగించాడు. మరుసటి రోజు బ్రహ్మ తానే గడ్డికి



కాపలాగా వెళ్ళి గోవును దూరంగా తోలతాడు. రెండవరోజు గోవు వస్తే మళ్ళీ అలాగే తోలతాడు. మూడవరోజు గోవు రాగా బ్రహ్మ కోపాన్ని ఆపుకోలేక వేదాలకట్టతో గోవు వీపు మీద కొడతాడు. ఆ దెబ్బకు అది చనిపోతుంది.

దేవతలందరూ వచ్చి తమ గోవును బ్రతికించమని చెప్పడంతో బ్రహ్మ గోవును తిరిగి బ్రతికిస్తాడు. అయినప్పటికీ గోవును కొట్టిన పాపం అతణ్ణి వదలలేదు.

"ఏ మంట పలికినదు బ్రమ్మదేవుండు- యేదపుస్తకాలు ఎంచి జూసేను
గోవు గొట్టినకొట్టు దోసమన్నాడు- ఎచ్చోట పాపాలు పాసునన్నాడు
కాశితానికే కదులు తున్నాడు"

పై వాక్యాలు భారతీయులకు గోవుపట్ల ఉన్న భక్తిని చాటుతూ ఉన్నాయి. గోహత్యా ప్రయత్నపాప నివారణకు బ్రహ్మ కాశీకి వెళ్ళినట్లు పైన చెప్పినప్పటికీ ఈ కథాగేయంలో బ్రహ్మ నిజంగా వెళ్ళింది విశాఖపట్నం దగ్గరలో ఉన్న సముద్రస్నానానికే.

"ముదుకుడ జలధిలో కెళ్ళె నిలబ్రమ్మ - ముడకుడ జలధిలో మునుమొకము గడిగి
సేరదు నీళ్లతో సెయి జబ్బ గడిగి- కాలూసేతులు శుద్ధి చేసుకున్నాడు
తలయొంటి జలదిలో కెళ్ళె నిల బ్రమ్మ- మూడు దోసులు గంగ ముందెత్తి పోసి
సూర్యనారాయణ దండమన్నాడు- శిరసు ముంచీనదు శ్రీకోనలోన
అంతలో యాబ్రమ్మ కతియ వేదుకు లొచ్చి- ఓల ఓలల బ్రమ్మ ఓలలాడేను
తలయదన్నెరుగక ఓలలాడేను- జలిదొడ్డు నేదాలు తల్లటించేను
ఉగమూను జగమూను ఉద్ధరించేదాలు- ఎండలో నేదాలు ఎండుతున్నాయి
కలియ దాపారాలు పాలించే నేదాలు- మంచులో నేదాలు మాగుతున్నాయి
ఇల మూదునోకాలు పాలించు నేదాలు- వానలో నేదాలు ఒదులుతున్నాయి
చావు పుట్టుక రెండు చదివేటి ఏదాలు- ఇసకలో నేదాలు ఇదులుతున్నాయి"

నదులు, కోనేర్లు, సముద్రం మొదలైన చన్నీటిలో స్నానం చేసేవారు మొదట మోకాలి వరకు నీటిలో దిగి ముఖం కడుక్కొని ఆ తర్వాత చేతులు, కాళ్ళు కడుక్కుంటారు. ఇలా చేయడం వల్ల మనిషి శరీరం చన్నీటికి కొంత అలవాటు పడుతుంది. అప్పుడు ఒకేసారి తలవరకూ చన్నీటిలో మునిగిపోతారు. జానపదులు చేసే ఈ చన్నీటి స్నాన విధానాన్ని జానపదకవి బ్రహ్మదేవునికి ఆపాదించి చెప్పాడు. శరీరం ఒకసారి చన్నీటికి అలవాటు పడిన తరువాత ఆచన్నీటి స్నాం చాల హాయిగా ఉంటుంది. నీళ్ళలో నుంచి బయటకు రావాలనిపించదు. అలాగే బ్రహ్మదేవుడు సముద్రంలో స్నానం చేస్తూ చన్నీటి స్నానంలో ఎంతో సుఖం ఉండటంవల్ల నీటిలో నుంచి బయటకు రాకుండా చాలసేపు స్నానం చేశాడు. దీన్నే జానపదకవి

"ఓల ఓలల బ్రమ్మ ఓలలాడేను- తలయ దన్నెరగక తానమాడేను
ఒళ్లు దన్నెరుగక ఓలలాడేను"

అని బ్రహ్మ ఒళ్లు తెలియకుండా చాలాసేపు స్నానం చేసినట్లుగా జానపదకవి చక్కగా చెప్పాడు.

ఎండలో వేదాలు ఎండటం, మంచులో వేదాలు మాడడం, వానలో వేదాలు వదలడం మొదలైన మాటలు వేదాలపట్ల జానపదులకు గల భక్తి విశ్వాసాలను తెలుపుతున్నాయి.

బ్రహ్మ ఒళ్లు, పై తెలియకుండా సముద్రపు ఒడ్డున పెట్టిన వేదాలను మరచిపోయి స్నానం చేస్తున్న విషయం విష్ణువు దివ్యదృష్టితో తెలుసుకొని ఎంతో ముఖ్యమైన వేదాలను నిర్లక్ష్యంగా వదలి వేసిన బ్రహ్మదేవునికి గుణపాఠం చెప్పాలని, తన సేవకుడైన సోరుగుడు అనే రాక్షసుని పిలిచి వేదాలను దొంగిలించి తెమ్మని చెబుతాడు. సోరుగుడు వెళ్ళి వేదాలను బ్రహ్మకు తెలియకుండా దొంగిలించి అందులో ఉన్న విషయాలను చదివి ఇలా భావిస్తాడు.

"ఇల మూడు నోకాలు ఇందలున్నాయి- బ్రమ్మ యావుసు లిందలున్నాయి
ఈశ్వరుండావుసు లిందలున్నాయి- ఆదిష్ణు యావుసు లిందలున్నాయి
సావు పుట్టుక రెండు ఇందలున్నాయి- ఇసిమంటి ఏదాలు ఇలదరుడికిస్తేను
ఇష్ణు నా ప్రాణాని కరదనుచుతాడు"

త్రిమూర్తుల ఆయుషుతోపాటు ముల్లోకాలకూ సంబంధించిన అన్ని విషయాలూ వేదాల్లో ఉన్నాయి. ఈ విషయాలను తాను తెలుసుకున్నానని విష్ణువుకు తెలిస్తే విష్ణువు తనను చంపవచ్చని సోరుగుడు భావించి వేదాలను మింగివేసి సముద్రం లోపల ఉన్న దొండగిరి పర్వతం కింద దాక్కుంటాడు.

వేదాల్లో అన్ని జీవుల ఆయుషులు ఉన్నాయనే విషయం అంత నమ్మదగినది కాకపోయినప్పటికీ ఆధునిక కాలంలో ఇలాంటి ఊహలతో చలనచిత్రాలు వచ్చాయి. 'యమలీల' అనే సినిమాలో అన్ని జీవుల జీవిత చరిత్రలను చెప్పే గ్రంథం 'భవిష్యవాణి' అనే పేరుతో యముని వద్ద ఉన్నట్లుగా చెప్పబడింది. అలాంటప్పుడు వేదాల్లో ముల్లో కాల్లోని అన్ని విషయాలకూ సంబంధించిన అంశాలు రాయబడి ఉన్నాయని జానపదులు భావించడం ఉచితమైనదే. ఏమైనా సోరుగుడు వేదాలను అపహరించడానికి గల కారణాన్ని కల్పించడంలో జానపదకవి కృతకృత్యుడయ్యాడు.

వేదాలను సోరుగుడు దొంగిలించిన తరువాత చాలసేపటికి బ్రహ్మ నీటిలో నుండి బయటకు వచ్చి తీరికగా ఒళ్లు తుడుచుకొని నామాలు పెట్టుకుంటుండగా అతనికి అకస్మాత్తుగా వేదాలు గుర్తుకొచ్చాయి.



"సన్నపాటి నామాలు సాదుకున్నాడు- ఏదాల మీద తనకేదస్తులొచ్చేను
ఏదాల కిలబ్రహ్మ ఎర్రుకున్నాడు- కన్నుల కేదాలు కానరాలేదు
దైవమా నేనేమి చేదునన్నాడు- దొడ్డవారేదాలు దోపుడైనాయి
కాని వారేదాలు కన్న బోనాయి- ఏదాలు కిలబ్రహ్మ ఎర్రుకున్నాడు
సుడిగాలి ఏసెను సుట్టుకొని పోయెనని-సుట్టు పన్నెండా మటెదికినడు బ్రమ్మ
పెనిగాలి యీసెను పెనుచు కొనిపోయెనని- పెండి కట్టెదికినడు బ్రమ్మదేవుండు
కన్నుల కేదాలు కానరాలేదు- గాలి కోంతేబోయి గౌతమును గలుసునని
నట్టేటి సంద్రాల నడుమ గట్టేసెను- కన్నుల కేదాలు కానరాలేదు
ఆవల సంద్రాల ఈవలకు తోడితే- కన్నుల కేదాలు కానరాలేదు"

అతిముఖ్యమైన వస్తువును ఒక చోటపెట్టి మరచిపోయి ఆ తర్వాత చాల సేపటికి ఆ వస్తువు జ్ఞాపకం వచ్చి దాని కోసం చూస్తే అది పెట్టిన దగ్గర కనిపించకపోతే మనం ఎంతో కంగారుగా అక్కడా ఇక్కడా వెదకి, వాళ్ళకు వీళ్ళను అడిగి ఆ వస్తువు ఆ చూకి కోసం ఎంతగానో ప్రయత్నిస్తాం. అలాగే బ్రహ్మదేవుడు గంగానది ఒడ్డున పెట్టిన వేదాలు కనిపించక పోవడం చేత చుట్టుపక్కల అన్ని చోట్లా వెతకినట్లు జానపద కవి చక్కగా రాశాడు. "ఏదాలకిల బ్రమ్మ ఎర్రుకున్నాడు" అని చెప్పడంలో బ్రహ్మ పిచ్చెత్తి నట్లుగా వేదాలకోసం వెదికినట్లుగా చెప్పబడింది.

ఆ తర్వాత బ్రహ్మ వేదాల గురించి సూర్యుణ్ణి, చంద్రుణ్ణి అడుగుతాడు. వారు తమకు తెలియదంటారు. వెంటనే బ్రహ్మ సముద్రంలో వేగంగా ఈదుకుంటూ విష్ణువు దగ్గరికి వచ్చి వేదాలు పోయిన విషయాన్ని చెబుతాడు. విష్ణువు మొదట కోపించి ఆ తర్వాత వేదాలు ఎక్కడున్నా వెదకి తీసుకొని వస్తానని బ్రహ్మకు చెప్పి మత్స్యావతారం ధరించి సోరగుని కోసం సముద్రం అంతా వెతుకుతాడు. సోరుగుడు కనిపించక పోవడం చేత విష్ణువు సముద్రంలోని నీటిని మొత్తాన్ని తాగి పుక్కిట పడతాడు. సోరగుడు దాక్కున్న దొండగిరి పర్వతం బయటపడుతుంది. వెంటనే విష్ణువు పుక్కిట పట్టిన నీటిని వదలివేసి దొండగిరి పర్వతం కింద దాక్కున్న సోరుగుని బయటకు లాక్కొని వచ్చి వాడి వెన్ను చీల్చి అతడు మింగిన వేదాలను బయటకు తీసి తెచ్చి బ్రహ్మకు ఇస్తాడు.

ఈ విధంగా చిన్నదైన మత్స్యావతార కథను జానపదులకు ఆహ్లాదం కలిగించే కల్పనలతో జానపదకవి చేసిన ఈ కథాగేయం రసవంతంగా ఉంది.

**4. కొమ్మల వరాహావతారం :**

శిష్ట సాహిత్యంలో దీనిపేరు వరాహావతారం మాత్రమే. జానపద సాహిత్యం లోని దశావతార కథల్లో తొమ్మిదవదిగా మరొక వరాహావతార కథ ఉంది. ఆ కథ నుంచి ఈ కథను వేరుగా చెప్పడానికి వీలుగా దశావతార గాథాకారులు దీన్ని కొమ్మల వరాహావతారం అని పిలుస్తారు. ఇందులో విష్ణువు వరాహరూపాన్ని ధరించి కనకా ర్జునుని (హిరణ్యాక్షకుని) సంహరిస్తాడు. వరాహానికి కోరలు ఉంటాయి. ఆ కోరలను దశావతార గాథాకారులు కొమ్ములుగా భావించి ఈ కథను కొమ్మల వరాహావతారం అని పిలుస్తారు.

ఈ కథ ఆరుపుటల చిన్న కథాగేయం. ఈ చిన్నకథలో జానపదకవి అనేక మార్పులు చేశాడు. శిష్ట సాహిత్యంలోని హిరణ్యాక్షుని పేరు ఇందులో కనకార్జుడుగా మార్చబడింది. ఇతని భార్య గజాసుందరిదేవి. ఈమె గర్భవతిగా ఉన్నప్పుడు ఆమెకు ఎలాంటితినుబండారాలు కావాలో తెలుపవలసిందిగా కనకార్జుడు ఇలా అడుగుతాడు.

"అవుదువే సుందరీ అవునంతాదానా - మద్రాసి తేనెలు మంచి పలములుగలవు
మనసయితే మమ్మడుగు సుందరన్నాడు -టెంకాయ కొబ్బరులు తేనెయరటి పళ్ళు
మనసయితే మమ్మడగు సుందరన్నాడు - నాను బిందరసీలు నల్లయరటిపళ్లు
మనసయితే మమ్మడుగు సుందరన్నాడు - కర్జూర కిసిమీసి కమలాసి పలములు"

తేనె, పళ్ళు, కొబ్బరికోరు, చెక్కరకేళి అరటిపళ్ళు, ఖర్జూరం, కిస్‌మిస్ పళ్ళు, కమలా పళ్ళు మొదలైనవి ఏవి కావాలో కోరుకోమని కనకార్జుడు తన భార్యను అడుగుతాడు. ఇవన్నీ గ్రామీణులు వాడే ఆహార వస్తువులు. జానపదకవి తాము తినే ఆహార పదార్థాలను కనకార్జునుని చేత తన భార్య పరంగా చెప్పించాడు. గ్రామాల్లో ఉండే గర్భవతులైన స్త్రీలు చిన్నచిన్న నల్లమట్టి గడ్డలను తింటూ ఉంటారు. గజాసుందరి భర్త చెప్పిన పై పళ్ళను కోరుకోకుండా తాను తినడానికి నల్లరేగడి మట్టి కావాలని కోరుతుంది. కనకార్జుడు నల్లరేగడి కోసం భూమండలమంతా వెదుకుతాడు. ఐతే అతడు నల్లరేగడి మట్టి తెలుసుకోలేక భూమండలం మొత్తాన్ని భార్యముందు పరిస్తే ఆమే నల్లరేగడిమట్టి ఏరుకొని తింటుందని భావించి భూమిని చాపచుట్టగా చుట్టి చంకలో పెట్టుకొని భార్యదగ్గరకు వెళ్తూ వుంటాడు. అప్పుడు నారదుడు విష్ణువు దగ్గరకు వెళ్ళి కనకార్జుడు భూమిని తీసుకొని వెళ్తున్న విషయాన్ని ఇలా చెబుతాడు.

"ఏమంట పలికినడు నారదబ్రహ్మ - శెంకు సెక్కారాల దశావతారుడా
ఇకనేమిటున్నాది యుగము గుంగింది - కష్టబడి ఆదరిని బుట్టించినావు
పాడుజేస్తండు కనక కారుజుండు - ఇకనేమిటున్నాది ఈ జగములోన



ఆడు సాప జుట్టాదరణి సంకా బెట్టుకొని - పట్టుకెలతన్నాడు కనకారుజుండు"

విష్ణువు కష్టపడి సృష్టించిన భూమిని కనకార్జుడు చాపచుట్టగా చుట్టి పాడు జేస్తున్నాడని చెబుతాడు. అప్పుడు విష్ణువు కొమ్మల వరాహావతారమెత్తి కనకార్జుని ఎదిరించి కోరలతో అతణ్ణి చంపి భూమిని యధాప్రకారంగా చేసినట్లుగా జానపదకవి ఇలా చెప్పాడు.

"సాపానల్లడ బూమి బలపరచినాను - పట్టి బూసాదరిని బలపరిచినాను
నాటుకో నాబూమి నలగదున్నాను - నాలుగేసాలకే నలగ దున్నాను
ఉత్తర దచ్చినానికి సాలోసినాను - తూరుపుకి పడమటికి సాలోసినాను
ఎంచి బూసీనాను ఎండిగొలుసుల్ని - పట్టి బూసినాను పైడి గొలుసుల్ని
నాటుకో నాబూమి నలగదున్నాను - నాగటాసారమున నవరుసులు బండే
అన్ని శివజంతువులకు ఆరమేసేను"

విష్ణువు కనకార్జునుని నుంచి భూమిని రక్షించి దాన్ని యధాప్రకారం చేయటమే గాకుండా భూమిని నాగలితో దున్ని పంటలు పండించి అన్ని జీవులకు ఆహారం వేశాడట. వ్యవసాయదారుడైన జానపదకవి శ్రీమహావిష్ణువును కూడా వ్యవసాయదారునిగా చిత్రించాడు. ఈ కల్పన చక్కగా ఉంది.

**5. నరసింహావతారం :**

నరసింహావతారం అరవైఆరు పుటల కథాగేయం. శిష్ట సాహిత్యంలోని నర సింహావతార కథకు అనేక మార్పులు చేసి జానపదకవి ఈ కథాగేయాన్ని రాశాడు. ఇందులో హిరణ్యకశ్యపుని పేరును ఇలనార్జుడుగా ప్రహ్లాదుని పేరును వవనార్జుడుగా మార్చాడు. ఇలనార్జుడు మొదట విష్ణుభక్తుడే. ఐతే విష్ణువు వరాహావతారమెత్తి ఇతని అన్న కనకార్జునుని చంపడం వల్ల ఇతడు విష్ణువు మీద పగబట్టి ఆ పగసాధించడం కోసం మరణం లేకుండా వరం పొందడానికి విష్ణువు గురించి తపస్సు చేస్తాడు.

"ఇలనార్జుడన్నోడు యిష్ణుభక్తుడు గాదా - ఆదియిష్ణుడు వరావు తారంబులను ఎత్తి
ఘనుడు మాయన్న కనకార్జునుని జంపె- ఆయనపై నేనుండి అన్న జంపిన పగలు
సాదిస్తునని జెప్పి చాల చింతించె - ఇరుతోలు చర్మంబు పట్టుకున్నాడు.
గోరమైనవి మంచి కారుటడవుల్లోన - ఇరుతోలు చర్మంబు ధరణిపై నేసి
సూదిమీదను సూది సూత్రంగ నిలిపె - ఏడు సన్నసూదు లేకంగ నిలిపె
సన్నసూదుల మీద సాయబాకుల్లు - అందమీద రుద్రాచ్చుల మరించినాడు
శిరసు కిందకు బెట్టి సిరిపాదములు ఎత్తి - తల్లకిందల పూజ తపసు జేసేను
ఏలియే నరయాలు ఎక్కులెట్టేను - మోచేతి నరయాలు కీళ్ళు దిప్పేను
ఒంటియే నరయాలు వాటముగ బన్నెను - కీళ్ళు దిప్పి కిన్నెర పాట బాడేను

సన్నప్ప రాగాలు కిన్నెరే పాటలు - కిన్నెర పాటలకు కీర్తరాగములు"

శిష్ట సాహిత్యంలోని తపస్సు వర్ణనకు జానపద సాహిత్యంలోని తపస్సు వర్ణనకు చాల తేడా ఉంటుంది. శిష్టసాహిత్యంలో ఆహారం మానివేసి వాయు భక్షన చేస్తూ ఒంటికాలి మీద నిలబడి తపస్సు చేస్తున్నట్లుగా చెప్పబడుతుంది. అంతేగాకుండా వర్షాకాలం వర్షంలో తడుస్తూ, శీతాకాలం గొంతు వరకు నీళ్ళలో మునిగి, ఎండాకాలం నాలుగు వైపులా అగ్ని పెట్టుకొని అగ్ని నడుమ తపస్సు చేస్తున్నట్లుగా చెప్పబడుతుంది. జానపద సాహిత్యంలో తపస్సు చేసేవారు జింక చర్మాన్ని భూమి మీద పరచి దాని మీద సూది మీద సూది గుచ్చుతూ ఆవిధంగా ఏడు సూదులు గుచ్చి, ఆ ఏడు సూదుల మీదా బాకులు నిలువుగా పెట్టి ఆ బాకులు మీద రుద్రాక్షలు పెట్టి ఆ రుద్రాక్షల మీద తపస్సు చేసే వారు తలకిందుగా ఉండి తపస్సు చేస్తున్నట్లుగా చెప్పబడుతుంది. పై గేయంలో ఇలానార్జుడు అదేవిధంగా తపస్సు చేశాడు. ఈ విధమైన తపోవర్ణన తపస్సును వర్ణించే అన్ని కథాగేయాల్లోనూ కనిపిస్తుంది. అందువల్లనే దీన్ని ఒక వారానువర్తనంగా చెప్పవచ్చు. ఇలనార్జుడు పైన చెప్పిన విధంగా తపస్సు చేసిన తరువాత తన శరీరం లోని చేతులకు, మిగిలిన ఒంటిమీద ఉన్న నరాలను బయటకు లాగి ఆ నరాలతో సంగీతాన్ని వాయిస్తూ కిన్నరపాటలు పాడాడు. విష్ణువును స్తుతిస్తూ కీర్తనలు పాడాడు.

ఈ విధంగా చేసిన ఇలనార్జుని తపస్సుకు మెచ్చి విష్ణువు అతనికి ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమంటాడు. అప్పుడు ఇలానార్జుడు -

"శెంకు సెక్కారాల దాశావతారా - అష్టభూలోకాల కాదినారాయణ
ఏవరములైతేమి తమకేమి కొదవ - పొగలు నాలుగుజాలు పొద్దుబోయినదాక
మరణంబులేకన్నా వరము దయసేయు - రాత్రి నాలుగుజాలు తెల్లవోరినదాక
మరణంబు లేకుండ వరము దయసేయు - ఇందు అందన దగదు ఎందు సావులులేని
అంద సావులు లేని వరము దయసేయు - ఆవరము దయసేయుమయ్య పరమేశ"

పగలు గానీ, రాత్రి గానీ, ఇక్కడ అక్కడ అని గాకుండా ఎక్కడా చావు లేని వరాన్ని ఇవ్వమని ఇలనార్జుడు కోరుకుంటాడు. విష్ణువు ఆ వరాన్ని ఇస్తాడు. ఆ తరువాత ఇల నార్జుడు తన అన్న కనకార్జుడు చనిపోయిన మైల పోగొట్టుకోవడానికి, అతని అస్తికలు కాశీలో ఉన్న గంగలో కలపడానికి కాశీకి వెళ్ళి, అన్న అస్తికలను గంగలో కలిపి, తాను గంగానదిలో స్నానం చేసి, అక్కడున్న శైవమునులను "నాకు అడ్డగా ఈబూది బొట్టు, గావాల" అని అడుగుతాడు. బహుశా దీని భావం శైవదీక్ష అయి ఉంటుంది.

"అడ్డుగా ఈబూది బొట్లు ఇవ్వడము - మావశముగాదయ్య ఇలనారజుండ
అష్టమైనది మంచి కారుటడివిలకెళ్ళి - సుష్టితో శివపూజ చెయ్యమన్నారు"



మునులు అడ్డగా బొట్టు ఇవ్వడం తమ వల్ల కాదని దానికోసం శివుని గురించి తపస్సు చేయమని చెబుతారు. ఇలనార్జుడు మళ్ళీ అడవికి వెళ్ళి శివుని గురించి తపస్సు చేస్తాడు. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు. అప్పుడు ఇలనార్జుడు -

"పచ్చ తులసోనాలు పట్నమున లేకన్నా - ఆ వరము దయసేయు మయ్యపరమేశ
నారాయణనియేటి నామబక్తులనెల్ల - నాలికలు గొయ్యమని నాకు సెలవియ్యి
ఆ వరము దయసేయుమయ్య పరమేశ"-

అని కోరుకుంటాడు. ఇలనార్జుడు విష్ణువు మీద పగ బట్టి అతణ్ణి పూజించడం మాని వేసి కొత్తగా శైవాన్ని స్వీకరించి నారాయణ అని స్మరించే విష్ణుభక్తుల నాలుకలు కోయడానికి అనుజ్ఞ ఇమ్మని ఈశ్వరుని కోరాడు. ఈశ్వరుడు ఆ వరాన్ని ఇస్తాడు.

ఆ తరువాత ఇలనార్జుడు తన రాజ్యానికి వచ్చి భూమి మీద ఉన్న విష్ణు భక్తులందరినీ హింసించడం మొదలు పెట్టాడు. దానితో విష్ణుభక్తులు, దేవతలు అతని బాధలకు తట్టుకోలేక విష్ణువు దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకుంటారు. అప్పుడు విష్ణువు -

"ఏదపుస్తాకాలు ఎంచి జూసేను - ఆకుపై యచ్చురాలమరగుణమించె
ఎందునా ఇలనార్జు సావు లేదాయె - నాముగోళ్ళూ వరము నాడివ్వలేదు
వాని కడుపున ఒక్క సుతుని బుట్టించి - ఈనికానికి తరకవాద నెడతాను
ఎల్లండ దేవతలు ఎళ్ళమన్నాడు"

ఇలనార్జున్ని ఎలా చంపాలా అని విష్ణువు వేదపుస్తకాల్లో చూశాడట. అందులో ఎక్కడా ఇలనార్జుని చావు కనపడదు. ఐతే విష్ణువు గోళ్ళతో ఇలనార్జునికి చావు లేకుండా వరమివ్వలేదు. అందువల్ల ఎలాంటి ఆయుధం లేకుండా గోళ్ళతో అతణ్ణి చంపాలని విష్ణువు భావిస్తాడు. ఐతే అకారణంగా ఇలనార్జుని చంపడానికి వీలు కాదు. అందువల్ల ఇలనార్జుని కడుపున ఒక విష్ణుభక్తుని పుట్టించి వారిద్దరి మధ్య వైరాన్ని పెంచి ఆ విష్ణుభక్తుని రక్షించే మిషతో ఇలనార్జుని చంపవచ్చునని భావిస్తాడు. ఆ తరువాత విష్ణువు ఇలనార్జుని భార్య అయిన ఇవలాంగిదేవికి సంతానం మీద కోరిక కలగ జేస్తాడు. జాన పదకవి సంతానం కోసం ఇవలాంగి చేసిన ప్రయత్నాన్ని చాల వివరంగా ఇలా రాశాడు.

"పూరమైనా నదులు పున్నెచేత్రములు - అటువంటి నదులల్ల తాన్నములు జేసె
దివ్వె తిరపతులన్ని తిరిగి మొక్కిన గాని - ఆంద పున్నెము లేదు ఇవలాంగిదేవి
అందల్ల సంతనము ప్రాపతులు లేవు - అప్పికొండ సోమన్న మాదొడ్దేముడని
అపికొండ సోమన్న నోము నోసేను - గుడిగట్టి గుడిమీద సిగిల మెత్తేను
గుడి చుట్టు బంగారు తీగులమరించె - ఆపైన పూర్వకుండమరంగ నిలిపె
ఆందల్ల సంతనము ఫలము లేపోయె - రాంగుళ్ళు రామన్న మాదొడ్డ దేవుడని

రాంగుళ్ళు రామన్న నోము నోసేను - గుడి గట్టి గుడి మీద సిగల మెత్తేను
గుడి చుట్టు బంగారు తీగులమరించె - ఆపైన పూర్వకుండమరంగ నిలిపె
అందల్ల సంతనము ఫలము లేపోయె - ఉత్తాడ మల్లయ్య మాదొడ్డదేవుడని
ఉత్తాడ మల్లయ్య నోము నోసేను - గుడి గట్టి గుడి మీద సిగల మెత్తేను
గుడిచుట్టు బంగారు తీగుల మరించె - ఆపైన పూర్వకుండమరంగ నిలిపె
అంద పున్నెము లేదు ఇవలాంగిదేవి - అందల్ల సంతనము ఫలము లేపోయె
కోరుకొండీరన్న మాదొడ్డ దేవుడని - కోరుకొండీరన్న నోము నోసేను
గుడిగట్టి గుడి మీద సిగల మెత్తేను - గుడిచుట్టు బంగారు తీగుల మరించె
ఆపైన పుర్వకుండమరంగ నిలిపె "

ఇందులో చెప్పిన అప్పికొండ సోమన్న, రాంగుళ్ళ రామన్న, ఉత్తాడ మల్లయ్య, కోరు కొండ ఈరన్న అనే దేవతలందరూ విశాఖపట్నం జిల్లాలో ఉన్నవారే. ఇవలాంగి దేవి సంతానం కోసం ఆ దేవతలందరికీ గుడి కట్టించినట్లుగా కవి చెప్పాడు.

ఇలా ఎన్ని ప్రయత్నాలు చేసినా ఇవలాంగిదేవికి సంతానం కలగ లేదు. దానితో ఆమె నిరాశపడి ఒకరోజు రాత్రి పడుకొని ఉన్నప్పుడు విష్ణువు ఆమెకు కలలో కనిపించి పక్కనే ఉన్న సింహాచలం వరాహనృసింహస్వామిని వదలివేసి ఎక్కడో దూరంగా ఉన్న అప్పికొండ సోమన్న, రాంగుళ్ళ రామన్న మొదలైన దేవతలను ఎలా పూజించావని, ఆ దేవతలు సంతానం ఇవ్వగలవారా అని ఆమెను ప్రశ్నించి ఆమెకు సంతానం కలిగే మార్గాన్ని గురించి వివరంగా ఇలా చెబుతాడు.

"అవిగవిగో నేరళ్ళు తెల్లనా గుళ్ళు - తెల్లనా గుళ్ళల్లో దేవుడున్నాడు
మాదవా సిమ్మాద్రి దూరమా నీకు - పక్కనా సిమ్మదిరి తలపు నీకు లేదా
ఏడుకతో సిమ్మదిరి నోము నోసీతే - సంతాన మిస్తాడు సర్వేశ్వరుండు
అవుదువే ఇవలాంగి అవునంతదాన - సంతాన మిస్తాడు సర్వేశ్వరుండు
సన్న వరిబియ్యము సాయిపప్పులతోనె - కావుళ్లు గట్టించు ఇవలాంగిదేవి
టెంకాయ కొబ్బరులు తేనె యరటిపళ్ళు - కావుళ్లు గట్టించు ఇవలాంగిదేవి
నానుబిందరసీలు నల్లరిటిపళ్లు - కావుళ్లు గట్టించు ఇవలాంగిదేవి
బండితిరుపతికోల బలువైన నంబులు - బలువైన నంబుల్లు కూర్చుకో మనును
సువ్వారి కోలలు సూటైన బక్తులు - సూటైన బక్తులను కూర్చుకోమనును
పైడి బెత్తిల వారు పట్టాబిదాసులు - పట్టాబిదాసుల్ల కూర్చుకో మనును
ఎలుగుబ్బ స్తాలాలు ఏకన్నాదముతోనె - కఱ్రావు దూడనె కదిలి నడిపించు
అడియోర పాతోవ ఆదుకొమ్మన్నాడు - అడియోర చెర్లోన తాన్నములు జెయ్యు



అడియోర పైడమ్మ కాదుకొమ్మన్నాడు - అడియోర పైడమ్మకు టెంకాయ కొట్టి
అడియోర పైడమ్మకు దండమని మొక్కు - ఆది పావంచాల కాదుకొమ్మన్నాడు
ఆదిపావంచాల టెంకాయ కొట్టి - అడుగడుగు పావంచాలంది దండములు
పన్నెండు దారల తాన్నములు జేయు - ఆపుట్టుదార కడకాదు కొమ్మన్నడు
ఆపుట్టుదారల తాన్నములు జేయు - పువ్వొంటి దాసుల్లె పూసుకొమ్మనును
అద్దాల పటుచీర పొత్తులెయ్యాల - పద్దాల పటుచీర పెనువత్తులెయ్యాల
అవుదువె ఇవలాంగి అవునంతదాన - బెలగమని బెమ్మాండ్ల జ్యోతి ముట్టించి
ఎలుగుబ్బ తాళాలు ఏకనాదముతోని - కఱ్రావు దూడనే కదిలి నడిపించు
ఆ కప్పకంబాము కాదుకొమ్మనును - ఆకప్ప కంబాన్ని కాగటను బట్టు
కఱ్రావు దూడనే కంటాన్నే గట్టేవు - తడివస్త్రములతోనే దేవిలము జొచ్చి
గుడిచుట్టు ముమ్మారు తిరుగు నివలాంగి - సంతానమిస్తాడు సర్వేశ్వరుండు"

పై గేయంలో చెప్పబడిన మొక్కుబడి విధానం అంతా కళింగాంధ్ర ప్రాంతంలోని ప్రజలు తమకోరిక తీర్చుకోవడానికి సింహాచలస్వామిని దర్శించే విధానమే. పై గేయంలో సన్నవరిబియ్యం, సాయిపప్పు, కొబ్బరికాయలు, అరటిపళ్ళు, అరిసెలు మొదలైన పదార్థాలను కావళ్లలో పెట్టి సింహాచలానికి మోసుకొని రాగా సేవగరిడి కళాకారులు తోడపెద్దును (కఱ్రావు దూడను) పట్టుకొని తాళాలు, బెత్తు, కోల మొదలైన పరికరాలతో సేవగరిడికళను ప్రదర్శిస్తూ దశావతార కథను గానం చేస్తూ ఉండగా ఇవలాంగి సింహాచలానికి రావాలి. కొండ కింద ఉన్న అడివార చెరువులో స్నానంచేసి అక్కడ ఉన్న పైడమ్మకు కొబ్బరికాయ కొట్టి సింహాచలం మెట్ల దగ్గరకు వచ్చి మొదటి మెట్టు దగ్గర మళ్ళీ కొబ్బరికాయ కొట్టి మెట్ల మీదుగా ఎక్కివస్తూ గంగధార, పుట్టుధార మొదలైన పన్నెండు ధారల దగ్గర స్నానాలు చేసి అక్కడ జ్యోతి వెలిగించి సింహాచలం దేవాలయంలోకి తడివస్త్రాలతో ప్రవేశించి కప్ప స్తంభాన్ని కౌగలించుకొని గుడిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ చేస్తే సింహాచలేశ్వరుడు సంతానం ఇస్తాడని ఇవలాంగికి సింహాచలేశ్వరుడు చెబుతాడు.

ఇవలాంగిదేవి ఆమరుసటిరోజే సింహాచలేశ్వరుడు చెప్పినట్లుగా అన్నీ సమకూర్చుకొని సేవగరిడివారు తనముందు నడుస్తుండగా సింహాచలం మెట్లమీదుగా కొండ పైకి వెళ్ళి తడివస్త్రాలతో కప్ప స్తంభాన్ని కౌగలించుకొని దేవుణ్ణి దర్శించి ఆ స్వామి చెప్పినట్లుగా తన మొక్కును తీర్చుకున్నాను కాబట్టి తనకు సంతానం కలిగించమని కోరుకుంటుంది.

ఈ కథాకాలం నాటికి నృసింహావతారం గానీ, వరాహావతారం గానీ లేవు.

సింహాచలం దేవాలయమే ఉండదు.ఐతే కవి కాలం నాటికి సింహాచలం క్షేత్రంలో దేవుడున్నాడు కాబట్టి కవి పై విధంగా రాశాడు.

ఆ తరువాత విష్ణువు తన భక్తుడైన పవనార్జునుని పిలిపించి ఇవలాంగి కడుపున ఇలనార్జుని కొడుకుగా పుట్టమని చెబుతాడు. దానికి పవనార్జుడు ఇలనార్జుడు చాల దుర్మార్గుడనీ అతడు అనేక రకాలుగా తనను హింసిస్తాడని అందువల్ల అతని ఇంట్లో జన్మించడానికి తాను వెళ్ళనని చెబుతాడు. ఐతే విష్ణువు ఇలనార్జుడు ఎన్ని రకాలుగా హింసించినా ఎలాంటి బాధా పవనార్జునికి కలగకుండా తాను చూస్తానని, అన్నివేళలా అతనికి రక్షణగా ఉండి కాపాడుతుంటానని, కాబట్టి ఇవలాంగి కుమారుడుగా జన్మించమని చెబుతాడు. చివరికి పవనార్జుడు అంగీకరిస్తాడు. పవనార్జుడు ఇలనార్జుని కుమారుగా పుడతాడు. ఇలనార్జుడు జోష్యులను పిలిపించి తన కుమారుని జాతకాన్ని గురించి అడుగుతాడు. వారు ఈ విధంగా సమాధానం చెబుతారు.

"అప్పుడేమన్నాడు ఇలనారజుండు - అవుదుదోయి బామ్మర్లు అవునంతవారా
నేకనేక నాకు సంతానములు గలిగె - బాలపుట్టినదినము బలము సూడండి
ఆమాటలిన్నారు వారు పురిమోదులు - సంకలో పుస్తకాలు జర్రునాదీసి
మునియేల పుస్తకాలు ముడులిప్పినారు - కడియేల పుస్తకాల కదలిప్పినారు
పెనియాల పుస్తకాలు పేరులను జదివేరు -నవగుణము పడిగట్టి నచ్చంత్ర మెంచేరు
ఆకు పాయచ్చురా లమరగునమించేరు - అపుడేమంట పలికినరు వారు పురి యోదులు
అవుదువో యిలనార్జునవునంతవాడా - బాలపుట్టిన దినము బలము బాగుంది
అన్నయొస్త్రములు గలవు ఆవుసులు గలవు - పాడిపంటలు గలవు బాగ్గెములు గలవు
ఏల రాజ్యము గలదు ఎక్క గుర్రము గలదు - బాలకొచ్చిన కొదవ మరియేమి లేదు
కొడుకుదే అరిపూజ తండ్రిదే శివపూజ - తండ్రికి కొడుకుకి తరక వైరములు
తండ్రిగండామొకటి తప్పదన్నారు - ఆ పలుకులిన్నాడు ఇలనారుజుండు
తండ్రి గండామైతే మాకేమి కొదవ"-

తాను చావు లేకుండా వరం పొందాడు కాబట్టి తన కుమారుని జాతకంలో తండ్రి గండం ఉందని జ్యోతిష్యులు చెప్పినప్పటికీ ఇలనార్జుడు పట్టించుకోలేదు.

కొంతకాలం తరువాత ఇలనార్జుడు తన గురువు శుక్రాచార్యుని పిలిపించి కుమారునికి విద్యాభ్యాసం చేయమని పవనార్జునుని అప్పగిస్తాడు. శుక్రాచార్యుడు పవనార్జునుని మిగతా పిల్లలు చదువుకుంటున్న చావడి దగ్గరకు తీసుకొని వెళ్ళి చదువు చెప్పడం ప్రారంభిస్తాడు.

"నేలపాయచ్చురాలు నేరుపుగ రాసె - శివ్వన్న అచ్చరము రాయించినాడు



ఆడు నారాయణచర్చం నడుపుతున్నాడు - నేలపై అచ్చరము ఆకుపై రాసేను
నారాయణచ్చరం నడుపుతున్నాడు - చిన్నపిల్లల గూడి శ్రీహరే రాసేను
ఆపాటి బాలలతో నరహరే రాసె - అట్టి కన్నుల జూసి సుక్కురుండు
ఏమిరా పవనార్జుడేతువా నీకు - శివశివ మీదేవుడు శివుడు మీదేవుడు
శివపూజ సదవవోయి చిన్న పవనార్జా - నారాయణంతడోయి పవనారజుండు"

పై గేయంలో భాగవతంలోని ప్రహ్లాదుని కథ సారాంశమంతా చిన్న మాటలతో జానపద కవి చెప్పాడు. శుక్రాచార్యులు "ఓం నమఃశివాయ" అని రాయించాడు. ప్రహ్లాదుడు "నమో నారాయణాయ" అని పలుకుతున్నాడు. ఈ కథలో ప్రధాన సమస్య ఇదే. శుక్రుడు ఎన్నిసార్లు చెప్పినా పవనార్జుడు నారాయణునే తలచుకుంటున్నాడు. శుక్రాచార్యునికి కోపం వచ్చి పవనార్జునునికి ఇలా బుద్ధి చెబుతాడు.

"ఏమయ్యా పవనార్జుడేతువా నీకు - ఎంత జెప్పిన బుద్ధి మానకున్నావు
తండ్రిదే శివపూజ కొడుకు దరిపూజంటె - నవ్వరా నీసరి రాజులల్లాను
శివపూజ సదవవోయి చిన్నపవనార్జా- శివుడు మీసిత్తమున దేవుడయి ఉన్నడు
శివపూజ సదవవోయి పవనారజుండా- శివుడు మన సంతతిని తిరసూచుచున్నాడు
శివపూజ సదవవోయి పవనారజుండా - అరి మీపగవాడు అయ్యపవనార్జుడా
అరిపూజ మానవోయి పవనారజుండా"

ఇలా శుక్రుడు ఎంత చెప్పినప్పటికీ పవనార్జుడు శివుని తలవకుండా విష్ణువునే తలుస్తున్నాడు. అప్పుడు శుక్రుడు పవనార్జునిని ఇలనార్జనుని దగ్గరకు తీసుకొనివెళ్ళి విషయమంతా చెప్పి అతనికి చదువు చెప్పడం తన వల్ల కాదని చెబుతాడు. ఇలనార్జుడు ప్రహ్లాదుని దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకొని బుజ్జగించి హరిని స్మరించడం మానివేసి శివుని స్మరించమని చెబుతాడు. కింది గేయంలో ఇలనార్జుని పుత్రవాత్సల్యాన్ని జానపద కవి చక్కగా ఇలా వివరించాడు.

"అట్టి కన్నుల జూసి ఇలనారజుండు - నాయనా నాయబ్బ నాముకుమారా
సెక్కిల్లు దీసిసేరి ముద్దాడి - బుగ్గలే దీసేను పూని ముద్దాడి
కోటి నోములు నోసి నిన్ను గన్నను కొడక - నిన్ను గన్న పలము నాకేమి లేదు
ఏడు అంతారాల ఎత్తి ముద్దాడేడు - పది అంతారాలు పట్టి ముద్దాడేడు
శివపూజ సదవరా సిన్నపవనార్జా - శివుడు మన నిత్తమున దేవుడై ఉన్నాడు
శివపూజ సదవరా సిన్న పవనార్జా"

పై గేయంలో "కోటి నోములు నోసి నిన్ను గన్నను కొడకా" అనే వాక్యంలో ఇలనార్జుని పుత్రవాత్సల్యాన్ని జానపదకవి చక్కగా వ్యక్తీకరించాడు. విష్ణుభక్తి మాని శివుని

ప్రార్థించమని చెప్పిన ఇలనార్జునితో పవనార్జుడు విష్ణువును ప్రశంసిస్తూ శివనింద చేస్తూ ఇలా పలుకుతాడు.

"బాబురా ఓరి బాబు ఇలనారజుండా - శివ్వన్నే పద్యాలు సుష్టిలో లేవు
నీ శివుడు దనిసితే సిగ్గుతానవుతాను - హరిని దలచితే మనకు సొర్గమొస్తాది
మన పిన్న పెద్దలకు మోచ్చుమొస్తాది - కసురు యంపళ్లల్లో కారాడి మేసిన
కాకి వొంటోడురా బాబు నీ శివుడు - పాలసంద్రములోన రవరత్న ముత్యాలు
అనుబగించిన అంస చిలకలకు తెలుసు - అంస యంటోడురా యాది నరసిమ్మ"

ఈ గేయంలో పవనార్జుడు విష్ణువును ఆదినరసిమ్మ అని పిలిచాడు. అప్పటికి ఇంకా నరసింహావతారం లేదు. కవికాలం నటికి నరసింహావతారం ఉంది కాబట్టి కవి అలా రాశాడు.

పవనార్జుడు చేసిన శివనింద భరించలేక ఇలనార్జుడు కోపంతో పవనార్జునుని పట్టుకొని భూమికేసి కొడతాడు. పవనార్జుడు చనిపోడు సరికదా ఎలాంటి గాయం లేకుండా చిరునవ్వుతో నారాయణుని స్మరిస్తాడు. దీనితో ఇలనార్జుడు తన శత్రువును స్మరిస్తున్న పవనార్జుని మీద శత్రుత్వం పెంచుకొని అనేక రకాలుగా అతణ్ణి చంపించే ప్రయత్నం చేస్తాడు. పాములతో కరిపించడం, ఏనుగులతో తొక్కించడం, మంటల్లో వేయడం, సముద్రంలో తోయడం మొదలైన అనేక ప్రయత్నాలతో పవనార్జుని చంపించే ప్రయత్నం చేస్తాడు. విష్ణు మహాత్మ్యం వల్ల పవనార్జునుడు చనిపోకుండా నవ్వుతూ నారాయణ అంటూ ఆ గండాల నుంచి గట్టెక్కుతాడు. చివరికి ఇలనార్జుడు విసిగిపోయి పవనార్జునితో నీ నారాయణుడు ఎక్కడున్నాడు, నాకు చూపించు అని అడుగుతాడు. దానికి పవనార్జుడు ఇలా సమాధానం చెబుతాడు.

"బాబురా ఒరి బాబు ఇలనారజుండా- నీకేమి జూపేది నిచ్చాయ మల్లా
నాయందు నున్నాడు నీయందు నున్నాడు- నీకు నాకు మద్య నిలిసి యున్నాడు
గట్టందు నున్నాడు పుట్టందు నున్నాడు- చీమందు నున్నాడు పామందు నున్నాడు
కాలుగోరి నుంచి కంటి రెప్పల నుంచి- పూరి పుల్లందునే పుట్టి యున్నాడు
సూది మోపను సోటు లేదు నరసిమ్మ- నీకు నాకు మద్య నిలిచి యున్నాడు
అన్నన్ని కంబాలు నమిరియున్నాడు- మానపతి కంబముని మసులాడు తున్నాడు
ఆ వట్టి కంబమున దేవుడున్నాడు - నీకేమి జెప్పేది నిచ్చాయమల్లా"

విష్ణు స్వరూపాన్ని గురించి జానపదకవి అపూర్వమైన రీతిలో ప్రహ్లాదుని చేత చెప్పించాడు.

"ఇందుగలడందు లేదని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి వింటే"

అనే పోతన పద్య భావాన్ని జానపద కవి తనదైన ధోరణిలో చక్కగా చెప్పాడు. పై వాక్యాల్లో

"నాయందునున్నాడు నీయందునున్నాడు- నీకు నాకు మద్య నిలిసి యున్నాడు
గట్టందు నున్నాడు పుట్టందు నున్నాడు- చీమందు నున్నాడు పామందు నున్నాడు"

అనే మాటలు భగవంతుని సర్వవ్యాపిత లక్షణాన్ని తెలియ జేస్తున్నాయి. అన్నింటి కంటే ముఖ్యం 'నీయందు నున్నాడు' అని చెప్పడం గొప్పగా ఉంది. భాగవతంలోని హిరణ్య కశ్యపుడు విష్ణువు తన కుమారునిలో దాక్కొని ఉండి తనను బాధపెడుతున్నాడని వాపోతాడు. విష్ణుద్వేషంతో పుత్ర వాత్సల్యాన్ని చంపుకొని ఇలనార్జునుడు పవనార్జుని చంపడానికి ప్రయత్నించాడు, కానీ పవనార్జుడు చెప్పినట్లుగా విష్ణువు ఇలనార్జుని యందే ఉంటే అప్పుడు అతను ఏమి చేయగలడు? అందువల్లనే జానపద కవి చెప్పిన నీయందునున్నాడు అనేమాట రమణీయంగా ఉంది.

పవనార్జుని పై మాటలకు ఇలనార్జుడు ఈ స్తంభంలో నీ హరి ఏవిధంగా ఉన్నాడో చూపించమని స్తంభాన్ని కొడతాడు? ఆ స్తంభంలో నుంచి విష్ణువు నరసింహావతార రూపంలో ప్రత్యక్షమవుతాడు. ఆ భయంకర రూపాన్ని చూసి భయపడి ఇలనార్జుడు అక్కడ నుంచి కొండల వెంట పర్వతాలవెంట పారిపోతాడు. అప్పుడు నరసింహుడు ఇలనార్జునుని చంపడానికి కింది విధంగా అడవిలో ఒక పర్ణశాలను వేసుకొని ఇలనార్జుని కోసం నిరీక్షిస్తూ ఉంటాడు.

"పగలల్ల ఇలనార్జు పొలిమేర దిరిగి- పొద్దుతే ఇలనార్జు డింటి కొస్తాడని
అడవిలొక పురియిల్లు గావించినాడు- తన రెండు పెనుతొడలు దారబందము జేసి
తన నోటి సెక్కిళ్లు తలుపు గాయించేను- నోటి వాయువు లెల్లీ దారుంచినాడు"

నరసింహామూర్తి భావించినట్లుగానే పగలు రాత్రి కాని అసుర సంధ్యవేళ గడపలోకి వచ్చిన ఇలనార్జునుని నరసింహస్వామి తన తొడల మీద వేసుకొని గోళ్ళతో అతని పొట్ట చీల్చి సంహరిస్తాడు. ఆ తరువాత నరసింహస్వామి పవనార్జునిని అతని తండ్రి రాజ్యాన్ని ఏలుకోమని చెబుతాడు.

ఇంతటితో నరసింహావతార కథ ముగుస్తుంది.

**6. వామనావతారం :**

దీన్ని బలి చక్రవర్తి పేరుతో బలుడవతారం అని కూడా అంటారు. ఇది తొమ్మిది పుటల కథాగేయం. ఈ కథాగేయం ఇలా ప్రారంభమవుతుంది.

"మిక్కుటంబుల వరము బలుడేలు తున్నాడు- శెంకు సెక్కారాలు దాశావతారుడు
బలుడు బూములు అడుగ పయనమావాడు- అయిదు ఒక్క పోగు అతని జన్నితము

సక్కగా నామాలు సాదుకున్నాడు- అరిగినా గంటకము సిరిగినా పుస్తకం
సింకిరేకల గొడుగు శిరసానినాడు- సేత రాగిచెంబు పట్టుకున్నాడు
సొప్పు పావలజోడు చెప్పుల మరించెను - బలుదు పట్నంలోకి పయనమాయేను"

పై గేయంలో బలిచక్రవర్తిని గురించి "మిక్కుటంబుల వరము బలుదేలు తున్నాడు" అని చెప్పబడింది. ఈ ఒక్కపాదంలోనే బలి చక్రవర్తి దేవతలను జయించి వైభవంగా భూమండలాన్ని పరిపాలిస్తున్నట్లుగా అర్థమవుతుంది. రెండవ పాదంలో "శెంకు. సెక్కారాలు దశావతారుడు" అని చెప్పబడింది. అంటే శంఖం, చక్రం కలిగి దశావతారాలను ఎత్తిన విష్ణువు అని అర్థం. మూడవ పాదంలో "బలుదు బూములు అడుగ పయనమానాడు" బలి చక్రవర్తిని మూడు అడుగుల భూమిని యాచించడానికి బయలు దేరినట్లుగా చెప్పబడింది. ఆ తరువాత ఐదు పాదాల్లో వామనుని వేషాన్ని గురించి చెప్పబడింది. వామనుడు వటువు వేషంలో బలి చక్రవర్తి దగ్గరకు వచ్చాడు. సంస్కృత భాగవతంలోనూ, పోతన భాగవతంలోనూ వామనుడు, నిరాడంబరంగా ఉన్నాడు గానీ, దారిద్ర్యంతో బాధ పడుతున్నట్లుగా లేదు. జానపదులు వాస్తవ దృక్పథం కలిగిన వారు. వారు తమ ఊర్లో ఎల్లప్పుడూ బిక్షమెత్తుకొనే పేద బ్రాహ్మణులను చూస్తూ ఉంటారు. వారి వేషాన్ని జానపద కవి వామనునికి వేయించాడు. వారి ఉద్దేశ్యంలో యాచనకు వెళ్ళేవాడు బీదవాడుగానే కన్పించాలి. అప్పుడే దాతకు అతని మీద జాలి కలిగి దానమివ్వడానికి ముందుకు వస్తాడు. వామనుడు కూడా యాచనకు బయలు దేరిన వాడు కావడం వల్ల జానపద కవి అతను చిరిగిన పుస్తకం, చిరిగిన గొడుగు పట్టుకున్నట్లుగా చెప్పాడు.

వామనుని కాలంలో ఇప్పుడు మనం వాడుతున్న కాగితాల పుస్తకాలు లేవు. తాళపత్రాలే నాటి పుస్తకాలు. తాళపత్ర గ్రంథాలను కూడా పుస్తకాలు అంటారు. జానపద కవి వామనుణ్ణి తన కాలం నాటి వాటిగానే చిత్రిస్తూ అతడు చింకి పుస్తకాన్ని పట్టుకున్నట్లుగా చెప్పాడు. పై వాక్యాలతో పాటు "సొప్పపావల జోడు చెప్పుల మరించెను' అని వామనుని గురించి చెప్పబడింది. సొప్పపావల జోడు అంటే చెక్కతో చేసిన పావకోళ్ళ జోడు అను భావం. కవి అలాంటి పావుకోళ్ళను 'చెప్పులు' అని పిలిచాడు. మనం ఇప్పుడు ధరిస్తున్న తోలు చెప్పులను చెప్పులు అని పిలవడం జరుగుతుంది. ప్లాస్టిక్‌తో చేసిన పాదరక్షకలను నేడు ప్లాస్టిక్ చెప్పులు అని పిలుస్తున్నారు. అందువల్లనే జానపద కవి పావుకోళ్ళ చెప్పులు అని ఉద్దేశ్యంతో పై వాక్యాన్ని చెప్పాడు.

వామనుడు బలిచక్రవర్తిని దర్శించి తనకు మూడు అడుగుల నేల దానం ఇవ్వమని కోరతాడు. బలి చక్రవర్తి అతని అమాయకత్వానికి నవ్వి అతనితో ఇలా అన్నాడు.



"అవుదువోయి బ్రామ్మడా అవునంతవాడా- ఎట్నుంచి వచ్చావు పేద బామ్మడా
కోరగా కోరగా ఏమి కోరావు- మూడు అడుగుల్లోను ఏమి తింతావు
పక్కునా నవ్వినడు బలిచక్రవర్తి"

పై బలిచక్రవర్తి మాటల్లో జానపదుల ఆర్ద్ర హృదయపు నుడికారం కనిపి స్తుంది. లోకంలో యాచనకు దరిద్రమే కారణం. అందువల్లనే జానపద కవి వామనుని దరిద్రునిగా చిత్రించాడు. దరిద్రంతో ఉన్న వామనుడు మూడు అడుగుల భూమి కోరగానే బలి చక్రవర్తి మూడు అడుగుల భూమితో ఏమి తింటావని ప్రశ్నించాడు.

పై బలుని ప్రశ్నకు వామనుడు ఇలా సమాధానం చెప్పాడు.

"చెప్పుతను బలిచక్ర చెవులాలకించు- ఒక అడుగు నోపల చెరువు దవ్విస్తాను
ఉగములో నీకీరితుండి పోతాది- ఒక అడుగు నోపల ఊరు గట్టిస్తాను
ఉగములో నీకీరి తుండి పోతాది- ఒక అడుగు నోపల తోటలేయిస్తాను
ఉగములో నీకీరి తుండి పోతాది- ఒక అడుగు లోపల పంట్లు పండిస్తాను
ఉగములో నీకీరితుండి పోతాది- చాలా కాలము నిన్నుచెప్పుకుంటారు"

భాగవతంలోని వామనుడు మూడు అడుగుల నేల మీద తపస్సు చేసుకుంటానని చెబుతాడు. పాడిపంటలతో బాగా పరిచయమున్న జానపదకవి తన వామనుడు ఒక అడుగులో చెరువు, ఒక అడుగులో ఊరు, ఒక అడుగులో తోట, అందులో పంట వేస్తానని చెప్పాడు. ఊరు, ఊరి మధ్య చెరువు, ఊరు చివర తోటలు, ఆ తోటల్లో పంటలను జానపదులు ఎల్లప్పుడూ చూస్తూ ఉంటారు. భాగవత వామనునిలో స్వార్థమున్నది. అతను మూడు అడుగుల భూమిలో తపస్సు చేసుకుంటానన్నాడు. కానీ జానపద వామనునిలో స్వార్థం లేదు. పరోపకారం ఉంది. భాగవతంలో వామనుడు మూడు అడుగుల భూమిని ఎందుకు కోరాడో సామాన్యులకు అర్థం కాదు. ముక్కు మూసుకొని అడవిలో తపస్సు చేసుకొనే ఏ మహర్షి తాను కూర్చొని తపస్సు చేసుకోవడానికి అవసరమైన మూడు అడుగుల భూమిని ఇవ్వమని ఏ చక్రవర్తినీ యాచించలేదు. ఆ విధంగా యాచించి రెండు పాదాలతో విశ్వం మొత్తాన్ని ఆక్రమించిన వామనుడు అదే రూపంతో బ్రహ్మండమంతా కూర్చొని తపస్సు చేసుకుంటాడని సామాన్యులు భావించలేరు. అందువల్లనే తను చెప్పే అబద్ధం అందంగా ఉండాలని కాబోలు ఈ కథాగేయంలోని వామనుడు మూడు అడుగుల భూమిని ప్రజలకు ఉపయోగపడే లాగా వాడతానని చెప్పాడు.

ఆ తరువాత బలిచక్రవర్తి వామనునికి మూడు అడుగుల భూమిని ఇవ్వడం వామనుడు రెండు పాదాలతో భూమ్యాకాశాలను ఆక్రమించి మూడవ పాదాన్ని

బలిచక్రవర్తి తల మీద పెట్టి అతణ్ణి పాతాళ లోకానికి పాయతొక్కడం జరుగుతుంది. అప్పుడుబలి చక్రవర్తి వామనుని కోరిన కోరికలు గ్రామీణ సంస్కృతినీ, తెలుగు సంస్కృతినీ ప్రతిబింబిస్తున్నాయి.

"శెంకు సెక్కారాల దాశావతార- వరమొకటి దయసేయు దాశావతార
పాదమునే బలి చక్రు డొరము లడిగేను- అపుడే మంట పలికినడు నీల యెన్నుండు
అవుదువోయి బలిచక్రుడొనంతవాడా- మకుర సంకూరాత్రి మాపున్నెపలము .
మొదట శనివారాలు మాకు జెల్లేను- కనుమనగ బోగనగ పెద్ద పండూ గనగ
మూనాళ్ళ పురుషోదమిచ్చినాను బలుడా"

సంక్రాంతి పండుగ సందర్భంగా వచ్చే అంటే సంక్రాంతి పండుగ ముందు శని వారం పూజాఫలం విష్ణువుకు చెందుతుందని, భోగి, పెద్దపండుగ, కనుము ఫలాన్ని బలి చక్రవర్తికి చెందుతుందని విష్ణువు చెబుతాడు.

దీనితో వామనావతారం కథ పూర్తవుతుంది.

**7. పరశురామావతారం :**

దశావతార కథల్లో ఇది ఏడవది. ఇది ఎనిమిది పుటల కథాగేయం. ఇందులో కథ నామమాత్రంగా ఉంది. శిష్ట సాహిత్యంలోని కార్యవీర్యార్జునుడు ఈ కథాగేయంలో ఇరవై ఒక్క కార్తీకవీరులుగా చెప్పబడ్డాడు. పరశురాముని తండ్రి జమదగ్ని అని శిష్ట సాహిత్యంలో ఉంటే ఇందులో 'దమసుగ్గు' అని చెప్పబడింది. అంతేగాకుండా కార్తీక వీరులకు దమసుగ్గుకు బావ, బావమరుదల సంబంధం ఉన్నట్లుగా చెప్పబడింది.

ఇరవైఒక్క కార్తీకవీరుల దండు అడవికి వేటకు వెళ్ళి ఆకలి దప్పికలతో దమసుగ్గు ఆశ్రమానికి వెళ్ళి -

"బావోయి మాబావ దమసుగ్గు రాజా- అడవిలంటా ఏటలాడు తున్నాము
ఆరు పొద్దులాయె ఏటలాడాము- దప్పికవుతున్నాదీ దాహమిప్పించు
ఆకలికి పేగులు అలమటిస్తున్నాయి- మా కన్నాలు పెట్టించు దమసుగ్గు బావా"

అని అడుగుతారు. దమసుగ్గు తన దగ్గర ఉన్న కామధేనువు సాయంతో వారందరికీ మంచి విందు భోజనం పెట్టిస్తాడు.

"కాముదేను వొచ్చి కడగోల దువ్వె- అష్టమ్మ పున్యాలు ఇష్టబోగాలు
బంతులంటన్నాలు బలపరిచినాడు- సెలవులిచ్చీనాడు దమసుగ్గురాజు
బోంచేసి ఈరులు బొజ్జల్లమొయ్య- పుష్టిగా వన్నాలు పుచ్చుకున్నారు
ఎంగిళ్లు దీర్చేరు ఏరులై పారె - చేతులు గడిగేరు చెరువులై పారె
బోంచేసి ఈరులు ఆసోదలయినారు"



జానపదకవి వర్ణనలో రాజులైన కార్తీకవీరులు కూడా జానపదుల్లో కలసిపోయారు. "బోంచేసి ఈరులు బొజ్జల్ల మొయ్య" అని చెప్పడంలో చక్కటి నుడికారం ఉంది. కామధేనువు సృష్టించిన ఆహార పదార్థాలు రుచిగా ఉండడంచేత వారందరూ కడుపునిండా తిన్నారు. భుక్తాయాసం తీర్చుకోవడానికి "ఆసోదలైనట్లు"గా జానపదకవి చెప్పాడు.

ఆ తర్వాత కార్తీకవీరులకు దురాలోచన వచ్చింది. ఎలాగైనా కామధేనువును తీసుకొని వెళ్ళాలనుకున్నారు. మొదట దమసుగ్గును అడిగారు. అతను వీలు కాదన్నాడు. కార్తీక వీరులు బలవంతంగా కామధేనువును పట్టుకొని వెళ్ళే ప్రయత్నం చేశారు. కామధేనువు వచ్చిన వారినందరినీ పొడిచి దూరంగా తరమివేస్తుంది. దాంతో కార్తీక వీరులకు దమసుగ్గుమీద కోపంవచ్చి అతని తలను నరకివేస్తారు. ధర్మాతుడు, గొప్ప ఋషి అయిన దమసుగ్గు మరణంతో ప్రకృతి చలించిపోయిందట.

"తపసున్నే దమసుగ్గు తలలు దుంచీనారు- హరహరా యన్నాడు అపుడు దమసుగ్గు
పాల యంబది గదిలి పానుపల్లాడె- పానుపా ఇరుబగల పనుకులల్లాడె
మీద సిగిలం గదిలి మేరువల్లాడె- గిరిరాజు పైబడి గిరులు గోటాడె
మర్రాకు పానుపు మరితల్లటించె- పానుపున పడుకున్న భద్ర జేనుండు
నిద్ర మేలుకొనె నీలయెన్నుండు"

అప్పుడు విష్ణువు పరశరాముని రూపంతో వచ్చి కార్తీకవీరులను, వారి సైన్యాన్ని చంపివేస్తాడు. ఇంతటితో పరుశురామావతారం ముగుస్తుంది.

**8 . రామావతారం :**

సేవగరిడి దాసులు రామావతారాన్ని సేవగరిడి కళాప్రదర్శనలో పాడరు. రామావతారం సేవగరిడి కళాప్రదర్శనలో ఎక్కదని వీరంటారు. అందువల్ల వీరు ఈఅవతారాన్ని పాడరు. అందువల్ల రామావతారాన్ని గురించి ఇక్కడ చర్చించలేదు.

**9. వరాహావతారం :**

ఇది ముప్పైపుటల కథాగేయం. ఈకథ శిష్ట సాహిత్యంలో లేదు. ఇది పూర్తిగా జానపద కవి కల్పితం. ఎంత గొప్పవారైనా చేసిన పాపానికి ఫలితాన్ని అనుభవించ వలసి ఉంటుందనే జానపదుల నమ్మకాన్ని అనుసరించి కవి ఈ కథను కల్పించాడు. ఈ కథకు సింహాచల వరాహమూర్తికి సంబంధం కల్పించబడింది.

విష్ణువు రామావతారంలో వాలిని అన్యాయంగా పందిని చంపినట్లుగా చెట్టు చాటు నుండి చంపి పాపం కట్టుకున్నాడు. రామావతారం వదిలివేసినా ఆ పాపం విష్ణువును వెంటాడుతూనే ఉంటుంది. విష్ణువు ఆ పాపాన్ని వదలించుకోవాలని నిశ్చయించు కుంటాడు. ఆ సమయంలో వాలి కొడుకైన అంగదుడు సింహాచలం ప్రాంతంలో ఒక

ఎరుకలవాడుగా జన్మించి ఉంటాడు. అతని చేత బాణం దెబ్బతిని కొంత పాపాన్ని వదిలించుకోవాలని విష్ణువు భావిస్తాడు. ఈ కథాగేయం ఎరుకల వ్యక్తి పంచదార్ల కొండ మీద పోడు వ్యవసాయం చేయడంతో ఇలా ప్రారంభమవుతుంది.

"వోలి కొడుకంగజుడు ఒన్ను లెరికోడు- సిరి వాకు పర్వతం సిమ్మాద్రి కొండ
పంచదారల కొండ పర్వతం మీద- ఆ కొండ పోడేసె రాజు లెరికోడు"

అడవుల్లో ఉన్న ఎరుకలవారు పోడు వ్యవసాయం చేస్తారు. దీనికోసం వారు కొంత అడవిని నరికేసి భూమిని వ్యవసాయానికి అనుగుణంగా తయారు చేసి అందులో పంటలు వేస్తారు. ఈ కథాగేయంలో ఎరుకల వ్యక్తి సింహాచలం కొండ పంచదార్ల కొండ మీద పోడు వ్యవసాయానికి అనుగుణంగా భూమిని తయారుచేస్తాడు. ఆ తరువాత అతను విత్తనాల కోసం దేవలోకానికి వెళ్ళాడట.

"ఇక దేవలోకం ఎళ్ళె రాజులెరికోడు - తాతరా మాతాత తాత దేవేంద్రా
నేను కొండ మీదన పోడు ఏసుకున్నాను- నాకు ఇత్తనము దయసేయు తాత దేవేంద్ర
ఇత్తనాలిచ్చినదు తాత దేవేంద్ర- సామలు కొర్రలు సబ్బన్న దినుసులు
అనుములు, మినుములు అల్సంద బొబ్బర్లు- ఇత్తనాలిచ్చినాడు తాత దేవేంద్ర"

వాలి తండ్రి దేవేంద్రుడు, అందువల్ల అంగదుడు దేవేంద్రునికి మనుమడు. కాబట్టి జానపదకవి ఎరుకల వ్యక్తిచేత దేవేంద్రుని తాత అని పిలిపించాడు. దేవేంద్రుడు కూడా అతనికి సామలు, అనుములు, మినుములు మొదలైన ధాన్యపు విత్తనాలను ఎరుకల వ్యక్తికి ఇచ్చాడు. ఈ ధాన్యాలను కొండమీద సవరలు, ఎరుకలు పండిస్తారు. దేవలోకం నుంచి తెచ్చిన విత్తనాలు ఎరుకల వ్యక్తి తనపోడుభూమిలో చల్లుతాడు.

"సామలు కొర్రలు సబ్బన్న దినుసులు- అనుములు మినుములు అల్సంద బొబ్బర్లు
ఎర్రికో నెరకోడు ఎద ఎట్ట సాగె- పచ్చులు పావురాలు పడదవ్వికొచ్చె
ఎళ్ళెల్లి ఎరికోడు ఎనక తిరిగి చూసె- పచ్చులు పావురాలు పారిపోనాయి
కత్తాము కర్రతో కలిపె నిత్తనలు- ఆడింటి కొచ్చీనదు రాజు లెరికోడు"

ఎరుకుల వ్యక్తి విత్తనాలను చల్లుకుంటూ వెళుతుంటే అడవిలో ఉన్న పక్షులు ఆవిత్తనాలను తినడం మొదలు పెట్టాయట. అప్పుడు ఎరుకల వ్యక్తి కత్తాము కర్రతో చేనంతటిని కలిపేసి విత్తనాలు భూమిలోకి వెళ్ళేలాగ చేస్తాడు.

ఎరుకల వ్యక్తి వేసిన పంట తక్కువ రోజుల్లోనే పెరిగి పెద్దదై బాగా పండినట్లుగా జానపదకవి ఇలా వర్ణించాడు.

"మూడు రోజులక్కొర మొక్క దొడిగేను- నాలుగు రోజులక్కొర నల్లవద్దాది
ఏడు రోజులక్కొర ఎదిగి వచ్చేను- తొమ్మిది రోజులకు తొలకరించేను



పదిరోజులక్కొర పండి ఉన్నాది- గాదు కుందడికొర్ర గాతడివి నాగ
ఈనిందిరడికొర్ర యాతడివి నాగ- సామలు కొర్రలు సబ్బన్న దినుసులు
అనుములు మినుములు అల్సంద బొబ్బర్లు- పండి ఒరిగున్నాయి పరవతం మీద"

ఈపంట వాసన తూర్పు గాలి ద్వారా విష్ణువుకు తగులుతుంది. అప్పుడు విష్ణవు ఇలా అనుకున్నాడట.

"నేను రామావతారమున వోలి గొట్టాను - వోలి నేసిన పగలు ఒద్దనున్నాయి
ఎంత నెక్కెళ్ళినా ఎంబడొచ్చేను- ఉట్టు గట్టీ పగలు ఊగుతున్నాయి
నేనిలమీద వోలి పగలివ్వ బోతాను- తండ్రి గొట్టిన పగలు తనయుడా కిద్దును"

అప్పుడు విష్ణువు వరాహ రూపాన్ని ధరించి ఎరుకల వ్యక్తి పోడుభూమిలో ప్రవేశించి ఆ పంటను ఈ విధంగా పాడుచేస్తాడు.

"ఎండిన కొర్రల్ల ఎన్నారగించెను - పండిన కొర్రల్లా పాలారగించెను
ఆటకాట కొర్ర లందుకొని మేసె- పేరికొని పండిన పెద్దగుమ్మడు లన్ని
అయ్యారగించినా డానందమూగె- బురద కాలిన కొర్ర బూమి గలిపేను"

విష్ణువు వరాహరూపంలో పంటను ఈ విధంగా పాడుచేసి వెళ్ళిపోతాడు. మరుసటి రోజు ఎరుకల వ్యక్తి తన భూమి దగ్గరకు వచ్చి, పంది పాడుచేసిన తన పంటను చూసి, గుండె బాదుకొని సంవత్సరం పొడుగునా తన కుటుంబానికి బత్తెంగా సరిపోయే పంటను పంది పాడుజేసిందని, దాన్ని ఎలాగైనా చంపాలని నిశ్చయించు కొని, మరుసటిరోజు రాత్రి చేను దగ్గర మాటు వేసి అందులో దాక్కొని చివరకు నిద్రపోతాడు. విష్ణువు రెండవ రోజుకూడా పంది రూపాన్ని ధరించి ఎరుకలవాని చేతిలో బాణం దెబ్బతినడానికి బయలుదేరుతూ ఉంటాడు. అప్పుడు లక్ష్మి అతణ్ణి ఎక్కడికి వెళుతున్నావు? అని అడుగుతుంది. విష్ణువు విషయాన్ని చెబుతాడు. అప్పుడు లక్ష్మి విష్ణువును వెళ్ళవద్దని కోరుతుంది. ఆదిశేషుడు కూడా అదేవిధంగా కోరతాడు. విష్ణువు వారిని సమాధాన పరచి పంది రూపాన్ని ధరించి ఎరుకల వ్యక్తి కొర్రచేలోకి ప్రవేశించి పంటను పూర్తిగా పాడుచేసి నిద్రపోతున్న ఎరుకల వ్యక్తిని ఇలా నిద్రలేపాడట.

"మాటులో నెరికోడు మరినిద్ర బోయె- ఏ మంట పలికేను నీలయెన్నుందు
దొడ్డవాడికి నాకు దొంగతనమేల- తొంగున్న ఎరికోడ్ని తొడసరచి నేపె
నీ నిద్ర నీరి గల నెగర ఎరికోడ- పండిన కొర్రల్ల పందారగించె
నీ నిద్ర నెరిగాను నెగర ఎరికోడ- తల్లులకు పిల్లలకు పదినెల్లు బత్తెము
ఒక్కనాడె పంది మాపేసి పోయె- తొడ సరిసి ఎరికోడ్ని తానేపినాడు"

ఇక్కడ వరాహావతార ప్రసక్తి ఎలా ఉన్నా అడవుల్లో వ్యవసాయదారులు పరిస్థితిని కవి

వాస్తవంగా వర్ణించాడు. ఇప్పటికీ అడవుల్లో అడవి పందులు, నక్కలు, కొన్ని ప్రాంతాల్లో ఏనుగులు పంటను నాశనం చేయడం జరుగుతూ ఉంది.

తన పాపపరిహారం కోసం వరాహరూపాన్ని ధరించి ఎరుకల వ్యక్తి పోడు వ్యవసాయాన్ని పాడు చేసినప్పటికీ "దొడ్డవాడికి నాకు దొంగతనమేల" అని స్వామి చేతనే చెప్పించి జానపదకవి విష్ణువు మీద తనకున్న భక్తిని చాటుకున్నాడు.

నిద్ర మేల్కొన్న ఎరుకల వ్యక్తి పంది మీద తీవ్రమైన బాణప్రయోగం చేస్తాడు.

"కుడి పక్క నెరికోడు గురుతులేసేను- ఎండి ఎముకల సందు నెళ్ళె నాణములు
బాణ మెల్లిన కాసి బ్రమ్మాండ మడిలే- దాని చాయలు ఎలుగు దగదగ లాడె
నపురూను కొర్రాను నాగు గక్కేను - పాలూను కొర్రాను పడగక్కె పంది
కుడి పక్క నెరికోడు గురుతు లేసితేను- ఎడమ పక్క సిల్లలేరి పడ్డాయి
సీమూను నెత్తురు సిమ్మారిల్లేను- ముకురు గుండుల జోడు ముక్కలాయేను
తనయరితి తావలం నెత్తురైనాది- ఎరుకోడేసిన ఏటు ఎరుపూను మంట
నిలలేక పోతాడు నీల యెన్నుండు"

ఎరుకలివాడు వేసిన బాణం పంది కుడిపక్క నుంచి ఎడమ వైపుకు దూసుకొని వెళ్ళి పోతుంది. ఆ దెబ్బను పంది తట్టుకోలేక పోతుంది. రాముని బాణం దెబ్బకు వాలి ఎంత బాధ పడ్డాడో అంత బాధను పంది అనుభవించింది. పంది అక్కడ నుండి మెల్లగా నడుస్తూ మధ్యలో విశ్రాంతి తీసుకుంటూ చివరికి పాతాళ పుట్టలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకుంటూ ఉంటుంది. తెల్లవారిన తర్వాత ఎరుకలివాడు పంది దెబ్బ నుండి కారిన రక్తాన్ని బట్టి పందిని వెదుక్కుంటూ పాతాళ పుట్ట దగ్గరికి వచ్చి పుట్టను తవ్వి లోపలకు ప్రవేశిస్తాడు. అప్పటికి విష్ణువు పంది రూపాన్ని వదలివేసి నిజరూపాన్ని ధరించి ఉంటాడు. తాను బాణంతో కొట్టింది శ్రీమహావిష్ణువునని తెలుసుకొని ఎరుకల వాడు భయంతో వణకిపోయి క్షమించమని వేడుకుంటాడు. దానికి విష్ణువు -

"అవుదువారే ఎరికోడ అవునంతటోడా- నేను రామావుతారమున మీ తండ్రి వోలి గొట్టాను
వోలి గొట్టిన పగలు నావద్ద నున్నాయి- తండ్రి గొట్టిన పగలు తనయులాకిద్దును
నీ వల్ల నేరాలు నేపు ఎరికోడ- జడవకో ఎరికోడ జంకు నీలేల
ఏడవకు ఎరికోడ ఏడవద్దనును"

వాలి వధకు సంబంధించిన విషయాన్ని గురించి కొంత వివరించవలసి ఉంది. భారతీయ సంస్కృతిని అధికంగా ప్రేమించే మార్గకవితా ధోరణికి చెందిన విమర్శకులు శ్రీరాముడు వాలిని వధించడంలో దోషం లేదని వ్యాఖ్యానిస్తారు. దానికి వారు చెప్పే కారణం ఇది. దశరథుడు చక్రవర్తి. భారతదేశమంతా అతని పరిపాలన



కింద ఉంది. శ్రీరాముడు అడవికి వచ్చిన తరువాత దశరథుడు చనిపోయాడు. రాజ్యం భరతునికి ఇవ్వబడినప్పటికీ భరతుడు రాజు గాకుండా శ్రీరాముని పాదుకలను సింహాసనం మీద ఉంచి శ్రీరామునికి మారుగా పరిపాలిస్తున్నాడు. అందువల్ల రాజ్యం శ్రీరామునిదే. అలాంటి సమయంలో ఇక్ష్వాకు చక్రవర్తి పాలనలో ఉన్న ఏ ప్రాంతంలోనైనా ఎవ్వరైనా ధర్మవిరుద్ధంగా వ్యవహరిస్తే అలాంటి వారిని శ్రీరాముడు శిక్షించడం న్యాయం.

ప్రస్తుతానికి వస్తే కిష్కంద రాజ్యం భరతుడు పాలిస్తున్న రాజ్యంలో ఉంది. వాలి ధర్మ విరుద్ధంగా నైతిక పతనం చెంది కుమార్తెగా చూడవలసిన మరదలు 'రుమ'ను (తమ్ముడైన సుగ్రీవుని భార్యను) చెరబట్టి తమ్ముని దేశం నుంచి వెళ్ళగొట్టాడు. సుగ్రీవుడు రుష్యమూక పర్వతంమీద బతుకుతూ శ్రీరాముణ్ణి ఆశ్రయించాడు. అంటే బాధితుడు సరాసరి చక్రవర్తినే సమీపించినట్లైంది. కాబట్టి శ్రీరాముడు వాలిని శిక్షించడం న్యాయమే అవుతుంది.

ఇక రెండవ విషయం శ్రీరాముడు వాలిని చెట్టు చాటు నుండి సంహరింప వచ్చునా? అనేది. ఇక్కడ ప్రధాన విషయం. వాలి నేరస్థుడా? కాదా? అనేది. అందరూ వాలి నేరస్థుడనే అంగీకరిస్తారు. నేరస్థుడైన వాలిని శిక్షించే అధికారం రామునికి ఉందని పైన చెప్పడం జరిగింది.

ఇక మూడవది. వాలిని రాముడు శిక్షించిన విధానం. వాలిని మానవ ధర్మంతో చూడాలా? పశు ధర్మంతో చూడాలా? అనేది కూడా ముఖ్యం. మొదట వాలిని పశువుగా చూస్తే ప్రపంచంలో ఎక్కడైనా పశువును ఎదురుగా వెళ్ళి చంపాలన్న నియమం లేదు. అలాంటప్పుడు వాలిని చెట్టు చాటు నుంచి శిక్షించడం దోషం కాదు.

వాలిని మానవధర్మంతో చూద్దాం! ఇక్కడ ప్రధాన విషయం ముద్దాయిగా చెప్పబడినవాడు నేరం చేశాడా లేదా అనేది. నేరం చేశాడని రుజువైతే ఆ తరువాత శిక్ష వేసే విధానాన్ని గురించి ప్రశ్న వస్తుంది. యుద్ధంలో ప్రత్యర్థిని చంపే విధానాన్ని, దోషిని శిక్షించే విధానాన్ని పోల్చి చూడకూడదు. ఇక్కడ వాలి ప్రత్యర్థి కాదు. దోషి మాత్రమే. ప్రపంచంలో దోషిని శిక్షించడానికి అనాదిగా అనేక మార్గాలు అనుసరింప బడుతూ ఉన్నాయి. ముఖానికి ముసుగు వేసి ఉరి తీయడం, విషప్రయోగం చేసి చంపడం, కుర్చీలో కూర్చోబెట్టి దానికి విద్యుత్‌ను ప్రవహించజేసి చంపడం మొదలైనవి ఇలాంటివి. వీటిలో ఏది న్యాయం అనే విషయాన్ని గురించి ఎవరూ ప్రశ్నించలేదు. శిక్షింపబడేవాడు దోషి అవునా? కాదా? అనేదే అందరూ చూశారు. అందువల్ల దోషి అయిన వాలి చక్రవర్తి దూత అయిన శ్రీరాముని చేత సంహరించబడ్డాడు. ఇందులో

శ్రీరాముని దోషం లేదని పండిత విమర్శకుల భావన.

కానీ జానపదుల దృష్టి వేరు. రాముడు సుగ్రీవుడు మిత్రులు. రాముడు సుగ్రీవుని పశువుగా చూడలేదు. తనతో సమానంగా ఆదరించాడు. అలాంటప్పుడు సుగ్రీవుని అన్న అయిన వాలిని పశువుగా ఎలా ఊహిస్తారు? అందువల్ల వాలిని జానపదులు పశువుగా భావించరు. అంతేగాకుండా ఇద్దరు యుద్ధం చేస్తున్నప్పుడు చెట్టు చాటు నుంచి అందులో ఒకరిని కొట్టడం అధర్మమని, పాపమని జానపదులు భావిస్తారు. జానపదులకు పండితులకు తెలిసినంత తర్కం తెలియదు. వారు ఏదైనా విషయాన్ని ముక్కుసూటిగా చూస్తారు. అలాగే ఆలోచిస్తారు. అలాగే చెబుతారు. అలా చూసినప్పుడు వాలి వధ విషయంలో రాముడు అధర్మంచేసి పాపాన్ని మూట గట్టుకున్నాడని జానపదులు భావించి ఆ పాపపరిహారం కోసం ఈ వరాహ అవతార కథను సృష్టించారు. రాముడు పాపం చేశాడా? లేదా? అనే విషయాన్ని అలా ఉంచితే పాపం ఎంత గొప్పవాడు చేసినా అది పట్టి పీడిస్తుందనే జానపదుల విశ్వాసం గొప్పది. ప్రశంసనీయమైనది.

ప్రస్తుత కథకు వస్తే విష్ణువు ఎరుకలివాడు తనను బాణంతో కొట్టడంలో అతని తప్పు ఏమీ లేదని అనునయించి బాణందెబ్బ నొప్పికి తట్టుకోలేక ఆ నొప్పి పోవడానికి ఏ మందు వాడాలో చెప్పమని ఎరుకల వ్యక్తిని అడుగుతాడు. దానికి ఎరుకల వ్యక్తి

"కుంకంబు కరియేలు కూరిసిన మందు- జాజికాయ జాపత్రి సల్లనా మందు
మంచి గంధముతోని మాను మీ పుండు"

అని చెప్పి తనకు ఏదైనా వరం ఇమ్మని విష్ణువును అడుగుతాడు. అప్పుడు విష్ణువు
"ఓరి పట్టరా ఎరికోడ వరము లిస్తాను - నీకు ఉండ ఇల్లులేదు వండ పొయ్యిలేదు
దేశ సంచార మాయి నువ్వు తిర్గాల- ఏడూర్లు తిరిగినా మూడుర్లు తిరిగినా
మూడు సోలలు నీకు బత్తెమన్నాడు- ఊరికొక తట్ట లల్లుకొని బతుకు
పెన్నమేసుకు అరిసెలు వండుకోవద్దు- సిలుకు సిమ్మాచలము నువ్వు ఎక్కవద్దు
అప్పన్న పాదాలు మెట్లు లెక్కొద్దు- తొలిమెట్టు కొబ్బరికాయ కొట్టి
వెనక తిరిగి ఎళ్ళరా ఎరికోడ నువ్వు"

అని అంటాడు. ఇది ఎరుకల వ్యక్తికి వరం కాదు, శాపం. బాణందెబ్బ నొప్పికి తట్టుకోలేక విష్ణువు ఎరుకలి వ్యక్తిని ఒక్కడినే గాకుండా అతని కులం మొత్తాన్ని శపించాడు. ఎరుకలి వారికి ఉండడానికి ఇల్లు, వండుకోవడానికి పొయ్యి ఉండకూడదనీ, స్థిరనివాసం లేకుండా వారు సంచారజీవనం చేయాలనీ, ఎన్ని ఊర్లు తిరిగినా వారికి



మూడు సోలల బత్తెం మాత్రమే దొరుకుతుందనీ, అంతకంటే ఎక్కువ దొరక కూడదనీ, తట్టలు బుట్టలు అల్లుకొని వాళ్ళు జీవించాలనీ, పెన్నంపెట్టి వారు అరిసెలు వండుకో కూడదనీ, సింహాచలం మెట్లు వారు ఎక్కకూడదనీ, ఒకవేళ సింహాచలానికి వస్తే సింహాచలం మొదటి మెట్టు దగ్గరే కొబ్బరికాయ కొట్టి వెనక్కు తిరిగి వెళ్ళి పోవాలని విష్ణువు చెప్పాడు. ఇదంతా ఆంధ్రదేశంలోని ఎరుకల పరిస్థితి. దీన్ని జానపద కవి శ్రీహరి శాసనంగా వర్ణించాడు. ఎరుకల వారికి సింహాచల స్వామి దర్శనం నిషిద్ధం కావచ్చు. హరిజనులను కాదన్న మన సంస్కృతి గిరిజనులను కాదనడంలో ఆశ్చర్యమేముంది.

ఆతరువాత విష్ణువు గంగలో స్నానం చేయటానికి కాశికి బయలు దేరుతాడు. మార్గ మధ్యలో ఒక దాసుడు ఎదురవుతాడు. విష్ణువు అతణ్ణి తనకు ధాహం అవుతూ ఉందని ఎంగిలి లేని నీళ్ళు లభిస్తే ఇమ్మని కోరాడట. అప్పుడు దాసుడు ఇలా చెప్పాడు.

"అప్పుడేమన్నాడు నీలయెన్నుండు -ఓ దాసుడా నాకింత దావుతవుతుంది.
ఎంగిల్లేని దావుతులు నాకు కావాల- ఆ మాటలిన్నాడు దాసుడప్పుడు
అవుదువోయి మాసోమి అవునంతటోడ- చెరులోని నీళ్ళన్నీ చేప లెంగిలి గాదా
ఎంగిల్లేని దావుతులు ఎచ్చోట తెద్దును- ఇక నూతిలో నీళ్ళన్నీ కప్పలెంగిలి గదా
ఎంగిల్లేని దావుతులు నీకెచ్చోట తెద్దు- ఆవుల పాలన్నీ దూడలెంగిలి గాదా
ఎంగిల్లేని దావుతులు నీకెచ్చోట తెద్దును- ఆమాట లిన్నాడు నీల యెన్నుండు
అవుదువోయి దాసుడా అవునంతటోడ- ఎనక తిరిగి సూడవోయి దాసుడా నువ్వు
ఎనక తిరిగి దాసుడూ సూసెనప్పుడు- సెంగయ్య సెట్టుకు సెంగ కొబ్బరి కాయ
పుట్టి ఉన్నాది
సెంగయ్య సెట్టు సెంగ కొబ్బరికాయ దీసి- దావుతులు ఇచ్చేను దాసుడప్పుడు"

పై గేయంలో చెప్పబడిన "చెరులోని నీళ్లన్ని చేపలెంగిలి గాదా" మొదలైన భావాలు తత్త్వాల్లో కనిపిస్తాయి. జానపద గేయాల్లో తత్త్వాలు ఒక భాగం. వీటిలో గొప్ప వేదాంతం ఉంటుంది. ఆంధ్రదేశంలో ఒక భక్తుడు తనకు ఇష్టదైవమైన లింగని, ఎంగిలి చేయని వస్తువులతో పూజించాలనుకున్నాడు. అయితే ఎంగిలి లేని వస్తువులు అతనికి కనబడ లేదని ఈ విధంగా కింది గేయంలో బాధపడుతున్నాడు.

"ఏమి సేతుర లింగ, ఏమి సేతుర లింగ ॥ఏమి॥
గంగ ఉదకము తెచ్చి నీకు, లింగపూజలు చేతమంటె
గంగనున్నా చేప కప్పలు, ఎంగిలంటున్నాయి లింగా
మహానుభావా మాలింగమూర్తీ ॥ఏమి॥

అక్షయావుల పాలు దెచ్చి, అర్పితంబు చేతమంటె
అక్షయావుల లేగదూడ, లెంగిలంటున్నాయి లింగా
మాహోనుభావా, మాలింగమూర్తీ ॥ఏమి॥
తుమ్మిపూలు తెచ్చినీకు తుష్టిగా పూజింతమంటె
కొమ్మకొమ్మకు కోటి తుమ్మెద, లెంగిలంటున్నాయి లింగా
మహానుభావా, మా లింగమూర్తీ ॥ఏమి॥

(తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట 431)

తత్త్వాల్లోని ఇలాంటి భావాలను విన్న జానపదకవి సందర్భాన్ని కల్పించుకొని ఈ కథాగేయంలో వాటిని పొందుపరిచాడు.

శ్రీహరి సూచనతో ఎంగిలి లేని నీరు కొబ్బరి బోండంలో ఉందని దాసుడు గ్రహించి దాన్ని స్వామికి అర్పిస్తాడు. ఆ తరువాత విష్ణువు గంగానదిలో స్నానం చేయడానికి కాశికి వెళతాడు. ఇంతటితో వరాహ అవతార కథముగుస్తుంది.

ఈ విధంగా శ్రీరాముడు వాలికి చేసిన అపకారానికి జానపదులు స్పందించి, తాము ఎల్లప్పుడూ కొలిచే శ్రీరామునికి శిక్షవేసి అతణ్ణి వరాహావతారంగా మార్చి అంగదుని ఎరుకల వ్యక్తిగా చేసి అతని బాణం దెబ్బకు వరాహం బాధను అనుభవించి నట్లుగా చెప్పి తత్కారణంగా విష్ణువు దోషం సగం తగ్గిపోయినట్లుగా భావించారు. "చేసిన పాపాన్ని ఎవరైనా అనుభవించక తప్పదు" అనే తమ ఆధ్యాత్మిక భావనకు త్రిమూర్తుల్లో ఒకరైన విష్ణువును గురిచేయడం జానపదుల విశ్వాసానికి పరాకాష్ఠ.

**10. కృష్ణావతారం :**

శ్రీమద్రామాయణం ఆదర్శకావ్యంగా పరిగణింపబడుతూ వుంది. అందులో నాయకుడైన శ్రీరాముడు ఆదర్శ కుమారుడుగా, ఆదర్శ సోదరుడుగా, ఆదర్శ పాల కుడుగా, ఆదర్శవంతుడైన భర్తగా చివరకు ఆదర్శవంతుడైన దేవుడుగా కూడా కనిపిస్తాడు. అతనితో ఎంత చనువు ఉన్నప్పటికీ హద్దులు కూడా అలాగే ఉంటాయి. లక్ష్మణుడు, సీత, హనుమంతుడు మొదలైన వారికి అతనితో ఎంత చనువున్నప్పటికీ వాళ్ళందరూ భయభక్తులతో రాముని ఎదురుగా నిలబడి అతని ఆజ్ఞకోసం ఎదురు చూసి అతను చెప్పినట్లుగా చేసేవారే గానీ, తమ సొంత ఊహలను అతనికి చెప్పడానికి సాహసించరు. ఇది రామావతారంలో ప్రధానంగా కనిపిస్తుంది.

అంతకు ముందున్న వామనావతారంలో వామనుడు బాలుడు, బ్రహ్మచారి. అందులో బలి చక్రవర్తి కథ తప్ప అతని గురించిన కథ లేదు. ఇక నరసింహస్వామిని చూస్తే భయం కలుగుతుంది. తరువాత భక్తి కలుగుతుంది. భక్తి ఉన్నప్పటికీ భయం



చెదరిపోదు. కాబట్టి నరసింహస్వామి ఉగ్రమూర్తిగానే పూజింప బడతాడు. ఇతర అవతారాల్లో మానవత్వ ప్రసక్తి లేదు.

ఇక కృష్ణావతార విషయానికి వస్తే కృష్ణుడు మానవుల సమస్త భావాలకు ఆటపట్టైన వాడుగా కనిపిస్తాడు. భగవంతుని తనవానిగా, ఆత్మీయునిగా చూసుకోవాలన్న భక్తుని కోరికను తీర్చినవాడు శ్రీకృష్ణుడొక్కడే. దూరంగా నిలబడి అతణ్ణి పూజ్యునిగా చూసిన ధర్మరాజు లాంటి వారున్నారు. అతణ్ణి బంధువుగా, మేనత్త కొడుకుగా చూసి వేళాకోళం చేసిన అర్జునిని లాంటివారు ఉన్నారు. అన్నగా ఆరాధించి తమ కోర్కెలు సాధించుకున్న ద్రౌపది లాంటి వారూ ఉన్నారు. అతణ్ణి భర్తగా పూజించిన గోపికలు, అష్టభార్యలు మొదలైనవారు ఉన్నారు. అతణ్ణి స్నేహితునిగా చూసిన రేపల్లె పశువుల కాపరులూ ఉన్నారు. అతణ్ణి రోటికి కట్టి దండించి, ముద్దాడి అతని మీద ప్రాణాలు నిలుపుకొని, వాత్సల్యాన్ని చూపిన యశోద ఉంది. విష్ణువు దశావతారాల్లో ఎవరికి తోచినట్లుగా వారు పూజించడానికి అనువైన అవతారం శ్రీకృష్ణావతారం. కాబట్టి భారతీయ భాషల్లో సాహిత్యం పుట్టినప్పటి నుంచి నేటివరకు శ్రీకృష్ణుని తమకు ఇష్టమైన ధోరణిలో కవులు వర్ణించి సంతృప్తి పొందారు. శ్రీకృష్ణునికి పదహారు వేల గోపికలను అంటగట్టారు. అంతేగాదు అతడు ఆకర్షింపని స్త్రీ లేనట్లుగా వర్ణించి సంతోషించారు.

ఇక అల్లరిచిల్లరిగా తిరిగే వారికి శ్రీకృష్ణుడే ఆదర్శంగా కన్పిస్తాడు. అనేక చిలిపి చేష్టలు శ్రీకృష్ణునికి అంటగట్టబడ్డాయి. దశావతారాల్లో మరెవరికీ ఇలాంటివి లేవు. దయగల దేవునిగా కూడా శ్రీకృష్ణునికి అగ్రతాంబూలం ఇవ్వబడింది. ఇదంతా పండిత సాహిత్యంలోని కృష్ణుని సంగతి.

ఇక జానపదుల సంగతి వేరు. వారిది పసిబాలుర మనస్తత్వం. భయపెడితే వారు దూరంగా వెళతారు. చనువిస్తే వారిలో కలుపుకుంటారు. భయపెడితే స్వామి! అంటారు. చనువిస్తే ఏరా! పోరా! అంటారు. అలాగని వారి వాత్సల్యాన్నీ, ప్రేమను, భక్తినీ, సహృదయాన్నీ శంకింప నవసరం లేదు. ఒకమాటలో చెప్పాలంటే భగవంతునితో మనసారా, తనివితీరా ఆడుకోవడానికీ అవకాశం ఇచ్చిన ఏకైక మూర్తి శ్రీకృష్ణుడు. కాబట్టే జానపద సాహిత్యంలో శ్రీకృష్ణుని కథలకు అగ్రతాంబూలం ఇవ్వబడింది. ప్రస్తుత కృష్ణావతారంలో జానపదుల భక్తి, ప్రేమ, శృంగారం కొత్తకొత్త పోకడలు పోయింది. మూలమైన సంస్కృత భాగవత పురాణానికీ తెలుగులో ప్రసిద్ధ అనువాదమైన పోతన భాగవతానికీ సంబంధం లేని కథలతో వర్ణనలతో చిలవలు పలవలుగా జానపద భాగవతం పెరిగి పోయింది. ఈ కృష్ణావతారంలో కృష్ణుని పేరు

తప్పు మిగిలిన కథ అంతా దాదాపు జానపదకవి కల్పితమే. ఆ విశేషాలను గురించి పరిశీలించుదాం.

కృష్ణావతార కథ దేవకి తల్లి అయిన 'చంద్రవతీ దేవి' సంతానం కోసం అనేక విధాలుగా ప్రయత్నించడంతో ప్రారంభమవుతుంది. ఆమెకు మొదట కంసుడు పుడతాడు. ఆ తరువాత చాల కాలం వరకు మళ్ళీ సంతానం కలగలేదు. ఆమె సంతానం కోసం అనేక రకాల నోములు వ్రతాలు చేసి చివరకు విష్ణువును గురించి తపస్సు చేస్తుంది. ఆ తపస్సు వర్ణన నరసింహావతార కథలో ఇలనార్జుని తపస్సు వర్ణన లాగా ఉంటుంది. ఆతర్వాత జానపద కవి ఒక కల్పన చేశాడు. ఎవరైనా ఏ దేవుని గురించి ఐనా తపస్సు చేస్తే ఆ తపస్సుకు మెచ్చి దేవుడు ప్రత్యక్షమై తపస్సు చేసేవారు అడిగిన వరాన్ని ఇస్తారు. కానీ ఈ కథాగేయంలో చంద్రవతీదేవి విష్ణువును గురించి తపస్సు చేస్తూ ఉంటే విష్ణువు ఆ విషయాన్ని గ్రహించి నారదుని పిలిచి

"అవుదువోయి నారదుడ అవునంతటోడ- పాలసంద్రము యొడ్డు పడతి తపసున్నాది
ఏ వరము కోసమో తపసులున్నాది- ఏగ్రమున నువ్వెల్లి రమ్మి నారదుడు"

అని చంద్రవతీదేవి ఏ వరాన్ని ఆశించి తపస్సు చేస్తుందో కనుక్కొని రమ్మని నారదుణ్ణి పంపిస్తాడు. అప్పుడు నారదుడు చంద్రవతీదేవి దగ్గరకు వచ్చి ఆమె తపస్సు చేయడానికి గల కారణాన్ని గురించి అడుగుతాడు. ఆమె తనకు సంతానం కావాలని చెబుతుంది. నారదుడు వచ్చి ఆ విషయాన్ని విష్ణువుకు చెబుతాడు. అప్పుడు విష్ణువు ఆమెకు 'దేవకి' అనే కుమార్తె కలుగుతుందనీ ఆ కుమార్తె గడియ పట్టుకొని నడిచే వయసు వచ్చినప్పుడు గడియగండం తగిలి చంద్రవతీదేవి భర్త చనిపోతాడని ఆ విషయాన్ని చంద్రవతీ దేవికి చెప్పిరమ్మని నారదుణ్ణి తిరిగి పంపిస్తాడు. నారదుడు వెళ్ళి ఆమెకు ఆ విషయాన్ని చెబుతాడు. ఆమె భర్త చనిపోయినా ఫరవాలేదు, తనకు సంతానం కావాలని కోరుకుంటుంది. నారదుడు తిరిగి విష్ణువు దగ్గరకు వచ్చి ఆ విష యాన్ని విష్ణువుకు చెబుతాడు. విష్ణువు ఆమెకు సంతానం కలుగుతుందని తపస్సు మానేసి ఇంటికి వెళ్ళమని నారదుని చేత కబురు పంపిస్తాడు. ఆమె ఇంటికి వెళుతుంది.

తరువాత కొంతకాలానికి ఆమెకు కుమార్తె పుడుతుంది. ఆమెకు దేవకి అని పేరు పెడతారు. దేవకి గడియ పట్టుకొని నడిచే వయసు వచ్చినప్పుడు గడియ గండం తగిలి ఆమె తండ్రి చనిపోతాడు. చంద్రవతీదేవి భర్తతో సహగమనం చేస్తుంది. అప్పుడు కంసుడు తన తండ్రి మరణానికి కారణమైన చెల్లెలు మీద కోపం తెచ్చుకొని ఆమెను తన తల్లిదండ్రుల చితిలో పడవేయడానికి ప్రయత్నిస్తాడు. ఐతే విష్ణువు అతని మనసు మార్చి దేవకిని చంపకుండా చూస్తాడు.



ఇంతవరకు చెప్పిన కథ అంతా జానపదకవి కల్పితమే. సంస్కృత భాగవతంలో గానీ, తెలుగు భాగవతంలోగానీ ఈ కథలేదు. కృష్ణుని తల్లి దేవకి ఈ కథలో చాలా ముఖ్యమైన పాత్ర. జానపద సాహిత్యంలో ముఖ్యమైన పాత్రలు వారి తల్లిదండ్రులకు లేకలేక అనేక పూజల, నోముల, తపస్సుల ఫలితంగా జన్మించినట్లుగా చెప్పబడుతూ ఉంటుంది. అలాగే దేవకీదేవి కృష్ణావతార కథలో ప్రధానమైన పాత్ర కాబట్టి ఆమె తల్లి అయిన చంద్రవతీదేవి చేసిన తపస్సు ఫలితంగా జన్మించినట్లుగా కవి రాశాడు.

తన తల్లిదండ్రులు చనిపోయిన తరువాత కంసుడు బ్రాహ్మణులను పిలిపించి ఆమె జాతకాన్ని గురించి చెప్పమంటాడు. దానికి బ్రాహ్మణులు ఆమె జాతకాన్ని పరీక్షించి

"ఔదువోయి కంరాజు అవునంతవాడా- ఇన్నావా కంరాజు ఇవరమల్లాను
దీని గర్భవాసన పుట్టిన బాలడు- ఆ మేనయల్లుడి సేత నీగండమున్నాది
బాలకీ బంగారు మేడ గట్టాల- ఒంటి సిరి మేడలో నొడితి నుంచాల"

అని చెబుతారు. భాగవతంలో దేవకి వసుదేవుల వివాహం అయిన తరువాత కంసుడు వారిద్దరినీ రథం మీద తీసుకొని వసుదేవుని ఇంటికి వెళుతూ ఉన్నప్పుడు ఆకాశవాణి దేవకి అష్టమ సంతానం వల్ల కంసునికి మరణం సంభవిస్తుందని చెప్పబడింది. ఈ కథలో జానపదకవి కంసుని మరణ విషయాన్ని జ్యోతిష్యుల చేత చెప్పించాడు.

ఆతరువాత కంసుడు జ్యోతిష్యులు చెప్పినట్లుగా దేవకికి ఒంటి స్తంభం మేడ కట్టించాలని భావించి మేడ కట్టడానికి కలపను తీసుకొని రావలిసిందిగా ఉప్పర్లను ఆజ్ఞాపిస్తాడు. కంసుని కాలంలో ఉప్పర్లు ఉన్నారో లేదో తెలియదు కానీ జానపదకవి కాలం నాటికి ఉప్పర్లు ఉన్నారు. ఉప్పర్లు కంసుని ఆజ్ఞ ప్రకారం అడవులకు వెళ్ళి ఒంటి స్తంభం మేడకు కావలసిన కలపను తెచ్చారట.

"ఆ పలుకులిన్నాడు ఆరు యుప్పరులు - పారలు గొడ్డళ్ళు బయలు నేసేరు
పాలోసి గొడ్డళ్ళు పదునులో సేరు- ఉప్పోసి గొడ్డళ్ల మెప్పిగను నూరేరు
బుజాన్ని గొడ్డళ్లు బిడ్డడంబళ్ళు- ఎల్లారు ఉప్పరుల నల్లకొండలకి
నల్లగొండల నడుమ ఉసిరేక మాను- ఉసిరేకమానుకీ ఉట్లేల గట్టేరు
ఎక్కి నరికీనారు ఏగి రుక్షాలని- పక్కనే నరికేరు పాలరుక్షాలు
దిగివచ్చి నరికేరు ఏపకంబాలని- కొండనున్నే కలప పల్లానికి దించేరు
పల్లాన్ని దాకలప బళ్ళ కెత్తేరు- పూసినారా బళ్ళు పూదారకన్న
పూసినారాబళ్ళ తోవలంబడని- మదనపురి పట్నమున మన్నెయాదుల్లోను
ఈదిలోపల బళ్ళు ఇప్పేసినారు"

తరువాత కంసుడు ఒంటి స్తంభం మేడ కట్టించి దేవకిని అందులో ఉంచుతాడు. దేవకి పెరిగి పెద్దదవుతుంది.

ఆ తర్వాత విష్ణువు బ్రాహ్మణ వేషంలో కంసుని దగ్గరకు వచ్చి యవ్వనంలో ఉన్న దేవకికి పెళ్ళి చేయాలని పెళ్ళి చేయకుండా ఉంచడం పాపమని చెబుతాడు. దుర్మార్గుడైన కంసుడు ఆమెను చనిపోవడానికి సిద్ధంగా ఉన్న ఒక ముసలివానికి ఇచ్చి వివాహం చేయదలచి తన భటులకు అలాంటి వ్యక్తిని తీసుకొని రమ్మని ఇలా చెబుతాడు.

"చెల్లెలికి పెళ్ళిళ్లు చేదునన్నాడు - ఎక్కడే నొక ఇరిది నెనికి తేవాల
ఉద్దండ పురుగులు ఓములోడిన గాని - ఎక్కడేనొక ఇరిది నెనికి తేవాల
విలవిలా పురుగులు విదిలేటి బామ్మడిని - ఎక్కడే నొక ఇరిది నెనికి తేవాల
సీమీని రత్తాలు సిమ్మరిల్లిన గాని - ఎక్కడే నొక యిరిది నెనికి తేవాల"

కంసుని ఆజ్ఞ ప్రకారం అతని భటులు చావడానికి సిద్ధంగా ఉన్న ఒక ముసలి వ్యక్తిని తీసుకొని వస్తారు. కంసుడు అతనికీ దేవకికీ పెళ్ళి చేసి వారిద్దరినీ ఒంటి స్తంభం మేడలో ఉంచుతాడు. వివాహం అయిన మరుసటిరోజునే ఆ వృద్ధుడు మరణిస్తాడు. అతని శరీరాన్ని పట్టుకొని దేవకి దుఃఖిస్తూ ఉంటే ఆ సమయంలో ఆకాశ మార్గాన అటుగా వెళుతున్న పార్వతీపరమేశ్వరులు ఆమె దుఃఖాన్ని జూసి జాలిపడి దేవకి భర్తను బ్రతికించి అతణ్ణి నవయవ్వనుడిగా మార్చి వసుదేవుడని పేరుపెట్టి వెళ్ళిపోతారు.

జానపదుల ఈ కల్పన అంతా అమూలకమే. జానపదులకు అద్భుతరసం మీద ఆసక్తి ఎక్కువ. కథలో ఆశ్చర్యకరమైన సంఘటనలు ఎంత ఎక్కువగా ఉంటే వారు అంత బాగా ఆదరిస్తారు. జానపదులు ఈ ఇష్టాన్ని గమనించి జానపదకవి ఈ కథాగేయంలో వసుదేవునికి సంబంధించిన పై కల్పన అంతా చేశాడు.

ఆ తరువాత కథలో మనులు, దేవతలు విష్ణువు దగ్గరకు వెళ్ళి కంసుని దుర్మార్గాలను గురించి చెబుతారు. విష్ణువు దేవకి గర్భంలో అష్టమకొడుకుగా జన్మించి కంసుణ్ణి చంపుతానని చెబుతాడు. ఆ తరువాత విష్ణువు నారదుని రప్పించి ఎరుకత వేషంలో దేవకి దగ్గరకు వెళ్ళి ఆమెకు సోది చెప్పాలని నారదునికి చెబుతాడు. నారదుడు ఎరుకల స్త్రీవేషంలో దేవకి దగ్గరకు వెళ్ళి శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణుడుగా ఆమె గర్భంలో జన్మించి కంసుని చంపుతాడని చెబుతాడు.

"ఏమంటా పలికింది రాస ఎరికీత- అమ్మ దేవి నీ గర్భమున దేవుడుడతాడమ్మ
దేశిపతి రాజులను పూసుకుంటాడే- పడితి నీ గర్భమున బాలుడుడతాడమ్మ
పద్దకొండవతారాల ఎత్తనున్నాడు- మామ కంజుని శిరిసి మట్టనున్నాడు
అత్త పూతుక జంపు అంగళ్ళ లోపల- బాలపాపల తోడి బంతులాడేను



చిన్న పిల్లలతోను చిరతలాడేను- దేవి నీ గర్భమున దేవుడుడతాడు
దేశిపతి రాజులకు పూసుకుంటాడు"

ఇక్కడ పూతుక కంసుని భార్యగా చెప్పబడింది. భాగవతంలో పూతన ఒక రాక్షస స్త్రీ. కంసుని ఆజ్ఞచేత ఆమె కృష్ణుని చంపడానికి వెళ్ళి అతనికి తన స్తనం నుంచి విషపు పాలను ఇవ్వడానికి ప్రయత్నించి అతని చేతిలో చనిపోతుంది. జానపద కవి పూతన పేరును పూతుకగా మార్చి ఆమెను కంసుని భార్యగా చేశాడు. నారదుడు ఎరుకత వేషంలో దేవకికి చెప్పిన జోష్యం పూతుక విని ఆ విషయాన్ని కంసునికి చెబుతుంది. కంసుడు వసుదేవుని దేవకి ఉన్న గదిలో గాకుండా వేరొక గదిలో ఉంచి సంకెళ్ళు వేస్తాడు.

దేవకి అప్పటికే ఏడుమంది కుమారులను కని ఉంటుంది. ఆ ఏడుమంది కుమారులను కంసుడు చంపివేస్తాడు. ఎనిమిదవసారి దేవకి గర్భం ధరించినట్లుగా కంసుడు తెలుసుకొని విషప్రయోగం ద్వారా ఆమె గర్భాన్ని తొలగించాలని దేవకి చేత బలవంతంగా విషాన్ని తాగిస్తాడు. ఆమె గర్భంలో ఉన్న కృష్ణుడు ఆమె అంగుట్లోకి తన అంగుడికి పెంచి ఆమె తాగిన విషాన్ని తాను స్వీకరించి తిరిగి ఆమె చేత వాంతి చేయిస్తాడు. విషం పనిచేయలేదని కంసుడు గ్రహించి, దేవకి శిశువును ప్రసవించ గానే ఆ శిశువును చంపడానికి అనేక ఏర్పాట్లను చేస్తాడు.

"కాపు లెట్టీనాడు కాలకులరాజు - పుట్టగానే బాలుణ్ణి బొడ్డు గొయ్యాబోయి
బొడ్డు గొయ్యాబోయి పొట్టగొయ్యాలని - మంత్రసానుల దెచ్చి మరుగు నుంచాడు
పుట్టగానే బాలుణ్ణి మట్టి జంపామని - మదమత్తు ఏనుగులు కాపులుంచేదు
పుట్టగానే బాలుణ్ణి పొడిచి చంపామని - పోట్ల గర్రాపుల్ని కాపులుంచేదు
పుట్టగానే బాలుణ్ణి కరిసి చంపామని - కాట్ల బేబ్బులు తెచ్చి గయినొద్ద నుంచె
పుట్టగానే బాలుణ్ణి మోరు చంపామని - నాగుబామును తెచ్చి నట్టింట నుంచె
పుట్టగానే బాలుణ్ణి కళ్లు పొడవమని - కరుకోడు పుంజలను కాపులుంచేను
పుట్టగానే బాలుణ్ణి పిసికి చంపామని - పురుడు పిశాచుల్ని కాపులుంచేదు
పుట్టగానే బాలుణ్ణి ఊరు చంపామని - ఉల్లు బాములు తెచ్చి వొల్లాటలేసె
పుట్టగానే బాలుణ్ణి సంది గొట్టామని - పురుడు పిశాచుల్ని కాపులుంచేదు"

మంత్రసానులను, ఏనుగులను, పోట్ల కర్రావులను, కాట్ల బెబ్బులను, కరి కోడి పుంజులను, పురుడు పిశాచాలను మొదలైన వాటిని దేవకికి పుట్టబోతున్న శిశువును చంపడానికి కంసుడు కాపులుంచాడట. అప్పుడు దేవకి ఇదంతా గమనించి తాను దుర్మార్గుడైన కంసుని తోబుట్టువుగా ఎందుకు పుట్టాలని, ఈ ఆడజన్మ ఎత్తడం కంటే అడవిలో తులసి మొక్కగా గానీ, కొండమీద బండగా గానీ పుట్టివుంటే బాగుండేదని ఇలా దుఃఖిస్తుంది.

"అప్పుడేమన్నాది తల్లి దేవాకి - అన్నికరి కంరాజు అడియారిపోను
పాపకరి కంరాజు వదు పాదుగాను - అన్ని కారోడి తోడ నేనేల బుట్టితి
ఈ ఆడజల్మాలు ఎత్తున్నిమారు - అడవిలో తులసాయి పుడితేని మేలు
ఈ ఆడజల్మాలు ఎత్తున్నిమారు - కొండమీద బండనయి పుడితేని మేలు
కొలకొలన కన్నీరు కొలకలంటొదిలింది - వలవలన కన్నీరు వొంపె దేనాకి"

ఆమె దుఃఖాన్ని గమనించి గర్భంలో ఉన్న కృష్ణుడు ఆమెతో ఇలా చెబుతాడు.

"నల్ల నల్లని వాడ్ని నామంబు గలవాణ్ణి- సృష్టిలో నాపేరు కుష్ణుడోలమ్మ
అమ్మరో నీపుట్టిల్లు అతము జేసేదనమ్మ- దుమ్మునే మనదపురి దూలి గలుపుదునమ్మ
మామ కంజుని జంపి మదనపురి నేలుదును- అత్తపూతుక జంపుదు అంగళ్లలోను
పుట్టు బుదవారము కట్టుదామాస- పుట్టుతానే తల్లి పురియిల్లలోన
ఎదిరిగాలనొస్తాను ఎరుగుండవనమ్మ"

అప్పుడు దేవకి, కంసుడు పుట్టిన బాలను వెంటనే చంపడానికి అనేక రకాల కాపులను ఉంచాడనీ, వారందరూ కాపులుండగా నీవెలా పుడతావని కృష్ణుణ్ణి అడుగుతుంది. దానికి కృష్ణుడు తన మహాత్మ్యం చేత వసుదేవుని సంకెళ్ళను తొలగించి, అతణ్ణి రప్పించి, తనను చంపడానికి అక్కడ ఉన్న జంతువులన్నిటికీ ఆహారాన్ని వేయిస్తాడు. అవి ఆహారం తింటూ కాపల మరిచిపోతాయి. ఆ సందర్భంలో తాను పుడతానని కృష్ణుడు చెబుతాడు. ఆ తరువాత దేవకి తన అన్న కంసుడు గొప్ప దుర్మార్గుడనీ, అతడు తప్పనిసరిగా కృష్ణుడు పుట్టగానే చంపివేస్తాడని చెబుతుంది. అప్పుడు కృష్ణుడు తాను సామాన్యమైన వాడిని కాదని, అంతకుముందు తొమ్మిది అవతారాలెత్తిన శ్రీమహా విష్ణువునని చెబుతాడు. ఆ తరువాత జానపదకవి శ్రీకృష్ణుడు జన్మించిన ఘట్టాన్ని విపులంగా వర్ణించాడు. కృష్ణుడు జన్మించిన తర్వాత దేవకి అతని అందాన్ని చూసి ఒకవైపు సంతోషపడుతూ మరొకవైపు తన అన్న వచ్చి అతణ్ణి చంపివేస్తాడని బాధపడుతూ ఇలా దుఃఖిస్తుంది.

"ఈపు నింజామరి ఇమిడి యున్నది కొడుకా- ఏల పుట్టదు కొడుకా మామ గండమున
మా యింట పుట్టక గొల్లలింటను పుడితే- కొన్నాళ్ళు గోవులను కాసి బతుకుదువు
నీల ఎన్నుడు రూపు నిరినించి చూసింది- వల్లబుదు రూపులు వరినించి చూసింది
కళ్ళు చింతామని కలిగి యున్నది కొడుకా- ఏల పుట్టుదు కొడుకా మామ గండమున
మాయిల్ల పుట్టక రాసిల్ల పుడితేని - కొన్నాళ్ళు రాజరిక మేలుదువు కొడుకా
అరికాల్ల తామర పద్దమమరి యున్నాది- ఏల పుదుదువు కొడుకా మామ గండమున"

ఈ సందర్భంలో జానపద కవి ఒక విచిత్రమైన కల్పన చేశాడు. కృష్ణుడు ఇప్పుడు తనకు తల్లి అయిన దేవకి తాను రామావతారమెత్తినప్పుడు తన పినతల్లి కైక అనీ,



అప్పుడు ఆమె మందర మాట విని తనను అడవులకు పంపిందనీ, అందువల్ల ఈ జన్మలో ఆమె పాలు తాను తాగనని, తాను రేపల్లెలో ఉన్న గోపెమ్మ పాలు తాగుతానని కృష్ణుడు దేవకితో ఇలా చెబుతాడు.

"నీ పాలు తాగితే పాపమే మా తల్లి - పాలు తాగడం నాకు పంతులేదమ్మా
అగ్గజుడి కొరకాయి అవతార మెత్తుదును ........................................
రామాపుతారాలు ఎత్తున్ని నాడమ్మ - నాకు పినతల్లివే నువ్వు తల్లి దేవాకి
మందర మాటలు నువ్వు ఏల ఇన్నావు- ఒంతు ఇవ్వక నన్ను వనమేల పంపేవు
అందుకే నీపాలు తాగనన్నాను- ......................................
సాకి పరవతంతోని సాదేవి పుట్టేను- సాదేవి కూతురు గోపెమ్మ పుట్టేను
గోపి పాలు తాగ జాతకము నాది- గోపి పాలు తాగి గొల్లడవుతానమ్మ"

ఆ తరువాత కృష్ణుడు తనను తీసుకొని రేపల్లెకు పదమని తల్లికి చెబుతాడు. దేవకి కృష్ణుడు చెప్పినట్లుగా కృష్ణుని ఎత్తుకొని రేపల్లెకు బయలు దేరుతుంది. దారిలో కృష్ణుడు ఆమెకు అనేక రకాల పరీక్షలు పెట్టి తన మహాత్మ్యాన్ని తెలియజేస్తాడు. చివరకు దేవకి రేపల్లెకు వెళ్ళి అక్కడ నందుని భార్య అయిన గోపెమ్మ పక్కలో కృష్ణుని ఉంచి ఆమెకు జన్మించిన ఆడ శిశువును తాను ఎత్తుకొని చాటుకు వెళ్తుంది.

భాగవతంలో తనకు కూతురు జన్మించిన విషయం యశోదకు తెలియనట్లుగా చెప్పబడింది. కనీసం పురుడు పోసిన మంత్రసానికైనా తెలియదా? అని జానపదులకు అనుమానం వచ్చింది. ఆ అనుమానాన్ని జానపదకవి చిన్నకల్పనగా ఇలా చెప్పాడు. కృష్ణుడు గోపెమ్మ పక్కలో పడుకున్న తరువాత ఏడ్చాడట.

"గోపమ్మ పక్కలో నమురుకున్నాడు - గోలు గోలూమని గోల చేసేను
కావు కావుమని బాల కంకటిల్లేను - నిద్రమేలుకొని తల్లి గోపెమ్మ
అస్తాల బాలున్ని తడిమి చూసేను - ఇందాకాడబాలిపుడు మగ బాలని
ఇదేమి సోద్దెమె ఇచ్చింతరంబు - బొడ్డుకోసిన దాన బోగపురి పైడమ్మ
ఇదేమి సోద్దెమే ఇచ్చింతరంబు - ఇందాక ఆడబాల ఇపుడు మగబాల
బొడ్డు కోసుతపుడు బొమ్మల్ల పద్దాడు - అప్పుడే మగ బాలడమ్మ నీసుతుడు
నీలు బోసినదానా నీలారి గొంతాని - ఇదేమి సోద్దెమే ఇచ్చింతరంబు
నీలు బోసినపుడు నిను జూడలేదమ్మా - అప్పుడే మగ బాలడమ్మ నీసుతుడు"

కృష్ణుడు ఏడ్చినప్పుడు గోపెమ్మ అతణ్ణి తడిమి చూసి తన పక్కలో ఉన్నది మగశిశువుగా గుర్తిస్తుంది. ఐతే తనకు జన్మించింది ఆడశిశువు అనే విషయం ఆమెకు తెలుసు. అందువల్లనే ఆమె శిశువు బొడ్డు కోసిన పైడమ్మ అనే స్త్రీని "ఇందాక ఆడబాల, ఇప్పుడు

మగబాల" ఈ విచిత్రం ఎలా జరిగిందని అడుతుంది. ఐతే పైడమ్మ ఆమెకు పుట్టింది మగబాలేనని చెబుతుంది. ఇదే సమయంలో చాటున ఉన్న దేవకి నవ్వుతూ గోపెమ్మ దగ్గరకు వస్తుంది.

"నవ్వుతును దేవాకి నట్టింటి కొచ్చె - ఏమంటా పలికినాది తల్లి దేవాకి
అప్పరా ఓలప్పా అప్ప గోపెమ్మా - మగబాలనీకప్ప ఆడబాల నాకు
ఆ పలుకు లిన్నాడు నీల ఎన్నుండు - చిన్నవోడు శ్రీకృష్ణ పెద్దవోడైనాడు
ఇద్దరి తల్లులకు మద్దెస్థుడయ్యెను - కల్లందామన ముంచి కాయితము రాసె
మగబాల నీకమ్మో ఆడబాల నీకని - కల్లందామన ముంచి కాయితము రాసె"

శిశువుగా ఉన్న కృష్ణుడు పెద్దవాడై గోపమ్మ దేవకిల ఇద్దరి మధ్యకు వచ్చి ఒకరికి ఆడబాల, ఇంకొకరికి మగబాల కలిగినట్లుగా కాగితం రాయించాడట.

ఆ తరువాత దేవకి దుర్గను తీసుకొని మధురా నగరానికి వస్తుంది. కంసుడు ఆ శిశువును తీసుకొని పైకి ఎగరవేసి నరకబోతాడు. అప్పుడు ఆమె కంసునితో ఇలా చెబుతుంది.

"తుళ్ళవద్దొరె మామా తుళ్ళవద్దు- నీతుళ్ళు తుంగళ్ళ దూళి గలుపుదుము
నీ పాల మిత్తుకుడు మదనపురి పుట్టి- ఏగితే రేపల్లె కెల్లి పోయినాడు
ఎన్న కూడేదిని ఎదుగుతున్నాడు"

ఆ తరువాత కంసుని భార్య అయిన పూతుక రేపల్లెలో ఉన్న కృష్ణుని చంపడానికి వెళ్ళి అతని చేతిలో చనిపోతుంది. అలాగే కంసుడు గూడా కృష్ణుని చంపడానికి వెళ్ళి చనిపోతాడు. ఆ తరువాత కృష్ణుడు వారిద్దరికీ దహనసంస్కారాలు చేసి గయలో పిండ ప్రదానం చేస్తాడు.

ఆ తరువాత కథలో శ్రీకృష్ణుని చిలిపి చేష్టలు వివరింపబడ్డాయి. వ్యాసుని భాగవత పురాణంలో నామమాత్రంగా ఉన్న శ్రీకృష్ణుని చిలిపిచేష్టలను పోతన తెలుగు భాగవతంలో ప్రధానాంశాలుగా వివరించాడు. మధుర భక్తిలో మహిమ ఉన్నదో లేక రసగుళికల లాంటి పోతన పద్యాల్లో మహిమ ఉందో చెప్పలేము గానీ పోతన రాసిన శ్రీకృష్ణుని చిలిపి చేష్టలు ఆంధ్రులను ఎంతగానో ఆకర్షించాయి. తెలుగు కవుల పాత్రచిత్రణా సామర్థ్యం చేత ప్రసిద్ధమైన రెండు పౌరాణిక పాత్రలు పూర్తిగా మారి పోయాయి. ఒకటి సత్యభామ పాత్ర మరొకటి శ్రీకృష్ణుని పాత్ర. సత్యభామ శ్రీకృష్ణుని తన్నినట్లుగా తిమ్మన తన 'పారిజాతాపహరణం'లో రాశాడు. ఇలాంటి కవుల చిత్రణ కారణంగా తెలుగువారి దృష్టిలో సత్యభామ అసూయాపరులుగా, గర్విష్ఠిగా, శ్రీకృష్ణుని తన వశం చేసుకున్న అందాల భామగా ఉంది. మిగిలిన భారతీయుల దృష్టిలో



సత్యభామ వేరు. శ్రీకృష్ణుని విషయంలో కూడా ఇదే జరిగింది. తెలుగు భాగవతంలో ఉన్న శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు అందులో ముఖ్యంగా గోపికలు యశోదకు శ్రీకృష్ణుని మీద కొండాలు చెప్పడం మూలగ్రంథంలో కన్పించవు. ఇందులోని కొన్ని పద్యాలు మధుర భక్తి చెందినవి. సారాంశమేమంటే పోతన ప్రభావం చేత తెలుగువారి దృష్టిలో శ్రీకృష్ణుడు చిలిపి కృష్ణుడయ్యాడు. క్రమంగా ఆ చిలిపితనం, కొంటెతనం హద్దులు దాటిపోయాయి. మూలంలో లేని పోతన కల్పించని ఎన్నో కొంటెపనులను జానపదులు శ్రీకృష్ణునికి అంటగట్టారు.

అల్లబోయిన గొల్లపెద్దమ్మ అనే ఆమెకు తొమ్మిది మంది కోడళ్ళు ఉంటారు. వారు ఆలమందకు వెళ్ళి తొమ్మిది కడవల నిండా పాలు తెస్తూ ఉన్నప్పుడు కృష్ణుడు సుంకరి వేషంలో వారిని అడ్డగించి, భయపెట్టి ఆ పాలన్నీ తానే తాగి, వారి అత్తదగ్గరకు వచ్చి కోడళ్ళు పాలన్నీ తాగారని చెబుతాడు. ఆ అత్త కోడళ్ళను దండిస్తుంది.

నిద్రపోయిన ఒక కోడలిజుట్టును పెయ్యతోకను ముడివేసి పెయ్యను బెదరగొట్టి పరుగెత్తిస్తాడు. పెయ్యవెంట ఆ కోడలు వీధుల్లో ఈడ్చబడుతుంది.

మరొకసారి కృష్ణుడు ఒకరోజు రాత్రి వారి ఇంట్లోకి ప్రవేశించి ఉట్టి మీద ఉన్న పాలు పెరుగు తిని పాలను కోడళ్ళ మూతికిపూసి వారి అత్త దగ్గరకు వెళ్ళి పాలుపెరుగు వారే తిన్నారని చెప్పి అత్తచేత వారిని దండింపజేస్తాడు. కృష్ణుని ఈ దుండగాలను సహించలేక గొల్ల భామలు అతని తల్లి గోపెమ్మ దగ్గరకు వెళ్ళి ఈ విధంగా చెబుతారు.

"అత్తరా యోలత్తో ఓ లత్త గోపెమ్మ- మాకోసం కన్నావా మర్మ దుండగుడ్ని
మామనవు లుంచడు మగువ నీసుతుడు- పాలిచ్చే పిల్లలకు పాలివ్వనివ్వడు
మామనువు లుంచడు మగువ నీ సుతుడు- మా కోసం కన్నావా ఈమర్మ దుండగుని"

గొల్లభామలు ఈ విధంగా ఫిర్యాదు చేస్తూ ఉంటే గోపెమ్మ విసిగిపోయి కృష్ణుడు రేపల్లెలో ఉంటే తగవులు తెస్తూ ఉంటాడని భావించి గోపెమ్మ అతణ్ణి ఆల మందకు వెళ్ళమంటుంది. కృష్ణుడు కూడా దానికి అంగీకరిస్తాడు. ఆలమందకు వెళుతున్న కృష్ణునికి గోపెమ్మ భోజనం పెట్టింది.

"మెట్టవుసిరీకాయ మేకలా మజ్జిగ - చిక్కన్న సల్దిలో కట్టె గోపెమ్మ
కొండ వుసిరీకాయ గోవులా మజ్జిగా - చిక్కన్న సలిదిలో కట్టె గోపెమ్మ
అష్టబూలోకాల కిష్టావతారుడు - బోంచేసె నాసోమి బొజ్జల్ల మొయ్య"

కృష్ణుని కాలం నాడు మేకలు ఉండకపోవచ్చు. అయినప్పటికీ కవి కాలంలో అవి ఉన్నాయి. కాబట్టి కృష్ణుడు ఊసిరికాయ మేకల మజ్జికతో భోజనం చేసినట్లుగా కవి

చెప్పాడు. నిజానికి ఆనాడు ఆవులమంద ఎక్కువ ఉన్న కృష్ణునిలాంటి వారు పాలు, పెరుగు, నెయ్యిని తింటారు. మజ్జిగను వాడరు. మజ్జిగను పాడిలేని వారికీ, బీదవారికీ ఉచితంగా పోస్తారు. జానపదులందరూ సాధారణంగా బీదవారే పాలు, పెరుగు తినే అవకాశం వారికి తక్కువ. వారు మజ్జిగను మాత్రమే భోజనంలో వేసుకోగలరు. అంటే జానపదుల ఆహార పద్ధతిని కవి ఇక్కడ కృష్ణుని పరంగా చెప్పాడు.

తర్వాత గోపెమ్మ కృష్ణుని తీసుకొని ఆలమందకు వెళుతుంది. కృష్ణుడు చెట్టెక్కి ఆలమందను చూస్తాడు. ఆలమంద కొండల వెంట, గుట్టలవెంట చెదరిపోయి ఉంటుంది. కృష్ణుడు పిల్లనగ్రోవి ఊది ఆవులను వాటి పేర్లుపెట్టి ప్రేమతో ఇలా పిలిచాడు.

"ఎండి పిల్లన గగ్ర ఏని నాదంబాడి- ఆవులని పిలిచినడు అయ్య మాదముడు
ఒక ఒక్క దేనువుని వర్ణించి పిలిచె- ఆవుల్ని పిలిచేడు ఆది కుష్ణుండు
ముందలను మేసేవు ముత్యాల గొడుగా- మదును మామిడిరాయే మైనిపురి సిలకా
నువ్వు మేపు కుర్చుకు రమ్మి కేపు నీల్లకని- ఆవులను పిల్చినాడు ఆదికుష్ణుండు
ఆకాసమారెల్లి ఆల్లుకొని మేసేవు- ఆలిముత్తెము రాయె పాలజాగరమా
మేపు కుర్చుకు రమ్మి కేపు నీల్లకని- ఆ మాటలన్నాడు నీల వర్ణుండు
ఒక ఒక్కదేనువును వర్ణించి పిలిచె- మేగముల చాటంట మెసిలాడి మేసేవు
పసిని కంటిగ రాయె పద్దలకు తల్లి- మేపు కూర్చుకు రమ్మి కేపునీల్లకని
బూదేవతారెల్లి పూనుకొని మేసేవు- కురస గుమ్మడి రాయే కుంకాల పాడిరాయ
నేత ఎన్నెల రాయె నేగలకుతల్లి - మేపు గూర్చుకు రమ్మి కేపు నీల్లకని
అష్టబూలోకాల కాది కుష్టుండు- ఆవులను పిలిచేను గోవులా గొల్ల
కంటిలోది నలక కారగ్గి తొలి పురగ- సెరులోని సెదపురుగ దేవుతలు కొలువా
మేపు కూర్చుకు రమ్మి కేపు నీళ్ళకని- శెంకు సెకారాల దశావతారుడు
ఆవులని పిలిసేను గోవులా గొల్ల- చిత్తారి సిరికనకరట్లమానుకి రాయె
గురుకు బొల్లువ రాయె గుత్తాపుతీగె- మేపు కూర్చుకు రమ్మి కేపు నీల్ల కని
ఆవులను పిలిచేను ఆది కుష్టుండు- గోవులను పిలిసేను గోపాల సోమి"

ఈ వర్ణన ఇంకా సుదీర్ఘంగా సాగుతుంది. ఇందులో కృష్ణుడు ముత్యాల గొడుగు, మైనపురి చిలక, ఆణిముత్యం, పాలజాగరం, పసిడికంటిక, కురసగుమ్మడి, కుంకాల పాడిరాయ, గురుకు బొల్లువ, ఈరగవిరి, దివ్వెలగరిట మొదలైన పేర్లతో ఆవులను పిలిచాడు. అంతే గాకుండా ఆవుల రంగును బట్టి కృష్ణుడు కర్రావుదూడ, మైలావు, సిలకవన్నావు, గోరవన్నావు, హంసవన్నావు, నాగబొల్లావు మొదలైన విధంగా ఆవులను పిలిచాడు. జానపదకవి ఆవులకు పెట్టిన ఈ పేర్లు పరిశీలిస్తే అతని భావనా శక్తి, లోక



పరిశీలనా శక్తి, పదకల్పనాశక్తి తేటతెల్లమవుతుంది.

ఆ తరువాత గోపెమ్మ కృష్ణునికి ఆవుల విషయంలో కొన్ని జాగ్రత్తలు చెబుతుంది. కృష్ణుడు వడ్డెవారి కోన, మాతంగుడికోన, కాలింగుడికోన, చెంచువారికోన, శివశక్తి కోన, దేవేంద్రుని కోన మొదలైన కోనలకు వెళ్ళకూడదని ఆ కోనలకు వెళితే వాటి పాలకుల వల్ల ప్రమాదం కలుగుతుందని కృష్ణునికి చెబుతుంది. తర్వాత గోపెమ్మ ఆలమందకు పెద్దదిక్కుగా ఉన్న బసవన్నను పిలిచి అతనికి కృష్ణుణ్ణి, ఆలమందను అప్పగిస్తూ ఇలా చెబుతుంది.

"అవుదువోయి బసవన్న అవునంతవాడా- చిన్నోడు కుష్ణమ్మ మందకొస్తున్నాడు
మంద నీకిల్లడోయి బసమదేవుండా- పోకిరి ఏసాలు నువు మానుకోవాల
మందనీ కిల్లడోయి బసమ దేవుండాని- బసమ దేవుడికి మంద ఇల్లదెట్టింది"

పై విధంగా చెప్పి గోపమ్మ రేపల్లెకు వెళ్ళిపోతుంది. అప్పుడు కృష్ణుడు ఆవుల మందను మేపడానికి కదిలిస్తాడు. దాన్ని జానపదకవి ఇలా వర్ణించాడు.

"అప్పుడే మన్నాడు నీల యెన్నుండు- ఆరులచ్చాదవులు కోటేల పాలకులు
మంద పాలకులార మాయన్నలారా- కదలించండి మంద కాలనాదమున
కదలినాయామంద కాలనాదమున- పుచ్చపూ వర్ణమున పున్నుడాల మంద
రవ్వనే రవదూలి కమ్ముకెల్లేను- కదలించినాడా మంద కాలనాదమున
గోగుపూ వర్ణమున గొల్లడాలమంద- రవ్వనే రవదూలి కమ్ముకెళ్ళేను
కదలించినారా మంద కాలనాదమున- ఆవుల రవదూలి ఆకాసము గమ్మెను
ఆకసము రవదూలి ఆవుల గమ్మెను"

కృష్ణుడు ఆ విధంగా ఆవులను కదిలించి మైనాద్రిగిరి, సుద్దగిరి, సుమ్మగిరి, విష్ణుగిరి, గాదుగిరి మొదలైన అనేక కొండల మీద ఆవులను మేపుతారు. కృష్ణుడు ఆల మంద చాల పెద్దది. అందువల్ల ఎన్ని కొండల మీద గడ్డి మేపినప్పటికి ఆవులకు కడుపు నిండలేదు. దాన్ని గమనించిన కృష్ణుడు గోపెమ్మ ఏఏ కోనలకు వెళ్ళవద్దని చెప్పిందో ఆ కోనలకు ఆవులను తోలి మేపాలని నిశ్చయించు కుంటాడు. కృష్ణుడు మొట్టమొదట ఒడ్డెవారి కోనలో ఆవులను తోలి మేపుతాడు.

"ఆరులచ్చాదవులు కోటేల పాలకులు- మంద పాలుకులార మాయన్నలారా
వడ్డెవారి కోనలకు గోవులొద్దుండి- వడ్డెవారి కోనలను ఆవులను తోలేరు
పన్నెండామట మేర పద్దలాలమంద ఎన్నూరామట మేర యెడ్లాల మంద
మున్నూరామట మేర మునిదూడలున్నాయి- కదిలించె నామంద కాలనాదమున
రమ్మునె వడిబలము రవదూలి గమ్మేను- కొమ్మలన్నడి బలము కొట్టి మేపేదు

వడ్డెవరి కోనల్లొ ఒడ్డుగా మేసేను- వడ్డె బాసలు కొన్ని తానేర్చినాడు"

ఒడ్డెవారి కోనలోఆవులను తోలినప్పుడు వడ్డెవారెవరూ కృష్ణుని అడ్డగించ లేదు. స్వేచ్ఛగా కృష్ణుడు ఆ కోనలో ఆవులను మేపాడు. ఆ తరువాత కృష్ణుడు మాతంగుని కోనలో ఆవులను తోలి మేపుతున్నాడు. ఆ కోనకు అధిపతి మాతంగుడు.

"ఆ కోనలున్నాడు మాతంగుడన్నోడు - అప్పుడేమన్నాడు మాతంగుడన్నోడు

తరముతరముల నుంచి ఈ కోనలున్నాను - నరుడు ఎవ్వడు గాని నా కోన రాలేదు

దుండుగుడు గొల్లోడు దురుతమేటో గాని- నాకోన మేపొచ్చె గొల్లవోడిపుడు

చూస్తాను నేనిపుడు వడి దిట్టతనమల్లాని- ఓలి పిల్లిమొగ్గలేసుకొని ఎల్తందు

నీలయెన్నుడి వద్ద కాదనుకున్నాడు- అప్పుడే మన్నాడు నీల యెన్నుండు

వడిరెండు కాళ్ళు కలిపి పట్టూకొని - గిరగిరని దిప్పి దరిని కేసి కొట్టేను"

మతంగుని కోనలో అంతవరకూ ఎవరూ ఆవులను మేపలేదు. మొదటిసారిగా కృష్ణుడు తన ఆలమందను ఆ కోనలో తోలి మేపుతుంటే మాతంగునికి చాల కోపం వచ్చి ఆవులను మేపే గొల్లవాడి బలమేమిటో చూస్తానని పిల్లి మొగ్గలు వేసుకుంటూ కృష్ణుని దగ్గరకు వస్తాడు. కృష్ణుడు మాతంగుని రెండు కాళ్ళు పట్టుకొని గిరగిరతిప్పి భూమికేసి కొడతాడు. అప్పుడు మాతంగుడు వచ్చినవాడు సాధారణమైన గోపాలకుడు కాదని శ్రీకృష్ణుడని తెలుసుకొని తనకు బతుకుతెరువు చెప్పమని అతణ్ణి వేడుకుంటాడు. అప్పుడు కృష్ణుడు మాతంగునికి ఇలా చెబుతాడు.

"సెప్పుతను మాతంగుడ సెవులాలకించు- ముందటికి కలియుగం పుట్టనున్నాది

ఊరూరు దేశాలు పుట్టనున్నాయి- ఊరూరికే నువ్వు బతక బోవాల

ఊరూర చెప్పులు కుట్టుకో నువ్వు- గొడ్డుతోలు నువ్వు తెచ్చుకోరా

నరులకి జోళ్ళు నువ్వు కుట్టుకోవాల- ఊరికో మాతంగులై మీరు చెదరిపొండ్రా

తరము తరము మీరు ఆ రీతి బతకండి - ఆ తెరువు సెప్పేను నీల యెన్నుండు"

మాతంగుడు అంటే మాదిగ కులానికి చెందినవాడు. కృష్ణుని కాలంలో మాతంగులు ఉన్నారో లేదో చెప్పలేం. కవి కాలంలో వారు ఉన్నారు. అంతేగాదు వారి వృత్తి చని పోయిన పశువుల చర్మాన్ని తీసి దాంతో చెప్పులు కుట్టి అమ్ముకోవడం. జానపద కవి లోకంలో ఉన్న దాన్ని కృష్ణుని శాసనంగా కల్పించాడు.

ఆ తరువాత కృష్ణుడు ఆలమందను కాలింగుని కోనలో తోలి మేపుతూ ఉంటాడు. ఆకోనలో ఉన్న మడుగులో 'కరుకోటి శేషువుడు' అనే పెద్ద కాలసర్పం ఉంటుంది. ఆవులు కాలింగుని కోనలో గడ్డి తిని నీళ్ళు తాగడానికి మడుగు దగ్గరికి వెళ్ళాయి. శేషువుడు ఒక తెల్ల ఆవును పట్టుకుంటాడు. ఆ విషయాన్ని గమనించిన



కృష్ణుడు వెంటనే చెంగున మడుగులోకి దూకి శేషువుని కాలుతో తొక్కడానికి ప్రయత్నిస్తాడు. శేషువుడు కృష్ణుని కాటువేస్తాడు. ఆ విషానికి కృష్ణుడు మూర్ఛపోతాడు. కాసేపటికి మూర్ఛ నుండి తేరుకొని శేషువుని పడగల మీదకు గుప్పించి ఎగిరి దూకి అతనితో పదహారు రోజులపాటు యుద్ధం చేస్తాడు. చివరికి శేషువుడు ఓడిపోయి నెత్తురు కక్కుతాడు. అప్పుడు శేషువుడు తన భార్యలతో కలసి

"శెంకు సెక్కారాల దాశావతార- నువ్వంట నేనెరుగ నీల యెన్నుండా

నరుడను కున్నాను నారాయణుండా- నాకేమి తెరువయ్య దాశావతారా"

అని అడుగుతాడు. అప్పుడు కృష్ణుడు నాగులకు వారి బ్రతుకుతెరువు గురించి ఇలా చెబుతాడు.

"ఈ మడుగును మీరు వదలి ఎల్లాల- అడవి లంట మీరు ఎల్లి పోవాల

కప్ప జంతువులారాలు మీరు పుచ్చుకోవాల- ఆ రీతి బతకండి ఓ నాగులారా"

కప్పలను తిని జీవించే నాగుల జీవన విధానం లోకంలో ఉన్నదే. లోకంలో ఉన్న దాన్ని జానపదకవి శ్రీకృష్ణుని నిర్ణయంగా కల్పించి చెప్పాడు.

ఆ తరువాత కృష్ణుడు చెంచువారి కోనలోకి గోవులను తోలి మేపుతుంటాడు. ఆ కోనలో 'చెంచునందన' (చెంచువారి అమ్మాయి) ఉంటుంది. కృష్ణుడు ఆమెను చూసి తనను పెళ్ళి చేసుకోమంటాడు. అప్పుడామె తనకు ఆరుగురు అన్నలున్నారని చెబుతుంది.

"ఇందురుడు మాయన్న సెందురుడు మాయన్న- కార్తీకమారాజు కాటమరాజు

అందరికి పెద్దోడు అంబోతు మాయన్న- అందరికి చిన్నోడు కరుకోటకుండు"

ఆరుగురు అన్నలు వేటకు వెళ్ళారనీ వారు వస్తే అతణ్ణి చంపివేస్తారని ఆమె చెబుతుంది. దానికి కృష్ణుడు ఆమె అన్నలందరూ తనకు బావమరుదులనీ వారు తనని ఏమీ చెయ్యలేరని అందుచేత పెళ్ళి చేసుకోమని ఆమెను అడుగుతాడు. అప్పుడామె కృష్ణునితో

"మా చెంచువారితోని నువు కూడగలవా- చెట్టు లెక్కగలవా తేనెలు తేగలవా

తెర తేనెలు తెచ్చి మాకియ్యగలవా"

అని అంటుంది. దానికి కృష్ణుడు

"చెట్టులెక్కుతాను తెర తేనె తీస్తాను- తెర తేనె తెచ్చి మీకు ఇస్తాను

చెంచువారు పనులన్నీ నేను చేస్తాను- నన్ను పెళ్ళాడవే నందనాదేవి "

అని అంటాడు. అప్పుడు చెంచునందన

"పోవయ్య పోవయ్య ఓ గొల్లవాడా - మా తల్లిదండ్రులు సూసితే ఒప్పరు

పోవయ్య గొల్లవాడా పోకూలు మాని"

అని ఎగతాళిగా అంటుంది. కృష్ణుడు ఆమెను మందలించి గొల్లల వైభవాన్ని, వారి

గొప్పతనాన్ని ఇలా వివరిస్తాడు.

"గొల్లవారంతారే ఎల్లవారంతాను- గొల్ల యవతారాలు మీకేమి తెలుసును
అడవిలంటుండేటి అడవి మూర్కులు మీరు- గొల్ల యవతారాలు మీకేమి తెలుసు
పాలసంద్రం గొల్ల పానుపే గొల్ల- ఆదియిష్టుడు గొల్ల నాయవతారమే గొల్ల
ఇందురుడు గొల్లమ్మ చందురుడు గొల్ల- పది మంది ఒక చోట కూడితే గొల్ల
పాలమర్రె గొల్ల బెమ్మదేవుడు గొల్ల- ఈశ్వరుడు గొల్లమ్మ ఆది దేవతలు గొల్ల
గొల్ల యవతారాలు గుర్తులున్నావా- చెబుతాను చెంచితా చెవులాలకించు"

ఇందులో కవి పాలసముద్రం, ఆదిశేషుడు, ఇంద్రుడు, చంద్రుడు, పాలమర్రి, బ్రహ్మ దేవుడు, ఈశ్వరుడు, దేవతలందరూ గొల్లలే అని కాబట్టి గొల్లవారిని తక్కువగా చూడ వద్దని చెబుతాడు.

ఆ తరువాత వేటకు వెళ్ళిన చెంచునందన అన్నలు వచ్చి కృష్ణుని మీదకు యుద్ధానికి వస్తారు. కృష్ణుడు వారినందరినీ సులభంగా ఓడిస్తాడు. అప్పుడు వారు కృష్ణుని గొప్పతనం గ్రహించి తమ చెల్లెలైన చెంచునందనను కృష్ణునికి ఇచ్చి పెళ్ళి చేస్తారు. కృష్ణుడు చెంచునందనను తీసుకొని రేపల్లెకు వచ్చి ఆమెను తన తల్లి అయిన గోపెమ్మకు అప్పగించి తిరిగి ఆలమందకు వెళ్ళిపోతాడు.

ఆ తరువాత కృష్ణుడు శివశక్తికోనలో ఆలమందను తోలి మేపాలనుకుంటాడు. ఆకోన దట్టమైన చెట్లతో పట్టపగలే చిట్టచీకటిగా ఉంటుంది. కృష్ణుడు పచ్చిపాల నుంచి వెన్న తీసి వెన్నను నెయ్యిగా కరిగించి ఆ నెయ్యితో దివిటీలు వెలిగించి గోవుల కొమ్ములకు దివిటీలు కట్టి వాటి వెలుతురులో శివశక్తి కోనలోకి గోవులను తోలుతాడు. ఆ కోనకు అధిపతి శివశక్తి.

"కన్నులని జూసింది నాడు శివసత్తి - ఎట్నుంచి వచ్చాడో యశోదగొల్ల
సిరివంటి నాకోన నేల గలిపాడు - పండంటి నాకోన పాడు జేసేను
రవ్వనే రవదూలి కమ్ముకెల్లేను - మున్నూరామట కోన ముట్టడేసేను
అరవై యామట కోన అలుజు గట్టేను - కానియ్యమన్నాది కానిలెమ్మనాది"

తాను ఆ కోనలో ఉన్నప్పటి నుంచి ఇంతవరకూ ఎవరూ కోనలోకి ప్రవేశించ లేదని ఇప్పుడు ఎవరో గొల్లవాడు వచ్చి ఆవులను తోలి తన పండంటి కోనను పాడు జేస్తున్నాడని పలికి, పెద్ద గాలిని కల్పిస్తుంది. ఆ గాలికి దివిటిలన్నీ ఆరిపోయి చిట్ట చీకటిగా మారి పోతుంది. ఆ చీకటిలో ఏమి చేయాలో తోచక కృష్ణుడు తడుముకుంటూ తిరుగుతూ ఉంటే మందకు పెద్దదిక్కుగా ఉన్న బసవన్న తగులుతాడు. కృష్ణుడు అతని పాదాలు పట్టుకొని ఈ ఆపదనుండి రక్షింపమని వేడుకుంటాడు. బసవన్న 'ఖనేల్'మని రంకె



వేయగానే దివిటీలు అన్నీ వెలిగి పట్టపగలుగా మారిపోతుంది. అది చూసి శివశక్తి పారిపోతూ ఉంటే బసవన్న ఆమె వెంటపడి ఆమెను కృష్ణుని దగ్గరకు తీసుకొని వస్తాడు. అప్పుడు శివశక్తి తనను మన్నించమని కృష్ణుని వేడుకుంటుంది. కృష్ణుడు ఆమెను మన్నించి ఇకనుంచి గోపాలకులు ఎవరైనా గోవులను తోలుకొని ఆ కోనలోకి వస్తే వారికి అపాయం కలిగించకుండా చూసీచూడనట్లుగా వెళ్ళమని ఆజ్ఞాపిస్తాడు.

ఆ తరువాత కృష్ణుడు తన గోవులను దేవేంద్రుని కోనలో తోలి ఆవుల్ని మేపుతుంటాడు.

"దేవేంద్ర కోనలపై ఆవుల్ని తోలేను - దేవేంద్ర కోనల ముట్టడేసేరు
మున్నూరామట కోన ముట్టడేసేరు - అరవైయామట కోన అలుజు గట్టేరు
నేతయారికలంట నేగ లిరిసేరు - పెసరగయి చేలంట పెయ్యలిరిసేరు
పండినా వరిమీద పద్ద లిరిసేరు - చుట్టుకొని ఆకోన ముట్టడేసేరు
సెయ్యంటి ఆకోన నేల గలిసేను - పండంటి ఆకోన పాడుజేసేను"

కృష్ణుడు దేవేంద్రుని కోనలో ఆవుల్ని తోలి ఆ కోనను పాడు చేస్తూ ఉంటే దానికి కాపలాగా ఉన్న సేవకులు వెళ్ళి దేవేంద్రునికి ఆ విషయం చెబుతారు. దేవేంద్రుడు కోపించి మేఘాలను పిలిపించి ఆలమంద మీద కుంభవర్షం కురిపించాలని ఆజ్ఞాపిస్తాడు. అతని ఆజ్ఞ ప్రకారం మేఘాలు దేవేంద్రుని కోన దగ్గరికి వచ్చి ఎడతెరిపి లేకుండా కుంభ వర్షం కురిపిస్తాయి. ఆ వర్షానికి

"గుబగుబలాడగ గోవులల్లాడె - అల్లాడిగోవులు తల్లటించేను"

గోవుల ఆ పరిస్థితిని చూసి కృష్ణుడు అక్కడ ఉన్న గోవాది పర్వతాన్ని ఎత్తి దాన్ని గొడుగుగా పట్టి తన ఆలమందనే గాకుండా ఆ కోనలో ఉన్న మిగిలిన అన్ని రకాల జంతువులను వర్షం నుంచి రక్షిస్తాడు. మేఘాలు కురిసి కురిసి కురవలేక వెళ్ళిపోయి ఇంద్రునికి తమ అసహాయతను తెలియజేస్తాయి. అప్పుడు దేవేంద్రుడు మరింత కోపించి ఆకాలపిడుగును పిలిచి గోవాది పర్వతం మీద పడి ఆ పర్వతాన్ని ధ్వంసం చేయమని చెబుతాడు. ఆకాలపిడుగు కొండమీద పడి కొండ తొలుచుకొని వెళుతూ ఉంటుంది. కృష్ణుడు దాన్ని పట్టుకొని తన మామ దేవేంద్రుడు పంపిన కట్నంగా దాన్ని భావించి ఆ పిడుగుతో బసవన్నకు అనేక రకాల అలంకార వస్తువులను చేయిస్తాడు. ఆ తరువాత ఈ కథాగేయంలో కాములకథ చెప్పబడింది.

"దేవేంద్ర కూతుళ్లు దేవకన్నికలు - పార్వతి కూతుళ్లు పరమగన్నికలు
పంచుకుంతే పసుపు పాలుకే రాదని - జలిదిలోనా పసుపు జల్లేసినారు
సింత వనముల కాడ సీరు లిడిసేరు - వాలవాలల కాములు వోలలాడేరు"

కామినులు ఏడుగురు, వీరు దేవేంద్రుని కుమార్తెలు. వీరు పసుపును కొలనులో వేసి దిగంబరంగా జలక్రీడలాడుతూ ఉంటారు. కృష్ణుడు వారి వస్త్రాలను అపహరించి నగ్నంగా ఉన్న వారి చేత నమస్కారం చేయించుకొని వారిలో పెద్దవారి ఆరుగురి చీరలు వారికి ఇచ్చివేస్తాడు. ఏడవదైన చిన్న కామినిని తనతో రేపల్లెకు తీసుకొని వెళ్ళి గోపెమ్మకు అప్పగిస్తాడు. అప్పుడు గోపమ్మ కృష్ణునితో ఇలా అంటుంది.

"ఏ మంట పలికింది తల్లి గోపెమ్మ– నాయనా నాయబ్బ నాముకుమారా
కామినేల తెస్తివోరె కన్న కుమారా – కోటేల మంది గోపికలున్నారు
పద్దకొండు మంది పట్టమా దేవులు– రాద యున్నది కదా రుక్మియున్నది కదా
అందరికి సక్కనిది సత్తెబామున్నది– కామినేల తెస్తివొరె కన్నకుమారా
ఎన్నావులిచ్చినవు ఎంత సొమ్మిచ్చినవు– కామినేల తెస్తివో కన్నకుమారా
ఆరు పుట్లసోల్లు ఇసిరంబ లొండితే– కోడళ్ళ కంబళ్లు సాలకున్నాయి
పదిపుట్లు గంట్లు దంచన్న మొండితే– మనవల్ల కన్నాలు సాలకున్నాయి
కామినేల తెస్తివో కన్నకుమారా"

ఇందులో గోపమ్మ కృష్ణునికి అప్పటికే చాలమంది గోపికలు రాధ, రుక్మిణి, సత్యభామ మొదలైన పదకొండుమంది పట్టపురాణులు భార్యలుగా ఉన్నారని, పలికి వీరందరూ ఉండగ కామినిని మళ్ళీ ఎందుకు తీసుకొని వచ్చావని అడుగుతుంది. అంతేగాకుండా ఎన్ని ఆవులిచ్చి కామిని కొనుక్కొచ్చావని పలుకుతుంది. ఇంతమంది ఉన్న కుటుంబానికి ఆరుపుట్ల సోల్లు (రాగులు) విసిరి అంబలి చేస్తే చివర తినే కోడళ్ళకు అంబలి సరిపోవడం లేదు. పది పుట్ల గంట్లు (సజ్జలు) దంచి అన్నం వండితే మనవళ్ళకు అన్నం సరిపోవడం లేదని పలుకుతుంది. పై మాటలు కవి కాలంనాటి ఆచారాలను తెలియ జేస్తున్నాయి. ఆనాడు ఓలి ఇచ్చి ఆలిని కొనుక్కునే ఆచారం ఉండేది. యాదవులకు సంపద గోవులే. అందువల్ల వారు గోవులను కన్యాశుల్కంగా ఇచ్చి కన్యను కొను క్కొని పెళ్ళి చేసుకొనేవారు. ఆందువల్లనే గోపెమ్మ ఎన్ని ఆవులిచ్చి కామినిని తెచ్చావని అడుగుతుంది.

తరువాత పాదాల్లో ఆనాటి సమిష్టి కుటుంబ జీవన విధానం చెప్పబడింది. సమిష్టి కుటుంబంలో కొడుకులు కోడళ్ళు, మనుమలు మనమరాళ్ళు మొదలైన వారితో కలిపి మొత్తం ఇరవై నుంచి ముప్పైమంది వరకు ఉంటారు. కళింగాంధ్ర ప్రాంతంలో ఆనాటి ప్రజల ప్రధాన ఆహారం చోళ్ళు, గంట్లు. ఇరవై ముప్పైమంది ఉన్న, సమిష్టి కుటుంబంలో సోళ్ళు విసిరి ఆ పిండితో అంబలి చేసేవారు. గంట్లు దంచి అన్నం వండేవారు. ఈ ఆహార పదార్థాలు ముందు తినేవాళ్లు ఎక్కువగా తింటే చివర తినేవారికి మిగిలేదీ కాదు. అందువల్లనే గోపెమ్మ "కోడల్లకంబల్లు సాలకున్నాయని, మనవల్ల



కన్నాలు సాలకున్నాయని' చెప్పింది. ఈ విధంగా జానపద కవి పైగేయ పాదాల్లో ఆనాటి సామాజిక వ్యవస్థను, ఆచారాలను చక్కగా తెలియజేశాడు.

తల్లి అడిగిన పై మాటలకు కృష్ణుడు ఇలా చెబుతాడు.

"అమ్మరా ఓలమ్మ తల్లి గోపెమ్మ – ఆవునివ్వాలేదు గోవు నివ్వానేదు
రూపాయలివ్వ లేదు రుప్పులివ్వ లేదు – కానుకలివ్వ లేదు కట్నమివ్వ లేదు
రానన్న కామినే రమ్మనా లేదు – ఊరికొచ్చిన కామినొద్దనా లేదు
కాలు మట్టా లేదు కంకణము కట్ట లేదు – చేతనయితే పన్లు చేయించుకోమ్మ"

ఆ విధంగా చెప్పి కృష్ణుడు ఆలమందకు వెళ్ళిపోతాడు. గోపమ్మ కామిని చేత అనేక రకాల కష్టమైన పనులు చేయిస్తూ అనేక బాధలకు గురిచేస్తుంది. కామిని గోపెమ్మ చెప్పిన పనులన్నీ సహనంతో చేస్తూ ఉండడంవల్ల ఆమె సహనానికి మెచ్చి కృష్ణునితో కామినికి శోభనం ఏర్పాటు చేస్తుంది. కృష్ణుడు శోభనం గదిలో తనకు బదులుగా మంచం మీద ఒక అరటి దుండను పెట్టి దాని మీద దుప్పటి కప్పి ఉంచుతాడు. కామిని చక్కగా అలంక రించుకొని, పాలు పళ్ళు తీసుకొని శోభనం గదిలోకి ప్రవేశించి కృష్ణుడు మాట్లాడతాడని ఆశిస్తూ చాలసేపు గదిలో నిలబడుతుంది. కృష్ణుడు ఎంత సేపటికీ మాట్లాడక పోవడం చేత కామిని మంచం దగ్గరకి వెళ్ళి మంచం మీద దుప్పటి కప్పి ఉన్న దుండను కృష్ణుడుగా భావించి కౌగలించుకుంటుంది. వెంటనే కామిని, దుండ కలిసి కాలిపోతారు. కామిని కాలిపోయి కృష్ణుని వద్ద శెలవు తీసుకొని దేవలోకానికి వెళ్ళిపోతుంది.

ఆ తరువాత ఈ కథలో దేవేంద్రుడి యజ్ఞం గురించి చెప్పబడింది. ఈ యజ్ఞం శిష్ట సాహిత్యంలో చెప్పబడిన అగ్నిహోత్రంలో ఆజ్యం పోసి చేసే యజ్ఞం కాదు. ఇది వ్యవసాయానికి సంబంధించిన యజ్ఞం. చక్కగా పంటలు పండించి ఆ కొత్త ఫల సాయంతో భగవంతుని పూజించడమే ఈ యజ్ఞం. దేవేంద్రుడు సామాన్య మానవుని లాగా తన కుమారులతో కలసి సేద్యం చేసి వరి పంట వేసి, బాగా పండించి, కోసి, ధాన్యంగా మార్చిన తరువాత ఆ కొత్త బియ్యాన్ని ఆవుపాలతో ఎసరు పెట్టి పరమాన్నం వండి దేవునికి నైవేద్యం పెట్టడం యజ్ఞంగా చెప్పబడింది. ఇందులో దేవేంద్రుడు కృష్ణుని తల్లి గోపెమ్మకు సోదరుడుగా చెప్పపడ్డాడు. దేవేంద్రుని దగ్గర ఆవులు ఉండవు. అందు వల్ల దేవేంద్రుడు ప్రతి సంవత్సరం తన యజ్ఞానికి కావలసిన పాలను తన సోదరి అయిన గోపెమ్మ ఇంటి నుంచి తెప్పించుకొనేవాడు. ఎప్పటిలాగే ఆ సంవత్సరం కూడా ఆవుపాలు పంపించమని దేవేంద్రుడు గోపెమ్మకు కబురు చేస్తాడు. గోపమ్మ తన సోదరుడైన దేవేంద్రుని యజ్ఞానికి పాలు పంపించమని కృష్ణునికి చెబుతుంది.

"నాయకా నా యబ్బ నాముకుమారా– మీ మామ దేవేంద్రుడు యెగ్గెమెడుతున్నాడు

యెగ్గానికి పాలు పంపరా కొడకా- పాలు యెంగిలి చేయకురా కన్నకుమారా
యెగ్గానికి పాలు పంపరా కొడకా- ఆ పలుకులిన్నాడు నీల యెన్నుండు
ఏమంట పలికనడు నీల యెన్నుండు - మామ దేవేంద్రుడు నాకు పగరాజు
దేవేంద్రుడన్నోడికి పాలు పంపాను- దేవేంద్రడన్నోడు నాకు పగరాజు
ఆ పలుకులిన్నాది తల్లి గోపెమ్మ- నాయనా నా యబ్బా నాము కుమారా
అది కోటంత కార్యము కొండత యెగ్గెము- యెగ్గెమంత చిందు చేసుదువా కొడకా
నువ్వు పంపకపోతే నరులు పంపారు- అప్పుడేమన్నాడు నీల యెన్నుండు
పాలు పంపడానికి నావద్ద దాదులే లేరు- అప్పుడే మన్నాడు నీల యెన్నుండు
పాలు పంపడానికి నా వద్ద దాదులే లేరు- కావుల్లు పన్ననీకి జట్టీలు లేరు
దేవేంద్రుడి యెగ్గానికి పాలు పంపాను"

కృష్ణుడు మొదట దేవేంద్రుని యజ్ఞానికి పాలు పంపనని చెబుతాడు. గోపెమ్మ మరీ మరీ చెప్పడం చేత చివరకు అంగీకరిస్తాడు. అప్పుడు కృష్ణుడు ఆలమందకు వెళ్ళి పాలు పితికి తీసుకొని వచ్చి తన తల్లికి ఇచ్చి దేవేంద్రునికి పాలు పంపడానికి తన దగ్గర సేవకులు లేరని కాబట్టితన సోదరునికి ఆమెనే పాలు పంపించుకోమని చెబుతాడు. గోపెమ్మ తానే పాలు తీసుకొని వెళ్ళి దేవేంద్రునికి ఇచ్చివస్తుంది.

దేవేంద్రుడు చేసే యజ్ఞానికి కృష్ణుని ఆలమందలో ఉన్న బసవన్న, ఐదుగురు దాసుల్లతో కలసి వెళ్ళి, దేవేంద్రుని ఇంట్లో పూజలందుకోవడం, అక్కడ దాసులు సేవ గరిడి కళను ప్రదర్శించడం జరుగుతూ ఉంటుంది. అలాగే ఆ సంవత్సరం కూడా బసవన్నను తీసుకొని ఐదుగురు దాసుల్లను తమ యజ్ఞానికి రమ్మని దేవేంద్రుడు ఆహ్వానిస్తాడు. ఇక్కడ బసవన్న అంటే సేవగరిడి కళాకారులు పెంచే తోడపెద్దు. దాసులు బసవన్నకు స్నానం చేయించి ఒల్లంతా శుభ్రమైన గుడ్డతో తుడిచి నొసటి పతకం, మూపురానికి మువ్వల దండ, మెడలో గంటల దండ, బొడ్డు దగ్గర బోరుగంటలు, నడుముకు నాగబంధం, తోకకు దొండకాయపేరు, నాలుగు కాళ్ళకూ నాగుటంజలు, మూతికి సిడిమోర వేసి అలంకరిస్తారు. అలంకరించిన బసవన్నతో కలసి ఐదుగురు దాసుల్ల దేవేంద్రుని యజ్ఞానికి బయలుదేరి వెళ్తారు.

"బండి తిరపతికోల బలువైన నంబుల్లు- ఎగ్గాలు గెలిపించ ఏగునెల్లేరు
పొన్నె పెన్నల కోల పువ్వంటి దాసుల్లు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
ఎండి బెత్తెలవారు ఏదానుయోదులు- ఎగ్గాల గెలిపించ ఏగు నెల్లేరు
పైడి బెత్తెలవారు పట్టాపు దాసుల్లు - ఎగ్గాల గెలిపించ ఏగు నెల్లేరు
తులసి తావలాలు తులతూగె నంబుల్లు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు



ఎండి జన్నిదాలు ఏదాను యోదులు- ఎగ్గాల గెలిపించ ఏగు నెల్లేరు
ఇలనార్జు దన్నోడు ఇంటి సేవకుడు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
పవనార్జుడన్నోడు బత్తి సేవకుడు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
నంబాలుడన్నోడు నమ్మిన దాసుడు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
దోను దన్నోడు మా దొడ్డ దాసుడు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
ఉప్మాకు దన్నోడు మా దొడ్డ దాసుడు- ఎగ్గాలు గెలిపించ ఏగు నెల్లేరు
దేవేంద్రడింటికే పయనమానారు - దేవేంద్రుడింటికే ఆదుకున్నారు"

బసవన్న వెంట దేవేంద్రుని యజ్ఞానికి ఇలనార్జుడు, పవనార్జుడు, ద్రోణుడు, నంబాలుడు, ఉప్మాకుడు అనే ఐదుగురు దాసుళ్ళు సేవగరిడి పరికరాలైన కోల, తాళాలు, బెత్తు, నెమలి కుంచె పట్టుకొని దేవేంద్రుని ఇంటికి వెళతారు. దేవేంద్రుని భార్య నీళ్ళు తెచ్చి మొదట బసవన్న పాదాలను, ఆ తరువాత ఐదుగురు దాసుళ్ళ పాదాలు కడిగి సాంబ్రాణి పొగ వేస్తుంది. ఆ తరువాత దాసులు దేవేంద్రుని ఇంట్లో దేవుని మూలకు వెళ్ళి అక్కడ మూల పూజింపు పాటపాడి బయటకు వచ్చి దశావతారాల్లో ఏదో ఒక కథను పాడుతూ సేవగరిడి కళను ప్రదర్శిస్తూ ఉంటారు. ఇంట్లో దేవేంద్రుడు, అతని భార్య గొంతెమ్మ కళ్ళకు గంతలు కట్టుకొని ఒక పాత్రలో ఐదు ముంతల బియ్యాన్ని కొలిచి పోసి దానికి గుడ్డతో మూతకట్టి ఆ పాత్రను పైన దూలానికి వేలాడ గడతారు. దీన్ని రాత్రిపూట చేస్తారు. మరుసటి రోజు తెల్లవారిన తరువాత దూలానికి కట్టిన పాత్రను కిందకు దించి అందులోని ధాన్యాన్ని దాసులు బసవదేవుని ముందు కింద పోసి దేవేంద్రుని ఆ ధాన్యాన్ని కొలవమంటారు. అప్పుడు దేవేంద్రుడు, అతని భార్య కలసి బియ్యాన్ని కొలుస్తారు. కొలిస్తే రాత్రి పోసిన దాని కంటే ఐదుపావులు ఎక్కువగా బియ్యం ఉంటాయి. అలా బియ్యం పెరిగితే ఆ యజ్ఞం విజయవంతంగా ముగిసినట్లుగా భావిస్తారు.

ఆ తరువాత ఐదుగురు దాసుళ్ళు బసవదేవుని నీటి దగ్గరకు తీసుకొని వెళ్ళి స్నానం చేయిస్తారు. దేవేంద్రుడు అతని భార్య రాత్రి పోసి పొద్దున కొలిసిన బియ్యంతో ఆవుపాలు ఎసరుపెట్టి పరమాన్నం చేస్తారు. ఇంకా అనేక రకాల పిండి వంటలు, కూరలు చేస్తారు. వీటన్నింటినీ పెద్ద అరిటాకులోపెట్టి మొదట బసవన్నకు పెడతారు. ఆ తరువాత ఐదుగురు దాసులు భోజనం చేస్తారు. అప్పుడు దేవేంద్ర దంపతులు దాసులకు టెంకాయలు, అరటిపళ్ళు, అరిసెలు, ఖర్జూరం, కిస్మిస్, కమలాపళ్ళు మొదలైనవి ఇస్తారు.

"అల్లో నారాయణల్లో నువు దేవేంద్రుడింటికి యాగానికొచ్చేవు
అల్లో నారాయణల్లో ఏమేమి బోగాలు నీకిచ్చినారు

అల్లో నారాయణల్లో టెంకాయ కొబ్బరులు తేనె యరటిపళ్ళు
అల్లో నారాయణల్లో అటువంటి పలములు వారిచ్చినారు
అల్లో నారాయణల్లో నాను బిండరసీలు నల్లరటిపళ్లు
అల్లో నారాయణల్లో అటువంటి పలములు వారిచ్చినారు
అల్లో నారాయణల్లో కర్జూర కిసిమిసి కమలాసి పలములు
అల్లో నారాయణల్లో అటువంటి పలములు అరిచ్చినారు"

అప్పుడు దాసులు దేవేంద్ర దంపతులను ఇలా దీవిస్తారు.

"అల్లో నారాయణల్లో ఇలమీద వారిల్లు ఇరితి బొందాల
అల్లో నారాయణల్లో కోటిలకు వారిల్లు కొనలు సాగాల
అల్లో నారాయణల్లో కొడుకులు కోడళ్లు కోటి సంపదలు
అల్లో నారాయణల్లో అల్లుళ్ళు ఆడబిడ్డలదిక సంపదలు
అల్లో నారాయణల్లో ఇలమీద వారి మాట హెచ్చు గుండాల
అల్లో నారాయణల్లో రచ్చలో వారి మాట ఎచ్చు గుండాల
అల్లో నారాయణల్లో దాసుల్ల దీవనం బ్రమ్మ దీవనం
అల్లో నారాయణల్లో పచ్చనచ్చింతాలు సేత బట్టుకొని
అల్లో నారాయణల్లో గొంతెమ్మ సేతిలో వారు బోసేరు
అల్లో నారాయణల్లో అప్పుడే మన్నారు వారు దాసుల్లు
అల్లో నారాయణల్లో ఏటేట మా సోమి మీయింటి కొస్తాడు
అల్లో నారాయణల్లో ఏట మాదేవుడికి వంద కలగాల
అల్లో నారాయణల్లో ఏట మా దేవుడికి వంద ఇవ్వాల
అల్లో నారాయణల్లో దీవించిరి దాసుల్లు దివ్వెరచ్చుకులు"

ఈ విధంగా దీవించి కొన్ని అక్షింతలను దాసులు గొంతెమ్మకు ఇస్తారు. ఆమె ఆ అక్షింతలను తన ఇంటి మీద వేస్తుంది. ఆతరువాత బసవన్నతో కలసి దాసులు తిరిగి రేపల్లెకు వస్తారు.

దేవేంద్రుడు యజ్ఞం పెట్టే సమయంలో బసవన్నను పూజించిన పూజా విధానం పామరజన రంజకంగా కనిపిస్తుంది. కానీ ఇలాంటి సంప్రదాయాలన్నీ గోజాతి రక్షణ కోసం ఏర్పాటు చేయబడిన ఉత్తమ సంస్కారాలు. గోజాతి వల్ల మానవులకు చెప్పలేనన్ని ప్రయోజనాలున్నాయి. చివరకు అవి విసర్జించే మలమూత్రాలు కూడా పవిత్రమైనవిగా భావించబడుతూ ఉన్నాయి. అలాంటి గోజాతిని చిన్నపిల్లల కంటే ముద్దుగా పెంచి పోషించేవారు యాదవులు. గోజాతి వృద్ధికి దోహదం చేసేది బసవన్నలు. ఈ బసవన్నలను



జాగ్రత్తగా చూసే బాధ్యతను కూడా యాదవులే స్వీకరించారు. ఈ బసవన్నలనే ఆంబోతులు అంటారు. వీటిని గోశాలలో ఉంచి రోజూ తగినంతగా ఆహారాన్ని పెట్టి పెంచిపోషించేది యాదవులే. బసవన్నల వల్లనే గోజాతి అభివృద్ధి చెందుతూ ఉంది కాబట్టి దాన్ని పూజించే సంప్రదాయాన్ని యాదవులు స్వీకరించారు. ఆ సంప్రదాయ ప్రభావం మిగిలిన వారి మీద కూడ బాగా పడింది. ఈనాటికీ గ్రామాల్లో నూటికి తొంభై మంది బసవన్నను కొట్టడానికి సాహసింపరు. బసవన్న తమ గుమ్మంలోకి వస్తే దాన్ని శుభంగా భావిస్తారు. గుమ్మంలోకి వచ్చిన బసవన్నకు తవుడు, చిట్టు మొదలైన ఆహారం పెడుతూ ఉంటారు. సేవగరిడి కళాకారులు బసవన్నను సింహాద్రి అప్పన్నగా భావించి పూజించడం గోజాతి పట్ల వారికి ఉన్న పూజ్యభావానికి పరాకాష్ఠ.

ఆ తరువాత ఈ కథాగేయంలో "యాదవ కులానికి ముసలం" అనే సామెతకు కారణమైన కథను కవి వివరించాడు. యాదవులు ఒక గోపాలునికి గర్భవతి వేషాన్ని ధరింపజేసి ఎదురుగా వస్తున్న మునితో "మాబాల గర్భమున ఏ బాలపుట్టును" అని ఆ అమ్మాయికి పుట్టేది ఆడశిశువా? మగశిశువా? అని ప్రశ్నిస్తారు. దివ్యదృష్టితో సత్యాన్ని గ్రహించిన ముని యాదవులను ఇలా శపించాడు.

"ఈ బాల గర్భమున దుడ్డొకడు పుట్టు- యాదవా కులముకే ముసలమా దుడ్డు
దానివల్లన మీరు నాశనంబాయేరు"

అతడు చెప్పిన తొమ్మిది ఘడియలకే ఆ బాలునికి దుడ్డు పుడుతుంది. శ్రీకృష్ణుని సూచనతో యాదవులు సముద్రంలో ఆ ముసలాన్ని అరగదీస్తారు. చివరకు చిన్న ముక్క మిగిలిపోతే దాన్ని సముద్రంలో పారవేస్తారు. ఆ ముక్క ఒక చెంచు వ్యక్తికి దొరుకుతుంది. అతను దాన్ని తన బాణం చివర పెట్టుకుంటాడు. ఒకసారి చెట్టుకింద పడుకొని ఉన్న శ్రీకృష్ణుని జంతువుగా భావించి చెంచువాడు బాణంతో కొడతాడు. అది తీవ్రంగా తగిలి శ్రీకృష్ణుడు చనిపోయి అవతారాన్ని వదిలివేస్తాడు. కృష్ణుడు చనిపోవడానికి ముందు పొరపాటుగా తాను జంతువనుకొని బాణం వేశాననీ తన తప్పు మన్నించమని కృష్ణుని చెంచువాడు వేడుకుంటాడు. దానికి కృష్ణుడు -

"అవుదువోయి చెంచోడ అవునంతవాడా - నీది కాదీ తప్పు నాదనన్నాడు
రామాపుతారాన్నే వోలి నేసిన నాడు - దెబ్బకే దెబ్బలు రెండు దెబ్బలు
ఇస్తానన్నాను ఆనాటి పొద్దున - నాడు నీకొరములు ఇచ్చేను నేను
ఈవేల ఆ దెబ్బ ఇస్తినోయి చెంచోడా - ఇందుకు నువ్వేమీ బాధపడవద్దు"

అని అంటాడు. ఆ తరువాత కృష్ణుని శరీరానికి పాండవులు దహనక్రియలు జరిపిస్తారు. అతని శరీరంలో కొంతభాగం కాలకుండా మిగిలిపోయి అక్కడే వృక్షమవుతుంది. ఆ

వృక్షాన్ని ఒక చాకలి వ్యక్తి నరికి అందులో ఒక దుంగను ప్రవాహంలో వేస్తాడు. ఆ దుంగ ప్రవాహంలో కొట్టుకొని పూరి పట్టణానికి చేరుకుంటుంది. విష్ణువు పూరీ రాజుకు కలలోకన్పించి ఆ దుంగను ఒక పెట్టెలో పెట్టి దేవాలయంలో ఉంచి తొమ్మిది నెలలు పూజ చేయ్యాలని చెబుతాడు. రాజు అలాగే దుండను పెట్టిలో పెట్టి పూజచేస్తూ ఆరు మాసాల తర్వాత పెట్టె తెరచి చూస్తాడు. వెంటనే విష్ణువు జగన్నాథావతారం దాలుస్తాడు. అంటే కృష్ణుని శరీర భాగం వృక్షమై, దాని దుండ అయి చివరకు జగన్నాథ బలరామ సుభద్రల విగ్రహాలుగా మారాయని కవి భావన. ఇంతటితో కృష్ణావతారం ముగుస్తుంది. ఈ విధంగా శ్రీకృష్ణ జననంతో కథను ప్రారంభించి జగన్నాథ విగ్రహ విష్కరణతో భాగవత కథను ముగించిన జానపదకవి ధన్యుడు.

## గంగిరెద్దులవారి కథాగేయాలు - సాహిత్యాంశాలు :

ఆంధ్రదేశంలో గంగిరెద్దులవారు వారు ఆడే గంగిరెద్దులాట చాల ప్రసిద్ధమైనది. వీరు గంగిరెద్దులాటను ప్రదర్శించేటప్పుడు గేయాలు, కథాగేయాలు మొదలైన జానపద సాహిత్యాన్ని పాడరు. ఐతే గంగిరెద్దును పట్టుకొని ఊర్లో ఇల్లిల్లూ తిరిగి భిక్షమెత్తు కొనేటప్పుడు అనేక రకాల గేయాలను, కథాగేయాలను పాడతారు. వీటిలో కొన్ని చిన్న కథాగేయాలు, కొన్ని పెద్ద కథాగేయాలు ఉన్నాయి. గొల్లల వీరమ్మ పాట, ఈశ్వరమ్మ పాట, మాలవారి మంగమ్మ పాట, లక్ష్మీపూజ పాట, గంగరాజు పాట, సాయిబు నాయుడు పాట మొదలైనవి వీరు పాడే చిన్న కథాగేయాలు. రాములమ్మ కథ, లక్ష్మమ్మ కథ, పురూరవ చక్రవర్తి కథ, చిత్రసేన మహారాజు కథ, చంద్రగిరి మహారాజు కథ మొదలైనవి వీరుపాడే పెద్దకథాగేయాలు. వీటిలో కొన్నింటిని గురించి పరిశీలించుదాం.

**గొల్లల వీరమ్మ పాట :**

ఇది సాంఘికశాఖకు చెందిన చిన్న కథాగేయం. వీరమ్మ గొల్లకులానికి చెందినది కావడంవల్ల ఈ పాటకు గొల్లల వీరమ్మ పాట అనే పేరు వచ్చింది. ఈ పాటకు ఉయ్యూరు వీరమ్మ పాట లేక ఉయ్యూరు వీరమ్మకథ అనే పేరు కూడా ఉంది. వీరమ్మ ఉయ్యూరుకు చెందిన బాలిక కావడంవల్ల ఈ కథకు ఉయ్యూరు వీరమ్మ పాట అనే పేరు వచ్చింది.

వీరమ్మ రామన్న కూతురు, మంచి సౌందర్యవతి. ఆమెను చింతయ్య అనే గొర్రెలు కాసే యువకునికి ఇచ్చి రామన్న పెళ్ళి చేస్తాడు. ఆమె అత్తవారింటికి వెళ్ళి నప్పుడు ఒక రోజు ఆ ఊరిలోని కరణం ఇంటికి నీటికోసం వెళుతుంది. కరణం ఆమె



సౌందర్యాన్ని చూసి మోహించి అనేక విధాలుగా ఆమెను లొంగదీసుకొనే ప్రయత్నం చేస్తాడు. వీరమ్మ ఆ ప్రయత్నాలకు లొంగదు. చివరకు కరణం కలిగించే ఇబ్బందులకు తట్టుకోలేక వీరమ్మ అగ్నిగుండంలో దూకి చనిపోతుంది. చింతయ్య కూడా ఆమెతోపాటు అగ్గిలో దూకి చనిపోతాడు. తన సౌశీల్యాన్ని కాపాడుకోవడం కోసం ప్రాణత్యాగం చేసిన వీరమ్మ పేరంటాలై జానపదుల చేత పూజలు అందుకుంటున్నట్లుగా ఇందులో చెప్పబడింది.

ఈ కథ చిన్న మార్పులతో గురజాడవారి "కన్యక" కథను పోలి ఉంది. కన్యకలో కన్యక అవివాహిత. ఈ కథలో వీరమ్మ వివాహిత. మిగిలిన కథ ఇంచుమించుగా రెండింటిలోను ఒకే విధంగా ఉంది. గురజాడ మహాకవి. వీరమ్మ కథను కల్పించిన కవి ఎవరో తెలియదు. జానపద కవులు నిస్వార్థపరులు. ఏదైనా ఒక సంఘటన జరిగినపుడు దానికి స్పందించి ఆశువుగా కథాగేయాన్ని కల్పించి లోకం మీద వదలి వేస్తారు. ఆ తరువాత జానపద కవి దాని గురించి పట్టించుకోడు. అతను కల్పించిన కథ మౌఖిక ప్రసారంలో అనేక ప్రాంతాలకు వ్యాపిస్తుంది. గొల్లల వీరమ్మ కథ ఇలాంటిదే. అందువల్ల ఈ కథా రచయిత ఎవరో తెలియదు.

వీరమ్మ అందచందాలను గురించి తనదైన శైలిలో జానపద కవి ఇలా వర్ణించాడు.

"దబ్బపండూ చాయ దాబుగల బామా వీరమ్మా
నిమ్మపండూ చాయ నీటుగల బామా వీరమ్మా
పూసేటి తంగెళ్ళ పువ్వుల్ల వనమా వీరమ్మా"

వీరమ్మ పుట్టిన తరువాత ఆమె పుట్టింటి వారికి బాగా కలిసివచ్చింది.

"వీరమ్మ పట్టంగ ఏమి కలిగేనా గొల్లలికి
ఇరయ్యా ఎకరాల ఆమెరక బూమి గొల్లలికి
పన్నెండు ఎకరాల పల్లపు బూమి గొల్లలికి"

వీరమ్మ పన్నెండు సంవత్సరాల వయసు వచ్చిన తరువాత తండ్రి ఆమెకు పెళ్ళి ప్రయత్నం చేస్తూ ఉన్నప్పుడు ఆమె తన తండ్రి రామన్నతో తనను ధనికునికి కాకుండా పేదవానికి ఇచ్చి పెళ్ళి చేయమని ఇలా కోరుతుంది.

"అయ్యరో మాఅయ్య రామన్న రామన్నా
కలిగినోరికి నన్నిచ్చి పెళ్ళిచెయ్యకు రామన్నా
పేదవారికిచ్చి పెళ్ళి చెయ్యరా రామన్నా
పేదింటి కాపురము నేను చేసుతానా రామన్నా"

ఆమె కోరినట్లుగానే రామన్న ఆమెను చింతయ్య అనే పేద గొర్రెల కాపరి అయిన యువకునికిచ్చి పెళ్ళి చేస్తాడు. అత్తవారింటికి పంపిస్తే వారింట్లో తన కూతురు సుఖ

పడలేదని వివాహమైన తరువాత కూడా కూతురును రామన్న తన ఇంట్లోనే ఉంచు కున్నాడు. అప్పుడు తండ్రీ కూతుళ్ళ మధ్య జరిగిన సంభాషణ సమాజ సంస్కరణకు దోహదం చేసే సంస్కారబద్ధమైనదిగా ఉంది.

"నేను ప్రేమతో కూతురా నిన్ను పెంచినానే
పేదింటి కాపురము నేనిచ్చినానా వీరమ్మా
ఏమీ లేదాని బాదపడతావు కూతురా వీరమ్మా
అందుకే నా యింటి వద్ద నుంచేనా వీరమ్మా
అప్పుడేమన్నాది వీరమ్మా వీరమ్మా
వెర్రి మాటలాడావే తండ్రి రామన్న రామన్నా
పిచ్చి మాటలాడావే తండ్రి రామన్నా రామన్నా
పేదింటి కాపురము చేసితే మేలా నాతండ్రి
నాయింటికి నన్ను దిగబెట్టవయ్యా నా తండ్రి"

వీరమ్మ సౌందర్యానికి దాసుడైన కరణం, ఆమెను తన కోరిక తీర్చవలసిందిగా కోరుతూ, ఆమె తన కోరిక తీరిస్తే తన పన్నెండుమంది భార్యలను ఆమెకు దాసీలుగా చేస్తానని, అంతేగాకుండా ఆమెకు ఇంకా అనేక రకాల సౌకర్యాలు కలిగిస్తానని ఇలా చెబుతున్నాడు.

"ఏడేడు మేడాలు నీకు కడతాను వీరమ్మా-
ఒంటి స్తంబం మేడ వన్నెనా మేడా వీరమ్మా
గాజు స్తంబం మేడా గనమైన మేడ వీరమ్మా
మేడపైన చాలా బాతులిస్తానే వీరమ్మా
నీ మాటా నా మాటా రెండొక్కటైతే వీరమ్మా
నాయొక్క రాజ్యం నీకు రాసుతానే వీరమ్మా
నాయొక్క బూములు నీకు ఇస్తానే వీరమ్మా
పట్టపు దేవీని నిన్ను చేస్తానే వీరమ్మా"

కరణం ప్రలోభానికి లొంగకుండా వీరమ్మ అతని మాటలకు సమాధానంగా అతణ్ణి అన్నయ్య అని సంబోధిస్తూ ఇలా చెబుతుంది.

"విన్నావా అన్నయ్యా కరణం అన్నయ్యా అన్నయ్యా
బంగారం నాయింట బానిసై వుందా అన్నయ్యా
వెండి నాయింట పిండై ఉన్నదా అన్నయ్యా
కావాలంటేను నాయెనకా రారా అన్నయ్యా
ఎంత మాటాడినావు పాపిష్టివాడా అన్నయ్యా"



చివరకు కరణం తన కోరిక తీర్చుమని ఆమె చెయ్యి పట్టుకుంటాడు. వీరమ్మ కోపంతో అతన్ని కాలితో తన్ని తన ఇంటికి వస్తుంది. కరణం ఆమెను ఎలాగైనా లోబరుచుకోవాలని అనేక ప్రయత్నాలు చేస్తాడు. దాంతో విసిగిపోయిన వీరమ్మ ఆత్మహత్య చేసుకుంటుంది. పతివ్రత బలవన్మరణం పొందితే ఆమె పేరంటాలుగా వెలుస్తుందని మనవారి విశ్వాసం. తెలుగుదేశంలోని గ్రామదేవతల్లో అనేక దేవాలయాలు ఇలాంటివే. భర్తతో కలసి అగ్ని గుండంలో పడిన వీరమ్మ పేరంటాలై వెలసినట్లుగా ఈ కథాగేయంలో ఇలా చెప్పబడింది.

"రామ చిలకలాగ ఎగిరి పోయావా వీరమ్మా
కలువ పువ్వులాగా పారిపోయావా వీరమ్మా
ఎలయాగ మన్నాది గొల్లోరి బామా వీరమ్మా
నిత్య పేరంటాలై నిలిచియున్నాదో వీరమ్మా"

ఈ చిన్న కథాగేయంలో వారానువర్తనాలు చక్కగా చెప్పబడ్డాయి. శిష్టసాహిత్యంలో కవి సమయాలవంటివి జానపద సాహిత్యంలోని వారానువర్తనాలు. ఇవి అన్ని కథాగేయా ల్లోను ఒకేవిధంగా ఉంటాయి. ఉదాహరణకు వీరమ్మ పెరిగిన విధం ఈ కథాగేయంలో

"ఉగ్గెట్ట నోదాది ఉపనోదాది వీరమ్మా
పాలెట్ట నోదాది పట్టనోదాది వీరమ్మా
తూగుటుయ్యాల లోన ఊగుచున్నదా వీరమ్మా"

అని చెప్పబడింది. పిల్లలు పెంచబడిన విధం అన్ని కథాగేయాల్లోనూ ఇలాగే చెప్ప బడుతుంది. కథాగేయాల్లో వివాహ ప్రసక్తి వచ్చినప్పుడు ఆకాశమంత పందిరి, భూదే వంత అరుగువేసి అంగరంగ వైభవంగా పెళ్ళిచేసినట్లుగా చెప్పబడుతుంది. వీరమ్మ వివాహం అలాగే జరిగినట్లుగా ఈ కథాగేయంలో ఇలా చెప్పబడింది.

"ఆకాశమాదిరులు పందిళ్ళు వేసే యావేళ
శుక్రవారం రోజు చక్కని రోజు వీరమ్మా
ఆకాశమాదిరులు పందిళ్ళు వేసే యావేళ
బూదేవి మాదిరులు పీటం వేసే యావేళ
గుచ్చిన ముత్యాలు తోరనాలు వేసే వీరమ్మా
గుచ్చాని ముత్యాలు తలంబ్రాలు వీరమ్మా
అందముగ వీరమ్మకు పెల్లి చేసేనా యావేళ
పన్నెండు రాటాల పందిళ్ళులోన వీరమ్మాని
రంగరంగ వైబవంగా అందుకున్నాదే చింతయ్యా"

కూతురును అత్తవాంటికి పంపించేటప్పుడు తల్లిదండ్రులు ఆమెకు పసుపు, కుంకుమ,

ధనధాన్యాలు, చీరలు, రవికలు, చీపుర్లు మొదలైన సారెను బండ్లతో పంపించి నట్లుగా కథాగేయాల్లో చెప్పబడుతూ ఉంటుంది. ఈ కథాగేయంలో రామన్న తన **కూతురు** వీరమ్మను అత్తవారింటికి పంపించేటప్పుడు బండ్లతో సారె పంపినట్లుగా ఇలా చెప్పబడింది.

"పన్నెండు బళ్ళేమో పచ్చిపసుపు పెట్టరా వీరమ్మకు
ఇరవై బళ్ళేమో కుంకుమెట్టరా వీరమ్మకి
పన్నెండు బళ్ళేమో సన్నాబియ్యమూ వీరమ్మకి
ఇరవయ్యి బళ్ళేమో దనదాన్యాలా వీరమ్మకి
పన్నెండు బళ్ళేమో కొండచీపురులా వీరమ్మకి
అయ్యా పన్నెండు బళ్ళేమో సాయపసుపు వీరమ్మకి
ఇరవయ్యి బళ్ళేమో చీరలా గాదా వీరమ్మకి
చీర రవికలతోటి దిగనాడు తార యావేళ
సన్నబియ్యం తోటి సాయపప్పులూ వీరమ్మకి
బళ్ళేము ముందల వీరమ్మేమో ఎనకాలా వీరమ్మా
బండి బండికి ఆవును గట్టేనా వీరమ్మకి
ఆవులతో వీరమ్మ వెళ్ళుతున్నదా ఆవేళ"

ఈ విధంగా గొల్లల వీరమ్మకథ అనే ఈ చిన్నకథాగేయం చక్కటి వారాను వర్తనాలతో సాహిత్యాంశాలతో రసవత్తరంగా ఉంది.

**ఈశ్వరమ్మ పాట :** ఇది శిశుమరణాలశాఖకు చెందుతుంది. ఇది పదిహేను పుటల చిన్న కథాగేయం. గతంలో శాస్త్ర విజ్ఞానం ఇంతగా అభివృద్ధి చెందక ముందు అనేక రకాల వ్యాధుల కారణంగా చిన్నపిల్లలు మరణించేవారు. ఈశ్వరమ్మ అనే మూడు సంవత్సరాల అమ్మాయి జ్వరం వచ్చి చనిపోయింది. ఆమె మరణానికి చలించిపోయిన జానపద కవి ఆమె కథను చిన్న కథాగేయంగా అల్లుతూ ఆమె చనిపోయిన తరువాత కొన్ని మహిమలను ప్రదర్శించి పేరంటాలై వెలిసినట్లుగా ఈ కథాగేయంలో కల్పించి చెప్పాడు.

చోడవరం తాలూకా పైడమ్మపేట అనే గ్రామంలో సంద్రాలమ్మ, పోలినాయుడు అనే బీద దంపతులకు లేకలేక ఈశ్వరమ్మ పుడుతుంది. ఆమెకు మూడు సంవత్సరాల ప్రాయం వచ్చినప్పుడు ఈశ్వరమ్మ తాతగారి ఊరైన గనిసెట్లపాలెం అనే గ్రామానికి వెళుతుంది. అక్కడ తన తోటి పిల్లలతో ఆడుకుంటూ ఎందుకో భయపడి జ్వరంతో ఇంటికి వస్తుంది. ఆ మరుసటి రోజే ఆమె చనిపోతుంది. ఆమె తాత ఎంకునాయుడు తన కూతురుకి, అల్లునికి ఈశ్వరమ్మ చనిపోయిన సంగతి తెలియజేస్తాడు. వారు వచ్చి దుఃఖించి ఈశ్వరమ్మను వెంకునాయుడు కల్లంలో పూడ్చిపెడతారు. ఇంతవరకు జరిగిన



కథ వాస్తవమైనది. ఆమె చనిపోయిన తరువాత అనేక మహిమలను చూపించినట్లుగా జానపదకవి కల్పించి రాశాడు.

కథాగేయాల్లో నాయకుడు గానీ నాయిక గానీ తల్లిదండ్రులకు అనేక నోములు, వ్రతాల ఫలితంగా జన్మించినట్లుగా చెప్పబడుతూ ఉంటుంది. అంతేగాకుండా ఆ పాత్ర దేవతల పోలికతో ఉన్నట్లుగా చెప్పబడుతూ ఉంటుంది. ఇలా చెప్పడం ఒక వారాను వర్తనం. ఈ కథాగేయంలో సంద్రాలమ్మ అనేక నోములు వ్రతాలు చేసిన ఫలితంగా అలువేలు మంగమ్మ పోలికతో అనేక శుభలక్షణాలతో ఈశ్వరమ్మ జన్మించినట్లుగా ఇలా చెప్పబడింది.

"నొయ్యరానీ నోములు తల్లి నోసినాదా సంద్రాలమ్మా
పట్టరాని బతములు తల్లి బట్టినాదా సంద్రాలమ్మా
ఎక్కరాని కొండలు తల్లి ఎక్కినాదీ సంద్రాలమ్మా
నేకనేక ఒక బిడ్డపుట్టినాదీ బాలవీశ్వరమ్మా
అలివేలు మంగమ్మ పోలికున్నాదో ఈశ్వరమ్మా
ఏడుకొండల వాడి నామమున్నాదీ ఈశ్వరమ్మా
............ .............. ..............."

"అయ్యా చక్కని తల్లి బాలవీశ్వరమ్మా నాయనా వీపున వింజమరి
బొడ్డుపల్లిపూవు నాలుక నచ్చత్రం వరికాలు తామర పద్మం వీశ్వరమ్మాకీ"

ఒక్కగానొక్క కూతురు ఈశ్వరమ్మ చనిపోయినప్పుడు ఆమె తల్లిదండ్రులైన సంద్రాలమ్మ, పోలినాయుడు గోడుగోడున దుఃఖించినట్లుగా జానపదకవి కరుణరస భరితంగా ఇలా రాశాడు.

"కూటికి గుడ్డకీ పేదవారమమ్మా ఈశ్వరమ్మా
నేకనేక ఒక బిడ్డ జల్మలైనావా ఈశ్వరులమ్మా
నేనేమి జేతునే ముద్దుకూతురు తల్లో ఈశ్వరమ్మా
గోలుగోలూమనీ గోలెట్టినాదీ సంద్రాలమ్మా"

ఈశ్వరమ్మ మరణించిన తరువాత తాతగారికి కలలో కనిపించి తనను పూడ్చిపెట్టిన దగ్గర గుడి కట్టించాలని చెబుతుంది. తాత తాను పేదవాడిననీ తన వల్ల కాదని చెబుతాడు. ఈశ్వరమ్మ గాలి రూపంలో పైడమ్మపేటలో ఉన్న తన తండ్రికి కలలో కన్పించి గుడి కట్టించమని కోరుతుంది. అతను కూడా తనవల్ల కాదని చెబుతాడు. ఆ తరువాత ఈశ్వరమ్మ ధనవంతుడైన తన చిన్నాన్న దగ్గరికి సర్పరూపంలో వెళ్ళి తన కోరిక చెబుతుంది. వాస్తవాన్ని గ్రహించలేని పినతండ్రి ఆమెను పిశాచంగా భావించి కోపంతో తిడతాడు.

అప్పుడు ఈశ్వరమ్మ తన మహిమను ఇలా ప్రదర్శించిందట.

"వాంతులూ విరోచనాలూ కాయించినాదీ చిన్నాన్నగారికి
జోడు వెడ్లు గానండీ మాయం జేసిందో ఈశ్వరమ్మ
బండిపోతులగానండీ మాయం జేసిందీ ఈశ్వరమ్మ
కట్టబాదలు కొన్ని పెట్టించినాదీ ఈశ్వరమ్మ
సక్కనీ నాతల్లీ పేరంటాలు ఈశ్వరమ్మ"

ఈశ్వరమ్మ పేరంటాలైందని జానపదకవి భావన. పేరంటాలు దేవతల లాగా మహిమలు చూపగల సమర్థురాలు.

ఆ తరువాత చిన్నాన్న వాంతులు, విరోచనాలతో అల్లకల్లోలమై ఒక శివభక్తురాలి దగ్గరకు వెళ్ళి తన బాధను చెప్పుకున్నాడు. ఈశ్వరమ్మ కోరిక తీర్చకపోతే తప్పక చనిపోతావని శివభక్తురాలు చెప్పడంచేత చిన్నాన్న ఈశ్వరమ్మకు గుడి కట్టిస్తానని మొక్కు కుంటాడు. ఈశ్వరమ్మ శాంతించి అతని స్వస్థత చేకూరుస్తుంది.

ఈశ్వరమ్మ తల్లిదండ్రులు, చిన్నాన్న అందరూ కలసి తాతగారి ఊరైన గనిసెట్ల పొలానికి వెళ్ళి ఆమె శవాన్ని బయటకు తీసి ఒక పెట్టెలో పెట్టుకొని తమ ఊరికి తీసు కొని వస్తున్నప్పుడు బస్సు కండక్టరు ఈశ్వరమ్మ శవం ఉన్న పెట్టెను కాలితో తంతాడు. ఈశ్వరమ్మ బస్సును ఆపేసి ముందు చక్రాలను విరిగిపోయే లాగా చేస్తుంది. కండక్టరుకు అనేక రకాలైన బాధలు కలిగిస్తుంది. కండక్టరు తన తప్పు గ్రహించి ఈశ్వరమ్మను ఇలా ప్రార్థిస్తాడు.

"దండమమ్మా దండమమ్మా నీకు దండమమ్మా ఈశ్వరమ్మా
గుళ్ళూ గుండం కాడికి నేనొత్తానమ్మో ఈశ్వరమ్మా
ఐదొందల రూపాలు డిబ్బీలేస్తానూ ఈశ్వరమ్మా
సీరీను శెతమానం నీకు దెస్తనమ్మో ఈశ్వరమ్మా
కట్టబాదలు కొన్ని తగ్గించావమ్మా ఈశ్వరమ్మా
చెడిపోయిన బస్సునీ బాగుచేయవమ్మా ఈశ్వరమ్మా"

అతని ప్రార్థనను మన్నించి ఈశ్వరమ్మ అతనికి స్వస్థత కలగ జేస్తుంది. ఆ తరువాత ఆమె శవాన్ని పైడమ్మపేటకు తీసుకొని వెళ్ళి ఆమెను అక్కడ పూడ్చిపెట్టి ఆ శవం మీద గుడి కట్టించి ప్రతిసోమవారం తీర్థం సాగిస్తున్నారు. అప్పటి నుంచి తన గుడిని దర్శిం చిన ప్రజల కోరికలు తీరుస్తూ ఈశ్వరమ్మ ప్రసిద్ధి చెందింది.

**లక్ష్మీపూజ పాట :** ఈ చిన్న కథాగేయాన్ని లంకెలపాలెం దగ్గర ఉన్న దొనకొండ మరిడయ్య అనే గంగిరెద్దు కళాకారుని నుంచి సేకరించాను. మరిడయ్యగారు అనేక



గేయాలను, చిన్న, పెద్ద కథాగేయాలను అలవోకగా పాడగల సమర్థుడు. ఈ లక్ష్మీపూజ పాటను తానే కల్పించానని వారు చెప్పారు. ఇది సాంఘిక చిన్నకథాగేయాల్లో మోసగాండ్ర విభాగానికి చెందుతుంది. గ్రామీణులకు భక్తి ప్రపత్తులు ఎక్కువ. వారి ఈలక్షణాన్ని ఆధారంగా చేసుకొని తాను చేసే లక్ష్మీపూజవల్ల సంతానం లేనివారికి సంతానం, కోరిన కోరికలు కలుగుతాయని నమ్మించి తొమ్మిదిమంది స్త్రీలను మోసగించి వారి వద్దఉన్న బంగారు నగలను ఎత్తుకొనిపోయిన ఒక మోసగాని కథ ఇది. ఈ కథలో మోసగానికి పేరు లేదు. 'అయ్యగారు' అని మాత్రమే కవి ఇతణ్ణి పిలిచాడు. ఇతని భార్యను అమ్మగారు అని చెప్పాడు. వీరిద్దరూ నర్సీపట్నం దగ్గరున్న వేములపూడి గ్రామానికివచ్చి ఆ గ్రామంలో మూడునెల్లు మకాం వేసి గ్రామంలోని స్త్రీపురుషులను ఈ విధంగా బుట్టలో వేశారట.

"ఏములు పూడొచ్చాడమ్మా వయ్యగారు మూడు నెళ్ళు ఉన్నాడమ్మా వయ్యగారు
మూడునెళ్ళు ఉన్నాడమ్మా వయ్యగారు ఏ తీరుగున్నాడమ్మా వయ్యగారు
అక్కల్లారా మీరన్నాడా వయ్యగారు సెల్లెల్లారా మీరన్నాడా వయ్యగారు
అమ్మా లచ్చిమీ పూజన్నాడా వయ్యగారు శివ్వదే పూజన్నాడా వయ్యగారు
మూడు నెళ్ళు ఉన్నాడమ్మా వయ్యగారు మూడు వేలు కర్చెట్టాడా వయ్యగారు
కోడిల్ని గొర్రెల్నమ్మా వయ్యగారు కోరిగ్గా కోయించాడా వయ్యగారు
సేతులతో మాసాలండీ వయ్యగారు పెద్దవాళ్ళ కందించాడా వయ్యగారు
మాసాలు తిన్నారమ్మా నాయుళ్ళు మాయ మాట లిన్నారమ్మా నాయుళ్ళు"

ఆ విధంగా ఆ ఊరి ప్రజలను తన మాయమాటలతో మభ్యపెట్టి తాను తన ఊరిలో చేసే లక్ష్మీపూజలో పాల్గొంటే

"సంతాపనం లేనోరికల్లా సెల్లెమ్మా సంతానం గలిగేనమ్మా సెల్లెమ్మా
కోరినావారికల్లా సెల్లెమ్మా కొడుకుల్లు గలిగేరమ్మా సెల్లెమ్మా"

అని నిమ్మిస్తాడు. అతని మాటలకు నమ్మి ఆ ఊరి అమాయకులైన జానపద స్త్రీలు తమలో తాము "ఒలే అచ్చీయమ్మా, ఒలే సింతల్లీ, ఒసే సినబుల్లీ" అని ఒకరు నొకరు పిలుచుకొని తమ దగ్గర నగలు లేకపోవడంవల్ల ఎరువు నగలు తెచ్చుకొని ధరించారట.

"ఎరువు నగలు దెచ్చారమ్మ సెల్లెమ్మలు ఎక్కువగా దరియించారా బాబయ్యా
పుత్తిల తాళ్ళేశారమ్మా సెల్లెళ్ళు లెక్కిలీసు లేశారమ్మా సెల్లెళ్ళు
నానుపట్టెల్లే శారమ్మో సెల్లెళ్ళు కాసులపేరే శారమ్మా సెల్లెళ్ళు"

ఇక్కడ జానపద కవి గ్రామీణ స్త్రీలు పరస్పరం బంధుత్వాలను కలుపుకుంటూ ఆప్యాయంగా పలకరించే పిలుపులను చక్కగా వివరించాడు. అంతేగాకుండా గ్రామీణులు ఎక్కడికైనా

వెళ్ళేటప్పుడు ఇరుగుపొరుగు వారి నగలను అరువుగా తీసుకొని ధరించటం పరిపాటి. జానపదుల ఈ పద్ధతిని కవి ఇందులో చక్కగా వర్ణించాడు. ఆ తరువాత ఆ మోసగాడు తొమ్మిది మంది స్త్రీలను తనతో పాటు తునికి తీసుకొచ్చాడు. అక్కడ అతను లక్ష్మీపూజకు కావలసిన సామానులు కొన్న విధాన్ని జానపద కవి ఇలా చక్కగా వివరించాడు.

"ఒక స్టీలు కంచం కొన్నాడయ్యా వయ్యగారు కొత్త సీర కొన్నాడయ్య వయ్యగారు
అరటిపళ్ళు కొన్నాడమ్మా వయ్యగారు మొక్కజొన్నలు కొన్నాడమ్మా వయ్యగారు
అగరొత్తులు కొన్నాడమ్మా వయ్యగారు అర్తిబిల్లలు కొన్నాడమ్మా వయ్యగారు
సుట్టు జంతికలు గొన్నాడమ్మా వయ్యగారు సేగోడీలు గొన్నాడమ్మా వయ్యగారు
ఇయ్యన్నీ గొన్నడమ్మా వయ్యగారు కొత్తబ్యాగులు కొన్నాడమ్మా వయ్యగారు"

తరువాత ఆ మోసగాడు ఆ స్త్రీలనందరినీ ఒక లాడ్జిలోకి దింపి వారిని సిని మాకు తీసుకెళ్తూ వారు పెట్టుకున్న నగలన్నింటినీ తీయించి ఒక బ్యాగులో పెట్టి ఆ బ్యాగును లాడ్జిరూములో పెట్టిస్తాడు. తరువాత వారందరినీ సినిమాకు తీసుకొని వెళ్ళి మధ్యలో తన భార్య కడుపునొప్పితో బాధపడుతూ ఉందని ఆమెను డాక్టరు దగ్గరికి తీసుకొని వెళ్ళే నెపంతో లాడ్జికి వచ్చి బంగారు ఆభరణాలను తీసుకొని ఆభరణాలు ఉన్న బ్యాగులో అరటిపళ్ళు మొదలైన వాటిని పెట్టి మద్రాసుకు వెళ్ళిపోతాడు. ఆ తరువాత అసలు విషయం తెలుసుకొని తొమ్మిదిమంది గ్రామీణస్త్రీలు లాడ్జిరూముకు వచ్చి లబోదిబోమని రోదించడం మొదలు పెట్టారు. వారి దుఃఖాన్ని జానపదకవి జానపదుల మాటల్లో చక్కగా ఇలా వర్ణించాడు.

"నాను పట్టెలు బోనాయమ్మో తల్లోయ్ మొక్కజొన్నలైపోనాయ సెల్లెళ్ళు
అమ్మ లెక్కిలీసులు పోనాయమ్మో నాయనా అరటిపళ్ళైనాయమ్మా సెల్లెళ్ళు
సేతి గాజులు బోనాయమ్మా తల్లోయ్ సేగోడీలైపోయాయా సెల్లెళ్ళు
అమ్మ సెవ్వితారలు పోనాయమ్మా నాయనా సుట్టుజంతికలైనాయయ్యా
నేను నూతిలోన పద్తానండో తల్లో గోతిలోన నేను పడతాను నాయనా
నేను బండి కింద బుర్రెడతాను బాబయ్యా బస్సుకింద బడతానురో బాబయ్య
నీటితోడయ్యారయ్యా సెల్లెళ్ళు వీదులంటా పరిగెట్టారా బాబయ్యా"

ఆ తరువాత లాడ్జివాళ్ళు పోలిసువాళ్ళను పిలిపిస్తారు. పోలీసువారు తొమ్మిది మంది స్త్రీలను పోలీస్‌స్టేషన్‌కు తీసుకొని వెళ్ళి వారి భర్తలకు ఫోన్ చేసి వారిని పిలిపిస్తారు. వారు వచ్చి పోలీసులకు తొమ్మిదిమంది స్త్రీలకు తొమ్మిదివేలు లంచం కట్టి తమ స్త్రీలను తీసుకొని వెళ్ళిపోతారు,



ఈ చిన్నకథాగేయంలో గ్రామీణులను మోసగాండ్రు ఏవిధంగా మోసం చేస్తారో కవి చక్కగా చెప్పాడు. ఇందులో గ్రామీణుల భాష వారి అమాయకత్వం చక్కగా చెప్పబడ్డాయి. నిజానికి ఇందులో లక్ష్మీపూజను గురించిన కథ ఏమీ లేదు. అమాయకులైన తెలుగు గ్రామీణ స్త్రీలు మోసగించబడిన విధం చెప్పబడింది. కథ చివర కథాగేయ రచనకు గల కారణాన్ని గురించి కవి ఇలా చెప్పాడు.

"ఆంధ్రా దేశంలోనా వక్కయ్యా వందరిని నమ్మిస్తారా వక్కయ్యా
అక్కల్లారా మీరన్నానో బాబయ్యా సెల్లెల్లారా మీరన్నానో బాబయ్య
ఎన్నిమాయలు పెడతారమ్మ అక్కలారా వీదిలోను బెడతారమ్మా
లచ్చిమీపూజంటారు వక్కయ్యా సివ్వదే పూజంటారూ వక్కయ్యా
ఇన్ని మాయలు బెడతారమ్మా అక్కయ్యా ఈదిలోన బెడతారమ్మా
మాయలో పడద్దమ్మా వక్కయ్యా మర్మాలే పడద్దమ్మా వక్కయ్యా
ఈలాటిమాయలు ఆంధ్రేశానికి తెలపాలని ఈలచ్చిమీపూజ పాటనుకూర్శాము"

ఈ విధంగా గంగిరెడ్డు కళాకారులైన దొనకొండ మరిడయ్యగారు కూర్చిన ఈ పాట మోసగాండ్ర మోసాలను ఎత్తి చూపుతూ దీన్ని గుణపాఠంగా తీసుకొని మోసపోవద్దని గ్రామీణులకు ఉపదేశం చేసేదిగా ఉంది.

**గంగరాజు పాట :** ఈ పాట చిన్న కథాగేయాల్లోని సాంఘిక శాఖలో లేవదీసుకుపోవడం అనే వర్గానికి చెందుతుంది. ఇందులో గంగరాజు గిరీశం లాంటి మోసగాడు, మంచి మాటకారి, తన మాటలతో అమాయకురాలు, వివాహిత, సంతానవతి అయిన అచ్చయ్యమ్మ అనే గ్రామీణ స్త్రీని మభ్యపెట్టి ఆమెను లేవదీసుకొనిపోయి ఆమె దగ్గర ఉన్న నగలు అమ్మి, పేకాడి, ఖర్చుపెట్టి ఆమెను వదిలివేసి పారిపోతాడు. ఇలాంటి సంఘటనలు సమాజంలో జరుగుతూ ఉంటాయి. కాబట్టి ఇవి సజీవ ఉదాహరణలు. గంగరాజు లాంటి మోసగాండ్ర వలలోపడి చివరకు అధోగతిపాలైన స్త్రీలను గురించి చెప్పడం వల్ల సమాజానికి ఉపదేశం చేసినట్లుగా భావించి జానపదకవి ఈ కథాగేయాన్ని కూర్చాడు. అంతేగాకుండా జానపద కవులు సమాజంలోని మంచిని గురించి ఎలా చెబుతారో అందులోని చెడునుగురించి కూడా అలాగే చెబుతారు. అందువల్లనే జానపద సాహిత్యం సమాజాన్ని ఉన్నది ఉన్నట్లుగా చక్కగా ప్రతిబింబిస్తుంది అని చెప్పడం జరుగుతుంది.

గంగరాజు పేదవాడు, అన్ని వ్యసనాలు ఉన్నవాడు. ఇతని అదృష్టం బాగా ఉండి లాటరీలో నాలుగువేలు గెలుస్తాడు. దాంతో సూటూబూటూ వేసుకొని అచ్చయ్యమ్మ దగ్గరకు వచ్చి ఆమెతో తన గురించి ఎంతో డాబుసరిగా ఇలా చెప్పాడు.

"ఏడుగదుల మేడున్నాది సిన్నదానా ఎంద్రూపాయల మిద్దున్నాదీ

కాలుకింద గచ్చున్నాడు గంగరాజు నట్టింట్లో నుయ్యున్నాడా గంగరాజు
నా ాోని నువ్వొస్తేను సిన్నదానా బలేబలే వాస్తిన్నాదీ సిన్నదానా
బందేరి మెరకల మీద చిన్నదానా జీడిమామిడి తోటున్నాదీ
ఆ జీడితోటల్లోను నాయురాలా కోనేరు తవ్వించానూ నాయరాలా
కోనేరు గట్టు మీదో నాయులారా కొబ్బరితోటేసినాను నాయురాలా
ఆ కొబ్బరితోటల్లానూ నాయురాలు అంటుమామిడి తోటేదామా
వంటింట్లో నుయ్యున్నాడా గంగరాజు నత్తగుళ్ళ సేలన్నాడు గంగరాజు
తలయంటి తోడన్నాడు గంగరాజు తోడువారు విద్దరన్నాడు"

అతని మాటలతో అచ్చుయమ్మ "పెన్నంలో వేసిన బూరె ముక్కలాగా పొంగి పోయింద"ట. అచ్చుయ్యమ్మ "చెరుకు ముక్కలా ఉంద"ట. ఇక్కడ అచ్చుయ్యమ్మను గురించి జానపదకవి పెన్నంలో వేసిన బూరెముక్క లాగా పొంగిపోయిందని, చెరుకుముక్క లాగా ఉందని చెప్పడంలో అతని లోకపరిశీలనాశక్తి, దానితోపాటు తనకు పరిచిత మైన విషయాలను ఉపమలుగా చిత్రించడం ఎంతో రమణీయంగా ఉంది.

గంగరాజు ఆమెను ఇంకా ఈవిధంగా ప్రలోభపరుస్తున్నాడు.

"మూడుతులాల ముక్కుపుల్లో అచ్చియ్యమ్మ నాల్గుతులాల లత్తుకాడోచ్చయ్యమ్మ
ఏడు తులాల తీగున్నాదో నాయురాల ఎనిమిత్తులాల నానున్నాదీ నాయురాల
నాతోని నువ్వొస్తేనూ సిన్నదానా బలేబలే వాస్తిన్నాదీ సిన్నదానా
వానిసిరి కాటుకన్నాదు నాయురాలా జమునా బొట్టన్నాడు
ఎన్ని మాయలు బెట్టినాడు గంగరాజు అచ్చుయ్యమ్మను తీసకెల్తాడు గంగరాజు"

ఈవిధంగా ముక్కుపుడక, లత్తుకాడ,తీగ, నాను మొదలైన బంగారు ఆభరణాలను ఆమెకు చేయిస్తానని ఆమెకు చెప్పడమే గాకుండా ఆమెకు సినిమా నటీమణులైన వాణిశ్రీ కాటుక, జమున బొట్టు, జ్యోతిలక్ష్మి కొప్పు మొదలైనవి అన్నీ సమకూరుస్తానని చెప్పి ఆమెను లేవదీసుకొనిపోయి హోటల్లలో ఆమెకు దోసె, పెసరట్టు, టీ, కాఫీలు, ద్రాక్ష పళ్ళు, చెరకురసం, చాక్లెట్లు మొదలైనవన్నీ పెట్టి ఆమె తనను బాగా నమ్మేటట్లుగా చేసుకున్నాడు. ఇదంతా తన మీద ప్రేమతో గంగరాజు చేస్తున్నాడని ఆ అమాయకురాలు భ్రమించి గంగరాజును ఎప్పటికీ వదిలిపెట్టనని చెప్పిందట.

ఆ తరువాత గంగరాజు అచ్చుయ్యమ్మతో అనేక ఊర్లు, తిరుగుతూ కోడిపందాలు, గొర్రిపోతు పందాలు, పేకాట మొదలైనవి ఆడి తాను లాటరీలో గెల్చుకున్న డబ్బు మొత్తం ఖర్చు పెట్టేస్తాడు. ఆ తరువాత అచ్చుయ్యమ్మ దగ్గర ఉన్న బంగారు వడ్డానం, నెక్లెసు మొదలైన ఆభరణాలు తీసుకొని వాటిని ఒకదాని తర్వాత అమ్మేసి ఆ డబ్బుతో



అచ్చుయ్యమ్మతో కలసి కాకినాడ, రాజమండ్రి మొదలైన ఊర్లు తిరుగుతూ పేకాట ఆడుతూ డబ్బు మొత్తం ఖర్చుపెట్టేశాడు. ఆ తరువాత ఒకరోజు తాగివచ్చి అచ్చుయ్యమ్మను పిడిగుద్దులు గుద్దాడట. ఆ గుద్దులు తిన్న అచ్చుయ్యమ్మ ఏవిధంగా బాధపడిందో జానపద కవి ఇలా వివరించాడు.

"నాలక్కాయలు బ్రాంది తాగి అచ్చుయ్యమ్మను ఏంజేస్తున్నాడు నాయనా
పిల్లావరి కోవెల కాడో నాయనా పిడిగుద్దులు గుద్దేసాడో
ఆ గుద్దులు దిన్నాదమ్మో నాయనా తాతల్ని దలిసిందమ్మో
మల్లిపూవ్వల్లాటోల్లయ్యా గంగరాజు మేనమామల్గొగ్గేశానయ్యా గంగరాజు
తాటిసెట్టుల్లాంటోల్లని గంగరాజు తండ్రుల్లి వొగ్గేశాను గంగరాజు
కొడుకుల్లి ఒగ్గేశాన్రో నాయుడా కూతుల్లి ఒగ్గేశాన్రో గంగరాజు"

ఆ తరువాత గంగరాజు అచ్చుయ్యమ్మకు తాను చాలా బీదవాడినన్న సంగతి చెప్పి ఆమెను తీసుకొని అనకాపల్లికి వచ్చి అక్కడ బెల్లం మార్కెట్‌లో ఆమెతో కలసి కూలిపని చేసి, ఆ తరువాత ఆమెను వదిలేసి తన దారిని తను వెళ్ళిపోతాడు. అచ్చుయ్యమ్మ పండంటి తన సంసారాన్ని, కొడుకులను కూతుళ్ళను వదిలివేసి గంగరాజు మాయ మాటలను నమ్మి అతనితో వచ్చినందుకు ఎంతగానో బాధపడి తన పుట్టింటికి గానీ, అత్తవారింటికి గానీ వెళ్లలేక ఒకచోట టీకొట్టుపెట్టుకొని బ్రతుకడం ప్రారంభించిందట.

ఈ విధంగా జానపదకవి గంగరాజు, అచ్చుయ్యమ్మల వృత్తాంతాన్ని చక్కటి జానపద భాషలో శ్రోతలను ఆకట్టుకొనేలాగా చెప్పి చివరకు అమాయకులైన సంసార స్త్రీలు గంగరాజు లాంటి మోసగాండ్ర మాటలకు లొంగిపోతే చివరకు వారి జీవితం నరక ప్రాయం అవుతుందని మంచి ఉపదేశాన్ని చెప్పాడు. 'కన్యాశుల్కం' నాటకంలో గిరీశం బ్రాహ్మణ వితంతువైన బుచ్చమ్మను లేవదీసుకొని పోవడానికి అనేక కష్టాలు పడవలసి వచ్చింది. కానీ ఈ కథలో గంగరాజు పిల్లలతల్లి అయిన అచ్చుయ్యమ్మను తన మాయమాటలతో సులభంగా లేవదీసుకొని పోగలిగాడు. వితంతువుల బాధలు, బాల్యవివాహాల దోషాలను చూపటం గురజాడవారు చేశారు. గ్రామాల్లో అమాయకులైన స్త్రీలు మోసగాండ్ర ప్రలోభాలకు ఎలా లొంగిపోతారో తద్వారా వారు ఎలాంటి కష్టాలు పడవలసి వస్తుందో చెప్పడమే జానపదకవి ప్రధాన కర్తవ్యం.

ఈ విధంగా గంగిరెద్దులవారు అనేక రసవత్తరమైన కథాగేయాలను పాడుతారు.

## ఒగ్గుకథ - సాహిత్యాంశాలు :

ఒగ్గుకథకులు ప్రారంభం నుంచి మల్లన్నకథ, బీరప్ప కథలను చెప్తుతూ

ఉన్నారు. ఇప్పుడు ఈ రెండు కథలతోపాటు ఎల్లమ్మ కథ, నల్లపోచమ్మకథ, పురూరవ చక్రవర్తికథ, వాసదేవునికథ, బాలనాగమ్మకథ మొదలైన అనేక కథలను చెబుతున్నారు. వీరు చెప్పే ఎల్లమ్మ కథను పరిశీలించుదాం.

**ఎల్లమ్మ కథ :** ఎల్లమ్మ తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల్లో ప్రసిద్ధి చెందిన గ్రామదేవత. ఈప్రాంతాల్లోని ప్రజలు ఈమె పేరుతో తమ పిల్లలకు ఎల్లవ్వ, ఎల్లమ్మ, ఎల్లయ్య, ఎల్లన్న, ఎల్లప్ప, ఎల్లారెడ్డి మొదలైన విధంగా పేర్లు పెట్టుకుంటారు. ఇంతగా ప్రసిద్ధి చెందిన దేవత కావడం వల్లనే ఒగ్గుకథాకారులు ఈమె కథను చెబుతారు. ఈకథ పెద్దకథాగేల్లో పౌరాణిక విభాగానికి చెందుతుంది. పౌరాణిక విభాగంలో రామాయణ సంబంధాలు, భారత సంబంధాలు, భాగవత సంబంధాలు, ఇతరాలు అనే నాలుగు శాఖలున్నాయి. వీటిలో ఈఎల్లమ్మ కథ ఇతరాల శాఖకు చెందుతుంది. పౌరాణిక కథా గేయాల్లోని పాత్రలు శిష్టసాహిత్యంలోని పురాణపాత్రల లాగా గంభీరమైన ప్రవర్తన కలిగినవారుగా గాకుండా మామూలు జానపదులుగా చిత్రింపబడుతూ ఉంటారు. కథల్లో వాతావరణం గూడా జానపదీయంగా ఉంటుంది. అంటే కథాగేయాల్లో జానపద మనస్తత్వ చిత్రణ, జానపదవాతావరణ చిత్రణ ప్రధానంగా ఉంటుంది. అలాగే ఈ ఎల్లమ్మకథలో గూడ శివుడు, పార్వతి మొదలైన పురాణపాత్రలు శిష్టసాహిత్యంలో లాగా గంభీరమైన ఉదాత్తమైన ప్రవర్తన కలిగినవారుగా గాకుండా మామూలు జాన పదులుగా ప్రవర్తిస్తారు. శిష్టసాహిత్యంలో త్రిమూర్తుల్లో లయకారుడైన ఈశ్వరుడు ఈ కథాగేయంలో గ్రామాల్లో ఆడపిల్లను గన్న తండ్రి బలవంతుడైన రౌడీకి భయపడుతు న్నట్లుగా సాధారణంగా ఉంటుంది. ఇతడు ప్రతినాయకుడైన కార్తీకవీరునికి భయపడే వాడుగా చిత్రింపబడ్డాడు. పార్వతి భర్తమాట జవదాటని పల్లెటూరిస్త్రీగా చిత్రింపబడింది. శివపార్వతులిద్దరు శివపురం అనే ఊర్లో నివసిస్తూ వుంటారు. శిష్టసాహిత్యంలోని కార్తవీర్యుడు కార్తీకవీరుడు అనే పేరుతో ప్రతినాయకుడుగా ఈకథలో చెప్పబడ్డాడు. ఇతడు రామాయణంలో రావణాసురుడు లాగా అష్టదిక్పాలకులను జయించి వారిచేత ఊడిగం చేయించుకుంటున్నట్లుగా చెప్పబడ్డాడు. కథాగేయాల్లో ఆశ్చర్యకరమైన అమా నుషమైన సంఘటనలు ఎక్కువగా చోటుచేసుకుంటాయి. ఈఎల్లమ్మ కథలో గూడా ఆశ్చర్యకర మైన సంఘటనలు చాలచోట్ల చెప్పబడ్డాయి. అంతేగాకుండా కథాగేయాల్లో సాధారణంగా కనిపించే వారానువర్తనాలు గూడా ఇందులో ఉన్నాయి. ఇవన్నీ కథా గేయాల్లో సాధా రణంగా కనిపించే లక్షణాలు. ఐతే మిగిలిన కథాగేయాల్లో సాధారణంగా కనిపించని కొన్నివిశేషాలు ఇందులో ఉన్నాయి. ఒగ్గుకథకులు ఈకథను చెప్పేటప్పుడు అవసరాన్ని బట్టి లాలిపాటలు, పిల్లలపాటలు, సువ్విపాటలు, ఎన్నియాలో పాటలు, బతుకమ్మపాటలు



మొదలైన అనేకరకాల జానపదగేయాలను అనేక వరుసల్లో ఎంతో మధురమైన బాణీలతో పాడుతారు. ఈగేయాల వరుసలు కథాకథనంలో గొప్ప అందాన్ని ఆసక్తిని కలిగిస్తాయి.

ఎల్లమ్మకథ సృష్ట్యాదితో ప్రారంభమవుతుంది. సృష్టిప్రారంభంలో ఆదిశక్తి నెమలి రూపంలో ఉద్భవించి మూడు గుడ్లు పెడుతుంది. ఒకగుడ్డు పగిలిపోయి ఆకాశం. రెండవ గుడ్డు పగిలిపోయి భూమి అవుతాయి. మూడవగుడ్డు నుంచి త్రిమూర్తులు ఉద్భవిస్తారు. వారు పెరిగి యువకులైనప్పుడు ఆదిశక్తికి వారి మీద ప్రేమ పుట్టి మొదట తనను ప్రేమించమని విష్ణువును, తర్వాత బ్రహ్మను అడుగుతుంది. ఆమె తల్లి కాబట్టి ప్రేమించలేమని వారు చెబుతారు. ఆదిశక్తి తన నుదుట ఉన్న చిత్రకన్ను తెరచి మొదట విష్ణువును, తర్వాత బ్రహ్మను భస్మం చేస్తుంది. తర్వాత ఆమె శంకరుని ప్రేమించమని అడుగుతుంది. శంకరుడు ఆమెను స్నానం చేసిరమ్మని చెబుతాడు. శక్తి తన దగ్గర ఉన్న అస్తమానం కట్టను, చిత్రకన్నును కింద పెట్టి స్నానం చేయడానికి పోతుంది. అప్పుడు ఈశ్వరుడు అస్తమానం కట్టను చేత పట్టుకొని, చిత్రకన్నును నుదుట అమర్చుకొని స్నానం చేసి వస్తున్న శక్తిని చిత్రకన్ను తెరచి భస్మం చేస్తాడు. తర్వాత శంకరుడు విష్ణువును బ్రహ్మను లేపుకొని, శక్తి బూడిదను నాలుగు భాగాలుగా చేసి మూడు భాగాల నుంచి శంకరునికి భార్యగా పార్వతిని, విష్ణువుకు భార్యగా లక్ష్మిని, బ్రహ్మకు భార్యగా సరస్వతిని ఉద్భవింప జేస్తారు. జ్యేష్ఠభాగంగా పెద్దవాడైన శంకరునికి నాలుగవ భాగం వస్తుంది. శంకరుడు ఆబూడిదను పుట్టలో పోస్తే అందులో నుంచి మాత ఒక అమ్మాయి రూపంలో ఉద్భ విస్తుంది. ఒగ్గుకథాకారులు ఇంతవరకు ఉన్న కథను వచనంలో వేగంగా క్లుప్తంగా చెబుతారు. ఆతర్వాత ఉన్న కథను గేయరూపంలోనూ వచనంలోనూ వివరంగా చెప్పడం ప్రారంభిస్తారు.

మాత పెరిగి యవ్వనవతి అయి ఒక రోజు ఇరవైవొక్క మెట్లు ఉన్న కోనేరులో స్నానం చేస్తున్నప్పుడు అదే దారిలో వెళ్తున్న ఈశ్వరుడు ఆమెను చూచి

"అవ్వారే సుందరీ ఏమి లాయిరుందీ – ఈసుందరిని పొందని జన్మమెందుకూ"

అని మనసులో అనుకుంటాడు. ఈకథలో అందమైన స్త్రీని చూచిన పురుషులందరూ శివుడు అనుకున్నట్లుగానే అనుకుంటారు. అంటే ఇది ఈకథలోని వారానువర్తనం. శివుని అభిప్రాయాన్ని గ్రహించిన మాత కోనేరు మెట్లలో ఒక్కొక్క మెట్టు దిగుతూ ఒక్కొక్క వరస అనుకుంటూ తన దగ్గరికి రమ్మని, చివరి మెట్టు దగ్గర అతను ఏవరస అనుకుంటే అదే వరస ఖాయమవుతుందవి శివునికి చెబుతుంది. దానికి శివుడు అంగీకరించి

"ఫష్టుమెట్టు దిగబట్టెను రామ ఓరామా
అయ్యా కోడలంటా పిలిచిందూ రామ ఓరామా

రెండో మెట్టు దిగిందు వదినంటా పిలిచిందు
మూడో మెట్టు దిగిందు ఓరకంట జూచిందు
నాలుగో మెట్టు దిగిందు బార్యంటూ పిలిచిందు
శివుడు ఎన్నో వరసలు పెట్టబట్టె నమ్మో
అయ్య చివరమెట్టు కొచ్చేటాలకూ రామ ఓరామా
ఏమి తోస్తలేదు వర్సలన్నీ అయిపోయాయట
కన్నబిడ్డో కన్నబిడ్డంట పిల్చినాదు జంగమయ్య "

ఆధునిక కాలంలో ఇంగ్లీషు పదాలు లేకుండా మాట్లాడలేకపోతున్నాం. ఒగ్గు కథకులు కూడా సమాజంలో ఉన్నవారే కాబట్టి పైగేయభాగంలో మొదటిమెట్టు అనకుండా ఫష్టు మెట్టు అనే పదాన్ని ఉపయోగించారు. కోనేట్లో స్నానం చేస్తున్న ఆమె దగ్గరికి ఒక్కొక్క మెట్టు దిగి వెళ్తూ మొదటి మెట్టు దిగినప్పుడు కోడలు అని, రెండవ మెట్టు దిగినప్పుడు వదిన అని, ఇలా శివుడు ఒక్కొక్క మెట్టు దిగుతూ ఒక్కొక్క వరుస అనుకుంటూ చివరిమెట్టుకు వచ్చేటప్పటికీ వరుసలన్నీ ఐపోవడం చేత కన్నబిడ్డ వరుస ఒక్కటే మిగలడంతో శివుడు అదే వరుసతో ఆమెను పిలుస్తాడు. అలా పిలువగానే లోకమాత చిన్న శిశువుగా మారిపోయి ఈశ్వరునిలో ఒడిలోకి చేరుతుంది. ఆమెను ఎత్తుకొని తన శివపురానికి వస్తున్నప్పుడు శివునికి దేవానదేవతలచేత చావు లేకుండా బ్రహ్మ చేత వరం పొందిన కార్తవీర్యమహారాజు ఎదురై అతని చేతిలో ఉన్న బాలను చూచి ఆమె అందానికి మురిసిపోయి ఆమె పెరిగి పెద్ద అయిన తర్వాత తనకే ఇచ్చి పెళ్ళి చేయాలని చెబుతాడు. ఇవ్వనంటే అతడు ఏమి బాధలు పెడతాడోనని శివుడు భయపడి అలాగే చేస్తానని చెప్పి మాట ఇచ్చి ఆబాలను తెచ్చి తన భార్య పార్వతికి అప్పగిస్తాడు. పార్వతి ఆబాలను చూచి చాల సంతోషించి ఇరవైవొక్క రోజుల తర్వాత ఆమెకు నామకరణం చేయడానికి విప్రాపురిపట్నం నుంచి బ్రాహ్మణులను తీసుకొని రమ్మని తన దాసీలను పంపిస్తుంది. వారు వెళ్ళి నూటొక్క బ్రాహ్మణులను తీసుకొని వస్తారు. వారు వచ్చినప్పుడు వారిని గురించి పిల్లలు పాడుకునే చక్కని హాస్యగేయాన్ని కథకులు ఇలా పాడుతారు.

"అయ్యగారయ్యగారంతే గానీ అయ్యగారి పెళ్ళాం ముంతంతో
ముంత దీసుకపోయి మూలన బెడితే నక్కెత్తుక పాయెరో నారాయణో
నారాయనన్నాని ఆడకపోతె గొడ్డలి దెగెరా గోవిందో
గోవిందాని నెను గోడకొరిగితె పెళ్ళ గూలెరా పెరుమాళ్ళో
పెరుమాళ్ళని నెను పెన్నకు బోతె ఆవు దన్నెరో అనుమాన్లో
అనుమాన్లని నేనంగడి బోతే దొంగలు దొంగలు రాజప్పో



రాజప్పని నెను రాళ్ళకు బోతె ఉన్న మూడు పండ్లూడపో్పా
ఊడప్పని నెను ఊర్లోకి బోతే తలుపు దగ్గర బెట్టి తన్నపో్పా
తన్నపో్పని నెను తాళ్ళకు బోతే మోకు మద్దబెట్టి మొత్తపో్పా
మొత్తపో్పని నెను మోటకు బోతే దనిన మద్దబెట్టి దంచపో్పా
హరోంహరి ఆహా లింగం హరోంహరి ఆహా లింగం "

ఆబ్రాహ్మణులు ఆమె జాతకం చూచి

"పాతపాత పంచాంగాల కట్టలు పాలనెతుల్లో గడిగి
గంగలొ బుట్టింది గాంబీర్యరాలు పుట్టలో బుట్టింది
బూలోకమాత జలంలొ బుట్టింది జలలోకమాత
రేవున పెరిగింది నీబిడ్డా రేణుకా దేవత ఎల్లమ్మో
ఎల్లు అంటా పేరు బెట్టిరి రామ ఓరామా"

అని ఆమెకు రేణుకఎల్లమ్మ అని పేరు పెడతారు. పార్వతి రేణుకను ఉయ్యాల్లో వేసి

"జోఅచ్యుతానందా జోఅచ్యుతానందా జోబాలకుందా
ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏడ్వాకు ఏటి ఎల్లమ్మా
ఏడిస్తే నిన్నెవరు ఏడిస్తే నిన్నెవరు ఎత్తుకుంటారు.
జో.......... ఆయమ్మా జో ....... ఆయమ్మా ఆయీ – జో అచ్యుతానందా"

అని జోలపాట పాడుతుంది. రేణుక పెరిగి ఏడు సంవత్సరాల ప్రాయం వచ్చినప్పుడు పార్వతి ఆమెను చదువుకోవడానికి గురువు దగ్గరికి పంపిస్తుంది. గురువు ఆమెకు పురాణాలు, కావ్యాలు మాత్రమే గాకుండా విలువిద్య, కత్తివిద్య, గుర్రపుస్వారీ మొదలైన విద్యలను గూడా నేర్పిస్తాడు. ఇవన్నీ నేర్చుకొని ఇంటికి వచ్చేటప్పుడు ఒక చోట కొంత మంది స్త్రీలు బతుకమ్మ ఆట ఆడుతూ కన్పిస్తారు. ఎల్లమ్మ తాను బతుకమ్మ ఆడదానికి దాసీలతో కలిసి పూల కోసం వెళ్తుంది. అక్కడ తోటలో

"బొడ్డుమల్లెలు బోసంగిమల్లెలు – అస్తమల్లెలు జూడు నిస్తమల్లెలు జూడు
అన్నేరు పువ్వులు గన్నేరు పువ్వులు – తీరైన పువ్వులు తీరుత్తరాసలు
మేలైన పువ్వులు మేలుత్తరాసలు"

ఇలాంటి పువ్వులు తెంపుకొని వస్తుంది. తల్లి వాటితోటి బతకమ్మలు ఏర్చి కుంకుడాకులో గౌరమ్మను జేసి రేణుకకు ఇచ్చి బతుకమ్మ ఆడదానికి పంపిస్తుంది. రేణుక వాటిని తీసుకొని ఆడపిల్లలు ఆడుకునే దగ్గరికి వెళ్ళి బతుకమ్మ ఆడుకొని గంగలో వదిలిపెట్టి గౌరమ్మను గురించి

"శ్రీలచ్మి నీమైమలే గౌరమ్మ చిత్రమై తోచునమ్మా గౌరమ్మా

చిత్రమై తోచునమ్మా గౌరమ్మ చిత్రమై తోచునమ్మా గౌరమ్మ
కాకెర్ర బూసింది కాకెర్ర గాసింది కాకెర్ర పూవబ్బునే గౌరమ్మ
కాకెర్ర కాయబ్బునా గౌరమ్మ కాకెర్ర కాయబ్బునా గౌరమ్మ
తంగేడు బూసింది తంగేడు గాసింది తంగేడు కాయబ్బునా గౌరమ్మ
తంగేడు కాయబ్బునా గౌరమ్మ తంగేడు కాయబ్బునా గౌరమ్మ
యాదాది కొక్కరోజూ గౌరమ్మ నీపూజ జేతుమమ్మా గౌరమ్మ
నీనోము నోతుమమ్మా గౌరమ్మ నీనోము నోతుమమ్మా గౌరమ్మ
నీనోము మేనోమగా గౌరమ్మ మాపూజలు జూడవూ గౌరమ్మ
మాసేవలూ జూడవూ గౌరమ్మ మాసేవలూ జూడవూ గౌరమ్మ
అయ్యయ్యో పోయిరా గౌరమ్మ పొన్నగంటి గౌరమ్మాని"

అని పాడిన తర్వాత వివాహితలైన స్త్రీలందరూ తమ గౌరమ్మలను ఎదుటివారి కిచ్చి వారి గౌరమ్మలను పుచ్చుకుంటారు. రేణుక తన గౌరమ్మను ఇవ్వబోతే ఆమెకు పెళ్ళి కాలేదు కాబట్టి ఆమె గౌరమ్మను తీసుకోమని వారు చెబుతారు. అప్పుడు ఎల్లమ్మ గౌరమ్మను గంగలో పారేసి దు:ఖిస్తుందట. ఆమె దు:ఖాన్ని కథకులు ఇలా పాడుతారు.

"ఆకలంత బోయినాక అన్నముండి ఎందుకు
సలంత బోయినాంక దుశ్శాలువుండెందుకు
దూప జల్లారినంక నీళ్ళుండెందుకూ
వయసంత బోయినాంక వరుడుండెందుకు
ఆడపిల్లగ్గావల్సింది పద్దెనిమిదేండ్లదాంక పరమేశ్వరుని పూజ
పద్దెనిమిదేండ్లు దాటినాక పతిపూజాని
ఎల్లమ్మ పెండ్లి గాని పిల్ల వలపొయ్యబట్టెనమ్మా ఎల్లమ్మో
కలకల కన్నీరునమ్మ ఎల్లమ్మనె కన్నీరు దీసుతుంది మావురాలో
గోగులు బూసె గోగులు గాసె ఎన్నియాలో ఎన్నియాలో
గోగుల పూత రంగుల పాలె సందమామయ్యో
మల్లెలు బూసి మల్లెలు గాసె ఎన్నియాలో ఎన్నియాలో
మల్లెపూలు సెల్లెండ్లపాలె సందమామయ్యో
కందులు బూసి కందులు గాసె ఎన్నియాలో ఎన్నియాలో
కందుల పూత నందుల పాలె సందమామయ్యో
అమ్మా వలవలా ఏడ్వానమ్మా ఎన్నియాలో ఎన్నియాలో
తల్లి వలపొయ్యా జాగినాది సందమామయ్యో "



రేణుక ఏడ్చుకుంటూ తల్లి దగ్గరికి వచ్చి తనకు పెళ్ళి గాని కారణంగా తన గౌరమ్మను ఎవరూ తీసుకోలేదని తనకు పెండ్లి గావాలని చెబుతుంది. ఆడపిల్లకు పెండ్లి తండ్రి చేయవలసిందే గానీ తల్లి చేయలేదని, ఆమె పెళ్ళి విషయం ఆమె తండ్రితో మాట్లాడతానని పార్వతి ఎల్లమ్మకు చెబుతుంది. ప్రతిరోజు శివుడు మధ్యాహ్నం భోజనం చేసేటప్పుడు ఎల్లమ్మ అతని ఒడిలో కూర్చునేదట. ఆరోజు శివుడు బోజనం చేయడానికి కూర్చొని తొలిముద్ద నోట్లో పెట్టుకోబోతున్నప్పుడు అతనికి ఎల్లమ్మ గుర్తుకొచ్చి కూతురేదని పార్వతిని అడుగుతాడు. అప్పుడు పార్వతి ఎల్లమ్మ తనంత అయి పెళ్ళీడు కొచ్చిందని పరోక్షంగా శివునికి

"నేం తొడిగే చెప్పు నాబిడ్డ కాలికొచ్చిందయ్య – నేను గట్టే సీరె నాబిడ్డ కడుతున్నది
నేం దొడిగే జాకెట్టు నాబిడ్డ రెట్ట కొచ్చింది – నేను గట్టే సీరె నాబిడ్డ గడుతున్నది"

అని చెబుతుంది. జానపదకవి ఎంతో చక్కగా గౌరవంగా పార్వతి చేత కూతురు పెళ్ళీడుకొచ్చిందని చెప్పించాడు. ఇక్కడ పాత్రలు పార్వతీపరమేశ్వరులు అయినప్పటికీ వారు గ్రామాల్లోని సాధారణ దంపతుల లాగా అంటే భార్య భర్తకు భోజనం పెట్టడం, భోజనం చేసేటప్పుడు ఇంటివిషయాలు మాట్లాడుకోవడం మొదలైనదంతా గ్రామాల్లో సాధారణంగా జరుగుతున్నట్లుగా జానపదకవి చెప్పాడు. ఇదంతా జానపదవాతావరణ చిత్రణ, జానపదమనస్తత్వ చిత్రణ అవుతుంది.

తమ కూతురు పెళ్ళీడుకొచ్చిందని పార్వతి పరోక్షంగా చెప్పిన దాన్ని శివుడు అర్థం చేసుకోడు. అప్పుడు పార్వతి

"తొడిగితెనెమో కాలికుంటున్నా – ఇడిస్తేనెమొ ఇడుపుకుంటున్నా నాదో
కాలికి చెప్పెంతో ఆడదాని బతుకంత – ఈడేరి నీబిడ్డ ఇంటిమీదున్నది నాయనో
కడదేరి నీబిడ్డ గడపల్లో ఉన్నది దేవో – బిడ్డ పుడితేనెమో తల్లికి బాదన్నరు
కొడుకు పుడితేనెమో తండ్రికి బాదన్నరు–మన బిడ్డ ఎల్లమ్మకు లగ్గం గావాలంట నాదో"

అని స్పష్టంగా చెబుతుంది. ఇందులో మొదటి మూడు పాదాల్లో పురుష స్వామ్యంలో స్త్రీబతుకు ఎంత హీనంగా ఉందో పార్వతి చేత జానపదకవి చక్కగా చెప్పించాడు. భర్తకు భార్య కాలికి చెప్పులాంటిదని చెప్పడంలో భార్య బానిస బతుకు స్పష్టమవుతుంది. పార్వతి అలా చెప్పగానే శివుడు వెంటనే తన బిడ్డ ఎల్లమ్మ అలాంటిది కాదని చెబుతాడు. కొడుకు పెళ్ళి కావాలంటే మన సమాజం తప్పుగా అర్థం చేసుకోదు. కాని కూతురు పెళ్ళి కావాలంటే మాత్రం మన సమాజం అంగీకరించదు. అందులోనూ తండ్రి తన కూతురు చిన్నపిల్ల అని అప్పుడే ఆమెకు పెళ్ళి ఏమిటని అనుకుంటాడు. ఇక్కడ శివుడు గూడా అలాగే అనుకొని

"నాబిడ్డ లగ్గమాని అడగదే నాబిడ్డ - ఎందుకట్ల చెప్పినావు ఓబామిని "
అని పార్వతిని ప్రశ్నిస్తాడు. అప్పుడు పార్వతి ఎల్లమ్మ ఏడ్చుకుంటూ బైట కూర్చుందని వెళ్ళి ఆమెనే అడగమని చెబుతుంది. అప్పుడు శివుడు ఎల్లమ్మ దగ్గరికి వచ్చి ఆమెను మహావీరుడైన కార్తీకమహారాజుకిచ్చి పెళ్ళి చేస్తానని చెప్పి కార్తీకరాజును గురించి ఇలా చెబుతాడు.

"బలబాయీ బంటంట బిడ్డా రేణూకా
రాతికోట రంపంకోట ఇత్తడికోట పుత్తడికోట
కంచుగుబ్బల్ల కోట ఏలేవాడు కార్తీకమారాజు
కార్తవీర్యమారాజు కార్తీక చెల్లమ్మ గన్న కొడుకు
గాలిదేవుడు వచ్చి వాకిండ్లు నూకుతున్నాడు
అగ్గిదేవుడు వచ్చి వంట జేసి పెడతయున్నాడు
శివుడు కార్తీకుని పూజమందిరంలో ప్రత్యక్షమైయున్నడు"

అని అతడు అష్టదిక్పాలను ఓడించి వారిచేత ఊడిగం చేయించుకుంటున్న గొప్పవాడని చెబుతాడు. అప్పుడు ఎల్లమ్మ "అతడు దేవతలు గన్న కొడుకా రాజులు గన్న కొడుకా రాక్షసులు గన్న కొడుకా" చెప్పమని శివుని ప్రశ్నిస్తుంది. దానికి శివుడు అతడు రాక్షసులు కన్నబిడ్డ అని సమాధానం చెబుతాడు. అప్పుడు రేణుక కోపంతో

"ఎంత బుద్ధిమాటా పల్కితివే నాయన జంగామా
ఒరె సిగ్గు లేదా నాయనా శివుడ జంగమయ్యా
దేవతలకు రాచ్చసులకు ఎట్ల గల్సునూరా నాయనా
ఓరి గోల్లజోపు వాడవూరా గోల శంకరూడా
నీకు తినేటందుకు తిండి లేక మూడూర్లు బిచ్చమెత్తు బిచ్చగాడ
ఏసుకునేటందుకు సొమ్ములేక రుద్రాచ్చ పేర్లు ఏసుకున్నోడ
కట్టేటందుకు బట్టల్లేక పులితోలు గట్టినోడా
పూసుకునేటందుకు గందం లేక బూడిద బూసుకున్నోడా
బుజకిరాటాల్లేక పాములల్లాటలేసుకున్న నాయన జంగమోడా"

అని శివుణ్ణి నిందిస్తుంది. కూతురు అలా నిందించినందుకు శివుడు బాధపడి తాను ఎల్లమ్మ శిశువుగా ఉన్నప్పుడె ఆమెను కార్తీకరాజుకిచ్చి పెళ్ళి చేస్తానని మాట ఇచ్చానని, ఇప్పుడు మాట తప్పితే కార్తీరాజు తనను, ఎల్లమ్మను గూడా చంపుతాడని చెబుతాడు. ఆ ఆపదనుంచి గట్టెక్కడానికి ఎల్లమ్మ ఒక ఉపాయం చెబుతుంది. దాని ప్రకారం శివుడు తన కూతురుకు స్వయంవరం ఏర్పాటు చేస్తాడు. స్వయంవరానికి "ఊరు



పరమటి భాగంలో ఏడంత్రాల మాలు కట్టిచ్చిందు, మాలుకాడ గనకనేమో ఆటువంటి పన్నెండు బిగాల గరటతంబం బాతి, గరటతంబానికి జాగంట గట్టి కింద రణబేరి బెట్టిందు, ముప్పైమూడు మూళ్ళ పాగచెల్ల చుట్టాలె, రణబేరి గొట్టాలే, అరవైయ్యారూర్లు తిరగాలె కలికిచామంతిపూలు తెచ్చి ముప్పైమూడు దేవతలకు పూజ గట్టాలే, గనుమంటి వానికి నాబిడ్డనిచ్చి లగ్గం జేస్తనంటడు"

ఈస్వయంవరంలో కార్తీకరాజుతో పాటు ఎవరూ నెగ్గలేరు. జమదగ్ని నెగ్గి ఎల్లమ్మను దేవతలందరి సమక్షంలో పెళ్ళి చేసుకుంటాడు. పెళ్ళైన నాలుగవరోజు నాగవెల్లి జరగవలసి ఉంటుది. కార్తీకరాజు బ్రాహ్మణవేషంలో శివపురానికి వచ్చి వధూవరుల జాతకాలు కుదరలేదని, నాగవెల్లి జరిగిగితే వారిద్దరికి ప్రాణగండముందని ఆదోషం పోవాలంటె జమదగ్ని కొంతకాలం తపస్సు చేయాలని, అంతవరకు నాగవెల్లి చేయ గూడదని చెబుతాడు. అతని మాటలు నమ్మి శివుడు గూడా అదేమాట చెబుతాడు. జమదగ్ని తపస్సు చేయడానికి బైలుదేరతాడు. రేణుక తాను కూడా భర్త వెంట బయలు దేరుతుంది. కొంతదూరం పోయిన తర్వాత జమదగ్ని తాను తపస్సు చేసి వస్తానని తనను దీవించి పంపమని రేణుకకు చెబుతాడు. అప్పుడు రేణుక

"అద్దానపడివిలోపల మంత్రానికి పోయిప్పుడు- నీకు దగ్గ పాలివాడు నీప్రాణం దీస్తే
నాకేమి నెరువుంది ఓనాదుడా - నాకేమి నెరువుంది మునిపుంగవా"

అని అడవిలో ఎవరైనా అతణ్ణి చంపితే తనకు ఎలా తెలుస్తుందని అడుగుతుంది. తనకు దీవణ ఇమ్మని కోరితే రేణుక తన చావును గురించి మాట్లాడినందుకు జమదగ్ని కోపంతో

"ఏమ్మాట పలికితివే ఆడిదాన నీవు
ఇల్లాల దీవనార్తి వెట్టమంటే సావు దీవన కోరినావు
నాకు సావు దప్పుదు నీనాలిక మచ్చుంది ఎల్లమ్మో
నాసావు దప్పాదాయె దేవి రేణుకమ్మా"

అని తనకు చావు తప్పదని, తాను చనిపోతే ఆమె చేతికున్న గాజులు పగిలి పోతాయని, కాలికున్న కంచుమట్టె పగిలిపోతుందని, పుస్తెలతాడు తెగి కింద పడి పోతాదని, బొట్టు పోతుందని ముండమోసినట్లుగా కలగంటుందని చెబుతాడు. "మరి నువ్ మరణమైతే మల్లెట్ల లేపుకుందు నాదోనాదా" అని రేణుక జమదగ్నిని అడుగుతుంది.

"నామీదప్రేమలు నామీద బ్రమలుంటే గనుక
సచ్చినోళ్ళ పేరు మీద సొచ్చమైన బోనమెత్తుకోని
ఏడంత్రాల బోనము ఎత్తుకోని రావే"

స్వచ్ఛమైనబోనం ఏడుకుండలు తీసుకొని వచ్చి బోనంకుండల్లో నుంచి ఏడు ముద్దలు

అన్నందీసి అతని నోట్లో పెడితే తాను తిరిగి బ్రతుకుతానని చెప్పి తపస్సు చేయడానికి అడవిలోకి వెళ్ళిపోతాడు. దారిలో అతనికి దాహమవుతుంది. అక్కడ ఉన్న కాళింగ మడుగుకు వెళ్ళి వంగి నీళ్ళు తాగుతుంటే అతని తల మీద ఉన్న తలంబ్రాలబియ్యం మడుగులో పడి మొలకెత్తి వరి పంట అయి "నాయనా నీపేరు మీద పుట్టినం మాకేదైనా దీవనార్తి పెట్టమని" వరిపైరు అడిగిందట. తాను చనిపోతే బోనంకుండల్లో ఆహారం గావాలని దీవనార్తి (వరం)పెట్టాడట. తర్వాత జమదగ్ని అడవిలోకి వెళ్ళిపోతాడు. ఎల్లమ్మ మట్టేడుపురం అనే ఊర్లో ఉంటుంది.

ఒక దగ్గర జటంగమహాముని అనే పేరుగల ఒక ముని సంతానం గోరి శివుని గురించి తపస్సు చేస్తే శివుడు ప్రత్యక్షమై ఒక మామిడిపండు ఇచ్చి దాన్ని అతని భార్య తింటే ఆమెకు ఒక కొడుకు పుడతాడని చెబుతాడు. "ఒక్క కన్ను కన్ను గాదు, ఒక్క రూపాయ్ ముల్లె గాదు, ఒక్క కొడుకు కొడుకు గాదు" అని జటంగముని భావించి మామిడి పండును భూమిలో పాతి నీళ్ళుపోస్తే అది మొలకెత్తి పెరిగి పెద్దదై ఐదు పండ్లు కాస్తుంది. స్నానం జేసి వచ్చి వాటిని తెంపుకోవాలని ఆముని స్నానానికి వెళ్తాడు. అదే సమయంలో జమదగ్ని అక్కడికి వచ్చి ఆకలవుతుంటే చెట్టెక్కి ఐదు మామిడిపళ్ళు తెంపు కొని తినబోతూ ఉంటాడు. జటంగముని వచ్చి ఎంతోకష్టడి తాను సంపాదించుకున్న మామిడిపళ్లను తెంపినందుకు కోపించి, జమదగ్ని తన సంతానం మొగం చూడకుండా చనిపోవాలని శపిస్తాడు. అప్పుడు జమదగ్ని తెలియక చేసిన నేరం క్షమించమని శాప విమోచన కలిగించమని ప్రార్థిస్తాడు. అతని కుమారులకు 24 సంవత్సరాల ప్రాయం వచ్చినప్పుడు తిరిగి అతడు జీవిస్తాడని ఆఐదు మామిడిపళ్ళను అతని భార్యకు ఇవ్వమని చెబుతాడు. జమదగ్ని ఆపండ్లను తన రెండు కాలిపిక్కల్లో దాచిపెడతాడు.

జమదగ్ని అడవిలో ఒక చోట తపస్సు చేసుకుంటూ ఉంటాడు. అదే సమయంలో కార్తీకరాజు వేటకు వచ్చి అలసిపోయి దాహంతో అల్లాడుతూ నీళ్ళు తీసుకొని రమ్మని తన సేవకులను పంపిస్తాడు. వారు నీటి కోసం వెదుక్కుంటూ జమ దగ్ని దగ్గరికి వచ్చి నీళ్ళు ఇమ్మని అడుగుతారు. జమదగ్ని కొన్ని మర్రికాయలు తెప్పించి అందులో "గువ్వలు" తీసివేయించి ఆమర్రికాయల్లో తన దగ్గరున్న కామధేనువు పాలు పిండుతూఉంటాడు. అప్పుడు కామధేనువు "నాపాలు తాగినోళ్ళు నాకే సేదైతారు కొడుకో-నాపాలు పిండబోకురా నాయనా"అని తన పాలను వారికి ఇవ్వవద్దని చెబుతుంది. ఐనప్పటికి జమదగ్ని వినకుండా పాలుపిండి రాజభటులకు ఇచ్చి "మీరు బోయే తోవలో మర్రికాయలు పటమాగి సంకురాత్రి గురుగులైతాయ్, సంకురాత్రి గురుగులు పటమారి దూపబుడ్లయితయ్. దూపబుడ్లు పటమారి బంగారి



బిందెలైతాయి. మీరాజు దగ్గరికి పోయేసరికల్ల సట్టేడు సముద్రమైతాయి. మంత్రులు తినేటందుకు మామూలు భోజనం రాజు తినేటందుకు రాజభోజనమైతాది. ఏనిగలకేమో సెరుగ్గడలైతాయి, గుర్రాలకు గుగ్గిల్లయితాయని" చెబుతాడు. అతడు చెప్పినట్లుగానే రాజుకు అతని పరివారానికి వారి గుర్రాలు ఏనుగులకు తగ్గ ఆహారం, నీరు మర్రికాయల్లో నుంచి వస్తాయి.

మర్రికాయలు చాల చిన్నవిగా ఉంటాయి. కాయల్లో లోపలి భాగాన్ని తీసివేసి వాటిలో పాలు పిండితే అందులో పట్టేపాలు చాల తక్కువ. అంత తక్కువగా కామధేనువు పాలను జమదగ్ని పిండి కార్తీవీరుని భటులకు ఇస్తే వారు వాటిని తీసుకొని వెళ్ళేటప్పుడు దారిలోనే మర్రికాయలు సంకురాత్రిగురిగలుగా అంటే చిన్నమట్టికుండలుగా మారతాయని, మరికొంత దూరం వెళ్ళేటప్పటికి ఆగురిగలు దూపబుడ్లు అంటే మంచి నీటి చెంబులుగా, మరికొంత దూరం వెళ్ళేటప్పటికి అవి బిందెలుగా, చివరకు ఆనీరు సముద్రమంత నీరు అవుతుందని అంతేగాకుండా కార్తీకరాజు రోజూ తినే రాజుల భోజనం, అతని మంత్రులు రోజూ తినే మంత్రుల భోజనం, వారిసైనికులు తినే మామూలు భోజనం, వారి ఏనుగులు, గుర్రాలు మొదలైన జంతువులకు అవసరమైన చెరుకుగడలు, గుగ్గిళ్ళు మొదలైనవి గూడా అందులోనుంచి వస్తాయని జమదగ్ని చెప్పాడు. అతను చెప్పినట్లుగా అవన్నీ జరిగాయి. జానపదకవి కామధేనువు పాల యొక్క మాహాత్మ్యాన్ని చెప్పడానికి ఇదంతా చెప్పాడు. ఇలాంటి ఆశ్చర్యకరమైన కల్పనలు ఇందులో ఇంకా ఉన్నాయి.

పైన చెప్పినట్లుగా జరిగినందుకు ఆశ్చర్యపోయి అదంతా జమదగ్ని వద్దనున్న ఆవు మాహాత్మ్యమని తెలుసుకొని ఆఆవు తన దగ్గర ఉంటే తాము ఎక్కడ ఉంటే అక్కడ తమకు కావలసినవన్నీ ఇస్తుందని ఆలోచించి కార్తీకరాజు జమదగ్ని దగ్గరికి వచ్చి తనకు కామధేనువును ఇమ్మంటాడు. ఆసమయంలో కామధేనువు మేతకు వెళ్ళి ఉంటుంది. అది దేవతల ధేనువు కాబట్టి దాన్ని ఇవ్వడం కుదరదని జమదగ్ని చెబుతాడు. దానికి కోపగించి దూడను తీసుకొని వెళ్తే ఆవు, దూడ కోసం దానంతట అదే తమ దగ్గరికి వస్తుం దని భావించి జమదగ్నిని భయపెట్టి దూడను తీసుకొని కార్తీకరాజు వెళ్ళిపోతాడు.

కామధేనువు వచ్చిన తర్వాత విషయం తెలుసుకొని తాను వద్దని చెబుతున్నా వినకుండా తాన పాలు నరులకు ఇచ్చి తన దూడకు అపకారం కలిగించినందుకు జమదగ్నిని అతడు అతని భార్యాపిల్లలకు దూరమవుతాడని శపిస్తుంది. అప్పుడు జమదగ్ని ఆవు తనకు ఇచ్చిన శాపానికి విమోచన కలిగిస్తే ఆవు తన దూడను తెచ్చుకునే మార్గాన్ని చెబుతానని అంటాడు. అప్పుడు ఆవు జమదగ్ని 24 సంవత్సరాల తర్వాత భార్యాపిల్లలను

కలుసుకుంటాడని చెబుతుంది. అప్పుడు జమదగ్ని తన దగ్గరున్న నాగబెత్తంతో ఆవు మీద తిప్పి దానికి వెయ్యి సింహాల బలమిచ్చి కార్తీకరాజు కోటను ధ్వంసం చేసి దూడను తెచ్చుకోమని చెబుతాడు. అప్పుడు ఆవు తన దూడ కోసం కార్తీకరాజు పట్నం మీదకు దండెత్తుతుంది. అది దండెత్తడాన్ని ఒగ్గుకథాకారులు వేగంగా చిన్న చిన్న పాదాల్లో ఇలా పాడతారు. ఇలా పాడడాన్ని చల్తీదాటి అని అంటారు.

"ఉరుకుతానే యున్నదే - కామదేనువెళ్ళైనా
ఈడికోల దగ్గరా - పన్నెడు బీగాలది
పరువు బండ లేపెనె - రాజుకోట మీదనే
దాడిజేయ వట్టెనా - రంపంకోట గూలెనా
ఇత్తడికోట గూలెనే - పుత్తడికోట గూలెను
ఊరుకొస్తయున్నది"

ఆవిధంగా కోటలన్నింటినీ కూలగొట్టి తనదూడను తీసికొని ఆవు ఉక్కురెక్కలు కావించుకొని ఆకాశమార్గంలో వెళ్ళిపోతూ వుంటే కార్తీకరాజు కోపించి తప్పరాని బాణాన్ని ఆవు మీదకు ప్రయోగిస్తాడు.

"తప్పరాని బాణమే తాను చేత వట్టెనా- తప్పరాని బాణము తాను గొట్ట వట్టెనా
మొయ్యమొయ్య బాణమే మోత వెట్టవట్టెనా - రొయ్యరొయ్య బాణమే రగ్గులేప వట్టెనా
ఈడికోలె దగ్గరా యాడికొస్తయున్నది - ఆరునెల్ల పుట్టరో కాంచాల మర్రిరో
బాణం మీదికైనప్పుడు ఆవులు కిందికొస్తున్నయి - బాణం కిందికైనప్పుడు ఆవులు
మీదికొస్తున్నయమ్మో
రయ్యరయ్య బాణమె మోత వెట్ట వట్టెనా - ఈడికోలె దగ్గరా యాడికొస్తయున్నది
ఆరునెల్ల పుట్టరో కాంచాల మర్రిరో- కాంచాల మర్రిరో రెండుగానే దెగెనా
పుట్టలోపల రాజురో తపసు వట్టియున్నడు- కుడిడొక్కలో బాణం దిగుతయున్నదమ్మో
అప్పుడు మునివరుడు ఏమంటయున్నాడు- దర్తు మీద వద్దదు ఓబామ రేణుకా
నువ్వన్నమాట దప్పలేదే ఎల్లమ్మో- నాప్రాణి పోతయున్నదే ఓరేణుకా
సచ్చినొల్ల పేరుమీద ఎల్లమ్మో- నిన్ను సొచ్చానా బోనమంటా జెప్పిన
దర్తి మీద వద్దదేమీ మునిరాజూ- అమ్మా వలపొయ్యవట్టెనెమీ రామరామా "

బాణాలు శస్త్రాలు, అస్త్రాలు అని రెండు రకాలు. గురి చూసి వేసేవి శస్త్రాలు. మంత్ర ప్రయోగంతో వేసేవి అస్త్రాలు. బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం మొదలైనవి ఇలాంటివి. వీటికి గురి అక్కర లేదు. మంత్రాన్ని పఠించి బాణం ప్రయోగిస్తారు. శిష్టకవులు అస్త్రం అనే దాన్ని ఒగ్గుకథాకారులు తప్పరానిబాణం అని అన్నారు. ఇది చక్కని తెలుగుమాట.



కార్తీకరాజు ప్రయోగించిన ఆబాణం ఆవు వెంట పడింది. ఆవు బాణం నుంచి తప్పించుకోవడానికి ఆకాశంలో కిందికి పైకి పోతూవుంది. అలా పోతూ ఆవు జమదగ్ని తపస్సు చేసుకుంటున్న కాంచాలమర్రిచెట్టు దగ్గరకు వస్తుంది. ఆవుకు తగలవలసిన బాణం అక్కడ పుట్టలో తపస్సు చేసుకుంటున్న జమదగ్ని కుడి డొక్కలో గుచ్చుకుంటుంది. అప్పుడు జమదగ్ని మరణయాతన పడుతూవుంటే అక్కడ నిద్రపోతున్న ఎల్లమ్మ తాను ముండ మోసినట్లుగా కల కంటుంది. ఆమె లేచి చూసేటప్పటికి తన మెడలోని పుస్తెలు తెగిపోయి ఉంటాయి. చేతి గాజులు, కాలిమట్టెలు, కడియాలు పగిలిపోయి ఉంటాయి. వీటన్నిటినీ చూసి తన భర్త చనిపోయినట్లుగా భావించి రేణుక ఇలా దు:ఖిస్తుంది.

"ఆహో ప్రాణనాదా నాదా నాదా నాదా-నువ్వు ఎక్కడెల్లిపోతివయ్య ఓనాదుడో
నేనేమి సేతునాని ఎల్లమ్మో - కలకల కన్నీరునమ్మో రామరామో
ఆమ్మ కన్నీరు దీసుతుంది రేణుకమ్మో-నేను ఏదారి నొత్తునయ్య ప్రాణనాదో
నేను ఏతోవనొత్తునంట ఎల్లమ్మనే- వలవల తల్లినమ్మ రేణుకమ్మ
నేనేమి సేతునంట ఎల్లమ్మో- నిను నేను లగ్గమాడి ఓనాదుడా
నేనేమి సూకపడ్డా ఓనాదుడో- నన్ను నువ్వు లగ్గమాడి మునిరాజా
నువ్వేమి సూకపడ్డావ్ ఓనాదుడో-ఆని కలకల కన్నీరు దీసుతున్నది రేణుక"

అని దు:ఖిస్తూ తన భర్త తిరిగి జీవించాలంటే స్వచ్ఛమైన బోనం తీసుకొని పోవాలని భావిస్తుంది. అది ఎలా తీసుకొనిపోవాలో ఆమెకు తెలియదు కాబట్టి దాన్ని తెలుసుకోవడానికి ఆమె గుండెలు బాదుకుంటూ తండ్రి ఉన్న శివపురానికి పరుగెత్తుకెళ్ళి శివుని చూచిన వెంటనే దు:ఖమాగక అతని మీదపడి దు:ఖించి తన భర్త చనిపోయాడని చెప్పి అతణ్ణి తిరిగి బ్రతికించుకోవడానికి స్వచ్ఛమైన బోనం తీసుకొని పోవాలని అది ఎలా పెట్టాలో చెప్పమని అడుగుతుంది. దానికి శివుడు

"సాదలేనోడు సాదుల్లో కల్సిండు - ఏలలేనోడు ఏట్లో గల్సిండు
ఆయన నాకిష్టం లేకుండె-కోడ్ని తినేటోడు వోయిండు
నీకు గొర్రెందినేటోడ్ని తెస్తనే కన్నబిడ్డా -వేరె పెండ్లి నీకు జేతును రామ ఒయ్ రామా

అని అంటాడు. అతని మాటలకు ఎల్లమ్మ కోపించి

వింటవూరా నాయనా దేవ జంగమయ్యా-ఆరు మంటలు మండిందీ దేవి యల్లమ్మ
ఒకెల్ల నీకు కర్మం మూడి నువ్ సచ్చిపోతె- మాఅమ్మ పార్వతమ్మ అమ్మ గంగదేవి
కోడ్ని తినేటోడు సచ్చిపోయిండాని - గొర్రెందినోటోన్ని ఇంకొక పెండ్లి
జెసుకుంటరా రామరామా"

అని అంటుంది. ఆమె మాటలకు శివుడు అడ్డుపడి నీదీ నాదీ ఒకటేనా అని ప్రశ్నిస్తాడు.

దానికి ఎల్లమ్మ

"నాయనా నాయనా నాయనో - ఏవ్వరిదేం బంగారి తాళి గాదు నాయనో

ఇంటింటికి మట్టిపొయ్యే ఉంటది గానీ - బంగారి పొయ్యి ఉండదు నాయనో

ఎవ్వర్లాత ఎట్లుందో నారాత ఇట్లుందీ - సచ్చాన బోనం సెలవు బెట్టు నాయానా"

అని స్వచ్ఛమైన బోనం ఎలా పెట్టాలో చెప్పమని తండ్రిని మళ్ళీ అడుగుతుంది. అది తనకు తెలియదని శివుడు కోపంగా పలుకుతాడు. దానికి ఎల్లమ్మ కోపించి సింహాసనం మీద కూర్చున్న తండ్రిని

"దండరెట్టలు వట్టింది గిరగిర దిప్పిందీ-గిరగిర దిప్పిందీ దర్తి మీద గొట్టిందీ

ఏనిగంతా బలాము ఎదమీద వెట్టిందీ-సచ్చానా బోనం సెలవు పెట్టేపెట్టు

లేకపోతే నీపాణం దీస్తా నాయనా"

అని పలుకుతుంది. శివుడు ఆమె బలానికి ఆశ్చర్యపోయి నెలకొకసారి ఆమె బహిష్టు కావాలని దానివల్ల ఆమె బలమంతా గంగ పాలు కావాలని శపిస్తాడు. అప్పటినుంచే స్త్రీలందరూ నెలకొకసారి అంటు అవుతున్నారట. ఆతర్వాత శివుడు ఎల్లమ్మ స్వచ్ఛమైన బోనం పెట్టే విధానం గురించి చెబుతాడు. దాని ప్రకారం ఆమె ఇలా చేస్తుంది. "సట్టేడు సంద్రాలకాడికొచ్చినాది, తామరాకుల్లోని ఎంద్రికాయగుళ్ళు దీసినాది, రొట్టెబిల్లలెక్క ఏడు గొట్టినాది, సుడిగుండమనంగా నీళ్ళు గుండ్రంగా తిరిగ్గేదగ్గర తూంకాడికొచ్చింది, ఎల్లమ్మ ఎప్పుడైతే నీళ్ళల్లో దుంకంగానే ఏడు బోనం కుండలు తయారైనాయట, ఏడు బోనం కుండలు చేతులో వట్టుకున్నది, కుమ్మరాములో వట్టి కాలేయొద్దన్నడు, సేతులో బోనంకుండలు వట్టుకోని సూర్రున్నెదుర్కున్నాదీ, సూరుడు ఏడురోజులు గొట్టే ఎండ ఒక్క గడియల్లో గొట్టిండట, మరి బోనంకుండలే కాలవట్టెనయ్యా, బోనం కుండ మీద దెబ్బగొడ్తే కాసినట్టు సప్పుడొస్తున్నదయ్యా, ఎల్లమ్మ గిరగిర ఉరికింది, మరి దూసావరిసేను బియ్యం కాళింగాల మడుక్కాడికెళ్ళి దూసావరిసేను బియ్యం వడ్లు దెచ్చిందీ, అరిసెయ్యి రోలు జేసింది, మోసెయ్యి రోకలిబండ జేసింది, అరిసేతిలో దంచింది, కంటిరెప్పలతో సెరిగినాదీ, సెరిగిన బియ్యం దీస్కపోయి కుండల్లో వెట్టింది. బోనం కుండలు ముందల వెట్టుకోని వలపొయ్యజాగింది రేణుకా, వలపోసినప్పుడేమీ రేణకఎల్లమ్మ కన్నీరు వోయింది ఏడు బోనంకుండలు నిండినాయి, బోనం తయారీ జేసుకుంటూంది. బోనం కిందవట్టి పొయ్యిరాళ్లు వెట్టి ఒండొద్దన్నాడు, చాతీ మీద వెట్టింది రెండు సన్నుపుష్పములు రెండు దిక్కుల వెట్టింది కదుమ ఒక్క దిక్కు పోటు వెట్టింది. సూరున్నెదుర్కున్నాదీ సచ్చాన బోనాలుడికినాయి, తమ్ముడా మల్లికార్జునసామీ ఎక్కడున్నవ్ తమ్ముడా అనంగానే సిరిశైలం సోమి పిడికెడంత బండారు పంపించిండటా, తమ్ముడు బండారు పంపిచ్చినప్పుడు



నాతమ్మునికి నేనేం బంపియ్యాలన్నది ఎల్లమ్మ, ఒళ్లుమీదున్నయ్ పందుం గవ్వల్లొకెల్లి ఏడు గవ్వలు తీసినాదీ, తమ్ముడా మల్లయ్య నీపేరు మీద ఒగ్గలు జగ్గలు వుట్టినయ్ వాళ్ళు గనక ఏమీ ఏడు గవ్వలతోటి కంటమాలలల్లుకోని మెడకు పెట్టుకోని నీపండుగల్ పబ్బాల్ జేయాలన్నది, అవిదానంగా చెప్పి రేణుకఎల్లమ్మ బండారు బొట్టు వెట్టి బోనం పూజించుకోని కాళ్ళకు పసుపు బెట్టుకుంది, ఒడివాలబియ్యం బోసుకుంది, తెల్లజీర అద్దాల జాకట్టు తొడుక్కోని, అమ్మవోరు ఎల్లమ్మ ఏమంటయున్నది, సుట్టబట్ట లేకపాయే, పుట్టకాడికురికుంది, పుట్టలో సెయ్ వెట్టింది, ఇక నాగన్ననే గుంజిందిరో సుట్టబట్ట జేసి నెత్తినవెట్టుకుంది, సచ్చమైనా బోనం నెత్తినెత్తుకున్నది ఒళ్ళో ఒడివాలు వోసుకోని అంబ్రరిల్లాల్ వట్టుకోని ఈరగోల వట్టుకోని,

"దమదమ దప్పుల్ గొట్టంగా అమ్మవోరు బైలెల్లంగా

గుబగుబ గుగ్గిలమెయ్యంగా ముమ్మయమూర్తులు నిండంగా

అమ్మవోరు బైలెల్లంగా అనంతకోటి దేవతలు

అమ్మవోరు బైలెల్లంగా ఉష్షో ఉష్షో జనులంతా

ఉష్షో ఉష్షో జనులంతా ఊగసాగిరే నరులంతా"

బోనం నెత్తిన వెట్టుకున్నాది, ఏడు గిద్దల ఆముదం బోసినాది ఏడు గిద్దల నూనె వోసింది ఒక్కటే అఖండ జ్యోతి ముట్టించెనే,

"అమ్మవోరు బైలెల్లంగా అనంతకోటి దేవతలు

అడివి లోపల రేణూకా తల్లి వస్తాయున్నాది"

ఇలా స్వచ్ఛమైన బోనం తల మీద పెట్టుకొని వస్తున్నప్పుడు కార్తీరాజు చూసి ఏలాగైనా ఆమె ఎత్తుకున్న స్వచ్ఛమైన బోనాన్ని ఎంగిలి చేసి ఆమె వ్రతాన్ని భంగం చేయడానికి ఏడు పిడికిల్ల మట్టి పట్టుకొని భూమి మీద కొట్టి ఏడుగురు దొంగలను సృష్టించి వారికి భిక్ష గాళ్ళ వేషం వేయించి ఎలాగైనా ఎల్లమ్మ బోనాన్ని ఎంగిలి చేయమని పంపిస్తాడు. వారు ఎల్లమ్మకు ఎదురుగా వచ్చి ఏడురోజుల నుంచి అన్నం లేదని తమకు అన్నం పెట్టమని అనేక రకాలుగా బ్రతిమాలుతారు. వారి బాధ నిజమని నమ్మి ఎల్లమ్మ ఏడుబోనాలనుంచి ఏడు ముద్దలు తీసి వారికి పెడుతుంది. ఆతర్వాత రేణుక ఎంగిలి బోనాలు తీసుకొని జమదగ్ని పడిపోయిన దగ్గరికి వస్తుంది. ఆమెను చూసి జమదగ్ని స్వచ్ఛమైన బోనం తెమ్మంటే ఎంగిలి బోనం తెచ్చావు దీనివల్ల తనకు ఉపయోగం లేదని తన ప్రాణం పోతుందని జమదగ్ని ఇలా దు:ఖిస్తాడు.

"నాబాణమన్నా పీకరాదే ఓరేణుకా- నిన్ను నేను లగ్గమాడి ఎల్లమ్మా

నేను ఏ[illegible] సూకపడ్డనమ్మా ఎల్లమ్మో- నన్ను నువ్వు లగ్గమాడి ఎల్లమ్మా

నువ్వు ఏమి సూకపడ్డవమ్మ ఎల్లమ్మ- నాప్రాణమెల్లిపోతయుందే ఓరేణుకా
నాయన గౌతుడా మానాయనా-ఓతల్లి అలియమ్మా అలియమ్మ"

అని తన తల్లిదండ్రులను తలచుకొని శోకించి చనిపోయే ముందు రేణుకను ఏదైనా వరం కోరుకోమంటాడు. అప్పుడు ఎల్లమ్మ తనకు సంతానం కావాలని కోరుకుంటుంది. జమదగ్ని ఆమెకు నలుగురు కుమారులు ఒక కూతురు పుడతారని చెప్పి తన పిక్కలో దాచిపెట్టిన ఐదు మామిడిపళ్ళు తీసి ఆమెకిచ్చి తన డొక్కలో గుచ్చుకున్న బానం తీసి అందులో నుంచి వచ్చే తన రక్తాన్ని ఐదు దోసిళ్ళు తాగితే ఐదుగురు సంతానం కలుగుతారని చెబుతాడు. ఆమె అతను చెప్పినట్లుగా బానం పీకగానే జమదగ్ని చనిపోతాడు. అతని శరీరం నుంచి రక్తం కారుతూ ఉంటే ఎల్లమ్మ మొదటి దోసిలి రక్తం తాగుతూ ఉన్నప్పుడు విష్ణువు చూచి దోమరూపంలో ఆమె తాగే రక్తంలో చేరి ఆమె గర్భంలో ప్రవేశిస్తాడు. తర్వాత మరి నాలుగు దోసిళ్ళ రక్తం తాగి ఐదు మామిడి పళ్ళు తింటుంది. ఆతర్వాత ఎల్లమ్మ జమదగ్నికి అంత్యక్రియలు నిర్వహించి అతని ఎముకలు తీసి ఏడు బోనం కుండల్లో పెట్టి మర్రిచెట్టులో దాచిపెట్టి అవి తనకూ తన సంతానానికి తప్ప మిగిలిన వారికెవరికి కనిపించ కూడదని ఒట్టు పెడుతుంది. జమదగ్ని ఇచ్చిన మామిడిపళ్ళ తినడం చేత ఆమె గర్భవతి అవుతుంది.

"ఒక్క గడియా నిండంగా ఓకిలింతలాయే- రెండేసి గడియల్లో రొమ్ములు గనమాయే
మూడు గడియల్లో ముద్దపిండమాయే -నాలిగేసి గడియల్లో నవసందులాయెనమ్మో
ఐదేసి గడియల్లో ఆవుసులు నిండెనమ్మో-ఆరు వోయి ఏడు గడియలే దేవి ఎల్లమ్మా
ఏడేసి గడియల్లో యవసాడినాది పిండం-నవతొమ్మిది గడియల్ నిండ వచ్చాయి"

ఆతర్వాత ఎల్లమ్మ ఐదుగురు పిల్లలను కంటుంది. బ్రాహ్మణులను పిలిచి నామకరణం చేయిస్తుంది. పారిన రక్తంలో పుట్టాడు కాబట్టి పెద్దకొడుకు పేరు పరుశురామయ్య అని మిగిలిన వారికి డొక్కలయ్య సిటికెలయ్య జంపయ్య సిరియాలగౌరమ్మ అని పేర్లు పెడతారు. ఎల్లమ్మ లాలిపాటలు పాడుతుంది. వారు పెరిగి పెద్దవాళ్ళవుతారు.

జానపదసాహిత్యంలో నాయకుడు ఒక అసాధారణమైన వస్తువు కోసం ఒక వ్యక్తిని అడిగినప్పుడు అది తన దగ్గర లేదని ఫలానా వారిదగ్గర ఉందని ఆవ్యక్తి చెప్పడం, నాయకుడు ఆవ్యక్తి దగ్గరికి వెళ్ళి ఆవస్తువును గురించి అడగడం, ఆవ్యక్తి అది తన దగ్గర లేదని ఫలానా వారి దగ్గర ఉందని చెప్పడం, ఇలా ముగ్గురు నలుగురు వ్యక్తులు చెప్పడం చివరకు నాలుగవ వ్యక్తి గానీ ఐదవ వ్యక్తి గానీ నాయకుడు కోరిన వస్తువును ఇవ్వడం జరుగుతుంది. కథను ఎక్కువ సేపు చెప్పడానికి జానపదకవులు ఇలా చేస్తారు. ఎల్లమ్మ కథలో పరుశురాముడు బొంగరాలాట ఆడుకోవడానికి " కారుతోటి



పట్టందీ, కొలిమిలో పెట్టంది, సుత్తితో దెబ్బ తినని బొంగరం" కావాలని తల్లిని అడుగుతాడు. అలాంటి బొంగరం తన దగ్గర లేదని తన పినతల్లి గంగ దగ్గర ఉందని చెబుతుంది. రాముడు గంగ దగ్గరికి పోయి బొంగరం ఇమ్మని అడిగితే తన దగ్గర లేదని చెంచువారి కోనలో ఉన్న కాటమ్మశక్తి దగ్గర ఉందని గంగ చెబుతుంది. రాముడు ఆశక్తి దగ్గరకు పోయి అడిగితే అది తన దగ్గర లేదని నాగలోకంలో పన్నెండు శిరసుల నాగయ్య తల మీద ఉంటుందని శక్తి చెబుతుంది. వెంటనె పరుశురాముడు నాగ లోకంలోకి వెళ్లి పన్నెండు శిరసుల నాగరాజును చూసి చిన్నశిశువుగా మారిపోయి దానికి కనిపించకుండా వెళ్ళి దానితోక పట్టుకొని గిరగిర తిప్పి భూమికేసి కొట్టి చంపివేసి బొంగరాన్ని తీసుకొని దానితోలును బొంగరానికి జాలెగా చేసి తీసుకొని తల్లి వద్దకు వచ్చి తాను ఎవరితో బొంగరాలాట ఆడాలని అడుగుతాడు. కంచువారిపట్నంలో బలిజవారైన వరదరాజు బూపాలసిద్దమ్మ గన్న ఏడుగురు కుమారులు ఎలిసెట్టి మలిశెట్టి రాజులు అతని మేనబావలున్నారని వారితోటి ఆడుకోమని చెబుతుంది. పరుశురాముడు మేనమామ ఊరికి పోతూ దారిలో ఒక గొర్రెపిల్లను, చలువడేగను తీసుకొని బావలున్న కంచువేరిపట్నానికి వచ్చి వారితో కోడిపందెం, పొట్టేళ్ళ పందెం, బొంగరాల పందెం ఆడి గెలుస్తాడు. పిడిగుద్దులపందెం ఆడేటప్పుడు తన తండ్రి పేరు చెప్పాలని బలిజ వారు చెబుతారు. తండ్రి పేరు తనకు తెలియదని రాముడు చెబుతాడు. అప్పుడు బావలు

"ఓరి రండెల్లి కొడుకో రాముడా ఓరాముడా
నీకు రాజ్యాలు లేవురా రాముడా ఓరాముడా
మీకు నాయన లేడు రాముడా ఓరాముడా
మరి మీకు తండ్రి లేడు రాముడా ఓరాముడా
గొల్లవాళ్ళ రాముడా ఓరాముడా
పచ్చిపాలకు రాముడా ఓరాముడా
మీయమ్మ నిన్ను కన్నదిరా రాముడా ఓరాముడా
చక్కగ గన్నదిరా మీయమ్మ గొల్లొల్ల పచ్చిపాలగ్గన్నది
గొండ్లోళ్ళ లేతముంజలకు గన్నది
తొవ్వసారొల్లకు కొంగు వరసి గన్నది,
పర్వతం తొవ్వల్లో పచ్చిపెసర్లగ్గన్నది మీయమ్మ"

అని అంటారు. ఆమాటలు వినలేక వారిని ఏమీ అనలేక పరుశురాముడు వెంటనే తన తండ్రిని గురించి తెలుసుకోవడానికి తల్లి దగ్గరకు బైలుదేరి వస్తాడు. ఆకోపంలో వచ్చేటప్పుడు దారిలో ఒక పూజారిని కొట్టగా పూజారి అతణ్ణి తండ్రిలేని రంకులకొడకా

అని తిడతాడు. అంతేగాకుండా బావి దగ్గర ఆడవారి కడవలు పగుల గట్టగా స్త్రీలు గూడా అతణ్ణి ముండకొడుకు రండకొడుకు అని తిడతారు. ఆకోపంతో పరుశు రాముడు తల్లి దగ్గరకు పరుగున వచ్చి దారిలో ముగ్గురు పెద్దలు తనను ఒక పాట గురించి ప్రశ్నించారని దానికి సమాధానం కావాలని, ఆపాటను ప్రజలందరి ముందు చెబుతానని చెప్పి తల్లిని నలుగురులోకి తీసుకొని వచ్చి ఇలా పాడతాడు.

"విత్తులేని చెట్టు ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-అది పాలెట్ల బెట్టెనె ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
పాలు లేంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ- అది ఇత్తెట్ల వెట్టెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
ఇత్తు బెట్టంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ- అది మొలకెట్లు మొలిచెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
మొలక మొలవంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ- అది తీగెట్ల వారింది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
తీగ వారంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ- దాని పందిరెట్లేసిరి ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
పందిరెయ్యంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-అది కాయెట్ల గాసెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
కాయ గాయంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-అది పండెట్ల బండెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
కోడె లేని దూడ ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-ఆదూడెట్ల గట్టెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
మొగుల్లేని వాన ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-గావానెట్లు గొట్టెనే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
నాయన లేంది ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-మరి మేమెట్ల బుట్టిమే ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
ఆజగ్గరాజుల్ల ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ- మారాజు గానరాడు ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
దేవాన దేవతుల్లో ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-మాదేవుడు గానరాడు ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ
ఇంతమందిలో ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ-మానాయన గానరాడు ఎల్లమ్మో దేవి ఎల్లమ్మ"

అని ప్రశ్నించి తల్లిని కాలితో చేత్తో కొడుతూ తమ తండ్రెవరో చెప్పమని చిత్రహింసలు పెడ్తున్నాడట. పరుశురామునికి 24 ఏండ్లు వచ్చేవరకు తన గురించి చెప్పవద్దని జమదగ్ని రేణుకను ఆజ్ఞాపించడం వల్ల ఆమె పరుశురామునికి అతని తండ్రిని గురించి చెప్పలేక పోతుంది. పరుశురాముడు పెట్టే బాధలకు సహించలేక ఆమె మీరు సత్యాన పుట్టారని చెబుతుంది. దానికి పరుశురాముడు సత్యమిచ్చిన దేవుడెవరు చెప్పమని గట్టిగా అడుగుతాడు. అప్పుడు రేణుక మీరు వరాన పుట్టారని చెబుతుంది. వరమిచ్చిన దేవుడెవరు చెప్పమని పరుశురాముడు అడుగుతాడు. మీరు లంబాడ తండాలో మూలనచ్చత్రాన ఊరు గండాన పుట్టడంచేత మిమ్మల్ని గంగలో పారేస్తుంటే నేను తెచ్చి పెంచుకున్నాని చెబుతుంది.దానికి పరుశురాముడు ఏతండాలో పుట్టాము ఎవరికి పుట్టామో చెప్పమంటాడు. అప్పుడు ఎల్లమ్మ

"మీరు అట్ల గూడా పుట్టలేదుర ఓరాముడా-ఎర్రగా బండ గూడ గాలబెట్టి
నన్ను బండ మీద పొర్లిచ్చినా రామయ్యో-తండ్రి జాడ తెల్వదురా నారాముడా"



అంటుంది. అప్పుడు పరుశురాముడు ఎర్రగా బండ కాలబెట్టి తల్లిని ఆబండమీద పడుకోబెడతాడు. అన్న తల్లిని కష్టపెట్టడాన్ని చూసి సహించలేక సిరియాల గౌరమ్మ మనకు ఇప్పటికే తండ్రి లేడు తల్లి చనిపోతే మనం తల్లి గూడా లేని పిల్లలమవు తామని చెబుతుంది. అప్పుడు రాముడు తల్లిని వదలిపెట్టి తమ్ముళ్లను చెల్లెలిని పట్టుకొని దు:ఖిస్తూ ఉంటాడు. అప్పుడు ఎల్లమ్మ రామునికి 24 సంవత్సరాలు వచ్చేవరకు కనిపించకుండా దాక్కుంటే మంచిదని భావించి ఆమె ఊర్లో బ్రాహ్మణవాడ, కోమట్లవాడ, కాపులవాడ మొదలైన వాడలన్నీ తిరిగి వారి ఇళ్ళలో దాక్కునే ప్రయత్నం చేస్తుంది. పరుశురామునికి భయపడి ఎవరూ ఆమె తమ ఇంట్లో దాక్కోవడానికి అవకాశమివ్వరు. ఎల్లమ్మ చివరకు మాదిగవాడలో మాతలింగమ్మ అనే ఆమె ఇంటికి వచ్చి తన కొడుకు నుంచి దాక్కోవడానికి చోటు ఇవ్వమని అడుగుతుంది. ఆమె ఎల్లమ్మ చీర, రైక తీసుకొని ఆమె దాక్కోవడానికి స్థలం చూపిస్తుంది.

పరుశురాముడు బైండ్లవాని వేషం వేసుకొని తల్లిని వెదుక్కుంటూ మాతలింగమ్మ ఇంటికి వచ్చి

"నీకొడుకు రాముడు ఎల్లమ్మో బైండ్లవాడా ఎల్లమ్మో
నీబిడ్డ గౌరమ్మెల్లమ్మ జోగురాలయిందెల్లమ్మ"

అని పాడేటప్పటికి దాక్కున్న ఎల్లమ్మ బైటికి వస్తుంది. రాముడు ఆమెను చూచి పట్టుకొని తన తండ్రి పేరు చెప్పమని అడుగుతాడు. ఎల్లమ్మ పాముగా, పెద్దపులిగా మారి అతని నుంచి తప్పించుకునే ప్రయత్నం చేస్తుంది. రాముడు కనుక్కొని ఆమె తప్పించు కోకుండా చూస్తాడు. చివరకు ఇద్దరు మట్టేడుమావురానికి వస్తారు. అప్పటికి రామునికి 24 సంవత్సరాలు నిండుతాయి. అప్పుడు ఎల్లమ్మ పరుశురామునికి అతని తండ్రి జమదగ్ని అని అతణ్ణి కార్తీకరాజు చంపాడనీ, అతని ఎముకలు కాంచాలమర్రి దగ్గర ఉన్నాయని చెబుతుంది. వెంటనే రాముడు పరుగున కాంచాలమర్రి వద్దకు వెళ్ళి తండ్రి ఎముకలు తీసుకొని వాటిని అతికించి బ్రహ్మ దగ్గరికి వెళ్ళి తండ్రికి రాత రాయించి సంజీవి పర్వతానికి వెళ్ళి సంజీవిపుల్ల తెచ్చితండ్రిని బతికిస్తాడు. వెంటనే కార్తీకరాజు మీదకు దండెత్తివెళ్ళి అతనితో యుద్ధం చేసి చంపుతాడు. ఆతర్వాత రాముడు తల్లిదండ్రులకు నాగవల్లి చేస్తాడు.ఇంతటితో ఎల్లమ్మ కథ ముగుస్తుంది.

ఈవిధంగా ఒగ్గువారు చెప్పే ఎల్లమ్మ కథలో అనేక అద్భుత కల్పనలు, జానపద మనస్తత్వ చిత్రణ, జానపద వాతావరణ చిత్రణ, ఆనేక వారానువర్ణనాలు మొదలైన సాహిత్యాంశాలున్నాయి. ఇదే విధంగా వీరు మల్లన్న కథ, బీరప్ప కథ మొదలైన అనేక కథలను వివిధ సాహిత్యాంశాలతో చెబుతారు.

## తప్పెటగుళ్ళ కథలు - సాహిత్యాంశాలు :

తప్పెటగుళ్ళ కళాకారులు తమ కళాప్రదర్శన సందర్భంగా అనేక పౌరాణిక, చారిత్రక, సాంఘిక కథాగేయాలను పాడతారు. వీరు సేవగరిడి కళాకారులు పాడే దశావతార కథలను తమ కళా ప్రదర్శన సందర్భంగా పాడతారు. ఐతే సేవగరిడి కళాకారుల లాగా కథాగేయాన్ని పూర్తిగా పాడరు. దశావతార కథాగేయాలలోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలను మాత్రమే వీరు పాడతారు. ప్రధానంగా కృష్ణావతారంలోని కృష్ణుని పుట్టుక, కృష్ణుడు కంసుని సంహరించడం, గొల్లభామలతో గోటకాలాడడం, కాములావతారం మొదలైన కథాభాగాలను పాడతారు. రామావతారంలో లక్ష్మణమూర్ఛ కథను పాడతారు. చారిత్రకాల్లో సారంగధర కథను, సాంఘికాల్లో పూసలఅప్పన్న కథ, రెల్లిఅప్పమ్మ కథ, మాలవారి మంగమ్మ పాట మొదలైన కథాగేయాలను పాడతారు. వీటిలో కొన్నింటిని గురించి పరిశీలించుదాం.

రామావతారంలో లక్ష్మణమూర్ఛ ఘట్టం ప్రసిద్ధమైంది. వాల్మీకి రామాయణంలో రావణుని కొడుకైన మేఘనాథుని చేతిలో లక్ష్మణుడు మూర్ఛ పోయినట్లుగా చెప్పబడింది. దశావాతార కథాగేయాల్లోని రామావతారంలో లక్ష్మణుని మూర్ఛ వృత్తాంతంలో జానపదులు కొన్ని మార్పులు చేశారు. రామునితో జరిగిన యుద్ధంలో మేఘనాథుడు మొదలైన రావణాసురుని కొడుకులు, తమ్ముడైన కుంభకర్ణుడు చనిపోతారు. అప్పుడు రావణాసురుడు దిగులుగా ఉంటాడు. అతనితో అతని భార్య మండోదరి ఇదంతా విభీషణుని కారణంగా జరుగుతూ ఉందని, లంక గుట్టంతా విభీషణడు రామునికి చెప్పి మనవారందరూ చనిపోయేలాగా చేస్తున్నాడని చెబుతుంది.

"ఇది తప్పక మీ తమ్ముడిబియ్యాసుమాయె - మీతమ్ముడు కొండేలు మోసుకొని పోయె
ఈదండు తెచ్చినవాడు మీ తమ్ముడోయి - కొట్టిన దెబ్బలకు కొండాలు మోసుకొని
అల్లడుగోమీ తమ్ముడు రాముసంగతన"

ఆమె మాటలకు రావణాసురుడు విభీషణుని మీద బాగా కోపం తెచ్చుకొని విభీషణుని చంపడానికి శక్తిబాణాన్ని ప్రయోగిస్తాడు. ఆ బాణం విభీషణుని మీదకు వచ్చే విధానాన్ని గురించి, జానపదకవి చక్కగా ఇలా వివరించాడు.

"ఆ మాటలిన్నాలడు లంకరావణబ్రహ్మ - మిట్టిపడి రావణుడు మీసమొడిలేసు
గట్టిగ దమ శరము పట్టుకున్నాడు - తోడియేటి బాణంబు తొడిగె రావణుడు
బాణమా నువ్వెల్లి పాణాలు తోడమని - యిబియాసు పేరెట్టి బాణము దొడిగె
ఎక్కడున్నా యిబియాసు నెనికి చంపాలని - సత్తిబాణము దొడిగి చెయిబూని వదిలితే



జయ్‌మని బాణంబు జాకొట్టుకెల్లె - గొటాగొటా బాణంబు గోటాడు కెలితే
కొండదరి దేవతలె గోపెట్టసాగె - గొటగొటన బాణంబు గోపెట్టి కెలితేని
పచ్చని రుచ్చాలు కోలమాడేను - గొటగొటన బాణంబు గోటాడు కెలితేని
అగిని మంటలు మండుతా బాణమెల్లే - గొటగొటన బాణంబుగోటాడు కెలితేని
దరిని గజగజలాడి దాపారమొడుకూ - గొటగొటన బాణంబు గోటాడు కెలితేని
నట్టేడు సంద్రాలు నదులల్ల గలుసూ - గొటగొటన బాణంబు గోటాడు కెలితేని
పాలసంద్రము గదిలె పాను పల్లాడే - గొటగొటన బాణంబు గోటాడు కెలితేని
రవి మండలం పొడుగు రవదూలిగమ్మె - సీరాగవుల దండు సీమలా పుట్టరో
ఏరీతిగిబియాసు నెదకుతున్నాది - వోలి గొలిచిన సేన వరుస డబ్బై కోట్లు
ఏరీతిగి బియాసు నెదకుతున్నాది"

భయంకరంగా తనను చంపడానికి వస్తున్న బాణాన్ని చూసి విభీషణుడు భయపడి రాముని దగ్గరకు పరుగెత్తుకొనిపోయి అతని పాదాలు పట్టుకొని ఇలా ప్రార్థిస్తాడు.

"కన్నులని జూసేడు రమిని యిబియాసు - అల్లాడి యిబియాసు తల్లడిల్లేను
పారిపోయి రగురాము పాదముల కొరుగు - శెంకు సెక్కారాల దాశావతారా
ఈ ఎత్తు నాసావు గట్టిగా నిజము - ఆలి బిడ్డల్నిడిచి అన్నదమ్ముల్నిడిచి
నిన్ను నమ్ముకొన్నాను నీల యెన్నుండా - తల్లి దండ్రుల్నిడిచి తరము పెద్దల్నిడిచి
నిన్ను నమ్ముకొన్నాను నీల యెన్నుండా"

అప్పుడు రాముడు అతనికి అభయమిచ్చి విభీషణుని మీదకు వచ్చే బాణాన్ని కాయమని లక్ష్మణునికి చెబుతాడు. లక్ష్మణుడు విభీషణుని తన వీపున కట్టుకొని శక్తి బాణానికి ఎదురుగా నిలబడతాడు ఆ బాణం లక్ష్మణుని వక్షస్థలంలోకి దిగి లక్ష్మణుని మూర్ఛ పోగొడుతుంది. మూర్ఛపోయిన లక్షణుని చూసి అతను చనిపోయాడనుకొని రాముడు ఇలా దుఃఖిస్తాడు.

"పాపిష్టి రావణుడా నువు పాడుగానాని - అస్త్రాల తమ్ముణ్ణి అందుకున్నాడు
ఏమంట పలుకుతాడయివోజి రాము - శోకించె రామయ్య నోకమల్లాడ
ఈ తనువు నాకెందుకురో లంక నాకెందుకురో - జోడు యీడిపోయావా తమ్ముడా
మీ తల్లి సౌమిత్రి నీ ప్రేమ గలతల్లి - తమ్ముడని అడిగితే నేనేమని చెప్పేది
తమ్ములు ముగ్గురు తమ్ముడేడంటేను - ఏలాములో నేనెవరిని జూపుదును
ఈ తనువు నాకేల సీత నాకేల - ఈ లంక నాకేల తమ్ముడూ లచ్చనాని
సన్నపడి ముత్తాలు సాలు బోసీనట్లు - రాలేను రామయ్య కన్నులుదకాలు
పెద్దపెద్ద ముత్యాలు పేర్లు సాగీనట్లు - రాలేను రామయ్య కన్నులుదకాలు

రామయ్య శోకించె రాజ్యమల్లాడ "

ఇక్కడ జానపద కవి రాముని దుఃఖాన్ని మంచి కరుణరస భరితంగా చెప్పాడు. దుఃఖిస్తున్న రాముని దగ్గరకు అతని గురువైన వశిష్ఠుడు వచ్చి లక్ష్మణుని పరిశీలనగా చూసి, లక్ష్మణుడు చనిపోలేదని కేవలం మూర్ఛపోయాడని తెల్లవారేలోగా సంజీవిని తీసుకొని వస్తే దాని ప్రభావంతో లక్ష్మణుడు తిరిగి పునర్జీవితుడవుతాడని చెబుతాడు. తెల్లవారే లోగా సంజీవిని తీసుకొని రాగలవాడు హనుమంతుడు ఒక్కడే అని జాంబవంతుడు రామునికి చెబుతాడు. అప్పుడు రాముడు హనుమంతుని ఎంతో ప్రేమగా ఇలా పిలుస్తాడు.

"రారోరి అనుమన్న రాము సన్నతకు - సామంతులల్లుడో బలిమి గలవోడా
రార మాయనుమన్న రాము సన్నతకు - వోలి యంగజు కొడుక వోలి మేనల్లుడ
రార మాయనుమన్న రాము సంగతకు - అనుమన్న పెనుమన్న గన బుద్ధిమంతు
రారోరి యనుమన్న రాముసన్నతకు - ఈరాన ఈరులను ఏలాన ఏసేటి
బలిమి కల వోడివిరా బాలుడనమన్న - రార మాయనుమన్న రాము సంగతకు
రాసేటి కోసేటి రంపమురా నీవు - రాతలకు బగిమేమి రమ్మిరనుమన్నా
రాతలకు బగిమి లంకలకు బగిమి - రారోరి యనుమన్న రాము సంగతకు
నువ్వు పుట్టగా సూర్జుని పట్టి మింగేవు - ఆర్నిమింగీనావు యనుమన్న రమ్మీ
రాగిమీసాలోడ రంగైనవోడ - రార మాయనుమన్న రాము సంగతికి"

పై పిలుపులో హనుమంతుని మీద రామునికి గల ప్రేమానురాగాలు, అతని శౌర్య పరాక్రమాల మీద రామునికి గల నమ్మకం చిన్న చిన్న తెలుగుపదాలతో చక్కగా వ్యక్తమయ్యేలాగా జానపదకవి రచించాడు.

రాముని ఆజ్ఞతో సంజీవి తేవడానికి వెళుతున్న హనుమంతుడు తన ఈ ప్రయత్నంలో ఎవరైనా అడ్డమొస్తే ఏమి చేయమంటానని రాముని అడుగుతాడు. అప్పుడు రాముడు హనుమంతునికి ఇలా సమాధానం చెబుతాడు.

"అడుగడుగు రాచ్చసుల నీకడ్డమైతే - రాము కార్యమని చెప్పరనుమన్న
రాము కార్యానికి రాచ్చసులడ్డితే - కాముకా వల శిరసు కండించుతావు
ఆ రామనచ్చుములు ఆర్తమున దలచి - కోడి గందరియిల్లు కొట్టి కుప్పెయ్యి
గండుకొని రత్తాలు కొండపై గదులు - ఆకలేసిన సోట ఆకలనకన్న
మరువక మము దనుసు బాలుడనుమన్నా - యుద్దమొచ్చిన సోట సాలలేదనకా
మరవక మము దనుసు బాలుడనుమన్న - దప్పికేసిన సోట దప్పి గాకన్నా
మరవక మము దనుసు బాలుడనుమన్న"



పైగేయ భాగంలో రామకార్యానికి రాక్షసులు అడ్డు తగిలితే "కాముకా వల శిరసు కండించుతావు" అని రాముడు హనుమంతునికి చెప్పాడు. ఇందులో "కాముక" అనే పదం పాత మాట. ఈపదానికి తప్పక అని అర్థం. ఈపదం ఈనాడు ఉత్తరాంధ్ర ప్రాంతంలో వ్యవహారంలో ఉన్నట్లు కన్పించదు. వ్యవహారంలో లేకపోయినప్పటికీ సేవగరిడి కళాకారులు తమ సాహిత్యంలో కాముకా లాంటి పాత మాటలను ఉపయోగిస్తూ ఆపదాలను బ్రతికిస్తున్నారు. ఆంధ్రదేశంలో రాయలసీమ ప్రాంతంలోని భాష పెద్దగా మారలేదు. అందువల్ల ఆప్రాంతంలో ఈపదం ఇప్పటికీ వ్యవహారంలో ఉంది.

ఆ తరువాత హనుమంతుడు ఆకాశ మార్గంలో సంజీవి కోసం బయలుదేరి వెళుతూ ఉంటాడు. ఈ విషయాన్ని రావణాసురుడు గ్రహించి హనుమంతుడు సంజీవిని తీసుకొని రాకుండా ఎలాగైనా ఆపమని కాలనేమి అనే రాక్షసుని పంపిస్తాడు. కాలనేమి హనుమంతుడు వెళ్ళేదారిలో ఒక దగ్గర ఋషి వేషాన్ని ధరించి కూర్చొని ఉంటాడు. ఆకాశంలో వెళుతున్న హనుమంతుని కాలనేమి కిందికి పిలిచి దాహం తీర్చుకోమని చెంబుతో నీళ్ళు ఇస్తాడు. హనుమంతుడు చెంబులోని నీళ్ళుతనకు సరిపోవని చెబుతాడు. అప్పుడు కాలనేమి పక్కనే మంచినీటి [illegible]డుగు ఉన్నదనీ అక్కడకు వెళ్ళి తాగమని చెబుతాడు. హనుమంతుడు చీకటి[illegible] దగ్గరకు వెళ్ళి నీళ్ళు తాగుతున్నప్పుడు మడుగులో ఉన్న మొసలి అతణ్ణి పట్టు[illegible] మింగుతుంది. అప్పుడు హనుమంతుడు శ్రీరామచంద్రుని తలచుకొని శరీరాన్ని పెంచి మొసలి పొట్ట చీల్చుకొని బయటకు వస్తాడు. అప్పుడు మొసలి దేవతా స్త్రీగా మారి శాపం కారణంగా తాను మొసలిని అయ్యానని, హనుమంతుని దయవల్ల తన శాపం తీరిపోయి తన పూర్వరూపం ధరించాననీ, ఋషిరూపంలో ఉన్నవాడు రావణాసురుడు పంపిన కాలనేమి అనే రాక్షసుడని, అతణ్ణి చంపి సంజీవిని కోసం వెళ్ళమని చెబుతుంది. ఆమె చెప్పినట్లుగానే హనుమంతుడు కాలనేమిని చంపి సంజీవి ఉన్న పర్వతం దగ్గరకు వెళతాడు. పర్వతం మీద ఏది సంజీవో హనుమంతుడు తెలుసుకోలేక పర్వతం మొత్తాన్ని తీసుకొని అయోధ్యానగరం మీదుగా వస్తూ ఉంటాడు. అలా వస్తున్న హనుంతుని భరతుడు చూసి బాణంతో కొడతాడు. ఆ బాణం దెబ్బతగలి హనుమంతుడు శ్రీరాముని తలచుకుంటాడు. ఆ మాటలు విని భరతుడు తాను బాణంతో కొట్టిన వాడు పగవాడు కాదని తన అన్న శ్రీరాముని బంటు అని తెలుసుకొని అతని దగ్గరకు వచ్చి పరామర్శించి తిరిగి సంజీవి పర్వతంతో సహా పంపిస్తాడు. అప్పుడు హనుమంతుడు తెల్లవారక ముందే సూర్యతేజంతో ప్రకాశిస్తూ వస్తూ ఉంటాడు. అతణ్ణి చూసి సూర్యుడు ఉదయిస్తున్నాడని భావించి రాముడు సూర్యుని మీద కోపగించి అతని మీద బాణం వేయడానికి

సిద్ధమవుతాడు.

"ఎయ్యసూర్యుల బంకి ఎలుగుతున్నాడు - పన్నెండు సూర్యులు దూరినట్టాయి
ఇల పట్టపగలాయె మూడు నోకములు - అటు పారజూసేడు అయివోజి రాము
అప్పుడొచ్చిన కోపమంతింతగాదు - పాపిష్టి సూర్యుడా నువు పాడు గాను
నువు పగవోడ్ని గూడీనావోరి సూర్యుడా - నీసూర్యమండలము తెగయేదు(వ్రాని
రాయిమీదన కెళ్ళి బానమెక్కెట్టె"

అప్పుడు వశిష్ఠుడు ఆ వచ్చేది సూర్యుడు కాదని హనుమంతుడని చెప్పి రాముడు బాణం వేయకుండా ఆపుతాడు. వశిష్ఠుడు హనుమంతుడు తెచ్చిన సంజీవిని ఉపయోగించి లక్ష్మణుని మూర్ఛపోగొట్టి అతణ్ణి తిరిగి పునర్జీవితుణ్ణి చేస్తాడు.

ఇది రామావతార కథాగేయంలోని లక్ష్మణమూర్ఛ కథా ఘట్టం. ఈ ఘట్టం మొత్తాన్ని తప్పెటగుళ్ళు కళాకారులు తమ కళాప్రదర్శన సందర్భంగా పాడతారు.

తప్పెటగుళ్ళ కళాకారులకు బాగా ఇష్టమైన కథ కృష్ణావతారం. దీనికి కారణం కృష్ణుడు యాదవ వంశంలో పుట్టడం కావచ్చు. అంతేకాకుండా కృష్ణావతారంలో అనేక రసవత్తరమైన ఘట్టాలు ఉన్నాయి. భాగవతంలో కృష్ణుని మహాత్మ్యాన్ని తెలియజేసే సంఘటనలు ఎక్కువగా ఉన్నాయి. అలాంటి కథలకు జానపదులు తమ ఇష్టానుగుణంగా కొన్ని మార్పులు చేసి కృష్ణావతార కథాగేయాన్ని చెప్పుకున్నారు. ఇలాంటి వాటిలో కృష్ణుడు తన మామ అయిన కంసుని చంపడం ముఖ్యమైనది.

కృష్ణుడు కారాగారంలో ఉన్న దేవకికి అష్టమ సంతానంగా జన్మించిన తరువాత అతని ఆదేశాన్ని బట్టి దేవకి అతణ్ణి తీసుకొని రేపల్లెకు వెళ్ళి రేపల్లెలో నందుని భార్య అయిన గోపెమ్మ పక్కలో కృష్ణుని ఉంచి ఆమె కన్న ఆడశిశువును తీసుకొని తిరిగి మధురా నగరానికి వచ్చి కారాగారంలో ఉంటుంది. తెల్లవారిన తరువాత కంసుడు దేవకి సంతానాన్ని చంపడానికి వస్తాడు. అప్పుడు దేవకి తనకు పుట్టినది "ఆడబాల" అని, ఆడబాల కంసుణ్ణి చంపలేదని అందువల్ల ఆడశిశువును చంపకుండా వదిలి పెట్టమని బ్రతిమాలుతుంది. దానికి కంసుడు ఆడబాల అయితే అత్తకు ప్రమాదమని చెప్పి దేవకి చేతిల్లో ఉన్న ఆడ శిశువును పాదాలు పట్టుకొని ఆకాశంలోకి విసిరేస్తాడు. ఆకాశంలోకి వెళ్ళిపోయిన ఆ శిశువు కంసునితో ఇలా పలుకుతుంది.

"మామతో మరి మూడు మాటలాడింది - తుళ్ళవద్దొరె మామ తుళ్ళవద్దు
నీతుళ్ళు దుంగళ్ళ దూలి గలుపుదుము - నీపాల మిత్తుకుడు మదనపురి బుట్టి
ఏగితే రేపల్లె కెళ్ళిపోయినాడు - ఎన్నకూడె తిని ఎదుగుతున్నాడు
పాలకూడె తిని పెరుగుతున్నాడు - తుళ్ళకురా ఒరె మామ తుళ్ళవద్దు



నీతుళ్ళు దుంగళ్ళ దూలిగలుపుదుము - తల్లి సైదోదువని తాలినానే గానీ
పగడాల పలువరస పగల దన్నుగును -తన్నితే నీశిరసు దరిమీద బడును"

ఆ విధంగా పలికి శిశువు మాయమవుతుంది. కంసుడు తనకు చావు తప్పదని భయపడి దిగులుగా ఇంటికి వస్తాడు. అతని భార్య అయిన పూతిక అతని దిగులుకు కారణం గురించి ప్రశ్నిస్తుంది. కంసుడు జరిగిన విషయాన్ని చెబుతాడు. అప్పుడు పూతిక తాను రేపల్లెకు వెళ్ళి కృష్ణుని చంపివస్తానని కంసునికి చెప్పి చల్ల అమ్మే గొల్ల భామ వేషాన్ని ఇలా ధరిస్తుంది.

"సరిసల్ల పురిసల్ల గూన బడబోసింది - ముస్తాబులవుతాది కాంత పూతీకా
నొక్కితె కిక్కిరిసి నోరి తడిసినట్లు -తన రెండు చేతులకు దండకడియాలు
కాల్లయే పిళ్ళెలు కంచుమట్టెలు జోడు - అందమైన పూతిక బొందులమిరించింది
ముస్తాబులవుతాది కాంత పూతీకా - కొప్పు నున్నగ దువ్వి కొమర కాటుకలెట్టి
కొప్పుపై ముత్యాలు జల్లు దిగనాడి - ముస్తాబు లవుతాది కాంత పూతీకా
నాగుపాములబట్టి నడుములకు తెగదీసి - కుడిజవనానికిస్సాలు కూర్చి పన్నింది
మరికొక్క గదికెల్లి పూతికాదేవి- వారింటి దైవాల్ని కోరి ఏడేను
మా అత్తకొలిచేటి మకిరి ఏలుపులారా - సల్దికి బాలుణ్ణి చంపి నేనొస్తే
వచ్చెవారం నాడు ఓరు మెడతాను - మంగలవారం నాడు మడపలెడతాను
వారింటి దైవాల్ని కోరి ఏడింది"

పై గేయంలో పూతుక ముస్తాబును జానపదకవి సహజ సుందరంగా వర్ణించాడు. జానపదులు ఏదైనా పెద్దపని మీద వెళ్ళేటప్పుడు దేవుని గదిలోనికి వెళ్ళి తాము వెళుతున్న పని జరిగితే దేవునికి కొత్తబట్టలు పెట్టి కొబ్బరికాయ కొడతానని మొక్కుకుంటారు. అలాగే పై గేయంలో పూతుక కృష్ణుని చంపడానికి తన కుడిస్తనానికి విషాన్ని పూసుకొని బయలుదేరి వెళుతూ కృష్ణుని చంపి నేను తిరిగి వస్తే 'వచ్చె వారం నాడు ఓరు మెడతానని, మంగలవారం నాడు మడపలెడతానని' తన ఇంటి దైవాలకు మొక్కుకుంది. ఓరుం అంటే ఆహారం, మడపలు అంటే బట్టలు అని అర్థం.

పూతుక బయలుదేరి వెళుతూ ఉంటే ఆమెకు అనేక రకాల అపశకునాలు ఎదురయ్యాయట. ఆ అపశకునాలను లెక్కచేయకుండా ఆమె రేపల్లెకు వెళుతుంది. తన అత్త పూతుక తనను చంపడానికి వచ్చిన విషయాన్ని శిశువుగా ఉన్న కృష్ణుడు గ్రహించి రెండు సంవత్సరాల బాలుని లాగా పెరిగి తన తోటి పిల్లలతో కలిసి ఆడుకుంటూ ఉంటాడు. పూతుక కృష్ణుని తెలుసుకొని అతణ్ణి పట్టుకొని విషం పూసిన తన స్తనాన్ని అతని నోటికి అందివ్వబోతుంది. కృష్ణుడు ఆ స్తనాన్ని వెనక్కు తోసేసి మరొక

స్తనాన్ని నోటితో అందుకొని ఆమె పాలతోపాటు ఆమె ప్రాణాన్ని కూడా లాగివేస్తాడు. పూతుక కృష్ణుని పట్టుకొని అతణ్ణి చంపడానికి ప్రయత్నించడం, ఆమె ప్రయత్నాన్ని వమ్ముచేసి కృష్ణుడే ఆమెను చంపడాన్ని జానపద కవి ఎంతో రసవత్తరంగా ఇలా రచించాడు.

"ఇంత చక్కని బాలుడు నావద్ద కలిగితే – ప్రేమతో బాలున్ని పెంచుకుందూనని
సంకనమిరించిందోయి పూతికాదేవి – కుడి జవనముల పాలు పెట్టబోతున్నాది
కుడి జవనముల పాలు ఎనకతోసీనాడు – ఎడమ జవనముల పాలు అందుకున్నాడు
పున్నావు సత్తువునే పూని నాగినాడు – సత్తున్రా ఓరి కుష్ణ సత్తునన్నాది
సస్తే సర్గలోకమిస్తానోనత్త – కిరియటంబుల బోలు కిల్లొక్కటేసే
ఆ రత్తనే జంపి దారికొస లేసెను"

కృష్ణుని చంపడానికి వెళ్ళిన పూతిక ఎంత సేపటికీ రాకపోవడంతో కంసుడు రథం మీద తానే బయలుదేరి రేపల్లెకు వస్తాడు. అతడు వచ్చేటప్పటికి కృష్ణుడు చిన్న పిల్లలతో కలసి ఆడుకుంటూ ఉంటాడు. కంసుడు అతణ్ణి పట్టుకొని చంపడానికి ప్రయత్నిస్తాడు. కృష్ణుడు అతణ్ణి ఒక దెబ్బతో చంపివేస్తాడు. ఆ తరువాత కృష్ణుడు చనిపోయిన తన అత్తమామల శవాలకు దహన సంస్కారం చేయించి పిండం పెట్టినట్లుగా జాన పదకవి ఇలా వివరించాడు.

"అష్టభూలోకాల కాదినారాయణ – ఆలోసనయినాడు అరగడియ రొద్దు
మాయత్తమామలకు నేను కాకపోతే – మరి ఎవరు అవుదురోయి దైవమన్నాడు
వారత్తమామలను రదముపై వేసికొని – కాలేటి భూములకి తోడుకెళ్ళినడు
మంచిగందం తరువు మానులని రప్పించె – కండించి తుండించి కటిక పేర్పించెను
అందమీదరి మామ నమరంగ సేసెను – అందమీదారత్తానమరంగ నేసెను
సీగంద కస్తూరి సిప్టి వెలిగించి – అగలమున పెనుమంట లంది కాలేను
సుద్దిగా వరి మామ చూరణ మాయె – సుద్దిగా వరి అత్త చూరణ మాయె
ఏమంటా పలికినడు నీలయెన్నుండు – అష్టభూలోకాల కాదినారాయణ
మరి ఎవరు అవుదురోయి దైవమన్నాడు – వారత్త వరిమామలకు గయపిండమేసె
కాశిలో గయపిండ మేసినానే తల్లి"

కంసుడు చేసే దుర్మార్గాలను బట్టి అతణ్ణి, అతని భార్య పూతుకను కృష్ణుడు చంపాడు. మనిషి చనిపోవడంతో అతనితో ఉన్న వైరం సమసిపోతుంది. అందువల్లనే కృష్ణుడు పూతుకను కంసుణ్ణి చంపిన తరువాత వారితో అంతకు ముందు తనకు ఉన్న శత్రుత్వం సమసిపోయినట్లుగా భావించి వారు తమకు అత్తామామలు కాబట్టి వారి శరీరాలకు అంత్యక్రియలు చేయడం తన కర్తవ్యంగా భావించి కృష్ణుడు ఆ కార్యాన్ని



నిర్వహించాడు. జానపదకవి ఇక్కడ గొప్ప మానవత్వాన్ని ప్రదర్శించాడు.

**కృష్ణుడు గోపికలతో గోటకాలాడడం :**

ఈ వృత్తాంతాన్ని తప్పెటగుళ్ళ కళాకారులు, "కృష్ణ సెలంతకం" అని కూడా పిలుస్తారు. ఇందులో శ్రీకృష్ణుడు రేపల్లెలోని గోపికలతో చేసిన చిలిపి చేష్టలు చెప్పబడ్డాయి.

కృష్ణుడు తనతోటి బాలలతో కలసి బంతి ఆట ఆడుతున్నప్పుడు బంతి వెళ్ళి గోపికల దొడ్లో పడుతుంది. కృష్ణుడు బంతికోసం వెళ్ళి తన బంతి ఇమ్మంటాడు. దానికి ఆ ఇంట్లో ఉన్న గొల్లభామలు ఇలా సమాధానం చెబుతారు.

"గొలగొండ సేదులు గొల్లబామాలు – నాబంతి యివ్వరా ఓయి బామాలారా
నీబంతి ఎవదెరుగు నిన్నెవరు ఎరుగురా – నేరబోతులవాడ దారి పొమ్మన్నారు
తక్కు బోతులవాడ చక్కగని పొమ్ము – ఈతూరు బంతాని మావాడకొస్తేని
కొంకు లిరగగ నిన్ను కొదుదు మన్నారు – ఈతూరి బంతాని మావాడకొస్తేని
మడమ లిరగగ నిన్ను కొడుదుమన్నారు – ఈతూరి బంతాని మావాడ లొస్తేని
మద్దివోరిల్లల్లో బద్దిపలువులు తెచ్చి – మద్దిమాలుతోని నిను గట్టుదుము"

కృష్ణుడు తన బంతి కోసం వస్తే ఆ ఇంట్లో ఉన్న గొల్లభామలు బంతి ఇవ్వకుండా అన్యాయంగా కృష్ణుణ్ణి తిడతారు. దీనితో కృష్ణుడు వారికి ఎలాగైనా గుణపాఠం చెప్పాలను కుంటాడు. ఆ ఇంట్లో మొత్తం తొమ్మిది మంది తోడికోడళ్ళు ఉంటారు. ఈ తొమ్మిది మంది ఆలమందకు వెళ్ళి కడవలతో పాలు తీసుకొని వస్తూ ఉంటారు. కృష్ణుడు ఈ విషయాన్ని గమనించి సుంకరి (పన్ను వసూలుచేసేవాడు) వేషాన్ని ధరించి దారి కాచి వారిని పాలు అమ్ముతున్నందుకు సుంకం చెల్లించవలసిందిగా దబాయిస్తాడు. దానికి వారు మేము చాలా కాలం నుంచి ఈ దారిలో వస్తూపోతూ ఉన్నాము. ఇంత వరకు ఎవరూ సుంకం అడగలేదని చెబుతారు. అప్పుడు కృష్ణుడు తాను కొత్తగా ఆ ప్రాంతం మొత్తాన్ని గుత్తగా పాడుకున్నానని, కాబట్టి తప్పనిసరిగా సుంకం చెల్లించ వలసిందేనని చెబుతాడు. దానికి గొల్ల భామలు తమ ఇంటికి వస్తే సుంకం ఇస్తామని చెబుతారు.దానికి కృష్ణుడు అంగీకరించకుండా సుంకానికి బదులుగా పాలుపోయమని చెప్పి వారు తీసుకొనివచ్చిన తొమ్మిది కడవల పాలు తాగివేస్తాడు. ఈ విషయమంతా జానపద కవి ఎంతో చక్కగా ఇలా వివరించాడు.

"తొమ్మంద్రు బామాలు తోటికోడల్లు – తొమ్మిది గాగులు పట్టుకున్నారు
ఆలమందకు బామలు పాలు కెల్లేరు – ఆమాయ గన్నాడోయి నీల ఎన్నుండు
గున్నచింతల దాకా కూడా పరిగెట్టి – గున్నచింతల కాడ కూర్చునున్నాడు
చిన్నచిన్న సుంకారి రూపమైనాడు – కురచ గుంపులు కఱ్ఱ బట్టుకున్నాడు

ఆలమందకు బామలు పాలుకెల్లినారు - తొమ్మిది గాగులు పాలు పట్టుకొని
దారి తప్పని బామలొస్త నున్నారు - ఎదురుగుంటేడడుగు లెల్లి కృష్ణుండు
అవుదురోయి బామాలూ అవునంతావారా - గొలుగొండ చేడియలు గొల్లబామల్లారా
ఎన్నాళ్ళ ఈబాట పాలమ్ముతున్నారు - ఇచ్చోట సుంకాలు ఇచ్చెల్ల మనును
కొత్త సుంకరిపేట గుత్త చేసినాను - ఇచ్చోట సుంకాలు ఇచ్చెల్ల మనును
ఏమంటా బామలు ముచ్చటాడేరు - అవుదువోయి సుంకరి అవునంతావాడా
రేపల్లె పుట్టింది ఈబాట పుట్టింది - ఎన్నడు సుంకాలు ఎరగమన్నారు
అష్టబూలోకాలు కాదినారాయణ - ఏమంటాపలికినాడు నీల ఎన్నుండు
అవుదురో బామలూ అవునంతావారా - కొత్తసుంకరిపేట గుత్త చేసీనాను
ఇచ్చోట సుంకాలు ఇచ్చెల్ల మనును - ఏమి సుంకమిద్దుమో సుంకరయ్యా
పాలు సుంకమివ్వర్రా ఓ బామలారా - అప్పుడేమన్నారు గొల్లబామాలు
పరుగు తిని మామామ పాలమ్ముతున్నాడు - రావయ్య సుంకరి మావాడలోకి
ఇక్కడక్కడ సుంకా మక్కడిస్తాము - నేరుపిన మా అత్త నెయ్యమ్ము తున్నాది
రావయ్య సుంకరి మావాడలోకి - ఇక్కడక్కడ సుంకార మక్కడిస్తాము
ఆపలుకులిన్నాడు నీల ఎన్నుండు - ఆవుదురో బామలూ గొల్లబామాలారా
అక్కడిక్కడ సుంకమాలచూలకు రాదు - ఇచ్చోట సుంకా లిచ్చెల్ల మనును
ఏమంటా బామలు ముచ్చటాడేరు - అవుదువో సుంకారి అవునంతావాడా
సట్టయినా తెచ్చుకో సల్లోసితాము - ముంతయినా తెచ్చుకో పాలోసితాము
ఏమంటా పలికినాడు నీల ఎన్నుండు - అవుదువోయి బామలూ గొల్లబామాలూ
సట్టిలోని పాలు నాకు సైతము లేదు - ముంతలోని పాలు ఇంపతము లేదు
ఓరకం పడతాను ఒడ్డించమన్నాడు - కూకోని నాసోమి కోరకము పడితేని
వళ్లొంచి బామలు వడ్డించుతున్నారు - తొమ్ముదుగాగులు పాలుతాగేను"

ఓరకం అంటే మోకాళ్ళ మీద కూర్చొని, రెండు చేతులతో దోసిలిపట్టి ఆ దోసిట్లో పాలు పోస్తూ ఉంటే దోసిలిని నోటి దగ్గర పెట్టుకొని పాలుతాగడం. సుంకరిసుంకంగా రెండు సేర్లు గానీ మూడు సేర్లు గానీ పాలు తాగగలడని భావించి గొల్ల భామలు సుంకానికి బదులుగా కృష్ణుని దోసిటిలో పాలు పోయడం ప్రారంభించారు. కానీ కృష్ణుడు తొమ్మిది కడవల పాలు తాగడమే గాకుండా పుట్ట చాటుకు పోయి పులి రూపంలో వారిని భయపెట్టి పారిపోయేలాగా చేస్తాడు. ఆ తరువాత కృష్ణుడు గొల్లభామల కంటే ముందుగా వారి ఇంటికి వెళ్ళి భామల అత్త అయిన అల్లబోయిన పెద్దమ్మ దగ్గరకు వెళ్ళి గొల్ల భామల మీద ఇలా చాడీలు చెబుతాడు.



"అల్లబోయినదానా గొల్ల పెద్దమ్మా - నీ కోడల్ల ముచ్చట నేను చెప్తుతాను
నాకేమి కట్నాలు నాతి పెద్దమ్మ - ఆతోవనొచ్చి నేనక్కడున్నాను
తొమ్మిది గాగులు పాలు పట్టుకొని - దారితప్పని బామలొస్త నున్నారు
గున్నచింతల దాకా కూడా నొచ్చేరు - పాలుకి నీఇల్లు పదివేలు గుత్తంట
ఎన్నడా పాలు బొట్లెరగ మన్నారు - నెయ్యికే నీఇల్లు రేపల్లె వాడంట
ఎన్నడా నెయ్యి పిసరెరగ మన్నారు - తొమ్మిది గాగులు పాలు తాగేరమ్మ
పాలు తాగిన వోరు దారీనే రాకన్న - పుట్ట చాటుకు పోయి పులి రూపైనారు
డొంక చాటుకు పోయి దొంగరూపైనారు - మాయమ్మ కొట్టింది గోవులకు పంపింది
ఆదోవ నొచ్చి నేనక్కడున్నాను - నా చెక్కిళ్ళు చెంపలూ చెదరగిల్లేరు
చిరత ముప్పుడి పంచె చింపేసినారు - నేనెల్లి మాయమ్మతో చెప్తుతాను
మిమ్మల్ని యుగములో గోపెమ్మ ఉంచదు"

పెద్దమ్మ ఏడుగురు కోడళ్ళు ఆలమంద దగ్గర నుంచి పాలుతీసుకొని వస్తూ గున్న చింతల దగ్గరకు వచ్చి తొమ్మిది కడవల పాలు తాగడమే గాకుండా పెద్దమ్మ, కోడళ్ళకు ఏనాడూ పాలు, పెరుగు, వెన్న మొదలైనవి పోయలేదని వారు చెప్పుకుం టున్నారని, ఆ సమయంలో అక్కడ ఉన్న తన చెక్కిళ్ళు, చెంపలు గిల్లి తాను కట్టుకున్న పంచె చింపేశారని తాను పోయి తన అమ్మ గొపెమ్మతో ఆ విషయాన్ని చెబుతానని, గోపెమ్మ, పెద్దమ్మను, వారి కోడళ్ళను ఆ ఊరిలో నుంచి వెళ్ళగొడుతుందని చెబుతాడు. అప్పుడు పెద్దమ్మ తన కోడళ్ళు అతణ్ణి కొట్టి పంచె చింపిన విషయాన్ని వాళ్ళ అమ్మకు చెప్పవద్దని బ్రతిమాలి అతని రెండు చేతుల్లో రెండు వెన్నముద్దలు పెట్టి అతణ్ణి పంపిస్తుంది.

ఆ తరువాత పెద్దమ్మ తొమ్మిది మంది కోడళ్ళు ఖాళీ కడవలతో ఇంటికి రాగానే పెద్దమ్మ చీపురుతోటి, రోకలితోటి కోడళ్ళను కొట్టి, వారు తొమ్మిది కడవల పాలు తాగిన విషయాన్ని గురించి, బాలకృష్ణణ్ణి కొట్టిన విషయాన్ని గురించి అడుగు తుంది. దానికి తొమ్మిది మంది కోడళ్ళు -

"అన్నెమెరుగమత్త పున్నెమెరుగము - అరిచేతిలో బోసిన అగ్గి ఎరగము
నిజము నిజమోలత్త నీతోడు సుమ్మాని "

అని ఒట్టు పెట్టుకుంటారు. ఆ తరువాత తొమ్మిది మంది కోడళ్ళు కృష్ణుని తల్లి అయిన గోపెమ్మ దగ్గరకు వెళ్ళి అతడు చేసే దుండగాల గురించి ఇలా ఫిర్యాదు చేస్తారు.

"తొమ్మంద్రు బామలు తోటికోడళ్ళు - గోపెమ్మ యవ్వారి మేడ కెల్లేరు
అత్తరా యోలాత్తో ఓలత్త గోపెమ్మ - మాకోసం కన్నావా మర్మదుండగుడ్ని
మామనవు లుంచదు మగువ నీసుతుడు - పాలిచ్చే పిల్లలకు పాలివ్వ నివ్వడు

మామనువు ఉండడు మగువ నీసుతుడు - మాకోసం కన్నావా ఈ మర్మ దుండగుని"
గొల్లభామల మాటలకు గోపెమ్మ తన కుమారుడు రెండునెల్ల పసిబాలుడనీ అతడు హంసతూలిక ఉయ్యాలలో ఎప్పుడూ ఉంటాడనీ, అలాంటి పసిబాలుని మీద ఇలాంటి నిందలేస్తారా అని వారిని తిట్టి పంపిస్తుంది. దానికి గొల్లభామలు ఈసారి కృష్ణుడు తమ ఇంటికి వస్తే మడమలు ఇరగ్గొడతామని, ఆవులను గట్టే పలుపుతో అతణ్ణి కట్టివేస్తామని చెప్పి వెళ్ళిపోతారు. ఈ విషయం అంతా గ్రహించిన కృష్ణుడు ఒక అర్ధరాత్రి గొల్లభామల ఇంట్లోకి వెళ్ళి ఉట్ల మీద ఉన్న పాలను కిందకు దించి తాగి, నిద్రపోతున్న గొల్లభామల మూతికి పాలు పూసి అత్త దగ్గరకు వెళ్ళి ఆమె కోడళ్ళు పాలన్నీ తాగేశారని చెబుతాడు. అత్త కోడళ్ళ దగ్గరకు వెళ్ళి వారి మూతికి ఉన్న పాలను చూసి వారే పాలు తాగారని భావించి నిద్రలేపి వారిని కొడుతుంది. ఆ మరుసటిరోజు కోడళ్ళు కృష్ణుని తల్లి దగ్గరకు వచ్చి అతను చేసిన దుండగాలను గురించి చెబుతారు. వారి మాటలను గోపెమ్మ నమ్మకుండా వారిని తిట్టి పంపిస్తుంది.

కృష్ణుని ఈ దుండగాలను గురించి విన్న కోనబోయిన వారి ఇంటికోడలు అయిన ఒక గొల్లభామ అల్లబోయిన వారి కోడళ్ళు కృష్ణుని దుండగాలకు అతణ్ణి ఏమీ చేయకుండా వదలివేశారని వారి స్థానంలో తానుంటే కృష్ణునికి తగిన విధంగా బుద్ధి చెప్పే దాన్నని పలుకుతుంది. ఈ విషయాన్ని కృష్ణుడు తెలుసుకొని ఒక రోజు సాయం కాలం ఆలమందకు వెళ్ళిన ఆమె భర్త రూపంలో ఆమె ఇంటికి వస్తాడు. వచ్చినది తన భర్తే అనుకొని కృష్ణునితో ఇలా పలుకుతుంది.

"ఆలమందకు బోయి ఆరు నెల్లయింది - శామానమా సోమి శామానమా
మాకన్నవోరు సిన్నప్పు డిచ్చిన సిలకసారావులు - శామానమా సోమి శామానమా
అయ్యన్నీ శామానమా అయ్య కోనారి - పిక్కలె సన్నము బిగువైన పడ్డలు
అయ్యన్నీ శామానమా అయ్య కోనారి - దెక్కలే సన్నము దేగసారావులు
అయ్యన్నీ శామానమా అయ్యకోనారి"

ఉత్తరాంధ్ర ప్రాంతంలో యాదవులను కోనార్లు అని పిలుస్తారు. కోన అంటే గోసమూహం అని అర్థం. కోనారి అంటే గోసమూహం కలిగినవాడు అని అర్థం. పై గేయంలో గొల్లభామ తన భర్త వేషంలో వచ్చిన శ్రీకృష్ణుని తన భర్తగా భావించి అతడు ఆలమందకు వెళ్ళి ఆర్నెల్లు అయిందని, ఈ ఆర్నెల్ల కాలంలో అతను క్షేమంగా ఉన్నాడా అని మొదట ప్రశ్నించింది. స్త్రీలకు తమ పుట్టింటి వారు ఇచ్చిన వస్తువుల మీద, జంతువుల మీద ప్రేమ ఎక్కువగా ఉంటుంది. గొల్లభామ మొదట తన భర్త క్షేమాన్ని గురించి ప్రశ్నించిన తరువాత తన కన్నవారు ఇచ్చిన చిలకసారావులు క్షేమంగా ఉన్నాయా? అని ప్రశ్నించింది. ఆ తరువాత మిగిలిన గోవులన్ని క్షేమంగా ఉన్నాయా అని ప్రశ్నించింది. ఆమె ప్రశ్నలకు కృష్ణుడు అన్నీ క్షేమంగా ఉన్నాయని చెబుతాడు. ఆర్నెల్ల తరువాత ఇంటికి వచ్చిన భర్తకు గొల్లభామ నలుగు బెట్టి, తలస్నానం చేయించి మంచి పిండివంటలతో రుచికరమైన పదార్థాలతో భోజనం పెట్టి ఆ రోజు రాత్రి అతనితో శృంగారకేళిలో పాల్గొంటుంది. తెల్లవారి లేచి చూస్తే భర్త ఉండడు. ఇదంతా శ్రీకృష్ణుని మాయ అని ఆమె తెలుసుకుంటుంది.

ఆ తరువాత గొల్లభామలందరూ కలసి శ్రీకృష్ణుని పట్టుకొని అతణ్ణి పలుపులతో కట్టేసి శ్రీకృష్ణుని తల్లి అయిన గోపమ్మ దగ్గరకు వెళ్ళి తమ ఇంటికి వచ్చిన కృష్ణుని కట్టి వేశామని చెబుతారు. అప్పుడు గోపెమ్మ మన ఇంట్లో పాలు పెరుగు ఉండగా, వాటి కోసం గొల్లభామల ఇళ్ళకు ఎందుకెళ్ళావు? అని శ్రీకృష్ణుని చెంప మీద కొడుతుంది. వెంటనే కృష్ణుడు నోరు తెరచాడట. ఆనోట్లో అన్నిలోకాలు, కొండలు, కులగిరులు మొదలైన విశ్వమంతా ఆమెకు కన్పించిందట. అప్పుడు ఆమె తాను అజ్ఞానంతో అతణ్ణి సాధారణమైన వ్యక్తిగా భావించి కొట్టానని పలుకుతుంది. ఆ తరువాత గోపెమ్మ కృష్ణుడు రేపల్లెలో ఉంటే ఇలాంటి తగవులు తెస్తుంటాడని ఆలమందకు పంపిస్తుంది.

ఈ విధంగా తప్పెటగుళ్ళ కళాకారులు కృష్ణావతారంలోని కృష్ణుడు గొల్ల భామలతో గోటకాలాడిన వృత్తాంతాన్ని పాడతారు.

తప్పెటగుళ్ళ కళాకారులు సారంగధర కథను పాడతారు. ఈ కథను కొంత మంది చారిత్రక కథగా చెబుతారు. రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని ఆంధ్ర దేశాన్ని పాలించిన రాజరాజ నరేంద్రునికి సంబంధించిన ఇతివృత్తంగా ఈకథ చెప్ప బడుతూ ఉంది. ఐతే ఇందులో చారిత్రక సత్యం ఎంత మాత్రం లేదు. రాజరాజ నరేం ద్రునికి సారంగధరుడు అనే కొడుకు లేడని చరిత్రకారులు చెబుతున్నారు. ఐతే చరిత్ర వేరు కథ వేరు. ఇప్పటికీ సారంగధర కథ రాజరాజనరేంద్రునికి సంబంధించినదిగానే చెప్పబడుతూ ఉంది.

ఈ కథలో రాజరాజనరేంద్రునికి చాలకాలం పాటు సంతానం కలగలేదు. సంతానం లేకపోయినందుకు అతని భార్య రత్నాంగి తన భర్తతో ఇలా దుఃఖిస్తుంది.

"రాజోయి నారాజు నారాజ నరేంద్రా - వెండైన మన యింట మెండాయి ఉన్నాది
బంగారం మన యింట బాడిసై ఉన్నాది - అమ్మాని పిలుచుటకు ఆడవారు లేరు
అయ్యాని పిలుచుటకు మగవారూ లేరు - మేడలూ మిద్దెలూ మేటిగా ఉన్నాయి"

చివరకు రత్నాంగి నోములు ఫలించి ఆమె గర్భవతి అవుతుంది. ఆమె గర్భాన్ని గురించి ఇలా పాడతారు.

"ఏ తీరుగున్నాది రత్నాంగి ఆదేవి - నెల తప్పి ఉన్నాది రత్నాంగి ఆదేవి
ఒకటాయె రెండాయె మూడు మాసాలాయె - మూడున్ను ఒకటున్న నాలుగు
మాసాలాయె
నాలుగున్న ఒకటున్ను ఐదుమాసాలాయె - ఐదున్న ఒకటున్న ఆరుమాసాలాయె
ఆరున్ను ఒకటున్న ఏడు మాసాలాయె - ఏడున్ను ఒకటున్న ఎనిమిది నెలలాయె
తొమ్మిదో మాసము తొందరగ వచ్చెనూ"

తరువాత ఆమెకు కుమారుడు జన్మిస్తాడు. రాజు బ్రాహ్మణులను పిలిపించి జాతకం రాయించి అతనికి "సారంగ ధరుడు" అనే నామకరణం చేస్తాడు. సారంగ ధరుడు ఎంతో అల్లారుముద్దుగా అనేకమంది దాదుల సంరక్షణలో ఇలా పెరిగాడు.

"జోజోజో నా బాల ఉయ్యాల - జోల పాటలు పాడి ఉయ్యాల
జోడుకొండల మద్దెను ఉయ్యాల - నీకు జోల పాడెదను ఉయ్యాల
ఉగ్గోసినొక దాది ఉయ్యాల - నిన్ను ఊపనొక దాది ఉయ్యాల
పాలెట్ట నొక దాది ఉయ్యాల - ఎత్తుకోనొక దాది ఉయ్యాల
నీలోయ నొక దాది ఉయ్యాల - నిను నిదురించు నొకదాది ఉయ్యాల
పన్నెందు శేరులుది ఉయ్యాల - నీకు బంగుటుయ్యాల కొడుక ఉయ్యాల
ముప్పయ్యి శేరులది ఉయ్యాల - నీకు మువ్వలుయ్యాల కొడక ఉయ్యాల"

సారంగధరుడు పెరిగి ఆటబాలుడు అయ్యాడట. ఆడుకోవటానికి పావురాలను కొనమని తల్లిని కోరతాడు.

"అంతాయ యింతాయె ఆటబాలుడాయె - అమ్మోలి మాయమ్మ మాయమ్మ రత్నాంగి
నాయీడు జోడులకు పావురాలున్నాయి - పావురము కొను తల్లి మాయమ్మ రత్నాంగి"

కుమారుని కోరికను మన్నించి ఆమె పావురాలను కొంటుంది. పావురాల పందానికి వెళ్తానని సారంగధరుడు తల్లిని అడుగుతాడు. తల్లి వద్దని ఇలా చెబుతుంది.

"కొడుకోయి నా కొడుకా  కొడుక సారంగ - కోటినోములు నోచి నిను కన్నాను
పావురాల పందేనికి వద్దురా సారంగా - ఆ ఊరు పందేనికి వెళ్ళవద్దు కొడుకా"

కానీ పావురాల పందానికి వెళతానని సారంగధరుడు పట్టుబట్టి చివరికి తల్లిని ఒప్పించి వెళతాడు.

"చక్కని పావురము సారంగ వదిలేను - ఎగిరేను పావురము ఆగగనమార్గాన
ఎగిరేను పావురము ఏడు యోజనాలు - చిత్రాంగి మేడలపై వాలె నాపావురము
అన్నికారి చిత్రాంగి చూసింది పావురము"

తన మేడమీద వాలిన సారంగధరుని పావురాన్ని రాజరాజు నరేంద్రుని ఉంపుడు గత్తె



అయిన 'చిత్రాంగి' పట్టుకొని దాచిపెడుతుంది. తన పావురం కోసం సారంగధరుడు చిత్రాంగి మేడకు వెళతాడు. అతణ్ణి మోహించిన చిత్రాంగి సారంగ ధరునితో ఇలా పలుకుతుంది.

"రావయ్యా సారంగ రమ్మాని పిలిచేను - ఇరుగు ఎవ్వరు లేరు పొరుగు నెవ్వరు లేరు
ఇది మంచి సమయము ఇటు రారా సారంగా - రాజు లేనప్పుడో సారంగో నువ్వు
రారాదా పోరాదా సారంగో"

ఆమె పిలుపులో ఉన్న ఆంతర్యాన్ని గ్రహించిన సారంగధరుడు చిత్రాంగిని తల్లిగా సంబోధిస్తూ ఇలా పలుకుతాడు.

"వందనమే నాతల్లి నీకు వందనమమ్మా - తండ్రి కొచ్చిన దానా పినతల్లి వౌతావు
అమ్మోలి మాయమ్మా మాయమ్మా చిత్రాంగి- నాపావురం నాకియ్యి నేనెల్లిపోతాను"

అతని మాటలను లెక్కచేయకుండా చిత్రాంగి తన కోరికలో తప్పులేదని ఇలా సమర్థిస్తూ సారంగధరునికి చెబుతుంది.

"ఆవు కడుపున ఒక దూడ పుట్టలేదా - ఆ దూడతో ఆ యావు వరియించలేదా"

ఈ సమయంలో శృంగారపూరితమైన బొమ్మలతో ఉన్న చిత్రాంగిమేడను చక్కగా పాడతారు. ఇలా సారంగధర కథ మొత్తాన్ని తప్పెటగుళ్ళ వారు పాడతారు.

**పూసల అప్పన్నకథ :**

తప్పెటగుళ్ళు వారు పాడే కథాగేయాల్లో పూసల అప్పన్నకథ ఒకటి. బాల్యంలో అన్నదమ్ములు, అక్కాచెళ్ళెళ్ళు పరస్పర ప్రేమతో చాలా సన్నిహితంగా ఉంటారు. వారికి వివాహం అయిన తరువాత ప్రేమలు ఆప్యాయతలు సన్నగిల్లుతూ ఉంటాయి. ముఖ్యంగా ఇది అన్నదమ్ముల విషయంలో ఎక్కువగా జరుగుతూ ఉంటుంది. అందుకనే "పుట్టుకతో అన్నదమ్ములు పెరుగుతూ దాయాదులు" అనే సామెత ఏర్పడింది. వివాహమైన తరువాత కూడా స్త్రీలు తమ పుట్టింటివారి మీద ఎనలేని ప్రేమాభిమానాలను కలిగి ఉంటారు. పురుషుల్లో ఇది తక్కువగా ఉంటుంది. వివాహమైన తరువాత భార్య చెప్పిన మాట వినడం వల్ల గానీ, తన సంతానాన్ని వృద్ధిలోకి తీసుకొని రావాలన్న లక్ష్యం వల్ల గానీ పురుషుల్లో స్వార్థం చోటు చేసుకుంటుంది. తద్వారా అన్నదమ్ముల మీద, అక్కచెళ్ళెళ్ళ మీద ప్రేమ కంటే ధనానికీ ఆస్తిపాస్తులకు ఎక్కువ విలువ ఇస్తారు. పూసల అప్పన్న కథ సమాజంలో అతి సహజంగా జరుగుతున్న ఈ విషయాన్ని తెలియజేస్తుంది.

పూసల అప్పన్నకు సూరన్న, సుబ్బన్న అనే ఇద్దరు తమ్ముళ్ళు, అంజమ్మ అనే చెల్లెలు ఉంటారు. చెల్లెలు చిన్నతనంలోనే వీరి తల్లితండ్రులు చనిపోతారు. పూసల అప్పన్న తమ్ముళ్ళను, చెల్లెలిని ప్రేమతో, ఆప్యాయతతో వారికి ఎలాంటి లోటు రానివ్వ

కుండా పెంచి పెద్ద చేస్తాడు. ముగ్గురు అన్నలు తమ ఏకైక చెల్లెలు అయిన అంజమ్మను ఎంతో అల్లారుముద్దుగా పెంచారట. ఆమెను పెంచిన విధానాన్ని గురించి జానపద కవి ఇలా చెప్పాడు.

"పట్టుపాలుపోసి పెంచుతున్నారా ఆ బాలని
ఏలయేగ నున్నాది ముద్దుల అంజమ్మా అంజమ్మా
పట్టు పాలుపోసి పెంచుతున్నారా ఆ బాలని అంజమ్మా
ఉగ్గెట్టనో దాది ఊపనో దాది బాలాకి అంజమ్మా
పాలెట్టనో దాది పట్టనో దాది బాలాకి అంజమ్మా"

పై గేయంలో చెప్పబడిన "ఉగ్గెట్టనో దాది ఊపనో దాది, పాలెట్టనో దాది పట్టనో దాది" అనేది కథాగేయాల్లో సాధారణంగా కనిపించే వారానువర్తనం.

అంజమ్మకు పంద్రెండేండ్ల వయసు వచ్చిన తరువాత రూపవంతుడు, గుణ వంతుడు అయిన యువకునికి ఇచ్చి ఐదు రోజుల పెళ్ళి అంగరంగ వైభోగంగా చేశారు. ఆ పెళ్ళిని జానపద కవి ఇలా వర్ణించాడు.

"ఆకాశ మాదిరులు పందిళ్ళు వేసే అంజమ్మకు
భూదేవతా మాదిరులు పీటాలు వేసే అంజమ్మకు
రంగ రంగ వైభవంగా చేసుతున్నారా అంజమ్మకు
గుచ్చినా ముత్యాలు తోరణాలు కట్టే ఆయేళ
గుచ్చాని ముత్యాలు తలంబ్రాలు ఆ బాలకి
ఏలయేగ నున్నాది ఆ చిన్న మగువా ఆ యేళ
పన్నెండు రాటాల పందిళ్ళలోనా యిల్లాలు
ఎలయేగ నున్నాది అమ్మా అంజమ్మా
రంగ రంగ వైభోగంగా అందుకున్నాది యిల్లాలు
రామయ్యా రఘురామ రామా శ్రీరామా రామాయ్యా
అయిదు రోజుల పెళ్ళి చేసుతున్నారా చెల్లిలికి
అయిదు రోజుల పెళ్ళి చేసుతున్నారా అంజమ్మకి"

పై వివాహ వర్ణన అంతా అన్ని కథాగేయాల్లో సాధారణంగా కనిపించే వారాను వర్తనమే. ఆ తరువాత అన్నదమ్ములు చెల్లెలిని అత్తవారింటికి పంపించేటప్పుడు పసుపు, కుంకుమ సన్నబియ్యం, చాయపప్పు, కొండ చీపుళ్ళు బండ్లతో పంపించారట. ఇది కూడా కథాగేయాల్లో సాధారణంగా కనిపించే వారానువర్తనమే. జానపదకవి ఇక్కడ సారెను గురించి చెప్పేటప్పుడు చివరగా 'ఇరవయ్యా బళ్ళేమి యెండి బంగారం ఆ బాలకి' అని



ఇరవై బళ్ళతో వెండి, బంగారం సారెగా పంపించినట్లుగా చెప్పాడు. ఇది అతిశయోక్తిగా, అబద్ధంగా అనిపించవచ్చు. జానపద కవులు సాధారణంగా బీదవారు, దరిద్రంలో మునిగిన వీరు గుండె నిండా బంగారాన్ని నింపుకుంటారు. కాబట్టే ఈ కథా గేయంలో ఇరవై బళ్ళ వెండి బంగారం సారె ఇచ్చినట్లుగా చెప్పబడింది. బీదవారు తమ బిడ్డను 'బంగారు కొండ' అని ముద్దులాడుతూ ఉంటారు. ఆ బంగారు కొండ లాంటిదే ఈ ఇరవై బళ్ళ వెండి బంగారం కూడా.

జానపద కవి అంజమ్మ భర్తకు పేరు చెప్పలేదు. "ఉత్తర ఖండాన రాజుకిచ్చేనా చెల్లెల్ని" అని అంజమ్మ భర్తను గురించి చెప్పాడు. రూపంలో ఇతడు రాజు అయితే స్వభావంలో మహారాజు, చక్రవర్తి అని చెప్పదగినవాడు. అత్తింటివారు తన భార్యకు పంపించిన సారె తనకు ఏ మాత్రమూ అవసరం లేదనీ, తన భార్యను తాను అపు రూపంగా చూసుకుంటానని తన బావలకు చెబుతాడు. అప్పుడు బావలు తమ చెల్లెలును బాగా చూసుకోమని ఆమె భర్తకు ఇలా ఇల్లడపెడతారు.

"ఏమంటా అన్నాదమ్ముళ్ళు చెప్పారా ఆయేళ
విన్నావా బామ్మరిది వివరంబుగాను బామ్మరిది
మా ముద్దు చెల్లెలు నీకిల్లడయ్యో ఓ బావా
మా ముద్దు చెల్లెలు నీకిల్లాడేమీ ఓ రాజా
తీగెలోని తీగె బంగారు తీగ చెల్లెమ్మా
నీ ముద్దు తీర్చేది మాముద్దు చెల్లెలా ఓ రాజా
మా ముద్దు చెల్లెలు నీకిల్లడయ్యో ఓ రాజా
చెల్లెలు నిళ్ళాడ చాలా పెట్టారా అన్నలు
చేతిలో చెయ్యేసి సింహాచలేశ అన్నారా"

పై గేయంలో అన్నలు తమ చెల్లెలు బంగారుతీగె అనీ, కూర, బంతి అనీ, నీ ముద్దు తీర్చేది అనీ, మా ముద్దు చెల్లెలు అనీ, చివరగా తన చెల్లెలు భర్త చేతిలో చెయ్యేసి సింహాచలేశా అని సంబోధించి తమ చెల్లెలను జాగ్రత్తగా చూసుకోమని వెళ్ళి పోయారు. ఈ మాటలవల్ల ఆ ముగ్గురు అన్నదమ్ములకు తమ చెల్లెలు మీద వల్లమాలిన ప్రేమా భిమానాలు ఉన్నాయని జానపదకవి అపూర్వమైన రీతిలో తెలియజేశాడు. లోకంలో గయ్యాలి అత్తలే కాదు. కుంతీదేవి లాంటి అత్తలు కూడా ఉంటారు. అంజమ్మ అత్త కూడా అలాంటిదే. అంజమ్మ అత్త ఆంజమ్మను కోడలుగా గాకుండా కొడుకుతో సమానంగా వాత్సల్యంతో, ఆప్యాయంగా చూసుకుంది.

వివాహమైన ఐదు నెలల తరువాత అంజమ్మ భర్త ఉద్యోగం నిమిత్తం భార్యను,